



డాక్టర్ బాబాసాహెబ్ అంబేడ్కర్

ఎం.ఎ., పి.హెచ్.డి., డి.ఎస్.సి., బార్–ఎట్–లా, జె.పి., ఎల్.ఎల్.డి., డి. లిట్.

జననం : 14 ఏప్రిల్, 1891 పరినిర్వాణం : 6 డిసెంబర్, 19

# డా|| బాబా సాహెబ్ అంబేద్కర్ రచనలు - ప్రసంగాలు

## సంపుటం - 11

*ప్రధాన సంపాదకులు*

ఆచార్య పేర్వారం జగన్నాథం

ఉపాధ్యక్షులు, తెలుగు విశ్వవిద్యాలయం

*సంపాదకులు*

ఆచార్య జయధీర్ తిరుమల రావు (కన్వీనర్)

డా|| సి. మృణాళిని

డి.వి. సుబ్బారావు

*అనువాదం, సారథ్యం*

తెలుగు విశ్వవిద్యాలయం

*ప్రచురణ*

ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం

1994

**DR. BABA SAHEB AMBEDKAR RACHANALU - PRASANGALU - Vol. XI**

**Pages : VIII+XII+536**

Volumes in English Compiled : Vasant Moon

First Edition : January 1994

Second Edition : October 1994

Copies : Popular Edition : 4000

Library Edition : Rs. 100/-
Popular Edition : Rs. 50/-

*General Editor*

**Prof. PERVARAM JAGANNADHAM**

*Editors*

**Prof. Jayadhir Thirumal Rao** (Convenor)
**Dr. C. Mrinalini**
**Sri. D.V. Subba Rao**

*Copies can be had from*

Registrar,
Publications Division,
Telugu University,
Lalitha Kala Kshetram, Public Gardens,
Hyderabad - 500 004

*Cover*

**K.C. Reddy**

*Printed at :*
S.V. Printers :s,
1-1-770/5, Gandhinagar,
Hyderabad.

# బుద్ధుడు - తని ధమ్మం

*రచన*

డా|| బి. ఆర్. అంబేద్కర్

ఆచార్య పేర్వారం జగన్నాథం,
ఉపాధ్యక్షులు

తెలుగు విశ్వవిద్యాలయం,
పబ్లిక్ గార్డెన్స్,
హైదరాబాదు - 4.

# రెండవ ముద్రణ పీఠిక

నవభారత రాజ్యాంగ నిర్మాత బాబాసాహెబ్ డా॥ భీంరావు అంబేద్కర్ ఆంగ్ల రచనలను తెలుగులోకి అనువదించి ప్రచురించే కార్యక్రమానికి ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం తెలుగు విశ్వవిద్యాలయాన్ని సారధ్య సంఘంగా నియమిస్తూ, అందుకోసం 18 లక్షల రూపాయలు మంజూరు చేసింది. ఈ ప్రణాళికను ప్రోత్సహించి నిధులు మంజూరుచేసిన అప్పటి ముఖ్యమంత్రి మాన్యశ్రీ నేదురుమల్లి జనార్ధన రెడ్డి గారికి, అంబేద్కర్ సంపుటాలను విజయవంతంగా తెలుగు వారికి అందజేయడంలో సహకరిస్తున్న ప్రస్తుత ముఖ్యమంత్రి మాన్యులు శ్రీ కోట్ల విజయభాస్కర రెడ్డి గారికి ఈ సందర్భంగా ధన్యవాదాలు సమర్పిస్తున్నాను. డా॥ అంబేద్కర్ భావజాలాన్ని, ఆయన ఆలోచనా సరళిని నేటి యువతరానికి తెలియజేసే దృష్టితో ఈ గ్రంథాలను సంక్షేమ శాఖ హాస్టళ్లకు సరఫరా చెయ్యాలని ఆంధ్ర ప్రదేశ్ సాంఘిక సంక్షేమ శాఖ మమ్మల్ని కోరింది. అందుకోసం ఈ సంపుటాలను ప్రత్యేకంగా పునర్ముద్రిస్తున్నాం. ఈ కార్యక్రమాన్ని విజయవంతంగా నిర్వహించుటకు సహకరిస్తున్న ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వానికీ, సాంఘిక సంక్షేమ శాఖాధిపతులకూ, పాఠకులకూ, ఆయా సంపుటాల సంపాదక వర్గానికీ మరోసారి ధన్యవాదాలు తెలియజేస్తున్నాను.

(పేర్వారం జగన్నాథం)

హైదరాబాదు
ది. 14.10.1994
విజయదశమి.

# ముందుమాట

భారత రాజ్యాంగ నిర్మాతగా, దళిత వర్గాల నాయకుడిగా, రాజనీతి కోవిదుడుగా, న్యాయశాస్త్ర పారంగతుడుగా, ప్రజాభిమానాన్ని చూరగొన్న మనీషి డాక్టర్ బాబా సాహెబ్ అంబేద్కర్. కుల వ్యవస్థలో కూరుకుపోయిన వారికి డా|| అంబేద్కర్ ఒక ఆశాజ్యోతి. ఒక చైతన్య కేతనం. స్వేచ్ఛ, స్వాతంత్ర్యం, సమానత్వం, సౌభాతృత్వాల మేలు కలయికగా ఉండే సమాజం అంబేద్కర్ లక్ష్యం.

మహార్ కులంలో జన్మించిన అంబేద్కర్ విద్యార్థి దశ నుండే సమాజంచేత దుర్భరమైన అవమానాలను ఎదుర్కొన్నారు. దానితో చిన్నతనంలోనే ఆయన సంఘ సంస్కరణ, పీడిత జనోద్ధరణే పరమ లక్ష్యంగా ఎన్నుకొన్నారు. ఆయన ఏ వృత్తి చేపట్టినా ఆ లక్ష్యానికి దూరం కాలేదు. ఆ లక్ష్య సాధన కోసం కార్యక్రమాలను కొనసాగించారు. ఆ క్రమంలోనే రచనలు చేయడం ప్రసంగాలు చేయడం ద్వారా ప్రచారం చేయడం, వంటి ప్రధాన మార్గాలను ఎంచుకున్నారు.

బలహీన వర్గాలలో చైతన్యాన్ని రగిలించి వారికి నాయకత్వం వహించి డా|| అంబేద్కర్ తన రాజకీయ మహా ప్రస్థానానికి శ్రీకారం చుట్టారు. బొంబాయి రాష్ట్ర శాసన సభ సభ్యత్వం, రాజనీతి శాస్త్రంలో విశేష పరిజ్ఞానం డా|| అంబేద్కర్ కృషికి ఎంతగానో దోహదం చేసినాయి.

డా|| అంబేద్కర్ అహర్నిశలు ప్రతి దశలోనూ దళితుల అభ్యున్నతి కోసం కృషి చేశారు. రాజ్యాంగంలో దళితుల కోసం ఏర్పాటయిన ప్రత్యేక హక్కులు, వసతుల కోసం నిర్విరామంగా కృషి చేసిన విషయం లోక విదితమే.

దళిత జనాభ్యున్నతి కోసం ఆయన సాగించిన అవిశ్రాంత పోరాటానికి వెన్నుదన్నుగా భారత చరిత్ర, శ్రుతి స్మృతి పురాణాది ప్రాచీన వాఙ్మయాన్ని, అందుకు సంబంధించిన ఆధార గ్రంథాల్ని క్షుణ్ణంగా ఆకళింపు చేసుకున్నారు. తాను చేపట్టిన మహత్తర సంస్కరణోద్యమాన్ని శక్తివంతంగా నడిపించినారు.

డా|| అంబేద్కర్ ఏ రంగంలో కృషి చేసినా రచనా వ్యాసంగాన్ని విడనాడలేదు. రాజకీయం, ఆర్థికధార్మికాది విషయాలపై అసాధారణ ప్రతిభతో ఆయన రాసిన రచనలు, చేసిన ప్రసంగాలు అంబేద్కర్ జ్ఞాన సంపదకు మణిహారాలు.

అమూల్యమైన అంబేద్కర్ రచనలు ప్రసంగాలను సేకరించేందుకు 1976 మహారాష్ట్ర ప్రభుత్వం ఒక నిపుణుల సంఘాన్ని ఏర్పాటు చేసింది.

ఫలితంగా డా॥అంబేద్కర్ గ్రంథావళిని మహారాష్ట్ర ప్రభుత్వం 1979 డా॥బాబా సాహెబ్ అంబేద్కర్ జన్మదినోత్సవ దినాన ఆంగ్లంలో వెలువరిం భారతావనికి అందించింది.

ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం డా॥అంబేద్కర్ శత జయంతి ఉత్సవాల సందర్భం ఆయన రచనలు, ప్రసంగాలను తెలుగులోకి అనువదించాలని నిర్ణయించింది. విషయంలో అప్పటి రాష్ట్ర ముఖ్యమంత్రి మాన్యశ్రీ నేదురుమల్లి జనార్ధనరెడ్డి గ ఆసక్తి, ఉత్సాహం అనువాద కార్యక్రమానికి ప్రేరకాలయినాయి. వారు నిధులను కూ సమకూర్చినారు.

అనంతరకాలంలో ముఖ్యమంత్రి మాన్యశ్రీ కోట్ల విజయ భాస్కరరెడ్డి గా డా॥అంబేద్కర్ రచనల అనువాద కార్యక్రమానికి మరింత చేయూ అందించినారు.అందుకు రాష్ట్ర ప్రభుత్వానికి ధన్యవాదాలు తెలుపుతున్నాం.

ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం ఈ అనువాద కార్యక్రమ నిర్వహణకు సారథ్య సంస్థ తెలుగు విశ్వవిద్యాలయాన్ని నియమించింది. తెలుగు శాఖలు ఉన్న కొన్ని వి విద్యాలయాలు, ఇతర ముఖ్య సంస్థలను ఈ అనువాద కార్యక్రమంలో భాగస్వాముల చేసి తెలుగు విశ్వ విద్యాలయం పూర్వ ఉపాధ్యక్షులు పద్మభూషణ్ ఆచార్య , నారాయణరెడ్డి గారు ఈ ప్రణాళికకు రూప కల్పన చేశారు. వారి నేతృత్వంలో అనువా కార్యక్రమానికి ఆరంభం జరిగింది.

పైన పేర్కొన్న వివిధ సంస్థలు డా॥అంబేద్కర్ రచనల అనువా కార్యక్రమాన్ని బాధ్యతాయుతంగా స్వీకరించినాయి. అంతేకాదు ఆయా సంస్థల చెందిన వ్యక్తులే సంపాదక బాధ్యతలు నిర్వహించినారు. వివిధ రచయితల పండితులు చేసిన అనువాదాల్లో సంపాదకులు ఎంత ప్రయత్నించినప్పటికీ కొం భిన్నత, అనువాద శైలీ భేదాలు చోటు చేసుకోక తప్పలేదు.

డా॥అంబేద్కర్ రచనల్లో, చేసిన ప్రసంగాల్లో వాడిన పదాలకి ఆయ సందర్భాల ననుసరించి కనిపించే కొన్ని అర్థాలు నేడు వాడుకలో కనిపించడం లేద ఆ విధంగా డా॥అంబేద్కర్ ఉపయోగించిన పదాలకు వివిధ శాస్త్రాలకు సంబంధిం రకరకాల అర్థచ్ఛాయలు కనిపిస్తాయి. ఆంగ్ల పదాలకు సరిసమానమైన ఒకే పారిభాషి పదం అన్ని సందర్భాల్లో అన్వయించక పోవడం మరో ఇబ్బంది. అందుకే సందర్భాన్ని

అనుసరించి అర్థం చెడకుండా తెలుగులో వివిధ పదాలను వాడడం తప్పని
అయింది. ప్రస్తుత గ్రంథం " బుద్ధా అండ్ హిజ్ ధమ్మ " లో ప్రాకృత పదమైన " ధమ్మ
పదం మరికొన్ని ప్రాకృత పదాలను యథాతథంగా వాడడం జరిగింది.

డా॥ అంబేద్కర్ రచనలు ప్రసంగాల అనువాద కార్యక్రమానికి తగిన సలహ
సూచనలు ఇచ్చేందుకు ఒక పరిశీలనా సంఘం ఏర్పాటయింది. పార్లమెంటు మ
సభ్యులు శ్రీ కోట పున్నయ్య, ప్రముఖ విద్యావేత్త డా॥ టి.వి. నారాయణ, ఆం
ప్రదేశ్ ప్రభుత్వ న్యాయశాఖ మాజీ కార్యదర్శి శ్రీ జె. వీరాస్వామి సభ్యులుగా ఉన్నా
పరిశీలనా సంఘ సభ్యులు చేసిన సూచనలననుసరించి, వారి మార్గ దర్శక సూత్రాల
దృష్టిలో ఉంచుకొని సారథ్య సంఘంగా తెలుగు విశ్వవిద్యాలయం అనువ
కార్యక్రమాన్ని ముందుకు నడిపిస్తున్నది. ఈ సందర్భంగా వారికి నా ప్రత్యే
ధన్యవాదాలు తెలుపుతున్నాను.

డా॥ అంబేద్కర్ రచనలు ప్రసంగాలు సంపుటాలను అనువదించే బాధ్యత
తెలుగు విశ్వవిద్యాలయం వెంటనే వివిధ విశ్వవిద్యాలయాలకు, కొన్ని సంస్థల
అప్పగించింది. ఈ సందర్భంలో రాష్ట్ర ప్రభుత్వ విద్యాశాఖ, సాంఘిక సంక్షేమ శాఖ
ఏర్పాటు చేసిన సమావేశాలకు హాజరయి తెలుగు విశ్వవిద్యాలయం రిజిస్ట్ర
డా॥ తాళ్ళ వెంకటరెడ్డి ప్రచురణల కార్యక్రమాన్ని క్రమబద్ధం చేశారు.

డా॥ అంబేద్కర్ శతజయంతి ఉత్సవాలను పురస్కరించుకొని తెలు
విశ్వవిద్యాలయం అనువదించి, ముద్రింప చేసిన ఏడవ సంపుటం తిరుపతి
14.4.1992 నాడు ఆవిష్కృతమైంది.

డా॥ అంబేద్కర్ జయంతిని పురస్కరించుకొని డా॥ అంబేద్కర్ పీపు
ఎడ్యుకేషనల్ ట్రస్ట్‌వారు అనువదించిన మొదటి సంపుటం హైదరాబాదు
14.4.1993నాడు ఆవిష్కృతమైంది.

ప్రస్తుత సంపుటం డా॥ అంబేద్కర్ గ్రంథావళిలో పదకొండవది. దీ
అనువాదాన్ని తెలుగు విశ్వవిద్యాలయం వారు నిర్వహించినారు. ఈ గ్రంథంలో సిద్ధా
గౌతముడు, బోధి సత్త్వుడు బుద్ధునిగా మారిన విధం, చిరపరిత్యాగం, బుద్ధుడు ఏ
బోధించాడు, మతం-ధమ్మం, మరియు బౌద్ధ జీవన విధానం తదితరమై
కీలకాంశాలను డా॥ అంబేద్కర్ విశ్లేషణాత్మకంగా చర్చించినారు.

ఈ పదకొండో సంపుటం అనువాదాన్ని తెలుగు విశ్వవిద్యాలయం ప్రము
అనువాదకులకు అప్పగించింది. అనువాదకులు, శ్రీమతి డా॥ వి.భార్గవి రావ

డా॥ సి. మృణాళిని, ఆచార్య జయధీర్ తిరుమల రావు, శ్రీ డి.వి. సుబ్బారా
శ్రీ సి. ధర్మారావు, శ్రీ జె. చెన్నయ్య మరియు శ్రీ కె. ఎల్. ఎస్. ప్రసాద్ గా
ధన్యవాదాలు.

దీక్షతో, దక్షతతో త్వరితగతిని అనువాదం చేసిన రచయితలకూ, అనువాద
మెరుగులు దిద్దిన సంపాదకులు ఆచార్య జయధీర్ తిరుమలరావు, డా॥ సి. మృణా
మరియు శ్రీ డి.వి. సుబ్బారావు గార్లకు నా అభినందనలు తెలియజేస్తున్నాను.

డా॥ అంబేద్కర్ రచనల అనువాద కార్యక్రమాన్ని ప్రోత్సహించి ఉత్సాహ
ముందుకు నడిపిస్తున్న సాంఘిక సంక్షేమ శాఖాధికారులకు, ఉన్నత విద్యాశాఖాధికారు
కృతజ్ఞతలు.

ఈ గ్రంథాన్ని సకాలంలో అందంగా ముద్రించిన నవ్య ప్రింటర్స్, హైదరాబ
వారికి కృతజ్ఞతలు.

ఈ సంపుటం అందరి హృదయాలను చూరగొంటుందని విశ్వసిస్తున్నా

**ఆచార్య పేర్వారం జగన్నాథం**
ఉపాధ్యక్షులు, తెలుగు విశ్వవిద్యాలయం
మరియు
ప్రధాన సంపాదకులు

# తొలిమాట

భారత రాజ్యాంగ ప్రధాన నిర్మాత డా|| అంబేద్కర్ ఒక రాజ్యాంగవేత్తగా, పార్లమెంటు వ్యవహర్తగా మాత్రమే ప్రపంచానికి పరిచితుడు కాదు. ఆయన ఒక గొప్ప పండితుడిగా, కార్యశీలి అయిన సంస్కర్తగా విశ్వవిఖ్యాతి గాంచాడు. దళితుల నాయకుడిగా ఆయన హిందూ సమాజంలోని దమన రీతులకు వ్యతిరేకంగా ఎన్నో పోరాటాలు చేశాడు. ఆయన తన జీవితకాలమంతా స్వాతంత్ర్యం, సమానత్వం, న్యాయం, విశ్వమానవ సౌభ్రాత్రతల మీద ఆధారపడిన ఒక కొత్త సామజిక వ్యవస్థను ఏర్పాటు చేయటానికే కృషి చేశాడు.

వెనుకబడిన వర్గాల సమస్యల పరిష్కారానిక ఆయన చూపిన విప్లవాత్మకమైన, మానవీయమైన మార్గానికి భారతీయ సమాజం ఆయనకు ఎంతో ఋణపడి ఉంది.

డా|| అంబేద్కర్ జీవితకాలమంతా శ్రమించిన వెనుకబడిన వర్గల వారి సంక్షేమం కోసం మహారాష్ట్ర ప్రభుత్వం నిబద్ధమై ఉన్నది. డా|| అంబేద్కర్ వంటి మహాపురుషుల ఆలోచనలు, బోధనలు కొత్త తరానికి ఎప్పుడూ వెలుగును అందిస్తూనే ఉంటాయి. డా|| అంబేద్కర్ రచనలను పూర్తిగా ప్రచురించాలనే పథకంలో భాగంగా ఆయన అముద్రిత రచనలను మూడు భాగాలను వరుసగా తీసుకు వస్తున్నందుకు మా ప్రభుత్వం ఎంతో గర్వపడుతున్నది, ఆనందిస్తున్నది.

ఎస్.బి చవాన్
మహారాష్ట్ర ముఖ్యమంత్రి

# ముందుమాట

డా॥ అంబేద్కర్ రచనలలో ఇప్పటి వరకూ ముద్రితం కాని ఈ సంపుటాలకు ముందు మాట రాయవలసిందిగా నన్ను అడగటం, నాకెంతో గౌరవాన్ని ఇచ్చినట్టుగా భావిస్తున్నాను.

భారతీయ సమాజ శాస్త్ర కోవిదులలో డా॥ అంబేద్కర్ అత్యుత్తమ స్థానాన్ని అలంకరిస్తారు. రచనల ద్వారా ప్రస్ఫుటమయ్యే ఆయన పాండితీ ప్రకర్ష, మన సాంఘిక మతపరమైన సమస్యలకు ఒక హేతుబద్ధమైన మార్గాన్ని సూచించే కాంతిరేఖలా ఉపకరిస్తుంది.

డా॥ ్కర్ సంపూర్ణ రచనలను సంపుటాలుగా వెలువరించే పని మహారాష్ట్ర ప్రభుత్వం చేపట్టింది. ఈ పని నిమిత్తమై పునర్నిర్మితమైన సంఘం ఆయన అముద్రిత రచనలను మూడు సంపుటాలుగా వెలువరించింది. భారతీయ సామాజిక, రాజకీయ పరిణామ అధ్యయనపరులు వీటికోసం ఎంతో ఆసక్తితో ఎదురు చూస్తున్నారు.

భారతీయ సమాజంలోని తాత్విక సమస్యలనూ, సాంఘిక సమస్యలనూ, చర్చించిన ఈ సంపుటాలు, హేతువాద ప్రాతిపదికపైన జాతీయ సమస్యలకు పరిష్కారాన్ని కనుగొనటానికి ఆతుత పడుతున్న నవయువతరానికి, మేధావులకూ చాలా ఆసక్తిదాయకమవుతాయి.

ఈ సంపుటాలను త్వరితగతిలో తీసుకురావటానికి చూపిన ఆసక్తికి, అంకిత భావానికి, శ్రద్ధకు సంపాదకవర్గాన్ని అభినందించాలి.

ఆచార్య రామ్ మేఘే

విద్యాశాఖామంత్రి, మహారాష్ట్ర

# పరిచయం

భారతదేశపు ప్రజలలోని కొన్ని వర్గాలలో బౌద్ధమతం పట్ల ఆసక్తి రోజురోజుకు పెరుగుతున్న సూచనలు కనిపిస్తున్నాయి. దానితోపాటు సహజంగానే బుద్ధుని జీవితాన్ని గురించీ, బోధనలను గురించీ విస్పష్టమైన, సుసమన్వితమైన రచనల కోసం ఆరాటంకూడా పెరుగుతోంది.

బౌద్ధుడుకానివాడు బుద్ధుని జీవితాన్ని గూర్చి, బోధనలనుగూర్చి సుసమన్వితమైన, పరిపూర్ణమైన రీతిలో గ్రంథం రచించడం చాలా కష్టం. `నికాయాలు ' ఆధారంగా బుద్ధుని జీవితకథను, సుసమన్వితంగా ప్రకటించడం కష్టం; ఆయన బోధనలలో కొన్నింటిని ప్రకటించడం మరీ కష్టం. నిజానికి ప్రపంచంలోని ఇతరమతాల ప్రవక్తల జీవితాలనూ, బోధనలనూ ప్రకటించడంకంటె బౌద్ధమత స్థాపకుని జీవితాన్నీ, బోధనలనూ ప్రకటించడం మరింత క్లిష్టమైనపని. అందుకు రచయిత చికాకుకలిగించే ఎన్నో చిక్కుప్రశ్నలను ఎదుర్కొనవలసివస్తూంది. మరి అలాంటి ప్రశ్నలన్నింటినీ పరిష్కరించి బౌద్ధమత బోధనల అవగాహన మార్గాన్ని సుగమం చేయడం అవసరంకాదా? బౌద్ధులందరూ ఈ ప్రశ్నలను గూర్చి తీవ్రంగా చర్చించి, వాటిమీద చేతనైనంత వెలుగును ప్రసరింప చేయవలసిన తరుణం ఆసన్నంకాలేదా?

ఇట్టి ప్రశ్నలను గూర్చిన చర్చను లేవదీయాలనే ఉద్దేశ్యంతోనే ఆ ప్రశ్నలను నేను ఇక్కడ పేర్కొంటున్నాను. మొదటి ప్రశ్న : బుద్ధుని జీవితంలోని ప్రధాన సంఘటన అయిన `పరివ్రజ ' కు సంబంధించింది. బుద్ధుడు ఎందుకు `పరివ్రజ ' కు పూనుకొన్నాడు? సాంప్రదాయకంగా చెబుతూ వచ్చిన జవాబు: `ఒక శవాన్ని, ఒక వృద్ధుణ్ణి, ఒక వ్యాధి పీడితుణ్ణి చూసి బౌద్ధుడు `పరివ్రజ ' కు పూనుకొన్నాడు ' అని ఇది పూర్తిగా అర్థంలేని జవాబు. బుద్ధుడు తన 29వ ఏట `పరివ్రజ ' కు పూనుకొన్నాడు. ఈమూడు దృశ్యాలను దర్శించడం వల్లనే ఆయన `పరివ్రజ ' కు పూనుకున్నాడు అంటే అంతకు ముందు ఈ దృశ్యాలు ఆయన కంట ఎందుకు పడలేదు? ఇవి సర్వసాధారణమైన సంఘటనలుగదా! అంతవరకూ ఇవి ఆయన కంటపడకుండా ఉండడం అసంభవం. ఆదృశ్యాలను ఆయన చూడడం అదేమొదటిసారి అని చెప్పేసాంప్రదాయిక వివరణను మనం ఎంత మాత్రం అంగీకరించలేము. ఆవివరణ అసహజమైనది, తర్కదృష్టికి నిలువ జాలనిది. మరి ఆ ప్రశ్నకు ఈ జవాబును అంగీకరించకపోతే మరి ఏది నిజమైన జవాబు?

రెండవ ప్రశ్న: నాలుగు ఆర్యసత్యాలకు సంబంధించినది. ఇవి బుద్ధుని అసలు బోధనలలో భాగం అవునా కాదా? ఈ సత్యాలు బౌద్ధమత మూలానికే గొడ్డలిపెట్టు. జీవితం దుఃఖం, మరణం దుఃఖం, పునర్జన్మ దుఃఖం అయితే మరి ప్రాణులకు ఎలాంటి గమ్యం లేకుండా పోతుంది. మతంకాని, తత్వశాస్త్రంకాని ఈలోకంలో మనిషికి సుఖం సాధించడానికి

తోడ్పడవు. దుఃఖంనుండి విముక్తి మార్గంలేక పోతేమతం ఏమి చేస్తుంది? బుద్ధుడు మనిషి దుఃఖాన్ని నివారించడానికి ఏమి చేయగలడు? దుఃఖం జన్మతో వచ్చినదేగదా! బౌద్ధులుకాని వారు బౌద్ధమతాన్ని అంగీకరించడానికి ఈనాలుగు ఆర్యసత్యాలూ గొప్ప ప్రతిబంధకాలుగా ఉన్నాయి. ఇవి మనిషికి ఆశలేకుండా చేస్తున్నాయి. ఇవి బౌద్ధమతాన్ని నిరాశావాద మతంగా రూపొందిస్తున్నాయి. ఇవి అసలు బుద్ధుడు చేసిన బోధనలేనా? లేదా మధ్యలో బౌద్ధ సన్యాసి ఎవరైనా చేర్చినవా?

మూడవ ప్రశ్న: 'ఆత్మ', 'కర్మ', 'పునర్జన్మ' లకు సంబంధించినది. బుద్ధుడు ఆత్మ ఉనికిని నిరాకరించాడు. కాని ఆయనే కర్మ, పునర్జన్మ సిద్ధాంతాలను ధ్రువీకరించాడు. అందువల్ల ఒక ప్రశ్న ఉత్పన్నంఅవుతుంది. 'ఆత్మ' లేకపోతే కర్మ ఎలా సాధ్యం? ఆత్మలేకపోతే పునర్జన్మ ఎలా సాధ్యం? అని. ఇవి ఎవరినైనా నిరుత్తరులను చేయగల ప్రశ్నలు. 'కర్మ', 'పునర్జన్మ' పదాలను బుద్ధుడు ఏ అర్థంలో వాడాడు? తన కాలంనాటి బ్రాహ్మణులు వాడిన అర్థంలో కంటె విభిన్నమైన అర్థంలో ఆయన ఈ పదాలను వాడాడా? అవును అంటే అర్థం ఏమిటి? లేక బ్రాహ్మణులు వాడిన అర్థంలోనే ఆయన కూడా వాటిని వాడాడా? అలా వాడి ఉంటే ఒక వంక ఆత్మ లేదంటూ మరొకవంక కర్మ, పునర్జన్మ లు ఉన్నాయనడం పరస్పర విరుద్ధంకాదా? ఈ వైవిధ్యాన్ని నివారించవలసి ఉంది.

నాలుగవ ప్రశ్న: భిక్కుకు సంబంధించినది. బుద్ధుడు భిక్కును ఏర్పాటు చేయడంలో ఆయన ఉద్దేశ్యం ఏమిటి? అతనిని పరిపూర్ణమానవునిగా తీర్చిదిద్దడమా? లేక తన జీవితాన్ని పూర్తిగా ప్రజాసేవలో గడుపుతూ, వారికి ఒక మిత్రునిగా, మార్గదర్శిగా, తత్త్వదర్శిగా ఉండేట్టుచేయడమా? ఇది చాలా ముఖ్యమైన ప్రశ్న. దీని మీదనే బౌద్ధమత భవితవ్యం ఆధారపడి ఉంది. భిక్కువు కేవలం పరిపూర్ణ మానవుడు అంటే బౌద్ధమత ప్రచారానికి అతడెంత మాత్రం ఉపయోగపడడు. ఏమంటే పరిపూర్ణమానవుడైనా అతడు స్వార్థపరుడై ఉంటాడు. కనుక అలా కాకుండా అతడు సంఘసేవకుడు అనే పక్షంలో బౌద్ధమత విస్తరణకు అతడు ఆశాజ్యోతి కాగలడు. సిద్ధాంత సమన్వయం కోసమేకాకుండా ముఖ్యంగా ఈ ప్రశ్నను బౌద్ధమత భవితవ్యం కోసమైనా మనం పరిష్కరించవలసిఉంది.

నన్నుమన్నిస్తే మహాబోధిసొసైటివారు నడుపుతున్న జర్నల్‌లోని పుటలు కనీసం నావరకైనా చదవడానికి ఉత్సాహం కలిగించడంలేదు. ఆపుటలలోని విషయం ఆసక్తిదాయకం గాను, ప్రబోధాత్మకంగానూ లేకపోవడం ఇందుకు కారణం కాదు. అలా ఉత్సాహం లేక పోవడానికి కారణం అనాసక్తితో కూడిన పాఠకులు ఆ పుటలు చదువవలసి రావడం. దానిలో ఒక వ్యాసంచదివి ఆ జర్నల్ పాఠకుడు ఏమి చెబుతాడో తెలుసుకోవాలని మనకు ఉంటుంది. కాని ఆ పాఠకుడు తన ప్రతిస్పందనను ఎంత మాత్రం ప్రకటించడు. పాఠకుడు ప్రదర్శించే ఈమౌనం రచయితకు గొప్పనిరుత్సాహం కలిగిస్తుంది. నేను లేవదీసిన ప్రశ్నలు పాఠకులను ఉత్సాహపరచి ఈ సమస్యల పరిష్కారానికి వారి సూచనలను ప్రకటించేట్టు చేస్తాయని నేను ఆశపడుతున్నాను.

డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్

# నాంది

మనకు ప్రస్తుతం ఉన్న, వారసత్వంగా పొందిన విశ్వాసాలనూ, అభిప్రాయాలనూ కాలానుగుణంగా తిరిగి తిరిగి పునర్విమర్శచేసుకోవడం తప్పనిసరి! తద్వారా వర్తమాన, భూతకాలాల అనుభూతుల మధ్య కొంత సమన్వయం సాధించుకోవడం, మన అనుభుతులకూ, ఆలోచనలకూ సంతృప్తికలిగించే రీతిలో ధైర్యంగా భవిష్యత్తును ఎదుర్కోడం సాధ్యం కాగలదు. ప్రస్తుత కాలంలో సవిమర్శకమైన, శాస్త్రీయమైన వివేచన రూపంలో ఉన్న మనమతం సైద్ధాంతికంగానూ, ఆచరణ పూర్వకంగానూ ప్రాధాన్యాన్ని సంతరించుకొని ప్రజలదృష్టిని ఎక్కువెక్కువగా ఆకర్షించగలగడానికి కారణాలు:(ఏ) ఆధునికశాస్త్రీయ విజ్ఞానం, భావసంపద శీఘ్రగతిని అభివృద్ధి చెందుతూ ఉండడం,(బి). ఈ విషయమై ప్రగాఢమైన బౌద్ధిక ఆసక్తి వ్యక్తం అవుతూఉండడం (సి). ప్రపంచంలోని అన్ని ప్రాంతాలలోనూ మతాన్ని సంస్కరించి దానికి నూతన భావరూపం చేకూర్చి దానిని మరింత `తర్కసహం' గానూ, శాస్త్రీయంగానూ, మూఢవిశ్వాసరహితంగానూ రూపొందించాలనే ప్రయత్నాలు విరివిగా సాగుతూ ఉండడం, (డి). గతంలో మతాన్ని ప్రభావితం చేసి మతం చేత ప్రభావితమవుతూ వచ్చిన నేటి సాంఘిక, రాజకీయ, అంతర్జాతీయ సంఘటనల ప్రభావం. కొన్ని కృత్యాల. సంఘటనల నైతిక విలువ ప్రశ్నింప బడినప్పుడల్లా దానిలో మత సంబంధమైన విలువ యొక్క ప్రసక్తి ఉంటుంది. ప్రగాఢంగా కదిలించే అనుభూతులు తప్పని సరిగా స్పష్టంగా మత సంబంధమైనవి అయినా కాకపోయినా మన ప్రాతిపదిక భావాలను పునర్విమర్శ చేసుకొనేట్టు మనలను బలాత్కరిస్తాయి. చివరకు న్యాయం, మానవ గమ్యం, దేవుడు, విశ్వం వంటి సమస్యలు తల ఎత్తుతాయి. ఇవి మతానికీ, ఇతర భావాలకూ మధ్య ఉన్న సంబంధం, సామాన్య జ్ఞానం యొక్క యథార్థత, `అనుభవం', 'వాస్తవికత'లకు సంబంధించిన ఆచరణ యోగ్యమైన ఆలోచనలు మొదలైన సమస్యలతో సంబంధం కలిగి ఉంటాయి.

"ఎన్‌సైక్లోపీడియా ఆఫ్ రిలిజియన్ అండ్ ఎథిక్స్"
(సంపుటం 10, పుట 669) నుండి

# విషయ సూచిక

## అధ్యాయం I

# సిద్ధార్థ గౌతముడు
# బోధి సత్త్వుడు బుద్ధునిగా మారిన విధం

1. జననం నుండి పరివ్రాజం వరకు.
2. చిర పరిత్యాగం.
3. కొత్త వెలుగుకై అన్వేషణ.
4. జ్ఞానోదయం - వినూత్నమార్గ దర్శనం.
5. బుద్ధుడు - అతనికి ముందువారు.
6. బుద్ధుడు అతని సమకాలీనులు
7. సాదృశ్యాలు-వ్యత్యాసాలు.

# 1. అతని వంశం

1. క్రీస్తు పూర్వం ఆరవశతాబ్ది కాలంలోనికి వెళ్ళి గమనిస్తే ; ఉత్తర భారతదేశమంతా ఏకైక సార్వభౌమిక రాజ్యంగా లేదు.

2. దేశమంతా, కొన్ని పెద్దవి, మరికొన్ని చిన్నవిగా చాలా రాజ్యాంగాలుగా విభజింపబడి వుండేది. వాటిలో కొన్ని సార్వభౌమిక రాజ్యాలు, మరికొన్ని సామంత రాజ్యాలు

3. సార్వభౌమిక రాజ్యాలు అన్నీ కలిపి పదహారు వుండేవి. అవి అంగ, మగధ, కాశి, కోసల, వ్రజ, మల్ల, ఛేది, వత్స, కురు, పాంచాల, మత్స్య, శౌరసేన, అశ్మక, అవంతి, గాంధార, కాంభోజ రాజ్యాలు.

4. కపిలవస్తునేలిన శాక్యులు ; పవను, కుషినారలనేలిన మల్లులు ; వైశాలినేలిన లిచ్ఛవులు ; మిధిలనేలిన వైదేహులు ; రామగమునేలిన కొలియలు ; అలకాప్పరాన్ని పాలించిన బులీలు ; రేసపట్టణాన్నేలిన కళింగులు, పిప్పల్వణ రాజ్యాన్నేలిన మౌర్యులు; శంశుమర పర్వత ప్రదేశాన్ని రాజధానిగా చేసుకుని పరిపాలించిన భగ్గులు - వీరందరూ వారి వారి రాజ్యాలను రాజరికం లేని రాజ్యాలుగానే పరిపాలించారు

5. రాజ్యాధికారానికి లోబడిన రాజ్యాలను జనపదాలనీ, రాచరికం లేని వాటిని 'సంఘాలని' లేక 'గణా'లని అంటూ వుండేవారు.

6. కపిలవస్తును పాలించిన శాక్యులది ప్రజా ప్రభుత్వ పాలనా, లేక కులీనులైన కొంతమంది పెద్దల సమష్టితో సాగిన రాజ్యపాలనా అనే విషయమై సరియైన ఆధారాలు లేవు.

7. కానీ, ఆ రోజుల్లో, శాక్యుల ప్రజా ప్రభుత్వంలో, పరిపాలన సాగించే కుటుంబాలు చాలా వుండేవనీ, అవి ఒకటి తర్వాత మరొకటి పరిపాలించేవని మాత్రం రూఢిగా చెప్పవచ్చు.

8. అధికారంలో వుంటూ పరిపాలన సాగించే కుటుంబ యజమానిని (పెద్దను) 'రాజు' అనేవారు.

9. సిద్ధార్థ గౌతముడు జన్మించేనాటికి, శుద్ధోదనుడు రాజుగా పరిపాలిస్తూ వుండేవాడు-

10. భారతదేశానికి ఈశాన్య దిక్కున శాక్యుల రాజ్యం వుండేది. అది ఒక స్వతంత్ర రాజ్యంగా వుండేది. కాని కొన్నాళ్ళ తర్వాత కోసల రాజు దానిని జయించి, తన సామ్రాజ్యంలో కలుపుకున్నాడు.

11. దాని ఫలితంగా, కోసల రాజు అనుమతి లేనిదే శాక్యరాజ్యం కొన్ని రాజ్యాధికారాలను వినియోగించుకోలేకపోయేది.

12. ఆనాటి రాజ్యాలలో కెల్ల కోసల రాజ్యం చాలా శక్తివంతమైనదిగా వుండేది - అలాగే మగధను కూడా చెప్పుకోవచ్చు. కోసల రాజు పసనేది (ప్రసేనుడు) మగధ రాజు బింబిసారుడు సిద్ధార్థ గౌతమునికి సమకాలీనులే.

## 2. అతని పూర్వీకులు

1. కపిలవస్తు శాక్యుల రాజధాని. బహుశా అది ప్రముఖ హేతువాది అయిన కపిలుని పేరుతో వెలసిన నగరమై వుండవచ్చు.
2. జయసేనుడనే శాక్యుడు కపిలవస్తులో వుండేవాడు. అతని కుమారుడు సినాహుడు - సినాహుడి వివాహము కచ్చనతో జరిగింది. సినాహునికి శుద్ధోధన, ధౌతోధన, సాక్కోధన, శుక్లోధన, అమితోధన అనే అయిదుగురు కొడుకులతో పాటు, అమిత, పమిత అనే యిద్దరు కుమార్తెలు కూడా జన్మించేరు.
3. వారి కుటుంబ గోత్రం "ఆదిత్య"
4. శుద్ధోధనుని వివాహము మహామాయతో జరిగింది. ఆమె తండ్రి పేరు అంజనుడు. తల్లి పేరు సులక్షణ. అంజనుడు కొలియ వంశజుడు. దేవదహ అనే గ్రామంలో నివసిస్తూ వుండేవాడు.
5. శుద్ధోధనుడు యుద్ధ విద్యలో ఆరితేరిన గొప్ప బలపరాక్రమశాలి. యుద్ధ విద్యల్లో అతను ప్రదర్శించిన శక్తి సామర్థ్యాలవల్ల రెండవ భార్యను పొందడానికై అతనికి అనుమతి లభించగా, మహా ప్రజాపతిని ఆయన ఎన్నుకొన్నాడు - ఆమె మహామాయకు అక్క.
6. శుద్ధోధనుడు గొప్ప ధనవంతుడు. విస్తారమైన పంట భూములుండేవి. అతని అధీనంలో చాలా గొప్ప పరివారం వుండేది. తన స్వాధీనంలో వున్న భూమిని దున్నడానికి వేయి నాగళ్ళను వుపయోగించినాడని చెప్పుకునేవారు.
7. అతనికి ఎన్నో భవంతులు వుండేవట. గొప్ప విలాసవంతమైన రాజభోగాలతో ఆయన జీవితాన్ని గడిపేవాడు.

## 3. అతని జననం

1. శుద్ధోదనునికి జన్మించినవాడే సిద్ధార్థ గౌతముడు. అతని జన్మ వృత్తాంతం ఇలా చెప్ప బడింది.
2. ప్రతి సంవత్సరం గ్రీష్మకాలం మధ్యలో వసంతోత్సవాన్ని జరుపుకోవడం శాక్యుల ఆచారం. ఒకసారి అది ఆషాఢమాసంలో వచ్చింది. రాజ్యంలో గల అందరు శాక్యులు రాజకుటుంబీకులు కూడా దీన్ని జరుపుకొనేవారు.
3. ఈ ఉత్సవం ఏడు రోజులపాటు జరుపుకోవడం ఆనవాయితీగా వస్తోంది.

ఒకానొక తరుణంలో, పండగను ఆనందోత్సాహాలతో, అత్యంత వైభవంగా, నానావిధ పుష్పాలతో, సుగంధ పరిమళాలతో జరుపుకోవాలని మహామాయ నిర్ణయించింది. మధుపానం మాత్రం నిషేధింపబడింది.

ఆ ఏడవ రోజున, మహామాయ పెందలకడే నిద్రలేచి, పన్నీట జలకమాడ, నాలుగు లక్షల వరహాలు దానం చేసింది. విలువైన నగలనలంకరించుకుని, తనకు యిష్టమయిన ఆహారాన్ని భుజించి,వుపవాసకాలం నాటి మొక్కుబడులన్నింటినీ తీర్చి, సర్వాలంకార శోభితయై అలరారుతూ నిద్రించడానికై రాజసౌధంలోగల తన శయనమందిరంలోనికి ప్రవేశించింది.

ఆ రాత్రి శుద్ధోదనుడు, మహామాయా కలిసారు. మహామాయ గర్భం దాల్చింది. హంసతూలికాతల్పం మీద పడుకొని నిద్ర పోయింది - ఆ గాఢ నిద్రలో ఆమె ఒక కల కన్నది.

ఆ కలలో నలుగురు దిక్పాలకులు, శయ్యపై పవ్వళించి వున్న తనను పైకెత్తి హిమాలయ పర్వత శ్రేణిలో ఎత్తైన ఒక సమతల ప్రదేశంలో గల పెద్ద (సాల) వృక్షం క్రిందన వుంచి, ప్రక్కగా నిలుచుని వున్నారు.

ఆ దిక్పాలకుల భార్యలు ఆమెను సమీపించి, మానస సరోవరానికి ఆమెను తీసుక వెళ్ళారు.

ఆమెకు స్నానం చేయించారు - దేవతా వస్త్రాలు కట్టారు - సుగంధ ద్రవ్యాలతో అభిషేకించారు - దైవత్వ సిద్ధికి పాత్రురాలిగా వుండే విధంగా పూలమాలలతో అలంకరించి సిద్ధపరిచారు.

0. అప్పుడు సుమేధుడనే బోధిసత్త్వుడు ఆమె ముందు సాక్షాత్కరించి, "ఈ భూమండలం మీద నా కడపటి జన్మను ప్రారంభిద్దామని తలపోస్తున్నాను. నీవు నా తల్లిగా వుండటానికి అంగీకరిస్తావా?" అని అడిగాడు "మహదానందంగా...." అని ఆమె అన్నది. అంతలో మహామాయకు మెలకువ వచ్చింది.

1. మరునాటి వుదయాన్నే మహామాయ తన స్వప్న వృత్తాంతాన్ని శుద్ధోదనునికి తెలియ జేసింది. ఆ స్వప్నాన్ని ఎలా అన్వయించు కోవాలో తెలియక శుద్ధోదనుడు ప్రసిద్ధ మర్మజ్ఞులైన ఎనమండుగురు బ్రాహ్మణులను పిలిపించాడు.

2. వారు రామ, ధగ, లక్కన, మంతి, యన్న, సుయామ, సుభోగ, సుదత్త అనేవారు. వారికి అఖండ స్వాగత సత్కారాలు ఏర్పాటు చేసాడు.

3. సుగంధ పరిమళాలను వెదజల్లే పుష్పాలను ఆ ప్రదేశమంతా పరిపించి, వారికి వున్నతాసనాల నేర్పాటు చేయించాడు.

4. ఆ బ్రాహ్మణుల పాత్రలను బంగారు, వెండి నాణాలతో నింపి వేసాడు. నెయ్యి, తేనె,

నూతన వస్త్రాలు కపిలవర్ణం కలిగిన మేలు రకం ఆవుల వంటి ఘన బహుమానాలతో సత్కరించాడు.

15. బ్రాహ్మణోత్తములు సంతుష్టులై ప్రసన్నులయిన తరువాత మహామాయకు కలిగిన స్వప్న వృత్తాంతాన్ని వారికి వివరించి, దీని ఫలితమేమిటో తెలియజేయండి" అని శుద్ధోదనుడు కోరాడు.

16. "కలవరపడవలసిన అవసరం లేదు - నీకు త్వరలోనే ఒక కుమారుడు జన్మిస్తాడు. అతడు గృహస్థ జీవితము గడిపితే, ప్రపంచానికే సార్వభౌముడవుతాడు. అలా కాని పక్షంలో, ఇల్లువిడచి ; ఒక సన్యాసిగా మారి ; ప్రపంచంలోని మాయ, భ్రమలను అన్నింటినీ పార ద్రోలగల బుద్ధునిగా మారతాడు" - అని ఆ బ్రాహ్మణులు తెలిపారు.

17. నూనె నిండియున్న గిన్నె లాగున ఎంతో జాగ్రత్తగా, సుకుమారంగా తన గర్భంలో గల బోధిసత్వుని పది చాంద్రమాన మాసాలపాటు మోసి, ప్రసవ సమయం సమీపిస్తుండగా తన పుట్టింటికి వెళ్ళాలని అభిలషించింది మహామాయ. "మా తండ్రిగారి నివాసమైన దేవదహ నగరానికి వెళ్ళగోరుతున్నాను" అని తన భర్తతో అన్నది.

18. "నీ అభీష్టాన్ని నేను ఎన్నడైనా కాదన్నానా?" అని శుద్ధోదనుడు బంగారు పల్లకీని సిద్ధపరచి, దానిలో ఆమెను కూర్చొనబెట్టి, జాగ్రత్తగా తీసుకొని వెళ్ళడానికై బోయీల నేర్పాటు చేసాడు. విశేష పరిజనం తరలిరాగా ఆమెను తన పుట్టినింటికి సాగనంపేడు.

19. దేవదహకు వెళ్ళే మార్గంలో, గుగ్గిలపు వృక్షాలు, పుష్పించేవి, పుష్పించనివి అయిన అనేక చెట్లు గల ఆహ్లాదకరమైన పెద్ద తోపు ద్వారా పయనించాల్సి వచ్చింది - అదే లుంబినీ వనం.

20. ఆ లుంబినీ వనం గుండా పయనిస్తున్న పల్లకీ, స్వర్గంలోని చిత్తలతావనమో, లేక సార్వభౌముని కోసమై అలంకరింపబడిన విడిది మంటపమో అనిపించేటట్లుగా వుంది.

21. చెట్ల మొదళ్ళ నుండి కొమ్మల చిగుళ్ళ వరకు, పలురకాల పండ్లతోను ఆకర్షణీయమైన రంగు రంగుల పూలతోను, వింత మధుర ధ్వనులను చేస్తూ వున్న అసంఖ్యాకమైన తుమ్మెదలతోను కిలకిలారావాలు చేసే రకరకాల పక్షుల సమూహాలతో నుండి రమణీయంగా వుంది.

22. ఆ సుందర వాతావరణాన్ని చూసి పరవశించిన మహామాయకి అక్కడ ఆగి, కాసేపు విశ్రమించాలి అనే కోరిక కలిగింది. దానికై గుగ్గిలపు వృక్షాలతోపులోనికి తీసుకొని వెళ్ళి, పల్లకీని దింపి, అక్కడే కొద్ది సేపు వుండవలసిందిగా బోయీలనాదేశించింది.

23. మహామాయ తన పల్లకీ నుండి దిగి, ఒక మహత్తరమైన గుగ్గిలపు వృక్షం వద్దకు నడచి వెళ్ళింది. ఆహ్లాదకరమైన పిల్లగాలులకు చెట్ల కొమ్మలు పైకి క్రిందకు వూగుతూ వుంటే, వాటిలో ఒక దాన్ని పట్టుకోబోయింది మహామాయ.

24. అదృష్ట వశాత్తూ, ఒక కొమ్మ ఆమె పట్టు కోవడానికి వీలుగా, తగినంత క్రిందికి వంగింది. ముంగాలి వ్రేళ్ళపై నిలబడి ఆ కొమ్మను చేజిక్కించుకుంది. వెనువెంటనే ఆ కొమ్మ పైకి ఎగసి పోతూండగా, కొమ్మతో బాటు ఆమె కూడా గాలిలోకి పైకి లేచిన సమయంలో శరీరంలో కదలిక వలన ఆమెకు పురుటి నొప్పులు వచ్చాయి. ఆమె చెట్టు కొమ్మకు వ్రేలాడుతూ వున్న దశలోనే, నిలువబడి వున్న భంగిమలోనే ఆమె ఒక పిల్లవానిని ప్రసవించింది.

25. క్రీస్తు పూర్వం 563వ సంవత్సరం వైశాఖ పూర్ణిమ దినాన ఆ పిల్లవాడు జన్మించాడు.

26. శుద్ధోదనుడు, మహామాయలకు వివాహమై ఎన్నో సంవత్సరాలయ్యింది. కాని వారికి సంతానం కలగ లేదు. లేక లేక కలిగిన పుత్రుని జనన మహోత్సవాన్ని శుద్ధోదనుడు, అతని కుటుంబమే గాకుండా, శాక్యులు అందరూ ఎంతో ఆనందంగా, ఆడంబరంగా జరుపుకున్నారు.

27. పుత్రుడు జన్మించిన శుభ కాలంలో, శుద్ధోదనునికి రాజుగా కపిలవస్తును పాలించే అవకాశం వచ్చింది. అందువల్ల రాచరికం పొందిన ఆనందంలో వున్నాడు - అతని కుమారుడు ఆనవాయితీ ప్రకారం రాకుమారుడుగా వ్యవహరింపబడేవాడు.

## 4. అసిత మహాముని రాక

1. బాలుడు జన్మించిన విషయం హిమాలయాలలో వున్న అసిత మహామునికి తక్షణమే తెలియ వచ్చింది.

2. ఆకాశంలోని దేవతలు చేసిన (బుద్ధనామ ఘోషతొ) ఆకాశమంతా ప్రతిధ్వనిస్తున్నది. వారు ఆనందంతో విహరిస్తున్నారు. "నేను వెళ్ళి, ఆ బుద్ధుడు ఏ ప్రదేశంలో జన్మించాడో తెలుసుకోవాలి" అని ఆయన సంకల్పించాడు.

3. తన దివ్యయోగ దృష్టితో జంబూ ద్వీపాన్ని యావత్తు పరికించగా, శుద్ధోదనుని యింట బ్రహ్మజ్ఞాన తేజో విరాజితుడై జన్మించివున్న ఒక బాలుని గుర్తించాడు. అతని జననం వలననే దేవతలందరూ పరమానందభరితులై యున్నారని తెలుసుకున్నాడు.

4. అసిత మహాముని తన మేనల్లుడైన నారదత్తునితో కలిసి శుద్ధోదనుని రాజ్యానికి వచ్చి, రాజసౌధ ద్వారబంధం వద్ద నిలుచున్నాడు.

5. శుద్ధోదనుని సౌధ ద్వారం వద్ద లక్షలాది మంది గుమిగూడి వుండడం అసిత మహాముని చూచాడు. అప్పుడు ద్వారపాలకుని సమీపించి, "ఓయీ!వెళ్ళు వెళ్ళి, ద్వారం దగ్గర ఒక ఋషి నిరీక్షిస్తూవున్నాడని రాజుకు చెప్పు!" అని అన్నాడు.

6. అప్పుడా ద్వారపాలకుడు శుద్ధోదనుని సమీపించి, ముకుళిత హస్తాలతో "మహారాజా! వయో వృద్ధుడైన ఒక యోగీశ్వరుడు ద్వారం వద్ద వేచి వున్నాడు. తమ దర్శనానికై అభిలాష పడుతున్నారు." అని విన్నవించుకున్నాడు.

7. అసితునికి ఒక వుచితాసనాన్ని సిద్ధం చేసి, "ఆ యోగీశ్వరుని ప్రవేశపెట్టు" అని రాజు ద్వారపాలకుని ఆజ్ఞాపించాడు. ద్వారపాలకుడు అసితునితో "లోనికి దయ చేయండి" అని అన్నాడు.

8. అప్పుడా అసితుడు శుద్ధోదన రాజును సమీపించి, అతని ఎదురుగా నిలువబడి, "జయము జయము ఓ రాజా! దీర్ఘాయుష్మాన్భవ. చిరకాలం ధర్మ బద్ధంగా నీవు రాజ్యపాలన చేయుదువు గాక" అని దీవించాడు.

9. అప్పుడు శుద్ధోధనుడు, భక్తి ప్రపత్తులతో అసితుని పాదాలకు నమస్కరించి, ఉచితాసనాన్ని సమర్పించాడు. ఆయన సుఖాసీనుడైన తర్వాత, "ఓ మహర్షి! తమ దర్శన భాగ్యం మునుపెన్నడూ నాకు కలిగిన గుర్తు లేదు. ఏ కార్యార్థియై తమరిచ్చటికి వేంచేసినారో, ఆ కారణమేమిటో సెలవివ్వండి" అని శుద్ధోదనుడు అడిగాడు.

10. దానిపై అసితుడు శుద్ధోధనునితో "ఓ రాజా! నీకు ఒక పుత్రుడు జన్మించాడు. అతనిని చూడాలనే కోరికతోనే నేను వచ్చాను" అని చెప్పాడు.

11. మునివర్యా! బాలుడు నిద్రిస్తున్నాడు. కొద్దిసేపు వేచి యుండగలరా! అని శుద్ధోదనుడు అర్థించగా, "ఓ రాజా, మహాత్ములు ఎక్కువసేపు నిద్రపోరు అటువంటి మహనీయులు నిద్రిస్తున్నా, మేల్కొనే వుంటారు". అని అసితుడు అన్నాడు.

12. అసిత మహామునిని కరుణించాడా అన్నట్లు తాను మేల్కొన్నట్లు సవ్వడి చేసాడా బాలుడు.

13. బాలుడు నిద్ర మేల్కొన్నాడని గమనించిన శుద్ధోదనుడు, జాగ్రత్తగా ఆ బాలుని తల రెండు చేతుల తోను పొదివి పట్టుకొని, ఋషి సమక్షానికి తీసుకు వచ్చాడు.

14. అసితుడా బాలుని వీక్షించి, మహాపురుషులకు మాత్రమే వుండే ముప్పది రెండు ముద్రలతో, ఎనభై లఘు ముద్రలతో అలంకరింప బడిన వాడిగా ; శుక్ర బ్రహ్మాదుల నతిశయించిన శరీరం కలవాడిగా ; కొన్ని లక్షల రెట్లు మించిన బ్రహ్మ తేజస్సు గలవాడిగా ఆ బాలుని గుర్తించి, ఈ వుద్భవించడం నిజంగా అద్భుతం" అని గౌరవ భావంతో తన ఆసనము నుండి లేచి, చేతులు జోడించి, పాదాలను స్పృశించాడు. ప్రదక్షిణము చేసి, తన హస్తాలలోనికి ఆ బాలుని తీసుకుని, ఎత్తుకొని ధ్యానవశుడయ్యాడు.

15. గౌతముని వలె, ఎవరైతే మహనీయుల ముప్పది రెండు ముద్రలను కలిగి జన్మిస్తారో, వారికి రెండే రెండు జీవన విధానాలు. మూడవదనేదే వుండదు. అతడు గృహస్థ జీవితాన్ని అనుసరిస్తే, ప్రపంచాన్నంతటినీ పాలించే సార్వభౌముడు కాగలడు. ఇల్లు వదలివెళ్ళి, నిరాశ్రయమైన జీవితాన్ని గడపితే, ఆయన మహాజ్ఞాన సంపూర్ణుడైన బుద్ధుడు అవుతాడు అని అసితునికి తెలుసు.

16. గృహస్థ జీవనాన్ని గౌతముడు కొనసాగించడని అసితుని నమ్మకం.

17. [illegible]

18. ఆ స్థితిలో వున్న అసితుని శుద్ధోధనుడు చూసేడు.

19. విలపిస్తున్న అసితుని చూసి శుద్ధోదనుడు గగుర్పాటు చెందాడు. ఖిన్నుడై "ఓ ఋషి వరా! కన్నీరు కారుస్తూ, తీవ్ర నిట్టూర్పులతో మీరెందుకు యిలా విలపిస్తున్నారు? బాలునికి జరుగబోయే వుపద్రవమేమీ లేదు కదా" అని అడిగేడు.

20. దానిపై అసితుడు, "ఓ రాజా! నేను బాలుని గురించి విలపించటం లేదు. అతనికి రాబోయే ప్రమాద మేమీ లేదు. కాని నేను నా గురించే బాధ పడుతున్నాను" అని రాజుతో అన్నాడు.

21. "ఎందువలన?" శుద్ధోదనుడు అడిగాడు. నేను వృద్ధుడనై పోయాను. వయస్సు పెరిగింది. చాలా సంవత్సరాలు జీవించాను. నిస్సందేహంగా యీ బాలుడు సంపూర్ణ జ్ఞానోదయాన్ని పొంది, బుద్ధునిగా మారతాడు. ఆ పైన, యింతవరకు ప్రపంచంలో ఎవ్వరికీ తెలియని సర్వోత్కృష్టమైన ధర్మ చక్ర పరివర్తనా సిద్ధాంతాన్ని రూపొందించి ప్రపంచ కళ్యాణానికై, అందరికీ బోధిస్తాడు." అని చెప్పాడు.

22. ఆయన ప్రబోధించే మత జీవిత సిద్ధాంతం ఆది మధ్యాంతాల యందు శ్రేష్ఠమైనదిగాను, భాషానుభూతులలో పరిపూర్ణమైనదిగాను సంపూర్ణంగాను, స్వచ్ఛంగాను వుంటుంది.

23. ప్రపంచంలో ఎప్పుడో, ఎక్కడో ఒక ఔదంబర పుష్పం వికసించినట్లుగా, ఏదో ఒక సమయంలో ఏదో ఒక ప్రదేశంలో, ఎన్నో లెక్కలేని కాలచక్ర పరిభ్రమణాల తరువాత, మహనీయులైన బుద్ధులు యీ ప్రపంచంలో ఉద్భవిస్తారు. అదే విధంగా, ఓ రాజా! యీ బాలుడు కూడా నిస్సందేహంగా పరమశ్రేష్ఠమైన, సంపూర్ణ జ్ఞానోదయాన్ని పొందుతాడు. ఆ విధంగా మారిన తర్వాత, లెక్కలేని సంఖ్యలో ప్రజలను దుఃఖ, దుస్థితులనే సాగరాన్ని దాటించి ఆనందమయ స్థితికి చేర్చగలడు".

24. "కానీ నేను ఆ బుద్ధుని చూడలేను. కాబట్టే ఓ రాజా! నేను ఏడుస్తూ, దుఃఖంతో గాఢంగా నిట్టూరుస్తున్నాను" అని చెప్పాడు.

25. ఆ తర్వాత రాజు, అసిత మహర్షికి, అతని మేనల్లుడైన నారదత్తునికి సముచిత భోజన సదుపాయం చేసి, వస్త్రాలను సమర్పించి అతనికి ప్రదక్షిణము చేసేడు.

26. అప్పుడు అసితుడు తన మేనల్లుడైన నారదత్తునితో! "నారదత్తా! ఈ బాలుడు బుద్ధుడైనాడని విన్నవెంటనే; వెళ్ళి, అతని బోధనలకు శరణాగతుడవుకమ్ము! ఇది నీకు కళ్యాణదాయకం, ఆనందదాయకం కాగలదు" అని, రాజు వద్ద శలవు తీసికొని, తన నివాసానికి వెడలి పోయేడు.

# 5. మహామాయ మరణం

1. అయిదవ రోజున నామకరణోత్సవము జరిగింది. బాలునికి 'సిద్ధార్థు'డనే పేరును నిర్ణయించారు. అతని వంశనామం 'గౌతమ' అందుచేత లోక ప్రియంగా గౌతమునిగా

2. పుత్రుడు పుట్టి, నామకరణం చేసే మధ్య గల ఆనందమయ కాలంలో, అకస్మాత్తుగా మహామాయ జబ్బుపడింది. వ్యాధి చాలా తీవ్రతరమైంది.

3. తన అంతిమ ఘడియలు సమీపించినవని గుర్తెరిగిన మహామాయ, శుద్ధోదనుని, ప్రజాపతిని తన శయ్య ప్రక్కకు పిలిచి, "అసితుని దివ్య వాక్కు ఫలిస్తుంది అని నాకు గట్టి నమ్మకముంది. కాని దాన్ని కళ్ళారా చూడటానికి నేను బ్రతికి వుండడం లేదు కదా అనే నావిచారము."

4. "నా పిల్లవాడు త్వరలో తల్లి లేని వాడవుతాడు. నేను పోయిన తర్వాత నా పిల్లవాడిని జాగ్రత్తగా పెంచుతారో, సరిగా చూస్తారో, అతన్ని ఉన్నత భవిష్యత్తు కనుగుణమైన పద్ధతిలో పెంచుతారో లేదో అనే చింత నాకు లేశమాత్రమైనా లేదు.

5. "ప్రజాపతి! నా పిల్లవాడిని నీకప్పగిస్తున్నాను. అతనిని నాకంటే ఎక్కువగా చూసుకుంటావు అన్న విషయంలో నాకే మాత్రం సందేహం లేదు."

6. "విచారించకండి. దేవుని నుండి పిలుపు వచ్చింది. అతని దూతలు నన్ను తీసుకు వెళ్ళడానికై వేచి యున్నారు. నాకు శలవిప్పించండి" అంటూ మహామాయ అంతిమ శ్వాస విడిచింది.

7. తన తల్లి అస్తమించే నాటికి సిద్ధార్థుడు ఏడు రోజుల పసికందు మాత్రమే.

8. సిద్ధార్థునికి నందుడనే తమ్ముడు వున్నాడు. అతడు శుద్ధోధనుని వల్ల మహా ప్రజాపతికి పుట్టినవాడు.

9. అతనికి పినతండ్రి కుమారులు చాలా మంది వుండేవారు. ఒక పినతండ్రియైన శుక్లోధనుని కుమారులు మహానాముడు, అనురుద్ధుడు, మరో పిన తండ్రి అమితోధనుర్ధుని కుమారుడు ఆనందుడు,మేనత్త కుమారుడు దేవదత్తుడు వుండేవారు. సిద్ధార్థ కంటే మహానాముడు పెద్దవాడు, ఆనందుడు చిన్నవాడు.

10. వారి సాహచర్యంలో సిద్ధార్థుడు పెరిగి పెద్దవాడయ్యాడు.

## 6. బాల్యం - విద్యాభ్యాసం

1. సిద్ధార్థునికి నడక, మాటలు రాగానే, శాక్యవంశీయులైన పెద్దలందరూ కూడి, గ్రామదేవత అయిన అభయ దేవాలయానికి ఆ బాలుని తీసుకొని రావలెనని శుద్ధోధనుని కోరారు.

2. శుద్ధోధనుడు అంగీకరించి; బాలునికి తగు ముస్తాబు చెయ్యవలసిందిగా మహా ప్రజాపతికి చెప్పాడు.

3. ఆమె ఆ విధంగా చేస్తుండగా, బాల సిద్ధార్థుడు తియ్యని కంఠంతో "తననెక్కడికి

వెళ్తునారన్న విషయాన్ని తెలిసికొని, చిరునవ్వునవ్వాడు. కాని శాక్యుల సాంప్రదాయాన్ని పాటిస్తూ, అతడు వెళ్ళాడు.

4. ఎనిమిదవ ఏట సిద్ధార్థుడు తన విద్యాభ్యాసాన్ని మొదలు పెట్టాడు.

5. మహామాయ స్వప్న వృత్తాంత పరిణామాలను వివరించడానికై గతంలో రావించనటు వంటి, అతని భవిష్యత్తుపై జోస్యం చెప్పి నటువంటి ఆ ఎనిమిది మంది బ్రాహ్మణులే అతని ఆది గురువులు.

6. వారికి తెలిసిన సమస్త విద్యలు నేర్పిన తర్వాత వేద, వేదాంగోపనిషత్తులను ఔపోసన పట్టివాడు, భాషా పారంగతుడు, వ్యాకరణ శాస్త్ర ప్రవీణుడు, ఉన్నత వంశోద్భవుడు, విశిష చరిత్ర గలవాడు యుద్దీక్కన్థల నివాసి అయిన సబ్బుమిత్తుని రావించాడు శుద్ధోధనుడు. బంగారు కూజాలోని నీళ్ళతో ధారాదత్తం చేస్తూ, విద్యాబోధనకై, ఆ బాలుని శుద్ధోధనుడు అప్పగించాడు. అతడు సిద్ధార్థుని రెండవ గురువు.

7. గౌతముడు అతని వద్ద, తత్కాల ప్రసిద్ధమైన తత్వశాస్త్రాలనన్నింటిలోను ప్రవీణుడయ్యాడు.

8. అంతేకాక, అలరకాలముని శిష్యుడు, కపిలవస్తు నందు ఆశ్రమం గలవాడు అయిన భరద్వాజుని నుండి ఏకాగ్రత, ధ్యానశాస్త్ర జ్ఞానంను నేర్చుకున్నాడు.

# 7. బాల్యదశ లక్షణాలు

1. తన తండ్రితో వ్యవసాయ క్షేత్రానికి వెళ్ళి నప్పుడు, అక్కడ పని ఏమీ లేనప్పుడు, అతడు ఒక ప్రశాంతమైన ప్రదేశానికి వెళ్ళి ధ్యానసాధన చేస్తూ వుండేవాడు.

2. బుద్ధి వికాసానికి కావలసినవన్నీ సమకూర్చి నప్పటికీ, క్షత్రియ ధర్మమైన యుద్ధశాస్త్ర విద్యను నిర్లక్ష్యం చేయలేదు.

3. తన వ్యక్తిత్వ ప్రభావాన్ని కుమారుని మేధపై రుద్దడమనే తప్పిదం చేయరాదని శుద్ధోధనుడు ఆరాటపడేవాడు.

4. సిద్ధార్థుడు దయార్ద్ర హృదయుడు. ఒక మనిషి మరో మనిషి నిస్సహాయ స్థితిని ఆసరాగా తీసికొని దోపిడీ చేయడాన్ని యిష్టపడేవాడు కాడు.

5. ఒకసారి స్నేహితులతో తన తండ్రి వ్యవసాయ క్షేత్రానికి వెళ్ళి, అక్కడ మండుటెండలో, చాలీచాలని దుస్తులు ధరించి, నేలను దున్నుతూ, బండరాళ్ళను మోస్తూ, చెట్లను నరుకుతూ వున్న కూలీలను చూసాడు.

6. ఆ దృశ్యాన్ని చూడటంతోనే, అతడెంతో చలించి పోయాడు.

7. "ఒక వ్యక్తిని మరో వ్యక్తి యిలా దోపిడీ చేయడం సబబేనా? కూలీలు కష్టపడుతూంటే, యజమాని వారి శ్రమఫలాన్ని అనుభవిస్తూ జీవించడం న్యాయమెలా అవుతుంది?"

8. ఏమని చెప్పాలో అతని స్నేహితులకు తెలియలేదు. ఎందుకంటే వారు "కూలీలు సేవ చేయడానికి పుట్టారని, యజమానికి సేవచేయడంలో తమ జీవన విధ్యుక్త ధర్మాన్ని నెరవేర్చుకుంటారనే పురాతన సిద్ధాంతాన్ని నమ్మినవారు కనుక.

9. "వప్రమంగళ" (ఏరువాక) మనే పండుగను శాక్యులు జరుపుకునేవారు. విత్తనాలు చల్లే దినాన గ్రామీణులు జరుపుకునే పండుగయిది.

10. ఆ ఆచారాన్ని సిద్ధార్థుడు ఎల్లప్పుడూ పాటిస్తూ, దున్నడంలో నిమగ్నమయ్యేవాడు.

11. విద్యా వంతుడైనప్పటికీ, శారీరకశ్రమను చిన్న చూపు చూడ లేదు.

12. యోధశ్రేణికి చెందినవాడు కనుక విలువిద్య, ఆయుధ యుద్ధ విద్యలు నేర్చుకున్నాడు. కాని, అనవసరంగా గాయపరచడం అతనికి యిష్టముండేది కాదు.

13. వినోదంలో పాల్గొనడానికి నిరాకరించేవాడు "నీకు పులులంటే భయమా?" అని అతని స్నేహితులడుగుతూ వుండేవారు. "పులులను చంపడానికి మీరు వెళ్ళటంలేదనే విషయం నాకు తెలుసు. నిరపాయమైన లేడి, కుందేలు వంటి అమాయక జంతువుల్ని మాత్రమే చంపుతారు." అని ప్రత్యుత్తర మిచ్చేవాడు.

14. "వేటకు కాకపోతే పోనీ ; నీ స్నేహితుల గురి ఎంత గొప్పదో చూడటానికైనారా" అని వాళ్ళు అనేవారు. "అమాయకపు జంతువులను చంపడం కళ్ళరా చూడలేను" అని అంటూ సిద్ధార్థుడు తిరస్కరించేవాడు.

15. సిద్ధార్థుని యిటువంటి ప్రవర్తనను చూసి ప్రజాపతి గౌతమి ఎంతో వ్యాకులత చెందేది.

16. నీవు క్షత్రియుడవనీ యుద్ధం చేయడం నీ విధి అనీ మరచి పోయావా? యుద్ధం చేయడమనే కళ వేట ద్వారా మాత్రమే నేర్చుకోవడం సాధ్యమవుతుంది. ఎందుకంటే వేటాడటం వలన సరిగ్గా గురిపెట్టడం ఎలాగో నీవు నేర్చుకోగలవు. క్షత్రియులకు వేట అనేది ఒక శిక్షణా స్థలం" అంటూ ఆమె వాదిస్తూ వుండేది.

17. "కాని, అమ్మా! క్షత్రియుడెందుకు యుద్ధం చేయాలి ?" అని సిద్ధార్థుడు గౌతమిని తరచు అడుగుతూ వుండేవాడు. "ఎందుకంటే అది అతని విధ్యుక్తధర్మం కాబట్టి" అని సమాధానం చెపుతూ వుండేది.

18. ఆమె సమాధానంతో సిద్ధార్థుడు ఎప్పుడూ సంతుష్టుడవలేదు. "ఒక మనిషి మరొక మనిషిని చంపడం విధ్యుక్త ధర్మమెలా అవుతుందో చెప్పమ్మా" అంటూ గౌతమిని అడుగుతూ వుండేవాడు. అటువంటి వైఖరి సన్యాసులకు తగినది. అంతేకాని క్షత్రియులు యుద్ధం చేసి తీరాలి. వారలా చేయక పోతే, రాజ్యాన్ని ఎవరు పరిరక్షిస్తారు?" అని గౌతమి వాదించేది.

19. "కాని, అమ్మా! క్షత్రియులందరు పరస్పర ప్రేమానురాగాలు కలిగి వుంటే; మారణకాండ లేకుండా వారి వారి రాజ్యాలను పరిరక్షించుకోలేరా"? [illegible]

20 తన సహచరులను ధ్యాన సాధనలో తనతో కూడమని ప్రోద్బలం చేయ ప్రయత్నించేవాడు. సరిగా కూర్చునే భంగిమను అతడు వారికి నేర్పేడు. ఏదో ఒక దానిపై మనస్సు నెలా లగ్నం చేయాలో వారికి నేర్పాడు. "నేను ఆనందంగా వుండుగాక! నా బంధువులందరు ఆనందంగా వుండుగాక! సమస్త జీవరాసులూ ఆనందంగా వుండుగాక! అనేటటువంటి ఆలోచనలను ఎన్నుకోవలసినదిగా వారికి సలహా యిచ్చేవాడు.

21. కాని అతని స్నేహితులు ఆ విషయాన్ని అంతగా పట్టించుకునే వారుకాదు. పైపెచ్చు అతన్ని చూసి నవ్వేవారు.

22. కండ్లు మూసుకున్న తరువాత వారు ధ్యాన విషయం పై ఏకాగ్రతనుంచలేక పోయేవారు. దానికి బదులుగా కొంత మందికి, వారి కండ్ల ముందు వేటాడటానికై జింక గానీ, తినడానికి తీపి తిను బండారంగానీ కన్పించేవి.

23. అతడు ధ్యాన సాధన వైపు మొగ్గుచూపడం అతని తల్లి దండ్రులకు నచ్చలేదు. అది క్షత్రియ జీవన విధానానికి చాలా విరుద్ధమైంది అని వారు తలచేరు.

24. సరియైన అంశాలపై ధ్యానిస్తే, అది సార్వత్రిక అనురాగాభివృద్ధికి దారి తీస్తుంది అని సిద్ధార్థుడు నమ్మేడు, " సజీవ ప్రాణుల గురించి ఆలోచించి నప్పుడు; ముందుగా మనం విచక్షణ, వివక్షలతోను చూస్తాము. స్నేహితులను, శత్రువులనుండి వేరు చేస్తాం; పెంపుడు జంతువులను మనుష్యుల నుండి వేరు చేస్తాం. మనం స్నేహితులను, పెంపుడు జంతువులను ప్రేమించి, శత్రువులను, క్రూరమృగాలను ద్వేషిస్తాం.

25. ఈ విభాజకరేఖను మన మందరం అధిగమించాలి. మనం విచారం చేసి వ్యావహారిక జీవితంలోని పరిమితులను దాటినప్పుడే ఇది మనకు సాధ్యపడుతుంది. అతని ఆలోచనా దృక్పధాన్ని అలా సమర్థించుకునేవాడు. అతని వాదనా సరళి అలా వుండేది.

26. విశిష్ట దయాళుత్వం అతనికి బాల్యం నుండే వుండేది.

27. ఒకనాడు తన తండ్రి వ్యవసాయ క్షేత్రానికి వెళ్ళేడు. విరామ సమయంలో, ప్రకృతి అందాన్ని, ప్రశాంతతనూ ఆనందిస్తూ ఒక చెట్టు క్రింద కూర్చొని సేద తీర్చుకుంటూ వున్నాడు. అలా కూర్చొని వున్న సమయంలో ఆకాశం నుండి ఒక పక్షి అతని ముందు పడింది.

28. ఆ పక్షికి బాణపు దెబ్బతగలగా, ఆ బాణం దాని శరీరములోనికి గుచ్చుకొని పోయింది. ఆ పక్షి విపరీతమైన బాధతో రెక్కలు కొట్టుకుంటున్నది.

29. ఆ పక్షికి సహాయ పడేందుకై వెంటనే వుపక్రమించాడు. బాణాన్ని పీకి వేసి, దాని గాయానికి కట్టుగట్టి నీళ్ళు త్రాగించేడు. దాన్ని ఎత్తుకుని తను పూర్వం కూర్చున్న చోటికి వచ్చి, దానికి తన కండువాను చుట్టి, వెచ్చదనాన్ని కలిగించడంకోసం వక్షానికి

30. ఈ అమాయక పక్షిని బాణంతో గాయపరచినదెవరా అని ఆశ్చర్యపోయేడు. అంతలో అతని పిన తండ్రి కుమారుడు, తన సోదరుడు అయిన దేవదత్తుడు విల్లమ్ములతో అక్కడికి వచ్చాడు. ఆకాశంలో ఎగురుతున్న ఒక పక్షిపై తాను బాణాన్ని సంధించగా పక్షికి బాణం తగిలి గాయమయి కూడ కొంత దూరం ఎగిరి అక్కడెక్కడో పడింది. దాన్ని గానీ నువ్వు చూసావా? అని అతడు సిద్ధార్థుని అడిగాడు.

31. సిద్ధార్థుడతనికి అవునని చెప్పి అప్పటికి కోలుకొని వున్న పక్షిని చూపించాడు.

32. ఆ పక్షిని తనకిచ్చివేయమని దేవదత్తుడు సాధికారంగా అడిగాడు. దానికి సిద్ధార్థుడు తిరస్కరించాడు. వారిరువురు మధ్య తీవ్ర వాదోపవాదం మొదలయ్యింది.

33. దేన్నయినా వేటాడి చంపితే, అది వేటగానికే చెందుతుంది. అనే నియమం ప్రకారం, యీ పక్షికి తనే యజమానిననీ దేవదత్తుడు వాదించాడు.

34. అటువంటి నియమం న్యాయసమ్మతమైనది కాదని సిద్ధార్థుడు త్రోసిపుచ్చాడు. ఎవరైతే దాన్ని రక్షిస్తారో వారికి మాత్రమే దానిపై యాజమాన్య సర్వాధికారాలు వుంటాయి అని వాదించాడు.

35. వారి వాదోపవాదం ఎంతకీ తేలలేదు. ఈ వాదం ఒక మధ్యవర్తికి అప్పగించ బడింది. ఆ మధ్యవర్తి సిద్ధార్థ గౌతముని వాదాన్నే బలపరచాడు.

36. దానితో దేవదత్తునితో శాశ్వత విరోధమొచ్చింది. కాని గౌతముడెంత గొప్ప దయాళువంటే ; తన సోదరునితో విరోధం కలిగినా సరే లక్ష్యపెట్టక, ఆ అమాయకపు పక్షి ప్రాణాన్ని కాపాడాలనే నిర్ణయించు కున్నాడు.

37. సిద్ధార్థ గౌతముని బాల్యంలో కన్పించిన విశిష్ట వ్యక్తిత్వ లక్షణాలు యిలా వుండేవి.

## 8. వివాహం

1. దండపాణి అనే శాక్యవంశీయుడొకడు వుండేవాడు. అతని పుత్రిక యశోధర. అందచందాలకు, సచ్ఛీలతకు ఆమె పెట్టింది పేరు.

2. యశోధరకు పదహారేళ్ళ వయస్సు రాగానే, ఆమె వివాహం గురించి దండపాణి ఆలోచిస్తూ వుండేవాడు.

3. సంప్రదాయపరంగా, తన ఇరుగు పొరుగు క్షత్రియ యువకులందరికీ తన కుమార్తె స్వయంవర ఆహ్వాన పత్రికలు పంపేడు దండపాణి.

4. సిద్ధార్థ గౌతమునికి కూడా ఒక ఆహ్వాన పత్రిక అందింది.

5. సిద్ధార్థ గౌతమునికి పదహారేండ్లు నిండాయి. అతని తల్లిదండ్రులు కూడా అట్లాగే అతనికి పెండ్లిచేయాలని వువ్విళ్ళూరుతున్నారు

6. స్వయంవరానికి వెళ్ళి, యశోధరను పాణిగ్రహణం చేయమని అతనిని కోరారు. తన తల్లిదండ్రుల కోర్కె తీర్చడానికి అతడు అంగీకరించాడు.

7. యువకులందరిలోను, సిద్ధార్థ గౌతముని యశోధర ఎన్నుకుంది.

8. దండపాణి దీనికంతగా సంతోషించలేదు. వీరివైవాహిక జీవితం ఫలప్రదమవుతుందా అనే సందేహంలో పడిపోయాడు.

9. ఎందుకంటే సిద్ధార్థుడు, సన్యాసులు, ఋషుల సాంగత్యానికి అలవాటుపడిపోయాడు. అలాంటప్పుడతడు ఒక గృహస్థునిగా ఎలా నెగ్గగలడు?

10. సిద్ధార్థుని తప్ప మరెవరినీ వివాహము చేసుకోరాదన్న దృఢనిశ్చయురాలైన యశోధర, "సాధువుల, ఋషుల సత్సంగంలో వుండటం అనేది పాపమా?" అని తన తండ్రిని ప్రశ్నించింది. ఆమె అలాభావించలేదు.

11. సిద్ధార్థగౌతముని తప్ప మరెవరినీ వివాహము చేసుకోనన్న తన కుమార్తె నిశ్చయాన్ని విన్న యశోధర తల్లి దండపాణిని అందుకు అంగీకరించమని కోరింది. దండపాణి అంగీకరించాడు.

12. గౌతమబుద్ధుని ప్రత్యర్థులు నిరాశపడటమేకాక అవమానింపబడినట్లుగా భావించుకున్నారు.

13. ఆమె ఎంపికకై యశోధర ఏదయినా వరపరీక్ష పెడుతుందని వారు ఆశించారు. కాని ఆమె అలా చేయలేదు.

14. సిద్ధార్థ గౌతముని ఎన్నుకోవడానికి దండపాణి అంగీకరించడు కాబట్టి వారి ప్రయోజనం నెరవేరుతుంది అని తలపోస్తూ వారందరూ ఆ సమయాన మిన్నక వూరుకొని వున్నారు.

15. దండపాణి విఫలుడవ్వడంతో వాళ్ళు విలువిద్యానైపుణ్యంలో పరీక్ష పెట్టాలని గట్టిగా సాధికారంగా అడిగారు. దండపాణికి ఒప్పుకోక తప్పలేదు.

16. ప్రధమంగా సిద్ధార్థుడందుకు సమాయత్తపడలేదు. కాని అతని తిరస్కారంవలన తన తండ్రికి, అతని కుటుంబానికి, యశోధరకు ఎంత అపఖ్యాతి కలుగుతుందో అతని రథసారధి అయిన చన్నుడు వివరించిచెప్పాడు.

17. అతని మాటలకు ప్రభావితుడై సిద్ధార్థ గౌతముడు ఆ పోటీలో పాల్గొనడాని కంగీకరించాడు.

18. పోటీ మొదలయింది. ప్రతి ఒక్కరూ వారి వారి విలువిద్యా కౌశలాన్ని ప్రదర్శించారు.

19. చివరికి గౌతముని వంతు వచ్చింది. కాని అతనిదే అత్యున్నత శ్రేణికి చెందిన నిపుణత్వం.

20. ఆ తర్వాత వివాహం జరిగింది. శుద్ధోధన దండపాణులిరువురూ ఆనందించారు. అలాగే యశోధర మహాప్రజాపతీగూడా

[illegible] కొన్నేళ్ళపాటు సాగిన తర్వాత యశోధర ఒక కుమారునికి [illegible] అతనికి 'రాహులుడని' నామకరణం చేసారు.

# 9. తనయుని దక్కించుకోవడానికి తండ్రిచేసిన ప్రయత్నాలు

[illegible] వివాహితుడై గృహస్థ జీవితం గడపడం చూసి రాజు [illegible] అసిత మహాముని దివ్యవాక్కు అతనిని కలవర పరుస్తూనే వున్నది.

[illegible] కాకుండా ఉంచాలో, అతన్ని, భోగభాగ్యాలలో, సుఖసంతోషాలలో [illegible] చేయాలని అతను సంకల్పించాడు.

[illegible] సిద్ధార్థుడు నివసించడానికై శుద్ధోధనుడు మూడువిలాస భవనాలను [illegible] కాలానికి, ఇంకొకటి వర్షాకాలానికి, మరొకటి శీతాకాలానికి కావలసిన [illegible] సంపూర్ణ విలాసయుత శృంగార జీవితాన్ని గడపడానికి [illegible] నిర్మించాడు.

[illegible] రకరకాల చెట్లు పుష్పాలతో అమరిన మనోహరమైన విశాల [illegible] వేయించాడు.

[illegible] పురోహితుడైన ఉదయునితో సంప్రదించి రాకుమారునికి అపూర్వ [illegible] విలాసినుల బృందాన్ని ఒక దానిని నియమిద్దామని తలపోశాడు.

[illegible] జీవన మాధుర్యాలవైపు మళ్ళించి వుంచేలా వారు ఎలా [illegible] మసులుకోవలసిందిగా శుద్ధోదనుడు ఉదయుని కోరేడు.

[illegible] విలాసినులందరినీ సమావేశపరచి, యువరాజును ఎలా [illegible] వారికి తెలియపరిచేడు.

[illegible] ప్రవీణులు. రసికుల మనోభావాలను అర్థంచేసుకోవడంలో [illegible] గొప్ప అందచందాలు గలవారు. మీరు మీ పద్ధతులలో [illegible]

[illegible] అన్ని కోరికలను పరిత్యజించిన మునీశ్వరులను సైతం [illegible] స్వర్గంలో అప్సరసల చేత మోహింపబడే దేవతలను [illegible] మీరు.

[illegible] తళుకుబెళుకులతో, వయ్యారాల కులుకులతో మనోభావాన్ని [illegible] మీ నైపుణ్యంతో ఆడవారిని సైతం తన్మయ చిత్తులను చేయగల [illegible] సమర్థమైనవని.

[illegible] ఇదంతా ఎరిగిన మీకు, యువరాజుని మోహించి [illegible] బందీగా చేయడం మీ శక్తికి మించిన పనేమీకాదు.

12. మీరీవిషయంలో ఏమైనా వెనుకంజ వేస్తే, అది సిగ్గుతోకండ్లుమూసుకునే నవవధువులకు తగినది అవుతుంది.

13. అతడెంత ఘనకీర్తి గల ధీరోదాత్తుడైన నాయకుడైనా. స్త్రీ శక్తి సామర్థ్యాలు అంతకంటే గొప్పవి. యిదే మీ దృఢ సంకల్పం కావాలి.

14. పూర్వం దేవతలకు సహితం జయింప సాధ్యంగాని ఒక మహర్షిని, కాశిపట్నపు అందగత్తె అయిన ఒక వారకాంత కాలితో శిరస్సుపై తన్ని దగిలి వేయలేదా?

15. ఎంతో తపశ్శాలి అయిన బ్రహ్మర్షి విశ్వామిత్రుడు సైతం "ఘృతకి" అనే వారాంగన వలలో పడి అడవిలో పది సంవత్సరాలు బందీగా వుండ లేదా?

16. "ఎంతో మంది అటువంటి మహర్షులనే చిత్తుగా చేయగలిగిన మీస్త్రీలకు; ఒక అర్భకుడు; యిప్పుడిప్పుడే యవ్వనారంభ దశలో గల యువరాజును లోబరచుకోవడం అదేమంత పెద్దపని?

17. ఇదీ విషయం కనుక రాచకుటుంబ సంతతికి అతను దూరం కాకుండా మీసకల ప్రయత్నాలను ధైర్యంగా సాగించండి.

18. మామూలు స్త్రీలు సామాన్య పురుషులను వశపరచుకుంటారు. కాని ఉన్నతుల్ని, అసాధ్యుల్ని లోబరుచుకున్న వారే నిజమైన స్త్రీలు.

# 10.యువరాజును వశపరచు కోవటంలో వనితల వైఫల్యం

1. ఉదయుని పలుకులు మనస్సున నాటు కొనిన వనితలు, రాకుమారుని వశపరచుకోవాలనే ద్విగుణీకృత వుత్సాహంతో సిద్ధపడ్డారు.

2. కాని తమ కనుసన్నలతో, మత్తెక్కించే చూపులతో, శృంగార చేష్టలతోను, ఆకర్షించే నవ్వులతో, సున్నితమైన కదలికలతో అది సాధ్యపడుతుందనే నమ్మకం వారికి పోయింది.

3. కాని, కుటుంబ పురోహితుని ఆజ్ఞవలన; యువరాజు సాధు స్వభావం వలన, ప్రేమ, మత్తుల ప్రభావంతో అది సాధ్యమే అన్న ఆశ తిరిగి పొందారు.

4. ఆ వనితలందరూ కూడబలుక్కుని హిమవద్వనాల్లో ఆడ ఏనుగల మందతో కూడి మదపుటేనుగు విహరించే విధంగా, యువరాజును విహరింప చేసారు.

5. ఆ ఆనందోద్యానంలో సుందరాంగుల సపరిచర్యల నడుమనున్న యువరాజు, దివ్యోద్యానవనంలో అప్సరసల మధ్యనున్న సూర్యునివలె విరాజిల్ల సాగాడు.

6. అప్పుడు కొందరు సుందరాంగులు కామోద్రేక పూరితులై తమ గుండెలకు అతన్ని సుతారంగా హత్తుకున్నారు

7. తూలి పడిపోతున్నట్లు నటించి, భుజాలు క్రిందికి వ్రేళ్ళాడిస్తూ అతనిపై ఒరిగి పోయి సుకుమారమైన లతలవంటి తమ చేతులు అతనిపై వేసి, కొందరు తమ బిగికౌగిళ్ళలో అతనిని బంధించారు.

8. నోట మత్తు పానీయ వాసనలు రాగా, రాగి వంటి ఎర్రని క్రింది పెదాలతో "నా రహస్యం వినవా?" అంటూ అతని చెవిలో గుసగుస లాడారు.

9. తైల మర్దనము చేసుకున్న కొందరు యువతులు ఆసక్తితో అతని చేతులను తమ చుట్టూ చుట్టుకొని, "నీ పూజా కార్యక్రమాలను యిక్కడ కానివ్వు" అంటూ ఆజ్ఞాపిస్తున్నట్లుగా అన్నారు.

10. ఇంకొకతె, మత్తుగొన్న దానిలా, నాలుక బయటికి చాపి అభినయిస్తూ, ఆమె నీల వర్ణపు వస్త్రాలు క్రిందికి జారి పోతూవుండగా చీకట్లో మెరుపు తీగలా స్పష్టంగా కనిపించేటట్లు నిలబడింది.

11. బంగారు నగల తళుకులతో పలుచటి దుస్తులలో నుంచి వారి అంగాంగ సోయగాలు కన్పించేటట్లుగా, వారు అతని చుట్టూ అటునిటు తిరిగారు.

12. ఇంకొందరు, మావి చిగురు రెమ్మలను చేతబట్టుకొని బంగారు కలశాల్లాంటి వారి స్తనాలను ప్రదర్శిస్తూ అతనిపై ఒరిగారు.

13. కలువ కనుల భామలు కొందరు, తామర పూలను చేతపట్టుకుని, కొలను నుండి బయటకు వచ్చి, పద్మముఖుడైన రాకుమారుని ఎదుట దేవతామూర్తుల్లా నిల్చున్నారు.

14. ఆత్మనిగ్రహం గల అతన్ని సులలిత మధురగానంతో అభినయంతో, మెరిసే చూపులతో ప్రేరేపిస్తూ "నీవు ఎలా మోసపోయావు?" అంటున్నది ఒకతె.

15. ఆకర్షణీయమైన ముఖవర్చస్సుగల మరొక వనిత ఆయుధాలను ధరించి కనుబొమలు సాగదీస్తూ ధీరోదాత్త నాయకుని అనుకరించింది.

16. చెవిని అలంకరించుకున్న ఆభరణాలు గాలికి కదులుతుండగా అందమైన, నిండైన వక్షోజాలు కలిగిన ఒక వయ్యారి "చేతనైతే మీరు నన్ను పట్టుకోండి" అంటున్నట్లుగా బిగ్గరగా నవ్వుతూ కవ్వించింది.

17. అతను వెళ్ళిపోతుండగా, కొందరు అతనిని పూలమాలలతో బంధించారు. మరి కొందరు సున్నితమైన నిందతో అంకుశంలాంటి మాటలతో శిక్షించేరు.

18. మరొక స్త్రీ అతనిని వాదులాటలోకి దించాలని మామిడి రెమ్మ త్రుంచి, కామోద్రేకంతో కలత చెందుతూ "ఈ పువ్వు ఎవరిది" అని ప్రశ్నించింది.

19. మరొకతె "ఒక స్త్రీ చేత జయింపబడిన నువ్వు చేతనైతే వెళ్ళి ఈ భూమండలాన్ని జయించు" అంది, మగవాడి విసురు, నడక అనుకరిస్తూ.

20. కలువ పువ్వును [illegible]

అస్పష్టమైన మాటలతో రాకుమారునితో యిలా అంది:

. "ఓనా ప్రభూ! బంగారు పంజరంలో బంధించబడినట్లుగా వున్న కోకిల పాడే చోట, పరిమళాలు విరజల్లే పుష్పాలు కప్పిన యీ మామిడిని చూడండి.

2. ప్రేమికుల విచారాలను వ్యక్తం చేసేలా, మాటల్లో మాడి పోతున్నట్లుగా రొద చేస్తున్న తుమ్మెదలున్న యీ అశోక వృక్షాన్ని, యిలా వచ్చి తిలకించండి.

3. ధవళ వస్త్ర ధారియైన పురుషుని, పసుపు వర్ణ వస్త్రధారిణియైన స్త్రీ కౌగిలించుకున్నట్లుగా, నాజూకైన మామిడికొమ్మ చుట్టుకున్న యీ వృక్షాన్ని వచ్చి పరికించండి.

4. తాజాగా చెట్టు నుండి బయల్వెడలే జిగురులా ప్రకాశమైనటువంటిది, స్త్రీల గోళ్ల రంగులను చూసి అవమానభారంతో వంగినదైనటువంటి కురుబాక పుష్పాన్ని పట్టుకోండి.

5. మా చేతుల అందాన్ని చూసి సిగ్గుపడి నిల్చుండి పోయిందా అన్నట్లుగా చుట్టూ క్రొత్త చిగుళ్లతో కప్ప బడి వున్న యీ చిన్న అశోకాన్ని వచ్చి వీక్షించండి.

6. మృదువైన తెల్లని దుస్తులతో సుందరాంగన సేద తీర్చుకుంటున్నదా అన్నట్లు చుట్టూరా ఒడ్డున పెరిగిన సింధూవర పొదలు గల యీ సరస్సును చూడండి.

7. ఎర్రటి బాతు నీళ్ళలో, తన ప్రియురాలి వెనుక దాసునిలా ఎలా వెంటబడి తిరుగు తుందో చూసి స్త్రీ సమ్మోహన శక్తి ఎలాంటిదో తెలుసుకోండి.

8. మైమరచి పాడే ఒక కోకిల పాటను రాగాలను, అంతా తన యిష్టమే అన్నట్లు నిర్లక్ష్యంగా పాడే మరో కోకిల పాటలను వచ్చి వినండి.

29. తనెంత వివేకో అని లోతుగా ఆలోచించే మనిషిలా కాకుండా, వసంత శోభతో మత్తెక్కే పిట్టల మోస్తరు మత్తిలటం నువ్వు యిష్టపడవూ?

30. ఈ విధంగా యువతులందరు వారి మనస్సుల్లో మోహముప్పొంగగా వివిధ కపటోపాయాలతో యువరాజును వశపరచు కోవాలనుకున్నారు.

31. అయినప్పటికి, ఆత్మనిగ్రహం గల యువరాజు ఏమాత్రం చలించలేదు.

32. వారిని వారి నిజస్థితి లో చూసిన యువరాజు దృఢచిత్తుడై దీర్ఘాలోచనలో పడిపోయాడు.

33. "యవ్వనం అశాశ్వతమని, ముసలి తనం వెంటరాగా వారి అందమంతా నశించిపోతుంది అని గ్రహించలేక పోతున్నారెందుకో యీ స్త్రీలు" అని విచారించాడు.

34. యువరాజును ప్రసన్నుడిని చేసేందుకు యీ విఫల ప్రయత్నాలు చాలా సంవత్సరాల తరబడి కొనసాగాయి.

## 11. రాకుమారునికి ప్రధానమంత్రి మందలింపు

ఉదయనుడు గ్రహించాడు.

2. వ్యవహార దక్షుడైన ఉదయనుడు రాకుమారునితో మాట్లాడదలచాడు.

3. ఏకాంతంగా వున్న రాకుమారుని కలిసి, "మీకు తగిన మిత్రునిగా రాజుగారిచే నియమింపబడిన వాడను కాబట్టి నా హృదయపూర్వక మైత్రీభావంతో మీతో మాట్లాడాలని అభిలషిస్తున్నాను." అంటూ ఉదయనుడు మాటలు ప్రారంభించాడు.

4. నిష్ప్రయోజనకరమైన చర్యలను నిరోధించడం, ప్రయోజనకరమైన పనులు చేయడానికి ప్రేరేపించటం, ఆపదలలో వెన్నంటి వుండటం యీ మూడూ మిత్రునికుండవలసిన లక్షణాలు.

5. మీ శ్రేయోభిలాషిగా వుండడానికై నేను వాగ్దానం చేసిన తర్వాత మీరు మానవ ధర్మానికి దూరంగా వెళ్తున్నపుడు నేను శ్రద్ధ వహించక పోతే, నేను మీ శ్రేయోభిలాషిని కాదన్న మాటే.

6. వంచనతోనయినా పడతులను ప్రలోభపెట్టి పొందడం యుక్తమైనదే. బిడియాన్ని వదలించు కోవడానికి, సుఖాన్ని పొందడానికీ యిది ఎంతో వుపయోగ పడుతుంది.

7. మర్యాదగా ప్రవర్తించడం ఆమె అభీష్టానికి అనుగుణంగా నడచుకోవడం యివే స్త్రీ హృదయాన్ని కట్టిపడేసేవి. నిజంగా ప్రేమవలననే మంచి లక్షణాలు అలవడతాయి. స్త్రీలు గౌరవాన్ని ప్రేమిస్తారు.

8. విశాల నేత్రుడైన ఓ యువరాజా! మీకు మనస్కరించనప్పటికీ మీ అందానికి తగినట్లుగా కోరి వచ్చిన కాంతలను మర్యాద పూర్వకంగానైనా సంతుష్టి పరిచే ప్రయత్నం చేయరాదా?

9. స్త్రీలకు సౌజన్యాన్నిమించిన ఆభరణం మరొకటి లేదు. అది లేని అందం పూలులేని తోట వంటిది.

10. కేవలం సౌజన్యంవలన ఏమిటి వుపయోగం? మనోభావాలను కూడా దానికి జోడించాలి. కష్టసాధ్యమైన ప్రాపంచిక వస్తువులు మీ కందుబాటులో వున్నపుడు, మీరు వాటిని నిర్లక్ష్యం చేయకూడదు.

11. అన్నిటికన్న ఆనందమే ముఖ్యమని భావించి, పురందరుడంతటి వాడు కూడా పూర్వము గౌతమ మహర్షి భార్య అహల్యను మోహించాడు.

12. అదే విధంగా సోముని భార్య రోహిణిని అగస్త్యుడు వలచాడు. కాబట్టే, స్మృతిలో చెప్పినట్లుగా, లోపాముద్ర వుద్భవించింది.

13. పరమ నిష్ఠాగరిష్ఠుడైన బృహస్పతి సైతం మారుత కుమార్తె ఔతధ్యుని భార్య అయిన మమత వలన భరద్వాజుని పొందేడు.

14. భక్తితో మధుసమర్పణ చేసున్న బృహస్పతి భార్య [illegible]

బుధుని పొందాడు.

5. ఆ విధంగా, పూర్వం అమిత కామోద్రిక్తుడైన పరాశరుడు, యమునానదీ తీరాన, వరుణ పుత్రుని కుమార్తె అయిన కాళితో కామకేళి జరిపాడు.

6. బ్రహ్మర్షి వశిష్ఠుడు కామాతురతతో అక్షమాల అనే నిమ్న జాతి స్త్రీతో కూడి, కపింగ్లదుడు అనే కుమారుని పొందేడు.

7. రాజయోగి అయిన యయాతి, జవసత్త్వాలుడిగి పోయిప్పటికీ, కైత్రర్ధవనంలో విశ్వాకి అనే అప్సరసతో క్రీడించాడు.

8. కౌరవ రాజు పాండును, స్వపత్నీ సంభోగం మరణానికి దారి తీస్తుందని తెలిసినా, మాద్రి అందచందాలకు, సుగుణాలకు పరవశుడై వలపు తీపికి లోనయ్యాడు.

9. ఎంతోఘన కీర్తి ప్రతిష్ఠలు గల మహనీయులెందరో తుచ్ఛమైన కామకలాపాలను జరిపినప్పుడు యోగ్యమైనవి జరపటంలో తప్పేముంది?

10. ప్రపంచమంతా యీ ఆనందాలకు దాసోహమన్నపుడు అందం, సామర్థ్యంగల యువకులైన మీరు మీ కొరకే వేచివున్న యీ ఆనందాలను చిన్న చూపు చూడతగునా!

## 12. ప్రధానమంత్రికి యువరాజు యిచ్చిన సమాధానం

1. ఉత్కృష్ట సంప్రదాయ బద్ధమైన అతని కమనీయమైన పలుకులను విన్న యువరాజు, మేఘగర్జన వంటి కంఠస్వరంతో యిలా ప్రత్యుత్తరమిచ్చాడు.

2. అభిమాన పూర్వకమైన మీ సంభాషణం మీ స్థాయికి అనుగుణంగానే వున్నది. కాని మీరు నన్ను ఎక్కడ తప్పుగా అర్థం చేసుకున్నారో విశదీకరిస్తాను.

3. ప్రాపంచిక విషయాలను నేను అలక్ష్యం చేయను. మానవాళి అంతా వాటికి బందీలుగా వున్నారన్న విషయం నాకు తెలుసు. కాని ఇహలోక సౌఖ్యాలు అశాశ్వతమని తెలిసిన తర్వాత, నా మనస్సు అందలి ఆనందాన్ని గుర్తించలేదు.

4. ఒక వేళ యీ స్త్రీల సౌందర్యం శాశ్వతమైనప్పటికీ, అటువంటి వాటిపట్ల వ్యామోహం వివేకవంతునికి తగదు.

5. కోరికలకు ఎందరో మహాపురుషులు దాసోహమయ్యారని మీరన్నారు కదా! వారిని ఆదర్శంగా తీసుకోవద్దు. ఎందుకంటే, వారు పతనాన్ని కూడా పొందారు.

6. ఆత్మనిగ్రహం కోల్పోయి, విషయ వాంఛలలో చిక్కుకుని పతనావస్థ నొందినవారిలో నిజమైన గొప్పతనం మృగ్యము.

7. వంచన చేత స్త్రీలను లోబరచుకోవచ్చని మీరన్నారు. మర్యాదతో కూడిన మోసమంటే ఏమిటో నాకు తెలుసు.

8. యదార్థమైన ప్రేమలేకుండా ఒక స్త్రీ కోర్కెలను తీర్చడంనాకు యిష్టంలేదు. సంగమమనేది స్వతస్సిద్ధంగాను, మనఃపూర్వకంగానూ జరగాలి. అవి లోపించినప్పుడు, దాన్ని నేను తృణీకరిస్తాను.

9. యదార్థాలను గమనించకుండా, కామోద్రేకపూరితమైన మనస్సుతో అనుబంధాల నేర్పరచుకుని, దాని వలన జరిగే అనర్థాలను తెలుసుకోలేక మోస పోవడంలో గొప్పతనమేమున్నది?

10. కామోపహతులైన వారే ఒకరినొకరు వంచించుకుంటూ వుంటే, స్త్రీపురుషులిరువురూ పరస్పరం చూసుకోవడానికి కూడా తగరు.

11. ఇవన్నీ యిలా వుండగా, తుచ్ఛమైన వైపు నన్ను తప్పుదారి పట్టించడం మీకు తగదు.

12. రాకుమారుని అచంచల దృఢ సంకల్పాన్ని విన్న ఉదయనుడు, యీ విషయాన్ని శుద్ధోధనునికి విన్నవించాడు.

13. ఈ ఐహిక విషయాల పట్ల తన కుమారుడి విముఖతను గుర్తించిన శుద్ధోధనునికి ఆరాత్రంతా నిద్ర పట్టలేదు. గుండెల్లో శరంగుచ్చుకున్న ఏనుగులా అమితంగా విలపించాడు.

14. సిద్ధార్థుడు తన వ్యక్తిత్వాన్ని ఆ విధంగా మలచుకోదలచిన సంకల్పం నుండి అతన్ని మళ్ళించి ప్రాపంచిక సుఖాలవైపు సిద్ధార్థుని ఆకర్షించడానికి తగిన మార్గాలను చర్చించుకుంటూ రాజు అతని మంత్రులు ఎంతో సమయాన్ని వ్యర్థ ప్రయాసతో గడిపారు. కాని వారు చేసిన వ్యర్థ ప్రయత్నాలకు మించి, మరేమీ వారికి తట్టలేదు.

15. ధరించిన పూలమాలలూ, ఆభరణాలూ నిరుపయోగమైపోగా, సరస శృంగార కళా నైపుణ్యమంతా నిష్ఫలమైపోగా, ఎవరి ప్రేమను వారు తమతమ హృదయాంతరాళల్లోనే దాచుకున్నారో ఆ కాంతా బృందాన్ని పంపివేశారు.

# 13. శాక్య సంఘంలో ప్రవేశం

1. శాక్యుల సంఘ ముండేది. ఇరవై సంవత్సరాల పైబడిన శాక్యయువకులందరూ ఆ సంఘ సభ్యత్వాన్ని స్వీకరించాల్సి వుండేది.

2. సిద్ధార్థ గౌతమునికి 20 సంవత్సరాల వయస్సు వచ్చింది. సంఘంలో చేరవలసిన తరుణమదే.

3. శాక్యులకు సంస్థాగారమనే ఒక సమావేశ మందరం కపిలవస్తులో వుండేది. సంఘ సమావేశం కూడా సంస్థాగారంలోనే జరుగుతుంది.

4. సిద్ధార్థుని సంఘంలో చేర్చే వుద్దేశ్యంతో ఒక సంఘ సమావేశాన్ని ఏర్పాటు చేయవలసిందిగా శుద్ధోధనుడు శాక్యపురోహితుని కోరాడు.

ఆ ప్రకారంగా కపిలవస్తులోని శాక్యుల సంస్థాగారంలో సంఘ సమావేశం జరిగింది.

సంఘ సమావేశంలో సిద్ధార్థుని సంఘ సభ్యునిగా చేర్చుకో వలసినదిగా పురోహితుడు ప్రతిపాదించాడు.

అప్పుడు శాక్యుల సేనాపతి తన ఆసనం నుండి లేచి సంఘాన్ని వుద్దేశించి శాక్యవంశీయుడైన శుద్ధోధనుని కుటుంబంలో పుట్టిన సిద్దార్థ గౌతముడు యీ సంఘ సభ్యుడు కాగోరుచున్నాడు. అతడు ఇరవై యేండ్ల ప్రాయంగలవాడు. అన్ని విధాల సంఘ సభ్యుడు కావడానికి యోగ్యుడు. కనుక, అతన్ని శాక్య సంఘంలో ఒక సభ్యునిగా చేర్చుకోవలసినదిగా నేను మనవి చేసుకుంటున్నాను. ఈ నా ప్రతిపాదనపై అభ్యంతరాలున్న వారు మాట్లాడ వలసిందిగా ప్రార్థిస్తున్నాను అని అన్నాడు.

దానికి ఎలాంటి అభ్యంతరమూ ఎవరూ తెలుపలేదు. "దీనికి అంగీకరించని వారిని మాట్లాడవలసిందిగా రెండవ సారి అభ్యర్థిస్తున్నాను", అని సేనాపతి అన్నాడు.

ప్రతికూలంగా మాట్లాడటానికి ఎవ్వరూ లేవలేదు. మరోసారి సేనాపతి "ఈ ప్రతిపాదనను అమోదించని వారెవరైనా వుంటే మాట్లాడమని మూడవసారి అడుగుతున్నాను", అని అన్నాడు.

. మూడవ పర్యాయం కూడా ఎవ్వరూ ప్రతికూలంగా మాట్లాడలేదు.

. అంగీకారం పొందనిదే అది ప్రతిపాదన కాదనీ ప్రతిపాదన లేకుండా చర్చించరాదనీ, శాక్యులలో ఒక నియమం వుండేది.

. మూడు సార్లు అభ్యంతరాలేవీ లేకుండా సేనాపతి ప్రతిపాదన అంగీకరింప బడటంతో, సిద్ధార్థుని శాక్య సంఘ సభ్యునిగా జేర్చుకున్నట్లు ప్రకటించారు.

. ఆ తర్వాత శాక్యుల పురోహితుడు నిల్చుండి, సిద్ధార్థుని కూడా నిల్చుండమని అన్నాడు.

. సిద్ధార్థుని సంబోధిస్తూ "ఈ సంఘం నిన్ను సభ్యునిగా చేసికొని, సత్కరించిన విషయాన్ని నీవు గుర్తించావా?" అని అడుగగా "అవునండి" అని సిద్ధార్థుడు ప్రత్యుత్తరమిచ్చాడు.

. "ఈ సంఘ సభ్యుని బాధ్యత లేమిటో నీకు తెలుసా?" "నాకు తెలియవని చెప్పడానికి విచారిస్తున్నాను. కాని, వాటిని తెలుసుకోవాలని అభిలషిస్తున్నానండి". సిద్ధార్థుడు అన్నాడు.

. "ముందుగా సంఘ సభ్యునిగా నీ విధులేమిటో నీకు తెలుపుతాను " అంటూ పురోహితుడు, ఒకదాని తర్వాత ఒకటి చెప్పసాగాడు.

1. శారీరకంగానూ, మానసికంగాను, ఆర్థికంగాను నీవు శాక్యుల ప్రయోజనాలను కాపాడాలి.
2. సంఘ సమావేశాలలో పాల్గొనడం మానరాదు.

3. శాక్య పరిపాలనలో నీకు కనిపించిన లోపాలను నిర్భయంగా, నిష్పక్షపాతంగా వెల్లడించాలి.

4. నీపై నేరారోపణ జరిగినప్పుడు నీవు కుపితుడవు కారాదు. నీవు తప్పు చేసినట్లయితే దాన్ని అంగీకరించాలి, లేక నీవు నిరపరాధివైతే తెలియజెప్పు.

17. ఇంకా కొనసాగిస్తూ పురోహితుడు యిలా అన్నాడు. "తదుపరి సంఘ సభ్యత్వానికి అనర్హునిగా చేసే వాటిని గురించి చెపుతాను.

1. మానభంగానికి పాల్పడినట్లయితే నీవు సంఘ సభ్యునిగా కొనసాగలేవు.

2. హత్య చేస్తే నీవు సంఘ సభ్యునిగా వుండజాలవు.

3. దొంగతనానికి పాల్పడినట్లయితే నీవు సంఘ సభ్యునిగా కొనసాగలేవు.

4. తప్పుడు సాక్ష్యం చెప్పినట్లు ఋజువైన పక్షంలో నీవు సంఘ సభ్యునిగా కొనసాగలేవు.

18. "శాక్య సంఘ సత్ప్రవర్తనా నియమాలను తెలియపరచినందుకు నేను తమ పట్ల కృతజ్ఞుడను. మనసా, వాచా పాటించడానికి నా శాయ శక్తులా కృషి చేస్తానని వాగ్దానం చేస్తున్నాను" అని సిద్ధార్థుడు పలికేడు.

## 14 సంఘంతో విరోధం

1. సిద్ధార్థుని శాక్య సంఘ సభ్యునిగా జేసి ఎనిమిది సంవత్సరాలు గడిచాయి.

2. అతడు ఎంతో నిలకడగా, అంకిత భావంగల సంఘ సభ్యునిగా వుండేవాడు. తన స్వకార్యాలలో ఎటువంటి ఆసక్తి చూపేవాడో, అలాగుననే సంఘ కార్యకలాపాల పట్ల కూడా ఆసక్తి కనపరిచేవాడు. సంఘ సభ్యునిగా తన ఉత్తమ ప్రవర్తనతో అందరి మన్ననలు పొందాడు.

3. అతను సభ్యత్వం పొందిన ఎనిమిదవ ఏట ఒక సంఘటన జరిగింది. అది సిద్ధార్థుని జీవితంలో ఒక సంక్షోభానికి, శుద్ధోధనుని కుటుంబంలో ఒక విషాదానికి దారి తీసింది.

4. ఆ విషాదానికి మూలం యిలా వుంది.

5. శాక్యరాజ్యానికి ఆనుకుని, కొలియుల రాజ్యము వుండేది. ఈ రెండు రాజ్యాలను విడదీస్తూ రోహిణీ నది ప్రవహిస్తూ ఉండేది.

6. రోహిణి నదీ జలాలను, అటు శాక్యులు ఇటు కొలియులు కూడా, వారి క్షేత్ర వ్యవసాయ నిమిత్తం వాడుకొనేవారు. ప్రతీ యేటా సాగుకాలంలో ముందుగా ఎవరు, ఎంత రోహిణీ జలాన్ని తీసుకోవాలనే విషయంపై యిరు రాజ్యాల మధ్య ఎప్పుడూ వివాదం ఏర్పడుతూవుండేది. ఈ వివాదాలు కలహాలకు ఒక్కొక్కసారి కొట్లాటలకూ దారి తీసేవి.

. సిద్ధార్థుని ఇరవై ఎనిమిదవ యేట నీటి విషయమై, శాక్యుల సేవకులకు కొలియుల సేవకులకు పెద్ద కొట్లాట జరిగింది. ఇరు వర్గాలవారికి గాయాలు తగిలాయి.

. ఈ విషయం తెలుసుకున్న మీదట, అటు శాక్యులు, యిటు కొలియులు యుద్ధం ద్వారానే ఈ సమస్యను శాశ్వతంగా పరిష్కరించు కోవాలి అని నిర్ణయించుకున్నారు.

. కొలియులపై యుద్ధాన్ని ప్రకటించే విషయాన్ని పరిశీలించడానికై శాక్యుల సేనాపతి, శాక్య సంఘ సమావేశాన్ని ఏర్పాటు చేసాడు.

0. సంఘ సభ్యులనుద్దేశించి, సేనాపతి యిలా అన్నాడు : "మన వారిపై కొలియులు దాడి చేశారు. కాని వారు వెనుకకు మరల వలసి వచ్చింది. కొలియులు ఇలా దౌర్జన్యకాండలు జరపడం ఇది మొదటిసారి కాదు. ఇన్నాళ్లు వాళ్లను సహించాం. కాని ఇది ఇలాగే సాగడానికి వీలులేదు. దీన్ని నిరోధించాలి. అలా చేయడానికి గల ఏకైక మార్గం కొలియులపై యుద్ధం ప్రకటించడమే, సంఘం కొలియులపై యుద్ధాన్ని ప్రకటించ వలసినదిగా నేను ప్రతిపాదిస్తున్నాను. అభ్యంతరాలు తెలుప దలచుకున్న వారు మాట్లాడవచ్చు".

1. సిద్ధార్థ గౌతముడు తన ఆసనం మీద నుండి లేచి యిలా అన్నాడు "ఈ తీర్మానాన్ని నేను వ్యతిరేకిస్తున్నాను. యుద్ధం ఏ సమస్యనూ తీర్చదు. యుద్ధం వలన మన సమస్య పరిష్కారం కాదు. అది మరో యుద్ధానికి కారణ భూతం అవుతుంది. చంపిన వాడిని చంపేవాడు మరొకడు వుంటాడు. విజేతను జయించేవాడు ఇంకొకడుంటాడు. దోచుకొనే వాడు కూడా మరొకప్పుడు దోచుకోబడతాడు"

2. సిద్ధార్థ గౌతముడు ఇలా చెప్పసాగేడు, కొలియులపై యుద్ధం ప్రకటించడానికి సంఘం తొందర పడరాదు, అని నేను భావిస్తున్నాను. ఏ వర్గంవారు దోషులో తెలుసు కోవడానికి చాలా సునిశితంగా పరిశీలించాలి. మన వాళ్ళే ఈ వివాదాన్ని ముందుగా లేవదీసినట్లుగా నేవిన్నాను. ఇదే నిజమైతే, మనం కూడా ఆనిందకు గురికాక తప్పదు.

3. సేనాపతి యిలా సమాధానం చెప్పాడు, "అవును. మన వాళ్ళే వివాదానికి మూల కారకులు. కాని, ముందుగా నీటిని తీసుకోవడం మనవంతు అన్న విషయం మాత్రం విస్మరించరాదు".

14. సిద్ధార్థ గౌతముడిలా అన్నాడు: పూర్తిగా యీ అపవాదు నుండి మనం బైట పడనట్లుగా కన్పిస్తున్నది. కాబట్టి నేను ప్రతిపాదించేది ఏమిటంటే మనలో నుండి యిద్దరిని ఎన్నుకుందాము. కొలియులను కూడా వారిలో యిద్దర్ని ఎన్ను కోవాల్సినదిగా అడుగుదాం. ఈ నలుగురు కలిసి అయిదవ వ్యక్తి ఎన్నుకుని, వీరందరూ యీ వివాదాన్ని పరిష్కరిస్తారు.

15. సిద్ధార్థ గౌతముడు చేసిన సవరణను బలపరిచారు. కాని వారిని కఠినంగా శిక్షిస్తే తప్ప ఈ కొలియుల పీడ అంతం కాదు. అంటూ సేనాపతి గౌతముని సవరణను వ్యతిరేకించాడు.

16 [illegible] చేసిన సవరణ - యీ రెంటినీ అభిప్రాయ సేకరణ కోసం [illegible] వచ్చింది. సిద్ధార్థ గౌతముడు ప్రతిపాదించిన సవరణ, [illegible] ప్రస్తావనకు వచ్చింది. ఎక్కువ మంది వ్యతిరేకించడంతో అది [illegible] ప్రకటించారు.

17 [illegible] సేనాపతి తన ప్రతిపాదనను సభ ముందుంచాడు. సిద్ధార్థ [illegible] లేచి, ఇలా అన్నాడు "ఈ ప్రతిపాదనను [illegible] సంఘాన్ని అర్థిస్తున్నాను. శాక్యులకు, కొలియులకు దగ్గర [illegible] ఒకరినొకరు నాశనము చేసుకోవాలని ఆశించడం అవివేకం".

18 [illegible] సేనాపతి వ్యతిరేకించాడు. "రణరంగంలో బంధువులు, [illegible] క్షత్రియులు పాటించరు. వారి రాజ్యం కోసం [illegible] యుద్ధం చేయాలి" అని నొక్కి చెప్పాడు.

19 [illegible] బ్రాహ్మణ విధి. పోరాడటం క్షత్రియ ధర్మం. వాణిజ్యం వైశ్యుల [illegible] శూద్రుల కర్తవ్యం. వారివారి విధులను నెరవేర్చడంలో ఒక [illegible] అని శాస్త్రాలు నొక్కి చెపుతున్నాయి.

20 [illegible] ప్రత్యుత్తరమిచ్చాడు. "శతృత్వంతో శతృత్వం రూపుమాసి పోదని, [illegible] మాత్రమే జయించగలం" అని నాకు తెలిసిన ధర్మం.

21 [illegible] కోప్పోతూ "సిద్ధాంతపరమైన తర్జన భర్జనలు చేయడం [illegible] నా ప్రతిపాదనను వ్యతిరేకించాడు. అన్నది ప్రస్తుత విషయం, [illegible] అభిప్రాయసేకరణ ద్వారా తెలుసు కుందాం" అని [illegible]

22 [illegible] సేనాపతి తన ప్రతిపాదనను సభాభిప్రాయానికి వుంచగా, దాన్ని [illegible] ఆమోదించినట్లుగా ప్రకటించారు.

## 15. బహిష్కారానికి సిద్ధత

1 [illegible] సమీకరణ పథకాన్ని సంఘానికి విన్నవించేందుకై, సేనాపతి [illegible] సమావేశాన్ని ఏర్పాటు చేసాడు.

2 [illegible] మధ్య వయస్కులైన ప్రతి శాక్యుడు కొలియులతో జరిగే [illegible] ప్రకటించడానికి అనుమతినీయవలసినదిగా ఆ సంఘ [illegible] ప్రతిపాదించాడు.

3 [illegible] యుద్ధ ప్రకటనను బలపరచిన వారు, వ్యతిరేకించిన వారు [illegible] ఆ సమావేశానికి హాజరయ్యారు.

4 [illegible] వారికి, సేనాపతి చేసిన ప్రతిపాదన నంగీకరించడానికి యిబ్బంది

ఏమీ లేదు. వారు పూర్వం తీసుకున్న నిర్ణయాన్ననుసరించి జరిగే ఆనవాయితీ సహజ పర్యవసానమే కదా!

5. వ్యతిరేకించిన అల్ప సంఖ్యాక వర్గీయులకు క్రొత్త సమస్య వచ్చింది, అధిక సంఖ్యాకుల నిర్ణయానికి తల ఒగ్గడమా మానడమా అనేది వారి సమస్య.

6. అధిక సంఖ్యాకుల అభిప్రాయానికి తల ఒగ్గకూడదనే అల్పసంఖ్యాక వర్గం నిర్ణయించుకుంది. వారు సమావేశంలో హాజరపడానికి కారణం కూడా అదే. దురదృష్టవశాత్తు, వారిలో ఎవ్వరూ కూడా బాహాటంగా చెప్పడానికి సాహసించలేదు. బహుశా అధిక సంఖ్యాక వర్గాన్ని వ్యతిరేకిస్తే జరిగే పర్యవసానాలను గ్రహించడం వలననే కాబోలు.

7. తనను సమర్థించినవారు మౌనంగా వుండటాన్ని గమనించిన సిద్ధార్థుడు లేచి సంఘాన్ని వుద్దేశించి"మిత్రులారా మీకు తోచిన విధంగా చేయండి. మీ పక్షాన అధిక సంఖ్యాకులు వున్నారు. కాని యుద్ధ సమీకరణపై మీ నిర్ణయాన్ని నేను వ్యతిరేకిస్తున్నానని చెప్పడానికి చింతిస్తున్నాను. మీ యుద్ధ బలగంలో నేను చేరను. నేను యుద్ధంలో పాల్గొనను" అని అన్నాడు.

8. దానికి సేనాపతి సంఘ సభ్యునిగా చేరినప్పుడు నీవు చేసిన ప్రమాణాలను గుర్తుతెచ్చుకో. వాటిలో దేన్నయినా అతిక్రమిస్తే స్వచ్ఛందంగా సామాజిక నిందకు గురి కావాలసి వుంటుంది, అని హెచ్చరించాడు.

9. సిద్ధార్థుడిలా దానికి బదులు పలికేడు " అవును శారీరకంగాను, మానసికంగాను, ఆర్థికపరంగాను శాక్యుల ప్రయోజనాలను నాశక్త్యానుసారం కాపాడతానని నేను ప్రమాణం చేసిన సంగతి వాస్తవమే. కాని, యీ యుద్ధాన్ని శాక్యులకు ప్రయోజనకారిగా నేను భావించటం లేదు. శాక్యులకత్యంత ప్రయోజన కారి అయినప్పుడు ప్రజానిందను లక్ష్యపెట్టనవసరం లేదు"

10. కొలియులతో తగాదాల కారణంగా శాక్యులేవిధంగా కోసల రాజుకు సామంతులయ్యారో గుర్తు చేస్తూ, సిద్ధార్థుడు శాక్య సంఘాన్నిలా హెచ్చరించాడు. శాక్యుల స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను మరింత కుంచించడానికి యీ యుద్ధం దోహదపడుతందన్న విషయం ఊహాతీతమైనదేమీ కాదు.

11. సేనాపతి కోపోద్రిక్తుడై సిద్ధార్థుని సంబోధిస్తూ నీ వాక్చాతుర్యం ఏ విధంగానూ నీకుపకరించదు. అధిక సంఖ్యాకుల నిర్ణయాన్ని నీవు పాటించి తీరాలి. కోసల రాజు ఆమోదంలేకుండా, సంఘ నియమాలను అతిక్రమించిన వానికి ఉరిశిక్ష గాని, దేశ బహిష్కార శిక్ష గానీ వేయడానికి సంఘానికి అధికారాలు ఏవీ లేవు, అనిగాని ఈ రెండింటిలో ఏదైనా ఒక శిక్షను విధిస్తే, దానికి కోసల రాజు ఆమోదించడు అనిగానీ భావిస్తున్నావేమో!

12. కాని నిన్ను శిక్షించడానికి సంఘానికి వేరే మార్గాలు వున్నాయన్న విషయం గుర్తుంచుకో,

సంఘం మీ కుటుంబానికంతటికీ సంఘ బహిష్కరణ విధించగలదు. మీ భూములను స్వాధీనం చేసుకోగలదు. దీనికై సంఘం కోసల రాజు అనుమతిని పొందాల్సిన అవసరం లేదు.

13. కొలియులతో యుద్ధం చేయాలన్న సంఘ నిర్ణయాన్ని వ్యతిరేకిస్తూ పోతే, తదుపరి పర్యవసానాలను సిద్ధార్థుడు గ్రహించేడు. అతనికి మూడే మూడు ప్రత్యామ్నాయమార్గాలు వున్నాయి. సైన్యంలో చేరి యుద్ధం చేయడం, వురితీతకు లేదా బహిష్కరణకు సంసిద్ధుడవ్వడం లేదా తనకుటుంబాన్ని కూడా సంఘ బహిష్కారానికి గురి చేసి, ఆస్తులను పోగొట్టు కోవడం.

14. మొట్టమొదటి దానిని అంగీకరించరాదని దృఢనిశ్చయంతో వున్నాడు. మూడవది ఊహించరానిది అని భావించాడు. ఇక మిగిలిన ఆ రెండవదే సరియైన పరిష్కార మార్గమనే నిశ్చయానికి వచ్చాడు.

15. ఆ విషయాన్నే సిద్ధార్థుడు సంఘంతో ఇలా చెప్పాడు. "దయ చేసి నా కుటుంబాన్ని శిక్షించవద్దు. వారిపై సంఘ బహిష్కరణ విధించి వారిని దుఃఖితులుగా చేయవద్దు. వారి ఏకైక జీవనోపాధి అయిన పొలాలను హస్తగతం చేసికొని, వారిని నిరాశ్రయులుగా చేయవద్దు. వారు అమాయకులు, తప్పు చేసిన వాడిని నేను. నా తప్పిదానికి నన్నే శిక్షననుభవించనీయండి మరణశిక్ష, దేశ బహిష్కరణ మీ యిష్టమైనదేదయినా నాకు విధించండి. నేను మనః పూర్వకంగా దాన్ని అనుభవిస్తాను అనీ, కోసల రాజుకు యీ విషయం మనవి చేయననీ మీకు ప్రమాణం చేస్తున్నాను." అని అన్నాడు.

## 16. తరుణోపాయంగా పరివ్రాజం

1. "నీ సలహాను ఆమోదించడం కష్టం. ఒక వేళ మరణించడానికి గాని, బహిష్కరణకు గురి కావడానికి గాని నీవు స్వచ్ఛందంగా అంగీకరించినప్పటికీ, కోసల రాజుకు ఈ విషయం ఏదో విధంగా తెలియక మానదు. ఆ పై సంఘమే ఈ శిక్షను విధించింది అన్న నిర్ణయానికి వచ్చి, సంఘంపై తగు చర్య తీసుకొనక మానడు".

2. "ఇది జటిలమైన సమస్య అయితే, నేను ఒక పరిష్కారాన్ని మీకు సునాయాసంగా సూచించగలను. నేను పరివ్రాజకుడినై, ఈ దేశాన్ని వదలి వెళ్ళిపోతాను. ఇదీ ఒకరకమైన బహిష్కారమే కదా! అని సిద్ధార్థ గౌతముడు అన్నాడు.

3. సేనాపతి దీన్ని ఒక మంచి సలహాగా భావించాడు. కాని సిద్ధార్థుడు దాన్ని ఆచరణలో పెడతాడా అనే సందేహం ఇంకా అతనిలో ఉన్నది.

4. అందుచేత సేనాపతి సిద్ధార్థునితో "నీవు మీ తల్లిదండ్రుల, భార్య అంగీకారం పొందకుండా పరివ్రాజకునిగా ఎలా మారగలవు? అని అడిగాడు.

5. "వారి అంగీకారం పొందటానికి నా శాయశక్తులా ప్రయత్నిస్తాను - వారి అంగీకారం లభించినా లభించకపోయినా, వెంటనే యీ దేశాన్ని వదలి వెళతాను అని గ్రహాగాం

చేస్తున్నాను" అని సిద్ధార్థుడు వారికి హామీ యిచ్చాడు.

6. సిద్ధారుని ప్రతిపాదనే సరియైన పరిష్కార మార్గమని సంఘం భావించి; వారు దానిని ఆమోదించారు.

7. కార్యకలాపాలను ముగించి, సంఘం సమావేశాన్ని ముగించే తరుణంలో, ఒక శాక్యయువకుడు లేచి నిలబడి "నేను చెప్పేది కాస్త వినండి. ఒక ముఖ్యమైన విషయాన్ని చెప్పదలచాను" అని అన్నాడు.

8. మాట్లాడటానికి అనుమతినివ్వగా, అతడు యిలా అన్నాడు, "సిద్ధార్థ గౌతముడు తన వాగ్దానాన్ని నిలబెట్టుకుని ఈ దేశాన్ని విడచి తక్షణమే వెళ్ళిపోతాడనే విషయంలో నాకే మాత్రమూ సందేహం లేదు. కాని ఒక విషయం నాకు నచ్చలేదు.

9. ఇప్పుడు, కొద్దిసేపట్లో సిద్ధార్థుడు కనుమరుగు అవుతాడు. అప్పుడు యీ సంఘం కొలియులపై యుద్ధ నిర్ణయానికి తక్షణ కార్యరూపం యివ్వాలనుకుంటున్నదా?

10. ఈ విషయమై మరొక్కసారి ఆలోచించ వలసినదిగా నేను కోరుతున్నాను. ఎట్టి పరిస్థితులలోనైనా సిద్ధార్థ గౌతముని బహిష్కరణ గురించి కోసల రాజుకు తెలిసి తీరుతుంది. వెనువెంటనే కొలియులపై శాక్యులు యుద్ధాన్ని ప్రకటిస్తే , కొలియులపై యుద్ధాన్ని వ్యతిరేకించి నందువలననే సిద్ధార్థుడు వెళ్ళిపోయాడని కోసలరాజు గ్రహిస్తాడు. ఇది మనకు శ్రేయోదాయకం కాదు.

11. కాని సిద్ధార్థ గౌతముని బహిష్కరణ తర్వాత యుద్ధాన్ని ప్రకటించడానికి మధ్య కొంత వ్యవధి యిస్తే ఆ రెండింటికీ మధ్య గల సంబంధాన్ని కోసలరాజు గుర్తించడానికి వీలు లేకుండా వుంటుంది అని నేను ప్రతిపాదిస్తున్నాను."

12. దీన్ని చాలా ముఖ్యమైన ప్రతిపాదనగా సంఘం పరిగణించింది. ఆపద్ధర్మంగా యీ విషయాన్ని సంఘం అంగీకరించడానికి నిర్ణయించింది.

13. విషాద భరితమైన శాక్య సంఘ సమావేశం ఆ విధంగా ముగిసింది. యుద్ధాన్ని వ్యతిరేకించి, ఆ విషయాన్ని ధైర్యంగా చెప్పలేని అల్పసంఖ్యాకులకు విపత్కర పరిణామాలు కలిగే పరిస్థితి తొలగి పోయినందుకు ఊరట కలిగి నిట్టూర్చారు.

## 17. వీడ్కోలు వచనాలు

1. సిద్ధార్థ గౌతముడు ఇంటికి చేరుకొకముందేశాక్యసంఘ సమావేశంలో జరిగిన సంఘటన వార్త రాజభవనానికి చేరింది.

2. ఇంటికి చేరుకోగానే, దుఃఖసాగరంలో మునిగి రోదిస్తున్న అతని తల్లి దండ్రులను చూసాడు.

3. "యుద్ధం వలన కలిగే దుష్పరిణామాలను మేము చర్చించుకుంటున్నాము. నీ వింతదూరం వెళ్తావని నేనూహించలేదు" అని శుద్ధోధనుడు అన్నాడు.

తెలుసుతుందని నేను కూడా వూహించలేక పోయాను" అని సిద్ధార్థుడు బదులిచ్చాడు.

5 "దురదృష్ట వశాత్తు, నా వాదన ప్రభావం ప్రజలపై ఏ మాత్రం పడని విధంగా మన సైన్యాధిపతులు వారి మనో భావాలను మరల్చుకున్నారు."

6 "పరిస్థితి విషమించనీయకుండా, నేనే విధంగా కాపాడిందీ మీరు గుర్తించారని నేను భావిస్తున్నాను. న్యాయాన్నీ, ధర్మాన్నీ నేను విస్మరించలేదు. న్యాయాన్నీ, ధర్మాన్ని పాటించడానికై, నాకు ఏ శిక్ష విధించినా దాన్ని నా వరకే పరిమితం చేసుకోవడంలో నేను కృతకృత్యుడనయ్యాను" అని సిద్ధార్థుడు పలికాడు.

7 అతని సమాధానంతో శుద్దోధనుడు సంతుష్టుడవ్వలేదు. "మాకేమి జరుగుతుందో నీవు కనీసం ఆలోచించనైనా లేదు." అని అనగా, "అందువల్లనే నేను సన్యసించడానికి నిర్ణయించుకున్నాను. మీ భూములను ఆక్రమించుకోవలసినదిగా శాక్యులు ఆజ్ఞాపిస్తే; ఉత్పన్నమయ్యే పరిణామాలను ఒకసారి ఊహించండి" అని సిద్ధార్థుడు బదులు పలికేడు.

8 "నీవేలేనప్పుడు మాకు యీ భూములుండి మాత్రం ఏం ప్రయోజనం?" శుద్ధోధనుడు ఆక్రోశించాడు. "నీతోబాటే కుటుంబమంతా యీ శాక్య రాజ్యాన్ని విడచి పెట్టి ఎందుకు వెళ్ళేయరాదు?"

# 18 స్వగృహాన్ని వదలి వెళ్ళడం

1 కపిలవస్తులోని ఆశ్రమవాసియైన భరద్వాజుని చేతుల మీదుగా పరివ్రాజం స్వీకరించాలని సిద్ధార్థుడు తలపోసాడు. ఆ విధంగానే, మరునాడు నిద్రలేచి, తన ప్రీతిపాత్రమైన కంథకాశ్వంపైన ఎక్కి, అతని సేవకుడు చెన్నుడు నడుస్తూ వెంటరాగా, ఆశ్రమానికి బయలు దేరాడు.

2 ఆశ్రమానికతడు చేరేటప్పటికి, క్రొత్త పెళ్ళి కుమారుని చూడటానికై వచ్చినట్టుగా పురుషులు బయటకు వచ్చి, గుంపులు గుంపులుగా ద్వారాల వద్ద గుమిగూడారు.

3 అతడు వారి సమీపానికి రాగానే, సంభ్రమాశ్చర్యాలతో వారి కళ్ళు విప్పారగా, పద్మపీఠం లాంటి ముకుళిత హస్తాలతో వారు సాష్టాంగ దండ ప్రణామాలాచరించేరు.

4 వారి మనస్సులలో ప్రేమాతిశయం, పొంగి పొరలగా, వారి నిశ్చల దృష్టితో అతన్ని తాగేస్తున్నారా అన్నట్టుగా, విస్తారమైన ప్రేమ వికసించగా, అందరూ అతని చుట్టూ నిలుచున్నారు.

5 అంతటి తేజోమయ లక్షణాలున్న అతన్ని చూసిన కొందరు స్త్రీలు, యుక్తాలంకార భూషితుడైన మన్మథుని ప్రతిరూపమా అన్నట్లు భ్రమపడ్డారు.

6 మరికొందరు అతని సౌమ్యతను, తేజస్సును చూసి, దివ్యతేజో కిరణాలను విరజిమ్ముతూ భువిపై సాక్షాత్కరించిన చంద్రునిగా భావించేరు.

7 మరి కొందరు అతని అందానికి ముగులై , అతన్ని మింగి వేయాలా...

వెళ్ళబెట్టుకుని, ఒకరి నొకరు చూసుకుంటూ, నెమ్మదిగా గుసగుసలాడసాగారు.

8. అదే విధంగా స్త్రీలు, రెప్పవేయకుండా, చేష్టలుడిగి అతన్నే చూస్తూ వుండిపోయేరు. సన్యసించాలన్న అతని నిర్ణయానికి ఆశ్చర్యపోతూ, అతని చుట్టూ నిలుచుండి పోయారు.

9. అతి కష్టం మీద ఆ గుంపు నుండి బయట పడి, ఆశ్రమ ద్వారాలలోనికి ప్రవేశించాడు.

0. తను సన్యాస దీక్షను గైకొనే సమయంలో, శుద్ధోధనుడు, ప్రజాపతి గౌతమి, అక్కడ వుండే, ఆ దృశ్యాన్ని చూడటం సిద్ధార్థునికి యిష్టం లేదు. ఎందుకంటే దుఃఖభారంతో విలపిస్తారని అతనికి తెలుసు. అతనికి తెలియనీయకుండా, వారప్పటికే ఆశ్రమానికి చేరారు.

1. ఆశ్రమ ఆవరణలోనికి ప్రవేశించగానే, జనసమ్మర్ధంలో వున్న అతని తల్లి దండ్రులను చూసాడు.

2. తన తల్లి దండ్రులను చూడగానే, ముందుగా అతడు వారి వద్దకు వెళ్ళి ఆశీస్సుల నర్థించాడు. భావోద్వేగంలో చిక్కుకు పోయిన అతని తల్లి దండ్రుల నోట మాట రాలేదు. అమితంగా రోదిస్తూ అతన్ని గట్టిగా కౌగలించుకుని, కన్నీళ్ళతో తడిపేసారు.

3. ఆశ్రమంలోని ఒక వృక్షానికి కంధకాశ్వాన్ని కట్టి చెన్నుడు నిలుచుని వున్నాడు. శుద్ధోధనుడు, ప్రజాపతి కన్నీళ్ళ పర్యంతం విలపించడం చూసి, దుఃఖాతి శయంతో తాను కూడా విలపించ సాగాడు.

14. అతి కష్టం మీద తల్లి దండ్రుల నుండి విడివడి, చెన్నుడు నిలుచున్న చోటుకు సిద్ధార్థుడు వెళ్ళాడు. తన దుస్తులను, ఆభరణాలను తిరిగి యింటికి తీసుకు పోవడానికై అతనికిచ్చేసాడు.

15. పరివ్రాజకుడు వుండవలసిన విధంగా శిరోముండనం గావించుకున్నాడు. యుక్తమైన పరివ్రాజక దుస్తులను భిక్షాపాత్రను తన సోదరుడు మహానాముడు తేగా, సిద్ధార్థుడు వాటిని స్వీకరించాడు.

16. పరివ్రాజ జీవన ప్రవేశానికై ఆ విధంగా సన్నద్ధుడైన సిద్ధార్థుడు, సన్యాసదీక్షను గైకొనేందుకు భరద్వాజుని చెంతకు వెళ్ళాడు.

17. శిష్యుల సాయంతో భరద్వాజుడు, జరిపించవలసిన క్రియా విధులను నిర్వర్తించిన మీదట, సిద్ధార్థ గౌతముడు పరివ్రాజకుడైనట్లు ప్రకటించేడు.

18. పరివ్రాజం స్వీకరిస్తానని, ఆలసించక వెనువెంటనే శాక్య రాజ్యాన్ని వదలి వెళ్తానని శాక్య సంఘానికిచ్చిన రెండు వాగ్దానాలను జ్ఞప్తికి తెచ్చుకొన్నవాడై, సిద్ధార్థ గౌతముడు పరివ్రాజ దీక్షా స్వీకారం ముగిసిన వెంటనే తన ప్రయాణాన్ని మొదలు పెట్టాడు.

19. ఆశ్రమంలో విశేష సంఖ్యలో జనసమూహం గుమిగూడి వుంది. అందుచేతనే గౌతముడు పరివ్రాజం స్వీకరించడానికి ప్రేరేపించిన పరిస్థితులు అసమానమైనవని ఆశ్రమాని

వదలి బయటకు వస్తుండగా, ఆ ప్రజాసందోహం గూడా అతన్ని అనుసరించింది.

20. కపిలవస్తును వదలి అనోమ నదీ దిశగా ప్రయాణం సాగించాడు. వెనుకకు తిరిగి చూడగా, ఆ సమూహం ఇంకా తన వెంబడే వస్తున్నట్లుగా గమనించేడు.

21. అతడక్కడ ఆగి, వారినిలా సంబోధించాడు: "సోదరీ సోదరులారా! నన్ను వెంబడించి ఏమీ ప్రయోజనం లేదు. శాక్యులకు కొలియులకు మధ్యగల వివాదాన్ని పరిష్కరించడంలో నేను విఫలుడనయ్యాను. పరిష్కారానికనుగుణంగా మీరు ప్రజాభిప్రాయాన్ని మలచ గలిగితే మీరు కృతార్థులవుతారు. కాబట్టి మీరు వెనుకకు మరలి పోవడం మంచిది." అతని అభ్యర్థన నాలకించి, ఆ జన సందోహం వెనుకకు మరల సాగింది.

22. శుద్ధోధనుడు, గౌతమి కూడా రాజసౌధానికి చేరుకున్నారు.

23. సిద్ధార్థుడు విడచి వెళ్ళిన ఆభరణాలను, దుస్తులను చూసి భరించలేక పోయింది గౌతమి. తామరకొలనులోనికి వాటిని విసరివేసింది.

24. పరివ్రాజం స్వీకరించేటప్పటికి సిద్ధార్థ గౌతమునికి 29 ఏండ్లే!

25. ఉన్నత వంశోద్భవుడు, మహాసద్గుణ సంపన్నులకు జన్మించినవాడు, విశేష ధనసంపదలు కలిగినవాడు, వికసిస్తున్న యవ్వన దారుఢ్యము గలవాడు, బుద్ధిశీలి, శక్తి సామర్థ్యాలలో గొప్పవాడు, విలాసవంతమైన జీవితాన్ని కొనసాగించినవాడు, ఈ భువిపై శాంతి పరిరక్షణ కొరకు, స్వపరివార జనులతో పోట్లాడిన శాక్యుడు ఇతడే " అని ప్రజలందరూ అతని గురించి గొప్పగా చెప్పుకుంటూ గుసగుసలాడుకోసాగారు.

26. స్వపరిజనులు తనను వ్యతిరేకించి నప్పటికీ, వారి నిర్ణయానికి తాను తలవంచడానికి తిరస్కరించి, స్వచ్ఛందంగా శిక్షననుభవించడానికై నిర్ణయించుకున్నందున, కలిమికి బదులు లేమిని, సౌఖ్యాలకు బదులు యాచనని, ఆవాసానికి బదులు నిర్వాసాన్ని ఎన్నుకున్నాడు. ఈ లోకంలో తన గురించి పట్టించుకునే వారెవరూ లేనివాడై తనది అంటూ చెప్పుకోవడానికిక యీ ప్రపంచంలో ఏదీలేని వాడైన గౌతముడు వెళుతున్నాడు.

27. నిజంగా అతడు చేసింది మనఃపూర్వకంగా చేసిన మహత్తర త్యాగం. అతనిది ధైర్య సాహసోపేతమైన చర్య. ఈ విశ్వ చరిత్రలో యిది అసమానం. అతడు "శాక్యముని" అనిగానీ, " శాక్యసింహుడు " అని గానీ పిలువతగినవాడు.

28. అటువంటి మహనీయుని కుమారునిగా పొందిన తల్లి ఎంతటి ధన్యురాలో, అతని తండ్రి ఎంతటి ధన్యుడోగదా! అటువంటి వానిని భర్తగా పొందిన అతని భార్య ఎంతటి పుణ్యాత్మురాలో, అన్న శాక్యమహిళ గౌతమి పలుకులెంత యదార్థమైనాయి!

## 19 యువరాజు - అతని భృత్యుడు

1. కంథకాశ్వంతో చెన్నుడు గృహోన్ముఖుడు కావలసిందే. కాని అతడందుకు నిరాకరించాడు.

పట్టుబట్టాడు. చెన్నుని బలీయమైన కోరికను గౌతముడంగీకరించక తప్పలేదు.

2. చివరికి వారు అనోమనదీ తీరానికి చేరారు.

3. ప్రియ మిత్రమా! ఈ విధంగా నన్ను అనుసరించి, నీకు నా పట్ల గల అంకిత భావాన్ని నిరూపించుకున్నావు. యజమాని పట్ల నీకు గల అవ్యాజమైన ప్రేమతో నా హృదయాన్ని పూర్తిగా జయించావు.

4. నీ కేవిధమైన ప్రతిఫలాన్నీ యివ్వనశక్తుడనైన నాపట్ల నీవు చూపిన భక్తి తత్పరత నాకెంతో ఆనందాన్నిచ్చింది.

5. ప్రతిఫలాన్ని యివ్వలేని వారిని, ఫలాపేక్షరహితంగా యిలా అభిమానంతో ఎవరు సాగనంపుతారు? విధి వక్రించినప్పుడు స్వపరిజనులే పరాయివారుగా మారిపోతారు గదా!

6. కుటుంబాన్ని ఆదుకుంటాడనే ఆశతో కుమారుని పెంచుతారు. తన భవిష్యత్తుకు తోడ్పడే తండ్రిని అతని కుమారుడు గౌరవిస్తాడు. ఫలాపేక్ష వుంటేనే ఈ లోకంలో దయాదాక్షిణ్యాలు చూపబడతాయి. నిస్వార్థ దృష్టితో జరిగేది ఏదీ లేదు యీ లోకంలో.

7. "నీ వొక్కడివే దానికి భిన్నమైనవాడివి. ఇక నీవు యీ అశ్వాన్ని తీసుకొని వెనుకకు మరలు."

8. ఇంతవరకూ ప్రేమ, స్థైర్యాలతో చలించని రాజు, యిప్పుడు దుఃఖిస్తూ వుండవచ్చు.

9. కోపంతోనో ప్రేమాభిమానాలు లేకనో, స్వర్గాపేక్షతోనో, ఇల్లు విడనాడి నేను వెళ్ళిపోలేదని వారికి విన్నవించు.

10. ఇంటిని వదలి వెళ్ళిన నాగురించి దుఃఖిస్తూ వుండవద్దు. ఎన్నాళ్ళ తర్వాతనైనా కాలమే మనలను కలుపుతుంది.

11. ఎడబాటు తథ్యమైనప్పుడు, ఒకసారి తన ఆత్మీయుల నుండి విడివడిన తర్వాత, అది పదేపదే పునరావృతం కాదుగదా?

12. ఈ లోకంలో ఒక వ్యక్తి మరణానంతరం, అతని ఆస్తికి సంపదకు ఖచ్చితమైన వారసులుంటారు. కాని అతని మేధా సంపత్తికి మాత్రం తగిన వారసులు లభించడం దుర్లభం, అసాధ్యమే కూడా!

13. రాజు అయినా నా తండ్రిని చూసుకోవడానికి ఒకరు కావాలి. తగని సమయంలో నేను వెళ్ళి పోయానని రాజు అనవచ్చు. కాని కర్తవ్యపాలనకు తగని కాలం అంటూ ఏదీ లేదు.

14. ఓ మిత్రమా! నీవు యిటువంటి సూనృత వచనాలతో రాజునోదార్చి, నీ శాయశక్తులూ వినియోగించి, నన్ను పూరిగా మరచి పోయేటటు చేయగలవా!

15. తన ప్రేమకు నోచుకోని నాదౌర్భాగ్యాన్ని వెల్లడించి నా మాతృమూర్తిని ఓదార్చగలవా? మాటలకందని మహోన్నతురాలు ఆమె!

16. ఈ మాటలు విన్న చెన్నుడు దుఃఖాతిశయంతో, గద్గదకంఠస్వరంతో చేతులు ముకుళించి, ఇలా సమాధానమిచ్చాడు.

17. నీ బంధుజనులకు యిలాంటి దుఃఖాన్ని కలుగజేస్తున్నావని గుర్తించిన మీదట, ఓ నా స్వామీ! ఊబిలో చిక్కుకున్న ఏనుగు వలె నా హృదయం దుఃఖసాగరంలో మునిగిపోతున్నది.

18. ఎంతటి పాషాణ హృదయునికైనా నీ నిర్ణయం కన్నీళ్ళు తెప్పించేటట్లు వున్నది. ఇక ప్రేమతో పరితపించేవారినింకెంతగా బాధిస్తుందో గదా!

19. అంతఃపురాలలో, నడయాడే నీ సుకుమార పాద మెక్కడ? గరుకైన, దర్భగడ్డి చిగుళ్ళతో వ్యాపించి వున్న, సన్యాసులుండే యీ అడవి ప్రదేశం ఎక్కడ?

20. ఓ యువరాజా! నీ యీ నిర్ణయాన్ని తెలుసుకున్న నేను విషాద భరితమైన కపిలవస్తునకు యీ అశ్వాన్ని ఎలా తీసికొని పోగలను?

21. మతవిరోధి స్వమతాన్ని కాదన్నట్లుగా, కుమారుని పట్ల రాజు పెంచుకున్న ప్రేమను బంధాన్ని నీవు ఎలా త్రెంచుకోగలవు?

22. నిన్ను ఎంతో అల్లారుముద్దుగా పెంచిన నీ మారుటి తల్లిని, ఆమె అభిమానాన్ని పొందని నీవు కృతఘ్నునిలా ఎలా మరచిపోగలవు?

23. సకలసద్గుణరాశి, తన కుటుంబానికే ఆదర్శవంతురాలు, భర్తకే సర్వస్వాన్నీ అర్పించిన నీ భార్యను, ఆమె చేతుల్లోని పసికందుని ఎలా విడనాడగలవు?

24. భ్రష్టుడైనవాడు తన ధనసంపదను విచ్చలవిడిగా వ్యర్థంగా ఖర్చు పెట్టే వ్యక్తిలాగు మెచ్చదగిన నీ యశోధర చిన్ని కొడుకుని యశోధర్మాన్ని సమాదరించే నువ్వు అధ్వాన్నంగా వదిలేస్తావా?

25. నీ సమస్తబంధుకోటినీ, నీ యావత్తు రాజ్యాన్ని సహితం వదలి పెట్టాలని మనఃపూర్వకంగా నీవు నిర్ణయించుకుని ఉండవచ్చు గాక ! కానీ, ప్రభూ నన్ను మాత్రం నీవు వదలి వెళ్ళలేవు. నీ పాదాలే నాకు శరణు. నీ పాదాలు తప్ప నాకు మరేవీ ఆశ్రయం కావు.

26. ఇలా దహించుకుపోతున్న నా హృదయంతో, నిన్ను వదలిపెట్టి, నేను నగరానికి వెళ్ళలేను.

27. నీవు లేకుండా ఒంటరిగా తిరిగి వచ్చిన నన్ను చూసి రాజు ఏమని అంటాడు ? లేక నీ భార్యకు ఏమి శుభవార్త చెప్పమంటావు.

28. నా అయోగ్యతను రాజుకు మళ్ళీ విన్నవించు "అని నీవు అనవచ్చు. కాని ఎవరు అలా ఆలోచిస్తారు? ఎవరు దాన్ని విశ్వసిస్తారు? చెన్నుడు యింకా యిలా చెప్పసాగాడు

సిగ్గుతో కుంచించుకుపోయిన హృదయంతో బలవంతంగా నాలుక చీల్చుకుని చెప్ప సాహసించినప్పటికీ దానిని ఆయన హర్షించడు.

ఎల్లప్పుడు ఎంతో దయాళువులై, కరుణ చూపడంలో వెనుకంజ వేయని నువ్వు, నిన్ను అమితంగా ప్రేమించే ఆ రాజును వదలి వెళ్ళడం శోభస్కరం కాదు. కావున వెనుకకు మరలి నన్ను కృతార్థుణ్ణి చేయి.

. పెల్లుబుకుతున్న దుఃఖంతో చెపుతున్న చెన్నుని మాటలు విన్న సిద్ధార్థ గౌతముడు మృదువచనాలతో యిలా అన్నాడు.

. చెన్నా! నీవు నా వియోగం పట్ల విచారించవద్దు. ఎన్నో జన్మల నెత్తవలసిన దేహం గల జీవులకు యీ పరిణామం అనివార్యం.

. ప్రేమాతి శయంతో నా బంధుకోటిని విడనాడక పోయినప్పటికీ, ఏదో ఒక రోజున మరణం సంభవించి ఒకరినొకరు నిస్సహాయంగా వదలుకునేటట్లు చేస్తుంది.

. ఎన్నో బాధలను, వేదనలను అనుభవించి, జన్మనిచ్చిన నా మాతృమూర్తికి నేనెక్కడుంటాను. నాకు ఆమె ఎక్కడుంటుంది?

. పక్షులు తమ చెట్టు మీద వ్రాలి, విశ్రమించి, ఆపై ఎగిరి వెళ్ళిపోయినట్లుగా, అందరి కలయికా వియోగంతోనే అంతమవుతుంది.

5. మేఘాలు ఒకదాని కొకటి చేరువగావచ్చి, మరల విడిపోయినట్లుగా, జీవరాసుల కలయికను విడిపోవడాన్ని కూడా అదేవిధంగా భావిస్తాను.

6. ఒకరినొకరు మోసగించుకుంటూ ఈ లోకంలో అందరూ జీవిస్తున్న యీ తరుణంలో, మనం ఈ లోకంలో వున్న కొద్ది కాలంలో, దేనినీ స్వంతమని భావించడం సరియైనది కాదు. అది చాలా ఘోరమైనది.

7. కాబట్టి మిత్రమా! ఈ పరిస్థితులలో నీవు దుఃఖించవద్దు. వెళ్ళిపో. నీ ప్రేమను ఇంకా వదలిపెట్ట లేకపోతే, వెళ్ళి ఆ తర్వాత తిరిగిరా!

8. అందుచేత, నా కెదురు చెప్పకుండా, నన్ను విడచి, కపిలవస్తు నగరవాసుల దగ్గరికి తిరిగి వెళ్ళిపో. అతని దృఢ నిశ్చయాన్ని మన్నించి, అతనిపైగల అభిమానాన్ని విడచిపెట్టండని వారికి నచ్చజెప్పు.

9. స్వామి, సేవకుల సంవాదాన్ని విన్న వుత్తమ కంథకాశ్వము అతని పాదాలను తన నాలుకతో నాకి, వేడి కన్నీటిని కార్చింది.

0. అరచేతి మధ్యభాగాన్ని అర్థ చంద్రాకృతిలో వంచి, స్వస్తిక శుభముద్రను దాల్చిన తన హస్తంతో సిద్ధార్థుడా అశ్వాన్ని తట్టి, స్నేహితుడితో అన్నట్లు యిలా అన్నాడు.

1. కంథకా! కన్నీరు కార్చవద్దు. నిగ్రహించుకో. నీవు పడిన శ్రమకు తగిన ఫలితం నీకు

దక్కుతుంది."

42. తిరిగి వెళ్ళడానికి సమయ మాసన్నమైందని గ్రహించిన చెన్నుడు, నారదుస్తులలో వున్న గౌతమునికి కడసారిగా నమస్కరించాడు.

43. ఆ తర్వాత, కంధకాశ్వానికి, చెన్నునికి వీడ్కోలు తెలిపి, గౌతముడు తన దారి పట్టాడు.

44. రాజ్యాన్ని త్యజించి, హీనమైన దుస్తులు ధరించి తన యజమాని సన్యాసులు వుండే అడవిలోకి వెళ్ళిపోతుండగా ఆశ్వికుడు చేతులు పైకి ఎగురవేస్తూ, అపరిమితంగా రోదిస్తూ నేల కూలాడు.

45. వెనుకకు తిరిగి చూస్తూ కంధకాశ్వాన్ని తన చేతులతో కౌగలించుకుని, బిగ్గరగా రోదించాడు. ఆ తర్వాత, ఆశలుడిగినవాడై ; పదేపదే విలపిస్తూ, తిరుగు ప్రయాణాన్ని సాగించాడు.

46. మార్గ మధ్యంలో పదే పదే తలచుకుని విచారిస్తూ కుమిలి పోతూ, తొట్రుబాటుతో క్రిందపడిపోసాగాడు. అతనితో తనకు గల అనుబంధాన్ని పదేపదే తలచుకుంటూ, తన దౌర్భాగ్యానికి విచారిస్తూ, ఏం చేస్తున్నాడో తెలియని స్థితిలో దారిపొడవునా ఎన్నో వున్మాద చేష్టలు చేసాడు.

## 20. చెన్నుని తిరుగు ప్రయాణం

1. తన యజమాని అడవిలోనికి అలా వెళ్ళపోగా, అమిత దుఃఖంతో వున్న చెన్నుడు మార్గ మధ్యంలో దుఃఖభారాన్ని దిగమ్రింగుకోవడానికై శత విధాల ప్రయత్నించాడు.

2. అతని హృదయమెంతగా భారమై పోయిందంటే, మామూలుగా కంధకాశ్వముతో ఒక్కరాత్రి ప్రయాణంతో దాటగల అదేమార్గాన్ని, తన యజమాని లేని లోటుకు విచారిస్తూన్న చెన్నునికి యిప్పుడు -ఎనిమిది రోజులు పట్టింది.

3. కంధకాశ్వం ధైర్యంగా వెళ్ళినప్పటికీ, అలసటచెంది, నీరసపడింది. అన్ని ఆభరణాలతోను అలంకరించ బడివున్నప్పటికీ, తన యజమాని లేక పోవడం చేత అందవిహీనంగా కన్పిస్తున్నది.

4. తన యజమాని వెళ్ళిన దిశవైపు తిరిగి శోకతప్తమైన గొంతుతో పదేపదే సకిలించసాగింది. విపరీతమైన ఆకలి బాధ కలిగినప్పటికీ, మార్గమధ్యంలో తన ఆకలి తీర్చుకునే ప్రయత్నాన్ని చేయలేదు. నీటిని గానీ, గడ్డిపోచనుగానీ ముట్టలేదు.

5. ఎలాగైతేనేం, చివరికి ఆ యిద్దరూ నెమ్మదిగా కపిలవస్తుకు చేరారు. గౌతముడు లేని నగరం నిర్మానుష్యంగా కన్పించింది. భౌతికంగా మాత్రమే వారు నగరానికి చేరారు కాని; వారి మనస్సు మనస్సులో లేదు.

6. ఆ నగరం పద్మాలతో నిండిన జలాలతోడను, పుష్పాలతో నిండిన చెట్లతో అలంకరింప

వారిరువురు కాంతి విహీనులై, దుఃఖాశ్రువులతో, మసకబారిన కండ్లతో నెమ్మదిగా నగరంలోనికి ప్రవేశించారు. అందరూ విషాదంలో మునిగి వున్నట్లుగా వీరికి తోచింది.

కీళ్ళు సడలిపోయి వారు తిరిగి వచ్చారని, శాక్యవంశానికే గర్వకారణమైన వానిని వెంట తోడ్కొని రాకుండా తిరిగి వచ్చారని విన్న నగర ప్రజలు కన్నీరు కార్చారు.

కోపోద్రుక్తులైన ప్రజలు రహదారిపైనే అతనిని నిలదీసి "శాక్యవంశానికీ, రాజ్యాన్ని వన్నెగా నిలిచిన రాకుమారుడేడీ?" అంటూ వెంబడించసాగారు.

అతడు లేని యీ పట్టణమొక అడవి, అతడున్న చోటు అడవి అయినా, అది పట్టణం కన్న మిన్నఅతడు లేని యీ పట్టణం మాకే మాత్రం తేజోవంతంగా లేదు.

. ఆ తర్వాత " రాకుమారుడొచ్చాడటే " అంటూ ఒకరి నొకరు బిగ్గరగా హెచ్చరించుకుంటూ, వరుస కిటికీల వద్ద స్త్రీలు ఆతృతతో గుమిగూడారు. కాని ఖాళీగా వున్న గుఱ్రాన్ని చూసి, బిగ్గరగా రోదించసాగారు.

# 21 శోకిస్తున్న కుటుంబం

. చెన్నుడు ఏ విధంగానైనా గౌతమునికి నచ్చజెప్పి, మనస్సుమార్చి, ఇంటికి తిరిగి తీసుకొస్తాడని కొండంత ఆశతో, అతనిరాకకై ఆతృతతో శుద్ధోధనుని కుటుంబ సభ్యులందరు ఎదురు చూడసాగారు.

.. రాజాశ్వశాలకు చేరగానే, అంతఃపురజనుల కందరికీ తన వేదనను తెలియజేస్తూ, కంధకాశ్వము బిగ్గరగా సకిలించింది.

. అంతఃపురం లోపల, వెలుపల వున్న వారందరూ గుఱ్రం సకిలించింది కాబట్టి, యువరాజు వచ్చేవుంటాడు అని భావించారు.

4. అప్పటి వరకు దుఃఖంతో మూర్ఛపోతూ వున్న స్త్రీలు, పిచ్చి ఆనందంతో రాకుమారునికై వెదకుతూ వున్న కండ్లతో ఎంతో ఆశగా రాజసౌధం నుండి బయటకు దూసుకొని వచ్చారు. కాని యువరాజులేని కంథకాశ్వాన్ని మాత్రమే అక్కడ చూసి, వారు నిరాశ చెందారు.

5. ఆత్మనిగ్రహాన్ని కోల్పోయిన గౌతమి బిగ్గరగా రోదించి మూర్ఛపోయింది. విలపిస్తూ ఇలా ఆక్రోశించింది.

6. "సుదీర్ఘ బాహుడు, సింహగమనుడు, వృషభనేత్రుడు, సువర్ణుడు, విశాలవక్షస్థలుడు, మేఘగర్జనుడు అయిన వీరుడు ఇలా ఆశ్రమవాసం చేయవలసిందేనా?"

7. సర్వోత్తమ కర్త, ఇంతటి వుదాత్తపురుషుడు మనల్ని వీడిపోయినప్పుడు ఈ భూమండలమంతా ఏ మాత్రం విలువలేనిది.

కలిగి, నీలికలువల వలె మృదువుగా వుండే అతని పాదద్వయం, ఎగుడు దిగుడులతో పాషాణమయమైన అడవి ప్రాంతంలో ఎలా సంచరించగలవు?

9. విలువైన వస్త్రాలు, సువాసననిచ్చే చందనంతో, ఔషధీయ గుణాలు గల మొక్కలతో అలంకరింపబడిన శయ్యాతల్పంపై అంతఃపురం పైభాగంలో విశ్రమించదగిన ఆ సుకుమార శరీరము అడవులలో ఎండ, చలి, వర్షాల బారి పడి ఎలా ఉండగలదు?

10. తన కుటుంబానికే గర్వకారణమైనవాడు, సౌశీల్యత, దారుఢ్యం, సామర్థ్యం, శక్తి, వేదాధ్యయనం, సుందరరూపం, యవ్వనం గలిగి ఎల్లప్పుడూ ఒకరికి యివ్వడమేగాని ఒకరిని యాచించనివాడు, పరుల కొరకు భిక్షకై దేహీ అంటూ ఎలా తిరుగాడ గలడు?

11. స్నిగ్ధమైన స్వర్ణతల్పంపై శయనించి, సంగీత వాద్యగోష్ఠితో నిద్రలేచే నాముద్దు బిడ్డ, నాపిచ్చి సన్యాసి, అక్కటా! యీ రోజు వొంటిపై గల ఒకే ఒక గుడ్డ పీలికతో కటికనేలపై ఎలా నిద్రించగలడు?

12. దయనీయమైన యీ ఆవేదనను గాంచి స్త్రీలు ఒకరి బాహువులతో మరొకరిని కౌగలించుకుని, చెదరిన లతలు తమ పువ్వుల్లోంచి మకరందాన్ని కార్చినట్లుగా, కన్నీరు కార్చారు.

13. అతనిని వెళ్ళడానికై అనుమతించిన విషయాన్ని మరచిన యశోధర దుఃఖాతిశయంతో నేల కూలింది.

14. "ధర్మపత్నినైన నన్నెందుకు పరిత్యజించాడు? ఎందుకు భర్తృవిహీనురాలినిగా చేసి వెళ్ళి పోయాడు. తనతో బాటుగా ఆ క్రొత్త జీవితాన్ని పంచుకునేందుకు అతని ధర్మపత్నినైన నన్ను అనుమతించ వలసింది.

15. స్వర్గాన్ని నేను అభిలషించలేదు. ఈ లోకంలో గాని, పైలోకంలోగానీ నా ప్రియమైన భర్త నన్ను వదలకుండా వుండాలన్నదే నా ఏకైక వాంఛ.

16. విశాల నేత్రుడు, ప్రకాశ మందస్మితుడు అయిన నా భర్త ముఖారవిందాన్ని చూడటానికి నేను అర్హురాలను కాకపోవచ్చుగాక. కానీ వారి ఒడిలో ఆడుకునే యోగ్యత యిక యీ రాహులునికి లేనట్లేనా!

17. సుందరరూపాన్ని మించిన సౌమ్యతగల మేధాసంపన్నుని మనస్సు యింత క్రూరంగా పాషాణమైందేమిటి? శత్రువును సైతం చక్కని సౌమ్య పదజాలంతో శాంత వచనాలతో ఒప్పించగల సమర్థుడు యిలా యీ పసికందు అయిన తన కుమారుని స్వయంగా విడచి ఎలా వెళ్ళగలిగారు!

18. నిజంగా నా హృదయం కూడా చాలా చాలా క్రూరమైనది - పాషాణ హృదయం- ఇనుములా కరడు గట్టుకు పోయింది. రాచ వైభవాన్ని వదలి అనాధలా అడవులకు పోయివున్నా యీ నా హృదయమేమీ ముక్కలయిపోదు. కాని నేను ఏమీ చేయలేకున్నాను. భరింపశక్యంగాకున్నది యీ దుఃఖభారం."

19. సంతసించడంగా గుణోగగ ...

ధైర్యాన్నికూడా కోల్పోయింది. ఆ విధంగా దుఃఖిస్తూ చాలా నీరసపడిన యశోధర పదే పదే బిగ్గరగా విలపించింది.

అలా మాట్లాడుతూ దుఃఖాతిశయంతో నేల కొరిగిన యశోధరను చూసిన స్త్రీలందరికీ ఏం చేయాలో తోచక వర్షంలో చిక్కుకున్న పెద్ద కలువ పుష్పాలవలె, ముఖంపై కన్నీరు సెలయేరులా ప్రవహించగా బిగ్గరగా రోదించారు.

చెన్నుడు, కంథకాశ్వముతో తిరిగి వచ్చిన వార్త తెలిసికొని, తన కుమారుని నిశ్చల అభిప్రాయాన్ని విన్న శుద్ధోధనుడు దుఃఖాఘాతానికి గురై, నేల కొరిగాడు.

సేవకులు అతన్ని పడిపోకుండా పట్టుకోగా, తన కుమారుని పట్ల కలిగిన దుఃఖాన్ని దిగ మ్రింగుకొని కన్నీరునిండిన కనులతో అశ్వముపై దృష్టి సారించాడు. ఆపై నేలపైబడి విషాదంతో బిగ్గరగా రోదించసాగాడు.

కొద్ది సేపటికి శుద్ధోధనుడు లేచి, పూజా మందిరములోనికి ప్రవేశించి తన విన్నపాలను దేవునికి నివేదించుకున్నాడు. దైవ విధులన్నీ నిర్వర్తించి, తన కుమారుడు క్షేమంగా తిరిగి రాగలందులకు కొన్ని త్యాగాలు చేస్తానని దేవునికి మ్రొక్కుకున్నాడు.

ఆ విధంగా శుద్ధోధనుడు, గౌతమి, యశోధర దైవప్రార్థనలు చేస్తూ, ఎన్నాళ్ళు దేవా! ఇకపై యింకెన్నాళ్ళు - అతన్ని మేము తిరిగి చూడగలమా?" అంటూ దేవుని ప్రశ్నిస్తూ కాలం గడపసాగారు.

# రెండవ భాగం
# చిర పరిత్యాగం

# 1. కపిలవస్తునుండి రాజ గ్రహానికి ప్రయాణం

కపిలవస్తును విడచి, సిద్ధార్థ గౌతముడు మగధ సామ్రాజ్య రాజధాని అయిన రాజగ్రహానికి వెళ్ళాలని తలపోసాడు.

అక్కడ బింబిసారుడు అనే రాజు పరిపాలిస్తూ వుండేవాడు. ఆ నగరం గొప్ప తత్త్వవేత్తలకు, మేధావంతులకు నిలయంగా వుండేది.

ఆ అభిప్రాయంతోనే అతివేగంగా ఉన్న ప్రవాహధాటికి వెరవకుండా, అతడు గంగానదిని దాటాడు.

మార్గమధ్యంలో శాకి అనే బ్రాహ్మణ స్త్రీ ఆశ్రమం వద్ద ఆపై పద్మ అనే మరొక బ్రాహ్మణ స్త్రీ ఆశ్రమం వద్ద తదుపరి రైనతుడనే బ్రహ్మణ ఋషి ఆశ్రమం వద్ద మజిలీ చేసాడు. వీరందరూ అతనికి ఆతిధ్యం యిచ్చారు.

అందరినీ మించిన శరీర దార్ఢ్యంతొ స్ఫురద్రూపంతో, హుందాగా వున్న అతడు, సన్యాసి దుస్తులు ధరించి వుండటం జూసి, ఆ ప్రాంత ప్రజలు దిగ్భ్రమ చెందారు.

అతన్ని చూడగానే, ఎక్కడికో వెళ్తున్న ఒక వ్యక్తి నిశ్చేష్టుడై నిలుచుండి పోయాడు. అక్కడే నిలుచున్న వాడు, అతని వెంట అదే మార్గంలో అనుసరించాడు. నెమ్మదిగా నడిచేవాడు, వేగంగా పరుగెత్తాడు. కూర్చుని వున్నవాడు చటుక్కున లేచి నిల్చున్నాడు.

కొందరు వారి చేతులు జోడించి నమస్కరించారు. ఇంకొందరు పూజ్యభావంతో తలలు వంచి నమస్కరించారు. మరి కొందరు, ఆదరాభిమాన పూర్వకమైన మాటలతో సంబోధించారు. అతని పట్ల భక్తి ప్రపత్తులను వ్యక్తం చేయకుండా వెళ్ళిన వారెవ్వరూ లేరు.

ఆహ్లాదకరమైన రంగుల దుస్తులు వేసుకున్నవారు అతన్ని చూసి సిగ్గు పడ్డారు. పిచ్చాపాటీ మాట్లాడుకునేవారు మౌనం వహించారు. అంతే కాని ఎవ్వరూ అతని పట్ల అపసవ్యంగా ఆలోచించలేదు.

అతని కనుబొమలు, నుదురు, నోరు, దేహం, చేతులు, పాదాలు, నడిచేతీరు - దేనిని చూసినా సరే, తక్షణమే వారి దృష్టి అక్కడే చిక్కుకునేది.

ప్రయాసపడుతూ సుదూర ప్రయాణాన్ని సాగించిన మీదట, అయిదు పర్వతాల నడుమగల రాజగ్రహ పట్టణాన్ని గౌతముడు చేరుకున్నాడు. చుట్టూ పెట్టని కోటలాగా, రమణీయంగా అలరారుతూవున్న పర్వతాలతో, పుణ్యక్షేత్రాలకు పవిత్ర స్థలాలకు ఆలంబనమై పునీతమైనదా పట్టణం.

11. రాజగ్రహను చేరగానే తాత్కాలిక నివాసానికై పాండవగిరి సమీపాన ఒక ప్రదేశంలో చెట్ల ఆకులతో ఒక చిన్న కుటీరాన్ని యేర్పాటు చేసుకున్నాడు.

12. రాజగ్రహ పట్టణం నుండి కపిలవస్తుకు కాలి నడకన పయనిస్తే సుమారు 400 మైళ్ళ దూరం ఉంటుంది.

13. ఇంతటి దూర ప్రయాణాన్ని సిద్దార్థ గౌతముడు కాలి నడకనే కొనసాగించేడు.

## 2 బింబిసార మహారాజు - అతని సలహా

1. మరునాడు, నిద్రలేచి భిక్షాపాత్రతో నగరంలోనికి వెళ్ళి భిక్షాటన చేయనారంభించాడు. అతని చుట్టూ విస్తారంగా జనులు గుమిగూడారు.

2. అప్పుడు మగధ సామ్రాజ్యాధీశుడైన శ్రేణియ బింబిసారుడు, తన అంతఃపురం వెలుపల వున్న అశేష ప్రజాసందోహాన్ని చూసి, కారణమేమిటో తెలుసుకొని రమ్మని పంపగా, రాజభటుడా విధంగానే చూసి యీ విధంగా విన్నవించాడు.

3. "అయితే విశిష్ట జ్ఞానసంపన్నుడు అవుతాడు లేదా యీ భూమండలాన్నంతటినీ ఏలే సార్వభౌముడైనా అవుతాడని" ముందుగా బ్రాహ్మణులు జోస్యము చెప్పినది ఇతని గురించియే. ఇతడు శాక్యరాజు కుమారుడు - ప్రస్తుతం సర్వసంగ పరిత్యాగి, అతనిని ఆసక్తిగా చూడటానికే ప్రజలందరూ అక్కడ గుమిగూడినారు" అని విన్న వించుకున్నాడు.

4. ఇది విన్నరాజు, దాని భావార్థము గ్రహించినవాడై వెనువెంటనే ఆసేవకునుద్దేశించి అతడెక్కడికి వెళ్తున్నాడో తెలియపర్చు" అని ఆదేశించగా, ఆ సేవకుడు రాజాజ్ఞను శిరసావహిస్తూ, యువరాజుని అనుసరించాడు.

5. స్థిర దృష్టితో కాడి పొడవు దూరము వరకు మాత్రమే తన ముందుకు చూస్తూ తూచి నెమ్మదిగా అడుగులు వేస్తూ, ఆ యాచకోత్తముడు తన సర్వేంద్రియాలనూ, మెదిలే ఆలోచనలనూ అదుపులో పెట్టుకొని, శాంతస్వరంతో భిక్షాటన చేసుకుంటూ వెళ్తున్నాడు.

6. అలా యిచ్చిన భిక్షలను గైకొని, పర్వత మూలప్రాంతంలో వున్న తన ఏకాంత ప్రదేశంలో విశ్రమించి, దాన్ని భుజించి, పాండవగిరిని ఎక్కేడు.

7. లోధ్ర వృక్షాలతో దట్టంగా నిండివున్న ఆ వనం, పికకూజితాలతో ప్రతి ధ్వనించగా తూరుపుకొండలపైనున్న ఉదయభానుడిలా, ఎర్రని దుస్తులతో, మానవాళికే దివాకరునిలా, ఆయన ప్రకాశించేడు.

8. రాజసేవకుడా విధంగా అతనిని అక్కడ పరిశీలించిన మీదట ఆ విషయమంతా రాజుకు విన్నవించాడు. అది విన్నంతనే ఆ రాజు విశేషఅభిమానంతో కొద్ది పరివారంతో అక్కడికి బయలుదేరాడు.

9. నభసదృశమైన ఎత్తైన విగ్రహంతో ఆ కొండ నధిరోహించాడు.

10. కదిలే పర్వతానికి తానే శిఖరంగా వొప్పుతూ, కోరికలను జయించినవాడై, పద్మాసనంలో కూర్చొని ప్రకాశిస్తున్న గౌతముని అక్కడ అతడు చూసాడు.

11. అతని సుందర విగ్రహాన్ని, సంపూర్ణ ప్రశాంతతను చూసి అతనిని గుర్తించి, ఎంతో ఆశ్చర్యం అభిమానం కలగగా ఆ ప్రజానాధుడు అతన్ని సమీపించాడు.

12. బింబిసారుడు సాదరంగా అతని సమీపాన కూర్చొని అతని యోగక్షేమాలను విచారించాడు. గౌతముడు కూడా తత్సమానమైన నమ్రతాభావంతో, తాను మానసికంగా శారీరకంగా ఆరోగ్య వంతునిగా వున్నట్లు, ఏ విధమైన కష్టాలు లేకుండా క్షేమంగా వున్నట్లు తెలిపాడు.

13. అప్పుడా రాజు, రాతిపై శుభ్రంగా వున్నచోట కూర్చొని తన మనోభావాన్ని వెలిబుచ్చాలనే కోరికతో యిలా పలికాడు.

14. "తరతరాలుగా మీ కుటుంబంతో మాకువున్న స్నేహానుబంధాన్ని పురస్కరించుకుని, ఓ నా పుత్రసమానుడా! నా మనస్సులోని మాటలు నీతో చెప్పాలని అభిలషిస్తున్నాను. కాబట్టి నాయీ స్వాభిమాన వచనాలను ఆలకించు.

15. సూర్యునితో మొదలయిన మీ వంశం, నీ వినూత్న యవ్వనం ప్రస్ఫుటంగా కనిపించే నీ అందం వీటినన్నిటినీ పరిశీలిస్తే, సర్వసుఖాలను, మిగతా విషయాల పట్ల ఆసక్తిని విడనాడి, నీవు రాచరిక జీవనాన్ని కాకుండా యిటువంటి పరివ్రాజిక జీవితాన్ని అవలంబించాలని ఎందుకు నిర్ణయించుకున్నావో అని నేను ఆశ్చర్యపోతున్నాను.

16. నీ శరీరాంగాలు ఎర్రచందన సువాసనకేగాని కావిరంగువస్త్రాలమొరటుదనానికి, తగినవికావు. నీయీ హస్తం, ఇతరులను రక్షించడానికే కాని, యితరులు వేసిన భిక్షాన్నాన్ని మోయడానికి కాదు.

17. ఓ యువరాజా! ఒకవేళ పితృపరంగా వచ్చే రాజ్యాన్ని పాలించడం నీకు యిష్టం లేనట్లయితే, దయచేసి నా అర్థరాజ్యాన్ని వెంటనే అంగీకరించు.

18. నీవు ఈ విధంగా ప్రవర్తించినట్లయితే, మీ స్వపరివారానికి ఎటువంటి దుఃఖమూ కలుగదు. కొంతకాలం గడిస్తే, రాజ్యాధికారం చిట్టచివరికి స్థిర మనస్కుడవైన నిన్నే వెతుక్కుంటూ వస్తుంది. కాబట్టి దయవుంచి నా అభ్యర్థనను మన్నించవలసినది. మంచి తనపు మద్దతు లభించినప్పుడే, మంచితనం సౌభాగ్యం యినుమడిస్తుంది.

19. వంశానుగతంగా వచ్చే నీ ఆభిజాత్యం వలన నీవు యిప్పుడే నన్ను విశ్వసించలేనట్లయితే నన్ను ఒక మిత్రుడిగా భావించి, నీ శత్రువులను జయించడానికై అసంఖ్యాక సైన్యంతో, విల్లమ్ములతో ముందుకు దూకు.

20. కాబట్టి వీటిలో ఒకటి నీవు ఎన్నుకో! ధర్మనిబంధనల కనుగుణంగా భోగభాగ్యాలను పరితరించు, ప్రేమను, మిగతా వాటినీ, విలోమక్రమంలో అనుసరించు, ఇవే జీవితంలో మూడు లక్ష్యాలు. ఎవరైనా చనిపోతే, వారు ఈ ప్రపంచానికి సంబంధించినంతవరకూ అదృశ్యులైన వారి క్రిందే లెక్క.

21. కాబట్టి, ఈ జీవన లక్ష్యత్రయాన్ని అనుసరించి, నీ వ్యక్తిత్వాన్ని ఫలప్రదం చేసుకో ధర్మాన్ని సిరిసంపదలను, భోగభాగ్యాలను సంపూర్ణంగా వశపరచుకున్న తర్వాత, అప్పుడు మానవ జీవితం పరిపూర్ణమవుతుంది అని చెపుతారు.

22. విల్లు సారించడానికి తగినటువంటి శక్తి వంతమైన నీ రెండు బాహువులనూ నిరర్థకంగా వుంచవద్దు. ఈ భూమండలాన్నే కాకుండా ముల్లోకాలనూ జయించడానికి అవి తగివున్నాయి.

23. ఇదంతా నీ పట్ల నాకు గల అభిమానంతో చెప్తున్నాను. కాని, సన్యాసి బట్టలతో వున్న నీపట్ల ప్రభుత్వాధికారంగా గానీ, రాజుననే అహంకారంతోగాని మాత్రం కాదు. దుఃఖంతో నా మనస్సు నిండి పోయింది. నాకు కన్నీళ్ళు వస్తున్నాయి.

24. సర్వసంగపరిత్యాగ జీవనాన్ని గడప నిశ్చయిచుకున్న నీవు, ముందుగా యీ యుక్త కాలంలో ఆనందాలను అనుభవించు. లేకపోతే, వృద్ధాప్యం వచ్చి మీ ఉజ్వల వంశానికి సాటి అయిన నీ అందాన్ని కబళించివేస్తుంది.

25. ధర్మానుసరణంలో వృద్ధుడు కూడా యోగ్యత సంపాదించుకోగలడు. కాని ఆనందాల ననుభవించడానికి వృద్ధాప్యం నిస్సహాయమైనది. కాబట్టే ఆనందాలు యువకులకు, సంపదలు ప్రౌఢులకు, ధర్మం వృద్ధులకూ సంబంధించినవి అని అంటారు.

26. నేటి యీ ప్రపంచంలో, యవ్వనం ధర్మానికి సిరిసంపదకి విరోధి. ఎంత వాటి బారి పడకుండా రక్షించుకోవాలన్నా భోగాలను అదుపు చెయ్యటం సాధ్యంకాదు. కాబట్టే కనిపించిన సుఖాలనన్నింటినీ మీ యువకులు చేజిక్కించుకోవాలి.

27. వృద్ధాప్యం జిజ్ఞాసకు అనువైనది. ప్రశాంతతపైన అది నొక్కు పెడుతుంది. తప్పనిసరగా కొద్ది ప్రయత్నంలో అదీ నిర్మోహత్వం సాధిస్తుంది.

28. దూరంచూసే సహనం లేకుండా చాపల్యంతో బాహ్యవిషయాల వెంట పరుగులు తీసిన యవ్వనదశ తర్వాత, కీకారణ్యం నుండి క్షేమంగా బయట పడిన వ్యక్తిలా వాళ్లు గాలి పీల్చుకుంటారు.

29. కాబట్టి యీ చపలమైన, తెంపరిస్వభావం గల దశను ముందుగా గడిపివేయాలి. మన జీవితపు తొలి రోజులు ఆనందాలకే కేటాయించ బడ్డాయి. వాటిని ఇంద్రియ గుణ ప్రభావం నుండి దూరం చేయలేము.

30. లేక, నిజంగా ధర్మం ఒక్కటే నీ ఉద్దేశ్యమైతే, యజ్ఞయాగాదులు నిర్వహించు. అది మీ కుటుంబంలో చాలా పూర్వకాలం నుండి వస్తున్న ఆచారమే. ఆ విధంగా

యజ్ఞయాగాదులవల్ల అత్యున్నత స్వర్గాన్ని అధిరోహించవచ్చు.

31. "శరీరాన్ని శోషింపజేసి మహర్షులు చేరుకున్న లక్ష్యాన్ని, సముచిత భూషణాలు అలంకరించుకున్న చేతులతో నవరత్న ఖచితంగా చిత్ర విచిత్ర వర్ణాలతో ప్రకాశించే కిరీటాన్ని ధరించి కూడా రాజర్షులు అదే లక్ష్యాన్ని చేరుకున్నారు."

## 3 బింబిసారునికి గౌతముని సమాధానం

1. ఇంద్రునిలా గొప్పగా, బలోపేతంగా మగధ చక్రవర్తి మాట్లాడగా, అదంతా విన్న రాజకుమారుడు తడబడలేదు. పర్వతంలా ధృఢంగా వున్నాడు.

2. మగధ చక్రవర్తి ఆ విధంగా చెప్పిన మాటలను విన్న మీదట, గౌతముడు స్నేహ పూరితవదనంతో, ఆత్మసంయమనంతో గంభీరంగా యిలా సమాధానం చెప్పాడు.

3. "మీరు నాకు చెప్పింది నాకు క్రొత్త విషయమని అనాల్సిన పనిలేదు. ఓ రాజా ! సింహాన్ని రాజచిహ్నంగా గల ఉత్కృష్ట వంశంలో పుట్టినవాడవైన మీరు, మీతో సమానంగా స్నేహితులను కూడా ప్రేమించే మీరు, మీ స్నేహితునిగా మీ ముందు నిలచిన వాని పట్ల యిటువంటి విధమైన పద్ధతిని అనుసరించడం సహజమే.

4. దురాలోచనపరుల మధ్య వారి కుటుంబాల మధ్య ఉండవలసిన మైత్రి క్షీణిస్తూ చివరికి అంతమై పోతుంది. కాని తరతరాలుగా వస్తున్న మైత్రిని పెంచుకోవడానికి ఒకరికొకరు సహాయం చేసుకుంటూ వుండేవారే మంచివారు.

5. విధి వక్రించినప్పుడు సైతం స్నేహితుల పట్ల మారని స్నేహాభిమానాన్ని ప్రదర్శించే వారే నిజమైన స్నేహితులు. అంతేకాని సకలసంపదలతో విలసిల్లుతున్నప్పుడు మాత్రమే వుండేవారు నిజమైన స్నేహితులు కారు.

6. ప్రపంచంలోగల సంపదనంతా సంతరించుకున్నప్పటికి, స్నేహితుల కొరకు, ధర్మోన్నతి కోసం వాటిని సద్వినియోగం చేసినపుడే వారి సంపదకు సార్ధకత చేకూరుతుంది. అది అంతరించి పోయినప్పటికీ, చివరికి ఏ మాత్రం బాధా కలుగదు.

7. ఓ రాజా! నాకు మీరిచ్చిన యీ సలహా, స్వచ్ఛమైన మీ స్నేహసౌహార్ద్రతలతో కూడుకున్నది. సామాన్య స్నేహంలో మీతో మర్యాద పూర్వకంగా ఏకీభవిస్తాను తప్ప మరొక విధంగా మీతో ఎదురాడను.

8. ఈ ప్రాపంచిక విషయాలంటే వెరచినంతగా, విషసర్పాలను చూసిగాని ఆకాశం నుండి పడే పిడుగులను చూసిగాని, గాలితో కలిసి వీచే మంటలను చూసిగాని, నేను అంతగా భయపడను.

9. అశాశ్వతమైన యీ విషయవాంఛలు, మన సుఖసంపదలను దోచి వేసి, ప్రపంచాన్నంతా భ్రమచే కప్పివేస్తాయి. వాటిని ఆశించినంత మాత్రాన మనస్సును లోబరుచుకుని, వాటిని మనఃపూర్వకంగా పొందాలనుకున్న వాళ్లను ఇంకా పిచ్చి వాళ్లనుగా చేస్తాయి.

10. ఈ ఐహిక సౌఖ్యాలకు లోబడినవారు, స్వర్గలోకంలో సహితం ఆనందాన్ని పొందలేరు. మర్త్యలోకంలో ఇంకేం పొందుతారు. అగ్నికి ఆజ్యం, గాలి తోడయినట్లుగా సుఖాలపట్ల దప్పికనొందినవాడు ఎన్నటికీ సంతుష్టుడు కాలేడు.

11. భ్రమలకులోనై మానవులు క్షణిక సౌఖ్యాలకు అంకితమైపోవటానికి మించిన దౌర్భాగ్యం ఈ ప్రపంచంలో మరొకటి లేదు. ఈ నిజాన్ని తెలుసుకున్న వారెవరైనా యీ సుఖాలంటే వెరుస్తారు. తెలివైనవాడు కష్టాలను కోరి తెచ్చుకోడు కదా!

12. సముద్రపరీవృతమమైన భూభాగమంతా జయించినా, ఆ సముద్రపు ఆవలి భాగాన్ని కూడా జయించాలని రాజులు కోరుకుంటారు. అలాగే ఎంత నీరు వచ్చి కలిసినా నిండని సముద్రంలా మానవమాత్రులెవ్వరూ, లభించిన ఆనందాలతో సంతుష్టులుకారు.

13. స్వర్గం నుండి కనకధార కురుసినప్పటికీ, సమస్త భూఖండాలను జయించి నప్పటికీ, శుక్రుని సింహాసనంలో అర్ధభాగాన్ని పొందినప్పటికీ, మాంధాత్రికి ప్రాపంచిక విషయాల పట్ల తృష్ణ తీరలేదు.

14. వృతాసురుని చూసి ఇంద్రుడు భయంతో దాగి వున్నప్పుడు, సురలోక స్వర్గాధిపత్యాన్ని అనుభవించినప్పటికీ, అహంకారంతో ఋషులచే పల్లకీ మోయించు కున్నప్పటికీ, నహుషుడు సంతృప్తి నొందలేదు.

15. ముతక నార బట్టలు ధరించి, కందమూలాలు, ఫలాలు తిని, నీరు త్రాగి వారి కర్తవ్యానికే అంకితమైన ఋషులు సర్పాల్లాంటి పొడవైన భవబంధాలలో చిక్కుకొని, యిహసౌఖ్యాల కోసం తాపత్రయపడి, వాటికి లొంగిపోలేదా?

16. ఆత్మనిగ్రహం భౌతికవాంఛలకు సౌఖ్యాలకు లోనయినవారి దుస్థితి విని వాటికి దూరంగా ఉంటారు.

17. సౌఖ్యాలను చేజిక్కించుకోవడం, నిజంగా దుఃఖభాజనంగా భావించాలి. సౌఖ్యాలే దుఃఖ కారణాలని గుర్తించాలి. ఎందుకంటే, వాంఛలపట్ల పొందిన మత్తులో పడిపోతారు. ఆ మత్తులో చేయవలసిన పనులు మాని వారు చేయకూడని పనులు చేస్తూ బాధాతప్తులై దుస్థితిని పొంది పతనమవుతారు.

18. ఎంతో ప్రయాసతో సాధించుకున్న ఈ సుఖాలు కొద్దికాలంపాటు వుండటానికి అరువు తెచ్చుకున్నవనీ కొద్ది కాలంలోనే మోసగించి వెళ్ళిపోతాయని తెలుసుకున్న వివేకి, ఆత్మనిగ్రహుడైన వాడు ఏవిధంగా వాటి పట్ల మక్కువను పెంచుకుంటాడు?

19. వాటిని చూడగానే ఆశలను రేకెత్తించి, వాటిని పొందగానే ఎండు గడ్డి మంటలా క్షణిక కాలంలోనే ఆరిపోయే యీ సుఖాలతో ఆత్మనిగ్రహంగల వారెవరైన క్షణికానందాల పట్ల ఎలా సంతుష్టినొందగలరు?

20. విసరివేయబడిన మాంసపు ముద్దలాంటివి, వాటిని పొందిన రాజులకు సైతం దుస్థితిని

కలుగచేసే యీ సుఖాలతో ఆత్మనిగ్రహం గలవాడు ఏ విధంగా సంతృప్తిని పొందగలడు?

1. ఇంద్రియాల వలె వినాశ హేతువులు, వాటి దరికి చేరిన వారికి దుస్థితిని కలుగ జేసే యీ సుఖాల పట్ల సంతృప్తిని ఆత్మనిగ్రహం గలవాడు ఎలా పొందగలడు?

2. క్రూర రౌద్ర సర్పాల్లాంటి ఈ సుఖాలు నిగ్రహపరులను కూడ కాటువేస్తాయి. వాళ్లు పతనం చెందుతారు. విషయం తెలుసుకున్న ఆత్మనిగ్రహం పరుడెవరైనా వాటి పట్ల సంతృప్తి నెలా పొందగలడు?

3. ఆకలితో అలమటించే కుక్కలు ఒక ఎముక కోసం కొట్లాడుకున్నట్లు, ఒక వేళ సుఖాలను అనుభవించినా వాటితో సంతృప్తి లభించనప్పుడు, ఆత్మ నిగ్రహంగలవారు ఎండిన ఎముకలతో తయారైన అస్థిపంజరం లాంటి యీ సుఖాల పట్ల ఏ విధంగా సంతృప్తి నొందగలరు.

4. సుఖాలతో గ్రుడ్డివారైన వివేకులకు, సుఖాలను ఆశిస్తూ వాటికి దుర్భర బానిసలైన దౌర్భాగ్యులకు, యీ ప్రాపంచిక జీవనంలో లభించేది బాధతో కూడిన మరణమే.

5. పాటలకు ఆకర్షించబడి వాటి వినాశనాన్ని కొని, తెచ్చుకున్న జింకల్లా, వెలుగు కోసం వెంపర్లాడి మంటల్లోనికి దూకే, కీటకాలలాగా, మాంసానికి ఆశపడి గేలం వంపును మింగే చేపలా, భౌతికసుఖాలు దుర్మరణానికే దారి తీస్తాయి.

6. సుఖాలు అనుభవించడానికే అనేది సామాన్య అభిప్రాయం. నిశితంగా పరిశీలిస్తే అవి ఏవీ అనుభవించదగినవికావు, సుందరమైన మృదువైన వస్త్రాలు వంటివన్నీ దుఃఖాలలో ఉపశమనం కలుగచేసే వుపకరణాలు మాత్రమే.

7. దప్పిక తీర్చుకోవడానికిక నీరు కావాలి. అదే విధంగా ఆకలి తీరడానకి ఆహారం కావాలి. ఎండ, గాలి, వర్షాల బారినుండి తప్పించు కోవడానికి ఇల్లు కావాలి. చలిగాలి బారినుండి కాపాడి దిగంబరత్వాన్ని కప్పిపుచ్చడానికి దుస్తులు కావాలి.

8. అదే విధంగా మగతను తీర్చడానికి ఒక తల్పం, ప్రయాణ బడలిక నుండి వుపశమనం కల్గించడానికి ఒక వాహనం, నిల్చునే బాధను దూరం చేయడానికై ఒక ఆసనం, ఆరోగ్యానికి, దారుఢ్యానికి, పరిశుభ్రతకు స్నానం కావాలి.

9. కాబట్టి మానవులను దుఃఖాల నుండి వుపశమనం కల్గించడానికే యీ సాధనాలుగాని, అవే సుఖాన్నందించే ముఖ్యసాధనాలు మాత్రం కాదు.

10. పైత్యజ్వరతాపంతో బాధపడేవానికి, శీతలోపకరణాలు ఆనందదాయకాలు; బాధల నుండి వుపశమనాన్ని పొందటాన్నే ఆనందాల ననుభవించడం అనుకుంటాడు.

11. ఈ అన్ని సుఖాల్లోనూ వ్యత్యాసం కన్పిస్తున్నది కాబట్టే, వాటిని అనుభవించటం అన్న మంటను ఆపాదించలేను. సౌఖ్యాన్నిచ్చేవే మరింకొకసారి దుఃఖాన్ని కూడా కల్గిస్తాయి.

32. దళసరి దుస్తులు, సువాసనలు వెదజల్లే అగరు చెక్కల శీతల వాతావరణంలో హాయినిస్తాయి. కాని ఉష్ణతాపంతో బాధపడేటప్పుడు హాయినిచ్చే వెన్నెల కిరణాలు, చందనపు చెక్కలు, శీతాకాలంలో బాధాకరంగా వుంటాయి.

33. లాభం, నష్టంలాంటి బాగా తెలిసిన వ్యతిరేక పదాలు, ఈ ప్రపంచంలో ప్రతి విషయంలోనూ విడదీయరానివిగా కలిసి పోయి వుంటాయి. కాబట్టే ఏ వ్యక్తీ నిత్య సంతోషిగానో, నిత్య దుఃఖితుడిగానో ఉండడు.

34. కష్టసుఖాలు ఏ విధంగా కలిసి ఉంటాయో గమనించిన తర్వాత, విలాసం బానిసత్వం రెండూ సమానమైనవిగానే నేను భావిస్తాను. రాజు ఎప్పుడూ ఆనందంగా నవ్వుతూనే వుండడు. అలాగే బానిస యెప్పుడూ బాధతో విలపిస్తూనే వుండడు.

35. విస్తృతమైన బాధ్యతలను నిర్వర్తించాల్సి వుంటుంది. కనుక రాజుకు కలిగే కష్టాలు, బాధలు చాలా ఎక్కువగా వుంటాయి. బరువులను భరించే కొక్కెం లాగా, అందర్నీ రక్షించడానికై రాజు ఎన్నో బాధలను భరించాల్సి ఉంటుంది.

36. దురదృష్టవశాత్తు రాజు తన రాజ్యాధికారంపై నమ్మకం పెట్టుకుంటే అది కుటిల మార్గాల ద్వారా రాజ్యాన్నే మరుభూమిగా మార్చగలదు. అలా కాకుండా మరొక ప్రక్క నమ్మకపోతే, భయస్థుడైన రాజుకు ఆనందమేముంటుంది.

37. ప్రపంచమంతా జయించిన తర్వాత కూడా, ఒకే ఒక నగరం అందునా ఒకే ఒక భవంతి అతని నివాసమై వుంటుంది. ఇదంతా ఇతరుల కోసం పడే శ్రమేకాని, రాజరికం కాదు గదా!

38. రాజ్యపరిపాలనా బాధ్యతా నిర్వహణలో, ఒక రాజుకు అవసరమైనవి ఒక జత దుస్తులు, ఆకలి తీర్చడానికి తగు మాత్రం ఆహారం, ఒక శయ్య, ఒక సింహాసనం మాత్రమే గదా, మిగతావన్నీ రాజసాన్ని చాటడానికిక పనికి వచ్చేవేగానీ, అతనికి అవసరమైనవి కాదు గదా!

39. ఈ సదుపాయాలన్నీ సంతృప్తి కోసమే అవసరమైతే, నేను రాజ్యం లేకుండానే సంతోషంగా సంతృప్తిగా వుండగలను. ఈ లోకంలో ఒక వ్యక్తి ఒక సారి సంతృప్తిగా వున్నప్పుడు ఇటువంటి వేరే చిహ్నాలు అనవసరమే గదా!

40. ఎవరైతే ఆనందం కొరకు యీ శుభప్రదమైన మార్గాన్ని అవలంబించాడో అతడు సుఖాల పేరుతో మోసగించబడలేడు. మీరు చాటిన స్నేహ భావాన్ని గుర్తుంచుకుని పదే పదే నాకు చెప్పండి యీ సుఖాల వల్ల ఏమైనా ప్రయోజనం వుందా?

41. నేను కోపంతో యిల్లు వదలి రాలేదు. నేను మీ స్నేహహస్తాన్ని నిరాకరించడం లేదు. లేదా నా కిరీటం శత్రు రాజుల శరాఘాతానికి గురై నేల కొరక లేదు. లేదా ఘనకార్యాలను సాధించాలన్న కోరికతో.

ప్రాణాంతకమైన విషసర్పాన్ని వదలి పెట్టిన వాడిలా, మంటలో వేసిన ఎండుగడ్డి కాగడాను మరల వెనక్కి లాగడానికి ఎవ్వరూ ప్రయత్నించని విధంగా, ఒక సారి విసర్జించిన సౌఖ్యాలను.

గ్రుడ్డి వానిని చూసి అసూయ చెందేవారు, స్వేచ్ఛగా జీవించగలిగీ, ప్రాపంచిక ఆకర్షణల వలయంలో చిక్కుకొనేవారు, నిరాశ్రయ జీవితంలోగల హాయిని గుర్తించలేక ఐహిక వాంఛలకు, మాయా పూరితమైన వెర్రిభ్రమలకు లోనైనవారు మాత్రమే ఈ భౌతిక వాంఛల పట్ల ఆకర్షితులవుతారు.

ఓ నా మంచి మిత్రమా ! భిక్షాటన చేసుకుంటూ బ్రతికే వారిపై జాలి పడవద్దు. ఆతనికి యిక్కడ అత్యున్నత ఆనందం, పరిపూర్ణ ప్రశాంతత వుంది. ఆపై అతనికి వున్న దుః దుఃఖాలుఅన్నీతొలగిపోతాయి .

సకల సంపదలతో తులతూగుతూ, అధిక వ్యామోహానికి లోనై ఈ సంతోషాన్ని పొందలేక, బాధలను అనుభవిస్తున్న వారిని చూసి జాలి పడాలి.

మీరు నాకు చెప్పినదంతా, మీ వ్యక్తిత్వానికీ, మీ జీవన విధానానికి, మీ కుటుంబానికీ సరియైనది. అలాగే నా నిర్ణయాన్ని అమలు పరచడం నా వ్యక్తిత్వానికీ, నా జీవన విధానానికి, నా కుటుంబానికీ తగినది."

# 4 గౌతముని సమాధానానికి ముగింపు

"లోకంలో జరిగే సంఘర్షణలు నా హృదయాన్ని గాయపరచాయి. అందుచేత ప్రశాంతతను పొందాలనే ఆశతో నేను బయటికి వచ్చాను. నన్ను యీలోకంలోని కష్టాల నుండి రక్షించడానికి మరో భూతలస్వర్గంలో ఏ సామ్రాజ్యాన్నయినా నేను అంగీకరించను;

ఈ ప్రపంచంలో మానవులు కోరుకునేవి మూడు పురుషార్థాలని మీరు చెప్పారు. నేను కోరుకున్నది దుఃఖదాయకమైనదని అన్నారు. కాని మీరు చెప్పిన మూడూ, అశాశ్వతమైనవి, సంతృప్తిని నివ్వజాలనివి.

యవ్వనం కలకాలం వుండదు. కాబట్టి వార్ధక్యము వచ్చేవరకూ ఆగు అని మీరు చెప్పారు గదా! ఇటువంటి నిర్ణయమే అనిశ్చితమైనది. ఎందుకంటే ముసలితనం కూడా అనిశ్చితమైనదీ, యవ్వనమే దృఢమైనదీ కావచ్చు.

ప్రపంచంలోని విభిన్న వయస్కుల స్థితిగతులను మార్చగల శక్తి ప్రకృతి కున్నది. ప్రశాంతతను కోరుకొనేవాడెవ్వడు వృద్ధాప్యం వరకు దానికై వేచివుండజాలడు. ఎందుకంటే యీలోగా మరణమనేది ఎప్పుడైన సంభవించవచ్చుగదా, ఎవరెరుగుదురు?

మరణం ఒక వేటగానిలా, వార్ధక్యమతని ఆయుధంలా, రోగాలు అతని బాణాల్లా వెంబడించగా, అతని బారినుండి తప్పించుకోవాలని అడవి అంతా పరుగెత్తిన లేడిలా

మృత్యువుకు అనుదినం భయపడుతూ ఎక్కువకాలం జీవించాలని ఎవరైనా కోరుకుంటారా?

6. కరుణాత్ముడైన ధర్మానువర్తుని మార్గాన్ని తక్షణం కోరుకోవడం యువకులకు, వృద్ధులకు, బాలురకు తగినదే.

7. మా పూర్వీకులనుసరించిన యజ్ఞయాగాదులను నేను కూడా ఆచరించి, యజ్ఞ ఫలాలను పొందమని మీరు చెప్పారు. ఇతర జీవాలను హింసించి, చేసే బలులతో స్వర్గ ప్రాప్తిని పొందాలన్న ఆశ నాకు లేదు.

8. నిస్సహాయ మూగజీవాలను చంపడం వలన భవిష్యత్తులో ఒనగూరే ప్రతిఫలం ఎంత శాశ్వతమైనప్పటికీ, దానికిక ఆశపడి ఆ అకృత్యానికి పాలుపడటం దయార్ద్రహృదయులు సహృదయులైనవారు చేయదగిన పనికాదు.

9. ఆత్మనిగ్రహం, నైతిక ప్రవర్తన, కామోద్రేకరహితంగా వుండటం వలనగాక జంతుబలి ద్వారానే యజ్ఞయాగాదుల ఫలితాన్ని పొందగలమనే మతవిశ్వాసం సరియైనది కాదు.

10. జంతుబలి ద్వారా ఈ లోకంలో జీవిస్తున్న మానవులకు పైలోకంలోని సుఖాలు కలుగుతాయని విశ్వసించడం కరుణార్ద్రహృదయులైన ప్రతివారికీ గర్హనీయమే. మన ఊహకందని మరో జన్మలో ఎన్నో సుఖాలు సిద్ధిస్తాయని భావించడం ఎంత అవివేకం.

11. భవిష్యత్తులో లభించే ప్రతిఫలాన్నాశించి యిటువంటి దుష్కృత్యాలను చేసేందుకై నేను సిద్ధపడను. నాకు రాబోయే జన్మల పట్ల ఆశలేదు. కావున ఓ రాజా! మేఘాల నుండి వచ్చే వర్షం ఏదిశనుండి వచ్చి కొడుతుందో తెలియక వర్షపు జల్లులో చిక్కుకున్న మొక్కల్లాగా, యీనాడు మనం చేసేపనులు కూడా దారీతెన్నూ లేకుండా అటునిటు పరుగులు తీస్తాయి."

12. అప్పుడారాజు ముకుళిత హస్తుడై - "నీకేవిధమైన ఆటంకాలు కలుగకుండా నీ కోరికలు సిద్ధిస్తాయి. చిట్టచివరికి నీవు సాధించవలసినదంతా పొందిన తర్వాత, నీవు నన్ను మీ దర్శన భాగ్యంతో కరుణించాలి !" అని అన్నాడు.

13. మళ్ళీ వచ్చి, తనని సందర్శిస్తానని గౌతముని నుండి స్థిర వాగ్దానం గైకొని, ఆ రాజు, తన సపరివారం సహితంగా అతని అంతఃపురానికి వెనుతిరిగాడు.

## 5. శాంతి వార్త

1. గౌతముడు రాజగ్రహంలో వుంటున్నప్పుడే, మరొక అయిదుగురు, పరివ్రాజకులు వచ్చి గౌతముని కుటీరం ప్రక్కనే మరో కుటీరాన్ని ఏర్పాటు చేసుకున్నారు.

2. వారు కౌండిన్యుడు, అశ్వజిత్తు, కశ్యపుడు, మహానాముడు, భద్రాకుడు అనే అయిదుగురు.

వారు కూడా గౌతముని స్ఫురద్రూపాన్నిచూసి ముగ్ధులయ్యారు. అతడు పరివ్రాజం స్వీకరించడానికి గల కారణమేమై వుంటుందో అని ఆశ్చర్యపోయారు.

బింబిసార మహారాజు పూర్వం ప్రశ్నించిన విధంగానే, వారు యీ విషయమై అతనిని ప్రశ్నించారు.

తాను పరివ్రాజం స్వీకరించడానికి, ఏయే పరిస్థితులు దారితీసాయో, తెలియజెప్పగా, "ఇవన్నీ మేము విన్నాము. కాని మీరు ఇల్లు విడచి వచ్చేసిన తర్వాత, అక్కడేమి జరిగిందో మీకు తెలుసా?" అని వారు ప్రశ్నించారు.

"తెలియదు" అని సిద్ధార్థుడన్నాడు. మీరు వచ్చేసిన తర్వాత యుద్ధ ప్రయత్నానికి వ్యతిరేకంగా శాక్యుల మధ్య పెద్ద అలజడిరేగింది.

"శాక్యులు మన సోదరులు", "ఒక సోదరుడు మరొక సోదరునితో యుద్ధం చేయడం తప్పు" "సిద్ధార్థ గౌతముని దేశబహిష్కారం గురించి ఆలోచించండి" అనే నినాదాలతో వున్న పతాకాలను చేతబూని, బాలబాలికలు, స్త్రీ, పురుషులు ప్రదర్శనలు, పూరేగింపులు జరిపారు.

ఆ ఆందోళన ఫలితంగా, శాక్యసంఘం ఒక సమావేశాన్ని ఏర్పరచి ఈ సమస్యను పునరాలోచనం చేసారు. ఈసారి, కొలియులతో సంధి చేసుకోవాలని అధిక సంఖ్యాకులు అభిప్రాయపడ్డారు.

కొలియులతో శాంతి సంప్రదింపులకై రాయబారులుగా వ్యవహరించడానికై అయిదుగురు శాక్యులను ఎన్నుకోవాలని సంఘం నిర్ణయించింది.

కొలియులు యిది విన్నమీదట ఎంతో ఆనందించారు. శాక్య రాయబారులతో మంతనాలు జరపడానికై వారు కూడా ఐదుగురు కొలియులను ఎన్నుకున్నారు.

ఉభయపక్ష దూతలు సమావేశమై, ఒక శాశ్వత మధ్యవర్తిత్వసంఘాన్ని రోహిణీ నదీజలాలపంపకంపై వచ్చే తగాదాలన్నీ తీర్చడానికి తగిన అధికారాలతో స్థాపించాలనీ; ఇరుపక్షాలవారు ఆ సంఘ నిర్ణయానికి కట్టుబడి వుండాలనీ నిర్ణయించారు. ఆ విధంగా భయపెట్టిన యుద్ధం శాంతిగా సమసిపోయింది.

జరిగిన వృత్తాంతమంతా ఈ విధంగా గౌతమునికి తెలియజేసిన మీదట, పరివ్రాజకులు ఇలా అన్నారు; "పరివ్రాజకునిగా కొనసాగాల్సిన అవసరం నీకింక లేదు. కాబట్టి యింటికి వెళ్ళి కుటుంబముతో కలిసి ఎందుకు వుండకూడదు?"

"ఈ శుభవార్త విని నాకు ఆనందం కలిగింది. ఇది నాకు ఒక విజయం, కాని నేను మా యింటికి తిరిగి వెళ్ళను. వెళ్ళకూడదు. నేను పరివ్రాజకునిగానే కొనసాగాలి" అని సిద్ధార్థుడు చెప్పాడు.

14. "మీ తదుపరి కార్యక్రమమేమిటని " గౌతముడా ఐదుగురు పరివ్రాజకులను అడుగగా, "మేము తపస్సు చేయాలని నిర్ణయించు కున్నామని నీవు కూడా మాతో కలవరాదా?" అని వారు అన్నారు. "ప్రస్తుతం, నేను ముందుగా యితర మార్గాలను పరిశీలించవలసి వుంది." అని గౌతముడు చెప్పాడు.

15. ఆపై ఆ అయిదుగురు పరివ్రాజకులు వెడలిపోయారు.

# 6 నూతన దృక్పథంలో సమస్య

1. కొలియనులు, శాక్యులు శాంతి నెలకొల్పుకున్నారని పరివ్రాజకులు చెప్పిన వార్త, గౌతముని చాలా వ్యాకులపరచింది.

2. ఒంటరివాడై, తన పరిస్థితి గురించి, తను పరివ్రాజకత్వాన్ని కొనసాగించడానికి గల కారణాలేమయినా మిగిలివున్నాయా అని ఆలోచించసాగాడు.

3. తాను తన వారినందర్నీ దేని కొరకు విడిచాడు - అని తనలో తానే ప్రశ్నించుకున్నాడు.

4. తాను యుద్ధాన్ని వ్యతిరేకించినందువలననే ఇల్లు వదలి వచ్చాడు. "ఇప్పుడు యుద్ధం ఆగిపోయింది గదా! నాకు మిగలిన సమస్య ఏమైనా వున్నదా? యుద్ధం ఆగిపోయినంత మాత్రాన నా సమస్య తీరినట్లేనా?"

5. చాలా ఆలోచించిన మీదట, తన సమస్య తీరలేదనుకున్నాడు.

6. యుద్ధ సమస్య వివాదాస్పదమైన సమస్యే! అది జటిల సమస్యలో ఒక భాగం మాత్రమే!

7. ఈ విధమైన పోరాటం, రాజులు, రాజ్యాల మధ్యనే కాదు - ఉన్నత వంశీయులు - బ్రాహ్మణుల మధ్య; ఇంటి యజమానులమధ్య తల్లి - కొడుకు మధ్య; తండ్రి - తనయుని మధ్య; సోదరి - సోదరుని మధ్య ; సహచరుల మధ్య, కొనసాగుతూనే వుంటుంది.

8. దేశాల మధ్య వైరం అప్పుడప్పుడూ వచ్చేది. కాని వర్గాల మధ్య వైరం సమసిపోనిది, నిరంతరమైనది. ఈ ప్రపంచంలోని కష్టాలన్నిటికి మూలం యిదే."

9. నిజమే! యుద్ధం గురించే నేను యిల్లు విడచాను. కొలియులు - శాక్యుల మధ్య యుద్ధం సమసిపోయినంత మాత్రం చేత నేను ఇంటికి తిరిగి వెళ్ళలేను. ఇప్పుడే నా సమస్య జటిలమైనదిగా కన్పిస్తున్నది. ఈ సామాజిక వైఫల్యానికి తగిన నివారణోపాయాన్ని నేను కనుక్కోవాలి.

10. ఇటువంటి సమస్యల పరిష్కారానికి ఇంతకు పూర్వం నిర్ధారించబడిన తాత్విక సూత్రాలేమైన వున్నాయా?

11. సరూజపర తాత్విక సిద్ధాంతాలలో ఏదైనా ఒక దానిని తాను అనుసరించవచ్చా?

12. తనంతట తానే ప్రతీదీ పరిశీలించాలని నిర్ణయించుకున్నాడు.

# మూడవ భాగం
# కొత్త వెలుగుకై అన్వేషణ

# 1. భృగుని ఆశ్రమంలో మజిలీ

1. ఇతర మార్గాలను అనుసరించాలన్న కోరికతో ఆరాదకాలమును కలవడానికై, గౌతముడు రాజగ్రహాన్ని విడిచి వెళ్ళాడు.

2. దారి మధ్యలో భృగుమహర్షి ఆశ్రమాన్ని చూచి, ఆసక్తితో అందులో ప్రవేశించాడు.

3. కట్టెల కొరకు బయటికి వెళ్ళి , చేతుల నిండా కట్టెలు , పూలు, దర్భలతో అప్పుడే వచ్చిన తపోశీలుడు, సర్వోన్నతుడు, విజ్ఞానప్రవీణుడు అయిన బ్రహ్మణుడు వెళ్ళడంమాని, అతనిని చూస్తూ వుండిపోయాడు.

4. ఆ ఆశ్రమవాసుల సత్కారాలు గైకొనిన తర్వాత , గౌతముడు ఆశ్రమ పెద్దలకు నమస్కరించాడు.

5. ముక్తిమార్గాన్వేషి అయిన ఆ విజ్ఞుడు స్వర్గాభిలాషులైన వారితో నిండి వున్న ఆ ఆశ్రమమంతా పర్యటించి , వారు చేసే అద్భుత తపోచర్యలను తదేకంగా చూసాడు.

6. ఆ ఆశ్రమావరణలోని వనంలో ఋషులు ఆచరించే వివిధ తపోరీతులను మొట్టమొదటి సారిగా ఆ శాంత మూర్తి చూసాడు

7. తపస్సాధనలో నిష్ణాతుడైన బ్రాహ్మణుడు భృగు, వివిధ తపోసాధనా మార్గాలను, వాటి వలన ఒనగూరే ఫలితాలను , గౌతమునికి తెలియపరచాడు.

8. పవిత్ర గ్రంథాలలో చెప్పినట్లుగా, పచనం చేయని, నీటితో పెరిగే ఆహారం, కందమూలాలు, ఫలాలు మునులకు తినతగినవి. కాని తపస్సులోని వివిధ ప్రత్యామ్నాయాలు మారుతూవుంటాయి.

9. ధాన్యాన్ని ఏరుకుని తినే పక్షుల్లా కొందరు, జింకలా గడ్డి మేస్తూ మరి కొందరు పాముల్లా గాలిని భుజిస్తూ ఇంకొందరు జీవిస్తూ వుంటారు - తామే చీమల పుట్టలుగ మారి.

10. కొందరు రాళ్ళలో విశేష శ్రమచేసి వారి ఆహారాన్ని సంపాదించు కుంటారు ఇంకొందరు, తమ పండ్లతో ధాన్యపుగింజల్ని బాగా నమిలి తింటారు. మరికొందరు ఇతరులకు, వండి వడ్డించగా మిగిలిన దేమయినా వుంటే, తమ కోసం వుంచుకుంటారు

11. కొందరు పదే పదే నీళ్ళలో తడుస్తూ, జడలు కట్టిన శిఖలతో మంత్రోచ్చారణ చేస్తు అగ్నికి రెండుసార్లు నైవేద్యాన్ని అర్పిస్తారు. మరి కొందరు చేపల్లాగా నీటిలో మునివుండి, వారి శరీరాలను తాబేళ్ళచే గీరించుకుంటారు.

నిమ్నలోకాన్ని వదలి, ఉన్నతలోకమైన స్వర్గాన్ని పొందుతారు. బాధలననుసరించే, సుఖాలను పొందవచ్చు. బాధలే, యోగ్యతకు మూలమని వాళ్ళంటారు.

13. ఇది విన్న గౌతముడు ఇటువంటి ఆశ్రమాన్ని నేను చూడటం యిదే ప్రథమం. ఈ తపోనియమమేమిటో నాకర్థంకావటం లేదు.

14. ప్రస్తుతం యింతే నేను చెప్పదలచుకున్నది. మీ యొక్క యీ భక్తి శ్రద్ధలు స్వర్గం కోసం. కాని ఈ లోకంలోగల జీవులు పడే కష్టాలను పరిశీలించి, వాటి నివారణోపాయాన్ని కనుగొనాలనేదే నా ఆకాంక్ష. నాకు శలవిప్పిస్తారా! సాంఖ్య శాస్త్రతత్త్వాన్ని అధ్యయనం చేసి, సమాధి మార్గాన స్వయంగా శిక్షితుడనై, నాసమస్యను తీర్చడానికి ఏ విధంగా అది సహాయపడుతుందో చూస్తా.

15. ఈ విధంగా నిమగ్నమై వుండి నాకు ఆశ్రయమిచ్చి, నా పట్ల మిక్కుటమైన అదరాభిమానాలను చూపిన మిమ్ములను వదలి వెళ్ళి పోవాల్సిందేనన్న ఆలోచన వచ్చేసరికి, నా బంధువులనందర్నీ విడచి పెట్టినప్పుడు కలిగినంత దుఃఖం కలుగుతున్నది.

16. కాబట్టి, నా అయిష్టతవల్ల గాని, ఇతరుల చెడుప్రవర్తన వలనగానీ, నేనీ అడవిని వదలి వెళ్ళిపోవటం లేదు. పూర్వం మునీశ్వరులాచరించిన ధర్మ విధులను ఆచరించడంలో ముందంజ వేస్తున్న మీరు మహర్షులవంటి వారు.

17. నాకు ఆసక్తి వున్న శాస్త్రంలో నిష్ణాతునిగా ప్రసిద్ధినొందిన ఆరాదకాలముడనే ముని వద్దకు నేను వెళ్ళాలనుకుంటున్నాను.

18. ఆశ్రమాధిపతి అయిన భృగుడు అతని స్థిరనిర్ణయాన్ని గమనించి, ఓరాకుమారా! నీవు తలపెట్టిన కార్యం సాహసోపేతమైనది. స్వర్గానికి, ముక్తికి మధ్యగల తేడాను యోచించి ముక్తి కొరకే నీ మనస్సులో నిర్ణయించుకున్న వాడవైన నీవు చిన్నవాడివైనా, నిజంగా సాహసవంతుడివి.

19. నీవు చెప్పినదే నీ స్థిరసంకల్పమయితే, త్వరి గా వింధ్య కోస్తకు వెళ్ళు. ఆనంద పారమ్యపు అంచుల్ని అంతర్దృష్టితో చూచినఆరాదముని అక్కడ నివసిస్తున్నాడు.

20. అతని ద్వారా నీవు నీ లక్ష్యసాధనామార్గాన్ని తెలుసుకుంటావు. నీ లక్ష్యం యింతటితో ఆగిపోదు. ఆయన మార్గాన్ని అధ్యయనం చేసిన తర్వాత నీ ఆలోచన యింకాముందుకు సాగుతుంది.

21. గౌతముడతనికి కృతజ్ఞతలు తెలిపి, తను వదలి వెళ్ళిపోతున్న ఋషిగణాలకు నమస్కరించగా, ఆ ఆశ్రమవాసులు కూడా అతని పట్ల మర్యాద పూర్వక క్రియా విధులను నిర్వర్తించారు. ఆతడు (ఆశ్రమాన్ని వీడి) ముని వరులుండే వనంలో ప్రవేశించాడు.

# 2. సాంఖ్యశాస్త్ర అధ్యయనం

1. భృగుమహర్షి ఆశ్రమాన్ని విడచి, ఆరాదకాలముని నివాసస్థలాన్ని వెదకుతూ గౌతముడు బయలుదేరాడు.

2. ఆరాదకాలముని వైశాలీనగరంలో నివసిస్తున్నాడు. గౌతముడక్కడికి వెళ్ళాడు. వైశాలీ నగరాన్ని చేరి, అతని ఆశ్రమానికి వెళ్ళాడు.

3. ఆరాదకాలముని సమీపించి మీ సిద్ధాంతంలోనికి, మార్గంలోనికి నన్ను ప్రవేశపెట్ట వలసినదిగా కోరుతున్నాను" అని అర్థించాడు.

4. దానిపై, ఆరాద కాలముడిలా అన్నాడు "నిన్ను ఆహ్వానిస్తున్నాను. నీలాంటి తెలివైనవాడు అనతి కాలంలోనే స్వయంగా ఆకళింపుచేసుకొని, సాధించి, దానికి కట్టుబడి వుండేలా చేసేదే నా సిద్ధాంతం."

5. నిజంగా ఈ నా వున్నత శిక్షణను పొందటానికి అన్నివిధాలా యోగ్యుడవు నీవే!

6. ఆరాదుని ఆ పలుకులనాలకించిన రాకుమారుడు పరమానందభరితుడై యిలా సమాధానం యిచ్చాడు.

7. "మీరు నా పట్ల చూపిన అమిత వాత్సల్యం వలన, అసంపూర్ణుడనైన నాకు సంపూర్ణత్వం సిద్ధించినట్లుగా గోచరిస్తున్నది.

8. కాబట్టి, మీ సిద్ధాంతోపదేశాన్ని నాకు బోధించడం ప్రారంభించరా?"

9. ఆరాదుడిలా అన్నాడు "నీ వినయశీలత, నీ విధేయ లక్షణం, నీ ధృఢ నిర్ణయాలతో నీ యోగ్యతను నిర్ణయించే ప్రాధమిక పరీక్ష పెట్టనవసరం లేనంతగా నీవు నన్ను ఆకర్షించావు.

10. శ్రోతలలో వుత్తమమైనవాడా, నా సిద్ధాంతాన్ని వినుము."

11. అంటూ అతడు సాంఖ్య సిద్ధాంత సూత్రాల్ని గౌతమునికి వివరించాడు.

12. తన ప్రసంగాన్ని ముగిస్తూ, ఆరాద కాలముడిలా అన్నాడు.

13. "ఓ గౌతమా! ఇవి మన సిద్ధాంత సూత్రాలు. వాటిని నీకు సారాంశరూపంలో వివరించాను.

14. విస్పష్టంగా వున్న ఆరాద కాలముని వుపదేశాన్ని విన్న గౌతముడు ఎంతో సంతుష్టుడయ్యాడు.

# 3. సమాధి మార్గంలో శిక్షణ

1. తన సమస్యా నివారణకు తగిన వివిధ మార్గాలను పరిశీలించే సమయంలో "ధ్యాన

[illegible]" (చిత్త ఏకాగ్రత) గురించి తెలుసుకోవాలనుకున్నాడు.

2 [illegible] మూడు పద్ధతులు వున్నాయి.

3 [illegible] సాధించటానికి, శ్వాసనియంత్రణే మార్గమనేది ఈ మూడు [illegible] సామాన్య సూత్రం.

4 "[illegible]" అనే శ్వాసనియంత్రణా విధానం అవలంబించేది ఒక పద్ధతి.

5 "[illegible]" అనే శ్వాసనియంత్రణ మార్గాన్ని అనుసరించాలనేది ఇంకొక పద్ధతి. ఈ [illegible] శ్వాస క్రియను మూడు భాగాలుగా విభజించారు. అవి:

1. [illegible] (పూరకం) 2. శ్వాసబంధం (కుంభకం)

3. [illegible] (రేచకం). మూడవ దానిని "సమాధిమార్గ పద్ధతి" అంటారు.

6 [illegible] నిష్ణాతునిగా ఆరాద కాలముడు ప్రసిద్ధుడే. ఆరాద కాలముని గురుత్వంలో [illegible] శిక్షణను కూడా పొందగలిగితే, తన కెంతో శ్రేయోదాయకం అని గౌతముడు [illegible].

7 [illegible] దయతో ధ్యానమార్గ శిక్షణను ప్రసాదించ వలసినదిగా ఆరాద [illegible] అభ్యర్థించాడు.

8 "[illegible]" అని ఆరాదకాలముడు జవాబు పలికేడు.

9 [illegible] మర్మములను ఆరాద కాలముడు అతనికి బోధించాడు. దానిలో [illegible].

10 గౌతముడు [illegible] ప్రతి రోజూ సాధన చేసేవాడు.

11 [illegible] సాధించిన తర్వాత, తాను నేర్చుకోవలసింది యింకేమయినా [illegible]" అని గౌతముడు అడిగాడు.

12 [illegible] ఆరాదకాలముడిలా సమాధానం చెప్పాడు, లేదు మిత్రమా "నేను నేర్పవలసింది [illegible]" [illegible] గౌతముడు ఆరాదకాలముని వద్ద శలవు తీసుకున్నాడు.

13 [illegible] చెప్పిన విధానం కంటే మరొక పైదశకు ఒక ధ్యాని చేరుకోవడానికి [illegible] ప్రక్రియను కనిపెట్టి ప్రసిద్ధినొందిన, ఉద్దాక రామ పుత్తుడనే మరొక యోగి [illegible].

14 [illegible] నేర్చుకుని, అత్యున్నత సమాధి స్థితిని అనుభవించాలని తలపోసాడు. [illegible] ఉద్దాక రామ పుత్తుని ఆశ్రమానికి వెళ్ళి, అతని శిష్యునిగా చేరాడు.

15 [illegible] ఉద్దాకుడు చెప్పిన ఎనిమిదవ దశను చేరుకునే సాధనలో [illegible]

సంపాదించాడు. ఉద్దాక రామ పుత్తుడు నేర్పిన సాధనలో నిష్ణాతుడు అయిన తర్వాత, పూర్వం ఆరాదకాలమునుని ప్రశ్నించిన విధంగానే, ``ఇంకా నేర్చుకో గలిగినది ఏమైనా వున్నదా?" అని గౌతముడడిగాడు.

16. "లేదు మిత్రమా! నీకు నేను నేర్పగలిగినది యింకేమీ లేదు" అనే సమాధానాన్నే ఉద్దాక రామ పుత్తుడు కూడా యిచ్చాడు.

17. కోసలదేశంలో ధ్యానమార్గంలో పరిపూర్ణులుగా ఆరాద కాలముడు, ఉద్దాక రామ పుత్తుడు ప్రసిద్ధులు. కాని, మగధ రాజ్యంలో తత్సమానులైన వారు కొందరున్నారని గౌతముడు విన్నాడు. వారి విధానంలో కూడా శిక్షణను పొందాలని అతడు ఆశించాడు.

18. తత్ప్రకారంగా గౌతముడు మగధకు వెళ్ళాడు.

19. వారి ధ్యానయోగ విధానం శ్వాస నియంత్రణా పద్ధతిపై ఆధారపడి వున్నదయినప్పటికీ, కోసలదేశంలో పాటించిన దానికి భిన్నంగా వుందని గ్రహించాడు.

20. శ్వాస పీల్చడం మానేయడమే కాకుండా, ఆ శ్వాసను నిలిపి ఏకాగ్రతను పొందటమనేదే ఆ ధ్యాన పద్ధతి.

21. గౌతముడీ ప్రక్రియను నేర్చాడు. శ్వాసను నిలిపి, ఏకాగ్రతను పొంద ప్రయత్నం చేసినప్పుడు, పోటు కలిగించే శబ్దాలు చెవుల నుండి బయల్వెడలు తున్నట్లు, వాడిమొనగల కత్తి తన శిరస్సులోనికి చొచ్చుకుపోతున్నట్లు అనిపించింది.

22. అది చాలా బాధాకరమైన ప్రక్రియ అయినా దాన్ని సాధించడంలో గౌతముడు విఫలమవ్వలేదు.

23. అదీ సమాధిమార్గంలో అతడు పొందిన శిక్షణ.

# 4. వైరాగ్యమార్గ సాధన

1. సాంఖ్య సమాధి మార్గాలను గౌతముడు పరీక్షించాడు. కానీ వైరాగ్యమార్గాన్ని చూడకుండానే, భృగు ఆశ్రమాన్ని వదలి పెట్టాడు.

2. దాన్ని కూడా స్వయంగా పరీక్షించి స్వానుభవం పొందాలనీ, అప్పుడే దాని గురించి సాధికారంగా చెప్పగలనని అతడు భావించాడు.

3. అవిధంగా, గౌతముడు గయ అనే పట్టణానికి చేరుకున్నాడు. చుట్టూవున్న ప్రాంతమంతా పరిశీలించి, వైరాగ్యమార్గసాధన కొరకు ఉరువేల వద్దనున్న నేగరుని ఆశ్రమంలోని నివాసమేర్పరచుకున్నాడు. ఆయన గయకి చెందిన రాజర్షి. వైరాగ్య సాధనకై ఎన్నుకున్న నైరంజ నదీ తీరప్రాంతాన ఒక నిర్జన

4. పూర్వం రాజగ్రహాలో తనను కలిసి, శాంతి వార్తను అందించిన ఆ అయిదుగురు పరివ్రాజకులను, ఉరువేల వద్ద అతడు చూసాడు. వారు కూడా వైరాగ్య సాధన చేస్తున్నారు.

5. ఆ భిక్షులు అతనినక్కడ చూసి , తమతో పాటు తీసుకొని వెళ్ళేందుకు సమీపించారు. గౌతముడు అందుకంగీకరించాడు.

6. ఆపై, ఆజ్ఞానువర్తులైన శిష్యులవలె, వినయ విధేయతలతో, భక్తి ప్రపత్తులతో అతనికి సేవలందించారు.

7. గౌతముడు సాధన చేసిన కఠోర విధులు, శరీర పోషణలు చాలా కఠినమైనవి.

8. ఒక్కొక్కసారి, ప్రతి రోజు అతడు రెండు గానీ, ఏడిండ్ల కంటే తక్కువ ఇళ్ళకు గాని వెళ్ళి ప్రతిచోట రెండు గానీ, ఏడు కంటే ఎక్కువ కాకుండా గానీ కబళాలను మాత్రమే స్వీకరించేవాడు.

9. రోజూ ఒక చిన్న పళ్ళెరంతో ఆహారం, ఏడు అలాంటి పళ్ళెరాలకు మించకుండా తిని జీవించేవాడు.

10. ఒక్కొక్కసారి, రోజుకొకసారే గానీ, రెండ్రోజుల కొకసారి గాని, వారానికి ఒకసారి గాని, పక్షానికొకసారి గాని, యిలా ఆహారాన్ని దారుణంగా తగ్గించుకునేవాడు

11. వైరాగ్యసాధనలో యింకా ముందు కెళ్ళిన తర్వాత, పచ్చని మూలికలు గాని, ధాన్యమూ, కొండజొన్న గింజలు గానీ, గింజలపై తీసిన పొట్టును గానీ, నీటి మొక్కలను గానీ, గంజిని గాని, నూనెగింజల పిండిని గానీ తింటూ వుండేవాడు.

12. ఫలాలను, కంద మూలాలను, గాలికి రాలిన కాయలను తిని జీవిస్తూ వుండేవాడు.

13. చెత్త కుప్ప నుండి సేకరించిన గుడ్డ పీలికలు ,చెట్ల బెరడులు లేక వాటి బద్దీలు, పూర్తిగా లేక మధ్యకు చీల్చబడిన నల్ల జింక చర్మం, ఆయన దుస్తులు, మనుష్యకేశాలు, జంతు రోమాలు, గుడ్లగూబ రెక్కలు మొదలైన వాటితో కలిపి నేసినవి ఆయన దుప్పట్లు.

14. తన శిరోజాలను, గడ్డాన్ని పీక్కుని, నేలపై నిటారుగా కూర్చొని, ఎప్పుడూ లేవకుండా అలా దేకుకుంటూనే అటూయిటూ వెళ్ళసాగాడు.

15. ఈ విధంగా వివిధ పద్ధతులలో అతని శరీరాన్ని అనేక యాతనలకు గురిచేశాడు. ఇంతటి కఠోర వైరాగ్యాన్ని అతడు సాధన చేశాడు.

16. అతనెంత అసహ్యకరదశకు చేరుకున్నాడంటే, అతని శరీరముపై సంవత్సరాల తరబడి పేరుకుపోయిన, దుమ్ము, ధూళి, మలినాలు కరడుగట్టి, బెరడులాగా మారి, వాటికవే విడి పడుతుండేవి

17. భయంతో రోమాలు నిక్కపొడవకుండా పరమ మూర్ఖులు మాత్రమే వెళ్ళ సాహసించే భయంకర కీకారణ్యమనే పేరు గాంచిన అరణ్య మధ్యభాగాన్ని తన నివాసంగా చేసుకున్నాడు.

18. వెన్నులో వణుకు పుట్టించే శీతాకాలంలో, చీకటి రాత్రులు బహిరంగ ప్రదేశంలోను పగటిపూట దట్టమైన తుప్పలలోను గడిపేవాడు.

19. వర్షాలముందు, నిప్పులు కురిసే వేసవిలో, పగలు మండుటెండల్లోను, రాత్రి సమయాలు గాలి కూడా ఆడని తుప్పలలోను జీవించాడు.

20. సగమేకాలి మసిబట్టిన ఎముకలను తల దిండుగా చేసుకొని స్మశానంలో అతడు నిద్రించేవాడు.

21. ఆపై రోజు ఒకే ఒక చిక్కుడు గింజను గాని; ఒక నువ్వు గింజనుగానీ, ఒక బియ్యపు గింజగాని తిని జీవిస్తూ వుండేవాడు.

22. రోజు ఒకే ఒక పండు తినిఉండటం వలన అతని శరీరం చాలా తీవ్రంగా శుష్కించి పోసాగింది.

23. అతడు తన కడుపును చూసుకోవాలి అనుకున్నప్పుడు అతనికి తన వెన్నెముకే కన్పించేది. వెన్నెముకను గుర్తించాలనుకుంటే, అతనికి తన వుదరం కన్పించేది అంత దగ్గరగా అతని వుదరం వెన్నెముకకు అంటుకుని వుండేది. అతడు అంత తక్కువ తినేవాడు కనుక.

# 5. వైరాగ్యసాధన విరమించడం

1. గౌతముడు పాటించిన నియమాలు, శోషణలు ఎంతో కఠోరమైనవి. అతడు వాటిని ఆరు సంవత్సరాలు పాటు పాటించాడు.

2. ఆరు సంవత్సరాలు గతించే సమయానికి, ఏ మాత్రం కదలలేనంతగా అతని శరీరం నీరసించి పోయింది.

3. అయినప్పటికీ, అతనికేవిధమైన నూతన కాంతి కన్పించ లేదు. లోకంలోని దుఃఖాల సమస్యకు తగిన తరుణోపాయాన్ని సాధించాలని దృఢ మనస్కుడైన అతనికి, తన లక్ష్యసాధనలో ఏ మాత్రం ప్రగతి లభించలేదు.

4. "మోహ రహిత స్థితిని గానీ, సంపూర్ణ జ్ఞానాన్నిగానీ, ముక్తిని కానీ పొందే మార్గం యిది కాదు" అని తనలో తాను నిశ్చయించుకున్నాడు.

5. కొందరు ఇహలోకం గురించి బాధలను అనుభవిస్తారు. మరి కొందరు స్వర్గానికి చేరుకోవాలని హింసల ననుభవిస్తారు. అయితే గురి తప్పి, అన్ని జీవరాసులూ, సుఖ సంతోషాలకోసమని ఆశతో దుఃఖసాగరంలో పడితీరతారు.

6. అటువంటిదే నాకు కూడా జరిగిందేమో?
7. అటువంటి ప్రయత్నాన్ని మాత్రమే కాదు నేను నిందించేది - అది ఆధారాన్ని పక్కన విసరి పైకి పాకాలంటుంది.
8. "శరీరాన్ని హింసకులోను చేయడాన్నే మతం అంటారా?" అని నేనడుగుతాను.
9. శరీరం పని చేయడానికి, మాని వేయడానికీ మూల కారణం మనస్సు ప్రభావమే! కాబట్టి మన ఆలోచనలను అదుపులో పెట్టుకోవడమే యోగ్యతైనది. ఆలోచన లేకుండా శరీరం కుక్కతో సమానం .
10. శరీరాన్ని గురించి మాత్రమే ఆలోచిస్తే శుచి అయిన ఆహారాన్ని తీసుకోవడం వలన లాభం కలగవచ్చు. కాని అప్పుడు యోగ్యత కర్తకు కూడ చెందుతుంది. దాని వల్ల ఏమిటి ప్రయోజనం?
11 ఆకలి, దప్పిక అలసటతో అలమటించి, బలహీనుడై, నీరసించి, తన అదుపులో లేని మనస్సుతో ఎవరైనా వినూత్నకాంతి నెలా పొందగలరు?
12. మనస్సులో ప్రశాంతత లోపించిన వాడు, మనస్సుతో చేరవలసిన గమ్యాన్ని ఎలా సాధించగలడు?
13. శారీరకమైన కోరికలను నిరంతరం తీర్చగలిగినప్పుడే నిజమైన ప్రశాంతత, మానసిక స్థిరత్వం పొందగలడు.
14. ఆకాలంలో. ఉరువేలలో సేనాని అనే ఒక గృహస్థు నివసిస్తూ వుండేవాడు. అతని కుమార్తె సుజాత.
15. సుజాత మర్రి చెట్టు నొక వరం కోరింది. తనకు ఒక కుమారుడు కలిగితే ప్రతి సంవత్సరం మొక్కు తీరుస్తాను అని మ్రొక్కుకుంది.
16. అమె కోరిక నెరవేరింది. పూజ చేయడానికి ఆ ప్రదేశాన్ని సిద్ధం చేయడానికై తన పనికత్తె పున్నను పంపింది.
17. ఆ మర్రిచెట్టు క్రింద కూర్చొనివున్న గౌతముని గాంచిన పున్న పైనించి దిగివచ్చిన వృక్షదేవునిగా అతనిని భావించింది.
18. సుజాత వచ్చి ఆమె చేసిన ఆహారాన్ని బంగారు గిన్నెలో వడ్డించి గౌతమునికి అర్పించింది.
19. అతడా గిన్నెను తీసుకుని నది ఒడ్డుకు వెళ్ళి, సుప్పాతితీతమనే స్నానఘట్టంలో స్నానం చేసి , ఆహారాన్ని భుజించాడు.
20. ఆ విధంగా అతని వైరాగ్యసాధన ముగిసింది.
21. గౌతమునితోవున్న ఐదుగురు విరాగులు అతడు నియమబద్ధ జీవితాన్ని, విధానాన్ని విడనాడినందుకు కోపోద్రిక్తులై, అతన్ని రోసి వెళ్ళిపోయేరు.

## నాలుగవ భాగం
# జ్ఞానోదయం వినూత్నమార్గ దర్శనం

1. వినూత్నకాంతికై ధ్యానం
2. జ్ఞానోదయం
3. వినూత్న ధమ్మం కోరడం
4. బోధిసత్వుడైన గౌతముడు "సమ్మాబోధి " అనంతరం బుద్ధుడు కావడం

# 1 వినూత్న కాంతికై ధ్యానం

ఆ ఆహారంతో ఆకలి తీర్చుకున్న గౌతముడు, తన పూర్వ అనుభవాల గురించి ఆలోచిస్తూ కూర్చున్నాడు. ఆ మార్గాలన్నీ విఫలమైనవని అతడు గుర్తించాడు.

అవి ఎంత పూర్తిగా విఫలమైనవి అంటే, వాటిననుసరించిన వారికి విరక్తి కలుగుతుంది. కాని అలాంటిదేమీ అతనికి కలుగలేదు. కాని కొంచెం విచారం కల్గింది.

ఒక మార్గం దొరుకుతుంది అని అతడెప్పుడూ ఎంతో ఆశతో వుండేవాడు. ఎంత నమ్మకంతో వుండేవాడంటే, సుజాత పంపిన ఆహారాన్ని తిన్న ఆనాటి రాత్రి నిద్రలో గౌతమునికి అయిదు కలలు వచ్చాయి. నిద్ర లేచి ఆ కలలను అన్వయించుకోగా, జ్ఞానోదయం తప్పక పొంద గలననే దృఢవిశ్వాసం గౌతమునిలో కలిగింది.

4. తన భవిష్యత్తు ఎలా వుంటుందోనని తెలుసుకో ప్రయత్నించాడు. ఏ విధంగా అంటే, సుజాత సేవకురాలు ఆహారంతో తెచ్చిన గిన్నెను `నైరంజన' నదిలోనికి విసరివేసి; "నాకే గనక జ్ఞానోదయం కలిగే పక్షంలో, ఈ గిన్నె మునుగకుండా, జల ప్రవాహానికి ఎదురుగా వెళ్ళుగాక, అలా కాని పక్షంలో అది మునిగి పోవుగాక" అని అన్నాడు. నిజంగానే ఆ పాత్ర నదీజల ప్రవాహానికి ఎదురేగి చివరికి నాగరాజైన కాలుని నివాసం వద్ద మునిగిపోయింది.

5. ఆశ, ఆశయాలు మరింత బలపడగా, ఉరువేలను వదలి, సాయంత్రమయ్యేసరికి, గయకు చేరే విశాలరహదారి గుండా వెళ్ళాడు. అక్కడ ఒక మర్రిచెట్టును చూసాడు. తన సమస్యకు ఒక పరిష్కార మార్గాన్ని కనుగొనడానికై తనపై ఏదైనా వినూత్న కాంతి వుదయిస్తుందేమోననే ఆశతో, ఆ మర్రిచెట్టు క్రింద కూర్చొని ధ్యానంచేయ సంకల్పించాడు.

5. నాలుగు దిక్కులలో ప్రతీ దానిని పరీక్షించిన తర్వాత, ఆ పవిత్రతను క్షాళన చేయడానికై మహర్షులందరూ ఎన్నుకున్న తూరుపు దిశనే గౌతముడు కూడా తన ధ్యాన సాధనకు ఎంచుకున్నాడు.

7. గౌతముడు పద్మాసనం వేసుకుని, నిటారుగా ఆ మర్రిచెట్టు క్రింద కూర్చున్నాడు. జ్ఞానోదయ సిద్ధికై దృఢనిశ్చయంతో తనలోతాను ఇలా నిర్ణయించుకున్నాడు : "నా చర్మం, కండరాలు, ఎముకలూ, హరించుక పోయినా, నా శరీరంలోని మాంసం, రక్తమూ ఆర్చుకు పోయినా సరే, సంపూర్ణ జ్ఞానోదయం సిద్ధించేవరకు, యీ చోటును నేను వదలి వెళ్ళేదిలేదు."

8. గజేంద్రుని వంటి ఘనప్రతాపము గలిగిన నాగుల రాజు, కాలుడు, అతని భార్య సువర్ణ ప్రభాస మర్రిచెట్టు క్రింద ఆసీనుడై వున్న గౌతముని గాంచి ప్రభావితులై, అతనికి తప్పకుండా జానోదయం కలిగి తీరుతుందన్న దృఢ విశ్వాసంతో యిలా కీర్తించారు.

"ఓ మహాముని! నీ పాదాల క్రింద యీ భూమి వున్నంత కాలమూ అది నీ నామాన్ని ప్రతిధ్వనిస్తూనే వుంటుంది. సూర్యతేజస్సుతో నీ వైభవం ప్రకాశిస్తూనే వుంటుంది. నీవు నిశ్చయంగా ఆశించిన ఫలాన్ని పొందగలవు."

10. ఓ పద్మనేత్రుడా! పక్షుల సమూహం ఆకాశంలో ఎగురుతూ నీకు గౌరవ వందనం చేస్తున్నంత కాలము, ఆకాశంలో సుతారంగా గాలి వీస్తున్నంత కాలము, నీ ధ్యేయాన్ని నీవు తప్పక పొందగలవు."

11. అతడు ధ్యానానికి కూర్చొనగానే, చెడు ఆలోచనలు, తుచ్ఛ మోహాలు అతని మనస్సులోనికి ప్రవేశించాయి. వీటినే పౌరాణిక కధలలో మారుని కుమారులని అంటారు.

12. అవి తనపై ప్రభావాన్ని చూపి, తనను లోబరచుకుని, తన ధ్యేయ సాధనలో విఫలునిగా చేస్తాయేమోనని గౌతముడెంతగానో భయపడ్డాడు.

13. ఈ వాంఛలతో పోరాడి యిదివరలో ఎందరో మహర్షులు, బ్రాహ్మణులు ఓడి పోయారు అన్న విషయం అతనికి తెలుసు.

14. తనలో వున్న ధైర్యాన్నంతటినీ కూడగట్టుకుని, మారుని వుద్దేశించి, " నాలో విశ్వాసం, శౌర్యపరాక్రమాలు జ్ఞానం వున్నాయి. నీ కామప్రలోభాలు ఏ విధంగా నన్ను లోబరచుకోగలవు? నదుల్లోని నీరు, ఈ గాలి, హరించి పోవచ్చు- గానీ, నా దృఢ నిశ్చయాన్ని మాత్రం నీవేవిధంగానూ హరించలేవు. నేనంతగా స్థిర సంకల్పంతో వున్నాను. నేను జీవితంలో పరాజితుడను కావడం కంటే, నాకు యుద్ధంలో వీర మరణమే మేలు." అని అన్నాడు.

15. క్రొవ్వు ముద్దలా కన్పించే దొర్లుతున్న రాయిని చూసిన కాకి, "ఇక్కడ నాకు ఒక మంచి ఆహారం దొరుకుతుంది, బహుశా, తీపివస్తువై వుండవచ్చు" అని ఊహించుకుంటూ, దాని వెంటపడిన విధంగా, అతని మనస్సులోనికి దుష్ట ప్రలోభాలు చొరబడ్డాయి.

16. అక్కడ ఏ విధమైన తియ్యదనమూ కన్పించక పోవటంతో, అక్కడి కాకి ఎగిరిపోతుంది. ఆ విధంగా రాతిని వెంబడించిన కాకిలా, చెడ్డ ప్రలోభాలు నిరాశతో గౌతముని వదలి వెళ్ళిపోయాయి.

## 2. జ్ఞానోదయం

1. ధ్యానసాధనకాలంలో ఆకలి తీర్చుకోవడానికై నలభై రోజులకు సరిపడే ఆహారాన్ని సమకూర్చుకున్నాడు.

2. తన మనస్సును చీకాకుపరచిన చెడు ఆలోచనల నన్నింటినీ పారద్రోలి, గౌతముడు ఆకలి తీర్చుకుని, సత్తువ తెచ్చుకుని, అలసట తీర్చు కున్నాడు. జ్ఞానోదయాన్ని పొందాలనే సంకల్పంతో ధ్యానసాధనకు వుద్యుక్తుడయ్యాడు.

3. నాలుగు వారాల ధ్యానసాధన తర్వాత గౌతమునికి జ్ఞానోదయం అయింది. నాలుగు దశలలో అతడు సంపూర్ణ జ్ఞానోదయాన్ని పొందాడు.

4. మొదటి దశలో అతడు హేతువును శోధనను చేపట్టాడు. అతని ఒంటరితనం దానిని సులభంగా పొందటానికిక దోహదపడింది.

5. రెండవ దశలో అతడు ఏకాగ్రతను కూడా దానికి జోడించాడు.

5. మూడవ దశలో సమచిత్తం, అప్రమత్తతలను తన సహాయానికై వినియోగించాడు.

7. చిటచివరి నాలుగవ దశలో స్వచ్ఛతను సమచిత్తానికి, సమచిత్తాన్ని అప్రమత్తతకు అనుసంధించాడు.

8. ఆ విధంగా చెదరని, శుద్ధమైన, కల్మష దూరమై స్నిగ్ధమైన, అనువర్తితమైన, కుశలమూ ధృఢమూ అయి ఉద్విగ్నభరమైన మనస్సుతో - తన లక్ష్యమెన్నడూ విస్మృతిలో పడకుండా, గౌతముడు తనని కలవరపరుస్తున్న సంశయం నివృత్తి చేసుకునేందుకు ధ్యానమగ్నుడయ్యాడు.

9. నాలుగవ వారంలో చివరి రోజు రాత్రి అతనిపైకి జ్ఞానోదయం కలిగింది. రెండు సమస్యలు ఉన్నాయని అతడు గుర్తించాడు. మొదటిది ఈ ప్రపంచంలో దుఃఖం ఉన్నదనేది. రెండవది ఈ దుఃఖాన్ని ఎట్లా దూరం చేసి మానవాళికి సుఖశాంతులు అందచెయ్యాలి అని.

0. చిట్ట చివరికి, నాలుగు వారాలపాటు ధ్యానంచేయగా, అంధకారం తొలగిపోయి, కాంతి ఉదయించింది; అజ్ఞానం తొలగిపోయి జ్ఞానం ఉద్భవించింది. అతడు ఒకవినూత్న మార్గాన్ని దర్శించాడు.

# 3. వినూత్న ధర్మము కనుగొనుట

1. వినూత్న కాంతిని పొందడానికి గౌతముడు ధ్యానంలో కూర్చునేటప్పటికి అతనిపై సాంఖ్య ప్రభావం ఎక్కువగా వుండేది.

2. బాధలను; ఆవేదనలను ఈ లోకంలో అనుభవించక తప్పదు అనేది నిర్వివాదాంశమని అతడు గ్రహించాడు.

3. వాటినేవిధంగా నివారించాలో తెలుసుకోవాలని గౌతముని ఆకాంక్ష. సాంఖ్యం యీ విషయాన్ని ప్రస్తావించలేదు.

4. కాబట్టి "ఈ బాధలను, ఆవేదనలను ఏవిధంగా ఆధిగమించాలి" అనే సమస్య పట్ల అతడు తన మనస్సును కేంద్రీకరించాడు.

5. "ప్రతి వ్యక్తీ అనుభవించే బాధలకు, ఆవేదనలకు గల కారణాలేమిటి ? "అని

సహజంగా మొట్టమొదటిగా తనలో తాను ప్రశ్నించుకున్నాడు.

6 "ఈ విషాదాన్ని ఏ విధంగా నిర్మూలించాలి అనేది అతని రెండవ ప్రశ్న.

7 "సమ్మాబోధి" అనేదే ఈ రెండు సమస్యలకూ పరిష్కార మార్గం అనే సమాధానాన్ని పొందాడు.

8 అందువల్లనే ఆ మర్రి చెట్టుకు బోధి వృక్షమనే పేరు వచ్చింది.

# 4. బోధిసత్వుడైన గౌతముడు "సమ్మాబోధి" అనంతరం బుద్ధుడు కావడం

1 జ్ఞానసిద్ధికి పూర్వం గౌతముడు బోధిసత్వుడు మాత్రమే. జ్ఞానోదయం పొందిన తర్వాత అతడు బుద్ధుడయ్యాడు.

2 బోధి సత్వుడనగా ఎవరు? బోధిసత్వమనగా ఏమి?

3 బుద్ధుడు కాగోరు వ్యక్తి బోధిసత్వుడు.

4 బోధిసత్వుడు బుద్ధునిగా ఎలా అయ్యాడు?

5 బోధిసత్వుడైన వాడు వరుసగా పది జన్మల పాటు బోధిసత్వునిగా వుండాలి. బుద్ధుడు కాగల అర్హతను పొందాలంటే ఏం చేయాలి?

6 తొలి జన్మలో, అతడు "ముదిత" ఆనందము పొందుతాడు. రజితకారుడు ముందు వెండిలోని మలినపూర్వపదార్థాలను తొలగించి కరగించినట్లుగా బోధిసత్వుడు నిర్మలుడవుతాడు. మబ్బులు తొలగిన చంద్రుడు ప్రకాశించినట్లు, ప్రమత్తుడు ప్రశాంత చిత్తుడుగా మారతాడు. దీనిని గుర్తించిన అతనిలో ఆనందము వెల్లివిరియగా అందరికీ సుఖం కలుగ చెయ్యాలనే గాఢమైన కోరిక అతనిలో కలుగుతుంది.

7 అతని రెండవ జన్మలో, "విమల" (స్వచ్ఛత)ను పొందుతాడు. బోధిసత్వునిలో కామపూరితమైన ఆలోచనలు యిప్పుడు తొలగిపోతాయి. అతడు దయాళువు. అందరి పట్ల కరుణగలవాడు. మనుష్యులలోని దుర్గుణాలను పొగడటంగాని వారి గుణగణాలను కించపరచటం గానీ చేయడు.

8 అతడు మూడవ జన్మలో "ప్రభాకరి" తేజస్సు సాధిస్తాడు. బోధిసత్వుని వివేకమిప్పుడు అద్దమంత ప్రకాశవంతంగా మారుతుంది. తాను పూర్తిగా తెలిసిన వాడై, అనాత్మ, అనిత్య, సత్యాలను సులువుగా గ్రహించగలడు. అత్యున్నత జ్ఞానాన్ని పొందటమే అతని ఏకైక వాంఛ. దానికై దేనినైనా త్యాగం చేయడానికి అతడు సిద్ధమే.

9. అతని నాలుగవ జన్మలో "అర్చిష్మతి" సాధిస్తాడు. ఈ జీవితంలో బోధిసత్వుడు అష్టాంగమార్గం పైన తన మనస్సు నిలిపి వుంచుతాడు.

10. అతని అయిదవ జన్మలో "సుదుర్జయ" అజేయస్థితిని పొందుతాడు. నిరపేక్ష, సాపేక్ష అంశాల మధ్యగల సంబంధాన్ని పూర్తిగా అర్థం చేసుకోగలుగుతాడు.

11. అతని ఆరవ జీవితంలో "అభిముఖి"గా మారతాడు. ఈ దశలో, పదార్ధ వికాసం, వాటి కారణాలు, ద్వాదశ నిదానాలను గురించి పూర్తిగా గ్రహించ గలుగుతాడు. అభిముఖి అనే యీ జ్ఞానమే ఆ విద్యతో అంధులయిన వారి నందరిపట్లా అతని హృదయంలో అనంతమైన దయాదాక్షిణ్యా లను కలిగిస్తుంది.

12. అతని ఏడో జీవనంలో "దూరం గమ"గా మారతాడు. బోధిసత్వుడిప్పుడు కాలానికి, స్థలానికి అతీతుడవుతాడు. అనంతంతో ఏకమైనప్పటికి అందరిపట్ల అతనికున్న అవ్యాజానురాగాల వలన నామరూపాలతోనే వుంటాడు. తామరాకుపై నీటి బిందువులాగా అతనికి ప్రపంచంలోని ఏ వాంఛలూ అంటనివిధంగా, అతడు మిగతా వారి నుండి విడిగా వుంటాడు. అతని చుట్టూనున్న వారి కోరికలు తీరుస్తాడు ; దానం, ఓర్మి, యుక్తి, శక్తి, ప్రశాంతత, అత్యున్నత అతడు ప్రసరిస్తాడు.

13. ఈ జీవితంలో వుంటుండగానే, అతనికి ధర్మం గురించి తెలుస్తుంది. ప్రజలందరికీ సులభంగా అర్థమయ్యేరీతిలో అతడు చెప్తాడు. తను యుక్తితోను, సహనంతోనూ మెలగాలి అని అతనికి తెలుసు. ఎవరైనా అతని పట్ల ఏ విధంగా ప్రవర్తించినా, ఏమి చేసినా, శాంతమూర్తుడై దానిని భరిస్తాడు. ఎందుకంటే, వారు తమ అజ్ఞానం వలన తన లక్ష్యాలను అపార్థం చేసుకున్నారనిపైగా, నలుగురికీ శ్రేయం కూర్చటంలో అలసత్వం చూపడు. జ్ఞానాన్నుంచి మనస్సును మరల్చడు. అందువల్లనే దురదృష్టం అతనిని సత్యమార్గమునుండి ఏ మాత్రం మరల్చలేదు.

14. ఎనిమిదవ జన్మలో, అతడు "అచలు"డవుతాడు. ఈ అచల స్థితిలో, బోధిసత్వునిలో వుండే అన్ని ప్రయాసలు దూరమవుతాయి. అతడు ఆ కారణంగా మంచినే అనుసరిస్తాడు. తను చేసే ప్రతిప్రయత్నంలోనూ కృతకృత్యుడవుతాడు.

15. తొమ్మిదో జన్మలో, అతడు "సాధుమతి" అవుతాడు. ఈ స్థితిని పొందిన వ్యక్తి సకల ధర్మాలను, శాస్త్రాలనూ తరచిచూస్తాడు.

16. అతని దశమ జన్మలో "ధర్మమేఘు"నిగా మారతాడు. ఈ దశలో బోధిసత్వుడు, బుద్ధుడై అనంత దివ్యదృష్టిని పొందుతాడు

17. బుద్ధునిగా మారినప్పుడు అతనికి వుండవలసిన ఈ పది శక్తులు బోధిసత్వునికి సమకూరుతాయి.

18. బోధిసత్వుడు తనకి దశలవారీగా సంక్రమించిన యీ పది శక్తులనూ పొందటమే

కాకుండా, యీ పది "పారిమితు"లలో సంపూర్ణత్వం సిద్ధించేవరకూ సాధన చేయాలి.

19. ఒక్కొక్క `పారమిత' ఒక్కొక్క జీవనంతో అంతమవుతుంది. పారమితలలో ప్రత్యేక అధ్యయనం క్రమపరిణామంగా జరగాలి. ఒక్కొక్క పారమితకు ఒక జీవితకాలం పడుతుంది. అంతేగాని ఒక జన్మలో దానిలో కొంత, దీనిలో కొంత వుండరాదు.

20. బోధిసత్వుడు బుద్ధునిగా మారడానికి యోగ్యత ఈ శక్తులను ద్విగుణీకృతం చేసుకోవడంవలననే కలుగుతుంది.

21. జాతక సిద్ధాంతం లేక బోధిసత్వుని జన్మదశలను పరిశీలిస్తే బ్రాహ్మణసిద్ధాంతమైన దేవుని అవతారాలకు పోలిక వున్నట్లు దృగ్గోచరమవుతుంది.

22. తన జీవన సారాంశముగా అత్యున్నత పరిశుద్ధ స్థాయిని బుద్ధుడు కలిగి వుండుట జాతక సిద్ధాంతం ఆధారపడివుంది.

23. అవతార సిద్ధాంతం ప్రకారం దేవుని జన్మ నిర్మలంగా వుండాలని లేదు. బ్రాహ్మణ సిద్ధాంతంలో అవతారాల గురించి చెప్పేది ఏమిటనగా దేవుడు స్వచ్ఛంగా నీతిగా లేక పోయినా, అతని అనుచరులను మాత్రం వివిధ రూపాల్లో సాక్షాత్కరించి రక్షిస్తూ వుంటాడు, అని.

24. బోధిసత్వుడు బుద్ధునిగా మారాలంటే ముందుగా పది జన్మలు ఎత్తాలనే నిబంధన ఉన్నట్టు ఏ సిద్ధాంతంలోనూ చెప్పిన దృష్టాంతరాలు లేవు. ఏమతమూ ఆమతప్రవక్తను ఇటువంటి ప్రశ్నకు సమాధానం చెప్పమని ప్రశ్నించదు.

# ఐదవ భాగము

# బుద్ధుడు - అతనికి ముందు వారు

1. బుద్ధుడు - వైదిక ఋషులు
2. తత్త్వవేత్త కపిలుడు
3. బ్రాహ్మణాలు
4. ఉపనిషత్తులు - వాటి బోధనలు

# 1. బుద్ధుడు - వైదిక ఋషులు

1. మంత్రాల సంకలనమే వేదాలు. మంత్రాలంటే ఋక్కులు ఈ ఋక్కులను వల్లించే వారిని ఋషులు అంటారు.

2. ఇంద్రుడు, వరుణుడు, అగ్ని, సోముడు, ఈశన, ప్రజాపతి, బ్రహ్మ, మహిద్ధి, యముడు మొదలైన దేవగణాల ప్రార్థనలే ఈ మంత్రాలు.

3. శత్రుబారి నుండి రక్షణ కల్పించమని సిరిసంపదలను ప్రసాదించమని, భక్తులు అర్పించే ఆహారం మాంసం మద్యములను స్వీకరించమని చేసే ప్రార్థనలే ఈ మంత్రాలు.

4. ఈ వేదాలలో తాత్త్వికత అంతగా లేదు. కాని కొందరు ఋషులు వీటిని తాత్త్విక దృష్టితో చూసే ప్రయత్నం చేసారు.

5. ఆ వైదిక ఋషులు అగమార్షనుడు, 2. ప్రజాపతి పరమేష్ఠి, 3. బ్రహ్మణస్పతి, బృహస్పతి అనికూడా అంటారు. 4. అనిలుడు 5. దీర్ఘ తమస్సుడు, 6. నారాయణుడు 7.హిరణ్యగర్భుడు, 8. విశ్వకర్మ.

6. ఈ లోకమెలా ఉద్భవించింది? ఈ సమస్త జీవరాసులూ ఎలా సృష్టించబడ్డాయి. అవి ఐకమత్యంగా కలిసి ఎలా మనగలుగుతున్నాయి. వీటి సృష్టికర్త ఎవరు? వీటిని నియంత్రించి, పాలించేవారు ఎవరు? ఈ ప్రపంచమంతా దేనినుండి ఆవిర్భవించింది? తిరిగి చివరకు అది దేనిలో లీనమయి పోతుంది? ఇవీ ఆ వైదిక ఋషుల తాత్త్విక చింతనలకు సమస్యలకు మౌలికమైన ప్రశ్నలు.

7. ఈ ప్రపంచమంతా తాప ం (ఉష్ణం) నుండి సృజింపబడింది. అనేది ఆగుమార్షణుని ఉవాచ. అనంత సృష్టిలోని ప్రకృతి నియమాలకు, సత్యానికి మాతృక, సృజనాత్మక సూత్రం ఈ తామసమే! వీటినుండే రాత్రి (తమస్సు) ఉద్భవించింది. తమస్సు నీటిని సృష్టించింది. నీటి నుండి కాలం ఉద్భవించింది. ఆ కాలమే సూర్యచంద్రులను, స్వర్గాన్ని, ధరిత్రిని, ఆకాశాన్ని, వెలుతురును సృజించి-రాత్రింబవళ్ళను నియంత్రించింది.

8. శూన్యం నుంచి యీ సృష్టి ఏర్పడిందన్నది బ్రాహ్మణస్పతి సిద్ధాంతం. ఏమీ లేనిది అంటే అతని దృష్టిలో అనంతమని అర్థం. ఏమీలేని దాని (అసత్) నుండి ఈ ఉన్నది (సత్) ఏర్పడిందని, ఈ ఏమీలేని స్థితియే, ఉన్నది అన్నదానికి సాధ్యమై ఉండబోయే దానికి మూల స్థానమని అతడు బోధించాడు.

9. ఏమీలేని దాని నుండి, ఉన్నది అనేది ఎలా వచ్చింది? అనే ప్రశ్నలో ప్రజాపతి పరమేష్టి తన వాదనను మొదలు పెట్టాడు. ఇది చాలా అసంబద్ధమైన వాదమని అతని ఉద్దేశ్యం.

ఈ సృష్టికి మూలపదార్థం నీరేనని అతడంటాడు. ఏమీలేని దాని నుండి గానీ, లేక ఉన్న దాని నుండి గానీ ఈ నీరు వచ్చింది గానీ యిదమిద్ధంగా ఈ రెంటిలో ఏ ఒక్కదాని నుంచే వచ్చి ఉండదు అని అతని అభిప్రాయం.

10 పదార్థానికీ, ప్రేరణాశక్తికీ, ఏ వ్యత్యాసాన్నీ పరమేష్టి చూపలేదు. అతని ఊహ ప్రకారం - ఒకానొక అంతర్నిహిత సూత్రాన్ననుసరించి నీరు జీవరాసులుగా రూపాంతరం చెందింది అంటాడు. దానికి ఆయన విశ్వపరివాంఛ, "కామ" అని పేరు పెట్టాడు.

11 అనిలుడు మరొక వైదిక తాత్త్వికుడు. అతడు ఈ సృష్టిలోని పంచభూతాల్లో ప్రధానమైనది గాలి అంటాడు. దానికి చలనశక్తి సహజసిద్ధంగా ఉంది. దాని వలననే ఈ సృష్టి అంతా జరిగింది అంటాడు.

12 సమస్త ప్రాణికోటి సూర్యునిపైననే ఆధారపడి చివరికి సూర్యునిలోనే అంతమవుతాయి అంటాడు. స్వచలనశక్తివలననే సూర్యుడు ఆకాశంలో ఉండి ముందుకు, వెనుకకు పయనిస్తున్నాడు అంటాడు దీర్ఘతామసుడు.

13 బాడబవర్ణంగల పదార్థంతో ఈ సూర్యుడు ఏర్పడ్డాడనీ, అందుకే మెరుగులు, మంటలు పుట్టుతున్నాయని అంటాడు.

14 వాయువు, మెరుపులు, అగ్ని వలన జలబీజం ఏర్పడిందనీ, నీటి నుండే మొక్కలు మొలకెత్తాయి అనేది దీర్ఘతామసుని అభిప్రాయాలు.

15 నారాయణుని సిద్ధాంతం ప్రకారం పురుషుడే (దేవుడు) ఈ విశ్వసృష్టికి మూలకారకుడు. పురుషుని నుండే సూర్యచంద్రులు, భూమి, నీరు, అగ్ని,గాలి, సుడిగాలులు . ఆకాశం, దిక్కులు, ఋతువులు, గాలిలో ఎగిరే కీటకాలు, సకల జంతుజాలం, వివిధ వర్ణాల మానవులు, మానవవ్యవస్థలూ, ఉద్భవించాయి.

16 పరమేష్టి సిద్ధాంతానికీ, నారాయణ సిద్ధాంతానికీ మధ్యస్థంగా ఉంటుంది. హిరణ్యాగర్భుని సిద్ధాంత దృక్పథం. హిరణ్యాగర్భ అంటే బంగారు బీజమని అర్థం. అదే ఈ ప్రపంచం యొక్క మహోన్నత శక్తి అనీ, దాని నుండే మిగిలిన శక్తులు, సర్వ జీవరాసుల సృష్టి, దైవ ప్రాపంచిక శక్తులు ఉద్భవించాయి అంటాడు.

17 హిరణ్యాగర్భుడు అంటే అగ్ని అని కూడా అర్థం. ఆ అగ్ని నుండియే సూర్యప్రకాశం వచ్చిందనీ, అదే ఈ ప్రపంచ సృష్టికి మూలసూత్రమని అతని ఉవాచ.

18 విశ్వకర్మ దృక్పథంలో, విశ్వసృష్టికి నీరే మూల పదార్థమనడం అసమంజసమనీ, అదే నిజమైతే, ఆ నీటికి మూలపదార్థం ఏమిటో చెప్పవలసి ఉంటుందని అంటాడు. అందుచేత నీరు మూలపదార్థమని, దానినుండే చలనశక్తి ఏర్పడుతుందని నిరూపించజాలమని అతడంటాడు.

19 దేవుడే ఈ చలనశక్తికి మూలకారకుడని విశ్వకర్మ వాదన. దేవుడే ఆదీ, తుదీ. ఈ

దృగ్గోచరమైన విశ్వకర్మసృష్టికి పూర్వమే దేవుడు ఉన్నాడు. ఈ విశ్వాంతరాళ శక్తులు సృజింపబడే ముందే దేవుడున్నాడు. ఈ ప్రపంచాన్నంతటినీ సృష్టించి నడిపించేవాడు దేవుడే. దేవుడు ఒక్కడే. అతని ఆజ్ఞానుబద్ధంగా ఈ ప్రపంచ జీవరాసులు చరిస్తాయి. అతడు (అజుడు) దేని నుండీ పుట్టలేదు. అతడు సర్వశక్తిమంతుడు, సర్వసంకల్పుడు. అతడే సృష్టికారకుడు సృష్టివినాశకుడు . అతడు ఒక తండ్రిగా మనలనందరినీ పుట్టించాడు. మన అందరి విధివ్రాతలూ అతనికి తెలుసు. అతడి ఇష్ట ప్రకారమే అంతా జరుగుతుంది అనేది అతని సిద్ధాంతం.

20. ఈ వైదిక ఋషులు మన్నించదగినవారుగా బుద్ధుడు భావించలేదు, కాని పది మంది మాత్రమే ప్రాచీన ఋషులని వారే "మంత్రా"లను రూపొందించారన్న విషయాన్ని మాత్రం అంగీకరించాడు.

21. నైతికంగా ఉద్ధరించేదేదీ ఈ మంత్రాలలో లేదనేది అతడు గుర్తించాడు.

22. ఎడారిలా నిష్ప్రయోజనమైనవి వేదాలు అనేది అతని ఉద్దేశ్యం.

23. మంత్రాలనుండి స్వీకరించాల్సిందిగానీనేర్చుకోవాల్సింది గానీ ఏదీ లేదని, వాటిని త్రోసి పుచ్చాడు.

24. అదే విధంగా, బుద్ధునికి వైదిక ఋషుల సిద్ధాంతాలలో కూడా ఏమీ కనుపించలేదు. వారు సత్యాన్వేషణకు తాపత్రయపడిన మాట వాస్తవమే కాని, దాన్ని చేరుకోలేక పోయారు అన్నాడు.

25. వారి సిద్ధాంతాలు ఊహాజనితాలేగాని, తర్కబద్ధమైనవి గాని, నిజాలుగాని కావు. వారి తత్త్వసూత్రాల వలన సామాజిక విలువలూ, పొదుకొనలేదు.

26. కాబట్టి వైదిక ఋషుల తత్త్వాన్ని నిరుపయోగమైనదిగా త్రోసిపుచ్చాడు.

## 2. తత్త్వవేత్త కపిలుడు

1. భారతదేశపు ప్రాచీన తత్త్వవేత్తలలో మిక్కిలి ప్రసిద్ధుడు కపిలుడు.

2. అతని తాత్త్విక దృక్పథం అసమానమైనది. తనదంటూ ఒక ప్రత్యేకతను సంతరించుకున్న తత్త్వవేత్త అతడు. అతడు రూపొందించినదే సాంఖ్యతత్వం.

3. అతని తత్వసూత్రాలు అద్భుతమైనవి.

4. నిరూపించబడనిదేదీ వాస్తవం కాదనేది అతని సాంఖ్య పద్ధతిలోని మొట్టమొదటి ప్రబోధం. దృష్టాంతరం లేనిదేదీ వాస్తవం కాదు.

5. వాస్తవాన్ని నిర్ధారించేందుకు కపిలుడు రెండే రెండు సాక్ష్యాలను ఆమోదించాడు. అవి

1. ఇంద్రియ గ్రాహ్యత 2. రాబట్టేది.

6. ఒక ప్రత్యక్ష వస్తువును మనోగతంగా గుర్తించి తెలుసుకోవడం ఇంద్రియ గ్రాహ్యత.

7. రాబట్టటంలో మూడు అంశాలున్నాయి: 1. కారణం నుండి ఫలితం మేఘాల ఉనికిని బట్టి వర్షం 2. ఫలితం నుండి కారణాన్ని - వాగులలో పొంగిపొరలే జలప్రవాహాల వలన కొండలలోపడిన వర్షం 3. సాదృశ్య పరిశీలన; ఒకడు ఉన్న చోటునుండి మరోచోటుకు కదలినప్పుడు స్థలం మారుతుంది. వేర్వేరు స్థలాల్లో నక్షత్రాలు కనిపిస్తున్నాయి గనుక అవి కూడా కదులుతున్నాయి.

8. అతని తదుపరి సూత్రం కార్యకారణ సంబంధమైనది. సృష్టి, దాని కారణం.

9. ఏదో ఒక అతీతశక్తి ప్రపంచాన్ని సృష్టించింది అనే సిద్ధాంతాన్ని కపిలుడు తిరస్కరించాడు. కుండ తయారు చేసే ముందుగా మట్టిఉన్నట్లుగా, బట్టలు తయారుచేసే పూర్వమే దారాలు ఉన్నట్లుగా, ఈ సమస్త జీవరాసులు అవతరించడానికి పూర్వమే, దానకి కారణభూతమైనదొకటి ఉందని అతని అభిప్రాయం.

10. ఈ ప్రపంచాన్ని సృష్టించిన శక్తి ఒకటి ఉందనే సిద్ధాంతాన్ని త్రోసిపుచ్చడానికి గల మొదటి కారణం యిదే.

11. తన వాదానికి సంబంధించి యితర కారణాలను కూడా అతడు చూపించాడు.

12. లేనిదేదీ క్రియా రూపం దాల్చలేదు. క్రొత్తగా సృష్టించబడినది ఏదీ లేదు. ఒక ఉత్పాదన - అది తయారయిన మూలపదార్థమే కాని నిజంగా వేరు కాదు. రూపొందించిన ఆకారం పొందడానికి ముందే ఉత్పాదన మూలపదార్థపు రూపంలో ఉంటుంది. అటువంటి మూలపదార్థంతో మాత్రమే ఒక నిర్దిష్టమైన వస్తువు తయారవుతుంది. ఒక నిర్థిష్ట పదార్థం మాత్రమే నిర్దిష్ట ఫలితాన్ని యిస్తుంది.

13. అలాంటప్పుడు, ఈ విశ్వసృష్టికి మూలాధారమేది?

14. వ్యక్త వస్తువులు, అవ్యక్త వస్తువులు అని ఈ విశ్వంలో ఉన్నాయని కపిలుడన్నాడు.

15. వ్యక్త వస్తువుల నుండి అవ్యక్త వస్తువులు ఉద్భవించవు.

16. ప్రతివస్తువునకు ఒక మిత పరిమాణమంటూ ఉంటుంది. ఈ విశ్వపు మూల స్వభావానికీ దానికీ పొంతన ఉండదు.

17. సమస్త వస్తువులు ఒకదాని కొకటి సాదృశ్యత కలవే. అందుచేత ఒక దానికి మరొకటి మూలం కాజాలదు. పైగా అన్నీ ఒకే మూలం నించి రావటంవల్ల అవే మూలం కాజాలవు.

18. కారణానికి, ఫలితానికీ తప్పకుండా వ్యత్యాసం ఉంటుంది అని కపిలుడు అంటాడు. కాకపోతే ఫలితంలో గర్భితంగా కారణం ఉంటుంది. అందుచేత విశ్వం దానికదే

అంతిమ కారణం కాజాలదు. అది ఒక అంతిమ కారణపు ఉత్పాదన మాత్రమే.

9. అవ్యక్తమైనవి మన కెందుకు గ్రాహ్యం కావు? మనకు గ్రాహ్యమయ్యే కదలికను అవి ఎందుకు చూపవు? అనే సందేహాలను కపిలుడు ఈవిధంగా నివృత్తి చేసాడు.

20. దానికి కారణాలు అనేకం ఉండవచ్చు. అవ్యక్తమైనవి కొన్ని అత్యంత సూక్ష్మ రూపంలో ఉండడం చేత మనకు గ్రాహ్యం కాకపోవచ్చు. మరికొన్ని మరీ దూరంగా లేదా మరీ దగ్గరగా ఉండవచ్చు. మూడో వస్తువు జోక్యం ఉండవచ్చు. లేక దానికంటే మరింత శక్తివంతమైన అనుభూతితో అది మరుగుపరచబడవచ్చు. ఇంకా మన ఇంద్రియ, మానసికలోపాలు ఉండవచ్చు.

21. అయితే ఈ సమస్త సృష్టికి మూలపదార్థం ఏమిటనే ప్రశ్నకు కపిలుని సమాధానమేమిటి? ఈ విశ్వంలో వ్యక్తావ్యక్త భాగాలకు ఉన్న వ్యత్యాస స్వభావమేమిటి?

22. ఈ విశ్వంలో వ్యక్త వస్తువులకు ఒక కారణం ఉంటుంది. అలాగే అవ్యక్తమైన వాటికి కూడా ఒక కారణం ఉంటుంది. అయితే ఈ రెండింటి మూలం స్వతస్సిద్ధం, స్వతంత్రం అయినటువంటిది.

23. వ్యక్తమైనవి బహుసంఖ్యాకాలు. పరిధిలో, పేర్లలో పరిమితమైనవి. వాటి మూలపదార్థం ఒక్కటే. అది విశ్వవ్యాప్తంశాశ్వతం. వ్యక్తవస్తువులకి క్రియలు, భాగాలు ఉంటాయి. మూలపదార్థం వీటన్నింటిలో వెన్నంటి ఉన్నప్పటికీ దానికి క్రియలూ, భాగాలూ లేవు.

24. అవ్యక్త వస్తువుల వికాసం వాటి మూడు భాగాల ద్వారా జరుగుతుంది. అవి సత్వ, రజో, తామస గుణాలు. వాటినే త్రిగుణాలు అంటారు.

25. సత్వగుణం మనం వెలుతురు అనే దానికి సమమైనది. అది ఆహ్లాదం కలిగిస్తుంది. రజోగుణం వలన చలనం ఏర్పడి కార్యకలాపాలు జరుగుతాయి. తామసగుణం భారంగా ఉండి నిష్క్రియ, నిర్లిప్తతలను కలిగించే స్థితిని అదుపుచేస్తుంది.

26. ఈ మూడు గుణాలు, ఒక దానితో మరొకటి అవినాభావ సంబంధం కలిగి ఉంటాయి. ఒకదానికింకొటి సహకరించుకుంటూ ఉంటాయి. వెలిగించిన ప్రమిదకు అడుగున నూనె, అందులో వత్తి, ఆపైన జ్యోతిలా ఆ మూడు గుణాలు కలిసి ఒక క్రియకు కారణమవుతాయి.

27. అయితే ఈ మూడు గుణాలు సమతుల్యంలో ఉండవు. అవి ఒకదానిపై మరొకటి ఆధిపత్యానికి ప్రాకులాడకపోతే ఈ ప్రపంచమే "అచేతన"మై, వికాసం నిలిచి పోతుంది.

28. ఈ మూడు గుణాలు సమతుల్యత పాటించకుండా, ఒకదానిపై అధికంగా మరొకటి ఉన్నపుడే ఈ ప్రపంచం "సచేతన" మై వికాసం మొదలవుతుంది.

29. ఈ మూడు గుణాలు సమతుల్యంగా ఎందుకు ఉండవు అని ప్రశ్నిస్తే, ఈ మూడు గుణాల సమతుల్యత చెడటానికి కారణం దుఃఖం ఉండటమే అని సమాధానమిచ్చాడు.

30. కపిలుని సిద్ధాంతమలా సాగింది.

31. తత్త్వవేత్తలందరిలోనూ కపిలుని సిద్ధాంతమే బుద్ధుని ఎక్కువగా ఆకర్షించింది.

32. వాస్తవం, తర్కం మీద ఆధారపడి చెప్పినదే కపిలుని సిద్ధాంతమని బుద్ధుడు అభిప్రాయపడ్డాడు.

33. అయితే కపిలుని సిద్ధాంతాన్ని బుద్ధుడు పూర్తిగా అంగీకరించలేదు. దానిలో మూడింటిని మాత్రమే అంగీకరించాడు.

34. ఒకటి వాస్తవమని నమ్మేందుకు, ఒక ఋజువు ఉండాలన్నది మొదటిది. హేతుబద్ధమైన ఆలోచన ఉండాలి.

35. దేవుడనే వాడొకడున్నాడని నమ్మేందుకు హేతుబద్ధమైన వాస్తవమైన, ఆధారమేదీ లేదు. దేవుడే విశ్వసృష్టికర్త అని అనటం కూడ యిలాంటిదే అన్న కపిలుని వాదనను బుద్ధుడు అంగీకరించాడు.

36. ప్రపంచంలో దుఃఖము ఉందని గూడా బుద్ధుడంగీకరించాడు.

37. అంతకు మించి కపిలుడు చెప్పిన మిగతా సిద్ధాంతమంతా తనకు పట్టనిదని బుద్ధుడు భావించాడు.

## 3. బ్రాహ్మణాలు

1. వేదాల తరువాత - చెప్పుకోదగ్గ మతగ్రంథాలకు బ్రాహ్మణాలని పేరు. వేదాలు, బ్రాహ్మణాలు రెండూ పవిత్రంగా భావిస్తారు. నిజానికి వేదాలలో భాగమే బ్రాహ్మణాలు. రెండింటిని కలిపి శృతులని పిలుస్తారు.

2. ఈ బ్రాహ్మణాలకు సంబంధించిన తత్త్వమంతా నాలుగు వాదనలపై ఆధారపడి ఉన్నది.

3. వేదాలు పవిత్రమైనవనీ, దోషరహితమైనవనీ, వాటిని ప్రశ్నించ రాదన్నది వాటిలో మొదటిది.

4. చనిపోయిన తరువాత ఆత్మ మరో జన్మ ఎత్తకుండా మోక్షసాయుజ్యం పొందేందుకు యజ్ఞయాగాదులు నిర్వహించి బ్రాహ్మణులకు ఉదారంగా దానాలనివ్వాలని చెప్పడం రెండవది.

5. ఈ బ్రాహ్మణాలు వేదాల్లో ఉన్నా ఒక ఆదర్శమైన మతాన్నే కాక ఆదర్శమైన సమాజాన్ని సైతం రూపొందించాయి.

6. ఈ ఆదర్శప్రాయ సామాజిక విధానానికి "చాతుర్వర్ణం" [illegible]

రహితమైనవనీ, వాటిని ప్రశ్నించరాదని చెప్పబడినట్లే ఒక సమాజపు నమూనాగా చాతుర్వర్ణ్యం సైతం దోష రహితమైనదని ప్రశ్నించరాదని చెప్పబడింది.

7. ఈ సామాజిక వ్యవస్థ నిర్మాణానికి కొన్ని నిబంధనలు రూపొందించబడినవి.

8. ఆ నిబంధనలలో బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర కులాల ఏర్పాటు మొదటిది.

9. ఈ నాలుగు వర్ణాల మధ్య సాంఘిక సమానత్వముండరాదనేది రెండవ నిబంధన. శ్రేణీపర అసమానత్వంతో ఇవి నాలుగూ కలిసికట్టుగా ఉంటాయి.

10. ఈ నాలుగు వర్ణాలలో బ్రాహ్మణులు అన్నింటికంటే పై స్థాయిలో ఉంటారు. క్షత్రియులు వారికంటే క్రింది స్థాయిలోను, తక్కిన వర్ణాల కంటే పై స్థాయిలోను ఉంటారు. వైశ్యులు క్షత్రియుల కంటే క్రింది స్థాయిలోనో, శూద్రుల కంటే పై స్థాయిలోనూ ఉంటారు. పై మూడు వర్ణాలకు క్రింది స్థాయిలో శూద్రులుంటారు.

11. ఈ నాలుగు వర్ణాల హక్కులు, సౌకర్యాలు సైతం శ్రేణీపర అసమానత్వరీతిలోనే ఉంటాయి.

12. బ్రాహ్మణుల హక్కులకు, సౌకర్యాలకు పరిమితి అంటూ లేదు. అంతా వారి అభీష్టమే. బ్రాహ్మణులకున్నన్ని హక్కులు, సౌకర్యాలు క్షత్రియులు కోరేందుకు వీలు లేదు. అయితే వైశ్యుల కంటే వారి కెక్కువగా ఉంటాయి. వైశ్యులకు క్షత్రియుల కంటే తక్కువ ఉంటాయి. అయితే శూద్రులకు ఎలాంటి హక్కులు, సౌకర్యాలు ఉండవు. పై వర్ణాల వారి దయాదాక్షిణ్యాలపై లభించేవి మాత్రమే. వారు మారుమాట్లాడ కుండా స్వీకరించటమే వారి గౌరవ హక్కు.

13. ఈ చాతుర్వర్ణ సిద్ధాంతంలో వృత్తి విభజన మూడవది. జ్ఞానసముపార్జన, శాస్త్రబోధన, మతవిధులను నిర్వహించడం బ్రాహ్మణుల వృత్తి. యుద్ధాలు చేయటం క్షత్రియుల వృత్తి. వ్యాపారం చేయటం వైశ్యుల వృత్తి. పై మూడు వర్ణాల వారికి సేవ చేయడం శూద్రుల వృత్తి. ఏ వర్ణం వారు ఆ వృత్తినే నిర్వహించాలి. ఎలాంటి పరిస్థితులలోనూ ఒక వర్ణం వారు మరో వర్ణం వృత్తిలోకి చొరబడరాదు.

14. శాస్త్రాధ్యయనానికి సంబంధించినది నాల్గవది. బ్రాహ్మణులు, వైశ్యులు, క్షత్రియులు మాత్రమే శాస్త్రాధ్యయనానికి అర్హులు. విద్యనేర్చుకొనే హక్కు శూద్రుల కెంత మాత్రమూ లేదు. అయితే ఈ హక్కు శూద్రులకే గాక పై మూడు కులాలలోని స్త్రీలకు సైతం నిషిద్ధమే.

15. ఐదవ నిబంధన జీవన విధానానికి సంబంధించినది. జీవితం నాలుగు దశలుగా విభజింపబడినది. మొదటిది బ్రహ్మచర్యం. రెండవది గృహస్థాశ్రమం, మూడవది వానప్రస్థం, నాల్గవది సన్యాసం.

16. రెండవ దశలో వైవాహిక జీవనం గడపాలి. మూడవ దశలో ఇల్లు విడిచి పోకుండానే స్వామి జీవనంతో పరిచయం, కుటుంబ బంధాల తెగతెంపులు జరగాలి. నాలవదశలో

సమస్త బంధాలు విడనాడి దైవాన్వేషణలో గడిపి కడకు ఆ దేవునిలో ఐక్యమైపోవాలి.

17. అయితే ఈ నాలుగు దశలు పై మూడు వర్గాలలోని పురుషులకు మాత్రమే వర్తిస్తాయి. శూద్రులకు, స్త్రీలకు బ్రహ్మచర్యాశ్రమం నిషిద్ధం. అలాగే సన్యాసాశ్రమానికి సైతం వీరు అర్హులు గారు.

18. ఆదర్శప్రాయసమాజం కొరకు దైవికంగా ఏర్పాటైనదని జెప్పబడే ఈ చాతుర్వర్ణ్య సిద్ధాంతం ఇట్లా ఉంటుంది. వాస్తవంగా బ్రాహ్మణులే ఎంతో నేర్పుగా ఎలాంటి మార్పులకు చేర్పులకు అవకాశం లేకుండా రూపొందించారు.

19. బ్రాహ్మణులకు చెందిన తత్త్వవిచారణలో నాల్గవది "కర్మ" సిద్ధాంతం. పునర్జన్మ సిద్ధాంతంలో భాగమే యిది. మరో జన్మలో ఈ జీవాత్మ ఎక్కడ రూపం ధరిస్తుందన్న ప్రశ్నకు కర్మసిద్ధాంతం జవాబు. బ్రాహ్మణాలు యిచ్చే సమాధానం క్రితం జన్మలో మనిషి చేసిన కర్మలను బట్టే ఉంటుందని అనగా అతడి కర్మను బట్టి ఉంటుంది.

20. వేదాలు దోషరహితమైనవనీ, వాటి ప్రామాణికతను ప్రశ్నించరాదన్న బ్రహ్మణాల తొలి సిద్ధాంతాన్ని బుద్ధుడు తిరస్కరించాడు.

21. దోషరహితంగాని దంటూ ఏదీ ఉండజాలదనీ ఏ సిద్ధాంతమూ శాశ్వతమైనదని జెప్పేందుకు వీలులేదనీ బుద్ధుడు వాదించాడు. ప్రతి సిద్ధాంతం మళ్ళీ మళ్ళీ పరిశీలింపబడాలనీ అప్పుడే అది మరింత నిగ్గు తేలుతుందనీ అన్నాడు.

22. మానవునికి సత్యం, అసలు సత్యం తెలియాలి. ఆ విషయంలో ఆలోచనా స్వేచ్ఛ ఉండి తీరాలి. అప్పుడే మానవుడు సత్యం కనుగొనగలుగుతున్నాడు.

23. వేదాలను ప్రశ్నించడానికి వీల్లేదనడమంటే ఆలోచనా స్వేచ్ఛను అరికట్టడమే. దాని వలన సత్యాన్ని తెలుసుకునే అవకాశం నిరాకరింపబడినదన్న మాట.

24. ఆ కారణంగా వేదాలు దోషరహితమైనవని జెప్పడం బుద్ధుడికి జుగుప్సాకరంగా తోచింది.

25. యజ్ఞయాగాదులకు సంబంధించిన రెండవ బ్రాహ్మణ సిద్ధాంతాన్ని సైతం బుద్ధుడు తీవ్రంగా వ్యతిరేకించాడు. యజ్ఞయాగాదుల పేర్లతో మూగజీవాల్ని అగ్నికి అర్పణ చేయడం త్యాగంగా వారు భావిస్తారు. త్యాగం మంచిదే. అయితే త్యాగం జేయడంలో భేదమున్నది.

26. పరుల హితం కొరకు తనకు కాకుండా చేసుకోవటం నిజమైన త్యాగం. కాని తనకేదో మేలు జరగాలన్న స్వార్థంతో మూగ జీవాలను బలి యివ్వడం బూటకపు త్యాగం.

27. బ్రాహ్మణాల యజ్ఞయాగాదుల్లో మూగ జీవాలను బలి యిచ్చి తద్వారా దేముడు ప్రసన్నుడవుతాడని భావించేవారు, దీనిని బూటకపు త్యాగంగా బుద్ధుడు ఖండించాడు.

ఆత్మకు మోక్షం సిద్ధిస్తుందన్న వెర్రిభ్రమలతో అలాంటి బలులు నిర్వహించడం బుద్ధుడు తీవ్రంగా వ్యతిరేకించాడు.

28. అమాయక జంతువులను బలి యివ్వడం ద్వారా మోక్షం సిద్ధించడం వాస్తవమే అయినట్లయితే ఒకడు తన తండ్రినే బలి యివ్వడం ద్వారా ఇంకా శీఘ్రంగా మోక్షం పొందవచ్చు గదా అని ఈ యజ్ఞాలను వ్యతిరేకించే వారు బ్రాహ్మణాలను ఆటపట్టించే వారు.

29. బుద్ధుడు ఆ వాదాన్ని మనఃపూర్వకంగా అంగీకరించాడు.

30. బుద్ధుడు యజ్ఞ బలులను రోసినట్లే. చాతుర్వర్ణ్య సిద్ధాంతాన్ని సైతం జుగుప్సాకరంగా భావించాడు.

31. బ్రాహ్మణులు వ్యవస్థీకరించిన చాతుర్వర్ణ్య విధానం సహజసిద్ధమైనది కాదని బుద్ధుడు భావించాడు. ఇష్టారాజ్యంగా బలవంతంగా ఈ వర్గీకరణ రూపొందింపబడింది. ఎవరో తమ ప్రీతి కొరకు తమకు కావలసినట్లుగా దీనిని రూపొందించారు. అలాగాక బాహాటమూ, స్వేచ్ఛాయుతమూ అయిన సామాజిక వ్యవస్థ ఏర్పాటు కావాలన్నాడు బుద్ధుడు.

32. బ్రాహ్మణులచే వ్యవస్థీకరింపబడిన యీ చాతుర్వర్ణ్య విధానంలో మార్పుకు ఎలాంటి అవకాశం లేదు. ఒకసారి బ్రాహ్మణుడైన వాడు ఆసాంతం బ్రాహ్మణుడే. క్షత్రియ వర్ణంలో బుట్టిన వాడు క్షత్రియుడే. అదే విధంగా శూద్ర వర్ణంలో బుట్టిన వాడు శూద్రుడే. పుట్టుకను బట్టే ఒకడి వర్ణం ఏర్పడుతుంది. గుణహీనుడికి తక్కువ స్థాయి గాని మహాసద్గుణ సంపన్నుడికి ఉన్నత స్థాయి గాని అసాధ్యం. వ్యక్తి యోగ్యతకు గాని, పెరుగుదలకు గాని ఎలాంటి అవకాశము లేదు.

33. ప్రతి సమాజంలోను అసమానత్వం ఉంటుంది. కాని బ్రాహ్మణ మతంలో ఇది వేరు. వారు బోధించే అసమానత్వమనేది వారి అధికారిక సిద్ధాంతం గాని సమాజంలో సహజ సిద్ధంగా ఎదిగింది కాదు. బ్రాహ్మణమతానికి సమానత్వంలో నమ్మకం లేదు. పైగా దాన్ని వ్యతిరేకిస్తుంది కూడ.

34. ఒక్క అసమానత్వంతో ఇది ఆగలేదు. అసమానత్వం ఆరోహణా పద్ధతిల రూపొందింపబడటమే బ్రాహ్మణ మతపు అంతరార్థం.

35. సమాజంలో సామరస్యం మాట అట్లా ఉంచి, బ్రాహ్మణులు రూపొందించిన ఈ ఆరోహణ పద్ధతి అసమానత్వం వలన పై వాళ్ళకు క్రింది వారి పట్ల ద్వేషం, క్రిం వారికి పై వారి పట్ల అసూయ ఏర్పడేలా చేసిందనీ, ఆ కారణంగా సమాజ సంక్షుభితమైనదనీ బుద్ధుడు భావించాడు.

36. నాలుగు వర్ణాల వృత్తులు గూడ స్థిరీకరింపబడినవి. ఎవరి కిష్టమైన వృత్తిని వా చేపట్టేందుకెంత మాత్రము వీలు పడదు. నైపుణ్యాంతో నిమిత్తం లేకుండా ఒకరు వర్గంలో పుడతారో వారా వర్గం వృత్తినేజేపట్టాలి.

37. చాతుర్వర్ణ్య విధానంలోని వృత్తి నిర్ణయ విధానాన్ని జాగ్రత్తగా పరిశీలించిన బుద్ధుడు బ్రాహ్మణులు తప్పుగా స్వార్థబుద్ధితోనే ఈ సామాజిక విధానం రూపొందించారని గ్రహించాడు.

38. ఇది అందరి ప్రయోజనాల్ని పరిరక్షించక పోవడమేగాక అందరికీ క్షేమాన్ని పెంచేదిగా అసలే లేదని గూడా తెలుసుకున్నాడు.

39. ఇది దుర్బలులను త్రొక్కిపెట్టి వారిని తమ ఇష్టానుసారం వాడుకోవాలన్న దుర్బుద్ధితో ఏర్పాటు చేశారని తెలుసుకున్నాడు.

40. బ్రాహ్మణులు రూపొందించిన కర్మ సిద్ధాంతం ఫలితంగా పీడితులు తిరుగబడే మనస్తత్వాన్ని కోల్పోయారు. గత జన్మలో తాము చేసిన కర్మానుసారం ఈ జన్మలో ఈ దుస్థితి కలిగిందని బాధితుడు భావిస్తున్నాడు. తన హీన స్థితికి మరెవ్వరు కారకులు గారని నమ్ముతున్నప్పుడు తాను తిరుగుబాటు జేసేందుకు వీలుండదన్న వాస్తవాన్ని బుద్ధుడు గ్రహించాడు.

41. శూద్రులు, స్త్రీలలో ఈ మానసిక వైకల్యం బలంగా ఏర్పడిపోవడంతో వారు వ్యవస్థపై తిరుగుబాటు చేయలేకపోయారు.

42. జ్ఞాన సముపార్జన కెలాంటి అవకాశం లేకుండ అజ్ఞానంలోనే వారినుంచేయడంతో వారి హీన పరిస్థితికి కారకులెవ్వరన్నది వారి ఊహకందని విషయమైంది. జీవితపు విలువల్ని వారి నుండి బ్రాహ్మణులే బలవంతాన దోచుకున్నారన్న విషయం వారు గ్రహించ లేకపోయారు. వారినణచివేసిన ఆయుధాన్ని సమర్థిస్తూ బ్రాహ్మణుల పట్ల భక్తిప్రపత్తులతో మెలగసాగారు.

43. మానవుడు స్వేచ్ఛ కోసం పోరాడేందుకు ఆఖరు సాధనం ఆయుధమే. కాని శూద్రులు ఆయుధాలు ధరించే హక్కే లేకుండ సిద్ధాంతీకరించబడింది.

44. ఈ బ్రాహ్మణ మతం వలన శూద్రులు నిస్సహాయులై స్వార్థబుద్ధితో రూపొందిన కుట్రలో బలిపశువులై పోగా క్షత్రియులు బలవంతులుగాను, వైశ్యులు ధనవంతులుగాను రూపొందారు.

45. అయితే ఈ వ్యవస్థను మార్చేందుకు వీలౌతుందా? ఇది స్వయానా దేవుడే ఏర్పాటు చేశాడని భావిస్తున్నంతవరకు దాన్ని మార్చడం సాధ్యపడదు.

46. ఈ సత్యాన్ని గ్రహించిన బుద్ధుడు ఈ బ్రాహ్మణ మతాన్ని తిరస్కరించాడు. ఇది న్యాయబద్ధమైన సామాజిక విధానం కాజాలదని చెప్పాడు.

## 4. ఉపనిషత్తులు - వాటి బోధనలు

1. ఉపనిషత్తులు సాహిత్యంలో వేరొక భాగం. అవి వేదాల్లో భాగం కావు. అవి అపౌరుషేయాలు కావు.

2. అయినా. అవి మత సాహిత్యంలో ఒక భాగమైనాయి.
3. ఉపనిషత్తులు బహుసంఖ్యాకాలు. కొన్ని ప్రధానమయినవి. మరికొన్ని అప్రధానమైనవి.
4. వేదశాస్త్ర ప్రబోధకులైన బ్రాహ్మణమత గురువులకు ప్రతికూలంగా కొన్ని ఉన్నాయి.
5. వేదాధ్యయనం, అజ్ఞానానికి, మూఢత్వానికీ దారి తీస్తుందని ఇవి ఒప్పుకున్నాయి.
6. చతుర్వేదాలు, వేదశాస్త్రం నిమ్నస్థాయికి చెందిన జ్ఞానంగా ఇవన్నీ ఏకగ్రీవంగా అంచనావేశాయి.
7. వేదాలు దైవదత్తమైనవనే విషయాన్ని అవి సవాలు చేసాయి.
8. బ్రాహ్మణ్యంలో మౌలికమైన బలులు, శ్రాద్ధ కర్మలు, యజ్ఞ విధులు, సంభావనల ప్రయోజకత్వాన్ని అవన్నీ తిరస్కరించాయి.
9. ఈ పై విషయాలే ఉపనిషత్తులు చేపట్టిన ప్రధాన అంశాలు కావు. వాటి చర్చ "ఆత్మ" "బ్రహ్మ లపై కేంద్రీకృతమైంది.
10. సర్వత్రావ్యాపించి ఉండి విశ్వాన్నంతా శాసించే మూలసూత్రమే బ్రహ్మ. తాను బ్రహ్మనని ఆత్మ గుర్తించడంవల్లనే మోక్షం సిద్ధిస్తుంది.
11. బ్రహ్మయే సత్యమనీ, ఆత్మ, బ్రహ్మలు ఒక్కటేనని ఉపనిషత్తుల ప్రధాన సిద్ధాంతం. ఆత్మ బ్రహ్మమని గుర్తించుకోలేక పోతున్నది. దీనికి కారణం అది "ఉపాధుల"లో చిక్కుకు పోవడమే.
12. "బ్రహ్మ సత్యమేనా?" అనేది ప్రశ్న. ఈ ప్రశ్నకు యిచ్చే సమాధానం మీదనే. ఉపనిషత్తుల తాత్త్విక సిద్ధాంతాలను ఆమోదించడం ఆధారపడి ఉంది.
13. "బ్రహ్మయే సత్యము" అనే సిద్ధాంతానికి ఆధారభూతమైన ఏ దృష్టాంత మూ బుద్ధునికి గోచరించలేదు.
14. ఉపనిషత్ భాష్యకారులను ఈ విషయమై ప్రశ్నించలేదు అని భావించరాదు. వారినిట్లా ప్రశ్నించారు.
15. అటువంటి ప్రశ్నలను, గొప్ప ఋషి, బృహదారణ్యకోపనిషత్తును రూపొందించడంలో గణనీయమైన పాత్రవహించిన యాజ్ఞవల్క్యుడినే అడగడం జరిగింది.
16. "బ్రహ్మ అంటే ఏమి? ఆత్మ అనగా ఏమి?" అని అతన్ని ప్రశ్నించగా - "నేతి ! నేతి! నాకు తెలియదు! నాకు తెలియదు! అని మాత్రమే సమాధానమివ్వగలిగాడు.
17. "దాన్ని గురించి ఎవ్వరికీ ఏమీ తెలియనపుడది యదార్థం ఎలా అవుతుంది ? అని బుద్ధుడు ప్రశ్నించాడు. అందువలన, ఉపనిషత్తుల ప్రతిపాదన కేవలం ఊహాజనితమేనని బుద్ధుడు సునాయాసంగా త్రోసి పుచ్చాడు.

# ఆరవ భాగం

# బుద్ధుడు అతని సమకాలీనులు

1. అతని సమకాలీనులు
2. సమకాలికులఎడల అతని దృక్పథం

# 1. అతని సమకాలీనులు

1. గౌతముడు పరివ్రాజం స్వీకరించే సమయానికి దేశంలో గొప్ప జ్ఞానపిపాస పెల్లుబుకుతూ వుండేది. బ్రాహ్మణ్య సిద్ధాంతమే కాకుండా, దగ్గర దగ్గరగా 62 సిద్ధాంతాలు, అన్నీ బ్రాహ్మణ్య సిద్ధాంతాన్ని వ్యతిరేకించేవే వుండేవి. వాటిలో కనీసం ఆరు గుర్తించదగినవి.

2. వీటిలో, పురాణ కశ్యపుడు అధిపతిగా వుండి బోధించే సిద్ధాంతం ఒకటి వుండేది. అక్రియావాదం ఏ విధంగాను కర్మ ప్రభావం ఆత్మపై వుండదని అతని బోధన. ఒకడు ఏదైనా చేయవచ్చు లేక చేయించవచ్చు. ఒకడు చంపవచ్చు, లేక చంపడానికి మరొక వ్యక్తిని వినియోగించవచ్చు. ఒకడు దొంగతనం, దోపిడి చేయవచ్చు. లేదా దొంగతనాలు, దోపిడీలు జరిపించవచ్చు. ఒకడు వ్యభిచరించవచ్చు లేదా వ్యభిచారం జరిపించవచ్చు; ఒకడు అబద్ధమాడవచ్చు. లేదా అబద్ధము చెప్పించవచ్చు. ఏదీ కూడా ఆత్మపై క్రియ {ప్రభావం} చూపలేవు. ఎంతటి దుష్కార్యాన్ని చేసినా, ఏ పాపం ఆత్మకు అంటదు. చేసింది ఎంత మంచి పని అయినా, ఆత్మకే విధమైన విశిష్టత ఒనకూరదు. దేనికీ ఆత్మపై ఏ విధమైన ఫలితాలూ వుండవు. ఒక వ్యక్తి మరణించినప్పుడు ఏవైతే ధాతువులతో అతని శరీరం తయారైనదో, అధాతువులన్నీ, వాటి అసలు స్థానానికి వెళ్ళిపోతాయి. చనిపోయిన తర్వాత శరీరంగానీ, ఆత్మగానీ - ఏదీ మిగలదు.

3. ఇంకొక సిద్ధాంతం "నియతి వాదం" అంటారు. మ ఖలిగోశాలు దీని ప్రధాన ప్రవక్త. అన్నిటికీ 'అదృష్టమే' ప్రధానపాత్ర వహిస్తుంది అనీ; పూర్వనిర్ధారణ ప్రకారమే అన్నీ జరుగుతాయనీ అతని ప్రబోధం. ఎవ్వరూ కూడా దేనికీ కర్తలుకాలేరు. విధి వ్రాతనెవరూ తప్పించుకోలేరు. ఏవైనా వాటంతటవే జరుగుతాయి. ఎవ్వరూ ఆ విధంగా జరిగేటట్లు చేయలేరు. ఒకరి విచారాన్ని మరెవరూ తొలగించలేరు, పెంచలేరు లేక తగ్గించలేరు. ప్రపంచంలో తనవంతు భాగాన్ని ప్రతివాడూ అనుభవించి తీరాలి.

4. మూడవ విధానాన్ని ఉచ్ఛేద వాదమని అంటారు. దాన్ని రూపొందించినవాడు అజిత కేశకంబళుడు. ఒక రకమైన వినాశ వాదమతని సిద్ధాంతం. యజ్ఞ, హోమాలలో ఏమీ లేదని, ఆత్మ అనుభవించ వలసిన సత్క్రియా ఫలితాలు, దుష్క్రియాపరిణామాలు అనేవి ఏవీ వుండవని అతడు ప్రబోధించాడు. స్వర్గమని గాని, నరకమని గానీ ఏదీ లేదు. ప్రపంచంలోని దుఃఖభాజకమైన కొన్ని అంశాలతో మానవుడు వుద్భవించాడు. ఆత్మ వీటిని తప్పించుకోలేదు. ఏవైతే విచారం, దుఃఖం ఈ లోకంలో వున్నాయో, వాటిని ఆత్మ ఏ విధంగానూ తప్పించు కోలేదు. అప్రయత్నంగా ఆ విచారం,దుఃఖం వాటికవే అంతమవుతాయి. ఎనభైఅయిదు లక్షల మహాకల్పవృత్త కాలంలో యీ ఆత్మ పునర్జన్మల నెత్తవలసి వుంటుంది. అప్పుడే ఆత్మయొక్క విషాదం, విచారం అంతమౌతుంది. అంతేకానీ, అంతకు ముందు గానీ, మరే విధంగా గానీ అంతరించదు.

5. 'అన్యోన్యవాద' మనేది నాల్గవ మార్గం. పకుధ కాచ్చాయన (కాత్యాయనుడు) యీ సిద్ధాంత కర్త. పృధ్వి, ఆప, తేజ, వాయు, సుఖ, దుఃఖ, ఆత్మ అనే ఏడు అంశాల కలయికతోనే జీవి వుద్భవిస్తుందని అతడు వుద్భోధించాడు. పై అంశాలన్నీ వేటికవే స్వతంత్రమైనవి. ఒక దాని ప్రభావం మరొక దానిపై వుండదు. అవి స్వయంభువులు, నాశములేనివి. ఒకడు మరొకని తలనరికివేస్తే, అది అతను చంపినట్లుకాదు. అక్కడ జరిగిందేమిటంటే చంపడానికై వాడిన ఆయుధము (కత్తి) ఏడు ధాతువులలోనికీ చేరినదన్నమాట.

6. సంజయ బేలపుత్రడు తన స్వంత వాదాన్ని బోధించేవాడు. దాన్నే విక్షేపవాదమనేవారు. అది ఒక సంశయాత్మక వాదం. అతడిలా వాదించేవాడు. "ఎవరైనా నన్ను స్వర్గం అనేది వుందా?" అని అడిగితే, వుందని నేను భావిస్తే, వుంది అని అంటాను. స్వర్గం లేదని నేను భావిస్తే 'లేదు' అని సమాధానము చెపుతాను. మానవులు సృష్టించబడ్డారా? మంచిఅయినా, చెడుఅయినా, మానవుడు తాను చేసిన కర్మ ఫలితం అనుభవించాలా? చనిపోయిన తర్వాత కూడా ఆత్మ జీవించి వుంటుందా? అని ఎవరైనా నన్ను ప్రశ్నించితే, వీటన్నిటికీ "లేదు" అనే సమాధాన మిస్తాను. ఎందుకంటే అవంటూ అసలు వున్నాయని నేననుకోను. ఈ విధంగా సంజయ బేలపుత్తుడు తన సిద్ధాంతాన్ని వివరించాడు.

7. చాతుర్యాం సంవారవాదమనేది ఆరవ మార్గం. మహావీరుడు, నిగంధ బేలపుత్రడు అని పిలవబడే యీ సిద్ధాంత కర్త, గౌతముడు వెలుగును వెదికే తరుణంలో జీవించి వుండేవాడు. యీ జన్మలోను, పూర్వజన్మలోను చేసుకున్న దుష్కర్మలవలన, ఆత్మ పునర్జన్మ నెత్తవలసి వుంటుందని అతడు బోధించేడు. తపశ్చర్య ద్వారా చెడుని తొలగించుకోవాలని అతడు సలహాయిచ్చాడు.చాతుర్యమధర్మాలనుపాటించ వలసినదిగా అతడు సూచించాడు. ఆ నాలుగు నియమాలు 1. చంపరాదు 2. దొంగిలించరాదు 3. అబద్ధ మాడరాదు 4. ఆస్థులను సంపాదించరాదు, బ్రహ్మచర్యాన్ని అవలంబించాలి.

## 2. సమకాలికుల ఎడల అతని దృక్పథం

1. ఈ నూతన తాత్త్వికుల సిద్ధాంతాలను బుద్ధుడు అంగీకరించలేదు.

2. అతడలా అంగీకరించకపోవడానికి కారణాలు లేక పోలేదు. అతడిలా అన్నాడు:

3. పురాణ కశ్యపుని, లేక పకుధ కచ్చాయనుని సిద్ధాంతాలు నిజమే అయితే దుష్కార్యాలు, దుర్మార్గాలు అందరూ చేయగలరు. సామాజిక బాధ్యతనూ, సామాజిక పరిణామాలనూ విస్మరించి ఒకడు యింకొకడిని చంపే ఘాతుకానికి ఒడికట్టవచ్చు.

4. మఖాలి గోశాలుని సిద్ధాంతమే నిజమైతే అతడు విధిక బానిసైపోతాడు. అతడు ముక్తిని పొందలేడు.

అజిత కేశకంబళుని సిద్ధాంతమే నిజమైతే, మనిషి చేయవలసినదంతా తినీ, తాగీ, తందనాలు తొక్కటంమాత్రమే.

సంజయ బేలపుత్రుని సిద్ధాంతమే సత్యమైనదైతే మానవుడు జీవితంపట్ల ఏ సద్భావం లేకుండా నిర్లిప్తంగా కాలక్షేపం చేయాలి.

నిగంతనాథపుత్రుని సిద్ధాంతమే నిజమైతే, మానవుడు తన కోరికలను సహజ ప్రవృత్తులను సమూలంగా పెకలించుకుని వైరాగ్యాన్ని, తపశ్చర్యని అవలంబించాలి.

ఆ విధంగా తాత్త్వికులు బోధించిన సిద్ధాంతాలలో దేనినీ బుద్ధుడు అంగీకరించలేదు. అవి నిరాశాపరులు, నిస్సహాయులు, తెంపరుల మనోభావాలు మాత్రమేనని అతడు భావించాడు. కాబట్టి వెలుగు కోసం మరొకచోట అన్వేషించాలని అతడు నిర్ణయించుకున్నాడు.

# ఏడవ భాగం

# సాదృశ్య వ్యత్యాసాలు

1. అతడు నిరాకరించినవి

2. అతడు సవరించినవి

3. అతడు ఆమోదించినవి

# 1 వినూత్న కాంతికై ధ్యానం

1. ఆ ఆహారంతో ఆకలి తీర్చుకున్న గౌతముడు, తన పూర్వ అనుభవాల గురి
ఆలోచిస్తూ కూర్చున్నాడు. ఆ మార్గాలన్నీ విఫలమైనవని అతడు గుర్తించాడు.

2. అవి ఎంత పూర్తిగా విఫలమైనవి అంటే, వాటిననుసరించిన వారికి వి
కలుగుతుంది. కాని అలాంటిదేమీ అతనికి కలుగలేదు. కాని కొంచెం విచారం కల్గి

3. ఒక మార్గం దొరుకుతుంది అని అతడెప్పుడూ ఎంతో ఆశతో వుండేవాడు. ఎ
నమ్మకంతో వుండేవాడంటే, సుజాత పంపిన ఆహారాన్ని తిన్న ఆనాటి రాత్రి నిద్ర
గౌతమునికి అయిదు కలలు వచ్చాయి. నిద్ర లేచి ఆ కలలను అన్వయించుకో
జ్ఞానోదయం తప్పక పొంద గలననే దృఢవిశ్వాసం గౌతమునిలో కలిగింది.

4. తన భవిష్యత్తు ఎలా వుంటుందోనని తెలుసుకో ప్రయత్నించాడు. ఏ విధంగా అం
సుజాత సేవకురాలు ఆహారంతో తెచ్చిన గిన్నెను `నైరంజన' నదిలోనికి విసరివే
"నాకే గనక జ్ఞానోదయం కలిగే పక్షంలో, ఈ గిన్నె మునుగకుండా, జల ప్రవాహా
ఎదురుగా వెళ్ళుగాక, అలా కాని పక్షంలో అది మునిగి పోవుగాక" అని అన్నా
నిజంగానే ఆ పాత్ర నదీజల ప్రవాహానికి ఎదురేగి చివరికి నాగరాజైన కాలుని నివా
వద్ద మునిగిపోయింది.

5. ఆశ, ఆశయాలు మరింత బలపడగా, ఉరువేలను వదలి, సాయంత్రమయ్యేసరికి, గయకు
విశాలరహదారి గుండా వెళ్ళాడు. అక్కడ ఒక మర్రిచెట్టును చూసాడు. తన సమస్యకు
పరిష్కార మార్గాన్ని కనుగొనడానికై తనపై ఏదైనా వినూత్న కాంతి వుదయిస్తుందేమో
ఆశతో, ఆ మర్రిచెట్టు క్రింద కూర్చొని ధ్యానంచేయ సంకల్పించాడు.

6. నాలుగు దిక్కులలో ప్రతీ దానిని పరీక్షించిన తర్వాత, ఆ పవిత్రతను క్షా
చేయడానికై మహర్షులందరూ ఎన్నుకున్న తూరుపు దిశనే గౌతముడు కూడా తన ధ్యా
సాధనకు ఎంచుకున్నాడు.

7. గౌతముడు పద్మాసనం వేసుకుని, నిటారుగా ఆ మర్రిచెట్టు క్రింద కూర్చున్నా
జ్ఞానోదయ సిద్ధికై దృఢనిశ్చయంతో తనలోతాను ఇలా నిర్ణయించుకున్నాడు : "
చర్మం, కండరాలు, ఎముకలూ, హరించుక పోయినా, నా శరీరంలోని మాంస
రక్తమూ ఆర్చుకు పోయినా సరే, సంపూర్ణ జ్ఞానోదయం సిద్ధించేవరకు, యీ చోటు
నేను వదలి వెళ్ళేదిలేదు."

8. గజేంద్రుని వంటి ఘనప్రతాపము గలిగిన నాగుల రాజు, కాలుడు, అతని భార్య సు
ప్రభాస మర్రిచెట్టు క్రింద ఆసీనుడై వున్న గౌతముని గాంచి ప్రభావితులై, అత

"ఓ మహాముని! నీ పాదాల క్రింద యీ భూమి వున్నంత కాలమూ అది నీ నామాన్ని ప్రతిధ్వనిస్తూనే వుంటుంది. సూర్యతేజస్సుతో నీ వైభవం ప్రకాశిస్తూనే వుంటుంది. నీవు నిశ్చయంగా ఆశించిన ఫలాన్ని పొందగలవు."

10. ఓ పద్మనేత్రుడా! పక్షుల సమూహం ఆకాశంలో ఎగురుతూ నీకు గౌరవ వందనం చేస్తున్నంత కాలము, ఆకాశంలో సుతారంగా గాలి వీస్తున్నంత కాలము, నీ ధ్యేయాన్ని నీవు తప్పక పొందగలవు."

11. అతడు ధ్యానానికి కూర్చొనగానే, చెడు ఆలోచనలు, తుచ్ఛ మోహాలు అతని మనస్సులోనికి ప్రవేశించాయి. వీటినే పౌరాణిక కథలలో మారుని కుమారులని అంటారు.

12. అవి తనపై ప్రభావాన్ని చూపి, తనను లోబరచుకుని, తన ధ్యేయ సాధనలో విఫలునిగా చేస్తాయేమోనని గౌతముడెంతగానో భయపడ్డాడు.

13. ఈ వాంఛలతో పోరాడి యిదివరలో ఎందరో మహర్షులు, బ్రాహ్మణులు ఓడి పోయారు అన్న విషయం అతనికి తెలుసు.

14. తనలో వున్న ధైర్యాన్నంతటినీ కూడగట్టుకుని, మారుని వుద్దేశించి, " నాలో విశ్వాసం, శౌర్యపరాక్రమాలు జ్ఞానం వున్నాయి. నీ కామప్రలోభాలు ఏ విధంగా నన్ను లోబరచుకోగలవు? నదులోని నీరు, ఈ గాలి, హరించి పోవచ్చు- గానీ, నా దృఢ నిశ్చయాన్ని మాత్రం నీవేవిధంగానూ హరించలేవు. నేనంతగా స్థిర సంకల్పంతో వున్నాను. నేను జీవితంలో పరాజితుడను కావడం కంటే, నాకు యుద్ధంలో వీర మరణమే మేలు." అని అన్నాడు.

15. క్రొవ్వు ముద్దలా కన్పించే దొర్లుతున్న రాయిని చూసిన కాకి, "ఇక్కడ నాకు ఒక మంచి ఆహారం దొరుకుతుంది, బహుశా, తీపివస్తువై వుండవచ్చు" అని ఊహించుకుంటూ, దాని వెంటపడిన విధంగా, అతని మనస్సులోనికి దుష్ట ప్రలోభాలు చొరబడ్డాయి.

16. అక్కడ ఏ విధమైన తియ్యదనమూ కన్పించక పోవటంతో, అక్కడి కాకి ఎగిరిపోతుంది. ఆ విధంగా రాతిని వెంబడించిన కాకిలా, చెడ్డ ప్రలోభాలు నిరాశతో గౌతముని వదలి వెళ్ళిపోయాయి.

## 2. జ్ఞానోదయం

1. ధ్యానసాధనకాలంలో ఆకలి తీర్చుకోవడానికై నలభై రోజులకు సరిపడే ఆహారాన్ని సమకూర్చుకున్నాడు.

2. తన మనస్సును చీకాకుపరచిన చెడు ఆలోచనల నన్నింటినీ పారద్రోలి, గౌతముడు ఆకలి తీర్చుకుని, సత్తువ తెచ్చుకుని, అలసట తీర్చు కున్నాడు. జ్ఞానోదయాన్ని పొందాలనే సంకల్పంతో [illegible]

3. నాలుగు వారాల ధ్యానసాధన తర్వాత గౌతమునికి జ్ఞానోదయం అయింది. నాలుగు దశలలో అతడు సంపూర్ణ జ్ఞానోదయాన్ని పొందాడు.

4. మొదటి దశలో అతడు హేతువును శోధనను చేపట్టాడు. అతని ఒంటరితనం దానిని సులభంగా పొందటానికిక దోహదపడింది.

5. రెండవ దశలో అతడు ఏకాగ్రతను కూడా దానికి జోడించాడు.

6. మూడవ దశలో సమచిత్తం, అప్రమత్తతలను తన సహాయానికై వినియోగించాడు.

7. చిటచివరి నాలుగవ దశలో స్వచ్ఛతను సమచిత్తానికి, సమచిత్తాన్ని అప్రమత్తతకు అనుసంధించాడు.

8. ఆ విధంగా చెదరని, శుద్ధమైన, కల్మష దూరమై స్నిగ్ధమైన, అనువర్తితమైన, కుశలమూ ధృఢమూ అయి ఉద్విగ్నభరమైన మనస్సుతో - తన లక్ష్యమెన్నడూ విస్మృతిలో పడకుండా, గౌతముడు తనని కలవరపరుస్తున్న సంశయం నివృత్తి చేసుకునేందుకు ధ్యానమగ్నుడయ్యాడు.

9. నాలుగవ వారంలో చివరి రోజు రాత్రి అతనిపైకి జ్ఞానోదయం కలిగింది. రెండు సమస్యలు ఉన్నాయని అతడు గుర్తించాడు. మొదటిది ఈ ప్రపంచంలో దుఃఖం ఉన్నదనేది. రెండవది ఈ దుఃఖాన్ని ఎట్లా దూరం చేసి మానవాళికి సుఖశాంతులు అందచెయ్యాలి అని.

10. చిట్ట చివరికి, నాలుగు వారాలపాటు ధ్యానంచేయగా, అంధకారం తొలగిపోయి, కాంతి ఉదయించింది; అజ్ఞానం తొలగిపోయి జ్ఞానం ఉద్భవించింది. అతడు ఒకవినూత్న మార్గాన్ని దర్శించాడు.

## 3. వినూత్న ధర్మము కనుగొనుట

1. వినూత్న కాంతిని పొందడానికి గౌతముడు ధ్యానంలో కూర్చునేటప్పటికి అతనిపై సాంఖ్య ప్రభావం ఎక్కువగా వుండేది.

2. బాధలను; ఆవేదనలను ఈ లోకంలో అనుభవించక తప్పదు అనేది నిర్వివాదాంశమని అతడు గ్రహించాడు.

3. వాటినేవిధంగా నివారించాలో తెలుసుకోవాలని గౌతముని ఆకాంక్ష. సాంఖ్యం యీ విషయాన్ని ప్రస్తావించలేదు.

4. కాబట్టి "ఈ బాధలను, ఆవేదనలను ఏవిధంగా అధిగమించాలి" అనే సమస్య పట్ల అతడు తన మనస్సును కేంద్రీకరించాడు.

సహజంగా మొట్టమొదటిగా తనలో తాను ప్రశ్నించుకున్నాడు.

6. "ఈ విషాదాన్ని ఏ విధంగా నిర్మూలించాలి అనేది అతని రెండ వ ప్రశ్న.

7. "సమ్మాబోధి" అనేదే ఈ రెండు సమస్యలకూ పరిష్కార మార్గం అనే సమాధానాన్ని పొందాడు.

8. అందువల్లనే ఆ మర్రి చెట్టుకు బోధి వృక్షమనే పేరు వచ్చింది.

## 4. బోధిసత్త్వుడైన గౌతముడు "సమ్మాబోధి" అనంతరం బుద్ధుడు కావడం

1. జ్ఞానసిద్ధికి పూర్వం గౌతముడు బోధిసత్త్వుడు మాత్రమే. జ్ఞానోదయం పొందిన తర్వాత అతడు బుద్ధుడయ్యాడు.

2. బోధి సత్త్వుడనగా ఎవరు? బోధిసత్త్వమనగా ఏమి?

3. బుద్ధుడు కాగోరు వ్యక్తి బోధిసత్త్వుడు.

4. బోధిసత్త్వుడు బుద్ధునిగా ఎలా అయ్యాడు?

5. బోధిసత్త్వుడైన వాడు వరుసగా పది జన్మల పాటు బోధిసత్త్వునిగా వుండాలి. బుద్ధుడు కాగోరు అర్హతను పొందాలంటే ఏం చేయాలి?

6. తొలి జన్మలో, అతడు "ముదిత" ఆనందము పొందుతాడు. రజితకారుడు ముందు వెండిలోని మలినవ్యర్థపదార్థాలను తొలగించి కరగించినట్లుగా బోధిసత్త్వుడు నిర్మలుడవుతాడు. మబ్బులు తొలగిన చంద్రుడు ప్రకాశించినట్లు, ప్రమత్తుడు ప్రశాంత చిత్తుడుగా మారతాడు. దీనిని గుర్తించిన అతనిలో ఆనందము వెల్లివిరియగా అందరికీ శుభం గలుగ చెయ్యాలనే గాఢమైన కోరిక అతనిలో కలుగుతుంది.

7. అతని రెండవ జన్మలో, "విమల" (స్వచ్ఛత)ను పొందుతాడు. బోధిసత్త్వునిలో కామపరమైన ఆలోచనలు యిప్పుడు తొలగిపోతాయి. అతడు దయాళువు. అందరి పట్ల కరుణగలవాడు. మనుష్యులలోని దుర్గుణాలను పొగడటంగాని వారి గుణగణాలను, కించపరచటం గానీ చేయడు.

8. అతడు మూడవ జన్మలో "ప్రభాకరి" తేజస్సు సాధిస్తాడు. బోధిసత్త్వుని వివేకమిప్పుడు అద్దమంత ప్రకాశవంతంగా మారుతుంది. తాను పూర్తిగా తెలిసిన వాడై, అనత్త, అనిచ్చ, సత్యాలను సులువుగా గ్రహించగలడు. అత్యున్నత జ్ఞానాన్ని పొందటమే అతని ఏకైక వాంఛ. దానికై దేనినైనా త్యాగం చేయడానికి అతడు [illegible]

9. అతని నాలుగవ జన్మలో "అర్చిష్మతి" సాధిస్తాడు. ఈ జీవితంలో బోధిసత్వుడు అష్టాంగమార్గం పైన తన మనస్సు నిలిపి వుంచుతాడు.

10. అతని అయిదవ జన్మలో "సుదుర్జయ" అజేయస్థితిని పొందుతాడు. నిరపేక్ష, సాపేక్ష అంశాల మధ్యగల సంబంధాన్ని పూర్తిగా అర్థం చేసుకోగలుగుతాడు.

11. అతని ఆరవ జీవితంలో "అభిముఖి"గా మారతాడు. ఈ దశలో, పదార్థ వికాసం, వాటి కారణాలు, ద్వాదశ నిదానాలను గురించి పూర్తిగా గ్రహించ గలుగుతాడు. అభిముఖి అనే యీ జ్ఞానమే ఆ విద్యతో అంధులయిన వారి నందరిపట్లా అతని హృదయంలో అనంతమైన దయాదాక్షిణ్యా లను కలిగిస్తుంది.

12. అతని ఏడో జీవనంలో "దూరం గమ"గా మారతాడు. బోధిసత్వుడిప్పుడు కాలానికి, స్థలానికి అతీతుడవుతాడు. అనంతంతో ఏకమైనప్పటికి అందరిపట్ల అతనికున్న అవ్యాజానురాగాల వలన నామరూపాలతోనే వుంటాడు. తామరాకుపై నీటి బిందువులాగా అతనికి ప్రపంచంలోని ఏ వాంఛలూ అంటనివిధంగా, అతడు మిగతా వారి నుండి విడిగా వుంటాడు. అతని చుట్టూనున్న వారి కోరికలు తీరుస్తాడు ; దానం, ఓర్మి, యుక్తి, శక్తి, ప్రశాంతత, అత్యున్నత అతడు ప్రసరిస్తాడు.

13. ఈ జీవితంలో వుంటుండగానే, అతనికి ధర్మం గురించి తెలుస్తుంది. ప్రజలందరికీ సులభంగా అర్థమయ్యేరీతిలో అతడు చెప్తాడు. తను యుక్తితోను, సహనంతోనూ మెలగాలి అని అతనికి తెలుసు. ఎవరైనా అతని పట్ల ఏ విధంగా ప్రవర్తించినా, ఏమి చేసినా, శాంతమూర్తుడై దానిని భరిస్తాడు. ఎందుకంటే, వారు తమ అజ్ఞానం వలన తన లక్ష్యాలను అపార్థం చేసుకున్నారనిపైగా, నలుగురికీ శ్రేయం కూర్చటంలో అలసత్వం చూపడు. జ్ఞానాన్నుంచి మనస్సును మరల్చడు. అందువల్లనే దురదృష్టం అతనిని సత్యమార్గమునుండి ఏ మాత్రం మరల్చలేదు.

14. ఎనిమిదవ జన్మలో, అతడు "అచలు"డవుతాడు. ఈ అచల స్థితిలో, బోధిసత్వునిలో వుండే అన్ని ప్రయాసలు దూరమవుతాయి. అతడు ఆ కారణంగా మంచినే అనుసరిస్తాడు. తను చేసే ప్రతిప్రయత్నంలోనూ కృతకృత్యుడవుతాడు.

15. తొమ్మిదో జన్మలో, అతడు "సాధుమతి" అవుతాడు. ఈ స్థితిని పొందిన వ్యక్తి సకల ధర్మాలను, శాస్త్రాలనూ తరచిచూస్తాడు.

16. అతని దశమ జన్మలో "ధర్మమేఘు"నిగా మారతాడు. ఈ దశలో బోధిసత్వుడు, బుద్ధుడై అనంత దివ్యదృష్టిని పొందుతాడు

17. బుద్ధునిగా మారినప్పుడు అతనికి వుండవలసిన ఈ పది శక్తులు బోధిసత్వునికి సమకూరుతాయి.

18. [illegible] సంకల్పించిన యీ పది శక్తులనూ పొందటమే

కాకుండా, యీ పది "పారిమితు"లలో సంపూర్ణత్వం సిద్ధించేవరకూ సాధన చేయాలి.

19. ఒక్కొక్క `పారమిత' ఒక్కొక్క జీవనంతో అంతమవుతుంది. పారమితలలో ప్రత్యేక అధ్యయనం క్రమపరిణామంగా జరగాలి. ఒక్కొక్క పారమితకు ఒక జీవితకాలం పడుతుంది. అంతేగాని ఒక జన్మలో దానిలో కొంత, దీనిలో కొంత వుండరాదు.

20. బోధిసత్త్వుడు బుద్ధునిగా మారడానికి యోగ్యత ఈ శక్తులను ద్విగుణీకృతం చేసుకోవడంవలననే కలుగుతుంది.

21. జాతక సిద్ధాంతం లేక బోధిసత్త్వుని జన్మదశలను పరిశీలిస్తే బ్రాహ్మణసిద్ధాంతమైన దేవుని అవతారాలకు పోలిక వున్నట్లు దృగ్గోచరమవుతుంది.

22. తన జీవన సారాంశముగా అత్యున్నత పరిశుద్ధ స్థాయిని బుద్ధుడు కలిగి వుండుట జాతక సిద్ధాంతం ఆధారపడివుంది.

23. అవతార సిద్ధాంతం ప్రకారం దేవుని జన్మ నిర్మలంగా వుండాలని లేదు. బ్రాహ్మణ సిద్ధాంతంలో అవతారాల గురించి చెప్పేది ఏమిటనగా దేవుడు స్వచ్ఛంగా నీతిగా లేక పోయినా, అతని అనుచరులను మాత్రం వివిధ రూపాల్లో సాక్షాత్కరించి రక్షిస్తూ వుంటాడు, అని.

24. బోధిసత్త్వుడు బుద్ధునిగా మారాలంటే ముందుగా పది జన్మలు ఎత్తాలనె నిబంధన ఉన్నట్టు ఏ సిద్ధాంతంలోనూ చెప్పిన దృష్టాంతరాలు లేవు. ఏమతమూ ఆమతప్రవక్తన ఇటువంటి ప్రశ్నకు సమాధానం చెప్పమని ప్రశ్నించదు.

# ఐదవ భాగము

# బుద్ధుడు - అతనికి ముందు వారు

1. బుద్ధుడు - వైదిక ఋషులు
2. తత్త్వవేత్త కపిలుడు
3. బ్రాహ్మణాలు
4. ఉపనిషత్తులు - వాటి బోధనలు

# 1. బుద్ధుడు - వైదిక ఋషులు

1. మంత్రాల సంకలనమే వేదాలు. మంత్రాలంటే ఋక్కులు ఈ ఋక్కులను వల్లిం వారిని ఋషులు అంటారు.

2. ఇంద్రుడు, వరుణుడు, అగ్ని, సోముడు, ఈశన, ప్రజాపతి, బ్రహ్మ, మహిద్ధి, యము మొదలైన దేవగణాల ప్రార్థనలే ఈ మంత్రాలు.

3. శత్రుబారి నుండి రక్షణ కల్పించమని సిరిసంపదలను ప్రసాదించమని, భక్త అర్పించే ఆహారం మాంసం మద్యములను స్వీకరించమని చేసే ప్రార్థనలే మంత్రాలు.

4. ఈ వేదాలలో తాత్త్వికత అంతగా లేదు. కాని కొందరు ఋషులు వీటిని తాత్త్వి దృష్టితో చూసే ప్రయత్నం చేసారు.

5. ఆ వైదిక ఋషులు అగమార్షనుడు, 2. ప్రజాపతి పరమేష్ఠి, 3. బ్రహ్మణస్పతి, బృహస్ప అనికూడా అంటారు. 4. అనిలుడు 5. దీర్ఘ తమస్సుడు, 6. నారాయణు 7. హిరణ్యాగర్భుడు, 8. విశ్వకర్మ.

6. ఈ లోకమెలా ఉద్భవించింది? ఈ సమస్త జీవరాసులూ ఎలా సృష్టించబడ్డాయి. ఐకమత్యంగా కలిసి ఎలా మనగలుగుతున్నాయి. వీటి సృష్టికర్త ఎవరు? వీ నియంత్రించి, పాలించేవారు ఎవరు? ఈ ప్రపంచమంతా దేనినుండి ఆవిర్భవించిం తిరిగి చివరకు అది దేనిలో లీనమయి పోతుంది? ఇవీ ఆ వైదిక ఋషుల తాత్త్వి చింతనలకు సమస్యలకు మౌలికమైన ప్రశ్నలు.

7. ఈ ప్రపంచమంతా తాప ం (ఉష్ణం) నుండి సృజింపబడింది. అనేది ఆగుమార్షణ ఉవాచ. అనంత సృష్టిలోని ప్రకృతి నియమాలకు, సత్యానికి మాతృక, సృజనాత్మ సూత్రం ఈ తామసమే! వీటినుండే రాత్రి (తమస్సు) ఉద్భవించింది. తమస్సు నీ సృష్టించింది. నీటి నుండి కాలం ఉద్భవించింది. ఆ కాలమే సూర్యచంద్రుల స్వర్గాన్ని, ధరిత్రిని, ఆకాశాన్ని, వెలుతురును సృజించి-రాత్రింబవళ్ళను నియంత్రించి

8. శూన్యం నుంచి యీ సృష్టి ఏర్పడిందన్నది బ్రాహ్మణస్పతి సిద్ధాంతం. ఏమీ లే అంటే అతని దృష్టిలో అనంతమని అర్థం. ఏమీలేని దాని (అసత్) నుండి ఈ ఉన (సత్) ఏర్పడిందని, ఈ ఏమీలేని స్థితియే, ఉన్నది అన్నదానికి సాధ్యమై ఉండబో దానికి మూల స్థానమని అతడు బోధించాడు.

9. ఏమీలేని దాని నుండి, ఉన్నది అనేది ఎలా వచ్చింది? అనే ప్రశ్నలో ప్రజాపతి పర

ఈ సృష్టికి మూలపదార్థం నీరేనని అతడంటాడు. ఏమీలేని దాని నుండి గానీ, లేక ఉన్నదాని నుండి గానీ ఈ నీరు వచ్చింది గానీ యిదమిద్ధంగా ఈ రెంటిలో ఏ ఒక్కదాని నుండే వచ్చిఉండదు అని అతని అభిప్రాయం.

10. పదార్థానికీ, ప్రేరణాశక్తికీ, ఏ వ్యత్యాసాన్నీ పరమేష్ఠి చూపలేదు. అతని ఊహాప్రకారం - ఒకానొక అంతర్నిహిత సూత్రాన్ననుసరించి నీరు జీవరాసులుగా రూపాంతరం చెందింది అంటాడు. దానికి ఆయన విశ్వపరివాంఛ, "కామ" అని పేరు పెట్టాడు.

11. అనిలుడు మరొక వైదిక తాత్త్వికుడు. అతడు ఈ సృష్టిలోని పంచభూతాల్లో ప్రధానమైనది గాలి అంటాడు. దానికి చలనశక్తి సహజసిద్ధంగా ఉంది. దాని వలననే ఈ సృష్టి అంతా జరిగింది అంటాడు.

12. సమస్త ప్రాణికోటి సూర్యునిపైననే ఆధారపడి చివరికి సూర్యునిలోనే అంతమవుతాయి అంటాడు. స్వచలనశక్తివలననే సూర్యుడు ఆకాశంలో ఉండి ముందుకు, వెనుకకు పయనిస్తున్నాడు అంటాడు దీర్ఘతామసుడు.

13. బూడిదవర్ణంగల పదార్థంతో ఈ సూర్యుడు ఏర్పడ్డాడనీ, అందుకే మెరుగులు, మంటలు ఏర్పడుతున్నాయని అంటాడు.

14. సూర్యుడు, మెరుపులు, అగ్ని వలన జలబీజం ఏర్పడిందనీ, నీటి నుండే మొక్కలు మొలకెత్తాయి అనేది దీర్ఘతామసుని అభిప్రాయాలు.

15. నారాయణుని సిద్ధాంతం ప్రకారం పురుషుడే (దేవుడు) ఈ విశ్వసృష్టికి మూలకారకుడు. పురుషుని నుండే సూర్యచంద్రులు, భూమి, నీరు, అగ్ని, గాలి, సుడిగాలులు, ఆకాశం, దిక్కులు, ఋతువులు, గాలిలో ఎగిరే కీటకాలు, సకల జంతుజాలం, వివిధ వర్గాల మానవులు, మానవవ్యవస్థలూ, ఉద్భవించాయి.

16. పరమేష్ఠి సిద్ధాంతానికీ, నారాయణ సిద్ధాంతానికీ మధ్యస్థంగా ఉంటుంది. హిరణ్యగర్భుని సిద్ధాంత దృక్పథం. హిరణ్యగర్భ అంటే బంగారు బీజమని అర్థం. అదే ఈ ప్రపంచం యొక్క మహోన్నత శక్తి అనీ, దాని నుండే మిగిలిన శక్తులు, సర్వ జీవరాసుల సృష్టి, దైవ, ప్రాపంచిక శక్తులు ఉద్భవించాయి అంటాడు.

17. హిరణ్యగర్భుడు అంటే అగ్ని అని కూడా అర్థం. ఆ అగ్ని నుండియే సూర్యప్రకాశం వచ్చిందనీ, అదే ఈ ప్రపంచ సృష్టికి మూలసూత్రమని అతని ఉవాచ.

18. విశ్వకర్మ దృక్పథంలో, విశ్వసృష్టికి నీరే మూల పదార్థమనడం అసమంజసమనీ, అదే అదే నిజమైతే, ఆ నీటికి మూలపదార్థం ఏమిటో చెప్పవలసి ఉంటుందని అంటాడు. అందుచేత నీరు మూలపదార్థమని, దానినుండే చలనశక్తి ఏర్పడుతుందని నిరూపించజాలమనీ అతడంటాడు.

19. దేవుడే ఈ చలనశక్తికి మూలకారకుడని విశ్వకర్మ వాదన. దేవుడే ఆదీ, తుదీ. ఈ

దృగ్గోచరమైన విశ్వకర్మసృష్టికి పూర్వమే దేవుడు ఉన్నాడు. ఈ విశ్వాంతరాళ శక్తులు సృజింపబడే ముందే దేవుడున్నాడు. ఈ ప్రపంచాన్నంతటినీ సృష్టించి నడిపించేవాడు దేవుడే. దేవుడు ఒక్కడే. అతని ఆజ్ఞానుబద్ధంగా ఈ ప్రపంచ జీవరాసులు చరిస్తాయి. అతడు (అజుడు)దేని నుండీ పుట్టలేదు. అతడు సర్వశక్తిమంతుడు, సర్వసంకల్పుడు. అతడే సృష్టికారకుడు సృష్టివినాశకుడు . అతడు ఒక తండ్రిగా మనలనందరినీ పుట్టించాడు. మన అందరి విధివ్రాతలూ అతనికి తెలుసు. అతడి ఇష్ట ప్రకారమే అంతా జరుగుతుంది అనేది అతని సిద్ధాంతం.

20. ఈ వైదిక ఋషులు మన్నించదగినవారుగా బుద్ధుడు భావించలేదు, కాని పది మంది మాత్రమే ప్రాచీన ఋషులని వారే "మంత్రా"లను రూపొందించారన్న విషయాన్ని మాత్రం అంగీకరించాడు.

21. నైతికంగా ఉద్ధరించేదేదీ ఈ మంత్రాలలో లేదనేది అతడు గుర్తించాడు.

22. ఎడారిలా నిష్ప్రయోజనమైనవి వేదాలు అనేది అతని ఉద్దేశ్యం.

23. మంత్రాలనుండి స్వీకరించాల్సిందిగానీనేర్చుకోవాల్సింది గానీ ఏదీ లేదని, వాటిని త్రోసిపుచ్చాడు.

24. అదే విధంగా, బుద్ధునికి వైదిక ఋషుల సిద్ధాంతాలలో కూడా ఏమీ కనుపించలేదు. వారు సత్యాన్వేషణకు తాపత్రయపడిన మాట వాస్తవమే కాని, దాన్ని చేరుకోలేక పోయారు అన్నాడు.

25. వారి సిద్ధాంతాలు ఊహాజనితాలేగాని, తర్కబద్ధమైనవి గాని, నిజాలుగాని కావు. వారి తత్త్వసూత్రాల వలన సామాజిక విలువలూ, పాదుకొనలేదు.

26. కాబట్టి వైదిక ఋషుల తత్త్వాన్ని నిరుపయోగమైనదిగా త్రోసిపుచ్చాడు.

## 2. తత్త్వవేత్త కపిలుడు

1. భారతదేశపు ప్రాచీన తత్త్వవేత్తలలో మిక్కిలి ప్రసిద్ధుడు కపిలుడు.

2. అతని తాత్విక దృక్పథం అసమానమైనది. తనదంటూ ఒక ప్రత్యేకతను సంతరించుకున్న తత్త్వవేత్త అతడు. అతడు రూపొందించినదే సాంఖ్యతత్వం.

3. అతని తత్వసూత్రాలు అద్భుతమైనవి.

4. నిరూపించబడనిదేదీ వాస్తవం కాదనేది అతని సాంఖ్య పద్ధతిలోని మొట్టమొదటి ప్రబోధం. దృష్టాంతరం లేనిదేదీ వాస్తవం కాదు.

5. వాస్తవాన్ని నిర్ధారించేందుకు కపిలుడు రెండే రెండు సాక్ష్యాలను ఆమోదించాడు. అవి

1. ఇంద్రియ గ్రాహ్యత 2. రాబట్టేది.

6. ఒక ప్రత్యక్ష వస్తువును మనోగతంగా గుర్తించి తెలుసుకోవడం ఇంద్రియ గ్రాహ్యత.

7. రాబట్టటంలో మూడు అంశాలున్నాయి: 1. కారణం నుండి ఫలితం మేఘాల ఉనికిని బట్టి వర్షం 2. ఫలితం నుండి కారణాన్ని - వాగులలో పొంగిపొరలే జలప్రవాహాల వలన కొండలలోపడిన వర్షం 3. సాదృశ్య పరిశీలన; ఒకడు ఉన్న చోటునుండి మరోచోటుకు కదలినప్పుడు స్థలం మారుతుంది. వేర్వేరు స్థలాల్లో నక్షత్రాలు కనిపిస్తున్నాయి గనుక అవి కూడా కదులుతున్నాయి.

8. అతని తదుపరి సూత్రం కార్యకారణ సంబంధమైనది. సృష్టి, దాని కారణం.

9. ఏదో ఒక అతీతశక్తి ప్రపంచాన్ని సృష్టించింది అనే సిద్ధాంతాన్ని కపిలుడు తిరస్కరించాడు. కుండ తయారు చేసే ముందుగా మట్టిఉన్నట్లుగా, బట్టలు తయారుచేసే పూర్వమే దారాలు ఉన్నట్లుగా, ఈ సమస్త జీవరాసులు అవతరించడానికి పూర్వమే, దానికి కారణభూతమైనదొకటి ఉందని అతని అభిప్రాయం.

10. ఈ ప్రపంచాన్ని సృష్టించిన శక్తి ఒకటి ఉందనే సిద్ధాంతాన్ని త్రోసిపుచ్చడానికి గల మొదటి కారణం యిదే.

11. తన వాదానికి సంబంధించి యితర కారణాలను కూడా అతడు చూపించాడు.

12. లేనిదేదీ క్రియా రూపం దాల్చలేదు. క్రొత్తగా సృష్టించబడినది ఏదీ లేదు. ఒక ఉత్పాదన - అది తయారయిన మూలపదార్థమే కాని నిజంగా వేరు కాదు. రూపొందించిన ఆకారం పొందడానికి ముందే ఉత్పాదన మూలపదార్థపు రూపంలో ఉంటుంది. అటువంటి మూలపదార్థంతో మాత్రమే ఒక నిర్దిష్టమైన వస్తువు తయారవుతుంది. ఒక నిర్దిష్ట పదార్థం మాత్రమే నిర్దిష్ట ఫలితాన్ని యిస్తుంది.

13. అలాంటప్పుడు, ఈ విశ్వసృష్టికి మూలాధారమేది?

14. వ్యక్త వస్తువులు, అవ్యక్త వస్తువులు అని ఈ విశ్వంలో ఉన్నాయని కపిలుడన్నాడు.

15. వ్యక్త వస్తువుల నుండి అవ్యక్త వస్తువులు ఉద్భవించవు.

16. ప్రతివస్తువునకు ఒక మిత పరిమాణమంటూ ఉంటుంది. ఈ విశ్వపు మూల స్వభావానికీ దానికీ పొంతన ఉండదు.

17. సమస్త వస్తువులు ఒకదాని కొకటి సాదృశ్యత కలవే. అందుచేత ఒక దానికి మరొకటి మూలం కాజాలదు. పైగా అన్నీ ఒకే మూలం నించి రావటంవల్ల అవే మూలం కాజాలవు.

18. కారణానికి, ఫలితానికి తప్పకుండా వ్యత్యాసం ఉంటుంది అని కపిలుడు అంటాడు. కాకపోతే ఫలితంలో గర్భితంగా కారణం ఉంటుంది. అందుచేత విశ్వం దానికదే

అంతిమ కారణం కాజాలదు. అది ఒక అంతిమ కారణపు ఉత్పాదన మాత్రమే.

19. అవ్యక్తమైనవి మన కెందుకు గ్రాహ్యం కావు? మనకు గ్రాహ్యమయ్యే కదలికను అవి ఎందుకు చూపవు? అనే సందేహాలను కపిలుడు ఈవిధంగా నివృత్తి చేసాడు.

20. దానికి కారణాలు అనేకం ఉండవచ్చు. అవ్యక్తమైనవి కొన్ని అత్యంత సూక్ష్మ రూపంలో ఉండడం చేత మనకు గ్రాహ్యం కాకపోవచ్చు. మరికొన్ని మరీ దూరంగా లేదా మరీ దగ్గరగా ఉండవచ్చు. మూడో వస్తువు జోక్యం ఉండవచ్చు. లేక దానికంటే మరింత శక్తివంతమైన అనుభూతితో అది మరుగుపరచబడవచ్చు. ఇంకా మన ఇంద్రియ, మానసికలోపాలు ఉండవచ్చు.

21. అయితే ఈ సమస్త సృష్టికి మూలపదార్థం ఏమిటనే ప్రశ్నకు కపిలుని సమాధానమేమిటి? ఈ విశ్వంలో వ్యక్తావ్యక్త భాగాలకు ఉన్న వ్యత్యాస స్వభావమేమిటి?

22. ఈ విశ్వంలో వ్యక్త వస్తువులకు ఒక కారణం ఉంటుంది. అలాగే అవ్యక్తమైన వాటికి కూడా ఒక కారణం ఉంటుంది. అయితే ఈ రెండింటి మూలం స్వతస్సిద్ధం, స్వతంత్రం అయినటువంటిది.

23. వ్యక్తమైనవి బహుసంఖ్యాకాలు. పరిధిలో, పేర్లలో పరిమితమైనవి. వాటి మూలపదార్థం ఒక్కటే. అది విశ్వవ్యాప్తంశాశ్వతం. వ్యక్తవస్తువులకి క్రియలు, భాగాలు ఉంటాయి. మూలపదార్థం వీటన్నింటిలో వెన్నంటి ఉన్నప్పటికీ దానికి క్రియలూ, భాగాలూ లేవు.

24. అవ్యక్త వస్తువుల వికాసం వాటి మూడు భాగాల ద్వారా జరుగుతుంది. అవి సత్వ, రజో, తామస గుణాలు. వాటినే త్రిగుణాలు అంటారు.

25. సత్వగుణం మనం వెలుతురు అనే దానికి సమమైనది. అది ఆహ్లాదం కలిగిస్తుంది. రజోగుణం వలన చలనం ఏర్పడి కార్యకలాపాలు జరుగుతాయి. తామసగుణం భారంగా ఉండి నిష్క్రియ, నిర్లిప్తతలను కలిగించే స్థితిని అదుపుచేస్తుంది.

26. ఈ మూడు గుణాలు, ఒక దానితో మరొకటి అవినాభావ సంబంధం కలిగి ఉంటాయి. ఒకదానికింకొటి సహకరించుకుంటూ ఉంటాయి. వెలిగించిన ప్రమిదకు అడుగున నూనె, అందులో వత్తి, ఆపైన జ్యోతిలా ఆ మూడు గుణాలు కలిసి ఒక క్రియకు కారణమవుతాయి.

27. అయితే ఈ మూడు గుణాలు సమతుల్యంలో ఉండవు. అవి ఒకదానిపై మరొకటి ఆధిపత్యానికి ప్రాకులాడకపోతే ఈ ప్రపంచమే "అచేతన"మై, వికాసం నిలిచి పోతుంది.

28. ఈ మూడు గుణాలు సమతుల్యత పాటించకుండా, ఒకదానిపై అధికంగా మరొకటి ఉన్నపుడే ఈ ప్రపంచం "సచేతన" మై వికాసం మొదలవుతుంది.

29. ఈ మూడు గుణాలు సమతుల్యంగా ఎందుకు ఉండవు అని ప్రశ్నిస్తే, ఈ మూడు గుణాల సమతుల్యత చెడటానికి కారణం దుఃఖం ఉండటమే అని సమాధానమిచ్చాడు.

30. కపిలుని సిద్ధాంతమలా సాగింది.

31. తత్త్వవేత్తలందరిలోనూ కపిలుని సిద్ధాంతమే బుద్ధుని ఎక్కువగా ఆకర్షించింది.

32. వాస్తవం, తర్కం మీద ఆధారపడి చెప్పినదే కపిలుని సిద్ధాంతమని బుద్ధుడు అభిప్రాయపడ్డాడు.

33. అయితే కపిలుని సిద్ధాంతాన్ని బుద్ధుడు పూర్తిగా అంగీకరించలేదు. దానిలో మూడింటిని మాత్రమే అంగీకరించాడు.

4. ఒకటి వాస్తవమని నమ్మేందుకు, ఒక ఋజువు ఉండాలన్నది మొదటిది. హేతుబద్ధమైన ఆలోచన ఉండాలి.

5. దేవుడనే వాడొకడున్నాడని నమ్మేందుకు హేతుబద్ధమైన వాస్తవమైన, ఆధారమేదీ లేదు. దేవుడే విశ్వసృష్టికర్త అని అనటం కూడ యిలాంటిదే అన్న కపిలుని వాదనను బుద్ధుడు అంగీకరించాడు.

6. ప్రపంచంలో దుఃఖము ఉందని గూడా బుద్ధుడంగీకరించాడు.

7. అంతకు మించి కపిలుడు చెప్పిన మిగతా సిద్ధాంతమంతా తనకు పట్టనిదని బుద్ధుడు భావించాడు.

## 3. బ్రాహ్మణాలు

. వేదాల తరువాత - చెప్పుకోదగ్గ మతగ్రంథాలకు బ్రాహ్మణాలని పేరు. వేదాలు, బ్రాహ్మణాలు రెండూ పవిత్రంగా భావిస్తారు. నిజానికి వేదాలలో భాగమే బ్రాహ్మణాలు. రెండింటిని కలిపి శృతులని పిలుస్తారు.

. ఈ బ్రాహ్మణాలకు సంబంధించిన తత్వమంతా నాలుగు వాదనలపై ఆధారపడి ఉన్నది.

. వేదాలు పవిత్రమైనవనీ, దోషరహితమైనవనీ, వాటిని ప్రశ్నించ రాదన్నది వాటిలో మొదటిది.

. చనిపోయిన తరువాత ఆత్మ మరో జన్మ ఎత్తకుండా మోక్షసాయుజ్యం పొందేందుకు యజ్ఞయాగాదులు నిర్వహించి బ్రాహ్మణులకు ఉదారంగా దానాలనివ్వాలని చెప్పడం రెండవది.

ఈ బ్రాహ్మణాలు వేదాల్లో ఉన్నా ఒక ఆదర్శమైన మతాన్నే కాక ఆదర్శమైన సమాజాన్ని సైతం రూపొందించాయి.

ఈ ఆదర్శప్రాయ సామాజిక విధానానికి "చాతుర్వర్ణ్యం" అని పేరు. వేదాలు దోష

రహితమైనవనీ, వాటిని ప్రశ్నించరాదని చెప్పబడినట్లే ఒక సమాజపు నమూనాగా చాతుర్వర్ణ్యం సైతం దోష రహితమైనదని ప్రశ్నించరాదని చెప్పబడింది.

ఈ సామాజిక వ్యవస్థ నిర్మాణానికి కొన్ని నిబంధనలు రూపొందించబడినవి.

ఆ నిబంధనలలో బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర కులాల ఏర్పాటు మొదటిది.

ఈ నాలుగు వర్ణాల మధ్య సాంఘిక సమానత్వముండరాదనేది రెండవ నిబంధన. శ్రేణీపర అసమానత్వంతో ఇవి నాలుగూ కలిసికట్టుగా ఉంటాయి.

ఈ నాలుగు వర్ణాలలో బ్రాహ్మణులు అన్నింటికంటే పై స్థాయిలో ఉంటారు. క్షత్రియులు వారికంటే క్రింది స్థాయిలోను, తక్కిన వర్ణాల కంటే పై స్థాయిలోను ఉంటారు. వైశ్యులు క్షత్రియుల కంటే క్రింది స్థాయిలోనో, శూద్రుల కంటే పై స్థాయిలోనూ ఉంటారు. పై మూడు వర్ణాలకు క్రింది స్థాయిలో శూద్రులుంటారు.

ఈ నాలుగు వర్ణాల హక్కులు, సౌకర్యాలు సైతం శ్రేణీపర అసమానత్వరీతిలోనే ఉంటాయి.

బ్రాహ్మణుల హక్కులకు, సౌకర్యాలకు పరిమితి అంటూ లేదు. అంతా వారి అభీష్టమే. బ్రాహ్మణులకున్నన్ని హక్కులు, సౌకర్యాలు క్షత్రియులు కోరేందుకు వీలు లేదు. అయితే వైశ్యుల కంటే వారి కెక్కువగా ఉంటాయి. వైశ్యులకు క్షత్రియుల కంటే తక్కువ ఉంటాయి. అయితే శూద్రులకు ఎలాంటి హక్కులు, సౌకర్యాలు ఉండవు. పై వర్ణాల వారి దయాదాక్షిణ్యాలపై లభించేవి మాత్రమే. వారు మారుమాట్లాడ కుండా స్వీకరించటమే వారి గౌరవ హక్కు.

ఈ చాతుర్వర్ణ సిద్ధాంతంలో వృత్తి విభజన మూడవది. జ్ఞానసముపార్జన, శాస్త్రబోధన, మతవిధులను నిర్వహించడం బ్రాహ్మణుల వృత్తి. యుద్ధాలు చేయటం క్షత్రియుల వృత్తి. వ్యాపారం చేయటం వైశ్యుల వృత్తి. పై మూడు వర్ణాల వారికి సేవ చేయడం శూద్రుల వృత్తి. ఏ వర్ణం వారు ఆ వృత్తినే నిర్వహించాలి. ఎలాంటి పరిస్థితులలోనూ ఒక వర్ణం వారు మరో వర్ణం వృత్తిలోకి చొరబడరాదు.

- శాస్త్రాధ్యయనానికి సంబంధించినది నాల్గవది. బ్రాహ్మణులు, వైశ్యులు, క్షత్రియులు మాత్రమే శాస్త్రాధ్యయనానికి అర్హులు. విద్యనేర్చుకొనే హక్కు శూద్రుల కెంత మాత్రమూ లేదు. అయితే ఈ హక్కు శూద్రులకే గాక పై మూడు కులాలలోని స్త్రీలకు సైతం నిషిద్ధమే.

- ఐదవ నిబంధన జీవన విధానానికి సంబంధించినది. జీవితం నాలుగు దశలుగా విభజింపబడినది. మొదటిది బ్రహ్మచర్యం. రెండవది గృహస్థాశ్రమం, మూడవది వానప్రస్థం, నాల్గవది సన్యాసం.

- రెండవ దశలో వైవాహిక జీవనం గడపాలి. మూడవ దశలో ఇల్లు విడిచి పోకుండానే సన్యాసి జీవనంతో పరిచయం, కుటుంబ బంధాల తెగతెంపులు జరగాలి. నాల్గవదశలో

సమస్త బంధాలు విడనాడి దైవాన్వేషణలో గడిపి కడకు ఆ దేవునిలో ఐక్యమైపోవాలి.

17. అయితే ఈ నాలుగు దశలు పై మూడు వర్ణాలలోని పురుషులకు మాత్రమే వర్తిస్తాయి. శూద్రులకు, స్త్రీలకు బ్రహ్మచర్యాశ్రమం నిషిద్ధం. అలాగే సన్యాసాశ్రమానికి సైతం వీరు అర్హులు గారు.

18. ఆదర్శప్రాయసమాజం కొరకు దైవికంగా ఏర్పాటైనదని జెప్పబడే ఈ చాతుర్వర్ణ్య సిద్ధాంతం ఇట్లా ఉంటుంది. వాస్తవంగా బ్రాహ్మణులే ఎంతో నేర్పుగా ఎలాంటి మార్పులకు చేర్పులకు అవకాశం లేకుండా రూపొందించారు.

19. బ్రాహ్మణులకు చెందిన తత్త్వవిచారణలో నాల్గవది "కర్మ" సిద్ధాంతం. పునర్జన్మ సిద్ధాంతంలో భాగమే యిది. మరో జన్మలో ఈ జీవాత్మ ఎక్కడ రూపం ధరిస్తుందన్న ప్రశ్నకు కర్మసిద్ధాంతం జవాబు. బ్రాహ్మణాలు యిచ్చే సమాధానం క్రితం జన్మలో మనిషి చేసిన కర్మలను బట్టే ఉంటుందని అనగా అతడి కర్మను బట్టి ఉంటుంది.

20. వేదాలు దోషరహితమైనవనీ, వాటి ప్రామాణికతను ప్రశ్నించరాదన్న బ్రహ్మణాల తొలి సిద్ధాంతాన్ని బుద్ధుడు తిరస్కరించాడు.

21. దోషరహితంగాని దంటూ ఏదీ ఉండజాలదనీ ఏ సిద్ధాంతమూ శాశ్వతమైనదని జెప్పేందుకు వీలులేదనీ బుద్ధుడు వాదించాడు. ప్రతి సిద్ధాంతం మళ్ళీ మళ్ళీ పరిశీలింపబడాలనీ అప్పుడే అది మరింత నిగ్గు తేలుతుందనీ అన్నాడు.

22. మానవునికి సత్యం, అసలు సత్యం తెలియాలి. ఆ విషయంలో ఆలోచనా స్వేచ్ఛ ఉండి తీరాలి. అప్పుడే మానవుడు సత్యం కనుగొనగలుగుతున్నాడు.

23. వేదాలను ప్రశ్నించడానికి వీల్లేదనడమంటే ఆలోచనా స్వేచ్ఛను అరికట్టడమే. దాని వలన సత్యాన్ని తెలుసుకునే అవకాశం నిరాకరింపబడినదన్న మాట.

24. ఆ కారణంగా వేదాలు దోషరహితమైనవని జెప్పడం బుద్ధుడికి జుగుప్సాకరంగా తోచింది.

25. యజ్ఞయాగాదులకు సంబంధించిన రెండవ బ్రాహ్మణ సిద్ధాంతాన్ని సైతం బుద్ధుడు తీవ్రంగా వ్యతిరేకించాడు. యజ్ఞయాగాదుల పేర్లతో మూగజీవాల్ని అగ్నికి అర్పణ చేయడం త్యాగంగా వారు భావిస్తారు. త్యాగం మంచిదే. అయితే త్యాగం జేయడంలో భేదమున్నది.

26. పరుల హితం కొరకు తనకు కాకుండా చేసుకోవటం నిజమైన త్యాగం. కాని తనకేదో మేలు జరగాలన్న స్వార్థంతో మూగ జీవాలను బలి యివ్వడం బూటకపు త్యాగం.

27. బ్రాహ్మణాల యజ్ఞయాగాదుల్లో మూగ జీవాలను బలి యిచ్చి తద్వారా దేముడు ప్రసన్నుడవుతాడని భావించేవారు, దీనిని బూటకపు త్యాగంగా బుద్ధుడు ఖండించాడు.

ఆత్మకు మోక్షం సిద్ధిస్తుందన్న వెర్రిభ్రమలతో అలాంటి బలులు నిర్వహించడం బుద్ధుడు తీవ్రంగా వ్యతిరేకించాడు.

28. అమాయక జంతువులను బలి యివ్వడం ద్వారా మోక్షం సిద్ధించడం వాస్తవమే అయినట్లయితే ఒకడు తన తండ్రినే బలి యివ్వడం ద్వారా ఇంకా శీఘ్రంగా మోక్షం పొందవచ్చు గదా అని ఈ యజ్ఞాలను వ్యతిరేకించే వారు బ్రాహ్మణాలను ఆటపట్టించే వారు.

29. బుద్ధుడు ఆ వాదాన్ని మనఃపూర్వకంగా అంగీకరించాడు.

30. బుద్ధుడు యజ్ఞ బలులను రోసినట్లే. చాతుర్వర్ణ్య సిద్ధాంతాన్ని సైతం జుగుప్సాకరంగా భావించాడు.

31. బ్రాహ్మణులు వ్యవస్థీకరించిన చాతుర్వర్ణ్య విధానం సహజసిద్ధమైనది కాదని బుద్ధుడు భావించాడు. ఇష్టారాజ్యంగా బలవంతంగా ఈ వర్గీకరణ రూపొందింపబడింది. ఎవరో తమ ప్రీతి కొరకు తమకు కావలసినట్లుగా దీనిని రూపొందించారు. అలాగాక బాహాటమూ, స్వేచ్ఛాయుతమూ అయిన సామాజిక వ్యవస్థ ఏర్పాటు కావాలన్నాడు బుద్ధుడు.

32. బ్రాహ్మణులచే వ్యవస్థీకరింపబడిన యీ చాతుర్వర్ణ్య విధానంలో మార్పుకు ఎలాంటి అవకాశం లేదు. ఒకసారి బ్రాహ్మణుడైన వాడు ఆసాంతం బ్రాహ్మణుడే. క్షత్రియ వర్ణంలో బుట్టిన వాడు క్షత్రియుడే. అదే విధంగా శూద్ర వర్ణంలో బుట్టిన వాడు శూద్రుడే. పుట్టుకను బట్టే ఒకడి వర్ణం ఏర్పడుతుంది. గుణహీనుడికి తక్కువ స్థాయి గాని మహాసద్గుణ సంపన్నుడికి ఉన్నత స్థాయి గాని అసాధ్యం. వ్యక్తి యోగ్యతకు గాని, పెరుగుదలకు గాని ఎలాంటి అవకాశము లేదు.

33. ప్రతి సమాజంలోను అసమానత్వం ఉంటుంది. కాని బ్రాహ్మణ మతంలో ఇది వేరు. వారు బోధించే అసమానత్వమనేది వారి అధికారిక సిద్ధాంతం గాని సమాజంలో సహజ సిద్ధంగా ఎదిగింది కాదు. బ్రాహ్మణమతానికి సమానత్వంలో నమ్మకం లేదు. పైగా దాన్ని వ్యతిరేకిస్తుంది కూడ.

34. ఒక్క అసమానత్వంతో ఇది ఆగలేదు. అసమానత్వం ఆరోహణా పద్ధతిలో రూపొందింపబడటమే బ్రాహ్మణ మతపు అంతరార్థం.

35. సమాజంలో సామరస్యం మాట అట్లా ఉంచి, బ్రాహ్మణులు రూపొందించిన ఈ ఆరోహణ పద్ధతి అసమానత్వం వలన పై వాళ్ళకు క్రింది వారి పట్ల ద్వేషం, క్రింది వారికి పై వారి పట్ల అసూయ ఏర్పడేలా చేసిందనీ, ఆ కారణంగా సమాజం సంక్షుభితమైనదనీ బుద్ధుడు భావించాడు.

36. నాలుగు వర్ణాల వృత్తులు గూడ స్థిరీకరింపబడినవి. ఎవరి కిష్టమైన వృత్తిని వారు చేపట్టేందుకెంత మాత్రము వీలు పడదు. నైపుణ్యంతో నిమిత్తం లేకుండా ఒకరు ఏ వర్ణంలో పుడతారో వారా వర్ణం వృత్తినేజేపట్టాలి.

37. చాతుర్వర్ణ్య విధానంలోని వృత్తి నిర్ణయ విధానాన్ని జాగ్రత్తగా పరిశీలించిన బుద్ధుడు బ్రాహ్మణులు తప్పుగా స్వార్థబుద్ధితోనే ఈ సామాజిక విధానం రూపొందించారని గ్రహించాడు.

38. ఇది అందరి ప్రయోజనాల్ని పరిరక్షించక పోవడమేగాక అందరికీ క్షేమాన్ని పెంచేదిగా అసలే లేదని గూడా తెలుసుకున్నాడు.

39. ఇది దుర్బలులను త్రొక్కిపెట్టి వారిని తమ ఇష్టానుసారం వాడుకోవాలన్న దుర్బుద్ధితో ఏర్పాటు చేశారని తెలుసుకున్నాడు.

40. బ్రాహ్మణులు రూపొందించిన కర్మ సిద్ధాంతం ఫలితంగా పీడితులు తిరుగబడే మనస్తత్వాన్ని కోల్పోయారు. గత జన్మలో తాము చేసిన కర్మానుసారం ఈ జన్మలో ఈ దుస్థితి కలిగిందని బాధితుడు భావిస్తున్నాడు. తన హీన స్థితికి మరెవ్వరు కారకులు గారని నమ్ముతున్నప్పుడు తాను తిరుగుబాటు జేసేందుకు వీలుండదన్న వాస్తవాన్ని బుద్ధుడు గ్రహించాడు.

41. శూద్రులు, స్త్రీలలో ఈ మానసిక వైకల్యం బలంగా ఏర్పడిపోవడంతో వారు వ్యవస్థపై తిరుగుబాటు చేయలేకపోయారు.

42. జ్ఞాన సముపార్జన కెలాంటి అవకాశం లేకుండ అజ్ఞానంలోనే వారినుంచేయడంతో వారి హీన పరిస్థితికి కారకులెవ్వరన్నది వారి ఊహకందని విషయమైంది. జీవితపు విలువల్ని వారి నుండి బ్రాహ్మణులే బలవంతాన దోచుకున్నారన్న విషయం వారు గ్రహించ లేకపోయారు. వారినణచివేసిన ఆయుధాన్ని సమర్థిస్తూ బ్రాహ్మణుల పట్ల భక్తిప్రపత్తులతో మెలగసాగారు.

43. మానవుడు స్వేచ్ఛ కోసం పోరాడేందుకు ఆఖరు సాధనం ఆయుధమే. కాని శూద్రులు ఆయుధాలు ధరించే హక్కేలేకుండ సిద్ధాంతీకరించబడింది.

44. ఈ బ్రాహ్మణ మతం వలన శూద్రులు నిస్సహాయులై స్వార్థబుద్ధితో రూపొందిన కుట్రలో బలిపశువులై పోగా క్షత్రియులు బలవంతులుగాను, వైశ్యులు ధనవంతులుగాను రూపొందారు.

45. అయితే ఈ వ్యవస్థను మార్చేందుకు వీలౌతుందా? ఇది స్వయానా దేవుడే ఏర్పాటు చేశాడని భావిస్తున్నంతవరకు దాన్ని మార్చడం సాధ్యపడదు.

46. ఈ సత్యాన్ని గ్రహించిన బుద్ధుడు ఈ బ్రాహ్మణ మతాన్ని తిరస్కరించాడు. ఇది న్యాయబద్ధమైన సామాజిక విధానం కాజాలదని చెప్పాడు.

## 4. ఉపనిషత్తులు - వాటి బోధనలు

1. ఉపనిషత్తులు సాహిత్యంలో వేరొక భాగం. అవి వేదాల్లో భాగం కావు. అవి అపౌరుషేయాలు కావు.

2. అయినా అవి మత సాహిత్యంలో ఒక భాగమైనాయి.
3. ఉపనిషత్తులు బహుసంఖ్యాకాలు. కొన్ని ప్రధానమయినవి. మరికొన్ని అప్రధానమైనవి.
4. వేదశాస్త్ర ప్రబోధకులైన బ్రాహ్మణమత గురువులకు ప్రతికూలంగా కొన్ని ఉన్నాయి.
5. వేదాధ్యయనం, అజ్ఞానానికి, మూఢత్వానికీ దారి తీస్తుందని ఇవి ఒప్పుకున్నాయి.
6. చతుర్వేదాలు, వేదశాస్త్రం నిమ్నస్థాయికి చెందిన జ్ఞానంగా ఇవన్నీ ఏకగ్రీవంగా అంచనావేశాయి.
7. వేదాలు దైవదత్తమైనవనే విషయాన్ని అవి సవాలు చేసాయి.
8. బ్రాహ్మణ్యంలో మౌలికమైన బలులు, శ్రాద్ధ కర్మలు, యజ్ఞ విధులు, సంభావనల ప్రయోజకత్వాన్ని అవన్నీ తిరస్కరించాయి.
9. ఈ పై విషయాలే ఉపనిషత్తులు చేపట్టిన ప్రధాన అంశాలు కావు. వాటి చర్చ "ఆత్మ" "బ్రహ్మ లపై కేంద్రీకృతమైంది.
10. సర్వత్రావ్యాపించి ఉండి విశ్వాన్నంతా శాసించే మూలసూత్రమే బ్రహ్మ. తాను బ్రహ్మనని ఆత్మ గుర్తించడంవల్లనే మోక్షం సిద్ధిస్తుంది.
11. బ్రహ్మయే సత్యమనీ, ఆత్మ, బ్రహ్మలు ఒక్కటేనని ఉపనిషత్తుల ప్రధాన సిద్ధాంతం. ఆత్మ బ్రహ్మమని గుర్తించుకోలేక పోతున్నది. దీనికి కారణం అది "ఉపాధుల"లో చిక్కుకు పోవడమే.
12. "బ్రహ్మ సత్యమేనా?" అనేది ప్రశ్న. ఈ ప్రశ్నకు యిచ్చే సమాధానం మీదనే. ఉపనిషత్తుల తాత్త్విక సిద్ధాంతాలను ఆమోదించడం ఆధారపడి ఉంది.
13. "బ్రహ్మయే సత్యము" అనే సిద్ధాంతానికి ఆధారభూతమైన ఏ దృష్టాంత మూ బుద్ధునికి గోచరించలేదు.
14. ఉపనిషత్ భాష్యకారులను ఈ విషయమై ప్రశ్నించలేదు అని భావించరాదు. వారినిట్లా ప్రశ్నించారు.
15. అటువంటి ప్రశ్నలను, గొప్ప ఋషి, బృహదారణ్యకోపనిషత్తును రూపొందించడంలో గణనీయమైన పాత్రవహించిన యాజ్ఞవల్క్యుడినే అడగడం జరిగింది.
16. "బ్రహ్మ అంటే ఏమి? ఆత్మ అనగా ఏమి?" అని అతన్ని ప్రశ్నించగా - "నేతి ! నేతి! నాకు తెలియదు! నాకు తెలియదు! అని మాత్రమే సమాధానమివ్వగలిగాడు.
17. "దాన్ని గురించి ఎవ్వరికీ ఏమీ తెలియనపుడది యదార్థం ఎలా అవుతుంది? అని బుద్ధుడు ప్రశ్నించాడు. అందువలన, ఉపనిషత్తుల ప్రతిపాదన కేవలం ఊహాజనితమేనని బుద్ధుడు సునాయాసంగా త్రోసి పుచ్చాడు.

# ఆరవ భాగం

# బుద్ధుడు అతని సమకాలీనులు

1. అతని సమకాలీనులు
2. సమకాలికులఎడల అతని దృక్పథం

# 1. అతని సమకాలీనులు

గౌతముడు పరివ్రాజం స్వీకరించే సమయానికి దేశంలో గొప్ప జ్ఞానపిపాస పెల్లుబుకుతూ వుండేది. బ్రాహ్మణ్య సిద్ధాంతమే కాకుండా, దగ్గర దగ్గరగా 62 సిద్ధాంతాలు, అన్నీ బ్రాహ్మణ్య సిద్ధాంతాన్ని వ్యతిరేకించేవే వుండేవి. వాటిలో కనీసం ఆరు గుర్తించదగినవి.

వీటిలో, పురాణ కశ్యపుడు అధిపతిగా వుండి బోధించే సిద్ధాంతం ఒకటి వుండేది. అక్రియావాదం ఏ విధంగాను కర్మ ప్రభావం ఆత్మపై వుండదని అతని బోధన. ఒకడు ఏదైనా చేయవచ్చు లేక చేయించవచ్చు. ఒకడు చంపవచ్చు, లేక చంపడానికి మరొక వ్యక్తిని వినియోగించవచ్చు. ఒకడు దొంగతనం, దోపిడి చేయవచ్చు. లేదా దొంగతనాలు, దోపిడీలు జరిపించవచ్చు. ఒకడు వ్యభిచరించవచ్చు లేదా వ్యభిచారం జరిపించవచ్చు; ఒకడు అబద్ధమాడవచ్చు. లేదా అబద్ధము చెప్పించవచ్చు. ఏదీ కూడా ఆత్మపై క్రియ {ప్రభావం} చూపలేవు. ఎంతటి దుష్కార్యాన్ని చేసినా, ఏ పాపం ఆత్మకు అంటదు. చేసింది ఎంత మంచి పని అయినా, ఆత్మకే విధమైన విశిష్టత ఒనకూరదు. దేనికీ ఆత్మపై ఏ విధమైన ఫలితాలూ వుండవు. ఒక వ్యక్తి మరణించినప్పుడు ఏవైతే ధాతువులతో అతని శరీరం తయారైనదో, అధాతువులన్నీ, వాటి అసలు స్థానానికి వెళ్ళిపోతాయి. చనిపోయిన తర్వాత శరీరంగానీ, ఆత్మగానీ- ఏదీ మిగలదు.

ఇంకొక సిద్ధాంతం "నియతి వాదం" అంటారు. మ ఖలిగోశాలు దీని ప్రధాన ప్రవక్త. అన్నిటికీ 'అదృష్టమే' ప్రధానపాత్ర వహిస్తుంది అనీ; పూర్వనిర్ధారణ ప్రకారమే అన్నీ జరుగుతాయనీ అతని ప్రబోధం. ఎవ్వరూ కూడా దేనికీ కర్తలుకాలేరు. విధి వ్రాతనెవరూ తప్పించుకోలేరు. ఏవైనా వాటంతటవే జరుగుతాయి. ఎవ్వరూ ఆ విధంగా జరిగేటట్లు చేయలేరు. ఒకరి విచారాన్ని మరెవరూ తొలగించలేరు, పెంచలేరు లేక తగ్గించలేరు. ప్రపంచంలో తనవంతు భాగాన్ని ప్రతివాడూ అనుభవించి తీరాలి.

మూడవ విధానాన్ని ఉచ్ఛేద వాదమని అంటారు. దాన్ని రూపొందించినవాడు అజిత కేశకంబళుడు. ఒక రకమైన వినాశ వాదమతని సిద్ధాంతం. యజ్ఞ, హోమాలలో ఏమీ లేదని, ఆత్మ అనుభవించ వలసిన సత్క్రియా ఫలితాలు, దుష్క్రియాపరిణామాలు అనేవి ఏవీ వుండవని అతడు ప్రబోధించాడు. స్వర్గమని గాని, నరకమని గానీ ఏదీ లేదు. ప్రపంచంలోని దుఃఖభాజకమైన కొన్ని అంశాలతో మానవుడు వుద్భవించాడు. ఆత్మ వీటిని తప్పించుకోలేదు. ఏవైతే విచారం, దుఃఖం ఈ లోకంలో వున్నాయో, వాటిని ఆత్మ ఏ విధంగానూ తప్పించు కోలేదు. అప్రయత్నంగా ఆ విచారం,దుఃఖం వాటికవే అంతమవుతాయి. ఎనభైఅయిదు లక్షల మహాకల్పవృత్త కాలంలో యీ ఆత్మ పునర్జన్మల నెత్తవలసి వుంటుంది. అప్పుడే ఆత్మయొక్క విషాదం, విచారం అంతమౌతుంది. అంతేకానీ, అంతకు ముందు గానీ, మరే విధంగా గానీ అంతరించదు.

5. 'అన్యోన్యవాద' మనేది నాల్గవ మార్గం. పకుధ కాచ్చాయన (కాత్యాయనుడు) యీ సిద్ధాంత కర్త. పృథ్వి, అప, తేజ, వాయు, సుఖ, దుఃఖ, ఆత్మ అనే ఏడు అంశాల కలయికతోనే జీవి వుద్భవిస్తుందని అతడు వుద్బోధించాడు. పై అంశాలన్నీ వేటికవే స్వతంత్రమైనవి. ఒక దాని ప్రభావం మరొక దానిపై వుండదు. అవి స్వయంభువులు, నాశములేనివి. ఒకడు మరొకని తలనరికివేస్తే, అది అతను చంపినట్లుకాదు. అక్కడ జరిగిందేమిటంటే చంపడానికై వాడిన ఆయుధము (కత్తి) ఏడు ధాతువులలోనికీ చేరినదన్నమాట.

6. సంజయ బేలపుత్రడు తన స్వంత వాదాన్ని బోధించేవాడు. దాన్నే విక్షేపవాదమనేవారు. అది ఒక సంశయాత్మక వాదం. అతడిలా వాదించేవాడు. "ఎవరైనా నన్నుస్వర్గం అనేది వుందా?" అని అడిగితే, వుందని నేను భావిస్తే, వుంది అని అంటాను. స్వర్గం లేదని నేను భావిస్తే 'లేదు' అని సమాధానము చెపుతాను. మానవులు సృష్టించబడ్డారా? మంచిఅయినా, చెడుఅయినా, మానవుడు తాను చేసిన కర్మ ఫలితం అనుభవించాలా? చనిపోయిన తర్వాత కూడా ఆత్మ జీవించి వుంటుందా? అని ఎవరైనా నన్ను ప్రశ్నించితే, వీటన్నిటికీ "లేదు" అనే సమాధాన మిస్తాను. ఎందుకంటే అవంటూ అసలు వున్నాయని నేననుకోను. ఈ విధంగా సంజయ బేలపుత్తుడు తన సిద్ధాంతాన్ని వివరించాడు.

7. చాతుర్యాం సంవారవాదమనేది ఆరవ మార్గం. మహావీరుడు, నిగంధ బేలపుత్రడు అని పిలవబడే యీ సిద్ధాంత కర్త, గౌతముడు వెలుగును వెదికే తరుణంలో జీవించి వుండేవాడు. యీ జన్మలోను, పూర్వజన్మలోను చేసుకున్న దుష్కర్మలవలన, ఆత్మ పునర్జన్మ నెత్తవలసి వుంటుందని అతడు బోధించేడు. తపశ్చర్య ద్వారా చెడుని తొలగించుకోవాలని అతడు సలహాయిచ్చాడు.చాతుర్యమధర్మాలనుపాటించ వలసినదిగా అతడు సూచించాడు. ఆ నాలుగు నియమాలు 1. చంపరాదు 2. దొంగిలించరాదు 3. అబద్ధ మాడరాదు 4. ఆస్తులను సంపాదించరాదు, బ్రహ్మచర్యాన్ని అవలంబించాలి.

## 2. సమకాలికుల ఎడల అతని దృక్పథం

1. ఈ నూతన తాత్త్వికుల సిద్ధాంతాలను బుద్ధుడు అంగీకరించలేదు.

2. అతడలా అంగీకరించకపోవడానికి కారణాలు లేక పోలేదు. అతడిలా అన్నాడు:

3. పురాణ కశ్యపుని, లేక పకుధ కచ్చాయనుని సిద్ధాంతాలు నిజమే అయితే దుష్కార్యాలు, దుర్మార్గాలు అందరూ చేయగలరు. సామాజిక బాధ్యతనూ, సామాజిక పరిణామాలనూ విస్మరించి ఒకడు యింకొకడిని చంపే ఘాతుకానికి ఒడికట్టవచ్చు.

4. మఖాలి గోశాలుని సిద్ధాంతమేనిజమైతే అతడు విధికి బానిసైపోతాడు. అతడు ముక్తిని పొందలేడు.

అజిత కేశకంబళుని సిద్ధాంతమే నిజమైతే, మనిషి చేయవలసినదంతా తినీ, తాగీ, తందనాలు తొక్కటంమాత్రమే.

సంజయ బేలపుత్రుని సిద్ధాంతమే సత్యమైనదైతే మానవుడు జీవితంపట్ల ఏ సద్భావం లేకుండా నిర్లిప్తంగా కాలక్షేపం చేయాలి.

నిగంతనాథపుత్రుని సిద్ధాంతమే నిజమైతే, మానవుడు తన కోరికలను సహజ ప్రవృత్తులను సమూలంగా పెకలించుకుని వైరాగ్యాన్ని, తపశ్చర్యని అవలంబించాలి.

ఆ విధంగా తాత్త్వికులు బోధించిన సిద్ధాంతాలలో దేనినీ బుద్ధుడు అంగీకరించలేదు. అవి నిరాశాపరులు, నిస్సహాయులు, తెంపరుల మనోభావాలు మాత్రమేనని అతడు భావించాడు. కాబట్టి వెలుగు కోసం మరొకచోట అన్వేషించాలని అతడు నిర్ణయించుకున్నాడు.

# ఏడవ భాగం

# సాదృశ్య వ్యత్యాసాలు

1. అతడు నిరాకరించినవి
2. అతడు సవరించినవి
3. అతడు అమోదించినవి

# 1. అతడు నిరాకరించినవి

తాత్విక, ధార్మిక చింతన యొక్క యీ సమీక్షనుబట్టి బుద్ధుడు తన "శాసనం" రూపొందించిన కాలంలో కొన్ని భావాలు ప్రజల మనస్సులలో బలంగా నాటుకుపోయి వున్నాయన్న విషయం అవగతమౌతుంది. అవి ఏవంటే:

1. వేదాలు దోషరహితమని నమ్మడం.
2. ఆత్మకు మోక్షసిద్ధి కలుగుతుందని, అది కలుగనప్పుడు పునర్జన్మలనెత్తవలెనని నమ్మడం.
3. మోక్షసాధనకు విధులు, క్రతువులు, బలుల ప్రభావం వుందని నమ్మడం
4. సాంఘిక వ్యవస్థలో చాతుర్వర్ణ్య విభజన తగినదని నమ్మడం.
5. ప్రపంచానికంతటికీ సృష్టికర్త ఈశ్వరుడనీ, దానికి బ్రహ్మం ఆధారభూతసూత్రమనీ నమ్మడం.
6. ఆత్మ వున్నదనీ నమ్మడం.
7. వివిధ లోకాలు వున్నాయనీ, ఆత్మ పునర్జన్మ ఎత్తుతూ ఈ లోకాల మధ్య తిరుగాడుతూ వుంటుందని నమ్మడం.
8. గత జన్మలో చేసిన కర్మఫలితాలు యీ జన్మలో అనుభవించాలన్న కర్మసిద్ధాంతాన్ని విశ్వసించడం.

   1. తన శాసన నియమాలను రూపొందించటంలో పాత భావజాలాన్ని బుద్ధుడు కూడా తన స్వంతపద్ధతిలో పరిశీలించాడు.
   2. ఈ క్రింది భావాలను అతడు నిరాకరించాడు.

      1. నేనెవరిని, ఎక్కడి నుండి వచ్చాను, ఎక్కడికి వెళ్తాను అని చేసే వూహాగానాన్ని ఖండించాడు.
      2. ఆత్మ గురించి వున్న పిచ్చి భ్రమల నన్నింటినిత్రోసిపుచ్చాడు. ఆత్మను శరీరంతో, అనుభూతులతో, సంకల్పంతో, స్పృహతో జోడించే ప్రయత్నాలనుండి దూరంగా వున్నాడు.
      3. కొందరు ధర్మాచార్యులు బోధించిన శూన్యవాద తత్వాలను త్రోసిపుచ్చాడు.
      4. మత విరోధుల భావాలను ఖండించాడు.

5. ఈ విశ్వవ్యాప్తికి మనకు తెలిసిన ఒక ఆరంభం వున్నదనే సిద్ధాంతాన్ని అతడు నిరాకరించాడు.

6. దేవుడు మానవుని సృష్టించాడనీ, లేక బ్రహ్మ శరీరం నుండి వెలువడ్డాడనే సిద్ధాంతాన్ని అతడు త్రోసిపుచ్చాడు.

7. ఆత్మ వునికిని అతడు నిరాకరించాడు లేదా విస్మరించాడు.

## 2. అతడు సవరించినవి

1. మహోదాత్తమైన కార్యకారణ నియతిని, దాని పర్యవసాన వుపసిద్ధాంతాలను అతడు ఆమోదించాడు.

2. మానవ ప్రమేయం లేకుండా సర్వం విధివిహితమనే వాదాన్ని, మనిషికీ లోకానికీ ఏం జరగాలో దేవుడు అంతా ముందే నిర్ణయించాడని చెప్పే అంతే మతిహీన వాదాన్ని అతడు త్రోసిపుచ్చాడు.

3. ఈ నాటి కార్యకలాపాన్ని నిర్వీర్యపరుస్తూ, ఏ పూర్వజన్మలోనో చేసిన కర్మలు ఇప్పుడు దుఃఖాన్ని కలిగిస్తాయనే సిద్ధాంతాన్ని తిరస్కరించాడు. కర్మసిద్ధాంతపు విధి విహితవాదాన్ని కాదన్నాడు. దాని స్థానంలో మరింత శాస్త్రీయమైన కర్మవాదాన్ని ప్రవచించాడు. పాత సీసాలో కొత్త ద్రాక్షారసం అందించాడు.

4. ఆత్మ వలన సిద్ధాంతం (సంసార) స్థానంలో పునర్జన్మ వాదం నెలకొల్పాడు.

5. మోక్షం లేదా ఆత్మ పరిపాకం సిద్ధాంత స్థానంలో నిబ్బాన ధర్మాన్ని ప్రతిష్ఠించాడు. ఆ విధంగా బుద్ధ శాసనం పూర్తిగా స్వకీయమైనది. దానిలో సూక్ష్మంగా పాతదేదైనా వుంటే, దానిని సవరించాడు లేదా పునర్నిర్మించాడు.

## 3. అతడామోదించినవి

1. సకలకార్యకలాపాలకు మనస్సే కేంద్రస్థానంగా గుర్తించటం అతని బోధనలలోని మొదటి విశిష్టాంశం.

2. అన్ని విషయాలకూ మనస్సు ముందుంటుంది. అది వాటిని శాసిస్తుంది, సృష్టిస్తుంది. మనస్సు అవగతమైతే అన్నివిషయాలూ అవగతమయినట్లే.

3. దాని అన్ని శక్తి యుక్తులలోనూ నాయకస్థానం మనస్సుదే. అదే ప్రధానమైనది. అసలు మనస్సే వాటన్నిటి సమాహారం.

4. మనస్సును సంస్కరించుకోవటమే మొదట చెయ్యవలసిన పని.

5. మనలోపలినించి పొడమరించినా, బయటి నుంచి సంప్రాప్తించినా - మంచీ చెడూ

అంతటికీ మనస్సే ఊట. ఇది బుద్ధుని బోధనల్లో రెండో విశిష్టాంశం.

6. చెడు ఏదైనా, చెడుకి సంబంధించినదేదైనా, చెడుకి చెందినదేదైనా - అది మనస్సు నుండే ప్రసరిస్తుంది. మంచి ఏదైనా, మంచికి సంబంధించినదేదైనా, మంచికి చెందిన దేదైనా - అంతా మనస్సు నుండే ప్రసరిస్తుంది.
7. అణగారిన మనస్సుతో ఏది చెప్పినా, చేసినా - బండి ఎద్దుల మడమల వెన్నంటే బండి చక్రాలు అనుసరించినట్లు, ఉపద్రవం మనిషిని వెంబడిస్తుంది. అందుకే మనస్సును క్షాళనం చేసుకోవటం మతసారం అవుతుంది.
8. పాపభూయిష్ఠమైన అన్నికార్యాలను పరిహరించటం అతని బోధనలో మూడవ విశిష్టాంశం.
9. నిజమైన మతం మత గ్రంధాల్లో ఉండవు. ఆ మతసూత్రాలను పాటించడంలోనే వుంటుందని అతని బోధనలోని నాలుగవ విశిష్టాంశం.
10. బుద్ధుని మతం అతడు స్వయంగా సృష్టించింది కాదు అని ఎవరైనా అనగలరా?

అనువాదం: డా. భార్గవి పి. రావు

# రెండవ అధ్యాయం
# దీక్షా ప్రచారం

1. వ భాగం - బుద్ధుని విషాదయోగం

2. వ భాగం - పరివ్రాజకులకు దీక్ష

3. వ భాగం - ఉన్నతులు, పవిత్రులకు దీక్ష

4. వ భాగం - ఇంటినుంచి పిలుపు

5. వ భాగం - దీక్షాప్రసారం పునఃప్రారంభం

6. వ భాగం - నిమ్నజాతులవారికి దీక్ష

7. వ భాగం - మహిళలకు దీక్ష

8. వ భాగం - పతితులు, నేరస్థులకు దీక్ష

# మొదటి భాగం

# బుద్ధుని విషాదయోగం

1. ఉపదేశించడమా. మానడమా?
2. శుభవార్తమానం ప్రకటించిన బ్రహ్మసహంపతి
3. రెండురకాల దీక్షలు

# 1. ఉపదేశించడమా, మానడమా?

. జ్ఞానోదయం కలిగి, తన మార్గాన్ని రూపొందించుకున్న తర్వాత, బుద్ధుని మనస్సులో సంశయం తలెత్తింది. తనకు లభించిన జ్ఞానాన్ని ఇతరులకు బోధించడమా? లేక స్వీయ వ్యక్తిత్వపరిపూర్ణతకు తన జీవితాన్ని వెచ్చించడమా?

2. ఆయన ఇలా తలపోశారు: నేనొక కొత్త ధర్మాన్ని కనుగొన్న మాట నిజమే. అయితే సామాన్య మానవుడికి దాన్ని ఆమోదించడం, ఆచరించడం చాలా కష్టం. వివేక వంతులకు కూడా అది బోధింపబడటం కష్టమే.

3. పరమాత్మ, ఆత్మ అనే బంధనాల నుంచి విముక్తి పొందటం మానవజాతికి కష్టతరమైన పని. క్రతువులు, కర్మకాండల విశ్వాసాన్ని వదులుకోవడం కూడా కష్టం. అదేవిధంగా కర్మసిద్ధాంతంలో నమ్మకంవదులుకోవడం మానవజాతికి ఎంతో కష్టం.

4. ఆత్మ అమరమని అనాదిగా ఉన్న నమ్మకాన్ని వదులుకొని, ఆత్మ అనేదానికి స్వతంత్ర మైన అస్తిత్వమే లేదనీ, మరణానంతరం దానికి ఉనికి ఉండదనీ నేను చెప్పే సిద్ధాంతాన్ని ఆమోదించడం మానవ జాతికిదుస్సాధ్యం.

5. మానవజాతి స్వార్థాన్ని వదులుకోక పోవడమే కాక, తన స్వార్థపరత్వంలో ఆనందం పొందుతుంది. స్వార్థం కంటే ధర్మం ముఖ్యమనే నా సిద్ధాంతాన్ని ఆమోదించడం మానవునికి కష్టమే. నేను నా ధర్మాన్ని బోధించి, ఇతరులు దాన్ని అర్థం చేసుకోక పోయినా, లేక అర్థం చేసుకున్నప్పటికీ ఆమోదించకపోయినా, లేక ఆమోదించికూడా ఆచరించక పోయినా, అది వారికి శ్రమను, నాకు విసుగును కలిగించడం తప్ప లాభంలేదు.

7. అంతకంటే ఈ ప్రపంచానికి దూరంగా సన్యాసిలా జీవిస్తూ, నా ధర్మం ద్వారా నేను పరిపూర్ణతను సాధించవచ్చు గదా" అని ఆయన తనకు తాను ప్రశ్నించుకున్నాడు. "ఆరకంగా కనీసం నాకైనా నేను మంచి చేసుకోగలుగుతాను"

8. ఈ రకంగా తర్కించుకుంటూ నిష్క్రియత్వంలో పడిపోయాడు. బుద్ధుడు తన ధర్మాన్ని బోధించడానికి ప్రయత్నించ లేదు.

9. బుద్ధుని మనస్సులో చెలరేగుతున్న ఆలోచనలను పసిగట్టిన బ్రహ్మసహంపతి ఇలా అనుకున్నాడు,"జ్ఞానదీప్తి పొందిన తథాగతుడు కర్తవ్యవిమూఢుడై, ధర్మబోధ చేయక మిన్నకుంటే, ప్రపంచం సర్వనాశనం కాక తప్పదు."

10. ఇలా ఆందోళనా మనస్కుడై బ్రహ్మసహంపతి వెంటనే బ్రహ్మలోకాన్నివదిలి బుద్ధుని ఎదుట ప్రత్యక్షమయ్యాడు. తన ఉత్తరీయాన్ని సవరించుకుని, చేతులు జోడించి,

వినమ్రుడై, "నువ్వు ఇకపై సిద్ధార్థ గౌతముడివి కావు, బుద్ధుడివి. దైవానుగ్రహం పొంది సంపూర్ణ జ్ఞానోదయం పొందిన వాడివి. తథాగతుడివి. ప్రపంచాన్ని జాగృతం చేయడానికి నీవెలా నిరాకరించగలవు? తప్పు మార్గంలో నడుస్తున్న మానవుని రక్షించేందుకు నీవెలా నిరాకరించగలవు?"

11. ధర్మబోధ విననందువల్ల పతనమౌతున్న అపవిత్రులు చాలామంది ఉన్నారు.

12. ప్రాచీనకాలంలో లోపభూయిష్టమైన విధానాలతోకూడిన మలిన సిద్ధాంతాలు మగధులలో తలెత్తిన విషయం తథాగతునికి తెలిసిందే.

13 "తథాగతుడు తన ఆజరామరమైన సిద్ధాంతాలద్వారాన్ని వారికోసం తెరవలేరా"?

14. "పర్వత శిఖరాగ్రంపై నిల్చున్న వ్యక్తి తన క్రిందనున్న ప్రజలను పరికించినట్లు, విజ్ఞానివై శోకమెరుగని నీవు నీచుట్టూఉన్న దుఃఖభాజనులను ఒక్కసారి పరికించిచూడు.

15. హితుడా, విజయుడా, గణనాయకుడా, జన్మరహితుడా, ప్రపంచంలోకి వెళ్ళు, దాని నుంచి విముఖుడవు కావచ్చు.

16. తథాగతుడు సదయుడై తనధర్మసూత్రాన్ని మానవులకు, దేవతలకు ఉపదేశించుగాక."

17. దానికి బుద్ధుడు ఈ విధంగా సమాధానమిచ్చాడు: "ఓ మానవోత్తముడా, బ్రహ్మదేవుడా, నా చుట్టుపక్కల అలసట కనిపించినందు వల్లే, నేను నా ధర్మాన్ని బహిరంగంగా బోధించడానికి వెనుకాడాను."

18. ప్రపంచంలో ఇంత దుఃఖం వుందని తెలిసి కూడా తను చేతులు ముడుచుకుని సన్యాసిలా కూర్చోవడం అనుచితమని బుద్ధుడు గ్రహించాడు.

19. సర్వసంగపరిత్యాగం నిష్ప్రయోజకమని ఆయన కనుగొన్నాడు. ప్రపంచం నుండి తప్పించుకోవాలని అనుకోవడం అవివేకమని అతను గ్రహించాడు. ప్రపంచం నుంచి తప్పించుకోవడం సన్యాసికి కూడాసాధ్యంకాదు. ప్రపంచం నుంచి పారిపోవడం కాదు, తను చేయవలసిన పని. ప్రపంచాన్ని మార్చి, మరింత ఉన్నతంగా దాన్ని తీర్చిదిద్దడం అవసరం.

20. ప్రపంచంలోని నిరంతర సంఘర్షణ, దుఃఖాన్ని, వేదనను కలిగించడం, దానికి పరిష్కారం తెలియక పోవడం వల్లే తను ప్రపంచాన్ని త్యజించానని ఆయన గ్రహించారు. తన బోధనలద్వారా ప్రపంచంలో ఈ వేదనను, దుఃఖాన్ని పరిహరించగలిగితే, ఆ పని చేయడమే తన కర్తవ్యంగాని, మూర్తీభవించిన క్రియా శూన్యుడిలా స్తబ్దుగా కూర్చోవడం కాదు.

21. ఈ విధంగా ఆలోచించిన బుద్ధుడు బ్రహ్మసహంపతి విజ్ఞప్తినిమన్నించి ప్రపంచానికి ధర్మోపదేశం చేయడానికి నిర్ణయించాడు.

## 2. శుభవర్తమానం ప్రకటించిన బ్రహ్మసహంపతి

అంతట బ్రహ్మసహంపతి "బుద్ధుడిని జనులకు ధర్మబోధ చేయడానికి ఒప్పించడానికి నేనే కారకుడినయ్యాను" అనుకొని అపరిమితానందం పొందాడు. బుద్ధునికి నమస్కరించి, ప్రదక్షిణంచేసి, తనదోవన తాను వెళ్ళాడు.

మార్గమధ్యంలో సకల ప్రపంచానికీ అతను ఈ విధంగా ఎలుగెత్తి చాటాడు: "ఈ శుభ వర్తమానం విని ఆనందించండి. మన ప్రభువైన బుద్ధుడు పాపానికీ దుఃఖానికి గల మూల కారణాలను కనుగొన్నాడు. వాటికి పరిష్కారంకూడా కనుగొన్నాడు.

. విసుగు చెందిన వారికి, విషాద జీవులకు ఆయన ఓదార్పు కలిగిస్తాడు. యుద్ధ బాధితులకు ప్రశాంతత చేకూరుస్తాడు. హృదయం ముక్కలై క్రుంగిపోతున్న వారికి ధైర్యాన్ని కలిగిస్తాడు. అణచివేతకు, దమనకాండకు గురైన వారికి నమ్మకాన్ని, ఆశల్ని కలిగిస్తాడు.

. **జీవితాంతం**సమస్యలతోసతమతమౌతున్న మీరు, పోరాటం జరుపుతూ, బాధను సహిస్తూ బతుకుతున్న మీరు, న్యాయం కోసం పరితపిస్తున్న మీరు, ఈ శుభ వర్తమానం విని ఆనందించండి.

. గాయపడ్డ మీరు మీ గాయాలను నయం చేసుకోండి, ఆకలిగొన్న మీరు కడుపు నిండుగా భుజించండి. అలసిపోయిన మీరు విశ్రమించండి, దాహంగొన్న మీరు దప్పిక తీర్చుకోండి, అంధకారంలోవున్న మీరు వెలుగును అన్వేషించండి. నిస్పృహలో కుములుతున్న మీరు ఉత్సాహవంతులు కండి.

6. బుద్ధుని ధర్మంలో - అనాథలను ఆదుకోవాలన్న తపనను సృష్టించే ప్రేమ వుంది. పతనావస్థలో వున్నవారిని ఉద్ధరించడానికి అవసరమైన ఔన్నత్యం వుంది. అధమ తరగతికి, నిరుపేద వర్గానికి చెందినవారిని ప్రగతిపథంలోకి నడిపించగల సమతాదృష్టి వుంది.

7. ఆయన బోధన న్యాయ సమత్వాల ధర్మం. ఆయన లక్ష్యం న్యాయశోభితమైన సమసమాజ నిర్మాణం.

8. ఆయన ధర్మమే సత్యం - సంపూర్ణ సత్యం. సత్యం కాక మరేదో అందులో లేదు.

9. తథాగతుడైన బుద్ధుని మార్గం హేతుబద్ధమైంది. మూఢనమ్మకాలనుంచి విముక్తమైనది. మధ్యమమార్గాన్ని బోధించినది. న్యాయబద్ధమైన శాసనాన్ని ఉపదేశించేది. నిర్వాణం వల్ల కలిగే శాంతిని చెప్పేది. తోటిప్రజలకు సాయుజ్యం కలిగించడానికై ప్రేమ, దయ, సహజీవన ధర్మాలను వారికి బోధించేది."

## 3. రెండురకాల దీక్షలు

1. బుద్ధుని సిద్ధాంతం ప్రకారం దీక్షకు రెండు అర్థాలున్నాయి.

2. భిక్షాశ్రేణికి ఇచ్చే దీక్షను "సంఘం" అంటారు.
3. ఒక గృహస్థుడిని బౌద్ధధర్మం అనుయాయిగాకాక ఉపాసకునిగా మార్చే దీక్ష రెండవది.
4. భిక్షుకులకు, ఉపాసకులకు జీవనవిధానంలో, నాలుగు వ్యత్యాసాలు మాత్రమే ఉన్నాయి.
5. ఉపాసకుడు గృహస్థుడిగానే ఉంటాడు. భిక్షుకుడు సంచార జీవనం గడుపుతాడు.
6. ఉపాసకులు, భిక్షుకులు కూడా కొన్ని నిబంధనలను పాటించాలి.
7. భిక్షుకులు కొన్ని ప్రతినలు చేయాలి. వాటిని ఉల్లంఘిస్తే శిక్ష అనుభవించాలి. ఉపాసకులకు కొన్ని ఆదేశసూత్రాలుంటాయి. వాటిని అతను తన శక్తిమేరకు ఆచరించవలసి వుంటుంది.
8. ఉపాసకునికి ఆస్తి వుండవచ్చు. భిక్షుకునికి ఆస్తులు ఉండకూడదు.
9. ఉపాసకుడుకావడానికి ఎటువంటి సంస్కారవిధీ ఉండదు.
10. భిక్షుకునికి మాత్రం `ఉప సంపద' అనే సంస్కారవిధి ఉంటుంది.
11. బుద్ధుడు తనవద్దకు వచ్చినవారికి, వారి వారి యిష్టాన్ని బట్టి భిక్షకుడుగాను, ఉపాసకుని గానూ దీక్ష ఇచ్చాడు.
12. ఉపాసకుడు కావాలనుకున్నపుడు భిక్షుకునిగా మారవచ్చు.
13. కాని ఒక భిక్షుకుడు తన దీక్షలలో దేన్నయినా ఉల్లంఘించినా, భిక్షుకగణం సభ్యత్వం విరమించదలచుకున్నా, ఆ క్షణం నుంచి అతన్ని భిక్షుకునిగా పరిగణించడం జరగదు.
14. ఈ పుస్తకంలో పై పేర్కొన్నవారికి మాత్రమే బుద్ధుడు దీక్ష యిచ్చారని అర్థం చేసుకోకూడదు.
15. సంఘంలో చేర్చుకోవడానికే ధర్మబోధన. బుద్ధుడు వర్గ, లింగ వివక్ష చూపలేదని చెప్పడానికి ఉపకరించే సన్నివేశాలను మాత్రమే ఇందులో చేర్చడం జరిగింది.

# రెండవ భాగం

# 1. సారనాథ్‌లో ప్రవేశం

1. తన ధర్మాన్ని బోధించడానికి బుద్ధుడు నిర్ణయించుకున్న తర్వాత "నేను మొట్టమొదట ఎవరికి నా సిద్ధాంతాన్ని బోధించను?" అని ప్రశ్నించుకున్నాడు. జ్ఞానిగా, వివేకిగా, పరిశుద్ధుడిగా తనుపరిగణించే అల రకాలం బుద్ధునికి గుర్తుకు వచ్చాడు. "అతనికే నా ధర్మాన్ని మొట్టమొదట బోధిస్తే ఎలావుంటుంది?" అనుకున్నాడు. కానీ అతను మరణించాడని బుద్ధునికి తెలియవచ్చింది.

2. ఆ తర్వాత ఉద్దక రామ పుత్రునికి బోధించాలని అనుకున్నాడు. కానీ అతను కూడా మరణించాడని తెలిసింది.

3. అప్పుడు అతనికి తను నిరంజనలో కఠిననిష్ఠలు నిర్వహిస్తూండగా తనసహచరులుగా ఉండిన ఐదుగురు జ్ఞాపకం వచ్చారు. తను వాటిని మానేసినందుకు కోపగించి, ఆ ఐదుగురు కోపగించి, తనను వదిలి వెళ్ళారు.

4. "వారు నా కోసం చాలా చేశారు, నా అవసరాలు తీర్చేవారు. మొదట వారికే ఉపదేశిస్తే బాగుంటుందేమో" అనుకున్నాడు.

5. వెంటనే వారి జాడ తెలుసుకున్నాడు. వారు ఇసిపట్నం లేళ్ళవనం లోని సారనాథ్‌లో వున్నట్టు తెలుసుకొని, వారిని వెతుక్కుంటూ వెళ్ళాడు.

6. ఆ ఐదుగురు, బుద్ధుడు రావడం గమనించి, అతనికి ఆహ్వానం పలకకూడదని నిశ్చయించుకున్నారు. వారిలో ఒకరు ఇలాఅన్నారు, "మిత్రులారా, నిష్ఠలను, పవిత్రజీవనాన్ని వదిలివేసి, విలాసవంతమైన జీవితం గడుపుతున్న విరాగి గౌతముడు వస్తున్నాడు. అతను పాపచరితుడు. కనక, మనం అతనికి నమస్కరించకూడదు, ఆదరించకూడదు, అతని భిక్షాపాత్రను, ఉత్తరీయాన్ని అందుకోకూడదు. కావాలంటే అతనికొక స్థానం విడిగా చూపిద్దాం. ఇష్టం వుంటే, అతను కూర్చుంటాడు." తక్కినవారు ఈ నిర్ణయంతో ఏకీభవించారు.

7. బుద్ధుడు వారిని సమీపించగానే, ఐదుగురు పరివ్రాజకులు తమ నిర్ణయాన్ని మరచిపోయారు. బుద్ధుని తేజస్సుకు అప్రతిభులై, అప్రయత్నంగా లేచి నిల్చున్నారు. ఒకడు భిక్షాపాత్రను అందుకోగా, మరొకడు ఉత్తరీయాన్ని తీసుకున్నాడు. ఇంకొకడు ఆసనం సిద్ధం చేయగా, నాలుగో వ్యక్తి బుద్ధుని పాదప్రక్షాళనానికి నీరు తెచ్చాడు.

8. ఆహ్వానించ కూడదనుకున్న అతిథికి ఈ రకంగా వారు ఘనస్వాగతం చెప్పారు.

9. బుద్ధుని అవహేళన చేద్దామనుకున్న వారే అతన్ని అర్చించసాగారు.

# 2. బుద్ధుని తొలి ఉపదేశం

1. పరస్పరపరామర్శలు ముగిసిన పిమ్మట, ఆ ఐదుగురు పరివ్రాజకులు, బుద్ధుడు ఇంకా వైరాగ్యం విశ్వసిస్తున్నారా అని ప్రశ్నించారు. బుద్ధుడు లేదని చెప్పాడు.

2. మానవ జీవితంలో ఒకవైపు ఆనందమే పరమలక్ష్యమైన విధానము, రెండోవైపు ఆత్మపరిత్యాగమే పరమలక్ష్యమైన విధానమని రెండు విపరీత ధోరణులున్నాయని బుద్ధుడు చెప్పాడు.

3. మనం హాయిగా తిని, తాగి, కులాసా చేద్దాం, ఎందుకంటే రేపటికి జీవించి వుంటామో లేదో తెలియదు' అనేది మొదటి ధోరణి అయితే, వాంఛలన్నింటినీ పరిహరించాలి, లేని పక్షంలో పునర్జన్మ తప్పదు అనేది రెండవధోరణి. ఇవి రెండూ ఉచితమైనవికావని బుద్ధుడు చెప్పాడు.

4. ఈ రెండింటికీ మధ్యమమార్గం అభిలషణీయమనీ, సంపూర్ణ ఆత్మాభిమానం, ఆత్మపరిత్యాగం రెండూ ఆచరణయోగ్యంకావనీ బుద్ధుడు చెప్పాడు.

5. పరివ్రాజకులతో ఆయన ఈ విధంగా అన్నాడు:" నాకీవిషయం చెప్పండి. మీ మన శ్శరీరాలు ప్రాపంచిక సుఖాలకోసం వెంపర్లాడుతున్నంతకాలం, ఆత్మపరిత్యాగం నిష్ప్రయోజకం కాదా?" దానికి పరివ్రాజకులు, "మీరు చెప్పింది నిజమే" అన్నారు.

6. "ఆత్మ పరిత్యాగం ద్వారా మీలోని వాంఛాగ్నిని చల్లార్చడంలో కృతకృత్యులు కానంత కాలం, సన్యాసి జీవితం గడపడంలో అర్థం ఏమిటి ?" అని బుద్ధుడు అడగ్గా, "ఔను, మీరు చెప్పింది నిజమే" అన్నారు పరివ్రాజకులు.

7. "నీ అహాన్ని నీవు జయించినపుడే వాంఛనుంచి విముక్తుడవౌతావు. అప్పుడే నీవు ప్రాపంచిక సుఖాలనుకోరుకోవు. నీ సహజమైన అవసరాల పరితృప్తి నిన్ను మలిన పరచదుకూడా. కనుక నీ శరారానికి అవసరమైనంత మేరకు నీవు తినాలి, తాగాలి.

8. దైహికవాంఛ ఏరకమైనదైనా మనిషిని నిర్వీర్యుణ్ణి చేస్తుంది. వాంఛాపూరితుడైన మనిషి తన కోర్కెలకు బానిసఅవుతాడు, అన్నిరకాల సుఖలాలస నీచమైనది. అశ్లీలమైనది. కాని జీవించడానికి అవసరమైనకోర్కెలు తీర్చుకోవడం పాపంకాదు, నీ శరీరాన్ని ఆరోగ్యంగా ఉంచుకోవడం నీ కర్తవ్యం, లేకపోతే నీ మనసును స్పష్టంగా, స్థిరంగా చేసుకొని, జ్ఞానజ్యోతిని వెలిగించుకోలేవు.

9. కనుక, పరివ్రాజకులారా! ఈ రెండు విపరీతవిధానాలను అవలంబించ కూడదని గుర్తుంచుకోండి. ఒక వైపు నీచమైన, అయోగ్యమైన, నిష్ప్రయోజకమైన దైహికవాంఛలను సంతృప్తిపరచుకోవడమే జీవితంగా భావించకూడదు, మరోవైపు బాధాకరమూ, అయోగ్యమూ, నిష్ప్రయోజకమూ అయిన వైరాగ్య జీవితవిధానంగా భావించకూడదు.

10. ఈ రెండు విపరీత ధోరణులకూ మధ్యమమార్గాన్ని చేపట్టాలి. నేను బోధించే మార్గం అదే.

11. అయిదుగురు పరివ్రాజకులు బుద్ధుని మాటలను సావధానంగా విన్నారు. బుద్ధుని మధ్యమ మార్గం గురించి ఏంమాట్లాడాలో తెలియక, తాము వెళ్ళిపోయిన తరువాత నుంచి బుద్ధుడు ఏం చేసాడని వారు ప్రశ్నించారు. అంతట బుద్ధుడు, తను గయకు వెళ్ళడం, అక్కడ బోధివృక్షం కింద ధ్యానంచేయడం నాలుగువారాల ధ్యానం అనంతరం తనకు జ్ఞానోదయం కలిగి, ఈ సరికొత్త మార్గాన్ని కనుక్కోవడం వివరించాడు.

12. ఇది వినగానే, పరివ్రాజకులు పరమఆసక్తితో, ఆ మార్గం గురించి వివరించమని బుద్ధుని కోరారు.

13. బుద్ధుడు అంగీకరించాడు.

14. తన వివరణను ప్రారంభిస్తూ తన ధర్మానికి భగవంతుడితో, ఆత్మతో నిమిత్తంలేదని బుద్ధుడు చెప్పాడు. తన ధర్మానికి మరణానంతర జీవితంతో కూడా ప్రమేయం లేదని ఆయన చెప్పాడు. అదేవిధంగా కర్మకాండకు, క్రతువులకు తన ధర్మంలో స్థానం లేదని ఆయన వివరించాడు.

15. తన ధర్మానికి కేంద్రం మానవుడు, ఈ భూమిపై మనిషిలో మనిషికి వున్న సంబంధాలేనని ఆయన చెప్పారు.

16. ఇదే తన మొట్టమొదటి ధర్మసూత్రమని ఆయన అన్నారు.

17. ఆయన రెండవసూత్రం ప్రకారం మనిషి విషాదంలో, దుఃఖంలో, పేదరికంలో బతుకుతున్నాడు. మనిషి దుఃఖాన్ని ఎలా ఉపశమింపచేయడమన్నదే తన ధర్మానికివున్న ఏకైక లక్ష్యం. అది తప్ప, ధర్మమంటే మరేది కాదు.

18. దుఃఖం ఉనికిని గుర్తించడం, దుఃఖాన్ని తొలగించేమార్గం అన్వేషించడమే తన ధర్మానికి పునాదులు.

19. ఏ ధర్మానికైనా ఇదే ప్రాతిపదిక కాగలదు. దీన్ని గుర్తించని మతం అసలు మతమే కాదు.

20. "ప్రపంచ వ్యాప్తంగా వున్న దుఃఖం, దాని నివారణలే మతం పరిశీలించ వలసిన అంశాలని తెలియని బ్రాహ్మణులు, సన్యాసులు నిజమైన బ్రాహ్మణులుగానీ, సన్యాసులుగానీ కానేకారు. ధర్మం యొక్క యధార్థమైన అర్థాన్ని వీరెవరూ గుర్తించడం లేదు."

21. అంతట పరివ్రాజకులు ఇలా ప్రశ్నించారు. "మీ ధర్మం ప్రాతిపదిక, దుఃఖం ఉనికిని గుర్తించడం, దాన్ని తొలగించడమే అయితే, మీ ధర్మం దుఃఖాన్ని ఎలా తొలగిస్తుందో సెలవియ్యండి."

22. బుద్ధుడు వారితో, ప్రతివ్యక్తి (1) శుద్ధపథం (2) ధర్మపథం (3) శీలపథం

అనుసరించినట్లయితే, దుఃఖం అంతమౌతుందని చెప్పాడు.

23. ఇటువంటి ధర్మాన్ని తను కనుగొన్నాడని ఆయన చెప్పారు.

# 3. బుద్ధుని తొలి ఉపదేశం - (కొనసాగింపు)

## శుద్ధపథం

1. అంతట ఆ పరివ్రాజకులు బుద్ధుని అతని ధర్మాన్ని వివరించవలసిందని కోరారు.

2. బుద్ధుడు ఆనందంగా అంగీకరించాడు.

3. మొట్టమొదటి శుద్ధపథం గురించి ఆయున వారికి చెప్పాడు.

4. శుద్ధపథం ప్రకారం, ఒక వ్యక్తి మంచి వాడిగా బ్రతకాలంటే, కొన్ని ఆదర్శాలను గుర్తించ వలసి వుంటుంది.

5. జీవితంలో పాటించవలసిన ఆదర్శాలు ఇవి : ఎవరినీ గాయపరచకూడదు, చంపకూడదు, ఇతరులకు చెందిన వస్తువును దొంగిలించడంగానీ, స్వంతం చేసుకోవడం గానీ కూడదు, అసత్యం చెప్పకూడదు, మత్తుపానీయాలు సేవించ కూడదు.

6. "ఈ ఆదర్శాలను గుర్తించడం, ప్రతి వ్యక్తికీ అతిముఖ్యమని నేనంటాను. ఎందుకంటే, ప్రతి మనిషికీ తన ప్రవర్తనను బేరీజువేయడానికి ఒక ప్రమాణం ఉండాలి. నా బోధనల ప్రకారం, ఈ ఆదర్శాలే ప్రమాణాలుగా పనిచేస్తాయి.

7. "ప్రపంచం నిండా పతితులున్నారు. కానీ పతితులలో రెండు రకాల వారున్నారు. ఏదో ఒక ప్రమాణం వున్న పతితుడు, ఏ ప్రమాణమూ లేని పతితుడు."

8. "ఏ ప్రమాణాలు లేని పతితుడికి తను పతితుడైన విషయం కూడా తెలీదు. కనుక అతను ఎప్పటికీ పతితుడుగానే మిగిలిపోతాడు. అలాకాక, ఒక ప్రమాణంవున్న పతితుడైతే, మళ్ళీ జీవితాన్ని సరిదిద్దుకోగలడు. ఎందువల్ల? తను పతితుడైన విషయం అతనికి తెలుసును కనుక."

9. "జీవితాన్ని క్రమబద్ధంగా నడపడానికి మనిషి ఒక ప్రమాణాన్ని పెట్టుకోవడం, పెట్టుకోక పోవడం అనేవాటికి వున్న వ్యత్యాసమిది. ఇక్కడ ముఖ్యమైన విషయం, మనిషి పతితుడు కావడం కాదు, అతనికి ఎలాంటి ప్రమాణం లేకపోవడం.

10. "పరివ్రాజకులారా! నేను చెప్పిన ఆదర్శాలను జీవిత ప్రమాణాలుగా ఎందుకు భావించాలని మీరడగవచ్చు."

11. "మిమ్మల్ని మీరు ఈరకంగా ప్రశ్నించుకుంటే, సమాధానం మీకే లాభిస్తుంది. ఈ

ఆదర్శాలు మనిషికి' మంచివా, కావా ? వీటి వల్ల సమాజానికి మేలు జరుగుతుందా?"

12. దీనికి నీకు `అవును' అని సమాధానం లభిస్తే నేను శుద్ధపథానికి సూచించిన ఈ ఆదర్శసిద్ధాంతాలు సరైనవేనని అర్థం."

# 4. బుద్ధుని తొలి ఉపదేశం (కొనసాగింపు) అష్టాంగమార్గం లేక ధర్మమార్గం

1. అనంతరం బుద్ధుడు పరివ్రాజకులకు అష్టాంగమార్గాలు బోధించాడు. అష్టాంగ మార్గాలలో ఉన్న ఎనిమిది అంశాలను ఆయన వివరించారు.

2. అతను తన వివరణను, అష్టాంగమార్గాల్లో మొదటిదైన `సమదృష్టి' (సమ్మాదిత)తో ప్రారంభించాడు.

3. "సమదృష్టి ప్రాముఖ్యాన్ని గుర్తించాలంటే" అని పరివ్రాజకులతో అన్నాడు బుద్ధుడు - తర్వాత కొనసాగిస్తూ,

4. "ఈ ప్రపంచం ఒక కారాగారమనీ, మనిషి అందులో ఖైదీఅని మీరు గ్రహించాలి."

5. "ఈ కారాగారం అంధకారబంధురమైంది. ఆ చీకటిలో బంధితుడు దేన్నిసరిగా చూడ లేడు. చివరికి తను బంధితుడనికూడా గ్రహించలేడు"

6. "చిరకాలం అంధకారంలో నివసించడంవల్ల మనిషి అంధుడై పోవడమే కాక, అసలు ప్రపంచంలో వెలుగు అనేది ఉంటుందా అని కూడా సందేహిస్తాడు"

7. మనిషికి వెలుగునిచ్చే వాహిక మనసు మాత్రమే.

8. కానీ, కారాగార బంధితులైన ఈ మనుషుల మనస్సులు వెలుగును ప్రసారంచేయగల **వాహికలు** కాలేవు.

9. దీనివల్లవచ్చే స్వల్పమైన వెలుగువల్ల దృష్టివున్నవారు అంధకారం అనేదొకటి వున్నదని గ్రహిస్తారు.

10. ఈ విధంగా మనిషిస్వభావమే లోపభూయిష్టమైంది...

11. కానీ, పరివ్రాజకులారా ! బంధితుడి పరిస్థితి కంటికి కనిపించేంత అధ్వాన్నంగా లేదు.

12. ఎందుకంటే ప్రతిమనిషిలోనూ సంకల్పం అనేదొకటి వుంటుంది. సముచితమైన లక్ష్యం ఎదురైనప్పుడు, ఈ సంకల్పం జాగృతమై, ఆచరణకు దారి తీస్తుంది.

13. మనిషి సంకల్పాన్ని ఏదిశగా నడిపించాలో చూపగలిగినంత వెలుగు లభించినంతనే, మనిషి తనతోటివారిని విమోచనం వైపుకు నడిపించాలి.

14. ఆ విధంగా మనిషి బంధనాల్లో వున్నా, స్వేచ్ఛగా ఉండవచ్చు. తనను అంతిమవిముక్తికి తోడ్కొని పోయే స్వేచ్ఛలో మొదటి మొట్టుకు మనిషి ఏక్షణమైనా ఎక్కవచ్చు.

15. దీనికి కారణం మనిషి. మనిషి అనుకోవాలేగాని తను కోరుకున్నమార్గం చేపట్టడానికి కావలసినవిధంగా అతను మనసును నియంత్రించగలడు. మనల్ని జీవితమనే గృహంలో బంధించేది, అక్కడ కట్టడిచేసేది కేవలం మన మనసే.

16. అయితే మనసు దేన్ని చేస్తుందో, దాన్ని నశింప చేయగలదు కూడా, మనిషిని బంధనాలలో బిగించే మనసే, సరైన మార్గదర్శకత్వం లభిస్తే అతన్ని విముక్తిడిని కూడా చేయగలదు.

17. సమదృష్టి (సమ్మాదిత్త) దీన్ని సాధించగలదు.

18. సమదృష్టి అంతిమ లక్ష్యమేమిటి? అని అడిగారు పరి వ్రాజకులు. సమదృష్టి అంతిమ లక్ష్యం అవిద్యను నాశనం చేయడం. అది మిథ్యా దృష్టికి పూర్తి వ్యతిరేకం. అన్నాడు బుద్ధుడు.

19. "అవిద్య అంటే ఉదాత్తమైన సత్యాలను అర్థం చేసుకోలేకపోవడం, దుఃఖాన్ని, దుఃఖనివారణను గుర్తించలేకపోవడం.

20. క్రతువులను, కర్మకాండలను, ధర్మశాస్త్రాల పవిత్రతను విశ్వసించడం మానివేసినపుడే సమదృష్టి అలవడుతుంది.

21. మూఢవిశ్వాసాలను, అతీంద్రియశక్తులపై విశ్వాసాన్ని విసర్జించినపుడే సమదృష్టి అలవడుతుంది.

22. తత్వాలపైన, అనుభవంపైనా ఆధారపడని, కేవలం ఊహాగానాలతో కూడిన సిద్ధాంతాలను వదిలిపెట్టినపుడే సమదృష్టి అలవడుతుంది.

23. మనసు, చింతన స్వేచ్ఛగా ఉన్నపుడే సమదృష్టి అలవడుతుంది.

24. ప్రతివ్యక్తికీ లక్ష్యాలు, ఆశయాలు, కోరికలు ఉంటాయి. ఈ లక్ష్యాలు, ఆశయాలు, కోరికలు ఉదాత్తంగా, ప్రశంసార్హంగా ఉండాలి గానీ అనర్హమైనవిగా, అగౌరవప్రదంగా ఉండకూడదని సమసంకల్పం (సమ్మాసంకల్పాలు) నేర్పుతోంది.

25. "సమవాదం (సమ్మావాచ్చ) ఈ విధంగా నేర్పుతుంది. (1) మనిషి ఎప్పుడూ సత్యాన్నే వచించాలి. (2) మనిషి ఎప్పుడూ అసత్యం పలకకూడదు (3) ఇతరుల గురించి చెడుగా మాట్లాడకూడదు, (4) ఇతరులపై అపవాదులు వేయకూడదు.(5)తోటివానిని నిందాపూర్వకమైన, పరుషమైన వాక్కులతో దూషించరాదు. (6) అందరితోనూ దయగా, మర్యాదగా మాట్లాడాలి (7) మూర్ఖంగా, అర్థరహితంగా మాట్లాడక, నిర్దిష్టమైన లక్ష్యంతో, వివేకంతో మాట్లాడాలి.

26. సత్యవాక్పరిపాలన, భయంనుంచిగానీ వేరొకరి మెప్పునాశించిగానీ చేయకూడదు. తనకంటే అధికులు తనను గురించి ఏమనుకుంటారన్న భయం, లేదా సత్యవచనం వల్ల ఎటువంటి కీడు జరుగుతుందోనన్న భయం మనిషికి ఉండకూడదు.

27. సమవాక్కు (సమ్మావాచ్ఛ)కు అధికుల ఆదేశాలతోగానీ, వ్యక్తిగత ప్రయోజనాలతోగానీ సంబంధం లేదు.

28. సమకర్మం (సమ్మాకమాంతో) సక్రమప్రవర్తనాన్ని నేర్పుతుంది, ప్రతిచర్య ఇతరుల అనుభూతులు, హక్కులపట్ల గౌరవాన్ని వ్యక్తంచేసేదిగా ఉండాలని ఈ సూత్రం నేర్పుతుంది.

29. సమకర్మ (సమ్మాకమాంతో) ప్రధాన సూత్రమేమిటి ? మానవ మనుగడకు సహజంగా ఏర్పడిన మౌలికసూత్రాలతో సామరస్యం కలిగివుండడమే సమకర్మ.

30. మనిషి చర్యలు, ఈ సూత్రాలకు అనుగుణంగా వున్నాయంటే దాన్నే సమకర్మగా పరిగణించాలి.

31. ప్రతివ్యక్తి భుక్తికోసం ప్రయత్నించవలసి వుంటుంది. అయితే జీవనోపాధి కోసం చేపట్టే మార్గాల్లో అన్యాయం, మనస్తాపం కలిగించే మార్గాలు చెడువి. ఇతరులకు ఎటువంటి అన్యాయం జరగకుండా భుక్తిని సంపాదించే మార్గం మంచిది. ఇదే సమ ఆర్జన (సమ్మా అజీవో)

32. సమవ్యాయము (సమ్మావ్యాయమో) అంటే సత్కృషి అ విద్యను పోగొట్టే మౌలికమైన ప్రయత్నం, అంటే బాధాకరమైన బందిఖానాలోంచి వెలుపలికి మార్గంచూపించే తలుపును చేరుకొని, దాన్ని తెరవడం.

33. సత్కృషికి నాలుగు లక్ష్యాలున్నాయి.

34. మొదటిది - అష్టాంగమార్గంలో సంఘర్షించే మానసికస్థితిని నివారించడం.

35. రెండవది - అప్పటికే అటువంటిమానసికస్థితి ఉత్పన్నమైవుంటే దాన్ని అణచి వేయడం.

36. మూడవది - అష్టాంగమార్గానికి అవసరమైన మానసికస్థితిని ఉదయింప జేయడం.

37. నాల్గవది - ఈ రకమైన మనఃస్థితి ఇదివరకే వుత్పన్నమైవుంటే దాన్ని వృద్ధిచేయడం.

38. సమశక్తి (సమ్మాసత్తి) అప్రమత్తతను, దురాలోచనను నిర్దేశిస్తుంది. మనసు నిరంతరం జాగృతమై వుండాలన్నది దీని అర్థం. మనిషి మనసులోని పాపప్రవృత్తిపై నిఘావేసి వుంచడానికి సమశక్తి అని పేరు.

39. ఓ పరివ్రాజకులారా! సమదృష్టి (సమ్మాదిత్త) సమసంకల్పం (సమ్మా సంకల్పా), సమవాక్కు(సమ్మావాచ్చా) సమకర్మ (సమ్మాకమంతో) సమ ఆర్జన (సమ్మాఆజీలో) సమ

వ్యాయామం (సమ్మావ్యాయామో) సమశక్తి (సమ్మాసత్తి) సాధించాలని ప్రయత్నిస్తున్న వ్యక్తికి ఐదు ఆటంకాలు ఎదురయ్యే అవకాశంవుంది.

40. ఈ ఐదు అవరోధాలు ఇవి. అత్యాస, దుర్బుద్ధి, జడత్వం, అవిశ్వాసం, అనిశ్చితత్వం. అందువల్ల, శృంఖలాలవంటి ఈ ఐదింటిని ఛేదించడం అవసరం. అది సమాధివల్లే సాధ్యం. అయితే పరివ్రాజకులారా! ఒక విషయం గుర్తుంచుకోండి. సమసమాధి (సమ్మాసమంది), సమాధి ఒకటి కాదు. అవి రెండు వేర్వేరు.

41. సమాధి అంటే ఏకాగ్రత. ఇది ఐదు అవరోధాలను అడ్డగించి, స్వయంకల్పిత ధ్యాన స్థితికి మనిషిని తీసుకువెళ్తుందనడంలో సందేహంలేదు.

42. అయితే ఈ ధ్యానస్థితులు తాత్కాలిక మైనవి. తత్ఫలితంగా అవరోధాలనిరోధం కూడా తాత్కాలికమైందే. మనకు కావలసినది శాశ్వతంగా వాటిని నిరోధించడం. అటువంటి స్థితి "సమసమాధి" (సమ్మాసమంది) వల్లే సాధ్యం.

43. అయిదు అవరోధాల తాత్కాలిక నిరోధం మాత్రమే చేయగలదు కనుక, కేవల `సమాధి' ప్రతికూలమైంది ఇందు మనసుకు శిక్షణ లభించదు. కానీ సమసమాధి నిర్మాణాత్మకమైంది. మనసుకు ఏకాగ్రత కలిసిరాని, ధ్యానసమయంలో `కుశల కర్మ'లను (సత్కార్యాలు), సదాలోచనలు, తలుచుకొనేలాచేసి, తద్వారా ఈ ఐదు అవరోధాలవల్ల తలెత్తే అకుశల కర్మల (దురాలోచనలు. దుష్కార్యాలు) నుంచి మనసును మళ్ళిస్తుంది.

44. సమసమాధి, మనిషి మనసుకు నిరంతరం మంచిగురించే ఆలోచించడం అలవాటు చేస్తుంది. సత్కార్యం చేయడానికి కావలసిన అంతర్ ప్రేరణను మనసుకు సమసమాధి ప్రసాదిస్తుంది.

## 5. బుద్ధుని తొలి ఉపదేశం (కొనసాగింపు)
## శీలపథం

1. అంతట బుద్ధుడు పరివ్రాజకులకు శీలపథం ఎలా వుంటుందో బోధించాడు.

2. ఈ క్రింది వాటిని పాటించడం ద్వారా శీలపథం ఆచరించాలని బుద్ధుడు చెప్పాడు (1) శీలం (2) దానం (3) ఉపేక్ష (4) నిష్కామం (నెక్కామ) (5) వీర్యం (6) క్షాంతి (ఖాంతి) (7) సత్యం (సచ్చ) (8) అధితానం (అదిత్థాన) (9) కరుణం (10) మైత్రి.

3. ఈ పదిగుణాలకు అర్థమేమిటని పరివ్రాజకులు బుద్ధుని ప్రశ్నించారు.

4. బుద్ధుడు వారికి ఇలా సమాధానమిచ్చాడు.

5. "శీలమంటే నైతికస్వభావం, పాపం చేయరాదనీ, మంచినే చేయాలని భావించడం, చెడు చేయడానికి సిగ్గుపడే లక్షణం. శిక్షా భయంతో పాపకార్యాలను చేయకుండా వుండడం

శీలం. చెడుచేయడానికి భయపడడం శీలం.

6. నిష్కామమంటే ప్రాపంచిక సుఖాలను పరిత్యజించడం.

7. **దానమంటే, తన ఆస్తులను, రక్తాన్ని, శరీరావయాలు దేన్నయినా సరే చివరికి తన ప్రాణాన్ని సైతం, ఎటువంటి ఫలాపేక్ష లేకుండా ఇతరులకు ధారపోయడం.**

8. వీర్యమంటే సత్ప్రయత్నం. నీ కర్తవ్యాన్ని నీ శాయశక్తులా నెరవేర్చడం, ఎటువంటి పరిస్థితి ఎదురైనా వెన్నుచూపక నీపని చేసుకుపోవడం.

9. క్షాంత (ఖాంతి) అంటే సహనం, ద్వేషాన్ని ద్వేషంతోనే అణచివేయకూడదని నమ్మడం దీని సారం. ఎందుకంటే, ద్వేషం, ద్వేషంవల్ల ఉపశమించదు. అది సహనంవల్లే ఉపశమిస్తుంది.

10. సత్యమంటే నిజం. మనిషి ఎప్పుడూ అబద్ధం చెప్పకూడదు. ఎల్లప్పుడూ నిజమే చెప్పాలి.

11. అతిద్ధానమంటే లక్ష్యంచేరుకోవాలనే స్థిరసంకల్పం.

12. కరుణ అంటే సాటి మనిషిపట్ల ప్రేమ, దయ చూపడం.

13. మైత్రి అంటే సకల జీవకోటిపట్ల స్నేహం ప్రదర్శించడం, మిత్రులకే కాదు శత్రువులకు కూడా స్నేహం అందివ్వడం. ఒక్క మనుషులకే కాదు, సకల ప్రాణులపట్ల ప్రేమగా ఉండడం.

14. ఉపేక్ష అంటే నిర్లిప్తత, కాని ఇతరులపట్ల అశ్రద్ధ, విరక్తి కాదు. రాగద్వేషాలకు అతీతమైన మనస్థితినే ఉపేక్ష అంటారు. తన ప్రయత్నాల ఫలితానికి దుఃఖం, ఆనందం చెందకుండా లక్ష్యసాధనను కొనసాగించడం.

15. ఈ సన్మార్గాలను ప్రతి వ్యక్తి తనశాయశక్తులా ఆచరించాలి. అందువల్లనే వాటిని పారమితలు (పరిపూర్ణ స్థితి) అన్నారు.

## 6. బుద్ధుని తొలి ఉపదేశం (ముగింపు)

1. తన ధర్మాన్ని, అందులోని విషయాలను ఈ విధంగా వివరించిన తరువాత, బుద్ధుడు పరివ్రాజకులను ఇలా ప్రశ్నించాడు.

2. "వ్యక్తి సచ్ఛీలత ప్రపంచమంతటా మంచికి పునాది కాదా?" వారు: "మీరు చెప్పింది నిజమే" అన్నారు.

3. బుద్ధుడు ఇంకా ఇలా అన్నాడు: " అయితే దురాశ, కోరిక, అజ్ఞానం, ప్రాణహరణం, చౌర్యం, వ్యభిచారం, అసత్యవచనం వ్యక్తి సచ్ఛీలతకు ఆటంకాలుకావా? ఈ

ప్రవృత్తులనునిగ్రహించేంత మనోబలాన్ని సమకూర్చుకోవడం అవసరం కాదా? మనిషిలో వ్యక్తిగత శీలం లేనపుడు అతను మంచికి సాధనం ఎలా కాగలడు?" దానికి పరివ్రాజకులు" మీరు చెప్పింది నిజమే" అన్నారు.

4. "ఇతరులపై ఆధిక్యత చూపడానికీ, వారిని బానిసలుగా చేసుకోవడానికి మనిషి ఎందుకు వెనుకాడడు? ఇతరులకు దుఃఖం కలిగించడానికి మనిషి ఎందుకు వెనుకాడడు? దీన్ని బట్టి చూస్తే, మనిషి ఇతరులపట్ల న్యాయంగా ప్రవర్తించడం లేదని విశదం కాదా?" అవునని సమాధాన మిచ్చారు పరివ్రాజకులు.

5. "అష్టాంగ మార్గాల ఆచరణ అంటే సమదృష్టి, సమసంకల్పం, సమవాక్కు, సమార్జన, సమవ్యాయామం, సమశక్తి, సమకర్మ, సమసమాధి- క్లుప్తంగా చెప్పాలంటే ధర్మమార్గాన్ని అందరూ అనుసరిస్తే, మనిషి మనిషిపట్ల చేసే అన్యాయం, అమానుషత్వాలు తొలగిపోవా?" అడిగాడు బుద్ధుడు: "అవును అని చెప్పారు పరివ్రాజకులు.

6. శీలపథం గురించి మాట్లాడుతూ,"అర్థులకు, పేదలకు, బాధోపశమనం కలిగించడానికి 'దానం' అవసరం కాదా! పేదరికం దుఃఖాలను ఉపశమింపచేయడానికి కరుణ అవసరం కాదా? నిస్వార్థ సేవకు `నిష్కామం' అవసరం కాదా? స్వలాభం లేకపోయినా నిరంతర కృషిసల్పడానికి `ఉపేక్ష' అవసరం కాదా ?

7. మనిషికి ప్రేమ అవసరం కాదా ? అని బుద్ధుడు ప్రశ్నించగా అవసరమని చెప్పారు వారు.

8. "నిజానికి ప్రేమ ఒకటేచాలదు. మనిషికి అవసరమైంది `మైత్రి'. మైత్రి, ప్రేమకంటే విస్తృతమైంది' మైత్రి. అంటే, కేవలం మనుషులమధ్య మాత్రమేకాక, సకల జీవరాశుల మధ్య ఉండ వలసింది. మనిషికి ఆనందాన్ని, నిష్పక్షపాతదృష్టిని సకలజీవులపట్ల అనురాగాన్ని, విద్వేషరాహిత్యాన్ని, ఇవ్వగలదు"

9. వారందరూ `అవున'న్నారు.

10. "అయితే ఈ సచ్ఛీలానికి ప్రజ్ఞ (తెలివితేటలు) కూడా తప్పనిసరిగా తోడవ్వాలి".

11. "ప్రజ్ఞ అవసరమా! కాదా? "బుద్ధుని ప్రశ్నకు పరివ్రాజకులు సమాధానమివ్వలేదు. వారి చేత జవాబు చెప్పించడంకోసం బుద్ధుడు మంచిమనిషి లక్షణాలను వివరించాడు. "చెడు చేయవద్దు. చెడు ఆలోచించవద్దు, చెడు మార్గంలో భుక్తి సంపాదించవద్దు. చెడు మాట్లాడవద్దు, ఎవరినీ గాయపరిచేవిధంగా మాట్లాడవద్దు". దీనికి అందరూ, "అవును నిజమే" అన్నారు.

12. "కానీ గుడ్డిగా మంచి పనులు చేయడం మాత్రం హర్షించదగ్గదేనా ?" బుద్ధుడు అడిగాడు. వెంటనే అన్నాడు:"నన్నడిగితే `లేదంటాను'. అదిమాత్రమేచాలదు". బుద్ధుడు పరివ్రాజకులతో అన్నాడు "అదే సరిపోతే పసిపాపకూడా ఎప్పుడూ మంచి చేస్తుందనే అనాలి, ఎందుకంటే, పసిపాపకు ఏమిటో తెలీదు. తన కాళ్ళు చేతులు విసిరి కొట్టడం తప్ప;

ఎవరినీకొట్టడం తెలీదు, ఏడవడం తప్పు; మాటలలో ఇతరుల్ని గాయపరచడం తెలీదు; ఆనందంలో కేరింతలు కొట్టడం తప్పు; జీవనోపాధిగాని, చెడుమార్గంలో భుక్తి సంపాదించడమంటేగాని తెలీదు.

3. "కనుక శీలపథం అవలంబిస్తున్నారా లేదా అని పరీక్షించాలంటే, మనిషి `ప్రజ్ఞను', అనగా అవగాహనను, తెలివితేటలను పరీక్షించాలి.

4. ప్రజ్ఞాపారమతత్వం. ప్రాముఖ్యాన్ని, అవసరాన్ని మీకు చెప్పడానికి మరోకారణం కూడా వుంది. మనిషి దానంచేయాలి. అయితే ప్రజ్ఞ లేని దానం దుష్ట భావాన్నే కలిగి వుంటుంది. మనిషిలో కరుణ ఉందనుకునే `ప్రజ్ఞ' లేకపోతే పాపపుచర్యలను కూడా కరుణించే అవకాశం వుంది.
ప్రతి చర్య ను విజ్ఞత'కు మరొ పైరైస ప్రజ్ఞాపార మితత్వంతో పరీక్షించి చూడాలి.

5. "దుష్ప్రవర్తన అంటే ఏమిటి, అది ఎలా ఉత్పన్నమౌతుంది. అన్న పరిజ్ఞానం, స్పృహ మనిషికి ఉండాలి. అదేవిధంగా సత్ప్రవర్తన ఏమిటన్న పరిజ్ఞానం కూడా ఉండాలి. ఇటువంటి పరిజ్ఞానం లేనపుడు, ఒకని చర్య మంచిదే అయినా, అతనిలో నిజమైన మంచితనం ఉన్నట్టు పరిగణించలేము. అందుకే `ప్రజ్ఞ' అత్యవసరమైన సుగుణమని నేనంటాను"

16. ఆ తర్వాత పరివ్రాజకులకు తన ప్రబోధాన్ని ఈ మందలింపుతో బుద్ధుడు ముగించాడు.

17. "మానవజాతి దుఃఖం పైనే దృష్టినిలపడంవల్ల నా ధర్మం నిరాశావాదానికి చేరువగా వుందని మీరు భావించవచ్చు. కానీ ఆ అభిప్రాయం సరైనదికాదు.

18. నా ధర్మం దుఃఖం ఉందని గుర్తించడమే కాదు దుఃఖం నిర్మూలన గురించి కూడా సరి సమానంగా చెప్తుందన్న విషయం మరవకూడదు.

19. నా ధర్మంలో ఆశ, ధ్యేయము రెండూ ఉన్నాయి.

20. నా ధర్మం లక్ష్యం, అవిద్యను నిర్మూలించడం. అవిద్య అంటే దుఃఖం ఉనికిని తెలుసుకోలేక పోవడం.

21. మనిషి వేదన అంతమొందించడానికి మార్గం చూపుతుంది. కనక నా ధర్మంలో ఆశవుంది.

22. మీరు దీనితో ఏకీభవిస్తారా, లేదా?" అని బుద్ధుడు అనగా "ఏకీభవిస్తాము" అని చెప్పారు పరివ్రాజకులు.

# 7. పరివ్రాజకుల సమాధానం

1. బుద్ధుడు చెప్పింది ఒక సరికొత్త ధర్మమని అయిదుగురు పరివ్రాజకులు ఆక్షణమే గ్రహించారు. జీవితంలోని సమస్యల పట్ల బుద్ధుడు ప్రదర్శించిన ఈ కొత్తవైఖరికి ముగ్ధులైనారు. ముక్తకంఠంతో ఇలా అన్నారు: " ప్రపంచ చరిత్రలోనే ఎప్పుడూ ఏమత

స్థాపకుడు కూడా, మానవజాతి వేదనను గుర్తించడమే మతానికి అసలైన ప్రాతిపదిక అని చెప్పలేదు.

2. ప్రపంచ చరిత్రలోని ఏమతప్రవక్తా ఈ వేదనను తొలగించడమే మతం అసలు లక్ష్యమని బోధించలేదు!

3. ప్రపంచ చరిత్రలోనే ఎప్పుడూ ఇటువంటి నిరాడంబరమైన అతిలోక అతిమానుష శక్తుల ప్రమేయంలేని, ఆత్మపై, భగవంతుడిపై, మరణానంతర జీవితంపై విశ్వాసం లేని మోక్షమార్గాన్ని ఎవరూ చూపలేదు!

4. ప్రపంచ చరిత్రలోనే ఎప్పుడూ అపౌరుషేయంకాని, భగవంతుని ఆదేశాలతో నిమిత్తంలేని, కేవలం మనిషి సామాజిక అవసరాల పరిశీలననుంచే ఉత్పన్నమైన సూత్రాలతో ఇటువంటి మతవిధానాన్ని ఎవరూ ప్రతిపాదించలేదు!

5. ప్రపంచ చరిత్రలోనే ఎప్పుడూ, మోక్షమంటే లోకంలో తన స్వీయ కృషితోనే మనిషి సాధించుకునే ఆనందమని ఎవరూ చెప్పలేదు!"

6. నూతన ధర్మంపై బుద్ధుని ప్రవచనాలు విన్నఅనంతరం పరివ్రాజకులు పైవిధంగా అన్నారు.

7. ఎట్టకేలకు బుద్ధునిలో, ఒక సంస్కర్తను చూశామని వారు భావించారు. తన కాలంనాటి మేధాసంపత్తిని జీర్ణించుకుని, ఉన్నత నైతికలక్ష్యాలు కలిగి, ఆత్మసంస్కారం, ఆత్మ నిగ్రహాలద్వారా ఈ భూమిపైనే మోక్షం సాధించ వచ్చునని ప్రబోధించి, తను విశ్వసించిన దానిని బహిరంగంగా ప్రకటించే ప్రతిభ, సాహసంవున్న సంస్కర్తను బుద్ధునిలో చూడగలిగామని వారు భావించారు.

8. బుద్ధునిపట్ల వారి భక్తి ప్రపత్తులు అవధులు మీరగా, ఆయనకు ఆత్మసమర్పణ చేసుకొని, తమను శిష్యులుగా స్వీకరించమని ఆ పరివ్రాజకులు ప్రార్థించారు.

9. బుద్ధుడు ఏహిభిక్కవే(భిక్షువులారా ప్రవేశించండి) అంటు వారికి దీక్షనిచ్చారు. వారే పంచ వర్గీయ భిక్షువులుగా పేరుపొందారు.

# మూడవ భాగం

# ఉన్నతులు, పవిత్రులకు దీక్ష

1. యశునికి దీక్ష
2. కాశ్యపులకు దీక్ష
3. సారిపుత్రుడు, మొగ్గలన్నలకు దీక్ష
4. బింబిసార మహారాజుకు దీక్ష
5. అనాధ పిండికునికి దీక్ష
6. ప్రసేన జిత్తు మహారాజుకు దీక్ష
7. జీవకునికి దీక్ష
8. రాష్ట్రపాలకునికి దీక్ష

# యశునికి దీక్ష

1. ఆ కాలంలో వారణాసి పట్టణంలో యశుడు అనే ఒక ఉన్నత వంశీయుని కుమారుడు ఉండేవాడు. అతను యువకుడు, చాలా సౌందర్యవంతుడు, తల్లిదండ్రులు అతన్ని అల్లారుముద్దుగా చూసుకునేవారు. అతను సిరిసంపదలతో తూగేవాడు. అతను నిరంతరం నృత్యం, మదిర, మగువల సాంగత్యంలో, వినోదాలలో కాలక్షేపం చేస్తూండేవాడు.

2. అలా కొంత కాలంగడిచాక, అతనిలో ఒక రకమైన విసుగు జనించింది. ఈవిశృంఖలత్వం నుంచి తనకు విముక్తి లేదా? ఇంతకంటె మంచి జీవనవిధానం లేదా? ఏం చేయాలో తోచక, తన తండ్రియింటిని వదిలివెళ్ళడానికి నిర్ణయించుకున్నాడు.

3. ఒక రాత్రి, తండ్రి యిల్లు వదలి వీధుల్లోనడుస్తూ, కాకతాళీయంగా ఇసిపట్నం చేరుకున్నాడు.

4. అలసటగా ఒక చెట్టుకింద కూర్చుని, గట్టిగా ఇలా అన్నాడు, "నేనెక్కడ వున్నాను? ఏది నాకు దారి? అయ్యో ఎంత నిస్పృహ, అయ్యో ఎంతటి ప్రమాదం."

5. సరిగ్గా ఆరోజు రాత్రి తథాగతుడు పంచవర్గీయభిక్షుకులకు తన ప్రప్రథమ ప్రబోధం చేసి వున్నాడు. ఇసిపట్నానికి యశుడు వస్తుండగానే, తథాగతుడు చల్లనిగాలిలో సేదదీరుతున్నాడు. యశుని స్వగతం విని, ఆ తర్వాత యశుడు తన వైపు వస్తుండగా తథాగతుడు చూసాడు.

6. వెంటనే ఆయన "నిస్పృహ లేదు, ప్రమాదం లేదు. పద, నేను నీకు దారి చూపిస్తాను "అంటూ తన ధర్మాన్ని యశునికి బోధించాడు.

7. ఇది వినగానే ఆనందపులకితుడైన యశుడు తన ఖరీదైన చెప్పులు విసిరేసి, వెళ్ళి తథాగతుని వద్ద కూర్చుని, ఆయనకు నమస్కరించాడు.

8. తనను శిష్యుడిగా స్వీకరించమని అతను బుద్ధుడిని కోరాడు.

9. బుద్ధుడు యశుని భిక్షువు కమ్మని కోరగా, అతను అంగీకరించాడు.

10. ఇదిలావుండగా తమ కుమారుడు అదృశ్యమైపోవడం గమనించి, యశుని తల్లిదండ్రులు వ్యధ చెందారు. తండ్రి కుమారుని అన్వేషణకై బయల్దేరాడు. ఆయన యశుడు, బుద్ధుడు కూర్చొనివున్న స్థలానికి వచ్చి, బుద్ధుని, "నా కుమారుడు యశుడిని మీరుగాని చూసారా?" అని ప్రశ్నించాడు.

11. బుద్ధుడు సమాధానంగా, "రండి మీ కుమారుడు ఇక్కడ దొరుకుతాడు" అని చెప్పాడు. యశుని తండ్రి అతని పక్కన కూర్చునికూడా అతన్ని గుర్తించలేదు.

12. అప్పుడు తథాగతుడు యశుడు తనను కలుసుకోవడం, భిక్షువుగా మారడం అప్పటి సంఘటనలను వివరించాడు. అంతట తండ్రి కుమారుని గురించి, తన కొడుకు సరైన

13. తండ్రి యశునితో "కుమారా నీ తల్లి చాలాబాధపడుతూ, ఏడుస్తున్నది. ఇంటికి తిరిగి వచ్చి నీ తల్లికి ప్రాణదానం చెయ్యి" అన్నాడు.

14. యశుడు తథాగతుని కేసి చూడగా, బుద్ధుడు అతని తండ్రిని ఇలా అడిగాడు "యశుడు మళ్ళీ ప్రాపంచికసుఖాలలో జీవనంగడపాలని మీకిష్టమా?"

15. దానికి యశుని తండ్రి "నా కుమారుడు మీవద్ద ఉండటానికే ఇష్టపడేటట్లయితే, అలాగే ఉండ నివ్వండి" అన్నాడు. యశుడు భిక్షువుగా ఉండడానికే నిశ్చయించుకున్నాడు.

16. వెళ్ళి పోయేముందు యశుని తండ్రి ఇలా అన్నాడు. "ఓ తథాగతుడా, మీరు నా కుటుంబ సభ్యులతో భోజనంచేయాలని విన్నపం"

17. తథాగతుడు ఉత్తరీయం ధరించి, భిక్షుక పాత్ర చేతబట్టి యశునితో పాటు వారి యింటికి వెళ్ళాడు.

18. అక్కడికి చేరుకోగానే, వారు యశుని తల్లినీ అతని ఒకనాటి భార్యను కలుసుకొన్నారు. భోజనానంతరం బుద్ధుడు తన ధర్మాన్ని ఆ కుటుంబసభ్యులకు భోధించారు. వారు చాలా ఆనందించి, తరువాత ఈ ధర్మాన్ని చేపడ్తామని వాగ్దానంచేశారు.

19. యశునికి సంపన్న కుటుంబాలకు చెందిన నలుగురు మిత్రులుండేవారు. వారి పేర్లు విమలుడు సుభాగుడు, పుణ్యజితుడు, గవాంపతి.

20. తమ మిత్రుడు యశుడు బుద్ధునిధర్మం స్వీకరించాడని తెలియగానే, యశునకు మేలు చేసేది ఏదైనా తమకుకూడా మంచిదేనని వారు భావించారు.

21. అందుకని వారు యశునివద్దకు వెళ్ళి తమనుకూడా శిష్యుల లో చేర్చుకోమని బుద్ధునికి మనవి చేయవలసిందిగా కోరారు.

22. యశుడు అందుకు అంగీకరించి, బుద్ధుని వద్దకు వెళ్ళి, "నా యీ నలుగురు స్నేహితులకు కూడా దీక్ష ఇవ్వండి దేవా" అని కోరాడు. బుద్ధుడు ఆ ప్రకారంగానే వారికి దీక్ష ఇచ్చాడు.

## 2. కాశ్యపులకు దీక్ష

1. వారణాసిలో ఆ రోజుల్లో కాశ్యపకుటుంబం అనే పేరుగల కుటుంబం ఉండేది. వారికి ముగ్గురు కుమారులుండేవారు. వారు ఉన్నత విద్యాభ్యాసం చేసి, కఠినమైన నియమనిష్ఠలతో జీవిస్తుండేవారు.

2. కొంతకాలం తర్వాత పెద్ద కుమారుడు సన్యాసం స్వీకరించాలని అనుకున్నాడు. వెంటనే ఇల్లు విడిచిపెట్టి, సన్యాసం పుచ్చుకుని ఊరువెల్ల ప్రాంతంలో ఒక ఆశ్రమం నెల కొల్పాడు.

3. క్రమంగా అతని ఇద్దరు తమ్ముళ్ళుకూడా అన్ననే అనుసరించి సన్యాసులయ్యారు.

4. వీరందరూ అగ్నిదేవతారాధకులే. వారికి పొడవైన శిరోజాలు ఉండడం వల్ల జటిలులు అని పేరు పొందారు.

5. ఈ ముగ్గురికి ఊరువెల్లకాశ్యప, నదీకాశ్యప, గయాకాశ్యప అనే పేర్లు స్థిరపడ్డాయి.

6. వీరిలో ఊరువెల్లకాశ్యపునికి ఐదుపందలమంది అనుచరులు, నదీకాశ్యపునికి మూడు వందల మంది శిష్యులు, గయాకాశ్యపునికి రెండు వందల మంది అను యాయులు ఉండేవారు. వీరందరికీ ప్రధాననాయకుడు ఊరువెల్లకాశ్యపుడే.

7. ఊరువెల్ల కాశ్యపుని కీర్తి క్రమేపీ నలుదిక్కులా వ్యాపించింది. అతను జీవించి వుండగానే ముక్తిపొందాడని పేరువచ్చింది. ఫాల్గునదీతీరాన వున్న ఆయన ఆశ్రమానికి రోజు వందలకొద్దీ భక్తులు సుదూరప్రాంతాలనుంచి వచ్చి అతని దర్శనం చేసుకునేవారు.

8. తథాగతుడుకూడా అతని పేరు విన్నాడు. అతనికి తన ధర్మాన్ని ప్రభోధించి, తమలో చేర్చుకోవాలని ఆయన నిర్ణయించాడు.

9. ఆ ప్రకారంగానే ఆయన ఊరువెల్లకు వెళ్ళారు.

10. అక్కడ కాశ్యపుడిని కలవగానే భగవానుడు ఇలా అన్నాడు: " నీకు అభ్యంతరం లేకపోతే, నేను ఒక రాత్రి నీ ఆశ్రమంలో గడుపుతాను."

11. దానికి సమాధానంగా కాశ్యపుడు నేను ఇందుకు అంగీకరించను . ఇక్కడ ముద్దలిందుడనే నాగ రాజు ఉన్నాడు. అతనికి ప్రమాదకరమైన శక్తియుక్తులున్నాయి. అగ్నిని ఆరాధించే సన్యాసులంటే అతనికి పరమద్వేషం. వారి ఆశ్రమాలకువెళ్ళి వారికి చాలా శని కలిగిస్తుంటాడు. నాకు చేసినట్లుగానే నీకుకూడా అతను అపకారం చేయవచ్చునని నా భయం."

12. నాగులు అనాటికే తథాగతుని ధర్మం స్వీకరించారన్న విషయం కాశ్యపునికి తెలీదు. కానీ బుద్ధునికి తెలుసు.

13. కనుక తథాగతుడు అక్కడే వుంటానని కాశ్యపుడిని మరీ మరీ అడిగాడు. "అతను నాకు ఎటువంటి హాని చేయకపోవచ్చు కాశ్యప! దయచేసి నీ అగ్నిహోత్రం వున్న గదిలో ఒక్కరాత్రికి నన్ను ఉండనివ్వు.".

14. కాశ్యపుడు ఇంకా అనేక అభ్యంతరాలు లేవదీశాడు. కానీ తథాగతుడు తన విన్నపాలు కొనసాగించాడు.

15. అప్పుడు కాశ్యపుడు, "నాకు మీతో ఎలాంటి వివాదాలు పెట్టుకోవాలని లేదు. కాని నా భయం తెలిపాను మీ యిష్టం వచ్చినట్టుగానే చేయండి" అన్నాడు.

16. తథాగతుడు అగ్నిహోత్రం వద్దకు వెళ్ళి కూర్చున్నాడు.

17. నాగరాజు ముచ్ఛలిందుడు ఆ గదిలోకి తన వేళప్రకారం వచ్చాడు. అయితే రోజూ కాశ్యపుడు కూర్చునేస్థానంలో తథాగతుడు కూర్చుని వుండడం చూసాడు.

18. గొప్ప శాంతితో, కాంతితో వెలుగొందుతున్న తథాగతుని ముఖారవిందాన్ని చూడగానే తను దైవసన్నిధిలో వున్నట్లుగా భావించిన ముచ్ఛలిందుడు, అవనతశిరస్కుడై, ప్రార్థించడం ప్రారంభించాడు.

19. ఆ రాత్రి కాశ్యపుడు, తన అతిధి ఎటువంటి కష్టాలు పడుతున్నాడోనని భయపడటంతో కలతనిద్ర పోయాడు. తన అతిధిని నాగరాజు దహించి వేసాడేమోనని భయపడుతూ నిద్రలేచాడు.

20. సూర్యోదయంకాగానే కాశ్యపుడు, అతని అనుచరులు తథాగతుని పరిస్థితి చూడాలని వచ్చారు. అక్కడ తథాగతునికి ఏమీకాకపోగా, ముచ్ఛలిందుడు అతన్ని ప్రార్థిస్తున్న దృశ్యం వారి కంటబడింది.

21. ఆ దృశ్యం చూడగానే ఒక అద్భుతాన్ని చూస్తున్నట్టుగా భావించాడు కాశ్యపుడు.

22. ఈ అద్భుతంతో దిగ్భ్రాంతి చెందిన కాశ్యపుడు తథాగతుని తనవద్దే ఉండమని కోరాడు. అతనికి ఒక ఆశ్రమం నిర్మించి అతని అవసరాలు చూసుకొంటానని చెప్పాడు.

23. తథాగతుడు అందుకు అంగీకరించాడు.

24. అయితే ఇలా కలిసివుండడంలో వారిద్దరి లక్ష్యాలు వేరు. ముచ్ఛలింద నాగుని నుంచి తనకు తథాగతుడు రక్షణ కల్పిస్తాడని కాశ్యపుని ఆశ. కాశ్యపుడికి తన ధర్మం భోధించే అవకాశం ఏనాటికైనా లభిస్తుందని తథాగతుని ఆశ.

25. అయితే కాశ్యపుడు అటువంటి ఆసక్తిని కనబరచలేదు. తథాగతుడు అద్భుతాలు సృష్టించే వ్యక్తి మాత్రమేనని భావించాడు కాశ్యపుడు.

26. ఒక రోజు తథాగతుడు తనంతటతానే ఆ ప్రస్తావన తీసుకు రావాలనుకుని, " నీవు అరిహంతవా?" అని కాశ్యపుడిని అడిగాడు.

27. "అరిహంతునివి కానిపక్షంలో ఈ అగ్నిహోత్రునివల్ల నీకు ఏపాటి మేలు కలుగుతుంది?"

28. దానికి కాశ్యపుడు, "అసలు అరిహంతుడంటే ఎవరో నాకు తెలీదు. కొంచెం వివరిస్తారా?" అని అడిగాడు.

29. తథాగతుడు ఇలా చెప్పాడు: "మనిషినిఅష్టాంగ మార్గంలోపయనించకుండా అడ్డగించే ఇంద్రియతత్వాన్ని జయించినవాడు అరిహంతుడు. అగ్నిహోత్రుడు మనిషి పాపాలను కడిగివేయలేడు."

30. కాశ్యపుడు ఆత్మప్రత్యయం మెండుగా వున్నవ్యక్తి. అయినప్పటికీ తథాగతుని వాదనలోని

బలం అతన్ని ప్రభావితుని చేసింది. తన మనస్సును తథాగతుని స్వాధీనం చేసి, అతని ప్రబోధానికి వాహికగా మలచుకున్నాడు. తన సామాన్యమైన విజ్ఞానం, తథాగతుని విజ్ఞానం ముందు దిగదుడుపేనని ఒప్పుకొన్నాడు.

31. ఆ విధంగా, ఊరువెల్ల కశ్యపుడు తథాగతుని ధర్మానికి తలవొగ్గి అతని అనుచరుడయ్యాడు.

32. కాశ్యపుని అనుచరులు కూడా అతన్ని అనుసరించి బుద్ధుని వద్ద దీక్ష తీసుకొన్నారు.

33. అప్పుడు కశ్యపుడు తన వస్త్రాలను, కర్మకాండకై తను ఉపయోగించే పాత్రలను నదిలోకి విసిరేశాడు.

34. అతని సోదరులైన నది, గయ నదిపై తేలియాడుతున్న వస్త్రాలను ఇతరవస్తువులను చూసి, "ఇవి మన సోదరునివి. అతను వాటిని ఎందుకు విసిరేశాడు? ఏదో పెద్ద మార్పు వచ్చి వుండాలి" అనుకొని మనస్తాపం చెందారు. వీరిద్దరేకాక వెంట ఐదువందలమంది అనుచరులు రాగా, సోదరుని వద్దకు బయలుదేరారు.

35. అక్కడికిచేరుకొగానే కాషాయవస్త్రాలలోవున్న సోదరుని, అతని అనుయాయులను చూసి, వారిని కారణం అడిగారు. కశ్యపుడు తను బుద్ధదీక్ష తీసుకున్న విధానం వివరించాడు.

36. అతని సోదరులు అంతా విన్నతర్వాత, "మన సోదరుని మనంకూడా అనుసరించాలి" అని అనుకొన్నారు,

37. తమ అభీష్టాన్ని వారు తమ అన్నగారికి చెప్పారు. వారిద్దరు తమఅనుచరులతో సహా బుద్ధుని ప్రబోధనలు ఆలకించడానికి వచ్చారు. వారి అగ్నిహోత్రానికి, బుద్ధుని ప్రవచనానికి గల భేదాన్ని బుద్ధుడు వివరించగా వారు విన్నారు.

38. బుద్ధుడు ప్రభోదిస్తూ ఇలా అన్నాడు: "అస్పష్టమైన ఆలోచనల కట్టె, కట్టె రాసుకున్నప్పుడు అగ్నిని సృష్టించగా, అజ్ఞానమనే నల్లనిపొగ ఎగబాకుతుంది.

39. "కామం, క్రోధం, భ్రమ అన్నవి ప్రపంచంలోని దుఃఖానికీ, వేదనకు ఆజ్యం పోస్తున్నాయి.

40. "మనిషి కామ, క్రోధ, భ్రమలను జయించగలిగితే, సమ్యక్‌దృష్టిని, జ్ఞానాన్ని, నిర్మల వర్తనాన్ని అలవరచుకుంటాడు.

41. ఈ విధంగా మనిషికి పాపం పట్ల ఒకసారి అయిష్టతఏర్పడగానే పరుల ఆస్తులపై వ్యామోహం తగ్గిపోతుంది. తద్వారా మనిషి తాపసి అవుతాడు.

42. ఈ పలుకులు వింటున్న ఋషులు అగ్నిహోత్రంపట్ల గౌరవం కోల్పోయి, బుద్ధుని శిష్యులుగామారాలని నిర్ణయించుకున్నారు.

43. ఈ విధంగా కశ్యపులకు దీక్షఇవ్వటం బుద్ధునికి ఘనవిజయమనే చెప్పాలి. ఎందువల్లనంటే వీరికి సామాన్యప్రజలను ప్రభావితంచేసే పలుకుబడి సమృద్ధిగా వుండేది.

## 3. సారిపుత్రుడు, మొగ్గలన్నలకు దీక్ష

1. తథాగతుడు రాజశ్రగ్రహలో నివసిస్తుండగా, ఆ ప్రాంతంలో సుప్రసిద్ధుడైన సంజయుడనే గురువు ఉండేవాడు. అతనికి 250 మంది శిష్యులు ఉండేవారు.

2. అతని శిష్యులలో సారిపుత్రుడు, మొగ్గలన్న అనే ఇద్దరు బ్రాహ్మణులు ఉండేవారు.

3. వీరిద్దరికీ సంజయుని బోధనలలో సంతృప్తి లభించక, ఇంతకంటే మంచి గురువుకోసం అన్వేషిస్తున్నారు.

4. ఒక రోజు, పంచవర్గీయ బిక్షుకులలో ఒకరైన అస్సాజీ మధ్యాహ్నసమయంలో భిక్షపాత్ర చేతబట్టి రాజగ్రహ నగరానికి భిక్షాటనకై వచ్చాడు.

5. సారిపుత్రుడు, అస్సాజీ ఠీవికి, వర్చస్సుకు ముగ్ధుడయ్యాడు. మనస్సులో ఇలా అనుకున్నాడు: "ఈ ప్రపంచంలో పూజనీయులని చెప్పదగిన సన్యాసుల్లో ఇతనొకరు. నేనితనివద్దకు వెళ్ళి " ఎవరి ప్రేరణలో నీవు సన్యాసం స్వీకరించావు ? నీ గురువు ఎవరు? నీవు ప్రచారం చేసేది ఎవరి ధర్మాన్ని? అని అడుగుతాను".

6. వెంటనే సారిపుత్రుడు ఇలా అనుకొన్నాడు: "ఆయన భిక్షకోసం ఇంటిముంగిటికి వెళ్ళాడు. నాసందేహం అడగడానికి ఇది తగినసమయం కాదు. ఒకరినుంచి ఏదైనా ఆశిస్తుంటే, వారి అడుగుజాడల్లో నడవాలన్న పెద్దల మాటలననుసరించి, నేను ఇతన్ని ఎందుకు అనుసరించ కూడదు?"

7. ఆ తర్వాత అస్సాజీ, రాజగ్రహలో తన భిక్షాటన ముగించుకొని భోజనపదార్థాలతో తిరిగి వెళ్ళాడు. సారిపుత్రుడు అస్సాజీవెంట అతని ఇంటికి వెళ్ళి, వినయపూర్వకంగా అభివాదంచేసి ఆయన పక్కననిల్చున్నాడు.

8. సారిపుత్రుడు, పూజనీయుడైన అస్సాజీతో ఇలా అన్నాడు:" మీ ముఖవర్చస్సు, పవిత్రత , కాంతితో దేదీప్యమానంగా ప్రకాశిస్తున్నది. మీరు ఎవరి ధర్మబోధనవల్ల సన్యాసం స్వీకరించారు? మీ గురువెవరు? ఎవరి ధర్మాన్ని మీరు ఆచరిస్తున్నారు? "

9. అస్సాజీ ఇలా చెప్పాడు: "ఐక్యవంశానికి చెందిన మహనీయుడు బుద్ధుని అనుసరించి నేను భిక్షువునయ్యాను. తథాగతుడే నా గురువు. నేను అనుసరించేది ఆయన బోధించే ధర్మాన్ని."

10. "ఓ పూజ్యుడా! మీ గురువుగారు బోధించే ధర్మం ఏమిటి? ఆయన మీకు నేర్పేది ఏమిటి?"

11. "నేనింకా కొత్తగా చేరిన శిష్యుడనే. ఇటీవలే దీక్ష పొందాను, బుద్ధుని ధర్మాన్ని వివరంగా చెప్పలేను, కాని క్లుప్తంగా దాని సారాంశాన్ని చెప్తాను."

12. సారిపుత్రుడు అస్సాజీతో, " మిత్రమా నీవు ఎంత చెప్పగలిగితే అంతే చెప్పు, కాని దాని అర్థం, కేవలం అర్థం కావాలి నాకు. వివరాల గురించి పట్టింపుదేనికి?"

13. అంతట పూజనీయుడైన అస్సాజీ బుద్ధుని బోధనల సారాంశాన్ని సారిపుత్రునికి చెప్పగా, అతను సంపూర్ణంగా సంతృప్తిచెందాడు.

14. సారిపుత్రుడు, మొగ్గలన్న స్వంత అన్నదమ్ములు కాకపోయినా, సోదరులవలె సన్నిహితంగా ఉండేవారు. తామిద్దరిలో ఎవరు మొదట సత్యం తెలుసుకొంటే, అది రెండవవానికి చెప్పాలని వారు పరస్పరం ప్రమాణంచేసుకున్నారు.

15. తదనుగుణంగా, సారిపుత్రుడు అస్సాజీ వద్దనుంచి మొగ్గలన్న వద్దకు వెళ్ళాడు. అతన్ని చూడగానే మొగ్గలన్న "నీ ముఖవర్చస్సు, నిర్మలంగా వుంది, కాంతివంతంగా వుంది. అంటే ఎట్టకేలకు నీకు సత్యదర్శనం అయినట్టేనా?"

16. "అవును, మిత్రమా, నాకు సత్యదర్శనమైంది." "మిత్రమా! అదెలా సాధ్యమైంది?" అంతట సారిపుత్రుడు తనకు, అస్సాజీకి మధ్య, జరిగిన సన్నివేశం వివరించాడు.

17. అపుడు మొగ్గలన్న, సారిపుత్రుడితో ఇలా అన్నాడు: " పద మిత్రమా! మనం వెళ్ళి సర్వోన్నతుడైన బుద్ధుని ఆశ్రయిద్దాం. అతనే మన గురువు."

18. సారిపుత్రుడు "అంతకంటే ముందు ఇక్కడ మనల్నే నమ్ముకుని జీవిస్తున్న రెండు వందల యాభైమంది (250) పరివ్రాజకులకు మనం వెళ్ళిపోతున్నట్టు తెలియజేయాలి. వారికి తోచినట్టు వారునిర్ణయించుకొంటారు."

19. సారిపుత్రుడు, మొగ్గలన్న పరివ్రాజకుల వద్దకు వెళ్ళి: "మిత్రులారా! మేమిద్దరం తథాగతుని వద్దకువెళ్తున్నాం. ఇకపై అతనే మాగురువు" అన్నారు.

20. పరివ్రాజకులు ఇలా సమాధానమిచ్చారు. " మీవల్లనే మేమందరం ఇక్కడ నివసిస్తున్నాం. ఇకపై మీరు మహాశ్రముడి సమక్షంలో పవిత్రజీవనం గడుపుదామని నిర్ణయించుకుంటే మేము కూడా అదేవిధంగా చేస్తాం."

21. సారిపుత్రుడు, మొగ్గలన్న తమ గురువైన సంజయుని వద్దకు వెళ్ళి "మిత్రమా! మేము తథాగతుని సమక్షానికి వెళ్తున్నాం అతనే మా గురువు" అన్నారు.

22. సంజయుడు, "మిత్రమా, వెళ్ళవద్దు మనం ముగ్గురంకలిసి ఈ పరివారాన్ని చూసుకుందాం" అన్నాడు.

23. ఆ విధంగా సారిపుత్రుడు, మొగ్గలన్న రెండు మూడు సార్లు అదే విషయం చెప్పగా, సంజయుడు అదేవిధంగా వారించాడు.

24. అంతట సారిపుత్రుడు మొగ్గలన్నతో పాటు 250 మంది శిష్యులను తీసుకొని, తథాగతుడు నివశిస్తున్న రాజగ్రహంలోని వేలువనంలోకి వెళ్ళారు.

25. సర్వోన్నతుడైన బుద్ధుడు వారిరువురిని దూరంనుంచే చూసి, తోటి సన్యాసులతో ఇలా అన్నాడు: "అక్కడ చూడండి ఇద్దరు సహచరులు వస్తున్నారు," సారిపుత్రుడను, మొగ్గలన్నను చూపిస్తూ, "వీరిద్దరూ నా ప్రధాన శిష్యులు, పవిత్రమైన శిష్యద్వయంగా ఉంటారు " అన్నారు.

26. వారిరువురు వెదురువనంలో ప్రవేశించగానే, తధాగతుడు కూర్చున్నచోటికి వెళ్ళి, అతని ముందు సాష్టాంగప్రమాణంచేసి, ఇలా అన్నారు: "భగవానుడా! మాకు దీక్ష యివ్వండి" అని ప్రార్థించారు.

27. భగవానుడు తనసంప్రదాయం ప్రకారం "ఏహిభిక్షూ" అంటూ, సారిపుత్ర మొగ్గలన్నలతో పాటు రెండువందల యాభైమంది పరివ్రాజకులకు దీక్ష ఇచ్చాడు.

## 4. బింబిసారమహారాజుకు దీక్ష

1. రాజగ్రహ మగధరాజు శ్రేణియ బింబిసారుని రాజధాని.

2. రాజగ్రహ నగరంలోని పలువురు జటిలురు బుద్ధునివద్ద దీక్షగైకొన్నారని తెలిసి, నగరమంతటా బుద్ధుని గురించి చర్చ ప్రారంభమైంది.

3. ఆ విధంగా బుద్ధుని నగరప్రవేశం మహరాజు బింబిసారునికి తెలిసింది.

4. "అత్యంత సాంప్రదాయ బద్ధులు, మూఢులు అయిన జటిలురను మార్చడమంటే సామాన్య విషయం కాదు నిజమే అనుకున్నాడు బింబిసారమహరాజు. అతనే సర్వోన్నతుడు, పవిత్రుడూ, పరిపూర్ణుడైన బుద్ధుడు అయివుండాలి. జ్ఞానంలోను, సత్ప్రవర్తనంలోను నిష్ణాతుడు. ప్రపంచాన్ని అర్ధంచేసుకొనే లోకసంచారి; మనుషులను సన్మార్గంలో నడిపించే ఉదాత్తుడు. నరులకు సురులకు బోధించే గురువు. తాను స్వయంగా అర్ధంచేసుకున్న సత్యాన్నే ప్రభోధిస్తున్నారు.

5. "ఆదిమధ్యాంతాలలోనూ అణువణువునా అతి సుందరంగా అందే ధర్మాన్ని ఆయన బోధిస్తుంటారు. పరిపూర్ణం, నిర్మలం, పవిత్రంఅయిన జీవనాన్ని అతను ప్రవచిస్తుంటారు. అతనివంటి ఉత్తముడి దర్శనమే ఆనందదాయకం."

6. ఇలాఆలోచించిన బింబిసారమహారాజు మగధకు చెందిన 12 శ్రేణుల బ్రాహ్మణులు, గృహస్థులతో, తధాగతుడు ఉన్నప్రాంతానికి వెళ్ళాడు. తధాగతునికి సగౌరవంగా నమస్కరించి, అతనివద్ద కూర్చున్నాడు. ఆయనతో వచ్చినవారిలో కొందరు అదే విధంగా అభివాదంచేసి బుద్ధునివద్ద కూర్చున్నారు. కొందరు పలకరించి,కూర్చున్నారు మరికొందరు చేతులు జోడించి కూర్చున్నారు, ఇతరులు తమ పేరు, కుటుంబనామం చెప్పి కూర్చున్నారు, మరి కొందరు మౌనంగా తథాగతునికి సమీపంలో కూర్చున్నారు.

7. ఆ మగధ బ్రహ్మణులు, గృహస్థులు తథాగతుని సమక్షంలో ఊరువెల్ల కశ్యపుడిని చూసి

ఆశ్చర్యపోయారు."ఇదెలా సంభవం? శ్రమణుడు కశ్యపుడి శిష్యరికంలో పవిత్రజీవనం గడుపుతున్నాడా? లేక కాశ్యపుడు శ్రమణుని శిష్యరికం చేస్తున్నాడా?"

8. వారి ఆలోచనలనుపసికట్టిన తథాగతుడు, పూజనీయుడైన కశ్యపుడితో ఇలా అన్నారు: "ఊరువెల్ల నివాసివైన కశ్యపుడు, మహనీయుడవని పేరు పొందిన నీవు అగ్నిపూజను వదిలివేయడానికి కారణమేమిటి?"

9. కశ్యపుడు ఇలా సమాధాన మిచ్చాడు: " అగ్నిహోత్రంవల్ల కమనీయ దృశ్యాలు, శ్వాసలు, రుచులు, కావాలన్న కోరికలు, సంభోగేచ్ఛతీరుతాయని అంటారు. కాని ఈ కోర్కెలు తుచ్ఛమైనవని గ్రహించినతర్వాత నాకు బలులు, నైవేద్యాలపై ఆసక్తిపోయింది."

10. "మీరేమీ అనుకోకపోతే మీరు ఇటువంటి నిర్ణయానికి ఎలావచ్చారో తెలపండి."

11. పరమ పూజనీయుడైన కాశ్యపుడు లేచినిల్చుని తన ఉత్తరీయాన్ని ఒక భుజంపైకి వచ్చేలా సవరించుకొని బుద్ధుని ఎదుట సాష్టాంగప్రణామం చేసి, ఇలా అన్నారు: "సర్వోన్నతుడు నా గురువు, నేను అతని శిష్యుడిని." అప్పుడు ఆ పన్నెండు శ్రేణుల మగధ బ్రాహ్మణులకు, గృహస్థులకు, కశ్యపుడే శ్రమణుడి ఆధ్వర్యంలో పవిత్రజీవనం గడుపుతున్నారని అర్థమైంది.

12. ఈ పన్నెండు శ్రేణుల బ్రాహ్మణుల, గృహస్థుల మనస్సులలోని ఆలోచనను అర్థం చేసుకొన్న తథాగతుడు, వీరికి తన ధర్మాన్ని బోధించారు. నల్లని మరకలు పోయి తెల్లగా, స్వచ్ఛంగాతయారైన శుభ్రవస్త్రంలో, ఈ భోధనలో పదకొండుశ్రేణుల మగధుల హృదయాలు పవిత్రతను, స్వచ్ఛతను పొందాయి. పన్నెండవ శ్రేణి అప్పటికపుడు భగవానుడి శరణుగోరి సామాన్య బౌద్ధులయ్యారు.

13. ఈ దృశ్యాన్ని తిలకించి, బౌద్ధ ధర్మాన్ని అవగాహన చేసుకొన్న బింబిసారమహారాజులో అన్ని సందేహాలు విచ్ఛిన్నమై, సంపూర్ణ జ్ఞానం కలగగా, ఆయన తథాగతునితో ఇలా అన్నారు: "ఇది వరకు నేను రాజకుమారునిగా ఉన్నప్పుడు, నాకు ఐదు ఆశయాలుండేవి, అవన్ని ఇప్పుడు పూర్తిగా సిద్ధించాయి.

14. గతంలో నేను యువరాజుగా ఉన్నపుడు `నేను మహారాజుగా పట్టాభిషిక్తుడనైతే ఎంత బాగుండును' అనుకొన్నాను, అది నా మొదటి ఆశయం. అది సిద్ధించింది, ఆ తర్వాత సంపూర్ణజ్ఞానంపొందిన సర్వోన్నతుడు నారాజ్యానికివస్తే ఎంతబాగుంటుంది అనుకొన్నాను. అది నా రెండవ ఆశయం. అది కూడా సిద్ధించింది. 'వారికి నేను సేవ చేయగలిగితే ఎంత బాగుంటుంది' అనుకున్నాను. అది నా మూడవ ఆశయం. అది కూడా సిద్ధించింది. 'ఆ సర్వోన్నతుడు నాకు ధర్మభోధ చేస్తే ఎంత బాగుంటుంది' అనుకున్నాను. అది నా నాల్గవ ఆశయం. అది ఈ నాటికి సిద్ధించింది. 'ఆధర్మాన్ని నేను అర్థం చేసుకోగలిగితే ఎంత బాగుంటుంది!' అనుకొన్నాను. అది నా ఐదవ ఆశయం. అదికూడా నేటికి సిద్ధించింది. భగవానుడా యువరాజుగా నేను ఏర్పరచుకున్న అయిదు ఆశయాలు అవి. 'అద్భుతం,

భగవానుడా!,అద్భుతం.తలక్రిందులైనదాన్ని మళ్ళీసవ్యంగా నిలబెట్టినట్లు, గోప్యంగావున్నదాన్ని బహిరంగపరచినట్లు దారితప్పినవారికి మార్గం చూపినట్లు, అంధకారంలో దీపం వెలిగించినట్లు, చూపున్నవారు చూడగలిగినట్లుగా తథాగతుడు అనేకరకాలుగా ధర్మాన్ని ప్రబోధించారు. భగవానుడా నేను మీ శరణం కోరుతున్నాను, మీ ధర్మం, భిక్షువుల సాంగత్యం, శరణం కోరుతున్నాను. ఈ రోజు నుంచి జీవితాంతం నన్ను శరణుజొచ్చి సామన్య శిష్యునిగా స్వీకరించమని ప్రార్థిస్తున్నాను."

## 5.అనాధపిండికునికి దీక్ష

1. కోసలరాజ్యం రాజధానియైన శ్రావస్తిలో సుదత్తుడు నివసించేవాడు. ఆ రాజ్యాన్ని ప్రసేనజిత్తు మహారాజు పాలించేవాడు. సుదత్తుడు రాజుగారి ఖజన్చాదారుడు. పేదల పట్ల వితరణ కలిగివుండడంవల్ల అతనికిఅనాధపిండికుడుఅనే పేరుండేది.

2. బుద్ధ భగవానుడు రాజగ్రహంలోఉండగా ఒకసారి అనాధపిండికుడు తన స్వంతపని మీద ఆ వూరికి నచ్చాడు రాజగ్రహ సమాజాధికారి భార్య అయిన తన సోదరి యింట్లో అతను బసచేశాడు.

3. అక్కడికి చేరుకోగానే, సమాజాధికారి, బుద్ధుని కోసం, బౌద్ధసన్యాసుల కోసం పెద్ద యెత్తున భోజనం ఏర్పాట్లు చేస్తుండడంచూసి, ఏదైన వివాహానికిగానీ, రాజుగారి ఆతిథ్యం కోసం గానీ ఏర్పాట్లు చేస్తున్నారని అనాధపిండికుడు భావించాడు.

4. నిజంతెలుసుకోగానే, బుద్ధుని చూడడానికి ఉత్సుకతచెంది, ఆ రాత్రే ఆయనను కలుసుకోవడానికి వెళ్ళాడు.

5. అనాధపిండికుడి స్నేహపూర్వకమైనభావాన్ని గుర్తించిన తథాగతుడు స్నేహపూర్వకమైన పలుకులతో అతనికి స్వాగతం చెప్పారు. కూర్చున్న వెంటనే అనాధ పిండికుడు, ఏదైనా మతపరమైన విషయంపై ప్రబోధం వినాలన్న ఆకాంక్షను వ్యక్తంచేశాడు.

6. అంతట తథాగతుడు ఈ విధంగా ప్రశ్నించాడు: "మన జీవితాలకు రూపకల్పన చేసిందెవరూ? ఈశ్వరుడే సృష్టించాడందామా? అదే నిజమైతే, జీవరాశులన్నీ మౌనంగా అతని అధికారానికి దాసోహమవాలి. కుమ్మరి మలిచిన పాత్రల్లా ఉండాలి. ఈ యావత్ ప్రపంచాన్ని సృష్టించింది ఈశ్వరుడే అయితే, విషాదం, విపత్తు, పాపం అనేవి ప్రపంచంలో ఉండవు, ఎందుకంటే పవిత్రత, అపవిత్రత కూడా అతనినుంచే వస్తాయి. ఒకవేళ ఈశ్వరుడు సృష్టికర్త కాకపోతే, మరొక కారణం ఉండాలి. అతను స్వయంభువు కూడా కాజాలడు. ఏరకంగాచూసినా, ఈశ్వరుడు అన్నభావనే తిరస్కరించవలసి వుంటుంది.

7. అతీతశక్తి అన్నది దేనికీ కారణం కాజాలదని అంటారు. మన చుట్టూ వున్నవన్నీ, మొక్క విత్తనం నుంచి మొ కెత్తినట్టు, ఏదో ఒక కారణంనుంచి ఉత్పన్నమౌతాయి. అన్నిటికీ కారణం అతీతశక్తి ఎలాకాగలదు? అతీతశక్తి సర్వవ్యాప్తమైనపుడు, అది సకల జీవరాశికీ సృష్టికర్తకాజాలదు.

8. అలాకాక మనిషి స్వయంభువు అయితే అన్నింటినీ ఆనందదాయకంగా ఎందుకు చేసుకోలేడు? సుఖం దుఖం అన్నవి వున్నట్టు మనకు స్పష్టంగా కనిపిస్తోంది. స్వయంభువు అయిన మనిషి వాటిని ఎందుకు చేయాల్సివచ్చినట్టు?

9. ఆలాకాక, సృష్టికర్తగానీ, విధిగానీ లేదనీ, దీనికి కారణం లేదనీ భావించిన పక్షంలో, మన జీవితాలను ఏదో లక్ష్యం వుందనుకుని మలచుకోవడం దేనికి?

10. కనక భూమిపై జరిగే ప్రతిదానికీ ఏదో కారణం వుంటుందని మావాదన. అయితే, ఈశ్వరుడుగానీ, అతీతశక్తిగానీ, స్వయంభువుగానీ, కారణరహితమైన విధిగానీ ) సృష్టికర్త కాజాలరు, కేవలం మనచర్యలే సత్ఫలితాలనుగానీ, దుష్ఫలితాలనుగానీ ఇస్తాయి.

11. ప్రపంచంలో ప్రతిదానికీ ఏదో ఒక ప్రేరకశక్తి ఉంటుంది. బంగారంతో చేసిన పాత్రలో ఏభాగాన్నికైనా బంగారం ముఖ్య కారణమైనట్లే, ప్రతిచర్యకు మూలభూతమైన ఒక కారణం ఉంటుంది.

12. కనుక ఈశ్వరుని పూజించడం, ఆరాధించడం మానివేయడమే ఉత్తమం. నిష్ప్రయోజకమైన ఫలితాల గురించిన ఊహాగానాలలో మనఉనికిని కోల్పోవడం మానేద్దాం. స్వార్థాన్ని విడిచిపెట్టి ,మంచి పనులే ఆచరిస్తే వాటివల్ల సత్ఫలితాలే లభిస్తాయి.

13. అనాధపిండికుడు ఇలా అన్నాడు "తధా గతుని మాటల్లోని సత్యాన్ని గ్రహించాను. నా మనసులో మాటకూడా స్పష్టంగా చెప్పదలచుకున్నాను. నా మాటలు విన్న తర్వాత నేనేంచేయాలో భగవానుడే సూచించాలి.

14. నేను నిరంతరం పనుల్లో మునిగి వుంటాను. ఎంతో ఐశ్వర్యం సంపాదించాను. కనుక నాకు చింతకూడా ఎక్కువే. అయినప్పటికీ నాపని నాకు ఆనందాన్నిస్తుంది, దాన్ని చిత్తశుద్ధితో నిర్వర్తిస్తాను, నావద్ద చాలమంది పని చేస్తున్నారు, నా విజయంపై వారందరి భవిష్యత్తు ఆధారపడివుంది.

15. మీ శిష్యులు ప్రపంచంలోని అశాంతిని ఖండిస్తూ మీ ఆశ్రమంలోని బ్రహ్మానందాన్ని ప్రశంసించడం విన్నాను. తధాగతుడు తన రాజ్యాన్ని, సంపదను వదలిపెట్టి ధర్మమార్గాన్ని కనుగొనడంద్వారా నిర్యాణసాధనలో యావత్ప్రపంచానికి మార్గదర్శకుడైనాడని వారు అంటున్నారు.

16. ఏది మంచిపనో దాన్నే చేయాలని, తోటి మానవులకు హితుడిని కావాలని నా మనస్సు ఉవ్విళ్ళూరుతుంది. అయితే, నేను మిమ్మల్ని ఒక ప్రశ్న అడుగుతాను, నేను కూడా మీలాగే నా సంపదను, ఇంటిని, వ్యాపారాన్ని విసర్జించి నిర్వాసితుడనైతేనేగానీ, ధర్మ బద్ధమైన జీవితానందం నాకు లభించదా?

17. దీనిక తథాగతుడు ఇలా సమాధాన మిచ్చాడు: "అష్టాంగమార్గాన్ని అనుసరించే ప్రతి ఒక్కరికీ ధర్మబద్ధమైన జీవితానందం లభిస్తుంది. ఐశ్వర్యాన్ని అంటిపెట్టుకొనేవాడు, తనమనస్సు దానివల్ల విషపూరితం కాకమునుపే, దాన్ని త్రోసిపుచ్చటం మంచిది తన

ఆస్తి కి దాసోహమనక సవ్యంగా దాన్ని వినియోగించేవారు, తోటి ప్రజలకు నిజంగా హితులే.

18. కనుక నీవు నీవృత్తిలో కొనసాగుతూ, వ్యాపారాన్ని శ్రద్ధగానిర్వహించు. జీవితం, ఐశ్వర్యం, అధికారం మనిషిని బానిసలుగా చేయవు, ఆ మూడింటికీ దాసోహమనడమే మనిషిని బానిసగాచేస్తుంది.

19. కేవలం విశ్రాంతికోసం ప్రాపంచికజీవితాన్ని వదలిపెట్టి భిక్షకుడు దానివల్ల ఎట్టి ప్రయోజనం పొందడు. బద్ధకం అన్నది అసహ్యకరమైన లక్షణం, శక్తివిహీనత ఛీత్కరించవలసిన లక్షణం.

20. ఒక వ్యక్తి స్వచ్ఛందంగా కోరుకుంటే తప్ప, ప్రపంచాన్ని వదలిపెట్టాలని, సర్వ సంగపరిత్యాగం చేయాలనీ, తథాగతుని ధర్మం ఎవరినీ కోరదు, ప్రతివ్యక్తి స్వార్థచింతన వీడాలని, హృదయాన్ని పరిశుద్ధంగా ఉంచుకోవాలనీ వైవాహికానందాల మన వీడాలనీ, ధర్మమార్గంలో జీవించాలనీ మాత్రమే తథాగతుని ధర్మం కోరుతుంది.

21. మనిషి వృత్తికళాకారుడిగా, వ్యాపారిగా, రాజోద్యోగిగా ఉండవచ్చు. ప్రపంచాన్ని వీడి ధ్యానానికి జీవితం అంకితం చేయవచ్చు. ఏ పనిచేసినా త్రికరణశుద్ధితో తమ కర్తవ్యాన్ని నెరవేర్చాలి, చురుకుగా, ఉత్సాహంగా నీటిలో పెరిగినా, నీటిని అంటకుండా వుండే తామరల, ప్రపంచంలోనే జీవిస్తూ రాగద్వేషాలకు, అసూయకు అతీతులుగా స్వార్థం కోసం కాక, సత్యంకోసం జీవించినపుడు మానవుడికి పరిపూర్ణమైన ఆనందం శాంతి లభించడం తథ్యం."

22. జ్ఞానగర్భితమైన ఈ సత్యప్రవచనం అత్యుత్తమమైనదని అనాథపిండికుడు గ్రహించాడు.

23. తథాగతుడికి పాదాభివందనంచేసి, ముకుళితహస్తాలతో తన విన్నపం తెలియజేసాడు.

## 6. ప్రసేనజిత్తు మహారాజుకు దీక్ష

1. భగవంతుడు వచ్చినవిషయం తెలుసుకున్న మహరాజు ప్రసేనజిత్తు, రాజలాంఛనాలతో జితవన విహారానికి వెళ్ళాడు. బుద్ధునికి ముకుళిత హస్తాలతో నమస్కరించి ఇలా అన్నాడు.

2. అల్పమైన, చిన్నదైన మారాజ్యం మీరాకతో పావనంకావటం నిజంగా మాభాగ్యం. ప్రపంచానికే ఆదిదేవుడు ధర్మరాజు, సత్యవంతుడు అయిన మీరాకవల్ల మా రాజ్యానికి విపత్తులుగానీ ప్రమాదాలుగానీ సంభవించలేవు.

3. మీ పవిత్రదర్శనం ఈ నాటికిఅయింది. ఇక మీ ప్రబోధసాగరం నుంచి సరికొత్త జలాలను నాకుకూడా ప్రసాదించండి.

4. ప్రాపంచిక సంపద తాత్కాలికమైనది, నాశకరమైనది, కానీ ధర్మసంబంధమైన సంపద శాశ్వతమైంది, అపరిమితమైంది. లౌకిక జీవితం గడిపేవాడు యమరాజైనాసరే, నిరంతరం

కష్టాల్లో మునిగితేలుతుంటాడు, కానీ పవిత్రజీవనం గడిపేవాడు సామాన్యుడైనా, మనశ్శాంతి పొందగలుగుతాడు.

అత్యాశ, సుఖాపేక్షలతోనిండిన రాజుగారి హృదయం ఎరిగిన తథాగతుడు, ఈ సందర్భాన్ని అవకాశంగా తీసుకొని ఇలాఅన్నారు:

"అధమకులంలో జన్మించనవాడే, సచ్ఛీలుడైన వ్యక్తిని చూసినపుడు భక్తిభావంతో తలమునకలవుతుంటే, ఉన్నతవంశజుడు, స్వతంత్రుడు అయిన మహారాజు ఇక ఎంత ఉన్నతమైనఅనుభూతి చెందాలి?

ఇక నేను క్లుప్తంగా నా ధర్మాన్ని వివరిస్తాను, మహారాజా విని, జాగ్రత్తగా విచారించి, వాటిని ఆచరించగలరు.

మనంచేసే మంచిచెడు సదా నీడలా మనల్ని వెంటాడుతాయి.

మనిషికి అన్నింటికంటే అవసరమైంది ప్రేమించే హృదయం.

. నీ ఏకైక పుత్రుడిని ప్రేమించినట్లుగా నీ ప్రజలను ప్రేమించు. వారిని అణచివేయవద్దు, నాశనం చేయవద్దు, నీ అనుయాయులందరిపై నిరంతరం నిఘావుంచు అధర్మ విధానాలను పరిహరించి, ఎల్లవేళలా సన్మార్గంలోనే చరించు, ఇతరులను కాలికింద నలిపివేయడంద్వారా ఉన్నతదశ చేరుకోవాలని అనుకోకు. బాధితులకు ఓదార్పునివ్వు. స్నేహాన్ని పంచు.

. మహారాజుహోదాగురించి ఎక్కువగా ఆలోచించకు. ముఖస్తుతిమాటలకు విలువనివ్వకు.

2. నిష్ఫలవల్ల ప్రయాసతప్ప లాభం లేదు, దానికి బదులు `ధమ్మం` గురించి ఆలోచించి ధర్మశాసనాన్నిపట్టిచూడు.

3. దుఃఖం, అనారోగ్యం అనే పాషాణాలు మనల్ని చుట్టుముట్టివున్నాయి నిజమైన ధర్మం తెలుసుకున్నపుడే, ఈ భాదాతప్తతఅనే పర్వతంనుంచి తప్పించుకోగలం.

4. అధర్మం ఆచరించడంవల్ల లాభమేమిటి?

5. విజ్ఞులందరూ దైహికసుఖాలను ఈసడించుకుంటారు. కామాన్ని అసహ్యించుకుని, ఆధ్యాత్మికజీవితాన్ని ప్రోత్సహించడానికి ప్రయత్నిస్తారు.

6. చెట్టు మంటల్లో తగలబడి పోతున్నపుడు, పక్షులు అందులో ఎలా చేరుతాయి? ఉద్వేగం ఉన్నచోట సత్యం మనజాలదు. ఈ పరిజ్ఞానంలేనినాడు, ఋషివంటివాడని పొగడబడే విద్యాధికుడుకూడా అజ్ఞానేఅవుతాడు.

7. ఈ పరిజ్ఞానం ఉన్నవారికే నిజమైన జ్ఞానం లభిస్తుంది. జ్ఞానం సాధించడమే మనిషికి ఉండవలసిన ఏకైకలక్ష్యం. దాన్ని విస్మరించడం జీవితంలో విఫలం చెందడమే.

18. అన్ని ధర్మాల బోధనలకు ఈ లక్ష్యమే కేంద్రం కావాలి.

19. ఈ సత్యం ఒక తాపసికే పరిమితం కాదు, ప్రతివ్యక్తికీ మత బోధకుడికీ, సామాన్యుడికీ, అందరికీ వర్తిస్తుంది. బ్రహ్మచర్య దీక్ష తీసుకొన్న సన్యాసికీ, సంసారంచేసే సామాన్యుడికీ, మధ్య ఎలాంటి వ్యత్యాసం లేదు. దిగజారిపోయే ఋషులున్నట్లే తమ సత్ప్రవర్తనతో ఋష్యత్వానికి ఎదిగే సామాన్య సంసారులున్నారు.

20. కామమనే ఉప్పెన అందరికీ ఎదురయ్యే ప్రమాదమే, దానికి ప్రపంచమే కొట్టుకు పోతుంది. అందులో చిక్కుకుపోయిన వ్యక్తికి తప్పించుకునే మార్గం లేదు, కానీ జ్ఞానమనే పడవలో, వివేచనఅనే చుక్కానితో తప్పించుకోవచ్చు. ఈ శత్రువునుంచి మనిషి తనని తాను ఎలా రక్షించుకోవాలో నేర్పేదే మతం.

21. మన చర్యల ఫలితాలను తప్పించుకోవడం అసాధ్యం. కనక మనం మంచి పనులే చేయడం అభిలషణీయం.

22. మనం చెడుపనులు చేయకుండా మన ఆలోచనలను తరచుగా పరీక్షించుకుంటూ వుండాలి. మనం ఏవిత్తనం నాటితే ఆ చెట్టే మొలుస్తుందన్న విషయం గుర్తుంచుకోవాలి.

23. వెలుతురు నుంచి చీకటిలోకి, చీకటి నుంచి వెలుగులోకి వెళ్ళేందుకు మార్గాలున్నాయి. అలాగే మసక చీకటినుంచి మరింత అంధకారంలోకి, ఉషోదయం వెలుతురు నుంచి చిక్కని వెలుగులోకి వెళ్ళడానికికూడా మార్గాలున్నాయి. వివేకవంతుడు కొద్ది వెలుతురు నుండి మరింత వెలుతురులోకి వెళ్ళేందుకు ప్రయత్నిస్తాడు. సత్యమనే జ్ఞానంవైపుకు అతను నిరంతరం ప్రయాణిస్తాడు.

24. సౌశీల్య ప్రవరనలో తార్కికమైన ఆలోచనతో నిజమైన ఆధిక్యతను సమకూర్చుకో. ఇహలోకంలోని అహాన్ని గుర్తించు, జీవితపు అస్థిరతను అర్థం చేసుకో.

25. మానసికఔన్నత్యం పెంచుకో. స్థిరసంకల్పంతో సద్ధర్మాన్ని అన్వేషించు, రాచరిక ప్రవర్తనను ఉల్లంఘించకు, నీ ఆనందం బాహిరమైన విషయాలపై కాక, నీ అంతరంగంపై ఆధారపడేలా చూసుకో. ఆరకంగా నువ్వు యుగయుగాలవరకు ఘనకీర్తి సంపాదిస్తావు.

26. మహారాజు ప్రసేనజిత్తు పురస్సరంగా తథాగతుని పలుకులువిని వాటిని హృదయంలో భద్రపరచుకొని, ఆయనకు సామాన్యశిష్యుడిగా మారనున్నట్లు వాగ్దానంచేశాడు.

## 7. జీవకునికి దీక్ష

1. రాజగ్రహలో రాజనర్తకి అయిన సాల్వతికి జీవకుడనే కొడుకు ఉండేవాడు.

2. జీవకుడు అక్రమసంతానం కావడం వల్ల, అతను జన్మించిన వెంటనే ఒక బుట్టలో పెట్టి, చెత్తకుప్పపై పారేశారు.

3. చెత్తకుప్పపైవున్న శిశువును చూస్తూ చాలా మంది పోగవుతున్నారు. రాజకుమారుడైన అభయుడు అదేసమయంలో అటుగావెళ్తున్నాడు. ఆ శిశువుగురించి అక్కడవున్న వారిని అతను ప్రశ్నించగా "జీవించే వున్నాడు" అని జవాబిచ్చారు.

4. అందుకే ఆ శిశువుకు జీవకుడనే పేరు వచ్చింది. అభయుడు అతన్ని దత్తత స్వీకరించి, పెంచిపెద్దవాడిని చేశాడు.

5. జీవకుడు తనుపెరిగి పెద్దవాడయ్యాక, తను ఎలా రక్షింపబడినదీ తెలుసుకున్నాడు. తనుకూడా ఇతరులను రక్షించేంత స్తోమత సంపాదించుకోవాలని నిర్ణయించుకున్నాడు.

6. అతను అభయునికి తెలియకుండా, అతని అనుమతి లేకుండా తక్షశిల విశ్వవిద్యాలయానికి వెళ్ళి ఏడేళ్ళపాటు వైద్యవిద్య నేర్చుకున్నాడు.

7. రాజగ్రహకి తిరిగిరాగానే వైద్యవృత్తి చేపట్టి, అనతికాలంలోనే మంచివైద్యునిగా కీర్తిప్రతిష్టలు సంపాదించాడు.

8. అతని వద్దకు వచ్చిన మొట్టమొదటి రోగి సాకేతనగరానికి చెందిన ఒక వ్యాపారవేత్త భార్య. ఆమెకు నయంచేసినందుకు పదహారు వేల కహరణాలను, ఒక మగపరిచారకుని, ఒక ఆడపరిచారికను, ఒక రథాన్ని ఆ వ్యాపారి జీవకునికి బహూకరించాడు.

9. అతని గొప్పదనాన్ని గుర్తించిన అభయుడు రాజసౌధంలోనే అతనికి ఆవాసం కల్పించాడు.

10. రాజగ్రహలో బింబిసారుని దీర్ఘకాల వ్యాధిని జీవకుడు నయంచేశాడు. దీనికి ప్రతిఫలంగా, బింబిసారుని ఐదువందల మంది భార్యలు తమ నగలన్నిటినీ అతనికి ఇచ్చారని చెప్పుకుంటారు.

11. జీవకుడు చికిత్సచేసి ఆరోగ్యవంతులను చేసినవారిలో రాజగ్రహకు చెందిన ఒక వ్యాపారి, వారణాసికి చెందిన మరో వ్యాపారి కుమారుడు ఉన్నారు.

12. జీవకుడిని రాజవైద్యునిగా, అంతఃపుర స్త్రీల వైద్యునిగా నియమించారు.

13. అయితే జీవకుడు తథాగతుని ఆరాధించేవాడు కనుక, ఆయనలాసంఘానికీ కూడా వైద్యునిగా వ్యవహరించేవాడు.

14. జీవకుడు బుద్ధభగవానుని శిష్యునిగా మారాడు. అయితే అతను రోగులకు, గాయపడ్డవారికి నయంచేయడానికి స్వేచ్ఛగా ఉండాలి కనుక, తథాగతుడు జీవకునికి భిక్షువుగా దీక్షఇవ్వలేదు.

15. బింబిసారుని మరణానంతరం, జీవకుడు అతని కుమారుడు అజాతశత్రువు కొలువులో పనిచేశాడు. తండ్రిని చంపిన అజాతశత్రువు, పరివర్తనచెంది బుద్ధుని చేరుకొనడానికి ప్రధానకారకుడు జీవకుడే.

# 8. రాష్ట్రపాలకునికి దీక్ష

1. సర్వోన్నతుడైన బుద్ధుడు తన విస్తారమైన భిక్షుకగణంతో, కురుదేశంలో భిక్షాటనం చేస్తుండే రోజుల్లో కురుపట్నమైన తుల్లకొత్తితలో మజిలీచేశాడు.

2. ఆ విషయం తెలియగానే ఆ నగరవాసులు బుద్ధుని దర్శించారు.

3. వారు ఆసీనులుకాగానే భగవానుడు వారికి ధర్మప్రబోధం చేశాడు. ప్రబోధం వినగానే, బ్రాహ్మణశ్రేష్ఠులు బుద్ధునికి ధన్యవాదాలు తెలుపుకొని, అభివాదంచేసి, ఇంటిముఖం పట్టారు.

4. ఈ సమూహంలో, ఒక ఉన్నతవంశీయుడైన రాష్ట్రపాలుడు అనే యువకుడు కూడా ఉన్నాడు. అతను ప్రబోధం విని ఇలా అనుకున్నాడు. "నా కర్థమైనంతవరకూ, తథాగతుడు బోధించే ఈ ధర్మం ప్రకారం ఉన్నతమైన, పరిపూర్ణమైన, పవిత్రమైన జీవనం గడపడం సామాన్యమైన సంసారికి సాధ్యం కాదు.

5. నేనుకూడా శిరోముండనం చేసుకొని, కాషాయవస్త్రాలు ధరించి భిక్షకుడిగా ఇల్లిల్లూ తిరిగితే బాగుంటుందేమో!"

6. బ్రాహ్మణులు వెళ్ళిపోగానే, రాష్ట్రపాలుడు బుద్ధుని సమీపించి, తన కోరికను వెల్లడించాడు.

7. దీనికి నీ తల్లిదండ్రుల అనుమతి వుందా, రాష్ట్రపాలా?" అని ప్రశ్నించాడు తథాగతుడు.

8. "లేదండీ."

9. "తల్లిదండ్రుల అనుమతి లేనివారిని నేను చేర్చుకోను"

10. "వారి అనుమతి తీసుకోవడానికి నేను ప్రయత్నిస్తాను" అని చెప్పి అతను, బుద్ధుని వద్ద భక్తిపూర్వకంగా సెలవుతీసుకొని తల్లిదండ్రులవద్దకు వెళ్ళి, తను భిక్షుకుడు కావడానికి అనుమతి ఇవ్వవలసిందిగా కోరాడు.

11. దానికి అతని తల్లిదండ్రులు ఇలా జవాబిచ్చారు: "ప్రియమైన రాష్ట్రపాల! నీవు మాకు ఒక్కగానొక్క కొడుకువి. మాకెంతో ప్రియమైనవాడివి. నువ్వు చిన్నప్పటి నుండి సకల భోగాలలో సుఖమైనజీవితం గడిపావు. హాయిగా తిని, తాగి, సంతోషంగా ఉండు. నువ్వు సంతోషంగా ఉండి, మంచి పనులు చెయ్యి, భిక్షకుడిగా మారడానికి మేము అనుమతించం.

12. నీవు మరణిస్తే ఎలాగు మాకు నిస్పృహతప్ప, జీవితంలో ఎలాంటి ఆనందమూ మిగలదు. కాని నువ్వు మావద్ద ఉన్నప్పుడు కూడా, ఇల్లువదిలి భిక్షకుడిగా వెళ్ళడానికి మేము అనుమతించడం కుదరదు."

13. రాష్ట్రపాలకుడు ఎన్ని సార్లు వేడుకున్నా, తలిదండ్రులు నిరాకరిస్తూనే వచ్చారు.

14. దీనితో చాలా వ్యధచెందిన రాష్ట్రపాలుడు నేలపై బోర్లాపడుకుని, తనను భిక్షకునిగా ఉండడానికి అనుమతించకపోతే, అక్కడే ప్రాణాలు విడుస్తానని చెప్పాడు.

15. అతని తల్లిదండ్రులు అతన్ని లేవమని మరీమరీ ప్రార్ధించారు. అయితే అతను ఒక్కమాట కూడా మాట్లాడలేదు.

16. అతని తల్లిదండ్రులు రాష్ట్రపాలుని మిత్రులను పిలిచి, వారికి తమ గోడు వినిపించుకొని, తమ తరపున మాట్లాడమని కోరారు.

17. అతని మిత్రులు మూడుసార్లు అతన్ని వేడుకున్నా, రాష్ట్రపాలుడు ఒక్క మాటకూడా మాట్లాడలేదు. కనుక అతని మిత్రులు వెనక్కి తిరిగి వచ్చి, "అతను నేలపై పడుకుని తనను భిక్షువు కావడానికి అనుమతించని పక్షంలో చనిపోతానని బెదిరిస్తున్నాడు. మీరు అనుమతి నిరాకరిస్తే అతను సజీవంగాలేచే ప్రసక్తిలేదు. మీరు అనుమతిస్తే, అతన్ని భిక్షకునిగానైనా చూడవచ్చు. మనకంతకంటే ప్రత్యామ్నాయం లేదు. వెంటనే అనుమతించండి." అన్నారు.

18. "సరే మేము అంగీకరిస్తున్నాము. అయితే బిక్షుకుడుకాగానే అతను మమ్మల్ని చూడాలి"

20. వెంటనే రాష్ట్రపాలుడు లేచి, కొంచెం ఓపికరాగానే, తథాగతుని వద్దకు వెళ్ళాడు. ఆయనకు అభివాదం చేసిన తర్వాత, "నాకు భిక్షకునిగా దీక్ష తీసుకోవడానికి తల్లిదండ్రుల అనుమతి లభించింది. కనుక నన్ను చేర్చుకోండి" అన్నాడు.

21. ఆప్రకారంగానే భగవానుడు అతనికి దీక్షనిచ్చాడు. ఒక పక్షంరోజుల తర్వాత, తథాగతుడు అక్కడినుండి పయనమై జితవనంలో బసచేశాడు.

22. రాష్ట్రపాలుడు ఒంటరిగా ఉండిపోయి, స్వార్థచింతన పూర్తిగావీడి, కఠినమైన దీక్షను అవలంబించి, భిక్షుక గణంతో అత్యంత ఉన్నత శ్రేణికి చేరుకోగలిగాడు.

23. ఆ తర్వాత ఒకనాడు బుద్ధుని వద్దకు నెళ్ళి నమస్కరించి ఆయన అనుమతితో తన తల్లి దండ్రులను చూసివస్తానని కోరాడు.

24. తన దివ్యచక్షువుతో రాష్ట్రపాలుని హృదయంలోనికి చూడగలిగిన భగవానుడు, అతను మళ్ళీ సంసారికజీవనాన్ని ఆశ్రయించే ప్రమాదంలేదని గ్రహించి, వెళ్ళడానికి అనుమతించాడు

25. ఆప్రకారమే రాష్ట్రపాలుడు బుద్ధునివద్ద భక్తి ప్రపత్తులతో సెలవుతీసుకొని, కురు రాజ్యంలోని లేళ్ళవనంలో బసచేశాడు.

26. ఆ మరుసటి రోజు ఉదయాన్నే కాషాయ వస్త్రం ధరించి, చేతిలో భిక్షపాత్రతో అతన పట్టణంలో భిక్షకైవెళ్ళి వరుసక్రమంలో తన తల్లిదండ్రుల ఇంటికి కూడా వచ్చాడు.

27. గదిలో తల దువ్వించుకుంటున్న అతని తండ్రి, దూరంనుంచి రాష్ట్రపాలుని చూసి, "ఈ భిక్షకులే నా ఒక్కగానొక్క కొడుకును నాకుకాకుండా చేశారు" అనుకొన్నాడు.

28. ఆ విధంగా తన తండ్రి ఇంట్లో రాష్ట్రపాలునికి భిక్ష దొరకలేదు, కనీసం నిరాకరణ కూడా దొరకలేదు, తిట్లు శాపనార్థాలు తప్ప.

29. అదే సమయంలో, ఒక పనిపిల్ల ముందురోజు అన్నాన్ని పారవేయబోయింది. రాష్ట్రపాలుడు చూసి "సోదరీ దాన్ని పారవేయదలచుకుంటే ఈ భిక్షా పాత్రలో వెయ్యి."

30. భిక్షవేస్తుండగా, అతని పాదాలు, చేతులు, కంఠస్వరాన్నిబట్టి పరిచారిక, గుర్తించి ఇంట్లోనికి పరుగెత్తి "అమ్మా మన చిన్న దొర వచ్చాడు. చూసావా?" అని అడిగింది.

31. "నువ్వు చెప్పింది నిజమే అయితే, నీవిక నుంచి బానిసవు కావు" అంటూ తల్లి తన భర్తకు ఈ విషయం చెప్పడానికి వెళ్ళింది.

32. రాష్ట్రపాలుడు బయటకూర్చుని ఆ చద్దెన్నం తింటూఉండగా తండ్రి అక్కడికి హడావిడిగా వచ్చి అన్నాడు, నిజంగా ఈ చద్దెన్నం తింటున్నది నా ప్రియకుమారుడేనా? నీ స్వంతఇంటికి రాకుండా ఇదేం పని?"

33. రాష్ట్రపాలుడు, "గృహస్థ జీవితాన్ని వదిలివెళ్ళిన మాకు స్వంతఇల్లు ఎక్కడుంది? మీ ఇంటికి నేను వచ్చిన మాట నిజమే, కానీ నాకు అక్కడ అన్నము దొరకలేదు, కనీసం తిరస్కృతి కూడా లభించలేదు, కేవలం తిట్లు మాత్రమే దక్కాయి."

34. "లోపలికిరా, కుమారా" అన్నాడు తండ్రి. "అక్కర్లేదు, గృహస్థా ఈ పూటకు నా భోజనం పూర్తయింది" అన్నాడు రాష్ట్రపాలుడు.

35. అలాగయితే, రేపు నీ భోజనం ఇక్కడే తీసుకుంటానని వాగ్దానం చెయ్యి" అన్నాడు తండ్రి.

36. రాష్ట్రపాలుడు మౌనంగానే తన అంగీకారం తెలిపాడు.

37. ఆ తరువాత అతని తండ్రి ఇంట్లోకి వెళ్ళి, బంగారాన్ని పోగుచేసి, దానిపై చాపలు కప్పమని ఆదేశించాడు. రాష్ట్రపాలుని ఒకనాటి భార్యలను అద్భుతంగా అలంకరించుకొని భర్తకు దర్శనమివ్వవలసిందని ఆదేశించాడు.

38. మరుసటి ఉదయం షడ్రసోపేతమైన భోజనం తయారు చేయించి, తన కుమారుని భోజనానికి రావలసిందని కబురుచేశాడు. మధ్యాహ్నం కావస్తుండగా పూజ్యుడైన రాష్ట్రపాలుడు కాషాయవస్త్రాలు ధరించి, భిక్షపాత్రతో అక్కడికి వచ్చి, తన స్థానంలో కూర్చున్నాడు.

39. అంతట తండ్రి ధనరాశులపై కప్పిన చాపలను తొలగించమని ఆదేశిస్తూ, "ఇదిగో, ఇది నీ తల్లి ఆస్తి. అది నీ తాతగారి నుంచి తండ్రికి సంక్రమించిన ఆస్తి. ఈ ఐశ్వర్యాన్ని అనుభవించడానికి, సత్కార్యాలు చేయడానికి నీకు సంపూర్ణమైన అధికారంవుంది.

40. పద కుమారా ! నీ భిక్షుక వృత్తిని వదిలిపెట్టు . ఒక సామాన్యుడిలా జీవిస్తూ, సంపదను అనుభవిస్తూనే మంచిపనులు చెయ్యి".

41. రాష్ట్రపాలుడు తండ్రికి ఇలా సమాధానమిచ్చాడు: "ఓ గృహస్థా ! నా సలహాను తీసుకుని నీవు ఈ పోగుచేసిన సంపదనంతా గంగానదిలో దిమ్మరించు. ఎందుకో చెప్పనా? ఇవి ఉన్నంత కాలం నీకు దుఃఖం, వేదన, రోగం, శారీరక, మానసిక బాధలు ఇక్కట్లు తప్పవు."

42. రాష్ట్రపాలుని భార్యలు అతని పాదాలపైబడి ప్రాధేయపడుతూ అతను ఈ దీక్ష ద్వారా ఏ అప్సరసల సాంగత్యాన్ని కోరుతున్నావని ప్రశ్నించారు.

43. "నేను అప్సరసలకోసం దీక్షతీసుకోలేదు, సోదరీ" అని జవాబిచ్చాడు, అతను.

44. సొంత భార్యలైన తమను అతను చెల్లెళ్ళని సంబోధించడంతో వారు హతాశులై స్పృహ కోల్పోయారు.

45. రాష్ట్రపాలుడు తన తండ్రితో "నాకు భోజనం పెట్టాలనుకొంటే పెట్టండి. నన్ను ఇబ్బంది పెట్టకండి" అన్నాడు.

46. "భోజనం సిద్ధంగా వుంది, కుమారా!", అంటూ తండ్రి కొడుకుకోసం ప్రత్యేకంగా వండించిన షడ్రసోపేతమైన భోజనాన్ని అతనికి కొసరికొసరి వడ్డించాడు.

47. భోజనానంతరం రాష్ట్రపాలుడు కురురాజ్యంలోని లేళ్ళవనంలో ఒక చెట్టు కింద విశ్రమించాడు.

48. ఆ సమయంలో, కురురాజు ఆదేశంప్రకారం, ఒక వేటగాడు ఆ ఉద్యానవనాన్ని శుభ్రం చేస్తున్నాడు, తన పనిలోవుండగా రాష్ట్రపాలుడు చెట్టుక్రింద కూర్చునివుండడం చూసి, ఆ విషయం రాజుగారికి చెప్పాడు, అప్పటికే రాజుగారు రాష్ట్రపాలుని గురించి వినివున్నాడు.

49. "ఇక ఇవాళ ఉద్యానవనం శుభ్రపరచనవసరం లేదు. నేను ఆ పూజ్యుని దర్శనం చేసుకుంటాను". వెంటనే రాజు రథారూఢుడై సపరివారంగా ఉద్యానవనం వద్దకు వెళ్ళాడు.

50. రథం వెళ్ళగలిగినంతదూరం వెళ్ళి, అక్కడినుండి కాలినడకన రాష్ట్రపాలుని వద్దకు వెళ్ళాడు. మహారాజు రాష్ట్రపాలునికి అభివాదం చేసి ఒక పువ్వులపాన్పుపై కూర్చుండమని ఆహ్వానించారు.

51. "వద్దు రాజా! మీరే అక్కడ కూర్చోండి నాకీ ఆసనం చాలు" అన్నాడు రాష్ట్రపాలుడు

52. రాష్ట్రపాలుడు తనకు చూపించిన స్థానంలో కూర్చుని, మహారాజు ఇలా అన్నాడు "ప్రపంచంలో నాలుగువిధాలైన బాధలవల్ల మనుషులు శిరోముండనం చేసుకొని కాషాయ వస్త్రాలు ధరించి సంచార జీవనం ప్రారంభిస్తారు. అవి 1. వార్ధక్యం 2 అనారోగ్యం 3. దారిద్ర్యం 4. ఆత్మీయులనుంచి.

53. ఉదాహరణకు ఒక వృద్ధుడినే తీసుకో, వయస్సుబాగా పైబడినస్థితిలో తను ఇకపై ధనార్జ చేయలేననీ, సంపాదించినదాన్ని వ్యయపరచడంకూడా చేతగాదనీ గ్రహిస్తాడు. అప్పు

గృహస్థాశ్రమాన్ని త్యజిస్తాడు. కానీ నీవు సంపూర్ణయౌవనంలో ఉన్నావు. ఒ ఫలితకేశమైన లేక నిగనిగలాడే శిరోజాలతో, సౌందర్యంతో వెలుగుతున్నావు. వృద్ధాప్యదుః నీకు లేదు. అటువంటప్పుడు గృహస్థాశ్రమాన్ని ఎందుకు వదిలిపెట్టావు?

54. మరో వ్యక్తి వయస్సులోనే వున్నా దీర్ఘ అనారోగ్యానికి గురైనాడనుకుందాం. తను ఇ సంపాదించలేననీ, ఉన్నదాన్ని అనుభవించలేనని తెలుసుకుంటాడు. అటువంటి దః గృహజీవితాన్ని వదలడానికి నిర్ణయించుకుంటాడు. కాని నీకు ఎటువంటి అనారోగ్యం లే కనుక ఆ పరిస్థితికూడా నీకు వర్తించదు. మరి ఎందుకు గృహజీవితాన్ని త్యజించావు?

55. ఇంకొక వ్యక్తి చాలా కాలం సంపన్నజీవితం గడిపి, క్రమేపీ దాన్ని కోల్పోయినతర్వా తన స్థితిని తెలుసుకుంటాడు. తను ఇకపై ఆర్జించలేననీ, ఉన్నదాన్నికూడా అనుభవించలే తెలుసుకుంటాడు. ఇది దారిద్ర్యంవల్ల వచ్చిన నిర్వేదం. అందువల్ల అతను గృహస్థాశ్రమా వదిలి, భిక్షుకుడవుతాడు. కాని పావనుడైన రాష్ట్రపాలుడు ఒక ఉన్నత సంపన్న కుటుంబ వంశోద్ధారకుడు. అతనికి అటువంటి బాధ ఏదీలేదు, దేనివల్ల నీవు ఇ భిక్షుకజీవితాన్నిగడుపుతున్నావు? పోనీ ఆత్మీయులను కోల్పోవడం గురించి అనుకొందుర రాష్ట్రపాలా, ప్రతీ మనిషికీ చాలామంది మిత్రులు, పరిచితులు, బంధువులు ఉంటా కానీ వీరితో అనుబంధాలు క్రమేపీ అంతరించిపోతాయి. ఆ మనిషి ఇలా అనుకొంటా ఇదివరకు నాకు ఎందరో మిత్రులు, పరిచితులు ఉండేవారు, క్రమేపీ వారిసం తగ్గిపోయింది. కనుక ఇకపై నేను సంపదను కూడబెట్టడం అంత సులభం కా ఈరకంగా భావించి అతను శిరోముండనం చేయించుకొని, కాషాయవస్త్రాలు ధరిం గృహస్థాశ్రమం వదిలి వెళ్తాడు. దీన్నే ఆత్మీయులను కోల్పోవడం వల్ల కలిగేదుఃఖం చెప్తారు. కాని నీకు ఎందరో మిత్రులు, బంధువులు ఉన్నారు. నీ ఆత్మీయులెవ మరణించలేదు. అలాంటప్పుడు నీవు దేన్నిచూడడం, తినడం లేదా తెలుసుకోవడంవ గృహస్థాశ్రమం వదిలిపెట్టావు."

56. "నేను గృహస్థాశ్రమం వదిలి తాపసిని కావడానికి కారణం, నేను తథాగతుని నాలు సిద్ధాంతాలను తెలుసుకోవడం, చూడడం, వినడమే అవి.

1. ప్రపంచం నిరంతర పరిణామశీలయై ఉంటుంది.
2. ప్రపంచానికి పరిరక్షకుడు, పరిపోషకుడు ఎవరూ లేరు.
3. మన స్వంతమంటూ ఏదీ లేదు. అన్ని ఇక్కడ వదిలి వెళ్ళవలసిందే.
4. వాంఛకు బానిస అయిన ప్రపంచం ఎప్పుడూ లేనిదానికి వెంపర్లాడుతుంటుంది అన్నాడు రాష్ట్రపాలుడు.

57. "అద్భుతం, అత్యద్భుతం" అన్నాడు మహారాజు "భగవానుడు ఎంత నిజం చెప్పాడు!

# నాల్గవ భాగం

# ఇంటి నుండి పిలుపు

1. శుద్ధోధనుడితో తుది సమాగమం.
2. యశోధర, రాహులులతో కలయిక
3. శాక్యుల వైఖరులు
4. గృహస్థునిగా మార్చడానికి చివరి ప్రయత్నం.
5. బుద్ధుని సమాధానం
6. మంత్రి సమాధానం
7. బుద్ధుని స్థిరసంకల్పం

# 1. శుద్ధోధనుడితో తుది సమాగమం

1. సారిపుత్రుడు, మొగ్గలన్న దీక్షతీసుకున్న తర్వాత భగవానుడు రాజగ్రహలోనే రెండునెలలపాటు ఉండిపోయారు.

2. భగవానుడు రాజగ్రహలో నివసిస్తున్న విషయం తెలియగానే, ఆయన తండ్రి శుద్ధోధనుడు, "నేను మరణించేలోగా నా కుమారుడిని చూడాలి. అతని ధర్మబోధల వల్ల ఇతరులు ప్రయోజనం పొందారు గానీ, అతని తండ్రి గానీ, బంధువులు గానీ ఎలాంటి ప్రయోజనం పొందలేదు" అంటూ, కుమారుడికి కబురుపంపాడు.

3. శుద్ధోధనుని సంస్థానంలోని ఒక రాజోద్యోగి కుమారుడైన కలూదయనుడితో ఈ సందేశాన్ని పంపారు.

4. వార్తాహరుడు రాజగ్రహ చేరగానే ఇలా అన్నాడు: "విశ్వవ్యాప్తంగా గౌరవింపబడుతున్న ఓ తథాగతా, పద్మం సూర్యోదయం కోసం ఎదురు చూసినట్లుగా, నీ తండ్రి నీ రాక కోసం ఎదురు చూస్తున్నారు."

5. భగవానుడు తండ్రి విజ్ఞప్తికి సమ్మతించి, పలువురు శిష్యులు వెంటరాగా, తండ్రి ఇంటికి ప్రయాణమయ్యాడు.

6. భగవానుడు అక్కడక్కడా బసచేస్తూ నెమ్మదిగా ప్రయాణం కొనసాగించాడు. కానీ కలూదయనుడు ముందుగా శుద్ధోధనుని ఇంటికివెళ్ళి, తథాగతుడు వస్తున్నవిషయం చెప్పాడు.

7. శాక్యదేశమంతటా ఈ వార్త వ్యాపించింది. "జ్ఞాన సముపార్జనకోసం ఇంటినుంచివెళ్ళి విస్తృతంగా పర్యటించిన రాకుమారుడు సిద్ధార్థుడు తన లక్ష్యాన్ని సాధించి, కపిలవస్తులోని స్వగృహానికి విచ్చేస్తున్నాడు" ఎవరినోటవిన్నా ఇదేమాట.

8. శుద్ధోధనుడు, మహాప్రజాపతి, బంధు, అమాత్యసమేతంగా తమ కుమారుడిని కలుసుకోవడానికి వెళ్ళారు. కొంత దూరంనుంచి కుమారుడిని చూడగానే, అతని సౌందర్యం, ఠీవి, తేజస్సు వారి హృదయాలను ఆనందపారవశ్యంలో నింపివేశాయి. కానీ ఆ సంతోషంలో వారు అవాక్కయిపోయి మౌనంగా ఉండిపోయారు.

9. "ఇతనన్నమాట తమ పుత్రుడు, సిద్ధార్థుని రూపం ఇదన్న మాట! తమ హృదయాలకు శ్రమణుడు ఎంతచేరువలోఉండికూడా ఎంత అంతరం వుంది తమ మధ్య!ఈ మునీంద్రుడు ఇకపై తమ పుత్రుడు సిద్ధార్థుడు కాదు! అతనిప్పుడు బుద్ధుడు, దైవానుగ్రహ పాత్రుడు, పరమపావనుడు, సత్యవ్రతుడు, మానవజాతి ప్రబోధకుడు!

10. తన పుత్రుని ధార్మికమాన్యత దృష్టిలోవుంచుకుని శుద్ధోధనుడు తనే రథందిగి, కుమారుడికి అభివందనం చేసి, ఇలా అన్నాడు: "నిన్ను చూసి ఏడేళ్ళయింది. ఈ క్షణం కోసం ఎంత ఎదురుచూసామో."

11. బుద్ధుడు తండ్రి ఎదురుగా ఆసీనుడయ్యాడు. రాజు కుమారుడికేసి ఆర్తిగా చూసాడు. అతన్ని పేరు పెట్టి పిలవాలనిపించింది కానీ, సాహసించలేకపోయాడు. మనస్సులోనే అనుకున్నాడు "సిద్ధార్థా! నీ ముసలి తండ్రి వద్దకు తిరిగివచ్చి మళ్ళీ అతని కొడుకువైపో" కానీ కుమారుడి మొహంలోని దీక్షనుచూసి, తన మనోభావాలను మనసులోనే అణచివేసాడు. శుద్ధోధనుని మహాప్రజాపతిని ఒక విధమైన నిస్పృహఆవరించింది.

12. తనదుఃఖంలోనే ఆనందంపొందుతూ, ఆనందంలోనే దుఃఖిస్తూ కొడుకుకు అభిముఖంగా కూర్చున్నాడు ఆ తండ్రి. తన కుమారుడిని చూసి ఎంతగర్వించినా, మహానుభావుడైన తన పుత్రుడు ఏనాటికీ తనకు వారసుడు కాజాలడన్న ఆలోచన, ఆ గర్వాన్ని అణచివేసింది.

13. "నీకు నారాజ్యాన్ని ధారాదత్తం చేసేవాడినే, కానీ నువ్వు దాన్ని బుద్బుదప్రాయంగా పరిగణిస్తావు" అన్నాడు రాజు.

14. దానికి సమాధానంగా భగవానుడు ఇలా అన్నాడు: "రాజుగారి హృదయం ప్రేమ మయమనీ, తన కుమారుడికోసం ఆయన చింతాక్రాంతులవుతున్నారనీ నాకు తెలుసు. కానీ నువ్వుకోల్పోయిన నీ కుమారుడిపై ఎంత వాత్సల్యముందో అదే వాత్సల్యం నీ రాజ్యప్రజలందరిపైనా నువ్వు చూపగలిగినట్లయితే, నీ కుమారుడి స్థానంలో మరింత గొప్ప మహనీయుని పొందగలుగుతావు. అప్పుడు సత్యప్రబోధకుడు, ధర్మప్రచారకులు, శాంతి నిర్యాణదూత నీ హృదయంలో ప్రవేశిస్తాడు."

15. తన కుమారుడు, బుద్ధుడు పల్కిన ఈ మృదుమధుర వాక్యాలు విని పులకించిన శుద్ధోధనుడు సజలనయనాలతో ఇలా అన్నాడు: "నీలో ఎంత అద్భుతమైన మార్పు! నన్ను ముంచెత్తిన విషాదమంతా మటుమాయమైంది! మొదట్లో బాధతో బరువెక్కిన నా హృదయం నీ మహాభినిష్క్రమణఫలంతో ఇప్పుడే తేలికైంది. అపారమైన నీ దయాహృదయంలో, అధికారంవల్ల లభించే క్షణికమైన ఆనందాలను తిరస్కరించి, ధర్మదీక్షా మార్గాన్ని చేపట్టాలన్న నీ లక్ష్యం సరైనది. నీ మార్గాన్ని నిర్ణయించుకున్న నీవు విమోచనం కోసం తపనచెంది ప్రజలందరికీ ధర్మోపదేశం చేయగలవు."

16. అనంతరం శుద్ధోధనుడు స్వగృహానికి తిరిగివచ్చాడు. బుద్ధుడు సహచరులతో పాటు అక్కడే ఉండిపోయాడు.

17. మరుసటి ఉదయం, తథాగతుడు తన భిక్షపాత్ర తీసుకుని కపిలవస్తులో భిక్షాటనకై బయల్దేరాడు.

18. "సిద్ధార్థుడు రథారూఢుడై, సపరివారంగా విహరించిన వీధుల్లోనే ఈనాడు భిక్షకోసం యాచిస్తూ ఇంటింటికీ తిరుగుతున్నాడు. అతను కాషాయరంగు అంగీ ధరించి, చేతిలో మట్టిపాత్ర పట్టుకున్నాడు." అనే వార్త నగరమంతటా గుప్పుమంది.

19. ఈ వింతవార్త వినగానే, శుద్ధోధనుడు త్వరత్వరగా బుద్ధునికి ఎదురు వెళ్ళాడు. " ఎందుకు

నన్నిలా అవమానాలపాలు చేస్తావు? నీకూ, నీ భిక్షువులకూ నేను అవలీలగా ఆహారం సమకూర్చగలనని నీకు తెలియదా?" అని అడిగాడు.

20. దీనికి బుద్ధుడు "ఇది నా జీవనవిధానం" అని అన్నాడు.

21. "అదెలా అవుతుంది? భిక్షుక వృత్తి నువ్వెప్పుడు అవలంబించింది కాదు కదా"

22. దానికి సమాధానంగా తథాగతుడు, "తండ్రీ, నీవూ, నీ వంశీకులూ రాజులవారసులై వుండవచ్చు, కానీ నేను ప్రాచీన బుద్ధుల వారసుడిని, నా పూర్వీకులు ఎప్పుడూ యాచకులే" అన్నాడు.

23. శుద్ధోధనుడు మాట్లాడలేదు. తథాగతుడు తన మాటలు కొనసాగించాడు "ఒక వ్యక్తికి రహస్యనిధి లభించినపుడు అందులోని అత్యంతవిలువైన ఆభరణాన్ని తండ్రికి ఇవ్వడం మన సంప్రదాయం, కనక తండ్రీ, ధర్మమనే నా నిధినుండి నేను ఇవ్వగలిగిన దాన్ని దయతో స్వీకరించండి."

24. ఆ తర్వాత బుద్ధుడు తండ్రితో ఇలా అన్నాడు, "స్వప్నాలనుంచి విముక్తుడవై, సత్య మార్గాన్వేషియై, శక్తివంతుడవై, ధర్మపథాన్ని అనుసరించినట్లయితే శాశ్వత ఆనందాన్ని పొందగలవు."

25. శుద్ధోధనుడు మౌనంగా కుమారుడి మాటలు ఆలకించి "కుమారా! నీవు చెప్పినవి ఆచరించడానికి యథాశక్తి కృషిచేస్తాను" అని సమాధానమిచ్చాడు.

# 2. యశోధర, రాహులులతో కలయిక

1. అనంతరం శుద్ధోధనుడు, తథాగతుని తన గృహంలోనికి తీసుకువెళ్ళగా, కుటుంబ సభ్యులందరూ అత్యంత గౌరవాదరాలతో ఆయనకు స్వాగతం చెప్పారు.

2. కానీ, రాహులుడి తల్లి యశోధర మాత్రం బయటకు రాలేదు. శుద్ధోధనుడు ఆమెకు కబురు పంపగా, ఆమె,"నిజంగా నేను తన గౌరవానికి పాత్రురాలినయితే , సిద్ధార్థుడే వచ్చి నన్నుచూస్తారు" అని సమాధానమిచ్చింది.

3. తన బంధుమిత్రులందరినీ పలకరించడం పూర్తయ్యాక, బుద్ధుడు, "యశోధర ఎక్కడ?" అని అడిగాడు. ఆమె రావడానికి నిరాకరించిందని వినగానే, బుద్ధుడే లేచి ఆమె గదికి వెళ్ళాడు.

4. తన కోరికమేరకు యశోధర గదికి తనతో వచ్చిన శిష్యులు సారిపుత్రుడు, మొగ్గలన్నలతో బుద్ధుడు ఇలా అన్నాడు,"నేను విముక్తుడను కానీ యశోధరకు ఇంకా విముక్తిలభించలేదు. నన్ను చూసి చాలా కాలమైనందున ఆమె విషాదంలో మునిగివుంది, ఆమెలో దుఃఖమంతా పొర్లి పొరి హృదయం ఉపశమించేంతవరకు, హృదయం ఛిద్రమై వుంటుంది. కనుక పవిత్రుడైన తథాగతుని ఆమె స్పృశించినట్లయితే, మీరు ఆమెను వారించకండి."

5. యశోధర తన గదిలో దీర్ఘఆలోచనా నిమగ్నురాలై కూర్చుని వుంది. చిరకాలంగా ఫలించని ప్రేమ పొంగిపొర్లుతుండగా బుద్ధుడు లోనికి అడుగు పెట్టేసరికి, ఆమె తనని తాను నిగ్రహించుకోలేక పోయింది.

6. తను ప్రేమించే వ్యక్తి బుద్ధుడనే, లోకపాలకుడనీ, సత్యప్రబోధకుడనీ విస్మరించి, అతని పాదాలపైవ్రాలి రోదించింది.

7. కొద్ది సేపటికి, శుద్ధోధనుడు కూడా అక్కడ వున్న విషయం జ్ఞప్తికి వచ్చి, అవమాన భారంతో లేచి బుద్ధునికి కొంత దూరంగా కూర్చుంది.

8. శుద్ధోధనుడు యశోధర తరపున క్షమాపణ చెబుతున్నట్లుగా అన్నాడు " ఆమె ప్రవర్తనకు ఆమెలోని ప్రగాఢమైన అనురాగమే కారణం. ఇది కేవలం తాత్కాలికమైన ఉద్వేగం కాదు. సిద్ధార్థుడు తనను వదిలి వెళ్ళిన ఈ ఏడేళ్ళలో అతను శిరోముండనం చేయించుకున్నాడని విన్నపుడు తను కూడా అలాగే చేసుకుంది. అతను సుగంధద్రవ్యాలను, ఆభరణాలను త్యజించాడని తెలుసుకొని తను కూడా త్యజించింది. భర్తలా తను కూడా నిర్ణీత వేళల్లో మట్టిపాత్రలోనే అన్నం తినడం అలవాటుచేసుకుంది.

9. ఇప్పుడు ఆమెలో స్థైర్యం లేకకాదు. తాత్కాలికమైన ఉద్వేగాన్ని అణచుకోలేక పోయింది."

10. అపుడు బుద్ధుడు, తను పరివ్రాజకుడైనతర్వాత యశోధర ప్రదర్శించిన ధైర్య స్థైర్యాలను, గుణగణాలను ప్రశంసించాడు. మానవజాతికి పరమలక్ష్యమైన జ్ఞానోదయంకోసం తను ప్రయత్నిస్తున్నపుడు, ఆమె పవిత్రత, సౌమ్యత, భక్తి ఒక బోధిసత్వునిగా తనకు అనుపదానమైన శక్తిని అందించాయని ఆయన చెప్పారు. ఆమెలోని అత్యుత్తమగుణాల కారణంగానే ఈ "కర్మ" సాధించ గలిగానని ఆయన చెప్పారు.

11. చెప్పరాని దుఃఖం అనుభవిస్తున్నా, ఆమె ఆధ్యాత్మిక వారసత్వాన్ని ఆవరించిన తేజస్సు, ఆమె ఉదాత్తజీవనవిధానంతో ద్విగుణీకృతమై, ఆమెను అసమానురాలిని చేసింది.

12. అపుడు యశోధర తన ఏడేళ్ళ కుమారుడు రాహులుడిని రాజకుమారుడిలా శోభాయమానంగా అలంకరించి, అతనితో ఇలా అంది:

13. "బ్రహ్మ వంటి తేజస్సులో వెలిగిపోయే ఈ పవిత్రుడు నీ తండ్రినేనిదివరకు చూడని ఐశ్వర్యపు గనులు ఈయన వద్ద ఉన్నాయి. కొడుకు తండ్రి ఆస్తులకు వారసుడు కావడం లోక సహజం కనుక, ఆయన వద్దకు వెళ్ళి నీ ఐశ్వర్యాన్ని ఇవ్వమని ప్రార్థించు."

14. దానికి రాహులుడు ఈ విధంగా అన్నాడు "నాతండ్రి ఎవరు? నేను శుద్ధోధనులను తప్ప మరే తండ్రినీ ఎరగను."

15. యశోధర బాలుడిని ఎత్తుకుని కిటికీనుంచి బుద్ధుడిని చూపించింది. ఆ సమయంలో భిక్షువులతోపాటు కూర్చుని భిక్షాటనలో తెచ్చుకున్న అన్నం భుజిస్తున్నాడు. అతను నీ తండ్రి అని, శుద్ధోధనుడుకాదని యశోధర రాహులునికి చెప్పింది.

16. రాహులుడు తండ్రి వద్దకు వెళ్ళి, నిర్భయంగా, ప్రేమగా తండ్రికేసి చూసాడు.

17. "మీరే నా తండ్రి కదూ" అంటూ, "ఓ శ్రమణానీ నాకు కూడా ఆనంద పరిపూర్ణయే" అన్నాడు. బుద్ధ భగవానుడు మౌనంగా ఉండిపోయారు

18. తథాగతుని భోజనం అయిపోగానే, అందరినీ దీవించి రాజభవనం నుంచి వెళ్ళిపోయారు. అయితే రాహులుడు అతన్ని అనుసరించివెళ్ళి తనవారసత్వం గురించి అడిగాడు.

19. బాలుడిని ఎవరూ నిరోధించలేదు. తథాగతుడు కూడా వారించలేదు.

20. అపుడు తథాగతుడు సారిపుత్రుడుకేసి తిరిగి ఇలాఅన్నాడు. "నా కుమారుడు ఆస్తి కోసం అడుగుతున్నాడు. అతనికి కష్టాలు కడగండ్లు తెచ్చి పెట్టే, నశించిపోయే సంపదలను అతనికి ఇవ్వలేను. కానీ ఎప్పటికీ నశించిపోని పవిత్రజీవనమనే ఆస్తిని వారసత్వంగా ఇవ్వగలను."

21. రాహులుడి కేసి తిరిగి ఆర్తిగా అన్నారు బుద్ధుడు, "నా వద్ద బంగారం, వెండి, నగలు లేవు, కానీ నా ఆధ్యాత్మికసంపదను భరించడం నీకు సమ్మతమైతే, అది అపారంగా ఇవ్వగలను. సన్మార్గాచరణమే నా ఆధ్యాత్మిక సంపద. అత్యుత్కృష్టమైన ఆనందాన్ని అన్వేషించే హృదయసంస్కార సాధనకీ తమ జీవితాలను అంకితం చేసిన నా సోదర గణంలో చేరడం నీకు సమ్మతమేనా?"

22. రాహులుడు ధృఢ చిత్తంతో, "నాకు సమ్మతమే" అన్నాడు.

23. రాహులుడు కూడా భిక్షుక గణంలో చేరి పోయాడనివిని శుద్ధోధనుడు చాలా దుఃఖించాడు.

## 3. శాక్యుల వైఖరులు

1. శాక్యదేశానికి తిరిగిరాగానే, తన దేశ ప్రజలు రెండు వర్గాలుగా విడిపోయినట్లు బుద్ధుడు గ్రహించాడు. ఒక వర్గం అతనికి అనుకూలంగానూ, రెండవ వర్గం అతనికి ప్రతికూలంగానూ వుంది.

2. ఈ పరిస్థితి అతనికి, శాక్యసంఘంలో తగాదా శాక్యులకు కొలియులకుమధ్య జరిగిన ఘర్షణను గుర్తుకుతెచ్చింది. ఆ ఘర్షణలో తను చాలా ప్రముఖపాత్ర వహించిన విషయంకూడా అతనికి గుర్తువచ్చింది.

3. గతంలో, ఆయనకు వ్యతిరేకంగా వున్నవారు ఇప్పుడుకూడా అతని గొప్పతనాన్ని గుర్తించడానికీ, అతనికి విధేయంగా ఉండడానికీ నిరాకరించారు. అతనికి అనుకూలంగా ఉన్నవారు ఇంటికి ఒక కుమారుడు చొప్పున బుద్ధుని సేవకగణంలో చేర్పించడానికి అప్పటికే నిర్ణయించుకుని వున్నారు. ఈ బృందం దీక్షతీసుకుని భగవానుడితో కలిసి రాజగ్రహకి వెళ్ళడానికి సిద్ధమయ్యారు.

4. అలా తమ కుమారుడిని బుద్ధునిసేవకు అంకితం చేయదలుచుకున్న కుటుంబాల్లో అమితోధనుడి కుటుంబం కూడావుంది.

5. అమితోధనుడికి ఇద్దరు కుమారులు. చాలా సుకుమారంగా పెరిగిన అనురుద్ధుడు, రెండవ వాడు మహానామ.

6. మహానామ అనురుద్ధుని వద్దకు వెళ్ళి, "ప్రపంచ పరిత్యాగానికి నువ్వు వెళ్తావా, నేను వెళ్ళనా" అని అడిగాడు. దానికి సమాధానంగా అనురుద్ధుడు, "నేను చాలా సుకుమారుణ్ణి. గృహజీవనంవదలి సంచారజీవనం గడపడం నా వల్ల కాదు. నువ్వే వెళ్ళు." అన్నాడు.

7. "కానీ, అనురుద్ధ, గృహజీవనం ఎలా వుంటుందో చెప్తాను విను. ముందు, పొలం దున్నాలి. ఆ తర్వాత విత్తనాలు వేయాలి. ఆ తర్వాత వాటికి నీరు అందించాలి. అది ముగిసాక నీరు పంపి నిలిపి వేయాలి, ఆ తర్వాత నాట్లు వేయాలి. అది పూర్తయిన తర్వాత కోత కోయాలి. అనంతరం పంటను తీసుకు వెళ్ళాలి. ఫలసాయాన్ని మోపులుగా కట్టాలి. తర్వాత దాన్ని నూర్చాలి ఆ తర్వాత పంటనుండి తరక, మెరిక వేరుచేయాలి. మిగిలినపంటను బస్తాల కెత్తాలి. ఇది పూర్తిఅయిందికదా అనుకునేంతలో మళ్ళీ పొలం దున్నే కాలం వస్తుంది. ఇలా ఏళ్ళతరబడి చేస్తూఉండవలసిందే.

8. ఈ పని ఎప్పటికీముగియదు. మన శ్రమతీరిందని అనుకోవడానికి లేదు. పని ఎప్పటి కయ్యేట్టు? ఎప్పటికి శ్రమ ఫలించేట్టు? మన పంచేంద్రియాలు సక్రమంగా పనిచేసే వయస్సులో మనకు విశ్రాంతి అన్నది లభిస్తుందా? అందుకే అనురుద్ధా, ఈ పని ఎప్పటికీ ముగిసేది కాదు."

9. వెంటనే అనురుద్ధుడు, "అలాగయితే నువ్వు గృహకృత్యాలు చూసుకో. నేను సేవకగణంతో వెళ్తాను" అన్నాడు.

10. వెంటనే అనురుద్ధుడు తన తల్లివద్దకు వెళ్ళి, అమ్మా నేను గృహగృత్యాలను వదిలి నిర్వాసిత స్థితికి చేరదలిచాను. అందుకు అనుమతిఇవ్వు" అని కోరాడు.

11. దానికి సమాధానమిస్తూ, అతని తల్లి: "అనురుద్ధా ! మీరిద్దరూ నాకు మిగిలిన ఇద్దరు కొడుకులు, మీలో నాకు ఎలాంటి లోపము కనిపించదు. నా వశంలో లేని మృత్యువు వల్ల ఏనాటికైనా నేను మీ యిద్దరినుంచి విడిపోకతప్పదు. కానీ మీరు సజీవులై వుండగానే, గృహంవిడిచి నిర్వాసితులవుతామంటే నేనెలా ఒప్పకోగలను?" అని అడిగింది.

12. అనురుద్ధుడు తల్లిని మరోసారి అభ్యర్థించాడు. ఆమె అదే సమాధానం చెప్పింది. మూడవసారి కూడా అనురుద్ధుడు తల్లిని ఆవిధంగానే కోరాడు.

13. శాక్యరాజైన బద్దియుడు అనురుద్ధుడికి మంచి మిత్రుడు. రాజాగారు పరిత్యాగం చేయడం అసంభవమనే ఆలోచనతో, అనిరుద్ధుని తల్లి, " ప్రియమైన అనురుద్ధా, శాక్యరాజు బద్దియుడు గనక లోకపరిత్యాగం చేస్తే నువ్వు కూడా అతనితో వెళ్ళవచ్చు" అని చెప్పింది.

14. వెంటనే అనురుద్ధుడు బద్దియుని వద్దకు వెళ్ళి మిత్రమా "నా పరిత్యాగాన్ని నువ్వు ఆటంకపరుస్తున్నావు"

15. "అయితే, మిత్రమా, ఆ ఆటంకాన్ని తొలగిద్దాం. నేను నీతో ఉన్నాను. నువ్వు కోరినట్లే లోకపరిత్యాగం చెయ్యి."

16. "పద, మిత్రమా, ఇద్దరం కలిసి ప్రపంచాన్ని పరిత్యజిద్దాం."

17. "కానీ, ప్రియమిత్రమా, గృహజీవితాన్ని వదిలి పెట్టడం నాకు చేతనయ్యేపని కాదు. ఇంకేది అడిగినా నీకోసం చేయడానికి నేను సిద్ధమే. దీనికి మాత్రం నువ్వు ఒంటరిగా వెళ్ళాల్సిందే" అన్నాడు బద్దియుడు.

18. "మిత్రమా, నువ్వు పరిత్యాగం చేస్తేనే నన్ను అనుమతిస్తా నన్నది మా తల్లి. పైగా నువ్వు ఇప్పుడే కదా! ప్రకటించావు, నీ పరిత్యాగానికి నేను ఆటంకమైతే, ఆ ఆటంకాన్ని తొలగిద్దాం. నాతోపాటు, నువ్వు కోరినట్లుగా నేను కూడా ఈ ప్రపంచాన్ని విసర్జిస్తాను' అని, పద, మిత్రమా, ఇద్దరం కలసి పరిత్యాగం చేద్దాం."

19. బద్దియుడు అనురుద్ధునితో, "అలా అయితే, ఏడేళ్ళు ఆగుమిత్రమా. ఏడేళ్ళు ముగిసిన వెంటనే ఇద్దరం కలిసి ప్రపంచాన్ని పరిత్యజిద్దాం" అన్నాడు.

20. "ఏడేళ్ళు మరీ సుదీర్ఘమైన కాలం, మిత్రమా. నేను అంతకాలం ఆగలేను."

21. అంతట బద్దియుడు ఆరేళ్ళు ఆగమన్నాడు. అనురుద్ధుడు కుదరదన్నాడు. అలా ఇద్దరు వాదించుకుంటుండగా, చివరికి ఏడాదికి, ఏడు నెలలకు, ఒక నెలకు, పక్షం రోజులకు, బద్దియుడు గడువుతగ్గించాడు అన్నిటికీ అనురుద్ధుడు మరీ అంతకాలం ఆగలేను అనే అన్నాడు.

22. చివరికి శాక్యరాజు, "అయితే, ఏడు రోజులు ఆగు మిత్రమా. నా రాజ్యభారాన్ని నా కుమారులకు, తమ్ముళ్ళకు అప్పగించడానికి ఆ మాత్రం వ్యవధి కావాలి అన్నాడు."

23. "ఏడు రోజులు దీర్ఘకాలం కాదులే, నేను వేచివుంటాను" అన్నాడు అనురుద్ధుడు.

24. ఆవిధంగా శాక్యరాజు బద్దియుడు, అనురుద్ధుడు, ఆనందుడూ, ఛాగుడు, కంబళుడు, దేవదత్తుడు గృహంవిడిచివెళ్ళారు. బాల్యంలో క్రీడాపేక్షతో ఇల్లు విడిచివెళ్ళినట్లే, ఇప్పుడు సర్వసంగపరిత్యాగులై బయల్దేరారు. ఉపాలి అనే మంగలికూడా వారిని అనుసరించడంతో వీరి సంఖ్య ఏడుకు పెరిగింది.

25. కొంత దూరం వెళ్ళినతర్వాత వారు తమ పరివారాన్ని వెనక్కిపంపి, పొరుగు మండలంలోకి అడుగుపెట్టారు. అక్కడ తమ ఆభరణాలు తొలగించి మూటగట్టి, మంగలి ఉపాలి చేతికిచ్చి "ఇవి తీసుకుని కపిలవస్తు నగరానికి వెళ్ళు. నీ భావిజీవితం హాయిగా గడపడానికి ఇది చాలు. మేము వెళ్ళి తథాగతుని చేరతాము" ఈ మాటలతో వారు ముందుకు నడిచారు.

26. ఉపాలి వారినివదిలి ఇంటిదారి పట్టాడు.

# 4. బుద్ధుని గృహస్థుగా మార్చడానికి తుదియత్నం

1. తన కుమారుడు శాశ్వతంగా వెళ్ళిపోతాడనీ, మళ్ళీ కనిపించడనీ ఆలోచనరాగానే శుద్ధోదనుడు పరిపరివిధాల దుఃఖించాడు.

2. తన మంత్రినీ, మత గురువునూ కలుసుకుని, తన కుమారుడిని తిరిగి రావడానికి ఒప్పించ వలసిందిగా కోరాడు.

3. మతగురువు, మంత్రి రాజుగారి ఆదేశానుసారం, బుద్ధుని దారిలో కలుసుకున్నారు.

4. బుద్ధుని వారు తగువిధంగా సత్కరించి, ఆయన అనుమతితో ఆయన వద్ద కూర్చున్నారు.

5. అంతట మతగురువు భగవానునితో ఇలా అన్నాడు:

6. " ఓ రాకుమారా, నీ వియోగమనే బాణం గుండెల్లో గుచ్చుకుని కన్నీరు మున్నీరుగా విలపిస్తున్న రాజుగారి వేదనను ఒక్క క్షణం తలుచుకో. నిన్ను వెనక్కి ఇంటికి రమ్మని ఆయన కోరుతున్నారు. అప్పుడే ఆయన ప్రశాంతంగా ప్రాణం వదలగలడు.

7. మతం విషయంలో నువ్వు సంకల్పదీక్ష వహించావనీ, నీ నిర్ణయం మారే అవకాశం లేదనీ నాకు తెలుసు. అయినప్పటికీ నువ్వు సర్వసంగపరిత్యాగంచేయడం నా హృదయాన్ని దావాలనంలా రగిల్చివేస్తోంది.

8. రా, కర్తవ్యపరాయణుడవైన నీవు, నీ కర్తవ్యాన్ని నెరవేర్చడంకోసం ఈ సంకల్పం వదిలిరా!

9. ఈ భూమిపై సార్వభౌమాధికారాన్ని అనుభవించు, శాస్త్రవిహితమైన సమయంలోనే అరణ్యాశ్రమానికి వెళ్ళువుగానీ. నీ ఆప్తుల శోకాన్ని అలక్ష్యం చేయవద్దు. అన్ని ప్రాణుల పట్ల దయచూపడమే అసలైన మతం.

10. మత మన్నది అరణ్యాలలో మాత్రమే లభించే పదార్థం కాదు. నగర జీవితంలో కూడా యోగులు సాయుజ్యాన్ని పొందగలరు. ఆలోచన, ప్రయత్నం దీనికి సరైనసాధనాలు. అరణ్యమూ, వేషమూ పిరికివాళ్ళ చేష్టలు మాత్రమే.

11. శాక్యరాజు నీ కారణంగా కష్టాలఅలలలో కూడిన శోకాంబుధిలో మునిగివున్నాడు. సముద్రంలో మునిగిపోతున్న వృషభంలా నిస్సహాయుడై, రక్షణహీనుడైవున్న నీతండ్రిని కాపాడు.

12. నిన్ను పెంచి పోషించిన రాణిని కూడా స్మరించుకో. అగస్త్యుడు తిరిగిన ప్రదేశం ఎక్కడో తెలియని ఆమె దూడను కోల్పోయిన ఆవుల నిర్విరామంగా విలపిస్తున్న ఆమెను పట్టించుకోవా?

13. భర్త జీవించి వుండగానే విధవరాలిలా, సహచరుడిని కోల్పోయిన హంసలా, మగయేనుగు త్యజించిన ఆడయేనుగులా రోదిస్తున్న నీ భార్యకు నీ దర్శనంతో ఆనందం కలిగించవా?"

4. మత గురువు పలుకులను శ్రద్ధగా ఆలకించిన బుద్ధుడు ఒక క్షణం ఆలోచించి, ఆ తర్వాత మృదుమధుర వాక్కులతో ఈ విధంగా అన్నారు:

## 5. బుద్ధుని సమాధానం

1. "తండ్రిగా రాజుగారికి నాపట్లవున్న ప్రేమ, వాత్సల్యం నేను ఎరుగుదును. అది తెలిసినప్పటికీ, ప్రపంచాన్ని ఆవరించివున్న విషాదం చూసినపుడు, నా స్వీయజనాన్ని వదిలిపెట్టడం అనివార్యమౌతుంది.

2. ప్రేమించిన వారితో వియోగమన్నదే లేకపోతే, ఎవరికి మాత్రం తన ఆప్తులను చూడాలని వుండదు? కానీ ఒక సారి చూసినా, మళ్ళీ వియోగం తప్పదు కనక, నాకు నాతండ్రి అంటే ఎంత ప్రేమఉన్నా, వారిని త్యజించడానికే సిద్ధపడుతున్నాను.

3. మా తండ్రిగారి విచారానికి కారణం నేనేనని మీరు భావించడం మాత్రం నేనంగీకరించను. ఎందుకంటే నన్ను కలుసుకున్నట్టుగా ఆయనకు కలిగే స్వప్నాలమధ్య, మళ్ళీ భవిష్యత్తులో విడిపోతామనే బాధ కూడా పీడిస్తూనేవుంది.

4. కనక ఒక కుమారుడో, ఆప్తుడో మనిషి దుఃఖానికి కారకుడవుతాడని ఏనాడూ భావించవద్దు. ఈ దుఃఖమంతా అజ్ఞానంవల్ల వచ్చినదే.

5. రహదారిలో కలుసుకున్న వారు విడిపోక తప్పనట్లే, ప్రతి మనిషికీ ఏదో ఒక సమయంలో ఆప్తుల వియోగం తప్పదు. కనక, వివేకవంతుడైనవాడు తన ఆత్మీయుల వియోగాన్ని కొనితెచ్చుకుని ఎందుకు విషాదాన్ని కోరుకుంటాడు?

6. మరోలోకంలో ఆప్తులను వదలి, మనం ఈ లోకంలోకి వస్తాం. ఇక్కడి నుంచి మరో ప్రపంచంలోకి, ఇలా అనేక లోకాలకు తరలి వెళ్తాం. మానవజన్మ నుదుట వ్రాసిన వ్రాత అదే. అలాంటి జాతిపట్ల ముక్తిపరులకు సానుభూతి ఎలా వుండగలదు?

7. తల్లి గర్భంలోనుంచి జన్మించినక్షణాన్నే, మృత్యువు తప్పదని తెలుసును. అయినా నా కుమారుడిపై మమకారంలో, నా అరణ్యవాసం అకాలనిర్ణయమని అనడం భావ్యమేనా?

8. ప్రాపంచిక లక్ష్య సాధనకు మీరన్నట్లు 'చెడుకాలం'ఉంటే ఉండవచ్చుగాక.... ఎందుకంటే కాలానికి వస్తువులతో అవిభాజ్యసంబంధం వుంది. ప్రపంచాన్ని కాలం తనతోపాటు లాక్కువెళ్తుంది. కానీ బ్రహ్మానందానికి కాలంతో నిమిత్తంలేదు.

9. రాజుగారు తన రాజ్యాన్ని నా స్వాధీనం చేయాలను కోవడం ఉదాత్తమైన ఆలోచనే. ఒక తండ్రి చేయవలసినపనే. అయితే దాన్ని స్వీకరించడం నాకు ఉచితంకాదు. ఒక రోగగ్రస్తుడు అనారోగ్యకరమైన ఆహారాన్ని ఆబగా ఆరగించినట్టు.

10. భ్రమలకు, ఆందోళనకు, ఉద్వేగానికి, అలసటకు ఆలవాలమైన రాచరికంలోకి అడుగు

పెట్టడం వివేకవంతులకు తగినపనేనా? మరొకరిసేవలు అందుకోవడంద్వారా వారి హక్కులను నిరాకరించడం సమంజసమేనా?

11. రాచరికపు స్వర్ణభవనం అగ్నిజ్వాలల్లో ఉన్నట్టు నాకనిపిస్తుంది. అక్కడి బాధ్యతలునాకు విషప్రాయమైనవి. ప్రశాంతమైన కలువపాన్పు మొసళ్ళతోనిండిన కొలనులా నాకనిపిస్తుంది."

# 6. మంత్రి సమాధానం

1. కాంక్షా రహితమైన, సహేతుకమై, గంభీరమై, జ్ఞాన సంపన్నమైన బుద్ధుని అభిభాషణాన్ని ఆలకించిన అనంతరం మంత్రి ఈ విధంగా సమాధానమిచ్చాడు.

2. "మీ నిర్ణయం అత్యుత్తమమైనదే. ఉచితమైనదే. కానీ ప్రస్తుతసమయానికి, అచరణీయమైంది కాదు. కర్తవ్యపరాయణుడవైన నీకు, నీ తండ్రిని ఈ వృద్ధాప్యంలో వదలివెళ్ళడం తగిన పనికాదు.

3. అగోచరమైన ఒక ఫలితం కోసం, దృగ్గోచరమైన గమ్యాన్ని అలక్ష్యం చేస్తున్నావంటే, కర్తవ్య దీక్షను, సుఖసంపదల్ని అంచనావేయగల సామర్థ్యం నీలో నిజంగా మొక్కవోయింది.

4. పువర్జన్మ ఉందని కొందరంటారు. లేదని మరికొందరు నమ్మకంగా చెబుతారు. ఈ విషయం సందేహాస్పదమైనపుడు మనకు లభించిన అదృష్టాన్ని అనుభవించడం ఉచితమైనపని.

5. మరణానంతరం మరో జీవతంవుంటే, అది ఎలా వున్నా అనుభవిద్దాం. లేక, మరే జీవితమూ లేని పక్షంలో మన ప్రయత్నమేమీ లేకుండానే యావత్ ప్రపంచానికీ జీవన్ముక్తి లభించిందన్నమాట.

6. కొందరు మరణానంతర జీవితం వుంది, కానీ, జీవన్ముక్తి అన్నది లేదంటారు. అగ్ని వేడిగా, నీరు ద్రవంగా వున్నట్లే మనిషి క్రియా శక్తికి కూడా ఒక ప్రత్యేక స్వభావం వుంటుందని వీరంటారు.

7. ప్రపంచంలో ఏం జరిగినా :- మంచి, చెడు, అస్తిత్వం, అస్తిత్వరాహిత్యం - అన్నీ స్వతస్సిద్ధంగా సంభవిస్తాయని కొందరంటారు. యావత్ప్రపంచమూ అట్లా అప్రయత్నంగా ఆవిర్భవిస్తుంది కనక మానవయత్నమంతా నిష్ప్రయోజనకరమని అంటారు.

8. పంచేంద్రియాల విధులు నిర్ణీతమైనట్లే, బాహ్యావస్తువులు ప్రియ, అప్రియ లక్షణాలు కూడా నిర్ణయింపబడి వుంటాయి. అటువంటప్పుడు వృద్ధాప్యానికీ బాధకూ నిమిత్తమైనదాన్ని మార్చడానికి ఎంత ప్రయత్నించీ ఏంలాభం? అది అంతా కూడా అప్రయత్నంగాకలిగేది కాదా?

9. అగ్ని నీటివల్ల ఆరిపోతుంది. నీరు అగ్నివల్ల ఆవిరిగా మారుతుంది. ప్రకృతిలోని వేర్వేరు పంచభూతాలు మానవశరీరంలో ఏకీకృతమైనాయి. ప్రపంచనిర్మాణమే, అలా ఏర్పడింది.

10. ప్రకృతి సిద్ధంగా తల్లిగర్భంలోని పిండంలో చేతులు, కాళ్ళు, కడుపు, వీపు, తల, అన్నీ కలిసి ఆత్మలో ఐక్యం చెందినట్లుగానే, యివన్నీ అప్రయత్నంగా సహజంగా జరుగుతాయని విజ్ఞులు చెబుతారు.

11. ముల్లుకు అవాడి తనం ఇచ్చిందెవరు? పశుపక్ష్యాదులకు ఆయాలక్షణాలు చేకూర్చిందెవరూ? ఇదంతా సహజంగా ఉత్పన్నమైనవే; కోరిక ప్రకారం నడుచుకోవడమన్నదే లేనపుడు, సంకల్పం అనే ప్రసక్తి ఎక్కడినుంచి వస్తుంది?

12. సకల సృష్టికి కారకుడు ఈశ్వరుడని కొందరంటారు. అదే నిజమైతే మనం ప్రయత్నించి ఏదైన చేయవలసిన అవసరం ఏముంది? ఒక చర్యకు కారణభూతమైనదే. ఆ చర్యవిరమణకు కూడా కారణమౌతుంది.

13. జననం, మరణం రెండూ ఆత్మద్వారా జరుగుతాయని కొందరంటారు. కానీ జన్మ అనుయాసంగా లభిస్తుందట, జీవన్ముక్తిమాత్రం ప్రయత్నించి తెచ్చుకోవాలంటారు.

14. మనిషి సంతానోత్పత్తిద్వారా తన పూర్వీకుల ఋణాన్ని, పవిత్రకర్మలద్వారా ఋషుల ఋణాన్ని యజ్ఞబలులద్వారా భగవంతుని ఋణాన్నీ తీర్చుకుంటారు. ఈ మూడు ఋణాలనుంచీ విముక్తిలభించిన అతనికి మోక్షంలభించినట్లే.

15. ఈ విధంగా, అనేక మోక్షమార్గాలను విజ్ఞులు చెప్పివున్నారు. ఇది కాక, ఇతర మార్గాలు అవలంభించేవారికి ఆయాసం తప్ప, ఫలితం లేదు.

16. కనుక, సాధుకుమారా నీకు మోక్షం కావాలను కుంటే, పెద్దలు నిర్ధేశించిన నిబంధనలనే ఆచరించు. అప్పుడు నీ కోరిక తీరుతుంది. రాజుగారి దుఃఖం కూడా అంతరిస్తుంది.

17. వనజీవితంనుంచి గృహజీవితానికి తిరిగివచ్చినందువల్ల ప్రాపంచిక దుఃఖాలపై నీ ధ్యానముద్రకు ఆటంకం కలుగుతుందని నువ్వు భావిస్తూఉంటేఆలోచన విరమించు. నీ కంటేపూర్వంకూడా చాలామంది అరణ్యాలనుంచి తిరిగి గృహజీవ నానికి వచ్చారు" అంటూ అంబరీషుడిని, ధృమకేతుడిని, రాముడినీ, ఇతరులను మంత్రి పేర్కొన్నాడు.

# 7. బుద్ధుని స్థిరసంకల్పం

1. రాజ విధేయుడై, రాజు గారికి మరోకన్నుగా మసులుకునే మంత్రి అభిమానపూర్వకమైన పలుకులు విని, రాజకుమారుడు, చెక్కుచెదరని సంకల్పంతో, ఒక్క విషయాన్నీ వదలి పెట్టక, తొందరపడక, సమాధానమిచ్చాడు.

2. "ప్రపంచంలో దేన్నైనా అస్తిత్వంవుందా అన్న నా సందేహాన్ని, మరొకరి మాటలతో నేను తీర్చుకోజాలను. వైరాగ్యంవల్లగానీ, ప్రశాంతజీవితంవల్లగానీ, దీనికి సంబంధించిన నిజాన్నీ నాఅంతట నేనే కనుక్కుంటాను.

3. అగమ్యగోచరమైన, వివాదాస్పదమైన, సిద్ధాంతాలను, వందలాది అభిప్రాయాలపై

ఆధారపడివున్న సిద్ధాంతాలను నేను ఆమోదించను. వివేకవంతుడు ఎప్పుడైనా ఇతరుల నమ్మకాన్నిబట్టి నడుచుకుంటాడా? ఈనాడు మానవజాతి యావత్తు చీకట్లో గుడ్డివాడి వెంటనడిచే గుడ్డివాళ్ళ చందంగా నడుచుకుంటున్నది.

4. సత్యాన్ని నేను వింగడించి చూడలేక పోయినప్పటికీ, మంచిచెడులు ఇదమిత్థమని తేల్చలేనపుడు, మంచి అని నమ్మినదాన్ని ఆచరించాలి. దోషరహితమైన ఆత్మగలవాడు కృషిప్రయోజనశూన్యమైన, మంచినే ఎన్నుకోవాలి.

5. అనాదిగా వస్తున్న 'పవిత్ర సంప్రదాయం' సందేహ భూయిష్టమైనపుడు, విశ్వాసనీయులైన వారిమాటలు నమ్మడం మంచిది. విశ్వసనీయత అంటే లోపరాహిత్యం, లోపాలు లేనివాడు అసత్యం పలకజాలడు.

6. ఇక నేను తిరిగి గృహానికిరావడం గురించి మీరు చెప్పిన విషయాలు నిజానికి మీరిచ్చిన ఉదాహరణలు ప్రామాణికమైనవి కావు. ఎందుకంటే తమ వాగ్దానాలు ఉల్లంఘించిన వారిని కర్తవ్యపరాయణులుగా మీరెలాపేర్కొనగలరు?

7. సూర్యుడు పతనమగుగాక, హిమవత్పర్వతం సడలుగాక! నేను మాత్రం లౌకిక జీవిగా, బాహ్యవస్తువులకుమాత్రమే స్పందించే ఇంద్రియలోలుడిగా ఇంటికి తిరిగి వెళ్ళడం కల్ల.

8. రగులుతున్న అగ్నిజ్వాలల్లోకి ప్రవేశించడానికైనా సిద్ధమే కానీ నా లక్ష్యం సిద్ధించకుండా ఇంట్లోకి అడుగుపెట్టను" ఈ మాటలంటూ నిర్మోహంనిండిన సంకల్పంతో, తథాగతుడు తన త్రోవన వెళ్ళాడు.

9. మంత్రి, మత గురువు సజలనయనాలతో, బుద్ధుని స్థిరవాక్కులను విన్నారు. నైరాశ్య దృక్కులతో కొద్దిసేపు అతని వెంట వెళ్ళి, మరి దుఃఖం భరించలేక, తిరిగి కపిలవస్తుకు మరలివచ్చారు.

0. రాకుమారుడిపై ప్రేమ, రాజుగారిపట్ల భక్తి హృదయం నిండానింపుకుని వారు వెనక్కి వచ్చారు. దారిలో ఎన్నోసార్లు వారు వెనక్కితిరిగి చూసారు. అద్భుతమైన తేజస్సుతో వెలిగిపోతూ, ఎవరికీ అందనంత దూరంలోవున్న సూర్యునిలో బుద్ధుడు వారికి దృశ్యాదృశ్యమై కనిపించాడు.

1. బుద్ధుని వెనక్కి తీసుకురావడంలో విఫలమైన మంత్రి, మతగురువు తడబడే అడుగులతో వెళ్ళారు. "తన ప్రియపుత్రుడిని చూడడానికి తహతహలాడుతున్న రాజు గారికి మొహం ఎలా చూపించేది" అని వాపోయారు.

# ఐదవ భాగం

## దీక్షా ప్రచారం పునఃప్రారంభం

1. జనపద బ్రాహ్మణులకు దీక్ష
2. ఉత్తరావతి బ్రాహ్మణులకు దీక్ష

# 1. జనపద బ్రాహ్మణులకు దీక్ష

1. రాజగ్రహ సమీపాన గృధకుంట పర్వతాల వెనక భాగంలో ఒక గ్రామం ఉంది. అందులో ఢభై కి పైగా బ్రాహ్మణ కుటుంబాలున్నాయి.

2. ప్రజలను బౌద్ధులుగా మార్చే ఉద్దేశ్యంతో బుద్ధుడు అక్కడికి వచ్చి ఒక చెట్టు క్రింద కూర్చున్నాడు.

3. తేజోవంతుడిగా, ఠీవిగా ఉన్న అతన్ని చూసి, స్థానికులు అతన్ని చుట్టు ముట్టారు. అంతట బుద్ధుడు ఆ బ్రాహ్మణులను వారు ఎంతకాలంగా ఆ పర్వతప్రాంతంలో నివసిస్తున్నారనీ, వారి వృత్తి ఏమిటనీ అడిగాడు.

4. దానికి సమాధానంగా వారు, "గత ముప్పై తరాలుగా మేమిక్కడే నివసిస్తున్నాం, పశువుల కాపర్లుగా ఉన్నాం" అని చెప్పారు.

5. వారి మతవిశ్వాసం ఎటువంటిదని బుద్ధుడు ప్రశ్నించగా, "మేము భిన్న ఋతువులను బట్టి సూర్య చంద్రులకూ, వర్షానికీ, అగ్నికీ క్రతువులు, పూజలు చేస్తాం."

6. "మాలో ఎవరైనా మరణిస్తే, అందరం సమావేశమై, అతను స్వర్గానికి చేరుకోవాలనీ, మరు జన్మ అతనికి ఉండకూడదని ప్రార్థిస్తాం" అని చెప్పారు.

7. దీనికి బుద్ధుడిలా సమాధానమిచ్చాడు " ఇది సరైన పద్ధతి కాదు, దీని వల్ల మీకు ప్రయోజనం కూడా లేదు. నన్ను అనుసరించడమే సరైన మార్గం. విరాగులుకండి.సంపూర్ణ నిగ్రహాన్ని పాటించి నిర్యాణం పొందండి" అతనింకా ఇలా చెప్పాడు.

8. "సత్యాన్ని అసత్యమనీ, అసత్యాన్ని సత్యమనీ భావించే వారు ధర్మగ్లాని చేస్తున్నారు, దీనివల్ల వారికి ఎలాంటి ప్రయోజనం కలగదు.

9. సత్యాన్ని సత్యంగా గుర్తించడం, అసత్యాన్ని అసత్యంగా తెలుసుకోవడం, అదే సరైన వైఖరి, దాని వల్లే నిజమైన ప్రయోజనం సమకూరుతుంది.

10. ప్రపంచమంతటా మృత్యువు ఉంది. దాని నుంచి ఎవరూ తప్పించుకోలేరు.

11. పుట్టిన ప్రతీదీ మరణిస్తుందని తెలుసుకోవడం, తద్వారా జననమరణాలను తప్పించుకునే సద్ధర్మాన్ని ఆచరించడం సరైన మార్గం.

12. ఈ మాటలు వినగానే అక్కడున్న డెభైమంది బ్రాహ్మణులు శ్రమణులు కావాలన్న ఆకాంక్ష వ్యక్తం చేశారు. బుద్ధుడు వారి నిర్ణయానికి హర్షం వ్యక్తం చేయగానే, వారి తలనీలాలు రాలి పోయాయి. వారు సంపూర్ణంగా బౌద్ధుల రూపు పొందారు.

13. అక్కడి నుంచి వారందరూ విహారానికి తిరిగి వచ్చారు. నడుస్తుండగా వారి భార్యలు, కుటుంబాలను గురించిన ఆలోచనలు, వారిని కలవరపరిచాయి. అదే సమయంలో జోరున వర్షం కురవడంవల్ల త్వరత్వరగా నడవలేక పోయారు.

14. రహదారి ప్రక్కగా దాదాపు పది ఇళ్ళున్నాయి. వీరందరూ వర్షం నుంచి తల దాచుకోవడానికి ఆ యిళ్ళలోకి వెళ్ళారు. కాని ఇళ్ళపై కప్పులో కన్నం ఉన్నందువల్ల వాన నుంచి వారికి ఎలాంటి రక్షణ లభించలేదు.

15. ఇది చూసి బుద్ధుడు ఈ విధంగా అన్నాడు, " ఇంటిపై కప్పు భద్రంగా లేకపోతే వర్షం సందు చూసుకుని లోపల కురిసినట్లు, మన ఆలోచనలను జాగ్రత్తగా నిగ్రహించుకోక పోతే, కోరికలు (కామ పరమైనవి) మన ధృఢనిర్ణయాలను సైతం నిర్వీర్యం చేస్తాయి.

16. "అయితే పై కప్పు భద్రంగా ఉన్నపుడు నీరు చొరబడనట్లే మన ఆలోచనలను నిగ్రహించుకోగలిగినపుడు, విచక్షణతో వ్యవహరించినపుడు, కోరికలు తలెత్త లేవు, మనల్ని కలవర పరచలేవు".

17. ఈ పలుకులు విన్న 70 మంది బ్రాహ్మణులు, తమ వాంఛలు నీచమైనవని భావించినప్పటికీ, సందేహాన్ని విడనాడలేకపోయారు. అయినా బుద్ధునితో ముందుకు సాగారు.

18. అలా ముందుకు సాగిపోతుండగా, ఒక చోట సువాసనలు వెదజల్లే ఒక వస్తువు నేలపై కనిపించింది. బుద్ధుడు దాన్ని వారి దృష్టికి తెచ్చాడు. ఆ వెంటనే, మురిగిపోయిన చేప కనిపించింది. బుద్ధుడు దాని దుర్వాసనను వారి దృష్టికి తెచ్చి, ఇలా అన్నాడు;

19. "దుర్వాసనగల వస్తువును తాకడం వల్ల మనం దుర్గంధం వెదజల్లినట్లే, నీచుల సాంగత్యంవల్ల మనకూ అటువంటి గుణాలే సంక్రమిస్తాయి. అటువంటి వ్యక్తి క్రమేపీ మరింత దిగజారి పోయి, నిష్కారణంగా దుష్టత్వం అలవరుచుకుంటాడు.

20. "కానీ విజ్ఞుల సాంగత్యం నెరపే వివేకవంతుడు, సుగంధం వెదజల్లే వస్తువును తాకిన వానివలే, విజ్ఞతనే ప్రదర్శిస్తాడు. అతను జ్ఞానప్రదాతయై, సుశీలవంతుడై, పరిపూర్ణత్వం పొంది, సంతుష్టుడవుతాడు".

21. ఈ మాటలు వినగనే, ఆ 70 మంది బ్రాహ్మణులు స్వగృహానికి వెళ్ళి, సుఖజీవనం గడపాలన్న తమ ఆకాంక్ష దోష భూయిష్టమైనదని గ్రహించి, ఆ ఆలోచన విరమించుకున్నారు. బుద్ధునితో విహారానికి వెళ్ళి, అక్కడ `అర్హత' పొందారు.

## 2. ఉత్తరావతి బ్రాహ్మణులకు దీక్ష

1. బుద్ధుడు శ్రావస్తి వద్ద జితవనంలో నివసిస్తూ, ధర్మబోధ చేస్తున్న రోజుల్లో, అక్కడికి తూర్పుదిశగా ఉన్న ఉత్తరావతిలో ఐదువందల మంది బ్రాహ్మణులుండే వారు.

2. గంగానది తీరాన, దుమ్ముధూళితో పంకిలం చేసుకోవడం ద్వారా ఋష్యత్వం పొందడానికి ప్రయత్నిస్తున్న ఒకనిర్గ్రంధియోగిని దర్శించుకునేందుకు వీరందరూ కలిసి వెళ్ళాలని నిర్ణయించుకున్నారు.

3. మార్గమధ్యంలో ఎడారిలో వెళ్తుండగా వారికి దాహం వేసింది. అక్కడ ఒక వృక్షం చూసి, దరిదాపుల్లో జనవాసం ఉండవచ్చునని భ్రమించి త్వరత్వరగా నడిచి వెళ్ళారు. అయితే అక్కడికి చేరుకునేసరికి ఎలాంటి ప్రాణి జాడా వారికి కనిపించలేదు.

4. దీనితో వారు పెద్ద పెట్టున ఏడవడం మొదలు పెట్టారు. అకస్మాత్తుగా ఆ వృక్షం నుంచి వారికి ఒక ప్రేతం గొంతు వినిపించింది. వారు ఎందుకిలా ఏడుస్తున్నారో అడిగి తెలుసుకున్న ప్రేతం వెంటనే వారికి కావలసినంత మద్యం, మాంసం చేకూర్చింది.

5. భోజనానంతరం వెళ్ళబోతూ ఆ బ్రాహ్మణులు, అది ప్రేతంగా ఉండిపోవడానికి కారణమేమిటని అడిగారు.

6. దానికి ప్రేతం ఇలా జవాబిచ్చింది. సుదత్తుడు బుద్ధునికి శ్రావస్తి ఉద్యానవనాన్ని బహూకరించినపుడు తాను శ్రావస్తిలోని పూజారుల సమావేశానికి వెళ్ళి, ఆ రాత్రంతా ధర్మబోధ విన్నాననీ, తిరిగి వెళ్తూ తన నీటి పాత్రలోని మంచి నీటిని పూజారులకు దానం చేసాననీ ప్రేతం చెప్పింది.

7. మరుసటి రోజు తను ఇంటికి రాగానే ఆగ్రహించిన భార్య, రాత్రంతా బయట ఉండి ఏం చేశావని అడిగింది. అతను కోపగించుకోక జితవనంలో బుద్ధుని బోధలు ఆలకించినట్లు చెప్పాడు.

8. ఇది వినగానే భార్య బుద్ధుడిని నోటికి వచ్చినట్టు తిట్టింది, "ఈ గౌతముడిది పిచ్చి ప్రేలాపనలు. అతను మనుషులను వంచిస్తున్నాడు" ఇత్యాదిగా ఆమె దూషించింది.

9. " ఇవి విన్నప్పటికీ నేను ఆమె మాటలను వ్యతిరేకించక, అంగీకరించాను. అవివేకం వల్ల నేను ఈ చెట్టు మీదే ఉండి పోయాను" అంటూ అతను ఈ సూక్తులు వల్లించాడు.

10. " క్రతువులూ, యాగాలు రాత్రింబవళ్ళు పరితాపాన్ని ఆందోళనను, హృదయభారాన్ని కలిగిస్తాయి తప్ప, వాటి వల్ల ప్రయోజనం లేదు.

11. "మనం దుఃఖాన్ని తప్పించుకొని, మన శరీరధాతువులన్నీ తరించిపోవాలంటే, తథాగతుని ధర్మోపదేశాన్ని ఆచరించాలి. అప్పుడే భూసురులు ప్రబోధించే ప్రాపంచిక కర్మకాండల నుంచి విముక్తి పొందగలం."

12. ఈ మాటలువిన్న బ్రాహ్మణులు బుద్ధుడు ఉంటున్న శ్రావస్తికి వెళ్ళి బుద్ధుని దర్శించుకుని, తమ రాకకు కారణం వివరించిన అనంతరం తథాగతుడు వారితో ఇలా అన్నాడు:

13. " ఒక వ్యక్తి జడలు పెంచెసుకుని, దిగంబరంగా తిరగవచ్చు లేదా కొన్ని ఆకులనో, చెట్టు బెరడునో శరీరానికి అచ్ఛాదనగా చేసుకోవచ్చు. కానీ మనస్సులోని కల్మషం నిర్మూలించడానికి

ఇవన్నీ పనికి వస్తాయా?

14. "కానీ ఎవరికీ హానితలపెట్టనివాడూ, హననం చేయని వారూహోమం పేరిట వినాశనానికిపాల్పడనివాడు విజయలాలస లేనివాడు, యావత్ప్రపంచం పట్ల సుహృద్భావం ఉన్నవాడు, అలాంటి వ్యక్తిలో విద్వేషం, దురాలోచన ఉండే అవకాశం లేదు.

15. తమ పుణ్యం కోసమో, జన్మాంతరలబ్ధికోసమో, భూతప్రేతాలకు బలులిచ్చే వారికి, సజ్జనులను సేవించే వారికీదక్కే ఆనందంలో నాల్గోవంతు దక్కదు.

16. "సత్ప్రవర్తన కలిగినవాడూ, ఇతరులను సముచితంగా గౌరవించేవాడు, వృద్ధుల పట్లభక్తి గల వాడు, అయిన వ్యక్తికి సౌందర్యం, శక్తి, జీవితం, శాంతి అనే నాలుగు సత్ఫలితాలు లభిస్తాయి."

17. భర్త సూక్తులు విన్న ఆ భార్య మనసు మార్చుకుంది.

# ఆరవ భాగం

## నిమ్నజాతుల వారికి దీక్ష

1. మంగలి ఉపాలికి దీక్ష
2. వీధులూడ్చే సునీతునికి దీక్ష
3. అస్పృశ్యులైన స్వపాక, సుప్రియులకు దీక్ష
4. సుమంగళ తదితర నిమ్నజాతుల వారికి దీక్ష
5. కుష్ఠరోగి సుప్రబుద్ధునికి దీక్ష

# 1. మంగలి ఉపాలికి దీక్ష

1. ఉపాలి వెనక్కి వెళుతూ, ఇలా ఆలోచించాడు: "శాక్యులు సహజంగా ఆవేశపరులు. నేను ఈ ఆభరణాలతో వెనక్కి వెళ్తే, నా సహచరులను నేనే చంపేసి వారి ఆభరణాలతో పారిపోయివచ్చానని అపోహపడి నన్ను చంపేస్తారు. కనుక నేను కూడా ఈ శాక్య సోదరుల మార్గాన్నే ఎందుకు అవలంబించకూడదు?"

2. "నిజంగానే నేనాపని ఎందుకు చేయ కూడదు? "ఉపాలి స్వగతంగా అనుకున్నాడు. వెంటనే తనవద్దనున్న నగలమూటను ఒక చెట్టుకు వ్రేలాడదీసి "ఇది ఎవరికి దొరికితే వాళ్ళకే బహుమతి అనుకుందాం" అంటూ, శాక్యయువకులు వెళ్ళిన దారినే అనుసరించాడు.

3. దూరంనుంచి ఉపాలిని చూసిన శాక్యయువకులు "ఎందుకు ఉపాలి, మళ్ళీ వెనక్కి వచ్చావు?. అని అడిగారు"

4. ఉపాలి తన ఆలోచనలను వారికి చెప్పగా, వారు ఇలా సమాధానమిచ్చారు. "తిరిగి శాక్య దేశానికి వెళ్ళకపోవడంలో చాలా మంచి పని చేశావు, ఉపాలీ" ఆవేశ పరులైన శాక్యులు నిన్ను తప్పక చంపేసి ఉండే వారు."

5. అప్పుడు వారు ఉపాలిని తమతో పాటు తథాగతుని వద్దకు తీసుకువెళ్ళారు. అక్కడికి చేరుకోగానే బుద్ధునికి అభివాదం చేసి, కూర్చున్నారు. ఆ తర్వాత తథాగతునితో వారిలా అన్నారు.

6. "దేవా, శాక్యులమైన మేము చాలా అహంకారులం మంగలి కులస్థుడైన ఈ ఉపాలి చాలాకాలంగా మా సేవకుడిగా పని చేస్తున్నాడు. మీరు మా కంటే ముందు ఇతనికి దీక్ష ప్రసాదిస్తే మేము ఇతన్ని జ్యేష్ఠుడుగా భావించి భక్తిశ్రద్ధలతో కలుస్తాము. ఇతన్ని జ్యేష్ఠుడిగా భావించి మేము చేసే సపర్యలతో శాక్యుల గర్వమంతా అణిగి పోవుగాక."

7. ఆ ప్రకారంగానే తథాగతుడు మొదట ఉపాలికి దీక్ష ఇచ్చి తర్వాతే శాక్య యువకులకు ఇచ్చాడు.

# 2. వీధులూడ్చే సునీతునికి దీక్ష

1. రాజగ్రహంలో సునీతుడనే వీధులూడ్చే వ్యక్తి ఉండేవాడు. నగరపౌరులు వీధుల్లోకి పారేసే చెత్తాచెదారాన్ని ఊడ్చటం అతని వృత్తి. ఈ వృత్తి అధమ తరగతికి చెందినదీ, అతనికి వంశపారంపర్యంగా వచ్చింది.

2. ఒక రోజు ప్రాతఃకాలంలో తథాగతుడు లేచి పలువురు భిక్షువులు వెంటరాగా,

రాజగ్రహానికి భిక్షాటనకై బయల్దేరాడు.

3. ఆ సమయంలో సునీతుడు వీధుల్లో పడిఉన్న చెత్తాచెదారాన్ని పోగుచేసి తోపుడుబండి మీద ఉన్న బుట్టలోకి దాన్ని వేస్తున్నాడు.

4. తథాగతుడినీ, అతని అనుచరులను చూడగానే, సునీతుడి మనస్సు ఆనందాశ్చర్యాలతో నిండిపోయింది.

5. తప్పుకోవడానికి చోటు దొరక్క తన బండిని గోడకానించి తను గోడకు అతుకున్నట్లుగా నిలబడి, చేతులు జోడిస్తూ బుద్ధుడికి నమస్కారం చేసాడు.

6. సునీతుని సమీపించగానే, బుద్ధభగవానుడు దివ్యమధుర స్వరంతో, "సునీతా! ఎందుకింత నీచంగా జీవిస్తున్నావు? ఇల్లు వదిలి సంఘంలో చేరగలవా?"

7. సునీతుడు, అమృతపుజల్లు పైనకురిసిన వాడిలా ఆనందంతో, ఉబ్బితబ్బిబ్బవుతూ, రాజభోగాలనుభవించే మీరే సంఘంలో ఉన్నపుడు, నేనెందుకు చేర కూడదు? అయితే నా వంటి వాడిని స్వీకరించ గలరా?" అన్నాడు.

8. వెంటనే బుద్ధుడు " భిక్షూ ఇలారా " అని పిలిచాడు ఆ పిలుపుతోనే అతనికి అనుమతీ, సంస్కారవిధి లభించింది. అతనికి భిక్షువులు ధరించే వస్త్రాలు, భిక్షుక పాత్ర ఇప్పించాడు.

9. ఆ తర్వాత అతన్ని విహారానికి తీసుకు వెళ్ళి ధమ్మమూ, సంయమన శిక్షణా బోధించాడు. "క్రమశిక్షణ, నిగ్రహం, ఆత్మసంయమనాలతో జీవనం గడపడంవల్ల మనిషి పవిత్రుడవుతాడు" అన్నాడు.

10. సునీతుడు పునీతుడెలాఅయినాడన్న ప్రశ్నకు బుద్ధుడు ఇలా సమాధానమిచ్చాడు. "రహదారిలోని పెంటకుప్పలపై పరిమళ భరితమైన కుసుమం పుష్పించినట్లు, కలుషిత జీవితం గడిపే మానవుల మధ్య పవిత్రమైన బుద్ధుని కుమారుడు ప్రకాశిస్తాడు".

## 3. అస్పృశ్యులైన స్వపాక, సుప్రియులకు దీక్ష

1. స్వపాక శ్రావస్తిలోని ఒక అస్పృశ్య తెగకు చెందిన వాడు. అతన్ని ప్రసవించే సమయంలో తల్లి చాలా సేపు స్పృహకోల్పోవడంతో భర్త, బంధువర్గం ఆమె మరణించిందని భావించి, ఆమెను దహనకాండ కోసం స్మశానానికి తీసుకు వెళ్ళారు.

2. అయితే పెనుగాలులతో వర్షం కురుస్తున్నందువల్ల, దహనక్రియకోసం తెచ్చిన కట్టెలు మండలేదు. ఆమె భర్త తదితరులు ఆమెను అక్కడ వదలి ఇళ్ళకు వెళ్ళిపోయారు.

3. అయితే స్వపాక తల్లి అప్పటికింకా జీవించే ఉంది. ఆమె అక్కడ బిడ్డను ప్రసవించి, మరణించింది.

. ఈ బిడ్డను కాటికాపరి తన కొడుకు సుప్రియునితో పాటు పెంచాడు. స్వపాకకు అతని తల్లి తెగ పేరే సంక్రమించింది.

. ఒక రోజున భగవానుడు స్మశాన వాటిక ముందునుంచ నడుస్తుండగా, స్వపాక అతన్ని చూసి, సమీపించారు. బుద్ధునికి నమస్కరించాక, అతని శిష్యునిగా చేరడానికి అనుమతి కోరాడు.

. ఆనాటికీ స్వపాక వయస్సు ఏడేళ్ళే, కనుక తన తండ్రి అనుమతి తీసుకోమని బుద్ధుడు ఆ బాలుడికి చెప్పాడు.

7. స్వపాక తన పెంపుడు తండ్రిని పిలుచుకురాగా, అతను, తన కుమారునికి దీక్ష ఇవ్వవలసిందని తథాగతుని కోరాడు.

3. స్వపాక అస్పృశ్యుడనే విషయాన్ని గణించక, బుద్ధుడు అతనికి దీక్ష ఇచ్చి ఉపదేశం చేసాడు.

. కొంత కాలానికి స్వపాక థేరా స్థాయికి వచ్చాడు.

0. కాటికాపరి కొడుకు సుప్రియతోపాటే స్వపాక కూడా పెరిగాడు. కనుక సుప్రియ, స్వపాక నుంచి బుద్ధుని సిద్ధాంతాలను తెలుసుకున్నాడు. సుప్రియ కులం కంటే, స్వపాక కులం అధికమైనప్పటికీ తనకు కూడా దీక్ష ఇప్పించమని సుప్రియ స్వపాకుని అడిగాడు.

1. స్వపాక ఒప్పుకోవడంతో, కాటికాపరి కులానికి చెందిన సుప్రియ కూడా భిక్షుకుడయ్యాడు.

## 4. సుమంగళుడు తదితర నిమ్నకులాల వారికి దీక్ష

1. శ్రావస్తి నగరంలో సుమంగళుడునే రైతుండే వాడు. అతను పొలాల్లో పని చేసి, జీవనం గడుపుకునేవాడు.

2. కపిలవస్తుకు చెందిన చెన్నుడు శుద్ధోదనుని ఇంట్లో సేవకుడిగా ఉండేవాడు.

3. రాజగ్రహలో ధన్నియుడనే కుమ్మరి నివసించేవాడు.

4. శ్రావస్తిలో ఒకప్పుడు కుర్ర ఉండేవాడు. అతను జీవనోపాధికి ఏపనీచేయక, చింపిరి దుస్తులతో, చిప్పచేత బట్టుకొని ధాన్యం గింజలు అడుక్కునేవాడు. యుక్త వయస్సు వచ్చాక అతను గడ్డి అమ్ముకొని బ్రతికేవాడు.

5. వీరందరూ బుద్ధభగవానుని అనుమతితో భిక్షుకులై దీక్ష స్వీకరించారు. బుద్ధభగవానుడు వారి గతజీవితాన్నిగానీ నీచ కులాన్నిగానీ పట్టించుకోక, అందరికీ ధర్మోపదేశం చేశాడు.

## 5. కుష్ఠురోగి సుప్రబుద్ధునికి దీక్ష

1. ఒకనాడు తథాగతుడు రాజగ్రహ సమీపంలో వెదురుపొదలో కొలువు తీరిఉన్నాడు.

2. ఆ రోజుల్లో రాజగ్రహంలో కుష్ఠువ్యాధితో తీవ్రంగా బాధపడుతున్న సుప్రబుద్ధుడనే వ్యక్తి నివసిస్తూ ఉండేవాడు.

3. ఆ రోజు బుద్ధ భగవానుడు నిండుసభలో ధర్మప్రబోధం చేస్తున్నాడు.

4. దూరంనుంచి ఆ సమూహాన్ని చూసిన సుప్రబుద్ధుడు "అక్కడ అంతమంది ఉన్నారంటే ఏదో జరుగుతున్నదన్న మాట. నేను కూడా అక్కడికి వెళ్తే, అన్నం దొరకవచ్చు" అనుకున్నాడు.

5. దగ్గరికి వచ్చిన తర్వాత ప్రసంగి స్తున్న బుద్ధుడిని చూసి"లేదు ఇక్కడ అన్నదానం జరగడం లేదు. ఇక్కడ గౌతముడు ధర్మబోధ చేస్తున్నాడు. సరే నేను కూడా వింటాను".

6. ఇలా అనుకుంటూ ఒక ప్రక్కగా కూర్చున్నాడు సుప్రబుద్ధుడు.

7. ధర్మబోధచేస్తున్న బుద్ధుడు, సభికుల మనస్సులను గ్రహించే శక్తితో, తనలో తను ఇలా అనుకున్నాడు "ఇక్కడున్నవారిలో సత్యాన్ని ఎవరు గ్రహించ గలరు? అప్పుడు గుంపులో కూర్చుని ఉన్న సుప్రబుద్ధుడిని చూసి, "ఇతను సత్యాన్ని గ్రహించగలడుఅనుకున్నాడు బుద్ధుడు.

8. సుప్రబుద్ధుని కోసం బుద్ధుడు ప్రత్యేకంగా దానం, పవిత్ర జీవనం, దివ్య ప్రపంచం గురించి ఉపదేశించాడు. అదేవిధంగా ఇంద్రియ వాంఛల దుష్టత్వాన్ని, వ్యసనాలు త్యజించడం వల్ల కలిగే ప్రయోజనాన్ని వివరించాడు.

9. సుప్రబుద్ధుడి హృదయం ఈ ధర్మోపదేశంతో మెత్తపడి, స్వేచ్ఛతో, విశ్వాసంతో ఆనంద పరిపూర్ణమైందని గ్రహించిన తథాగతుడు, తన ధర్మోపదేశంలో కెల్ల ఉత్కృష్టమైన దుఖ కారణం, దుఃఖోపశమనం, ధర్మమార్గం అనే అంశాలను వివరిస్తూ ఉపన్యసించాడు.

10. మరకలుపోయి శుభ్రపడిన తెల్లని వస్త్రం రంగు మార్పిడికి సిద్ధమైనట్లే, సుప్రబుద్ధుడి మనస్సులో ఇంతకు పూర్వం ఉన్న కల్మషం నశించి, సత్యం యొక్క స్వచ్ఛమైన రూపం అతనికి సాక్షాత్కరించింది. ప్రతి విషయానికి ఆది ఉన్నట్లే అంతం కూడా ఉంటుందన్న జ్ఞానోదయం అతనికి కలిగింది. ఆ క్షణంలో కుష్ఠురోగియైన సుప్రబుద్ధుడు సత్యాన్ని దర్శించాడు. సత్యాన్ని చేరుకున్నాడు, సత్యాన్ని గ్రహించాడు, సత్య స్వరూపం తెలుసుకున్నాడు. అతనిలోని సందేహాలు, ప్రశ్నలు పటాపంచలై, విశ్వాసం ఉదయించింది. వెంటనే తను కూర్చున్నచోటు నుంచి లేచి ప్రభుని సమీపంలో కూర్చున్నాడు.

11. అలా కూర్చున్న తర్వాత అతను తథాగతునితో ఈ విధంగా అన్నాడు." అద్భుతం, దేవా అద్భుతం. పతితుడిని ఉద్ధరించినట్టు దాగిఉన్న దాన్ని కనుగొన్నట్టు, అయోమయంలో ఉన్న వ్యక్తికి మార్గనిర్దేశం చేసినట్టు, చీకటిలో వెలుగు చూపినట్టు, కన్నులున్న వారు ఆకారాన్ని దర్శించగలరు అని చెప్పినట్టు. సత్యాన్ని శరణుకోరుతున్నాను. నాకు ధర్మోపదేశం చేయండి. నన్ను అనుచరుడిగా స్వీకరించండి."

12. ఈ విధంగా సుప్రబుద్ధుడు ఉపదేశం పొంది, బుద్ధుని పవిత్ర వాక్కులతో మనస్సు వికసించి తథాగతుడికి కృతజ్ఞతతో నమస్కరించి, తన త్రోవను బయల్దేరాడు.

13. అయితే, దురదృష్టవశాత్తు, ఒక కోడెదూడ సుప్రబుద్ధుడిని దారిలో అటకాయించి, పొడిచి వేసింది.

# ఏడవ భాగం

# మహిళలకు దీక్ష

1. మహాప్రజాపతి గౌతమి, యశోధర, ఆమె చెలులకు దీక్ష
2. చండాలిక ప్రకృతికి దీక్ష

# 1. మహాప్రజాపతి గౌతమి, యశోధర ఆమె చెలులకు దీక్ష.

1. తథాగతుడు చివరిసారి తన తండ్రిని సందర్శించిన సమయంలో శాక్యపురుషులతో పాటు, శాక్య మహిళలలో కూడా సంఘంలో చేరాలనే ఆకాంక్ష బలంగా నాటుకుంది.

2. ఈ మహిళలకు నాయకురాలు మహాప్రజాపతి గౌతమి.

3. బుద్ధభగవానుడు నిగ్రోధారామంలో శాక్యులకు ధర్మోపదేశం చేస్తుండగా ఒక రోజు మహాప్రజాపతి గౌతమి ఆయన వద్దకు వెళ్ళి, "తథాగతుని నియమాలకు, సిద్ధాంతాలకు అనుగుణంగా మహిళలుకూడా పరివ్రాజలై సంఘంలో చేరడానికి మీరు అనుమతిస్తే బాగుంటుంది" అని కోరింది.

4. "చాలుచాలు, గౌతమీ........ అటువంటి ఆలోచన నీ మనస్సులో రానీయకు" అన్నాడు బుద్ధుడు. ఆమె రెండు మూడు సార్లు అదే విజ్ఞప్తి చేసింది. ప్రతిసారీ తథాగతుడు నిరాకరిస్తూనే వచ్చాడు.

5. ఆయన సమాధానంలో దుఃఖితురాలై మహాప్రజాపతి గౌతమి కన్నీళ్ళతో వెనక్కివెళ్ళింది.

6. తథాగతుడు నిగ్రోధారామాన్ని వదలిపెట్టి తన పర్యటనపైవెళ్ళిన తరువాత మహాప్రజాపతి, శాక్య స్త్రీలు సమావేశమై, సంఘంలో చేర్చుకోవాలన్న తమ విజ్ఞప్తిని, దానికి బుద్ధభగవానుని నిరాకరణను చర్చించారు.

7. బుద్ధుని తిరస్కృతిని తుది నిర్ణయంగా అంగీకరించడానికి వారికి మనసొప్పలేదు వారంతా పరివ్రాజకుల దుస్తులు ధరించి భగవానుని సందర్శించడానికి నిశ్చయించుకున్నారు.

8. అనుకున్న ప్రకారంగానే మహాప్రజాపతి గౌతమి శిరోముండనంచేయించుకొని, కాషాయ వస్త్రాలు ధరించి, ఇతర శాక్య మహిళలతో బుద్ధుని కలుసుకోవడానికి వెళ్ళింది. ఆ సమయంలో బుద్ధుడు కూగిరి విహారంలోని మహావనం వద్దనున్న వైశాలిలో బసచేసి ఉన్నాడు.

9. మహాప్రజాపతి గౌతమి, తన పరివారంతోసహా, బుద్ధుని వద్దకు వచ్చింది. దూర ప్రయాణం వల్ల వారి దుస్తులు మట్టికొట్టుకుని, వారి కాళ్ళు వాచి ఉన్నాయి.

10. ఆమె మరోసారి తథాగతునికి నిగ్రోధారమంలోచేసిన విజ్ఞప్తిని చేసింది. అతను మళ్ళీ నిరాకరించాడు.

11. మళ్ళీ నిరాకరణ ఎదురుకావడంతో, మహాప్రజాపతి గది బయటకు వచ్చి దిక్కుతోచక నిలుచుంది. ఆ సమయంలో లోపలికి వెళ్తున్న ఆనందుడు ఆమెను చూసి గుర్తుపట్టాడు.

12. అతను మహాప్రజాపతిని ఇలా అడిగాడు: "వాచిపోయిన పాదాలతో, దుమ్ముకొట్టుకుని, దుఃఖిస్తూ మీరు ఎందుకు ఇక్కడ నిల్చున్నారు ?" దానికి జవాబుగా మహాప్రజాపతి "ఆనందా! తథాగతుడు మహిళలను గృహస్థ జీవనంవదలి ధర్మదీక్ష పొందటానికి నిరాకరిస్తున్నందువల్లే ఈ విచారం " అని బదులిచ్చింది.

13. వంద్యుడైన ఆనందుడు బుద్ధుని వద్దకు వెళ్ళి, నమస్కరించి అతని ప్రక్కన ఆసీనుడై, ఇలా అన్నాడు! "భగవానుడా! మీరు మహిళలను గృహస్థాశ్రమంవీడి సంఘంలో చేరడానికి, నిరాకరించినందువల్ల, మహాప్రజాపతి గౌతమి విషణ్ణవదనయై, దుఃఖిస్తూ బయట ఎలా నిల్చుని ఉందో చూడండి. ఆమె కోరినట్లుగా, మీరు మహిళలకు కూడా దీక్ష తీసుకోవడానికి అనుమతిస్తే బాగుంటుంది. "

14. "మీ తల్లి మరణానంతరం మహాప్రజాపతి పసిబిడ్డ అయిన మిమ్మల్ని పాలిచ్చి పెంచి పెద్ద చేయలేదా ? అటువంటి వ్యక్తి గృహస్తజీవితాన్ని వదలిపెట్టి, తథాగతుని వద్ద దీక్షపొందడానికి అనుమతి కోరినపుడు అంగీకరిస్తే బాగుంటుంది."

15. "చాలు చాలు ఆనందా! మహిళలకు కూడా దీక్ష ఇవ్వాలని అనవద్దు" అన్నాడు బుద్ధుడు. ఆనందుడు మరీ మరీ ప్రార్థించినా బుద్ధుడు అదే సమాధానమిచ్చాడు.

16. ఆనందుడు ఇలా ప్రశ్నించాడు " భగవంతుడా ! మహిళలు పరివ్రాజకులు కావడానికి మీరు ఎందువల్ల అభ్యంతర పెడుతున్నారు?

17. "శూద్రులు, స్త్రీలు, మలినులు, అధములు కనుక వారు మోక్షానికి అర్హులుకారని బ్రాహ్మణులు భావిస్తారన్న విషయం తథాగతునికి తెలిసిందే, అందువల్లే శూద్రులు, స్త్రీలు పరివ్రాజకులు కావడానికి బ్రాహ్మణులు అభ్యంతరపెడతారు. అంటే మీరు కూడా బ్రాహ్మణులతో ఏకీభవిస్తున్నారని అనుకోవాలా?

18. బ్రాహ్మణులవలె శూద్రులను దీక్షనిచ్చి సంఘంలో చేర్చుకోవడానికి మీరు అనుమతించలేదా? అటువంటప్పుడు స్త్రీల పట్ల మాత్రం వివక్ష దేనికి?

19. తథాగతుని ధర్మోపదేశానికి కట్టుబడి నిర్వాణపథం చేరుకునే సామర్థ్యం స్త్రీలకు లేదని మీరు భావిస్తున్నారా?"

20. దానికి తథాగతుడు ఇలా సమాధానమిచ్చాడు :" ఆనందా! నన్ను అపార్థం చేసుకోవద్దు. నిర్వాణపథం చేరుకోగల సామర్థ్యంలో స్త్రీలు పురుషులకు ఏమాత్రం తీసిపోరని నానమ్మకం. దయచేసి, నేను స్త్రీ పురుషుల అసమానతను సమర్థిస్తానని అనుకోకు. మహాప్రజాపతి విజ్ఞప్తిని నేను నిరాకరించడానికి కారణం స్త్రీ పురుష వివక్ష కాదు. అది ఆచరణీయం కాదన్న నమ్మకం."

21. "మీ నిరాకరణకు అసలు కారణం తెలిసినందుకు నాకు ఆనందంగా ఉంది, కానీ ఆచరణలో కష్టాలు ఉంటాయన్న కారణంగా ఆమె విజ్ఞప్తిని తిరస్కరించాలా? దీనివల్ల

బౌద్ధధర్మం అపఖ్యాతిపాలై, అందులో స్త్రీ పురుష వివక్ష ఉందన్న ఆరోపణలు ఎదుర్కోదా? దానికి బదులు మిమ్మల్ని కలవరపెడుతున్న ఇబ్బందులను అధిగమించడానికి కొత్త నిబంధనలు రూపొందించలేరా?"

22. "సరే ఆనందా! మహాప్రజాపతి అంత పట్టుదలగా ఉంటే స్త్రీలు నా నియమాల ప్రకారం పరివ్రాజకులు కావడానికి ఒప్పుకుంటాను. అయితే దీనికి ఎనిమిది షరతులు పెడుతున్నాను. ఈ ఎనిమిది ప్రధాన నిబంధనలను అమలుచేయవలసిన బాధ్యత మహాప్రజాపతిదే. దానివల్లే ఆమెకు సంఘంలో ప్రవేశం లభిస్తుంది."

23. వంద్యుడైన ఆనందుడు, భగవానునినుండి ఈ ఎనిమిది నిబంధనలను తెలుసుకుని, బయటకువెళ్ళి మహా ప్రజాపతికి తామిద్దరి మధ్య జరిగిన సంభాషణ వివరించాడు.

24. "ఆనందా యవ్వనవంతులైన, స్త్రీ పురుషులు స్నానం చేయగానే, తామర పూమాలను, మల్లెచెండును స్థిమూతక పుష్పాలను పవిత్రంగా స్వీకరించి శిరస్సుపై అలంకరించుకున్నట్టు, నేను భగవానుడు రూపొందించిన ఈ ఎనిమిది ప్రధాన నియమాలను, నా జీవితాంతం శిరసావహిస్తాను" అని చెప్పింది మహాప్రజాపతి.

25. పవిత్రుడైన ఆనందుడు మళ్ళీ బుద్ధుని వద్దకువెళ్ళి, నమస్కరించి, ఆయన పక్కన ఆసీనుడయ్యాడు. ఆ తర్వాత ఇలా అన్నాడు: "భగవానుడా, మహాప్రజాపతి గౌతమి ఎనిమిది ప్రధాన నియమాలను అమలు జరిపే బాధ్యత తీసుకున్నది. కనుక ఆమెకు సంఘంలో ప్రవేశించడానికి అర్హత లభించినట్లుగా భావించవచ్చు.

26. ఆ తరువాత మహాప్రజాపతి, ఆమెతోపాటు వచ్చిన అయిదువందలమంది శాక్యమహిళలు ధర్మదీక్ష పొందారు. దీక్ష తీసుకోగానే మహాప్రజాపతి బుద్ధభగవానునికి నమస్కరించి పక్కగా నిలుచుంది. ఆయన మహాప్రజాపతికి ధర్మోపదేశం చేశారు.

27. తక్కిన అయిదువందలమంది భిక్షుకురాండ్రకు బుద్ధుని శిష్యులలో ఒకడైన నందకుడు ధర్మదీక్ష ఇచ్చాడు.

28. మహాప్రజాపతితోపాటు దీక్ష పొందిన శాక్య మహిళలలో యశోధర కూడా ఉంది. ఆ దీక్ష స్వీకరించిన నాటి నుంచి ఆమె భద్రకాంచన పేరుతో పిలవబడింది.

## 2. చండాలిక అయిన ప్రకృతికి దీక్ష

1. అనాథ పిండక వద్ద జితవనారామంలోని శ్రావస్తిలో తథాగతుడు ఉంటున్న రోజులవి.

2. ఒకనాడు, బుద్ధుని శిష్యుడు ఆనందుడు భిక్షాటనకై నగరానికి వెళ్ళాడు. అక్కడ భోజనం ముగించిన తర్వాత అతను మంచినీటి కోసం నది వద్దకు వెళ్ళాడు.

3. నదీ తీరాన ఒక బాలిక కుండలో నీళ్ళు నింపుకోవడం చూసి ఆనందుడు తనకు కొంచెం

నీళ్ళు ఇవ్వమని అడిగాడు.

4. ప్రకృతి అనే పేరు గల ఆ అమ్మాయి, తను చండాలిక కనుక, తన చేతి నీరు ఆయన తాగ కూడదంటూ, నీళ్ళివ్వడానికి నిరాకరించింది.

5. దానికి సమాధానంగా ఆనందుడు "నాకు నువ్విచ్చే నీళ్ళుకావాలి. నీ కులంతో నిమిత్తం లేదు" అన్నాడు. వెంటనే ఆ బాలిక అతనికి తన కుండలోనుంచి నీళ్ళు ఇచ్చింది.

6. ఆ తర్వాత ఆనందుడు జితవనానికి వెళ్ళాడు. ఆ బాలిక అతన్ని అనుసరించి, ఎక్కడ నివసిస్తున్నాడో తెలుసుకుంది. అతని పేరు ఆనందుడనీ, అతను బుద్ధుని అనుచరుడనీ ఆమె తెలుసుకుంది.

7. ఇంటికి వచ్చిన తర్వాత తన తల్లి మాతంగికి జరిగిందంతా చెప్పి నేలపై పడి ఏడ్చింది.

8. ఎందుకు ఏడుస్తున్నావని తల్లి అడగ్గా, ఆ బాలిక " నువ్వునాకు పెళ్ళి చేయదలచుకుంటే నేను ఆనందుడినే చేసుకుంటాను ఇంకెవరినీ చేసుకోను" అని చెప్పింది.

9. కుమార్తె కోరికమేరకు తల్లి ఆనందుడి గురించి అన్ని వివరాలు కనుక్కుంది. తిరిగి వచ్చిన తరువాత, ఆనందుడు బ్రహ్మచర్య దీక్ష తీసుకున్నాడు కనక, అతనితో నీ వివాహం జరగడం అసంభవమని కుమార్తెకు చెప్పింది.

10. ఈ మాటలు వినగానే ఆ బాలిక విపరీతమైన బాధకుగురై భోజనం కూడా మానేసింది. ఇది తన నుదుటి వ్రాత అని ఆమె సరిపెట్టుకోలేక పోయింది. తన తల్లితో, "అమ్మా నీకు మంత్రశక్తి ఉంది కదా, నా కోరిక ఫలించేందుకు ఆ శక్తిని ఎందుకు ఉపయోగించవు? తల్లి :" సరే నేను చేయగలిగింది చేస్తాను."

11. మాతంగి ఆనందుడిని తన యింటికి భోజనానికి పిలిచింది. ప్రకృతి చాలా సంతోషించింది. తన కుమార్తె ఆనందుడిని వివాహం చేసుకోవాలని ఆ కాంక్షిస్తున్నట్టు మాతంగి అతనికి చెప్పింది. దానికి ఆనందుడు, " నేను బ్రహ్మచర్యదీక్ష తీసుకున్నాను కనుక వివాహం చేసుకోలేను" అని సమాధానమిచ్చాడు.

12 "నువ్వుగనుక నా కుమార్తెను వివాహం చేసుకోక పోతే, తను ఆత్మహత్య చేసుకుంటుంది. ఆమెకు నువ్వంటే అంత అభిమానం " అని చెప్పింది మాతంగి. "దానికి నేనేం చేయలేను" అన్నాడు ఆనందుడు.

13. ఆనందుడు వివాహానికి అంగీకరించలేదన్న విషయాన్ని మాతంగి లోపలికి వెళ్ళి కుమార్తెకు చెప్పింది.

14. బాలిక, అమ్మా! నీ మంత్రశక్తి ఏమైనట్టు? అడిగింది. నా మంత్రశక్తి తథాగతుడిని నిర్జించలేదు" అని జవాబిచ్చింది తల్లి.

15. ప్రకృతి గట్టిగా అరిచింది : " ఆ తలుపు వేసేయ్. అతన్ని బయటకు పోనీయవద్దు.

అతన్ని ఈ రాత్రే నా భర్తను చేసుకుంటాను".

16. తల్లి కూతురు కోరినట్టు చేసింది, చీకటి పడ్డాక, తల్లి ఒక మంచం తెచ్చి గదిలో పెట్టింది. ప్రకృతి అందంగా అలంకరించుకుని, గదిలో అడుగు పెట్టింది. కానీ ఆనందుడిలో ఎలాంటి చలనంలేదు.

17. అప్పుడు ప్రకృతి తల్లి తన మంత్రశక్తిని ఉపయోగించి, నిప్పు సృష్టించింది. వెంటనే ఆమె ఆనందుడిని పట్టుకుని, "నా కూతుర్ని పెళ్ళిచేసుకోవడానికి ఒప్పుకోని పక్షంలో ఈ నిప్పులోకి నిన్ను తోసేస్తాను" అంది. అక్కడికీ ఆనందుడు చలించకపోవడంతో తల్లీ కూతుళ్ళు నిస్సహాయంగా అతన్ని వదిలివేశారు.

18. ఆనందుడు వెనక్కివచ్చి తథాగతునికి జరిగిందంతా చెప్పాడు.

19. మరుసటి రోజు ప్రకృతి ఆనందుడిని అన్వేషిస్తూ జితవనానికి వచ్చింది. ఆనందుడు భిక్షాటనకు వెళ్తూ, ఆ అమ్మాయిని తప్పించుకోవాలని చూశాడు. కానీ అతను ఎక్కడికి వెళ్తే అక్కడికి అనుసరించింది ఆ అమ్మాయి.

20. ఆనందుడు తిరిగివచ్చేసరికి ఆమె విహారం బయటవేచిఉంది.

21. అప్పుడు ఆనందుడు బుద్ధునికి ఆ అమ్మాయి ఎలా తన వెంట పడుతున్నదీ చెప్పాడు. బుద్ధుడు ఆమెను పిలిపించాడు.

22. ఆ అమ్మాయి రాగానే, ఎందుకు ఆనందుడిని వెంట పడుతున్నావని బుద్ధుడు అడిగాడు. తనకు అతన్ని వివాహం చేసుకోవాలని ఉన్నట్టు చెప్పి, "అతను అవివాహితుడని తెలుసుకున్నాను. నేను కూడా అవివాహితురాలినే "అంది ఆ అమ్మాయి.

23. భగవానుడు, "ఆనందుడు భిక్షువు. శిరోముండనంచేయించుకున్నవాడునువ్వు కూడా శిరోముండనం చేయించుకుంటే, ఆ తర్వాత ఏం చేయగలనో చూస్తాను" అన్నారు.

24. దానికి "నేను సిద్ధమే" అంటూ, తల్లికేసి తిరిగి అమ్మా నీవు చేయలేనిది నేను చెయ్య గలిగాను. నేను తలవెంట్రుకలు తీయించుకుంటే మా వివాహం చేయిస్తానని భగవానుడు వాగ్దానం చేసారు" అంది.

25. తల్లి ఇందుకు ఆగ్రహించి, "నువ్వదిచేయడానికి వీలేదు. నువ్వు నా కూతురివి. శిరోముండనం చేయించుకోకూడదు అయినా ఆనందుడిలాంటి శ్రమణుడిని పెళ్ళాడాలని అంత పట్టుదల దేనికి ? కావాలంటే ఇంతకంటే మంచివాణ్ణి నీకు భర్తగా తీసుకురాగలను" అంది.

26. ప్రకృతి "నేను ఆనందుడిని చేసుకోలేకపోతే చచ్చిపోతాను. మరో దారి లేదు" అని చెప్పింది.

27. దానికి తల్లి "ఎందుకు నన్నిలా అవమానిస్తావు? అని అడిగింది. కుమార్తె, "నీకు నిజంగా

నా మీద ప్రేమ ఉంటే నా యిష్టం వచ్చినట్లు చెయ్యనివ్వు" అని జవాబిచ్చింది.

28. తల్లి తన అభ్యంతరం విరమించుకోవడంతో ప్రకృతి, శిరోముండనం చేయించుకుంది.

29. " తర్వాత ప్రకృతి తథాగతుడి ఎదుటకువచ్చి, " మీరు ఆదేశించినట్లు శిరోముండనం చేయించుకున్నాను " అంది.

30. తథాగతుడు, " నీకేం కావాలి? ఆనందుడి శరీరంలోని ఏ భాగం యిష్టం?" అని అడిగారు. ఆ అమ్మాయి ఇలా చెప్పింది " నాకు అతని ముక్కు, చెవులు, కంఠం, కళ్ళు, నడక అన్నీ యిష్టమే " అని చెప్పింది.

31. తథాగతుడు ఇలా చెప్పాడు "కళ్ళు కన్నీటికి నిలయాలనీ, ముక్కు మురికికి నివాసమనీ, నీరు ఉమ్మికి స్థానమనీ, చెవి మకిలికి ఇల్లనీ, శరీరం మలమూత్రాల భూయిష్టమనీ నీకు తెలీదా?

32. స్త్రీ పురుషులు ఒకటైనపుడు పిల్లలకు జన్మనిస్తారు. కానీ జన్మ ఉన్నచోట మరణం కూడా ఉంటుంది, మరణం ఉన్న చోట దుఃఖం ఉంటుంది. అలాంటప్పుడు ఆనందుడిని పెళ్ళిచేసుకోవడం వల్ల నీకేం లాభమో నాకర్థం కావడం లేదు."

33. ఆ అమ్మాయి కొద్ది సేపు ఆలోచించి, ఆనందుడితో వివాహం వల్ల లాభంలేదని గ్రహించి, తథాగతుడితో ఆ మాటే చెప్పింది.

34. బుద్ధ భగవానుడికి నమస్కరించి, ఆ అమ్మాయి ఇలా అంది: "నా అజ్ఞానం వల్ల ఆనందుని వెంట పడ్డాను. ఇప్పుడు నాకు జ్ఞానోదయమైంది. నడిసముద్రంలో ప్రమాదం జరిగిన తర్వాత తీరం చేరిన నావికుడి స్థితిలో ఉన్నాను నేను. రక్షణలేనివయోవృద్ధుడికి రక్షణ దొరికినట్లుంది నా పరిస్థితి. తథాగతుడు తన జ్ఞానవాక్కులతో నన్ను నిద్రనుండి మేల్కొల్పినారు."

35. "ప్రకృతి! నీవు ధన్యురాలివి. చండాలికవై ఉండి కూడా, అగ్రవంశీకులైన స్త్రీ పురుషులకు నీవు మార్గదర్శివైనావు. నీవు నిమ్నకులానికి చెందినా, బ్రాహ్మణులు కూడా నీ వద్ద నేర్చుకోవలసింది ఎంతో ఉంది. న్యాయ, ధర్మ మార్గాలను విడనాడక ఉంటే నీవు రాణుల రాజవైభవాన్ని కూడా మించిపోతావు".

36. వివాహ ప్రయత్నం విఫలం కావడంతో, ప్రకృతి భిక్షుక సంఘంలో చేరింది.

37. ఈవిధంగా నిమ్నవర్గానికి చెందినప్పటికీ తన కోరికమేరకు ప్రకృతి ధర్మదీక్ష స్వీకరించింది.

# ఎనిమిదవ భాగం

# పతితులు, నేరస్థులకు దీక్ష

1. దేశద్రిమ్మరికి దీక్ష
2. దోపిడీదొంగ అంగుళీమాలునికి దీక్ష
3. ఇతర నేరస్థులకు దీక్ష
4. దీక్ష ప్రసాదించడంలో ప్రమాదాలు.

# 1. దేశద్రిమ్మరికి దీక్ష

1. రాజగ్రహలో ఒకప్పుడు అరాచకంగా జీవించే ఒక వ్యక్తి ఉండేవాడు. అతనికి తల్లిదండ్రులన్నా, పెద్దలన్నా గౌరవం ఉండేది కాదు. తన వల్ల ఏదైనా తప్పు జరిగితే, సూర్య చంద్రులను, అగ్ని దేవుని ప్రార్థిస్తూ, వారికి బలులిస్తూ, తద్వారా తనకు మంచి జరుగుతుందని నమ్మేవాడు.

2. ఎంతో శ్రద్ధగా మూడేళ్ళపాటు నిర్విరామకర్మకాండ జరిపిన అతనికి మనశ్శాంతి లభించలేదు.

3. చివరికి శ్రావస్తికి వెళ్ళి బుద్ధుని గురించి కనుక్కొని, ఆయన వద్దకు వెళ్ళాడు. బుద్ధుని తేజస్సు చూసి, అతని పాదాక్రాంతుడై తన ఆనందాన్ని ప్రకటించాడు.

4. అనంతరం తథాగతుడు జంతుబలులు ఎంత నిరర్థకమైనవో వివరించాడు. హృదయం నిర్మలంకానపుడు, కర్తవ్య పరాయణతనూ పెద్దల యెడ గౌరవాన్ని విస్మరించినప్పుడు, ఇటువంటి భౌతికమైన చర్యలవల్ల ఫలితం ఉండదని ఆయన చెప్పాడు. ధర్మబోధ అనంతరం ఆయన ఉత్తేజకరమైన గాథలు వినిపించాడు.

5. శ్రామికులు, ముఖ్యంగా పిల్లలున్నవారు బుద్ధుని పూజించడానికి ఆయన చుట్టు ముట్టారు.

6. తల్లిదండ్రుల కోరిక మేరకు, బుద్ధుడు చిరునవ్వుతో గాథలను వినిపించాడు.

7. మహానుభావుడైన వ్యక్తి కాంక్షారహితుడై ఉంటాడు. తన జ్ఞానతేజంతో తన పరిసరాలను వెలుగుతో నింపుతాడు. విధివశాత్తు దుఃఖంకలిగినా, అందులోనూ ఆనందాన్నే పొందుతాడు. ఆందోళనారహితుడై తన వివేకాన్ని ప్రదర్శిస్తాడు.

8. "వివేక వంతుడు (భద్రుడు) ప్రాపంచిక విషయాలతో సంబంధం పెట్టుకోడు. అతను సంపదనూ, సంతానాన్నీ, భూమినీ కోరుకోడు ధర్మాచరణలో, జ్ఞానమార్గంలో నిమగ్నుడవుతాడు. వితండ సిద్ధాంతం వెంట, సంపద, ప్రతిష్టల వెంటపడడు.

9. అస్థిర చిత్తస్వభావం ఎరిగిన విజ్ఞుడు. ఇసుకలో నిలిచిన వృక్షంలా(తీవ్రప్రయత్నాలు) అస్థిరుడైన మిత్రుని మార్చడానికి, మాలిన్యం నుంచి అతన్ని సౌశీల్యానికి తేవడానికి కృషి చేస్తాడు.

# 2. చోరుడైన అంగుళీమాలునికి దీక్ష

1. కోసల దేశాన్ని ప్రసేనుడనే రాజు పాలిస్తున్న కాలంలో దుర్మార్గుడు, నరహంతకుడు కృపారహితుడు అయిన అంగుళీమాలుడనే బందిపోటు ఉండేవాడు. రక్తపాతమే నిత్యకృత్యంగా ఏ ప్రాణిపట్ల కనికరం లేకుండా అతను వ్యవహరించేవాడు. అతని

భయంతో గ్రామాలు, పట్టణాలు అల్లకల్లోలమైపోయాయి.

2. తను చంపిన మనిషి శరీరం నుంచి ఒక వేలు కోసి దండగా గుచ్చుకోవడం వల్ల అతనికి "అంగుళీమాలుడు" అనే పేరు వచ్చింది.

3. బుద్ధ భగవానుడు శ్రావస్తిలో ఉన్నపుడు అంగుళీమాలుడి గురించి విన్నాడు. అతన్ని మార్చాలని ఆయన నిర్ణయించుకున్నాడు. ఒకరోజు భోజనానంతరం, కాషాయ వస్త్రాలతో భిక్షపాత్ర పట్టుకొని, అంగుళీమాలుని అన్వేషణకై బయల్దేరాడు.

4. ఆయన వెళ్ళే మార్గంలో పలువురు గొర్రెల కాపరులు, రైతులూ, బాటసారులు ఎదురై "ఆ మార్గంలో వెళ్ళకండి అక్కడ అంగుళీమాలుడు ఉంటాడు" అని హెచ్చరించారు.

5. "పది ఇరవై, ముప్పైలేక నలభై మంది గుంపుగా కలిసి వెళ్ళినా అతన్ని తప్పించుకోలేరు" అని వాళ్ళు హెచ్చరిస్తున్నా మౌనంగా ముందుకు సాగాడు తథాగతుడు.

6. దారిపొడుగునా ఎందరో ఆయన్ని హెచ్చరిస్తూనే ఉన్నారు. అయినా, సమాధానం చెప్పకుండా, ఆయన తన ప్రయాణం కొనసాగించాడు.

7. కొంతదూరంనుంచే అంగుళీమాలుడు బుద్ధుని రాకను గమనించాడు. యాభై మంది గుంపుగా రావడానికి కూడా భయపడే తన మార్గంలో ఒక భిక్షుకుడు ఒంటరిగా రావడం చూసి, విస్మయించెంది, ఇతన్ని చంపాలని అంగుళీమాలుడు నిశ్చయించుకున్నాడు. తదనుగుణంగా, కత్తి, బాణం చేతబట్టి అతను బుద్ధుని అనుసరించాడు.

8. తథాగతుడు తన మామూలు నడకతో అడుగువేస్తున్నాడు. అంగుళీమాలుడు ఎంత ప్రయత్నించినా ఆయన నడకను అందుకోలేక పోయాడు.

9. అప్పుడు ఆ బందిపోటు ఇలా అనుకున్నాడు: ఇదేదో అద్భుతంలా ఉంది. ఇదివరకు నేను ఏనుగును, గుర్రాన్ని, రథాన్ని, చివరికు జింకను కూడా వేగంగా వెళ్తున్నా అందుకోగలిగాను. ఇవాళ మాత్రం, ఎంత ప్రయత్నించినా ఈ భిక్షుకుడిని దాటలేక పోతున్నాను. వెంటనే ఆగి, అంగుళీమాలుడు బుద్ధుని కూడా ఆగమని గట్టిగా అరిచి చెప్పాడు.

10. ఇద్దరు కలుసుకోగానే, భగవానుడు, ఇలా అన్నాడు. " అంగుళీమాలా! నీ కోసం నేను ఆగాను, నువ్వు కూడా నీ దుష్టవృత్తిని ఆపేస్తావా ? నిన్ను నా దారికి మళ్ళించడానికి, ధర్మమార్గం నీకు చూపడానికి నేను ఇలా వచ్చాను. నీలో మంచి ఇంకా చావలేదు. దానికి ఒక్క అవకాశం ఇస్తే, నువ్వు తప్పక మారగలవు."

11. ఈ మాటలతో తబ్బిబ్బు పడిన అంగుళీమాలుడు " ఎట్టకేలకు ఈ ముని నన్ను పట్టుకోగలిగాడు" అన్నాడు.

12. "నన్ను పాపకార్యాలు శాశ్వతంగా మానివేయమని మీ దివ్యవాక్కులు వచిస్తున్నాయి. కనుక ఒక అవకాశం ఇచ్చి చూస్తాను" అని చెప్పాడు.

13. వెంటనే తన మెడలో ధరించిన "అంగుళీమాలను" తీసి అగాధమైన లోయలోకి విసిరేసి, బుద్ధుని పాదలపైబడి, భిక్షుక సంఘంలోకి చేర్చుకొమ్మని వేడుకున్నాడు.

14. సురలకు, నరులకు మార్గదర్శకుడైన భగవానుడు, "భిక్షుకా! నన్ను అనుసరించు" అన్నాడు. ఆ పిలుపుతో అంగుళీమాలుడు భిక్షుకుడు అవ్వనేఅయ్యాడు.

15. అంగుళీమాలుడు వెంటరాగా, భగవానుడు శ్రావస్తికి దారితీశాడు. అదే సమయంలో రాజు ప్రసేనుడి భవనంలో ప్రజలు గుంపులుగా చేరి, ప్రజలను నిర్దాక్షిణ్యంగా హతమారుస్తున్న అంగుళీమాలుని అణచివేయమని ప్రభువును ప్రార్థించారు. అతన్ని నిర్మూలిస్తానని రాజు హామీ ఇచ్చాడు. కానీ విఫలుడయ్యాడు.

16. ఒక రోజు రాజు బుద్ధుని దర్శనానికి వెళ్ళాడు. తథాగతుడు రాజును పరామర్శిస్తూ "మీరెందుకో కలవరపడుతున్నట్టున్నారు. ప్రభూ, మగధరాజు బింబిసారుడు గాని, వైశాలి ప్రభువులైన లిచ్ఛవీ రాజులుగానీ, మరెవరైనాగానీ చికాకులు కలిగిస్తున్నారా?" అని అడిగాడు.

17. "అటువంటి సమస్యలేమీ లేవు దేవా. కానీ నా రాజ్యంలో అంగుళీమాలుడనే దోపిడీదారుడు ప్రజలను నానా హింసలుపెడుతున్నారు. అతన్ని అణిచి వేయాలని అనుకున్నాను కానీ, విఫలమయ్యాను."

18. "శిరోముండనం చేయించుకొని, పసుపు వస్త్రాలు ధరించి, హత్యలు, దొంగతనాలు, అసత్య వచనాలు మానేసి రోజుకు ఏకభుక్తం చేస్తూ, పవిత్ర జీవనం గడుపుతున్న అంగుళీమాలుడిని గనక మీరిపుడుచూస్తే, అతన్ని మీరేం చేస్తారు ప్రభూ?"

19. "భగవాన్ నేను అతనికి అభివందనం చేసి, సాధారణంగా కూర్చోమని ఆహ్వానించి, కాషాయ వస్త్రాలు, బహూకరిస్తాను కావాలంటే అతనికి రక్షణ, భద్రత కల్పిస్తాను. కాని, దుర్మార్గుడు, పతితుడు అయిన అలాంటి వ్యక్తి పై పవిత్రతాఛాయకూడాప్రసరించడానికి వీలు లేదే".

20. మరుక్షణం, బుద్ధునికి పక్కగా కూర్చుని ఉన్న అంగుళీమాలుడు , "ప్రభూ నేనే అంగుళీమాలుడిని " అని చెప్పాడు.

21. రాజు నిశ్చేష్టుడై, అవాక్కయ్యాడు. అతని దేహంపై రోమాలు నిక్కబొడుచుకున్నాయి. అది చూసి బుదుడు "భయ పడవలసిన అవసరం లేదు, ప్రభూ ఇక్కడ భయపడాల్సిన పరిస్థితి ఏమీ లేదు " అన్నారు.

22. బుద్ధుని మాటలతో కుదుటపడిన రాజు, అంగుళీమాలుని వద్దకు వెళ్ళి," నిజంగా మీరే నా పావనులైన అంగుళీమాలుడు?" అని అడిగాడు. అవునని జవాబు వచ్చింది.

23. "మీ తల్లి దండ్రులు ఏ జాతికి చెందిన వారు?" అని రాజు అడగ్గా "ప్రభూ! మా తండ్రి గగ్గ జాతికి, తల్లి మంతని జాతికి చెందిన వారు" అని చెప్పాడు అంగుళీమాలుడు.

24. " గగ్గా, మంతని పుత్రా ! నిశ్చంతగా ఉండు. నీకు కావలసినవన్నీ నేను సమకూరుస్తాను" అని చెప్పాడు రాజు.

25. కానీ, అప్పటికే భిక్షుక వృత్తి అవలంబించిన అంగులీమాలుడు, తనకు మూడు కాషాయ దుస్తులు ఉన్నాయి కనుక, ఇంకేమీ అవసరం లేదని రాజు గారికి చెప్పాడు.

26. రాజు గారు బుద్ధుని వద్దకు వెళ్ళి, నమస్కరించి, ఆయన పక్కన కూర్చుని, ఇలా అన్నాడు, "అద్భుతం, భగవాన్ అమితాశ్చర్యకరం. ఎవరికీ లొంగని వాడిని లొంగదీశావు. అణచివేయ లేని వాణ్ణి అణచివేశారు. ఆగ్రహావేశపరుడిని శాంతపరిచారు! నేను మారణాయుధాలతో కూడా ఇతన్ని అణచివేయలేక పోయాను. కానీ ఏ ఆయుధం లేకుండా మీరు అతన్ని లొంగదీశారు! ఇక నాకు అనుమతిస్తే, నేను వెళ్తాను. నేను చేయవలసిన పనులు చాలా ఉన్నాయి."

27. " ప్రభువుల ఇష్టం" అన్నాడు తథాగతుడు. రాజు గారు లేచి బుద్ధునికి అభివాదం చేసి వెళ్ళిపోయారు.

28. ఒకనాడు, కాషాయ వస్త్రాలు ధరించి, భిక్షుక పాత్ర చేత బట్టి అంగులీమాలుడు శ్రావస్తిలో భిక్షాటనకై వెళ్ళగా, వీధిలో ఒకడు అతనిపై మట్టి పెళ్ళ విసిరాడు. మరొకడు కర్ర విసిరాడు వేరొకడు విరిగిన కుండ ముక్కలు విసిరాడు. విరిగిన భిక్షాపాత్రతో, తల నుండి ఏకధారగా కారుతున్న రక్తంతో, చిరిగిన దుస్తులతో, అంగులీమాలుడు తిరిగి విహారానికి వచ్చి బుద్ధుని ఎదుట నిలిచాడు. అతన్ని చూసి భగవానుడు. " అన్నిటినీ సహించు, అన్నిటినీ సహించు " అన్నాడు.

29. ఈ విధంగా దోపిడీ దొంగ అయిన అంగులీమాలుడు బుద్ధుని బోధనలు స్వీకరించి, ధర్మ వర్తనుడయ్యాడు.

30. విముక్తివల్ల కలిగిన ఆనందాతిశయాన్ని వ్యక్తంచేస్తూ, జిజ్ఞాస లేని చోట జిజ్ఞాస ప్రదర్శించేవాడు, సచ్ఛీలంతో గతానికి స్వస్తిచెప్పేవాడు, యౌవ్వనంలోనే బుద్ధుని ఆశ్రయించినవాడు, చంద్రుని వలె భూమిని కాంతివంతం చేస్తాడు.

31. "నాపై శత్రుభావంగలవారంతా ఈ సూక్తులు వినండి. ఈ ధర్మపథాన్ని అనుసరిస్తే అందరూ జ్ఞానసంపన్నులవుతారు. ప్రేమసందేశమైన సహనాన్ని అలవరచుకుని యావజ్జీవితం దానికి కట్టుబడిఉండండి.

32. " అంగులీమాలునిగా, దోపిడీ దారునిగా పతనమౌతున్న నన్ను భగవానుడు ఉద్ధరించాడు. "అంగులీమాలునిగా" నేను రక్తంలో తడిసాను ఇప్పుడు తరించాను."

## 3. ఇతర నేరస్థుల దీక్ష

1. రాజగ్రహకి దక్షిణంగా ఒక ఎత్తైన పర్వతం ఉండేది.

2. ఈ పర్వతసానువుల నుంచి, దక్షిణ భారతదేశానికి దారితీసే మార్గం ఉండేది.

3. అక్కడ ఐదు వందలమంది దోపిడీ దొంగలు ఉండేవారు. ఆ త్రోవనవెళ్ళే ప్రయాణీకులను చంపి, వారి వస్తువులు అపహరించడం ఈ దొంగల వృత్తి.

4. వీరిని తుదముట్టించడానికి రాజుగారు ఎన్నిసార్లు సైన్యాన్ని పంపినా, వారు తప్పించుకునేవారు.

5. పొరుగునే నివసిస్తున్న బుద్ధుడు, ఈ దొంగలకు తమ వృత్తి లోని నైచ్యం తెలియటం లేదనీ, తన బాధలు వారిదృష్టికి రావడం లేదనీ గ్రహించి, తను వారిని కలుసుకోవడానకి వెళ్ళాలని నిర్ణయించుకున్నాడు.

6. ఇలా అనుకుని, ఒక సంపన్నుని వేషం ధరించి, కత్తి, బాణము చేతబట్టి, వెండి, బంగారు, సంచులతో, అశ్వారూఢుడై బుద్ధుడు ఆ దారిన ప్రయాణమయ్యాడు.

7. దోపిడీ దొంగల స్థావరం సమీపించగానే, అశ్వం పెద్దగా సకిలించింది. ఈ ధ్వనివిన్న ఐదువందల మంది దొంగలు వచ్చి ఆయన్ని చూసి, "ఇంత డబ్బు మనకు ఏ నాడు దొరకలేదు. పదండి అతన్ని పట్టుకుందాం" అంటూ ముందుకు వచ్చారు.

8. బాటసారి తప్పించుకోకుండా ఉండేందుకు వారు అతన్ని చుట్టుముట్టారు. అయితే ఆయన్ని చూడగానే అందరూ తమంతటతాము మోకరిల్లారు.

9. ఏ పరమాత్ముడీయన, ఏ పరమాత్ముడూ? అని అబ్బురపడిపోయారు.

10. తథాగతుడు వారితో, ఇతరులకు మీరుకలిగించే బాధలు, గాయాలు, ప్రపంచ పరివ్యాప్తమైన దుఃఖంతో సందేహాలతో, అవిశ్వాసంతో, పోల్చిచూస్తే చాలా అల్పమైనవనీ, ధర్మసూక్తులు ఆలపించడం వల్ల ఈ బాధలు ఉపశమిస్తాయనీ చెప్పాడు. ఆ తర్వాత ఆయన ఇలా అన్నాడు.

11. "దుఃఖంకంటే బాధాకరమైన గాయం మరేదీ లేదు. మూర్ఖత్వం కంటే తీవ్రంగా గుచ్చుకునే బాణమేదీ లేదు. ధర్మబోధిని ఆలకించడమే దీనికి సరైన ఔషధం. దీనివల్లే అంధులకు చూపు అజ్ఞానులకు జ్ఞానం కలుగుతాయి.

12. "కళ్ళు లేనివారికి ఈ ప్రబోధమే చూపై, మార్గం చూపుతుంది."

13. "అవిశ్వాసాన్ని పోగొట్టి, దుఃఖాన్ని పరిహరించి, ఆనందాన్ని పంచేది ఈ ధర్మబోధే. దీన్ని ఆలకించిన వారే అందరికంటే విజ్ఞులు."

14. "ఇటువంటి జ్ఞానం సంపాదించిన వారు అత్యంత పూజనీయులు."

15. ఈ ప్రవచనం విన్నదోపిడీదొంగలు తమ పాపాకింతమైన జీవితానికి పశ్చాత్తాపం చెందారు. వెంటనే వారి గాయాలు నయమైనాయి.

16. ఆ తర్వాత వారు బుద్ధుని శిష్యులై, ప్రశాంత జీవనం గడిపారు.

## 4. దీక్ష ప్రసాదించడంలో ప్రమాదాలు

1. పూర్వం ఒకప్పుడు రాజగ్రహానికి ఐదువందల యోజనాల దూరంలో ఒక పర్వత ప్రాంతంలో తథాగతుడు నివసిస్తుండేవాడు. ఈ పర్వతాల్లో నివసిస్తున్న 122 మంది గల ఒక తెగవారు వేటాడి జంతుమాంస భక్షణం చేసేవారు.

2. పురుషులు వేటకై వెళ్ళిన సమయంలో బుద్ధుడు వారి యిళ్ళకు వెళ్ళి స్త్రీజనానికి ధర్మబోధ చేసేవాడు.

3. "మానవత్వం ఉన్నవాడు ఎవరినీ చంపడు (లేదా చంపడం మానవ లక్షణం కాదు) అతను ఎప్పుడూ జీవితాన్ని పరిరక్షించేవాడే."

4. "ఈ సూత్రం వినాశనం లేనిది. దీన్నిఆచరించే వారికి ఏ విపత్తూ రాదు.

5. సౌమ్యత, ప్రాపంచిక విషయాల పట్ల అనాసక్తత, ఎవరినీ బాధించక పోవడం, ఆగ్రహం చెందక పోవడం. ఇవే బ్రహ్మలోకపు లేదా బ్రహ్మదేవుని లక్షణాలు.

6. బలహీనులపట్ల ప్రేమ చూపడం, బుద్ధుని బోధనలకు అనుగుణంగా పవిత్రజీవనం గడపడం, తనకు అవసరమైనంత వరకే దేన్నయినా స్వీకరించడం, దేన్ని ఎప్పుడూ ఆపాలో తెలుసుకోవడం, దీనివల్లే పునర్జన్మను, మృతిని తప్పించుకోవచ్చు".

   ఈ పలుకులు విన్న స్త్రీలు ధర్మపథగాములయ్యారు. పురుషులు వేటనుంచి తిరిగిరాగానే, జరిగిందంతా తెలుసుకొని బుద్ధుని చంపాలనుకున్నారు. కానీ భార్యలు వారిని నిగ్రహించారు. ఆ తర్వాత బుద్ధుని బోధలు వినివారుకూడా దీక్షాబద్ధులయ్యారు.

7. అనంతరం తథాగతుడు ఈ విధంగా పలికాడు.

8. "దయతో, సకలప్రాణులపట్ల కనికరంతో వ్యవహరించే వారికి పదకొండు ప్రయోజనాలు సిద్ధిస్తాయి."

9. "అతని శరీరం ఎప్పుడూ ఆరోగ్యంగా ఉంటుంది. అతనికి ప్రశాంతంగా నిద్రపడుతుంది. అధ్యయనంలో ఏకాగ్రత ఉంటుంది."

10. "అతనికి పీడ కలలు రావు. దేవతలు అతన్ని రక్షిస్తారు, మనుషులు ప్రేమిస్తారు. విషప్రాయమైనవి అతని దరిచేరవు. యుద్ధాల హింస అతన్ని తాకదు. అగ్నివల్లగానీ, జలంవల్లగానీ అతనికి ఎలాంటి అపాయం కలుగదు.

11. ఎక్కడ జీవించినా, సఫలజీవితం గడుపుతాడు. మరణానంతరం బ్రహ్మలోకానికి వెళ్తాడు. ఇవి పదకొండు సిద్ధులు."

12. ఈపలుకు అనంతరం అక్కడి స్త్రీ పురుషులు దీక్షస్వీకరించి ప్రశాంతిపొందారు.

# మూడవ అధ్యాయం

# బుద్ధుడు ఏమి బోధించాడు?

1వ భాగం - తన ధమ్మంలో తన స్థానం

2వ భాగం - బౌద్ధధమ్మంపై వివిధ అభిప్రాయాలు

3వ భాగం - ఏది ధమ్మం ?

4వ భాగం - ధమ్మం కానిది ఏది?

5వ భాగం - ఏది సద్ధమ్మం?

## మొదటి భాగం

# తన ధమ్మంలో తన స్థానం

1. బుద్ధుడు తనదైనధమ్మంలో తానేస్థానం కోరలేదు

2. మోక్షం ఇస్తానని బుద్ధుడు వాగ్దానం చేయలేదు. తాను మోక్షదాతను కానని మార్గదాతనని చెప్పాడు.

3. బుద్ధుడు తనకుగాని, తన ధమ్మానికిగాని ఎటువంటి దైవత్వాన్ని ఆపాదించలేదు. అది మానవుడికొరకు మానవుడే కనుగొన్నాడు. అది సాక్షాత్కరించింది గాదు.

# I. బుద్ధుడు తనదైన ధమ్మంలో తానే స్థానం కోరలేదు.

1. క్రీస్తుమతానికి తానే ప్రవక్తనని క్రీస్తు ప్రకటించుకున్నాడు.
2. తాను దేవుని కుమారుడననికూడ ప్రకటించుకున్నాడు.
3. క్రీస్తును దేవుని కుమారుడని అంగీకరించని ఏ వ్యక్తికీ పరలోకరాజ్యం లభించదని క్రీస్తు షరతు విధించాడు.
4. క్రీస్తును ప్రవక్తగాను, దేవుని కుమారునిగాను అంగీకరించడంపైనే మోక్షం ఆధారపడి ఉందని చెప్పడంద్వారా క్రీస్తు తనకుతాను ఒక స్థానాన్ని ఏర్పరచుకున్నాడు.
5. ఇస్లాం మతప్రవక్తయైన మహమ్మద్ తనను దేవదూతగా ప్రకటించుకున్నాడు.
6. మోక్షసాధనకోరేవారు రెండు షరతులు విధిగా పాటించితీరాలన్నాడు.
7. ఇస్లాంమతంద్వారా మోక్షం పొందగోరేవారు మహమ్మద్‌ను దేవదూతగా అంగీకరించి తీరాలి.
8. ఇస్లాంమతంద్వారా మోక్షం పొందగోరేవారు మహమ్మద్‌ను ఆఖరుప్రవక్తగా అంగీకరించి తీరాలి.
9. ఈ రెండు షరతులను విశ్వసించినవారికిమాత్రమే ఇస్లాంమతం ద్వారా మోక్షం లభిస్తుందని ప్రకటించాడు.
10. దేవదూతగా తానుకరుణిస్తేనే మోక్షం లభిస్తుందని మహమ్మద్ చెప్పడం ద్వారా ఆ మతానికి తానే ఆరాధ్యుడుగా స్థానంకల్పించుకున్నాడు.
11. అటువంటి షరతులను బుద్ధుడు ఎన్నడూ విధించలేదు.
12. శుద్ధోదన మహామాయ దంపతులకు జన్మించిన సాధారణ మానవుడనే కాని వేరుకాదని బుద్ధుడు ప్రకటించాడు.
13. క్రీస్తు, మహమ్మద్‌లవలె బుద్ధుడు తనకొక ప్రత్యేకస్థానమంటూ కల్పించుకొని మోక్షసాధన పేరుతో ఎలాంటి షరతులు విధించలేదు.
14. ఆ కారణంగానే బౌద్ధధర్మం విస్తారమైనదైనప్పటికీ అందులో బుద్ధుని ప్రస్తావన అతి తక్కువ గానే వుంది.
15. రాజ గ్రహాలో బుద్ధుడు మరణించిన తరువాతే తొలిసారిగా గుడి ఏర్పాటయినట్లు మనకు

16. కాశ్యపుడు గుడికివచ్చిన జనసమూహానికి అధ్యక్షత వహించాడు. బుద్ధుడు మరణించేవరకూ ఆయనతోకలిసి సంచారంచేస్తూ వెంటఉన్న కపిలవస్తువాసులు ఆనందుడు, ఉపాలి తదితరులు ఆ సమూహంలో ఉన్నారు.

17. అయితే అధ్యక్షుడైన కాశ్యపుడు ఏంచేశాడు?

18. అతను బౌద్ధధమ్మ సూత్రాలను వల్లించవలసిందిగా ఆనందుని కోరాడు. ప్రతిసూత్రాన్ని జనసమూహం ముందుంచి ఇవి సక్రమంగా వున్నదా ?" అని ప్రశ్నించాడు. వారు సక్రమమేనని ఏకగ్రీవంగా అంగీకరించిన మీదటే దాన్ని ఆమోదించారు.

19. ఆ తరువాత వినయసూత్రాలను వల్లించవలసిందిగా ఉపాలిని కోరాడు. ఉపాలి వల్లించిన ప్రతిసూత్రాన్ని సభికుల ముందుంచి "ఇది సక్రమంగా వున్నదా?" అని ప్రశ్నించి వారది సక్రమమేనని ఆమోదించిన మీదనే దాన్ని అంగీకరించారు.

20. అనంతరం కాశ్యపుడు బుద్ధుని జీవితవిశేషాలను వివరించమని జనసమూహంలోని ఎవరినైనా కోరివుండవచ్చు.

21. కానీ కాశ్యపుడు అలాచేయలేదు. ఎందుకంటే సంఘానికి సంబంధించినంతవరకు ఈ రెండు పిటకాలు మాత్రమే ముఖ్యమైనవని అతడు భావించాడు.

22. కాశ్యపుడు బుద్ధుని జీవితంలోని సంఘటనలను సేకరించి భద్రపరచినట్లయితే యీనాడు మనకు బుద్ధుని జీవితచరిత్ర సమపూర్ణంగా లభ్యమైఉండేది.

23. అయితే బుదుని జీవితవిశేషాలనుసైతం గ్రంధస్తం చేయించాలని కాశ్యపుడు ఎందుకు భావించలేదు?

24. అది అలక్ష్యం కాజాలదు. ఎవరయినా దానికిఇవ్వగల సమాధానం ఒక్కటే. బుద్ధుడు తన ధర్మంలోనే తనకు ఎలాంటి స్థానాన్ని ఆపాదించుకొని వుండకపోవడమే.

25. బుద్ధుడు వేరు బౌద్ధ ధర్మం వేరు.

26. బుద్ధుడు తన తరువాత వారసుని నియమించడానికి తిరస్కరించడమే తనకంటూ తన ధర్మంలో ప్రత్యేకస్థానమేది లేదనేందుకు మరొక దృష్టాంతం.

27. బుద్ధుని అనుయాయులు వారసుని నియమించవలసిందిగా రెండు మూడు పర్యాయాలు కోరారు.

28. ప్రతిసారి బుద్ధుడు తిరస్కరించాడు.

29. "ధర్మానికి వారసుడు ధర్మమే"నని సమాధానమిచ్చాడు.

30. సిద్ధాంతం దాని అంతట అదే జీవించాలి కాని మానవుని అధికారానికి లోబడికాదు".

31. మానవుని అధికారానికి లోబడి మనగలిగేది సిద్ధాంతం కాజాలదు.

32. ధర్మాన్ని నడిపించడానికిక ప్రతిసారి ఆ ధర్మ సంస్థాపకుని పేరును ప్రస్తావించవలసి వచ్చినట్లయితే అది ధర్మమే కాదు.

33. బుద్ధుడు తన ధమ్మంలో తన స్థానయేమిటన్న విషయమై వెలిబుచ్చిన దృష్టి యిది.

## 2. బుద్ధుడు మోక్షం ప్రసాదిస్తానని వాగ్దానం చేయలేదు. తాను మార్గదాతనే కాని మోక్షదాతనుకాను అని చెప్పాడు.

1. మతాలు చాలావరకు దైవప్రకటితమైనవిగానే వర్ణింపబడ్డాయి. కాని బుద్ధ ధర్మం అట్లా ప్రకటింపబడిందిగాదు.

2. ఒక మతం దైవదత్తమైనదని చెప్పడానికిగల కారణం, "ప్రాణులు తమని సృష్టించిన వానిని (దేవుని) పూజించమని, తద్వారానే వారి ఆత్మలకు విముక్తి అని వారికి దేవుని సందేశం అందటమే.

3. (దేవుని సందేశం) ఒకప్రవక్త ద్వారా దేవుడు ప్రజలకు తెలియపరచాడని చెప్పబడుతుంది. అప్పుడే అది మతముగా పిలువబడుతుంది.

4. ఆ సందేశాన్ని విశ్వసించినవారికి మాత్రమే ఆ ప్రవక్త మోక్షం ప్రసాదిస్తాడు.

5. ఆ ప్రవక్త ప్రకటించినవిధంగా విశ్వాసంతో వాటిని ఆచరించడం ద్వారా వారి ఆత్మలు నరకానికిపోకుండ స్వర్గానికివెళతాయి కాబట్టి ఆ ప్రవక్త దేవునిచే పంపబడినవాడని నమ్మితీరాలి.

6. బుద్ధుడు తాను ప్రవక్తననిగాని, దేవదూతననిగాని చెప్పుకోలేదు. అలాంటి అభిప్రాయాన్ని తాను తీవ్రంగా ఖండించాడు.

7. బౌద్ధ ధర్మం ప్రత్యేకత ఏమంటే, దాన్ని పరిశోధనద్వారా అన్వేషించి కనిపెట్టడం. అందుచేత దైవప్రేరితమని చెప్పే సిద్ధాంతాలతోగూడిన మతానికి దీనికి గల తేడా చాలా ప్రముఖమైనది.

8. భూమిపై మానవుని జీవనగమనం ఎలావుంటుందీ పరిశీలించి, పరిశోధించిన, ఫలితంగా బౌద్ధధర్మాన్ని ఒక అన్వేషణగా చెప్పవచ్చు. మానవుడు పుట్టుకతోబాటు సంతరించుకొన్న స్వాభావిక లక్షణాలేమిటి? చారిత్రక, సాంప్రదాయక కారణాలవలన అతని స్వభావంలో ఎలాంటి మార్పులేర్పడతాయి? ఎలా అవి తనకు హాని కలిగించాయో విచారణచేసి పరిశోధించడంద్వారా ఆ అన్వేషణ సాధ్యమైంది.

9. ప్రవక్తలని పేరుపొందినవారంతా మోక్షమిస్తామని వాగ్దానం చేశారు. అలా చెప్పని బోధకుడు బుద్ధుడు మాత్రమే. బుద్ధుడు "మోక్షదాత", "మార్గదాత"ల మధ్యగల భేదాన్ని స్పష్టంగా తెలయచేశాడు.

10. తాను మార్గదాతను మాత్రమేనని, దానిననుసరించి మోక్షము సాధించటం ఎవరికి వారుగ చేసేసాధనపై ఆధారపడి వుంటుందని చెప్పాడు.

11. భిక్షువుగా మారిన బ్రాహ్మణ మొగ్గలన్నకు బోధించిన సూత్రంలో దీన్నిగురించి యిలా చెప్పారు.

12. ఒకప్పుడు భగవానుడు శ్రావస్తిలోని తూర్పువైపు వనంలోగల మిగరుడి తల్లి యింట ఉంటూఉండేవాడు.

13. అప్పుడు రాజప్రసాదంలో గణాధికారిగావున్న మొగలన్న యనే బ్రాహ్మణుడు అయన్ను దర్శించి, సవినయంగా నమస్కరించి క్షేమసమాచారం అడిగిన తరువాత ఒక వైపుగా ఆసీనుడైనాడు. అప్పుడు మొగ్గలన్న బుద్ధునిలా ప్రశ్నించాడు.

14. "ఓ గౌతమ గురువర్యా! మీరు వుంటున్న యీ ఇంటిపైకి వెళ్ళేందుకై నిర్మింపబడిన మెట్లను ఒక్కొక్కదానినే ఎక్కుకుంటూ వెళ్ళవలసినట్లే మా బ్రాహ్మణులు వేదాధ్యయనం ద్వారా ఒకొక్క దశను అధిగమిస్తూపోవాల్సి వుంటుంది.

15. "గౌతమా ! విలువిద్యలో క్షత్రియునికి దశలవారి శిక్షణ ఇచ్చినట్లుగానే మా బ్రాహ్మణులకు సైతం వేదవిద్యను దశలవారిగా నేర్పుతారు. ఉదాహరణకు పిల్లలకు గణితం ప్రారంభించినపుడు.

16. ఒకటిని ఒక్కసారి, రెండును రెండు సార్లు, మూడును మూడుసార్లు, నాలుగును నాలుగుసార్లు, అలా వందవరకు పలికిస్తాము. అయితే ఓ గౌతమా! మీ అనుయాయులకు మీరు ధర్మబోధన చేసేటప్పుడుగూడా ఆ విధంగానే బోధిస్తారా?"

17. "అవును బ్రాహ్మణా! ఉదాహరణకు, అశ్వశిక్షకుణ్ణే గమనించు. సలక్షణమైన గుర్రాన్ని ఎక్కువ శ్రమపడనవసరం లేకుండానే మచ్చికచేసికొని స్వారీచేయగలుగుతాడు".

18. "అదేవిధంగా ఓ బ్రాహ్మణా! ధర్మశిక్షణకై ఎన్నికచేయబడిన మనిషిని తథాగతుడు "రమ్ము సోదరా ! గుణవిశిష్టతతో నీ తనువును, మనస్సును అదుపులో వుంచుకుని సాధన జేయుము" అంటాడు.

19. "మొదట నీ ప్రవర్తనను సక్రమపరచుకో. అలా చేసేటపుడు చిన్నవిగా కనిపించే పొరపాట్లు కూడ ప్రమాదకర పరిణామాలకు దారితీయగలవని గుర్తించు. అందుచేత నైతికవర్తన చాలా ముఖ్యమైనదని బోధించడం జరుగుతుంది."

20. "సాధకుడు అందులో పరిణతిపొందగానే తథాగతుడు రెండవపాఠం ప్రారంభిస్తాడు. "సోదరా! నీ కంటికి కనిపించేది రమణీయమై ఆకర్షించవచ్చు నిన్ను ఆకట్టుకోవచ్చు."

21. "ఆయితే ఆలాంటివారిపట్ల నీవు పరిశీలనా దృష్టినలవరచుకోవాలి. కంటికింపుగా కనిపించేవాటిపట్ల నీవు ఆకర్షితుడవైనట్లయితే నీవు నిగ్రహం కోల్పోయి ఆ ప్రవాహంలో కొట్టుకుపోతావు. అందుచేత నీ దృష్టిని అదుపులో వుంచుకోవడం చాలా ముఖ్యం.

22. "అలాగే తక్కిన యింద్రియాల విషయంలోకూడ అప్రమత్తత అవసరం. నీ చెవికి సోకే శబ్దం, నీ ముక్కు అఘ్రాణించే వాసన, నీ నాలుక చూసేరుచి, నీ వొంటికంటే స్పర్శాసుఖం, నీ మనసునాకర్షించే భావాలు వీటన్నిటినీ సునిశితంగా పరిశీలన చేయగలగాలి."

23. ఆ విధంగా సాధకుడు యింద్రియాలు అదుపులో వుంచుకోవడంలో పరిణితిపొందగానే మూడవ పాఠం మొదలవుతుంది."రా! సోదరా !నీవు స్వీకరించే ఆహారం విషయంలో ఎంతో జాగ్రత్తవహించు. ఏదో పటిష్టత కోసమో అతిగా భుజించేవారిలా కాకుండా కేవలం నీ శరీరం ఆరోగ్యవంతంగా వుంచుకోవడానికి ఎంత ఆహారం అవసరమో అంతే భుజించు. అది నీ శరీరానికి రక్షణకు, సధర్మవర్తనకు మాత్రమే అవసరం. ఆహార స్వీకరణలో నీకు ఏయేరకమవసరమన్నది నీవే ప్రశ్నించుకోవడం అలవరచుకో.

24. ఆ శిక్షణలో పరిణితి పొందగానే తథాగతుడు మరోపాఠం మొదలు పెడతాడు "రా సోదరా! పగటిపూట నీవు నడచేటప్పుడు, లేక ఒక చోట కూర్చున్నపుడు, నీ హృదయాన్ని క్షాళన పరచుకో ఎలాంటి బలహీనతలకు అవకాశంఇవ్వకు. రాత్రిసమయంలో కూడ నీవు నడుస్తున్నా, ఒక చోట కూర్చున్నా ఎలాంటి దురాలోచనలు రానివ్వకు. సింహంవలె కుడివైపునేపడుకొని నిద్రించు. అపుడు ఒక కాలు మరో కాలిపైనే వుంచుకో. అపుడు నీ ఆలోచనలు, భావాలు ఎంతో నిర్మలమైనదిగా వుండాలి. మూడవ జామున నీవు నిద్రలేచి నడకసాగిస్తూ హృదయం నిర్మలంగావుండేలా ఎలాంటి చెడుభావనలకు ఆస్కారమివ్వకుండ జాగ్రత్తవహించు."

25. ఓ బ్రాహ్మణా! ఆ విధంగా నడవడిక విషయంలో శిక్షణయిచ్చి అందులో పరిణితి పొందగానే తథాగతుడు మరోపాఠం మొదలెడుతాడు. "సోదరా! నీవిప్పుడు మనస్సును, నిగ్రహించుకోవడంలో సాధనచేయాలి. నీవు ముందుకు పోతున్నా, లేక వెనుకకు మరలినా నీ మనస్సును జాగ్రదావస్థలో వుంచుకో. అంగీ ధరించే సమయంలోగాని, భిక్షాపాత్రచేబూనునపుడుగాని, కూర్చున్నపుడుగానీ, నిలుచున్నపుడుగాని, నిద్రించే సమయంలోగాని, నడచేసమయంలోగాని, మాట్లాడునపుడుగాని, లేక మౌనంవహించినపుడు గాని, అన్ని సమయాల్లోను నిన్ను అదుపులో వుంచుకోవాలి.

26. ఆ విధంగా ఆత్మనిగ్రహంలో శిక్షణయివ్వడం పూర్తికాగానే తదాగతుడు తరువాత పాఠం ప్రారంభిస్తాడు "రమ్ము సోదరా! ఏకాంత జీవనం అలవాటు చేసుకో. అడవిలోగాని, ఏ చెట్లనీడలోగాని, కొండగుహల్లోగాని, గడ్డిమేటలపైగాని ఒంటరిగా గడపగలగాలి సాధకునికి అది అలవడగానే లభ్యమైన ఆహారం తీసుకుని పద్మాసనుడై పైనచెప్పిన నాలుగు నియమాలను సాధనచేస్తాడు.

27 బ్రాహ్మణా! ఆ విధంగా ధర్మానుసరణకై విచ్చేసే భిక్షువులు కఠోరనియమాలను సాధన చేసి మానసిక పరిపక్వత చెందుతారు.

28. "ఆసనాలను విడనాడి నియమబద్ధమైన జీవనం గడపగల్గిన అర్హులైన సోదరులు సకల బంధాలనుండి విముక్తిపొంది సమ్యక్‌దృష్టితో నిగ్రహంతో జీవితాలను పునీతం

చేసుకోగల్గుతారు."

29. బౌద్ధ సాధనావిధానం సాంతం విన్న బ్రాహ్మణుడైన మొగ్గలన్న భగవానుడితో యిలా అన్నాడు:

30. "అయితే ఓ గౌతమగురువర్యా! ఇంతటి శ్రేష్ఠమైన బోధకునిద్వారా శిక్షణ పొందే వారందరు ఆ నియమనిబంధనలను ఖచ్చితంగ పాటించి నిర్యాణం పొందుతారా లేక వారిలో కొందరు విఫలురవడం జరుగుతుందా?"

31. "ఓ బ్రాహ్మణా! శిక్షణపొందినవారితో కొందరు సఫలురుగావచ్చు. మరికొందరు విఫలురుగావచ్చు."

32. "అయితే అలా జరగటానికి కారణమేమిటో తెలుపగలరా, గౌతమ గురువర్యా! అది ఎలా సాధ్యమౌతుంది ? మీరు నిర్యాణమార్గం చూపుతున్నారు. మీ వంటి నిష్ణాతుల ద్వారా శిక్షణ పొందుతున్నారు గదా! అలాంటపుడు వారిలో కొందరు సాధించలేక పోవడం ఎందుకు జరుగుతుంది ?"

33. "బ్రాహ్మణా! అది నేను వివరించాల్సిన విషయమే. అయితే ముందు నిన్ను నేనొక ప్రశ్న అడుగుతాను. సమాధానం చెప్పు. నీవు తిన్నగ దారితప్పకుండా రాజగ్రహ నగరం చేరగలవుగదా ?"

34. "గౌతమ గురువర్యా! దారితప్పకుండ నేను రాజగ్రహ చేరగలను."

35. "నీవు రాజగ్రహ ు దారెటో చెబుతావు. కానీ బాటసారి పడమరగా పయనించి మరో చోటు చేరుకుంటాడు."

36. మరొకడు నిన్ను దారడుగుతాడు. మొదటివానికి చెప్పినట్లే యీ రెండవ వానికిగూడ రాజగ్రహకు ఎటువెళ్ళాలో చెబుతావు. వాడది గ్రహించి అటువైపే పయనించి రాజగ్రహ చేరకోగలుగుతాడు.

37. దారి చెప్పడం వరకేగదా నీ బాధ్యత?

38. అదే విధంగా బ్రాహ్మణా! తథాగతునికి సైతం ధర్మమార్గం చూపడమే బాధ్యత.

39. భగవానుడు మార్గదాతయేగాని మోక్షం వాగ్దానం చెయ్యరనటానిని యిది నిర్ధారిస్తున్నది.

40. అయితే ముక్తి అంటే ఏమిటి ?

41. మహమ్మద్, క్రీస్తు సిద్ధాంతాల సారం మోక్షం అనగా ప్రవక్త చెప్పినట్టే అనుసరించి నరకానికి పోకుండ స్వర్గానికి పోవడం.

42. కానీ బుద్ధుని ధర్మవిధానంలో ముక్తిఅనగా నిర్వాణం. నిర్వాణమనగా సకలవాంఛలను అదుపుచెయ్యటం.

43. అలాంటి ధర్మంలో మోక్షపు వాగ్దానం ఎట్లా ఉంటుంది?

# 3. బుద్ధుడు తనకుగాని, తన మతానికిగాని ఎటువంటి దైవత్వాన్ని ఆపాదించలేదు. అది మానవుడి కొరకు మానవుడే కనుగొన్నాడు. అది సాక్షాత్కరించిది కాదు.

1. ప్రతి మతస్థాపకుడు తనకుగాని, తన బోధనలకు గాని దైవత్వాన్ని ఆపాదించుకున్నాడు

2. మోజస్ తాను దేవుని పుత్రుడని ప్రకటించుకోక పోయినప్పటికీ, తన బోధనలు మాత్రం దైవప్రేరితమైనవని చాటుకున్నాడు. తన అనుయాయులు పాలు, తేనెలు ప్రవహించే ప్రాంతం చేరుకోవాలంటే తన బోధనలు ఖచ్చితంగా పాటించాలని, ఎందుచేతనంటే అది దేవుడైన యహోవా తనద్వారా ప్రకటింపచేశాడని తెలిపాడు.

3. యేసు క్రీస్తు తాను దేవుని కుమారుడనని చెప్పుకున్నాడు. క్రీస్తు తనకు దైవత్వాన్ని ఆపాదించుకున్నాడు. తదనుగుణంగా అతని బోధనలు దైవత్వాన్ని ఆపాదించుకున్నాయి.

4. కృష్ణుడు తాను దేవుడినని, భగవద్గీత తనచే చెప్పబడినదని చెప్పుకున్నాడు.

5. కానీ బుద్ధుడు తనకుగానీ, తన శాసనాలకుగానీ అలాంటి స్థాయి ఆపాదించుకోలేదు.

6. అందరు మానవులవలెనే తాను ఒక మానవుడినని, తాను బోధించే సూత్రాలన్నీ ఒక మానవుడు సాటి మానవునకు చెప్పేవి మాత్రమేనని తెలిపాడు.

7. తన బోధనలు దోషరహితాలనికూడా అతనెప్పుడూ అనలేదు.

8. తాను ప్రకటించిందల్లా, తాను విశ్వసిస్తున్నట్లు తన సూత్రాలు మానవ ముక్తికి దోహదం కాగలవని మాత్రమే.

9. జగత్తులో జీవనసరళి ఎలా ఉంటుందనే విశ్వజనీనమానవ అనుభవంపై తన ధర్మం ఆధారపడి ఉన్నదని చెప్పాడు.

10. అది వాస్తవమా కాదా అన్నది ఎవరైనా ప్రశ్నించవచ్చుననీ, తర్కించి పరిశీలన చేసి అది వాస్తవమో కాదో తెల్సుకోవచ్చునని తెల్పాడు.

11. అలా ఏ మతస్థాపకుడు తన మతాన్ని ప్రజల పరీక్షకు పెట్టలేదు.

# రెండవ భాగం

# బౌద్ధధర్మంపై వివిధ అభిప్రాయాలు

1. బుద్ధుని బోధనలను యితరులర్థంచేసుకొన్న విధానం
2. బుద్ధుడు తన ధర్మాన్ని వర్గీకరించిన వైనం

# 1. బుద్ధుని బోధనలను ఇతరులు అర్థంచేసుకున్న విధానం

1. "బుద్ధుని బోధనలు ఏమిటి?"
2. ఈ ప్రశ్నకు బౌద్ధులనబడేవారిలోను, బౌద్ధధర్మాన్ని అధ్యయనం చేస్తున్నవారిలోను విభిన్నధోరణులు వినవస్తున్నవి.
3. కొందరికి సమాధిసాధనే బౌద్ధధర్మ ప్రధాన సూత్రము.
4. మరి కొందరికి బౌద్ధధర్మంలో ఉపాసనే(ఒక రకమైనప్రాణాయామం) ప్రధానమైనది.
5. బౌద్ధధర్మం ఎంతో నిగూఢమైనదని కొందరు వాదిస్తే అది పూర్తిగా బాహాటమైందని మరి కొందరు వాదిస్తారు.
6. కొందరి దృష్టిలో యిది మెట్టవేదాంతం.
7. కొందరి దృష్టిలో ఇది కేవలం మార్మికం
8. కొందరైతే ఇది స్వార్థంతో ప్రపంచాన్నించి తప్పుకోవడం అన్నారు.
9. మానవునిలో సహజసిద్ధంగా ఏర్పడే కొన్ని ఉద్రిక్తతలను బలవంతాన అణచిపెట్టే సిద్ధాంతమని కూడాతేల్చారు.
10. ఈ విధంగా ఇంకా ఎందరో ఎన్నోరకాల వ్యాఖ్యలను ప్రచారం చేసారు.
11. బౌద్ధ ధర్మంపై ఇన్ని రకాలైన అభిప్రాయాలు వ్యక్తం కావటం ఆశ్చర్యకరమైన విషయమే.
12. కొన్ని భ్రమలున్నవారి అభిప్రాయాల్లో యివి కొన్ని.వారికి బౌద్ధసారం "సమాధి " లేదా "విప్పసన" లేదా రహస్యతంత్రం.
13. బౌద్ధధర్మం గురించి వ్రాసినవారిలో చాలామంది ప్రాచీన భారత చరిత్ర అధ్యయన పరులు. బౌద్ధాన్నిగురించి వారు అక్కడక్కడా ఆనుషంగికంగా తెలుసుకున్నారు.
14. అలా వ్రాసినవారిలో కొందరైతే బౌద్ధధర్మాన్ని అధ్యయనంచేసిన వారు గారు.
15. వారిలో కొందరు మతం పుట్టుపూర్వోత్తరాలకాధారమైన మానవశాస్త్రంతో పరిచయమైనా లేని వారు.
16. "బుద్ధుని బోధనలలో సామాజిక సందేశమేదైనా ఉన్నదా?" అన్న ప్రశ్న యిక్కడ ఉత్పన్న మవుతున్నది.
17. ఈ విషయాన్ని గట్టిగా ప్రశ్నించినట్లయితే బౌద్ధధర్మాన్ని అధ్యయనం చేసేవారు రెండు

అంశాలు సమాధానంగా చెబుతారు.

18. "బుద్ధుడు అహింసను బోధించాడు"

19. "బుద్ధుడు శాంతిని బోధించాడు"

20. ఇంకా అడగండి "అయితే బుద్ధుడు మరేయితర సామాజిక సందేశమైనా యిచ్చాడా?"

21. "బుద్ధుడు న్యాయాన్ని పాటించమని బోధించాడా?"

22. బుద్ధుడు ప్రేమని బోధించాడా?"

23. "బుద్ధుడు స్వేచ్ఛని బోధించాడా?"

24. "బుద్ధుడు సమానత్వాన్ని బోధించాడా?"

25. "బుద్ధుడు సౌభ్రాతృత్వాన్ని బోధించాడా?"

26. "బుద్ధుడు కారల్ మార్క్స్‌ను సమాధానపరచ గలడా?"

27. బౌద్ధధర్మంపై చర్చలో పై ప్రశ్నల్ని సాధారణంగా ఎవరూ వెయ్యరు.

28. కానీ నా పరిశీలనప్రకారమైతే బౌద్ధధర్మంలో సాంఘిక సందేశం ప్రధానమైనది. ఈ ప్రశ్నలన్నింటికీ బౌద్ధధర్మంలో సమాధానంలభిస్తుంది. అయితే యిటీవలి శాస్త్రకారులు వీటిని భూస్థాపితంచేశారు.

## 2. బుద్ధుని స్వంత వర్గీకరణం

1. బుద్ధుడు తన ధమ్మానికి వేరే వర్గీకరణ పాటించాడు.

2. ఈ వర్గీకరణంలో "ధమ్మం" మొదటిది.

3. అతడు యిచ్చిన కొత్త వర్గం "అధమ్మ" (ధర్మంకానిది). అయినా అది ధమ్మంగానే చలామణి అయింది.

4. "సద్ధమ్మ" పేరున మూడోవర్గం అతడు సృష్టించాడు.

5. మూడవవర్గం "ధమ్మ" తత్వానికి మరొక పేరు.

6. "ధమ్మ" , "అధమ్మ", "సద్ధమ్మ" అనే ఈ మూటిని క్షుణ్ణంగా అర్థం చేసుకున్నప్పుడే బౌద్ధధర్మం అవగతమౌతుంది.

# మూడవ భాగం

# ఏది "ధమ్మం"

1. స్వచ్ఛమైన జీవితం గడపడమే ధమ్మం.
2. జీవితంలో సంపూర్ణత్వాన్ని పొందడమే
3. "నిబ్బాన" మార్గంలో జీవించడం
4. గాఢమైన కోరికలను వదలివేయడమే
5. భౌతికవిషయాలు అనిత్యమైనవని నమ్మడమే
6. "కర్మయె" నీతిమార్గానికి ఉపకరణమని నమ్మడమే ధమ్మం

# 1. స్వచ్ఛమైన జీవితం గడపడమే ధమ్మం

1. స్వచ్ఛతలో మూడు రీతులువున్నాయి. వాటిలో శారీరక స్వచ్ఛత అనగా ఎట్టిది?

2. శారీరక స్వచ్ఛత అనగా హత్య చెయ్యకుండా, దొంగతనం చేయకుండా, పాపపంకిలమైన జీవితం గడపకుండాఉండాలి

3. వాక్కుల్లో స్వచ్ఛత ఎటువంటిది?

4. "అసత్యమాడకుండ ఉండాలి"

5. "మానసిక స్వచ్ఛత అనగా ఏమి?"

6. "భిక్షువు ఉంటాడు, అతనిలో మానసికంగా కోరికలు కలిగినట్లయితే వెంటనే గ్రహించి "నాలో మానసిక వాంఛలేర్పడి ఉన్నవని" జాగ్రత్త వహిస్తాడు. అలాంటివి లేకపోయినా అతడు గ్రహించగలడు. అలాంటి మానసిక వాంఛలేర్పడినట్లయితే వెంటనే జాగ్రత్తపడి వాటిని విడనాడతాడు. భవిష్యత్తులో అలాంటి వాంఛలకాస్కారమివ్వకుండా శ్రద్ధ వహిస్తాడు.

7. తాను ఒకరికి హాని తలపెట్టినట్లయితే, అతను వెంటనే గ్రహిస్తాడు, "నాలో హాని తలపెట్టే స్వభావం ఉంది" అని. అలాగే ఆ స్వభావం తలెత్తటం, దానిని అణచి వేయడం, భవిష్యత్తులో అది తిరిగిజరగకుండా ఉండటంలాంటివి కూడ గ్రహించి జాగ్రత్తపడతాడు.

8. తనలో సోమరితనం, జడత్వం, ఉద్రిక్తత, దుందుడుకుతనం ఉన్నట్లు గ్రహిస్తే వెంటనే జాగ్రత్తపడతాడు. తనలో ఏదైనా అనుమానంగానీ, చలించే స్వభావంగానీ ఏర్పడినట్లయితే వాటిని పసిగడతాడు. అలాగే వాటిని తలెత్తకుండా అణచివేసి, భవిష్యత్తులో తిరిగి అలాంటివిరాకుండా జాగ్రత్తపడతాడు. దీనినే "మానసిక స్వచ్ఛత" అంటారు.

9. మనోవాక్కాయకర్మలందు స్వచ్ఛతకలిగి, పాపరహితుడై పరిశుభ్రంగా, పవిత్రంగా రూపొందినవాడు "పాపప్రక్షాళితుడు"గా బిరుదు పొందుతాడు.

(ii)

1. "స్వచ్ఛత మూడు రకాలు. శారీరక, మౌఖిక, మానసిక"

2. "శారీరక స్వచ్ఛత అంటే ఏమి?"

3. "జీవహింసకు పాల్పడకుండా, యితరుల సొమ్ము ఆశించకుండా, పాపహేతువైన వాంఛలకు లోనుకాకుండా జీవించగలగడమే శారీరక పవిత్రత."

4. "మాట స్వచ్ఛత అంటే ఏమి?"
5. "అసత్య మాడకుండా, వదరుబోతుగా కాకుండా జీవించడమే."
6. "మానసిక స్వచ్ఛత అంటే ఏమి?"
7. "హృదయంలో దురాశకుగానీ, ద్వేషానికిగానీ తావివ్వక న్యాయదృష్టినలవరచుకోవడం ద్వారా మానసిక స్వచ్ఛత ఏర్పడుతుంది. ఈ విధంగా శారీరక, వాక్, మానసిక స్వచ్ఛత లేర్పడతాయి."

(iii)

1. "సాధనలోపం ఏర్పడేందుకు ఐదు విధాలైన బలహీనతలు కారణమవుతాయి. అవి ఏవి?"
2. "ప్రాణహానికి పాల్పడటం, యివ్వబడని దానిని సంగ్రహించడం, కాముకత్వం, అసత్యమాడటం, మత్తు పదార్థాలను సేవించి సోమరితనానికి ఆస్కారం కల్పించుకోవడం ఈ ఐదు బలహీనతలు."
3. మానవపతనావస్థకు ఈ అయిదు బలహీనతలు కారణం.
4. ఈ అయిదు బలహీనతలనుండి పూర్తిగా దూరంకావాలంటే మనస్సును నాలుగు విధాలుగా స్వాధీనపరచుకోవలసి ఉంటుంది.
5. సన్యాసి సాధారణంగా ప్రపంచంలో కనిపించే అసంతృప్తి, దురాశలకు దూరమై జీవిస్తూ, మానసికశక్తిని చాలాపటిష్టంగా అదుపులో ఉంచుకోవాలి.
6. సద్భావనా చింతన చేయాలి.
7. చిత్తాన్ని చిత్తంగానే మధించాలి.
8. మనస్సును ఎంతో స్థిరమైనపద్ధతిలో అదుపుచేసుకుంటూ దురాశ, అసంతృప్తులకు ఎలాంటి అవకాశమివ్వకుండ సాధనచేయాలి.
9. ఈ నాలుగు విధాలుగా జాగ్రత్తవహించడంద్వారా ఐదు బలహీనతలను పూర్తిగా తొలగించుకోగలగాలి.

(iv)

1. నైతికవైఫల్యం, మానసికవైఫల్యం, దృక్పథవైఫల్యం అనేవి మూడు.
2. నైతికవైఫల్యం అంటే ఏమిటి? ప్రాణహింస, దొంగిలించడం మానసికంగా పాపకార్యాలకు పాల్పడడం, అబద్ధమాడడం, సాటివారిని కించపరచడం, దురుసుగా మాట్లాడడం, క్రియాశూన్యుడై వాగడం ద్వారా మానవుడు నైతికపతనం చెందుతాడు.

3. మానసికవైఫల్యం అంటే ఏమిటి?

4. హృదయంలో అత్యాశకు, దుష్కృత్యానికి తావివ్వడంద్వారా మానసికవైఫల్యం ఏర్పడుతుంది.

5. దృక్పథవైఫల్యం అంటే ఏమిటి?

6. ఒకడు భ్రష్టుడై, విచలిత మనస్కుడై యితరులకు దానంచెయ్యడం వలనగాని, త్యాగం వలనగాని, వుదారత వలనగాని ఎలాంటి ఫలితంగాని, ప్రయోజనంగాని లభించదనీ, మంచిచేసినా చెడుచేసినా ఒక్కటేనని అసలీ ప్రపంచమే మిథ్యయని, ఈ ప్రపంచాన్ని మించి మరేదీలేదని, తల్లిదండ్రులు మరెవ్వరూ స్వచ్ఛందంగా పుట్టినవారు కారని, ఉన్నతిని పరిపూర్ణత్వాన్ని సాధించి తమ శక్తులతో పైలోకాల్ని పొంది ఆ విషయం ప్రకటించిన బ్రాహ్మణులు, తపస్వులు ఎవరూ లేరని భావిస్తాడు. శ్రమణులారా, యిదే దృక్పథవైఫల్యం.

7. ఓ శ్రమణులారా! ఈ నైతిక, మానసిక, దృక్పథవైఫల్యాలవల్ల చనిపోయిన తర్వాత శరీరం తిరిగి దుఃఖకారణమైన వర్ధంలో, పతనంలో, నరకంలో పునర్జన్మ పొందుతుంది. ఇదీ త్రివిధ వైఫల్యాలు.

8. ఓ శ్రమణులారా! జీవితంలో మూడు సాఫల్యాలున్నాయి. అవి: నైతిక, మానసిక, దృక్పథ సాఫల్యాలు.

9. నైతికవిజయం స్వరూపస్వభావాలేమిటి?

10. ప్రాణహింసకు, అబద్ధాలకు, దొంగతనాలకు దూరంగా జీవించగల్గడం నైతికవిజయం.

11. మానసికవిజయం ఎలాంటిది?

12. దురాశకు, దుర్బుద్ధికి తన హృదయంలో తావివ్వక మనగల్గితే తాను మానసికవిజయం సాధించినవాడౌతాడు.

13. దృక్పథవిజయం అంటే ఏమిటి?

14. ఒకడు ఉదారుడై, త్యాగనిరతికల్గి, ఇతరులకు సహాయపడుతూ, మంచికార్యాలు చేయడంవలన సత్ఫలితాలు, చెడుకార్యాలు చేయడంవలన దుష్ఫలితాలు ఏర్పడుతాయని గుర్తెరిగి, ఈ ప్రపంచం వాస్తవికమైనదనీ, ఈ ప్రపంచానికిమించిన పై లోకం ఉన్నదనీ, తల్లిదండ్రులకు, తదితరులకు స్వచ్ఛందజన్మం ఉందనీ, ఊర్ధ్వ లోకాల్ని పొందిన తాపసులు, బ్రాహ్మణులు ఉన్నారని, ఆ సంగతినివారు ప్రకటించ గలిగారని తెలుసుకుంటాడు. శ్రమణులారా! ఇది దృక్పథసాఫల్యం.

15. ఈ విధంగా నైతికంగాను, మానసికంగాను, దృష్టిపరంగాను విజయం సాధించగల్గిన వాడు తన జీవితాన్నిహాయిగా గడిపి తాను చనిపోయిన తరువాత తన మూడు విజయాల కారణంగా స్వర్గలోకంలో ఆనందమయులమధ్య పునర్జన్మ పొందుతాడు. అట్టివి, శ్రమణులారా, ఈ మూడు విజయాలు.

# 2. జీవితంలో సంపూర్ణత్వాన్ని పొందడమే ధమ్మం

1. పరిపక్వతలు మూడు విధాలు.

2. శారీరక, మౌఖిక, మానసిక (పరిపక్వతలు)

3. మానసికపరిపక్వత అంటే ఏమిటి?

4. ఆసవాలను సమయింపచేసికొని జీవితంలో హృదయాన్ని పూర్తిగా ఆసవాలకు దూరపరచి, ప్రక్షాళనపరచినవిధంగా జీవితాన్ని గడుపుతూ అందులో పరిపూర్ణత సాధించడం ద్వారా మానసిక పరిపక్వతఏర్పడుతుంది

5. ఇవికాక ఇంకా కొన్ని పరిపక్వతలున్నాయి. వాటిని బుద్ధుడు, సుభూతికి వివరించాడు.

6. సుభూతి : అర్పించడంలో పరిపక్వత అనడంలో బోధిసత్త్వుని అభిప్రాయమేమిటి?

7. భగవానుడు : బోధిసత్త్వుడైనవాడు తనజ్ఞానాన్ని, యింకా యితరులకు తానేది ఇవ్వగలిగినా దానినివ్వడంలో ఎంతో సంతృప్తి చెందుతాడు. తానివ్వడమే కాక ఇతరులుకూడా తనవలె యివ్వగలిగేలా ప్రోత్సహిస్తాడు. దీనిలో ఏ మాత్రం భీతిచెందడు.

8. సుభూతి : బోధిసత్త్వుడైనవాడు నైతికపరిపక్వత ఎలా చెందుతాడు?

9. భగవానుడు : బోధిసత్త్వుడైనవాడు పది నైతిక ధర్మాలను విధిగా అనుసరిస్తాడు. తన వలె ఇతరులు కూడా అనుసరించేందుకై ప్రోత్సహిస్తాడు.

10. సుభూతి : బోధిసత్త్వుడైనవాడు సహనశీలతలో ఎలా పరిపక్వత పొంద గలుగుతాడు?

11. భగవానుడు : బోధిసత్త్వుడైనవాడు సహనశీలతను పూర్తిగా సాధించగలుగుతాడు. తనవలె ఇతరులుకూడా సహనశీలతను అలవరచుకొనేందుకై ప్రోత్సహిస్తాడు.

12. సుభూతి : బోధిసత్త్వుడైనవాడు బుద్ధిబలంతో పరిపక్వతనెలా సాధిస్తాడు?

13. భగవానుడు : బోధిసత్త్వుడైనవాడు ఐదు విధాలుగా బుద్ధిబలాన్ని సాధించడంలో పరిపక్వత చెందుతాడు. ఇతరులు సైతం తనవలె పరిపక్వత సాధించేందుకు దోహదంకలిగిస్తాడు.

14. సుభూతి : బోధిసత్త్వుడైనవాడు మనస్సును కేంద్రీకరించి ధ్యాన సాధన చేయడంలో ఎలా పరిపక్వత సాధిస్తాడు?

15. భగవానుడు : మనసును కేంద్రీకరించడంలో పూర్తిగా నిమగ్నుడై తనఉనికినే తాను మరచి, బోధిసత్త్వుడైనవాడు ధ్యానసాధన చేస్తాడు. ఇతరులు సైతం

అలా సాధన చేసేందుకు తోడ్పడుతాడు.

16. సుభూతి : బోధిసత్వుడైనవాడు జ్ఞానసాధనలో పరిపక్వతను ఎలా సాధిస్తాడు?

17. భగవానుడు : బోధిసత్వుడైనవాడు ఒక ధర్మాన్నే పరిశీలన చేయడు. సకల ధర్మాల మౌలికసూత్రాలను, వాటి పూర్వాపరాలను పూర్తిగా పరిశీలించి నిగ్గు తేలుస్తాడు. ఇతరులు సైతం అలా తారతమ్య పరిశీలన చేసేందుకు తోడ్పడతాడు.

18. ఈ విధంగా ధర్మానుసరణలో పరిపక్వత సాధించాలి.

## 3. నిబ్బాన మార్గంలో జీవించడం ధమ్మం

1. "నిబ్బానానికి (నిర్వాణం) మించి ఆనందదాయకమైనది మరొకటిలేద"ని బుద్ధుడు ప్రవచించినాడు.

2. బుద్ధుడు బోధించిన ధర్మసిద్ధాంతాలన్నింటికి నిర్వాణమే మూలస్తంభమై మహోన్నత స్థానమాక్రమించుకున్నది.

3. అయితే ఈ నిర్వాణమంటే ఏమిటి? బుద్ధునికంటె ముందు చాలామంది నిర్వాణ మనే పదానికెన్నో నిర్వచనాలిచ్చారు. కాని బుద్ధుడు నిర్వచించింది వాటన్నిటికి పూర్తిగా భిన్నమైనది.

4. నిర్వాణమంటే ఇతరులిచ్చిన నిర్వచనమేమంటే ఆత్మకు మోక్షం లభించడమే.

5. మోక్షం సాధించేందుకు నాలుగు రకాల మార్గాలను వారు బోధించారు. లౌకిక విధానం మొదటిది. అంటే తిని, త్రాగి, సుఖభోగాలను అనుభవించడం. యోగమార్గం రెండవది. బ్రాహ్మణాలమార్గం మూడవది. ఉపనిషత్తులలో చెప్పబడినది నాల్గవది.

6. బ్రాహ్మణాలు, ఉపనిషత్తుమార్గాలలో ఆత్మ స్వతంత్రమైనదనే భావన కనిపిస్తుంది. బుద్ధుడీ రెండు సిద్ధాంతాలను త్రోసిపుచ్చాడు.

7. ఇక లౌకికమార్గం కేవలం శారీరకసుఖాలకు సంబంధించినది. అందులో తాత్వికమైన దంటూ ఏదీ లేదు. ఇది బుద్ధుడికి నచ్చే ప్రశ్న లేదు. మృగాలకులాగానే మానవులు కూడ తమ శారీరక అవసరాలను తీర్చుకోవడం మినహా ఇంకేమీ లేదు.

8. అలాంటిదానిని నిర్వాణమని చెప్పడంకంటె తప్పు మరొకటి లేదని అలాంటి మార్గం మానవ శ్రేయస్సుకు హానికరమని బుద్ధుడు భావించాడు.

9. భౌతికమైనవాటిపట్ల వాంఛలు పెంచుకుంటే అవి ఇంకా ఎక్కువై ఒక హద్దంటూ లేకుండా పెరిగి పోతాయి. అలాంటి వాటిద్వారా సంతోషం లభ్యమైనట్టు కనిపించినప్పటికీ వాస్తవంలో దక్కేది దుఃఖమే.

10. యోగమార్గంద్వారా సాధించే నిర్వాణం తాత్కాలికమైనదే. అంతేగాక తద్వారా సాధించే నిర్వాణానందం నిరుపయోగమైనది. ఎందుచేతనంటే యోగసాధనలో నిమగ్నమైనవాడు ప్రపంచాన్నించి వేరైపోతాడు. కనుక ఈ సాధన బాధాకరంగా కాకపోవచ్చు. కాని దాని వల్ల నిసలైన ఆనందం కలుగజాలదు. యోగసాధనద్వారా లభించే ఆనందం దానిని సాధన చేస్తూన్నంతవరకు మాత్రమే వుంటుంది. ఆ కారణంగా ఆ తాత్కాలికమైన ఆనందం తరువాత లభించేది విచారమే అవుతుంది.

11. ఆ విధంగా బుద్ధుడు ప్రవచించిన నిర్వాణమార్గం తనకు ముందువారు చెప్పిన విధానాలన్నింటికి భిన్నమైనది.

12. బుద్ధుడు ప్రవచించిన నిర్వాణమార్గంలో మూడు ముఖ్యమైన భావాలున్నాయి.

13. ఆత్మకు మోక్షమనేదానితో ఎలాంటి సంబంధంలేని జీవుడి ఆనందం మొదటిది.

14. ఒకడు తాను జీవించిఉండగానే "సంసార" జీవనం గడుపుతూ సౌఖ్యం పొందటం. రెండవది. ఆత్మ అనేది, చనిపోయిన తరువాత ఆత్మ స్వర్గం చేరుకోవడమనేది, బుద్ధుడు సూచించిన నిర్వాణమార్గానికి బొత్తిగా పరాయివి.

15. అగ్నిజ్వాలలవంటి చిత్తవికారాలను పూర్తిగా అదుపులోవుంచుకోవటంద్వారా నిర్వాణపథం చేరుకోవడం మూడవది.

16. చిత్తవికారాలనేవి మానవుని ఎలాదహించివేస్తాయో బుద్ధుడు గయలో వుండగా భిక్షుకులకిలా బోధించాడు:

17. "ఓ భిక్షుకులారా! సమస్తమూ మండుతూవున్నాయి. ఓ బోధకులారా! అగ్నిలో మండుతూవుండేవేమిటో తెలిసికోగల్గారా?

18. "కన్ను ఎల్లపుడు మండుతూవుంటుంది. అనగా మీ దృష్టి. అది గమనించే వాటిపై, సంతోషకరమైన లేక దుఃఖదాయకమైన వాటిపై నీవెలాంటి దృక్పథంగలిగి వుంటావన్నదానిపై నీ కన్ను అగ్నికాహుతి కావడం లేక తప్పించుకోవడమన్నది ఆధారపడి వుంటుంది.

19. "ఇవి ఏ అగ్నిలో మండుతున్నాయి?

20 "వికారం, ద్వేషం, మోహం అన్న అగ్నులలో మండుతున్నాయి. పుట్టుక, వృద్ధాప్యం మరణం, దుఃఖం, విచారం, దైన్యం, బాధ, నిరాశ యీ అన్నిసందర్భాల్లో అవి మండుతూనేవుంటాయి.

21. "అలాగే నీ చెవిగూడ ఎల్లపుడు మండుతూవుంటుంది. అది వినే శబ్దం, ముక్కు, ఆఘ్రాణించే వాసనలు, నాలుక, అవి చవిచూసే రుచులు, నీ శరీరం, నీ భావనలు, వాటిద్వారా నీకు లభించే సంతోషకరమైన లేక సంతాపకరమైన అనుభూతులు, నీ మనస్సు పరిభ్రమించేతీరు యివన్నీ మండుతూనేవుంటాయి.

22. ఇవి ఏ అగ్నిలో మండుతాయి?

23. "ఓ భిక్షువులారా! పై వాస్తవాలను దృష్టిలోవుంచుకోగలిగిన మహనీయులు వాటిపై విముఖత చూపుతారు. ఆ విముఖత్వం వారిలో సకలవికారాలు సమయింప చేస్తుంది. వాంఛలకతీతమైనవాడు వాస్తవంలో స్వేచ్ఛాజీవి. తాను స్వేచ్ఛ పొందగలిగానన్న అనుభూతి తనకు లభిస్తుంది."

24. అయితే నిర్వాణంద్వారా ఆనందమెలా లభిస్తుంది? ఇది చాలా సునిశితంగా పరిశీలించి గ్రహించాల్సిన విషయం.

25. కోరకలకారణంగానే మానవుడు నిస్సంతోషి అవుతున్నాడన్నది సాధారణంగా కలిగే భావన. అయితే ఇది అన్నిసందర్భాలలోను వాస్తవం కాజాలదు. సకల సదుపాయాలున్నవాడుసైతం విచారంగా ఉండడం మనం చూస్తున్నాంగదా.

26. అత్యాశవలననే నిస్సంతోషి అవుతాడు. జీవితాన్ని దుఃఖమయం చేస్తుంది అత్యాశ. ఇది ఉన్న వారిలోను లేనివారిలోను ఉంటుంది.

27. ఈ విషయమై బుద్ధుడు భిక్షువులకిచ్చిన ప్రబోధంలో యిలా వివరించాడు:

28. "సోదరులారా! లోభిత్వం (అత్యాశ) మితిమీరిన ఆగ్రహం (దోషబుద్ధి)భ్రమ (భ్రమ (మోహం) ద్వారా కలిగే అంధత్వం, మానసికఉద్రిక్తత, భావదాస్యం, తమ దీనత్వంపై, సాటివారిదీనత్వంపై విచారం, వీటిద్వారా మానవులకు వేదన బాధ వాటిల్లుతుంది.

29. దురాశ, క్రోధం, భ్రమలను అధిగమించగలిగినట్లయితే మానవుడిలో బాధ, వేదనలకు తావుండదు.

30. కాబట్టి ఓ భిక్షువులారా! వివేకంతో అనుసరించగలిగినట్లయితే నిర్వాణానందం మనకు జీవితకాలంలోనే లభ్యమౌతుంది

31. పై ప్రబోధాన్నిబట్టి మానవుని మ్రింగివేసే ప్రలోభాలేమిటో వాటిద్వారా నిస్సంతోషి ఎలా అవుతున్నాడో అవగతమౌతుంది. మనోవికారాలు మండుతున్న అగ్నివంటివని చెప్పడం ద్వారా బుద్ధుడు అవి ఎంతటి ప్రమాదకరమైనదీ నొక్కి వివరించి నిస్సంతోషిత్వానికి అసలు కారణం వెల్లడించాడు.

32. ఆ వాంఛలకు బలికాకుండా మానవుడు జాగ్రదావస్థలో ఉండాలన్నాడు. మానవుడు నిర్వాణమార్గం చేరుకొనేందుకవి అవరోధకరమైనవని హెచ్చరించాడు. వాటినుండి మానవుడు పూర్తిగా దూరమైననాడు నిర్వాణానికి చేరువకాగలడని వివరించాడు.

33. ఈ మానసికవికారాలను బుద్ధుడు మూడు భాగాలుగా విభజించాడు.

34. మొదటిది - అన్ని స్థాయిల్లో వెంపర్లాట, వ్యామోహానికి చెందినది; మోహం, అత్యాశ (లోభం ) వంటివి.

35. ద్వేషం, క్రోధం, నిస్పృహ వంటి వైముఖ్యపరిణామ దోషాలకు చెందినది రెండవది.

36. అన్ని స్థాయిల అజ్ఞానంవల్ల ఉత్పన్నమయ్యేవి మూడవది, భ్రమ, జడత, బుద్ధిహీనత, వంటివి.

37. వీటిలో మొదటి రెండు మంటలు మానవుని చిత్తప్రవృత్తినిబట్టి ఏర్పడే ఉద్రిక్తతలకు చెంది ఉంటుంది. మూడవది వాస్తవికపరిజ్ఞానలోప కారణంగా ఏర్పడుతుంది.

38. బుద్ధుడు ప్రవచించిన నిర్వాణమార్గం గూర్చి కొన్ని అపోహలున్నాయి.

39. నిర్వాణమంటే పరిభాషరీత్యా ఉబ్బిపోయి చిట్లిపోవడం లేక ఆరిపోవడం.

40. ఈ రెండు అర్థాలను ఆధారంచేసికొని వాటిని బుద్ధుడు చెప్పిన నిర్వాణానికన్వయిస్తూ చాలామంది అవాస్తవికమైన విధంగా భాష్యీకరించారు

41. ఆవిధంగా అన్వయించినవారు నిర్వాణమంటే సకలకోరికల్ని చంపుకొని చనిపోవడమేనని తేల్చారు.

42. అలా తప్పుగా అన్వయించుకొని బుద్ధుడు ప్రవచించిన నిర్వాణమార్గమే దోష భూయిష్టమైనదనికూడా అన్నారు.

43. అగ్నిలో దహించుకుపోతున్నదేమిటో బుద్ధుడు ప్రబోధించినదాన్ని సరియైనవిధంగా అర్థం చేసికోగల్గితే నిర్వాణానికి వారు గ్రహించిన అర్థం అసమంజసమైనదని తెలిసి పోతుంది.

44. అవి వివరిస్తున్నపుడు నీ మానసికవికారాలు నిన్ను అగ్నికి ఆహుతిచేస్తాయని హెచ్చరించాడు గానీ నీ జీవితమే అగ్నికాహుతియై పోతుందని బుద్ధుడు చెప్పలేదు.

45. నీ కోర్కెలన్నింటినీ పూర్తిగా చంపుకోమనిగూడా ఆ ప్రబోధంలో ఎక్కడా చెప్పలేదు. అగ్నికి ఆజ్యం వెయ్యవద్దని ఆ సందేశంలో ఉంది.

46. "నిర్వాణం" "పరిపక్వత" అనే రెండింటికి మధ్యగల తేడాను సైతం కొందరు విమర్శకులు విస్మరించారు.

47. ఈ విషయమై ఉదానుడిలా వివరించాడు: "శరీరంసమస్త విధులను మానివెయ్యడంలో పరినిర్మాణం ఏర్పడుతుంది. ఆ దశలో ఇక ఏ ఆలోచనలు మానసికమైన స్పృహఏదీ ఉండదు. సమస్తకార్యాలు ఆగిపోతాయి. పరినిర్వాణమంటే పూర్తి అచేతనత్వం."

48. ఈ అర్థం నిర్వాణానికి అన్వయించదు. నిర్వాణమంటే సకలవాంఛలను అదుపులో ఉంచుకొని సద్ధర్మమార్గాన్ని అనుసరించటం. అంతకుమించి వ్యాఖ్యానించడం వాస్తవాన్ని వక్రీకరించడమే.

49. సద్ధర్మమార్గానుసరణే నిర్వాణమని బుద్ధుడు ఒకానొక సందర్భంలో రాధకు వివరించాడు.

**50.** ఒకనాడు పూజనీయుడైన రాధ సర్వోన్నతుని దర్శించి, నమస్కరించి, ఒక ప్రక్కన కూర్చొని భగవానుని ఉద్దేశించి, "నిర్వాణందేనికొరకు?" అని ప్రార్థిస్తూ అడిగాడు.

**51.** "నిర్వాణమనగా వికారాలనుండి విముక్తి" అని భగవానుడన్నాడు.

**52.** "అయితే భగవానుడా! నిర్వాణం ధ్యేయమేమిటి?"

**53.** "ఓ రాధా! సద్ధర్మమార్గానుసరణమే నిర్వాణధ్యేయం. ఆ ధ్యేయసాధనే నిర్వాణపు మూలాధారము. అదే అంతిమం".

**54.** నిర్వాణమంటే లుప్తమని అర్థం కాదని సరిపుత్త తన ప్రబోధంలో ఇలా వివరించాడు.

**55.** ఒకప్పుడు సుగతుడు శ్రావస్తితోని అనాధపిండకుని ఆరామంలో సరిపుత్తతో బాటు ఉండేవాడు.

**56.** భగవానుడు భిక్షుసోదరులను ఉద్దేశించి " ఓ భిక్షువులారా! ప్రాపంచికమైన ఆస్తిపాస్తుల కొరకైగాక నా సిద్ధాంతసముపార్జన కోసమై కృషిచేయండి. మీ పట్ల నాకు గల అపారమైన అనురాగంవల్ల మీకిది అందిస్తున్నాను."

**57.** ఆ మాట అన్న తరువాత భగవానుడు తన ఆరామంలోనికి వెళ్ళిపోయాడు.

**58.** ఆ సమయంలో అక్కడ కూర్చొనిఉన్న సరిపుత్తుని ఉద్దేశించి భగవానుడు చెప్పిన దాని సారాంశమేమిటో వివరించమని సాటి భిక్షువులు కోరారు.

**59.** అప్పుడు సరి పుత్తుడు ఈ విధంగా చెప్పసాగాడు. "సోదరులారా! దురాశ ఎంతటి హానికరమో మీరు ఎరుగుదురు కదా! హానికరమైన దానికి మనం దూరంగా ఉండాలి".

**60.** "ఈ దురాశనుండి పూర్తిగాదూరమై హానిని తొలగించుకునేందుకు భగవానుడు చూపిన మధ్యమమార్గం మనకు తోడ్పడి, మనకు శాంతి, నిశిత దృష్టి, జ్ఞానోదయం, నిర్వాణం పొందేందుకు తోడ్పడుతుంది.

**61.** "అయితే ఈ మధ్యమమార్గం అంటే ఏమిటి? అష్టాంగమార్గానుసరణమే మధ్య మార్గం అంటే సమదృష్టి, సమ సంకల్పం, సమ వాక్కు, సమకర్మ, సమఆర్జన, సమశక్తి, సమవ్యాయామం, సమసమాధి - వీటి ద్వారా మనం మధ్యమమార్గాన్ని అనుసరించ గలుగుతాము.

**62.** క్రోధం హేయమైనది. దురాశ కూడా హేయమైనది. ఇంకా ద్వేషం, అసూయ, లోభత్వం, పేరాశ, కుత్సితం, మోసం, గర్వం, ఆడంబరత, జడత్వం, కూడాహేయమైనవి.

**63.** "ఆడంబరత, జడత్వం వైదొలగించుకోవాలంటే నీకు మధ్యమమార్గం కన్నువలే తోడ్పడుతుంది. తద్వారా మనల్ని శాంతిలో చూపు జ్ఞానోదయం వైపు నడుపుతుంది.

**64.** "అష్టాంగమార్గాన్ని అనుసరించడం ద్వారానే మనం నిర్వాణపథం చేరగలుగుతాము".

65. ఈ విధంగా సరిపుత్తుడు తన బోధన పూర్తిచేయగానే సాటిభిక్షువులు ఆనంద భరితులైనారు.

66. దీనినిబట్టి సద్ధర్మమార్గాన్ని అనుసరించడమే నిర్వాణానికి అర్థం కాని, ఏ ఇతర నిర్వచనం సరియైనది కాజాలదని తెలుస్తున్నది.

67. ఆత్మత్యాగం ఒకతీవ్ర మార్గం. పరినిర్వాణం మరో తీవ్రమార్గం. ఈ రెండింటికి మధ్యగల విధానం మధ్యమ మార్గం.

68. ఈ పారిభాషిక వ్యత్యాసాన్ని క్షుణ్ణంగా అవగాహన చేసుకోగలిగినట్లయితే నిర్వాణమనే పదంపై ఎలాంటి సందేహం కలుగదు.

## 4. వ్యామోహం వదలివేయడమే ధమ్మం

1. "ఆరోగ్యంకంటే కోరదగిన ఐశ్వర్యం లేదు. సంతృప్తికిమించి విలువైనది మరేదీ లేదని బుద్ధుడు ధమ్మపథంలో ప్రబోధించాడు.

2. అయితే సంతృప్తికలిగిఉండటంఅంటే చేతగానితనమనికాని లేక పరిస్థితులకు సైతం ఒగ్గి ఉండమనీ అర్థంకాదు.

3. అలా అర్థంచేసికొన్నట్లయితే బుద్ధుడు చెప్పిన ఇతర ప్రబోధాలకది విరుద్ధమవుతుంది.

4. "నిరుపేదలైనవారు ధన్యులు" అని బుద్ధుడు చెప్పలేదు.

5. బాధలను అనుభవిస్తున్నవారు వాటినితొలగించుకునే ప్రయత్నం చేయవద్దని బుద్ధుడు చెప్పలేదు.

6. అనంతమైన బాధలనుండి వీరోచితంగా పోరాడి వాటిని నివృత్తిపరచుకోమని చెప్పాడు. ఐశ్వర్యం అభిలషణీయమైనదే.

7. అయితే అత్యాశకు పోకుండా అవసరమైనమేరకు సాధించుకుని దానితో సంతృప్తి పొంద గలిగితేఅదే మహాభాగ్యమన్నాడు.

8. ఈ విషయంలో భిక్షువైన పాలుడిలా అన్నాడు: ధనవంతులైనవారు ఇంకా ధనవంతులు అవ్వాలని తాపత్రయపడటం మనం చూస్తూనేఉన్నాము. నూతన భోగాలకోసమై వారి తాపత్రయం పెరిగిపోతూ ఉంటుంది. సముద్రం వరకు జయించిన రాజు దాని కావలి రాజ్యాలనుకూడ జయించాలని తాపత్రయపడుతూఉంటాడు. రాజులు గతిస్తారు. పాలితులు గతిస్తారు. కానీ భూమిమీద వారి ఆశలకు ఒక అంతమంటూఉండదు.

9. "మహానిదాన స్తుతాంత"లో ఆనందునికి బుద్ధుడు అత్యాశ అదుపుగురించి ఇలా వివరిస్తాడు.

10. "ఆనందా! వ్యామోహం ధనాశకు ఆస్కారం కలుగచేస్తుంది. ధనాశ మరింత ధన హానికి

దారితీస్తుంది. ఈ వ్యామోహం మరింత సంపద పోగుచేయాలన్న తాపత్రయం దురాశకు ఆలవాలమవుతుంది.

1. "ఎంత కూడపెట్టినప్పటికీ యింకా కూడపెట్టాలన్న దురాశ కలుగకుండా ఉండేలా అప్రమత్తులమై గమనిస్తూ ఉండాలి.
2. "ఈ వ్యామోహన్ని, దురాశను మనమెందుకు నిరసించాలి? ఎందుకంటే ఆనందా! ఈ వ్యామోహం, దురాశ కలహాలకు, పోట్లాటలకు దారితీసి, తత్ఫలితంగా, దెబ్బలు, గాయాలు, ఘర్షణ, వాద ప్రతివాదాలు పోట్లాట, నిందారోపణలు, అబద్ధాలు అనివార్యమౌతాయి కనుక.
3. వర్గ పోరాటానికి ఇది చక్కటి విశ్లేషణ అనటంలో సందేహంలేదు.
4. అందుకే బుద్ధుడు వ్యామోహాన్ని, దురాశను ఎప్పుడూ అదుపులో ఉంచుకోవాలని హెచ్చరించాడు.

# 5. మిశ్రితాలు అనిత్యమైనవని నమ్మడమే ధమ్మం

1. అనిత్యసిద్ధాంతంలో మూడు అంశాలున్నాయి.
2. మిశ్రితమైనదేదీ శాశ్వతం కాదు.
3. వ్యక్తిగతమైనదేదీ శాశ్వతం కాదు.
4. కొన్ని పరిమితులకులోబడినది స్వయంసిద్ధమైనప్పటికీ అది శాశ్వతం కాదు.
5. మిశ్రితమైనవి ఎలా శాశ్వతంకావో ప్రసిద్ధ బౌద్ధతాత్వికుడైన అసంగుడు చక్కగా వివరించాడు.
6. అసంగుడు మిశ్రితమైన వాటి విషయమై "ఒకదాని ఆధారంగా మరొకటిగా ఏర్పడిన మిశ్రమంలో ఏ ఒక్కటీ స్వయంశక్తికలిగి ఉండజాలదు. మిశ్రమం విడిపోయినపుడు అందలి ధాతువులుసైతం నాశనమై పోవడం అనివార్యమౌతుంది.
7. "మన్ను, నీరు, నిప్పు, వాయువుల మిశ్రమమే జీవి. ఈ నాలుగు ధాతువులు విడిపోయినపుడు జీవి విగతమవుతుంది.
8. "దానినే మిశ్రమపదార్థ అనిత్య తత్వం అంటారు".
9. "ఒక వ్యక్తి అశాశ్వతమెలా అవుతున్నాడన్నది " ఉన్నది ఉండబోవునది అన్న సూత్రం చక్కగావివరిస్తుంది.
10. ఈ సూత్రం ప్రకారం గడచిపోయిన క్షణంలో నీవు జీవించావు. కాని ఇప్పుడు అది లేదు. రాబోయే క్షణంలో నీవు జీవిస్తావు, కానీ ఆ క్షణం దాటిన తరువాత నీవు లేవు. ప్రస్తుత

క్షణంలో నీవు జీవించిఉన్నావు. కానీ ఆ క్షణం తరువాత నీవు జీవించి లేవు.

11. అంటే మానవుని జీవనగతి అనుక్షణం మారుతున్నదని అర్థం. ఆ మార్పులో పెరుగుదల లేక తరుగుదల ఉండవచ్చును. కానీ ఈ క్షణం నీవు ఉన్నస్థితిలో మరుక్షణం ఉండవని అర్థం.

12. అనిత్యం అనే సిద్ధాంతంలోని మూడవ అంశం సామాన్యులకు అంత సులభంగా అర్థం కాజాలదు.

13. అయితే పుట్టిన ప్రతిప్రాణీ గిట్టక తప్పదు. అన్న వాస్తవం మాత్రం అందరికీ సులభంగా తెలిసిన విషయమే.

14. కానీ మానవుడు జీవించిఉండగానే ప్రతిక్షణం ఎలా మార్పుకు గురి అవుతాడన్న విషయం మాత్రం అంత సులభంగా అర్థంకాదు.

15. అందుకు బుద్ధుడు "అదెలా సాధ్యమంటారా! అది అశాశ్వతం కావటమే అందుకు కారణం" అంటాడు.

16. దీనిని ఆధారం చేసుకొనే శూన్యవాదం తలెత్తింది.

17. కానీ శూన్యవాదంలో ఏదీలేదన్నట్టు వాదించడం బుద్ధుని సూత్రీకరణకు విరుద్ధమైనది. ప్రపంచస్వభావాన్ని బట్టి మానవునిలో అనుక్షణం మార్పు జరుగుతున్నదన్నదే బుద్ధుని సూత్రీకరణ.

18. ఈ క్షణం వున్నది మరో క్షణంలో లేకపోవడమనే శూన్యతాస్థితివల్లనే ప్రపంచం మనగల్గుతుంది. ఇప్పుడున్నది ఎప్పుడూ అలాగే వుండిపోతే ప్రకృతి స్తంభించిపోతుంది. అనుక్షణం జరుగుతున్న మార్పువల్లనే ఒక దానిపై మరొకటి ఆధారపడి మార్పుకు కారణం అవుతూ ప్రకృతి కొనసాగ గలుగుతున్న సూక్ష్మం చాలామంది గ్రహించలేరు.

19. అలా అనుక్షణం మార్పులేక ఆగిపోయినట్లయితే యావత్ప్రపంచంలోని సకల ప్రాణికోటి విగతమైపోక తప్పదు.

20. మానవుడు జీవించి ఉన్నప్పుడు లేక మరణించినపుడు అతని శరీరస్థితిలో ఏ మార్పూ రానట్లయితే ఏమవుతుంది! అలాజరిగితే మానవాళి మనుగడే అంతమైయుండేది.

21. శూన్యవాదమంటే ఏదీలేదనుకోవడం. అదే వాస్తవమైతే మనుగడ సాధ్యమై వుండేది కాదు.

22. బుద్ధుడు సూత్రీకరించిన శూన్యవాధములో ఒక్క క్షణపు జీవితంలో పదార్థమున్నది. ఒక చుక్కలో పొడుగు వెడల్పులు ఉండకపోవచ్చు. కానీ చుక్క ఉన్నది కదా!

23. అన్నీ అశాశ్వతమైనవనేదే బుద్ధుని సూత్రీకరణ.

24. దీనిద్వారా బుద్ధుడు చెప్పదలచినది ఏమిటి? అది చాల ముఖ్యమైన విషయం.

25. ఈ సూత్రీకరణద్వారా మనం అర్థం చేసుకోవలసిన నీతి ఏమిటంటే ఏదీ శాశ్వతం కాదు కనుక దేనిపైన వ్యామోహం పెంచుకోకూడదని.

26. ఆస్తిపాస్తులనీ, అయినవాళ్ళనీ మరిన్నిబంధనాలు పెంచుకోరాదు. ఎంధుకంటే ఏదీ శాశ్వతమైనది కాదు. "సర్వం అనిత్యం"

## 6. కర్మయే నీతి మార్గానకు ఉపకరణమని నమ్మడమే ధమ్మం.

1. ఈ భౌతిక ప్రపంచానికి ఒక నియతి ఉన్నది. ప్రపంచంలో జరుగుతున్న మార్పులను విశ్లేషించినట్లయితే ఆ విధానం ఏమిటో మనం తెలుసుకో గలుగుతాము.

2. ఆకాశంలోని నక్షత్రాల అమరిక ఒక నియతికి కట్టుబడివున్నది.

3. ఋతువులు ఒకదాని తరువాత ఒకటి రావడంలో ఒక నియతి అంటూ వున్నది.

4. విత్తనం నుండి చెట్టు, చెట్టునుండి పండు, ఫండునుండి మళ్ళీ విత్తనం రావడంలో కూడ ఒక క్రమవిధానం వున్నది

5. బుద్ధుని పరిభాషలో దీనిని నియమవిధానం అంటారు. ఇవి సహజసిద్ధంగా ఏర్పడుతున్న ఋతునియమం, లేదా బీజనియమం.

6. ప్రపంచంలోని ప్రతిదానికి ఒక నియమవిధానమంటూ వున్నట్లే మానవుని జీవనసరళిలో కూడ ఒక నైతికవిధానం అంటూ ఉండితీరాలి. అయితే దాన్ని ఏర్పరచి కొనసాగించడం ఎలా ?

7. దేవుడు ఉన్నాడని నమ్మేవారికి అది సమస్యకాదు అందుకు వారి సమాధానం కూడ బహు తేలికగా లభిస్తుంది.

8. ఈ ప్రపంచ నైతికవిధానాన్ని దేవుడే పరిరక్షిస్తూ వుంటాడని వారు చెబుతారు. ఈ ప్రపంచాన్ని దేవుడే సృష్టించాడని, ఆయనే ప్రపంచాన్ని పాలిస్తున్నాడని వారు చెబుతారు. నైతిక, భౌతిక విధానాన్నికూడ దేవుడే రూపకల్పన చేస్తాడని వారి నమ్మకం.

9. నైతికవిధానం మానవ శ్రేయస్సుకోసమే. అది దేవునిచే రూపొందింపబడింది కనుక మానవుడు తప్పకుండా దేవునికి అధీనుడై వుండాలి. ఎందుకంటే మానవుడు దేవునిచే సృష్టించబడ్డాడు కనుక. ఈ విధంగా మానవుడు దైవిక మైన నైతిక విధానానికి కట్టుబడి వుండాలన్నదే వారిభావన.

10. దైవికంగానే అన్నీ ఏర్పడ్డాయని నమ్మేవారు నైతికవిధానం గురించికూడ అంతతేలికగా చెబుతారు.

11. కానీ ఇది అంగీకారయోగ్యమైనది కాజాలదు. ఎందుచేతనంటే నైతికవిధానాన్ని దేవుడే ఏర్పరచినటయితే దానికి దేవుడే ఆద్యంతుడు అయినటయితే దానినుండి తప్పించుకోవడం

మానవునికి సాధ్యమైఉండేదికాదు. అదే నిజమైతే ప్రపంచం అవినీతితో ఎందుకు
వున్నది?

12. దైవశాసనానికి ఆధారం ఏమిటి ? ఒక వ్యక్తి దాన్ని తప్పక అనుసరించితీరా
విషయంలో దేవుని ప్రమేయం ఎంతవుంది? ఇవి చాలా ముఖ్యమైన ప్రశ్నలు.
విధానం దైవికమని చెప్పేవారెవరూ వీటికి సంతృప్తికరమైన సమాధానాలు ఇవ్వ

13. అందుకే దైవికసిద్ధాంతకర్తలు వారి వాదానికి ఒక వివరణ ఇచ్చారు.

14. వాళ్ళు ఏమంటారంటే; దేవుని ఆజ్ఞానుసారమే ఈ సృష్టి ఏర్పడినదనే విషయ
అనుమానం లేదు. ఆకాశంలో సూర్య, చంద్ర, నక్షత్రాదులుకూడ దేవుని అభీష్టంమే
నెలకొన్నవి. ప్రకృతిలో ప్రతిదానికి శక్తియిచ్చి ప్రతీదీ నియమబద్ధంగ పనిచే
రూపొందించాడు.

15. దేవుడు ఒక నియమాన్ని విధించి ఆ నియమం ప్రకారం నడుచుకోవడం ప్రకృతికి వదలి వే

16. అందువలన నైతికవిధానం క్రమానుసారం లేనట్లయితే అది ప్రకృతిలోపమేగానీ దే
లోపం కాజాలదు.

17. కానీ ఈ వాదంకూడ అసలు సమస్యను పరిష్కరించేందుకు తోడ్పడదు. దీనివల్ల ప్ర
వర్తనపై దేవునకి బాధ్యతవుండదు. కాని దాన్ని ప్రకృతికి ఎందుకు వదలి వేశాడు! అ
బాధ్యతారహితంగా ప్రవర్తించే దేవుని వలన ఉపయోగమేమిటి?

18. నైతిక విధానం ఎలా క్రమబద్ధమవుతుంది ? అనే ప్రశ్నకు బుద్ధుడు ఇచ్చిన వివ
దీనికి పూర్తి భిన్నమైంది

19. బుద్ధుడిచ్చిన వివరణకూడ చాల తేలికగా అర్థమయ్యేదే. ``కమ్మానియమం" (కర్మనియతి)
నైతికవిధానక్రమం ఆధారపడి వుంది. అంతేగాని దేవునిపై కాదు. ఈ ప్రశ్నకు బుద్ధుడిచ్చి
సమాధానం ఇదే.

20. ప్రాపంచిక నైతికవిధానం మంచిది కావచ్చు. కానీ అది మంచిది కావడానికైన
చెడ్డదికావడానికైనా మానవుడే కారకుడు. వేరెవరూ కాదు.

21. ఇక్కడ కర్మ అంటే మానవుడు చేసేపని. పనికితగినట్లుగానే ప్రతిఫలం ఉంటుం
సామాజిక నీతి చెడుగాఉన్నదంటే దానికి మానవుని చెడుప్రవర్తనే కారణం. నైతి
వర్తనం మంచిగా వున్నదంటే మానవుని మంచివర్తనే దానికి కారణం.

22. బుద్ధుడు ప్రవచించిన కర్మసిద్ధాంతానికి అర్థం ఏమిటంటే నీవు చేసే పనిని బట్టే దా
ఫలితముంటుందని మాత్రమే. దీనినే బౌద్ధవాఙ్మయంలో ``కమ్మానియమం" అంటార

23. రాత్రి తరువాత పగలు వచ్చినట్లే నీవు చేసే పనివెనుకే దాని ఫలితం వుంటుంద
బుద్ధుడు ప్రబోధించాడు.

24. సత్కార్యాన్ని బట్టి సత్ఫలితాలు ఉన్నట్టే దుష్కార్యాలను చేసినపుడు వాటివలః దుష్ఫలితాలు తప్పవు అని అన్నాడు.

25. సమాజంలోని ప్రతిఒక్కరు సత్కర్మచేయం సాధ్యమైతే సామాజిక సత విధాన శ్రేయోదాయకమవుతుంది. అలా కాకుండా ప్రతి ఒక్కరు చెడ్డపనులకు పాల్పడినట్లయితే సమాజం దుఃఖదాయకమౌతుందన్నాడు.

26. నీవు ఒక సత్కర్మనుగాని, దుష్కర్మాన్నిగాని చేసినపుడు దాని ఫలితం వెంటనే కనిపించః పోవచ్చు. కానీ ఆ కర్మను బట్టిదాని ఫలితం తప్పకుండ వుండితీరుతుంది.

27. దిత్తదర్మ వేదనీయ కర్మ" అనీ (వెంటనే అనుభవించి తీరాల్సినవి)" ఉప పజవేదనీయ కర్మ" అనీ క్రొంత కాలం తరువాత పనియొక్క ఫలితం కనిపించేది) ``అపరాపరీయ వేదనీయ కర్మ" అనీ (ఫలితం ఎలాంటిదో చెప్పజాలనిది) మూడు విధాలుగా కర విభాగింపబడింది.

28. అహాని కర్మ" (ఎలాంటి ఫలితం వుండనిది) అని మరో విభాగంకూడఉంది. అంటే దాః ప్రభావం మంచిగాని, చెడుగానీ ఉండదు. లేక ఆ స్వల్పప్రభావం కనిపించక ముంద మరో కర్మ దానికి ప్రతిగా వుండవచ్చు.

29. బుద్ధుడు కర్మను గురించి ఇన్నివిధాలుగా వివరించినదాని సారాంశం ఏమిటంటే మన నిర్వర్తించే ప్రతిపనికి పర్యవసానమంటూ వుండితీరుతుందని.

30. మనం చేసే పనియొక్క పర్యవసానం మనం అనుభవించి తీరాల్సివుంటుందను కోవడం కూడ పొరపాటే. కొన్ని సందర్భాల్లో మనం చేసేపని ఫలితం మరొకరుఎదుర్కోవలసిరావచ్చు ఇక్కడ కర్మసిద్ధాంత సారాంశమేమిటంటే - మనం నిర్వర్తించే పని యొక్క ఫలితం వలననైతికవిధానంపై దానిప్రభావం ఉంటుంది.

31. వ్యక్తులు రావచ్చు, పోవచ్చు, కానీ వారి కర్మప్రభావం ప్రాపంచిక నీతివర్తనపై ఉండి తీరుతుంది.

32. ఆ కారణంగానే బౌద్ధధర్మంలో దేవునికిబదులు నీతికి స్థానం ఇవ్వబడింది.

33. అయితే ఈ ప్రపంచంలో నైతికవిధానానికి మనుగడ ఎలావుంటుంది?" అన్న ప్రశ్నక బౌద్ధధర్మంలో స్పష్టమైన సమాధానం ఉంది.

34. కానీ దానిని అర్థం చేసికోవలసినవిధంగా అర్థం చేసుకోవడం లేదు. దానికి విపరీతార్థాల తీయడం జరుగుతుంది. బుద్ధుడు బోధించిన కర్మసిద్ధాంతం నీతి విధానాన్ని ఎల నిర్వహించటమనే విషయంలో ఎక్కువగా అపార్థం చేసుకోవడమే కనిపిస్తుంది.

35. బుద్ధుని కర్మసిద్ధాంతం ఆశయమే అది.

36. కర్మసిద్ధాంతానికి సార్వజనీన నైతికవర్తనంతో ప్రమేయం ఉంటుందేకాని ఒక వ్యక్తి అదృ

దురదృష్టాలపై ఆధారపడి కాదు.

37. అది ప్రాపంచిక నైతికవర్తన పరిరక్షణకే తోడ్పడుతుంది.

38. ఆ కారణం చేతనే "కర్మ" బౌద్ధధర్మంలో ఒక భాగం అయింది.

## నాల్గవ భాగం

# ధమ్మం కానిది ఏది?

1. ప్రకృతికతీతమైనవాటిని నమ్మడం ధమ్మము కాదు.
2. ఈశ్వరుని (దేవుని) నమ్మటం ధర్మానుసరణలో భాగం కానక్కరలేదు.
3. బ్రహ్మతో ఐక్యమైపోవడమే ధ్యేయమని విశ్వసించడం బూటక ధమ్మం.
4. ఆత్మ అనేది ఉన్నదని నమ్మడం ధమ్మం కాదు.
5. బలులను నమ్మటం ధమ్మం కాదు.
6. ఊహాజనితమైన వాటిని నమ్మడం ధమ్మం కాదు.
7. ధార్మికగ్రంథాలను పఠించడం ధమ్మం కాజాలదు.
8. ధార్మికగ్రంథాలు దోషాతీతమైనవని నమ్మడం ధమ్మం కాదు.

# 1. ప్రకృతికతీతమైనవాటిని నమ్మడం ధమ్మం కాదు

1. ఏదైనాఒక సంఘటన జరిగినపుడు జరిగిందేమిటి? అది ఎలా జరిగి తెలుసుకోవాలనుకోవడం మానవసహజమైన విషయం.

2. కొన్నిసందర్భాల్లో జరిగిందేమిటో, అదెలాజరిగిందో తెలిసికొనేందుకు పెద్దగా కష్టపడాలి అవసరమే ఉండదు.

3. కాని చాలాసందర్భాలలో ఒక సంఘటన జరగటానికి కారణం అంతుచిక్కక పోవడం ఏ కారణంలేకుండానే అది జరిగిపోయినట్లు భావించడం జరుగుతుంది.

4. అయితే అది ఎలా జరిగిందన్న ప్రశ్న మాత్రం ప్రశ్నగానే మిగిలి పోతుంది.

5. అలాంటి సందర్భాల్లో మనం సాధారణంగా వినేదేమంటే ఏవో ప్రకృతి కతీతమైన శక్తి ప్రభావం వల్లనే ఆ అద్భుతం జరిగిందని.

6. ఈవిషయంలో బుద్ధునికి పూర్వీకులైన తాత్వికులు వివిధ సిద్ధాంతాలను రూపొందించా

7. ప్రతిసంఘటనకు కారణమంటూ ఉండితీరాల్సిన అవసరం లేదనే, కొన్ని సంఘటన వాటంతట అవి జరిగిపోతుంటాయనీ ప్రకుధ కాత్యాయనుడు సిద్ధాంతీకరించాడు.

8. ప్రతిసంఘటనకు తప్పక కారణముండి తీరుతుందన్నాడు మఖాళికోపాలుడు. అం కొన్ని సంఘటనలకు కారణాలుకనుక్కోవడం మానవులకు సాధ్యమేనని అవి ప్రకృ కతీతమైనవనీ, కొన్ని అలాజరగాల్సినట్టు ముందుగానే నిర్ణయించబడి ఉంటుం చెప్పాడు.

9. బుద్ధుడు పై రెండుసిద్ధాంతాలను తిరస్కరించాడు. ప్రతి సంఘటనకు కార ఉండితీరుతుందనీ అది మానవప్రమేయం వలన కావచ్చు లేదా ప్రకృతిశక్తుల ప్రభా వలనకూడ కావచ్చని బుద్ధుడు చెప్పాడు.

10. కాలం, ప్రకృతి, అనివార్య కారణాలూ ఇత్యాదులవలన సంఘటనలు జరుగుతుంటాయ వాదంపై బుద్ధుడిలా ప్రశ్నించాడు.

11. ఒక సంఘటన జరిగేందుకు కాలం, ప్రకృతి, అనివార్యకారణం మూలమైనట్లం మానవుని ప్రమేయమేమిటి?

12. కాలం, ప్రకృతి, అవకాశం, దేవుళ్ళు, అదృష్టం, అవసరంలాంటివాటికి వశమైతే మానవ కేవలం కీలుబొమ్మలాంటి వాడేనా?

13. స్వేచ్ఛ లేని మానవునికి జీవనప్రయోజనమేమిటి? ప్రకృతికతీతమైన శక్తుల్నే నమ్మికూర్చు

ఇక మానవుని మేధాశక్తివలన ప్రయోజనమేమున్నది?

14. మానవుడు స్వేచ్ఛాజీవి అయినట్లయితే జరిగే ప్రతి సంఘటనకు మానవ ప్రమేయమో లేక ప్రకృతిప్రమేయమో ఉండివుంటుంది. అంతేగాని ప్రకృతికతీతమైనవంటూ ఏదీ లేదు.

15. కొన్ని సందర్భాల్లో ఒక సంఘటనకు కారణం మానవుడికి స్ఫురించకపోవచ్చు. కానీ తన మేధాశక్తితో దానికి కారణమేమిటో ఎప్పటికైనా తెలుసుకోగలుగుతాడు.

16. ప్రకృతికతీతమైన దానిని తిరస్కరిస్తూ బుద్ధుడు మూడు విధానాలు చెప్పాడు.

17. మానవుడిని హేతువాదదృక్పథంవైపు నడిపించడం మొదటిది.

18. మానవుడిని సత్యాన్వేషణవైపు స్వేచ్ఛగా పయనింపచేయడం రెండవది.

19. మూఢనమ్మకాలను అనుసరించడంద్వారా మానవుడు అన్వేషణాశక్తిని కోల్పోతాడన్నది మూడవది.

20. దీనినే కర్మ లేదా కార్యకారణ సిద్ధాంతం అంటారు.

21. బౌద్ధధర్మంలో కార్యకారణ సిద్ధాంతం అత్యంత కీలకమైంది. బౌద్ధధర్మం హేతువాద బద్ధం కానట్లయితే అది బౌద్ధమే కాదు.

22. అందుచేత ప్రకృతికఅతీతమైన వాటిని నమ్మడం ధమ్మం కాదు.

## 2. ఈశ్వరుని (దేవుని) నమ్మడం ధమ్మానుసరణలో భాగంకానక్కరలేదు

1. ఈ ప్రపంచాన్ని ఎవరు సృష్టించారనేది మనం సాధారణంగా ఎదుర్కొనే ప్రశ్న. దేవుడే ఈ ప్రపంచాన్ని సృష్టించాడనేదికూడ మనం సాధారణంగా వింటున్న సమాధానం

2. బ్రాహ్మణులు రూపొందించిన విధానంలో దేవునికి ప్రజాపతి, ఈశ్వర, బ్రహ్మ మహాబ్రహ్మ, యింకా చాలా పేర్లున్నవి.

3. ఈ దేవుడెవరు? ఎలా అవతరించాడన్న దానికిమాత్రం సమాధానం లేదు.

4. దేవుని నమ్మేవారు దేవుడు సర్వశక్తిమంతుడనీ, సర్వాంతర్యామనీ, సర్వమూ ఎరిగినవాడని నమ్ముతారు.

5. దేవునికి కొన్ని మహాసద్గుణాలు సైతం ఆపాదించబడినవి. దేవుడు చాలమంచివాడనీ న్యాయబుద్ధికలవాడనీ. అందరినీ ప్రేమిస్తాడని నమ్ముతారు.

6. దేవుడే ఈ సమస్తవిశ్వాన్ని సృష్టించాడని సుగతుడు విశ్వసించాడా అన్నది ప్రశ్న.

7. అందుకు సమాధానం "లేదు" అనే. అలా తానెప్పుడూ అనలేదు.

8. దేవుడనేవాడు లేడనేందుకు బుద్ధుడు చాలా కారణాలను చూపెట్టాడు.

9. దేవుడున్నాడని అంటారేగాని ఆ దేవుని చూసినవారెవ్వరూ లేరు.

10. అంటే దేవుని ఎవ్వరూ ఎరుగరు. ఎవ్వరూ చూడలేదు.

11. దేవుడే ఈ ప్రపంచాన్ని సృష్టించాడనేందుకు ఎవ్వరూ ఏ ఋజువులూ చూపెట్టలేరు. ప్రపంచం ఏర్పడింది. దాన్నెవ్వరూ సృష్టించలేదు.

12. దేవుని నమ్మినందువలన గలిగే ప్రయోజన మేమున్నది? అది నిష్ప్రయోజనకరమైనది.

13. దేవునిపై విశ్వాసంతో ఏర్పాటైన ఏమతమైనా కేవలం ఊహాజనితమైనదేనని బుద్ధుడు చెప్పాడు.

14. అందుచేత దేవునిపై ఆధారపడి నెలకొల్పబడిన ఏ మతమైనా ఆచరణయోగ్యం కాజాలదన్నాడు.

15. అలాంటి మతం మూఢవిశ్వాసాలను పెంపొందించడానికి మాత్రమే ఉపయోగపడుతుంది.

16. ఇంతవరకు ఇలాకొనసాగిన బుద్ధుని వాదం అంతటితో ఆగలేదు. బుద్ధుడు ఆ విషయంపై సుదీర్ఘమైన చర్చనే కొనసాగించాడు.

17. దైవికవాదాన్ని నిరసిస్తూ బుద్ధుడు చెప్పిన కారణాలు చాలాఉన్నాయి.

18. దేవుడున్నాడని చెప్పేందుకు వాస్తవికమైన ఆధారమంటూ ఏదీలేదు.

19. వశిష్టుడు, భరద్వాజుడు అనే ఇద్దరు బ్రాహ్మణులతో బుద్ధుడి సంవాదం పరిశీలించినట్లయితే ఎన్నోవివరాలు వెల్లడౌతాయి.

20. ముక్తిసాధనకు సరయిన మార్గమేది? ఏది కాదు? అన్న విషయంపై వారిమధ్య గొప్ప వివాదం బయలుదేరింది.

21. ఆ వివాదంనడుస్తున్న కాలంలోనే సుగతుడు తన విశేషభిక్షు పరివారంతో కోసలమార్గంలోపయనిస్తూ ఐరావతీనదీ తీరంలో మానస ఘాట్ అనే ఒక బ్రాహ్మణపల్లెదాపునగల మామిడితోపులో బసచేశాడు.

22. ఈ వశిష్ట, భరద్వాజులనే బ్రాహ్మణులుకూడ ఆ పల్లెవాసులే. భగవానుడు తమ పల్లెకొచ్చాడని విన్న ఆ ఇరువురు వెళ్ళి ఆయన్ని దర్శించి వారికి తమ వివాదాన్ని వినిపించారు.

23. భరద్వాజుడు "తారుక్క" మార్గానుసరణద్వారా సరాసరి మోక్షంవైపే వెళ్ళి బ్రహ్మసాన్నిధ్యం పొందేందుకు వీలౌతుంది" అన్నాడు.

24. వశిష్టుడు అన్నాడు: "ఓ గౌతమా! ముక్తిసాధన విషయంలో బ్రాహ్మణులు పలు

మార్గాలు బోధిస్తున్నారు. అర్ధరీయ బ్రాహ్మణులొక మార్గం చూపెడితే తైత్తిరీయ బ్రహ్మణులు మరోమార్గం చూపెడుతున్నారు. కాంచక. బీహువర్గీయ బ్రాహ్మణులు వీరిద్దరిమార్గాలకు బిన్నమైన మార్గాలు చూపిస్తున్నారు. వారిలో ఎవరికి వారు బ్రాహ్మసాన్నిధ్యం పొందేందుకు తమదే సరైనమార్గమంటున్నారు.

25. "ఒక గ్రామంలో వీధులనేకం ఉన్నప్పటికినీ అవన్నీ ఒక కూడలికిచేరతాయి కదా! అలాగే ఈ బ్రాహ్మణులు చూపెట్టేమార్గాలన్నీ బ్రహ్మసాన్నిధ్యంవైపే తీసుకువెళుతుంటాయి"

26. "అయితే అవన్నీ సరియైనమార్గాలేనంటావా వశిష్టా? అని భగవానుడు ప్రశ్నించగా " ఔనననినేనంటాను గౌతమా". అని వశిష్టుడు సమాధానమిచ్చాడు.

27. "అయితే ఓ వశిష్టా! మూడు వేదాలను క్షుణ్ణంగా పఠించిన బ్రాహ్మణుల్లో బ్రహ్మను ముఖాముఖి కలుసుకున్నవారెవరైనా వున్నారా?"

28. "ఎవ్వరూ లేరు గౌతమా."

29. "పోనీ, వేదాధ్యయనంచేసి బ్రాహ్మణాలను బోధిస్తున్న వారిలో బ్రహ్మను ముఖాముఖీ చూచినవారున్నారా?"

30. "నిజంగా ఎవ్వరూ లేరు గౌతమా!" -

31. "అయితే బ్రహ్మను ఎవ్వరూ చూడలేదు. బ్రహ్మను గూర్చి ఖచ్చితమైన పరిజ్ఞానమున్న వారులేరు ఔనా?" ``అవును గౌతమా" అని వశిష్టుడు సమాధానమిచ్చాడు. "అయితే బ్రహ్మంటూ ఒకడున్నాడనేది వాస్తవమైనదని నమ్మేందుకు ఆధారమేమిటి?"

32. "వశిష్టా! గ్రుడ్డివాళ్ళు పొడవైనతాడు పట్టుకుని ఒకడివెనక మరొకడునడుస్తున్నా మొదటివాడుకాని, మధ్యవాడుకానీ, కడవాడుకానీ ఏదీచూడజాలనట్లే వివిధ వాదనలను ప్రతిపాదిస్తున్న బ్రాహ్మణులలో కూడ వ్యర్థప్రసంగం చేస్తున్నారు.

33. "ఇది - ఒకడు తానెప్పుడూచూచి ఎరుగని స్త్రీని ప్రేమించాడన్నట్లుగా లేదా, వశిష్టా?" అని గౌతముడు ప్రశ్నించగా "అలాగే వున్నదంటూ" వశిష్టుడు జవాబిచ్చాడు.

34. "తాను చూడని స్త్రీని ప్రేమించాడనివిని, అయితే ఆ స్త్రీ ఎంతఅందంగా వుంటుంది? ఆమె గొప్పవంశానికి చెందినదా ? బ్రాహ్మణ కులమా? లేక వైశ్యకులమా లేక శూద్రకులమా?" అని ప్రశ్నిస్తే ఏమి సమాధానమిస్తాడు?

35. గౌతముడు వశిష్ట, భరద్వాజులనుద్దేశిం "ప మిత్రులారా! మహాబ్రహ్మ అందరికంటే ముందు పుట్టినవాడు, తానే సర్వమూ జయించినవాడు అజేయుడు, సర్వాధికారి, సృష్టి స్థితిలయలకు కారకుడు, సమస్త మానవకోటికి పిత, సమస్తముఅయిఉండాలి కదా!

36. అనగా పుట్టిన వాడికి, ఇక పుట్టబోయే వారికి కూడ తనే తండ్రి.

37. మీరు పూజించే ఆ బ్రహ్మ అంతటి విజయుడు, అజేయుడు, పుటినవారికి, ఇక

పుట్టబోయేవారికి తండ్రి, శాశ్వతుడు, అనంతుడు అయినట్లయితే అతనిచే సృష్టించబడిన మనం అశాశ్వతులమై, జీవితమొక మజిలీవలె కొంతకాలం జీవించి తనువుచాలించాల్సి రావడానికి కారణం ఏమిటి?

38. ఈ ప్రశ్నలకు వారు ఏ సమాధానమూ చెప్పలేక పోయారు.

39. దేవుడు సర్వశక్తిమంతుడన్న విషయంపై బుద్ధుడిలా తనవాదన కొనసాగించాడు. "దేవుడు సర్వశక్తిమంతుడైనట్లయితే, యీ సృష్టికి తానే కారకుడైనట్లయితే ఇక మానవుడు చేయగలిగింది ఏదీ లేదన్న మాట. తానేదీ చేయవలసిన అవసరం కూడ లేదు. ఇక తాను ఏదీ చేయాలన్న సంకల్పం కూడ వుండజాలదు. అలాంటపుడు మానవుడు సృష్టిలో ఒక భాగంగా ఉంటూ ప్రాపంచిక విషయాలలో ఉదాసీనంగా వుండి పోవాల్సిందే. అదే వాస్తవమైనట్లయితే బ్రహ్మ మానవుని ఎందుకు సృష్టించినట్లు?

40. వశిష్టుడు దీనికి ఎలాంటి సమాధానమూ చెప్పలేక పోయాడు.

41. ఇక నాల్గవ వాదం దేవుడంతటి మంచివాడే హంతకులను, దొంగలను, దుశ్శీలులను, అసత్యవచనులను, వదురుబోతులను యితరులను దూషించేవారినీ, అత్యాశాపరులను, విచలితులను ఎందుకు సృష్టించాడు? ఇలాంటివారి సృష్టికి ఈశ్వరుడే కారకుడా? అదే వాస్తవమైతే అలాంటి దేవునివలన ప్రయోజనమేమిటి?

42. దేవుడు సర్వంతెలిసినవాడు, దయామయుడు అన్న విషయంపై నాల్గవ వాదన యిలా సాగింది.

43. "దేవుడే సర్వసృష్టికి కారకుడై, న్యాయవంతుడై, దయామయుడై వున్నట్లయితే లోకంలో యింతటి అన్యాయమెలా అలముకున్నది?" జినుడు ఇంకా యిలా ప్రశ్నించాడు. దేవుడు సమస్తమూ ఎరిగినవాడుకదా, లోకంలో యింతటి రుగ్మత విస్తరించి వుండగ దాన్నెందుకు రూపుమాప లేకపోతున్నాడు? అంతటి శక్తిమంతుడైన బ్రహ్మ ప్రపంచాన్ని ప్రక్షాళన చేయవచ్చును కదా? తనచే సృష్టించబడినవారు ఎన్నో బాధలకు గురికావటానికి కారణమేమిటి? మోసం, వంచన, అజ్ఞానం, అంతటా ఆవరించివుండటానికి కారణమేమిటి? అసత్యం సత్యాన్ని ఎలా జయించగలుగుతుంది? సత్యం, న్యాయం విఫలంకావటానికి కారణమేమిటి? చెడునే ప్రోత్సహించే బ్రహ్మ చాల అన్యాయవర్తనుడై ఉండాలి కదా?

44. దేవుడే సర్వశక్తిమంతుడై ఉన్నట్లయితే మంచికి, చెడుకుతానే కారకుడై ఉన్నట్లయితే తాను తప్పక పాపకళంకితుడైవుండాలి. మానవుని సంకల్పలోపమా లేక దేవుడు గ్రుడ్డివాడై న్యాయమేదో గుర్తించలేకున్నాడా?"

45. దేవుడనే వాడున్నాడా? లేడా? అన్న మీమాంసపై కాలం వృధాచేయడంవలన కలిగే లాభమేదీ ఉండజాలదు అన్నది ఆయన తరువాతి వాదన.

46. మానవుడికి, దేవుడికిగల సంబంధం ఏపాటిదన్న మీమాంసకంటే మానవుడికి, సాటి మానవుడికి మధ్య ఎలాటి సంబంధాలుండలన్నదే మతం పరమార్థం. మానవుడు సాటి మానవులతో సత్సంబంధాలు కలిగి వున్నట్లయితే తద్వారా అందరూ సుఖపరులుకాగలరన్నది మతం ఉద్దేశ్యం కావాలి.

47. దేవుడున్నాడా? లేడా? అన్న విషయంపై కాలయాపన చేయడాన్ని భగవానుడు వ్యతిరేకించడానికి మరో ముఖ్యకారణమున్నది.

48. దేవుడి పేరుతోనే ఈ పూజాపునస్కారాలు, జపతపాలు, జరుగుతున్నవి. ఇలాంటి మూఢాచారాలవలన మానవునిలో సదవగాహనలోపిస్తున్నది. తాను ప్రవచించిన అష్టాంగమార్గంలో ఈ సదవగాహనకు ఎంత ప్రాధాన్యతో,ఉంది.

49. ఆ కారణంగా భగవానుడి దృష్టిలో దేవునిపై నమ్మకమనేది చాల ప్రమాదకరమైనది. ఎందుకంటే దేవుడున్నాడనుకొన్నట్లయితే ఇక పూజలు, క్రతువులు తప్పవు. వాటిని నిర్వహించేందుకు పూజారి ఆవశ్యకత తప్పదు. ఈ పూజారి తెలివి చాలకుటిలమైనది. ఇతడు మూఢాచారాలను, మూఢనమ్మకాలను ప్రోత్సహించి మానవునిలో "సమ్మాదిత్తి" (సమదృష్టి) ఏర్పడకుండా చేస్తాడు.

50. దేవుడున్నాడని నమ్మేవాదాన్ని వ్యతిరేకిస్తూ బుద్ధుడు తెచ్చిన వాదనల్లో కొన్ని అనుభవపూర్వకమైనవి, మరికొన్ని చింతనాపరమైనవి. అయితే అవి దేవునిపై విశ్వాసాన్ని పూర్తిగా హరించగలవి కాకపోవచ్చునని కూడ బుద్ధునికి తెలుసు.

51. అయితే దేవుడున్నాడన్న వాదాన్ని బ్రద్దలు చేసే దృష్టాంతాన్ని కూడ భగవానుడు చూపెట్టగలిగాడు "పతిత సముత్పాద" సిద్ధాంతంలో భగవానుడావాదనను మరింత స్పష్టంచేయటం జరిగింది.

52. ఈ సిద్ధాంతంప్రకారం దేవుడున్నాడా లేడా అన్నది ప్రధానమైన విషయమేగాదు. దేవుడే ఈ సమస్తవిశ్వాన్ని సృష్టించాడా లేదా అన్నదికూడ ముఖ్యమైన విషయం కాదు. సృష్టించాడనబడేవాడు దాన్నెలా సృష్టించగలిగాడో పరిశీలించడం ప్రధానమైన విషయం. ఆ విషయమై సుదీర్ఘపరిశీలన చేసినట్లయితే యీ ప్రపంచమెలా సృష్టింప బడిందో తెలుస్తుంది.

53. ఇక్కడ ప్రధాన విషయమేమిటంటే ఆ దేవుడనబడేవాడు ఏవో ఒకదాని నుండి ఈ విశ్వాన్ని సృజించాడా లేక శూన్యంనుండే విశ్వాన్ని సృజించాడా అన్నదే.

54. శూన్యంనుండే సృజించాడన్నది నమ్మశక్యంగాని విషయం.

55. అలాగాక ఏదో ఒకదానినుండే దేవుడీ విశ్వాన్ని సృజించాడను కొన్నట్లయితే సృష్టికి ముందే ఏదో ఒకటుండిఉన్నట్లయితే దేవుడే ఈ సృష్టికి మూలకారకుడని భావించేందుకు వీలులేదు. ఎందుకంటే తాను సృష్టించక పూర్వమే ఏదో ఒకటుండి వుండడం చేత.

56. దేవుడు సృష్టి ప్రారంభించకపూర్వం మరొకటేదో సృష్టించబడివున్నపుడు దేవుడే ఈ సృష్టికి కారకుడని చెప్పేందుకు వీలులేదు.

57. దేవుడున్నాడా లేడా అన్న విషయంపై బుద్ధభగవానుడింతటి తార్కికదృష్టితో పరిశీలించి కడకు దేవుడనేవాడు కేవలం అభూత కల్పనగా తేల్చివేశాడు.

58. పై కారణాల వలన దేవుడున్నాడని విశ్వసించడం ధమ్మం కాదనీ అది కేవలం కల్పన మాత్రమేనని చెప్పాడు.

# 3. బ్రహ్మంతో ఐక్యమైపోవడమే ధ్యేయమని విశ్వసించడం బూటక ధమ్మం

1. బుద్ధుడు తన ధర్మాన్ని ప్రచారం చేస్తూండిన కాలంలో వేదాంతమనే తాత్వికధోరణి కూడ ప్రచారంలో ఉండేది.
2. ఈ సిద్ధాంతానికి సంబంధించిన సూత్రాలు పరిమితమై చాలా సులభధోరణిలో వుండేవి.
3. ఈ సమస్త విశ్వాంతరాళానికి బ్రహ్మ పేరుతో సర్వవ్యాప్తమైన ఒక సామాన్య సూత్రం వుంది.
4. అది బ్రహ్మ సత్యం.
5. ఆ బ్రహ్మ ప్రతిఒక్కరి ఆత్మలలో అంతర్లీనమైఉన్నాడనేది ఆ వేదాంతంలో మొదటి సూత్రం.
6. వ్యక్తిఆత్మ బ్రహ్మలో లీనమైపోవడంద్వారానే ముక్తి లభిస్తుందన్నది రెండవ సూత్రం.
7. జీవాత్మలోనే పరమాత్మ ఉన్నాడని విశ్వసించడం ద్వారానే జీవాత్మ పరమాత్మలో లీనం కాగలదనేది ఆ సిద్ధాంతసారం.
8. జీవాత్మ పరమాత్మలో లీనంకావలెనంటే సంసారిక బంధనాలను విడనాడాలి.
9. వేదాంత సిద్ధాంతమిలా ఉంటుంది.
10. బుద్ధుడు ఈ సిద్ధాంతాన్ని ఏమాత్రం గౌరవించలేదు. ఇది కేవలం ఊహాజనితమైందనీ అందులో వాస్తవికతకు ఏమాత్రం తావులేదనీ బుద్ధుడు త్రోసిపుచ్చాడు.
11. భరద్వాజుడు, వశిష్టుడు అనే ఇరువురు బ్రాహ్మణులతో తానుజరిపిన సంవాదంలో ఈ సిద్ధాంతంపై స్పష్టమైనవివరణ మనకు లభిస్తుంది.
12. ఒకానొక వాదాన్ని వాస్తవమని నమ్మేందుకు సహేతుకమైన ఋజువు కావాలి.
13. ఈ ఋజువులు ప్రత్యక్షంగానో లేక తత్వవిచారణ ద్వారానో మనం గ్రహించవచ్చు.
14. "బ్రహ్మ అనేవాడిని చూచినవారెవరైనా ఉన్నారా? మీలో ఎవరైనా చూశారా? బ్రహ్మతో

మీరెవరైనా మాట్లాడారా? పోనీ బ్రహ్మం ఉనికినిగురించి మీకే ఆధారమైనా ఉన్నదా?" అంటూ ఆ ఇరువురినీ ప్రశ్నించాడు.

15. అందుకు వశిష్టుడు "లేద"ని సమాధానమిచ్చాడు:

16. పోనీ బ్రహ్మం ఉనికి గూర్చి నిర్ధారించేందుకు మరి ఏ ఇతర ఆధారంకూడ లేదు.

17. "అలాంటపుడు బ్రహ్మంటూ ఒకడున్నాడని చెప్పేందుకు ఆధారమేమిటని" బుద్ధుడు ప్రశ్నించినపుడు అందుకు వారినుండి ఎలాంటి సమాధానము లభించలేదు.

18. మన కంటికి కనిపించక పోయినప్పటికినీ బ్రహ్మం వున్నాడనీ మన కంటికి కనిపించనంతటి సూక్ష్మరూపంలో ఉన్నాడనీ వాదించేవారున్నారు.

19. నిరాధారమైన ఈ వాదనకు మనమెలాంటి ప్రాధాన్యతను ఇవ్వాల్సిన అవసరంలేదు.

20. అయితే వాదనాసౌలభ్యంకోసం మనకంటికి కనిపించకపోయినప్పటికినీ బ్రహ్మ అనేవాడున్నాడనే అనుకుందాము.

21. విద్యుచ్ఛక్తి మన కంటికికనిపించదు కదా. అలాగే బ్రహ్మ అనే వాడున్నాడని కూడ అనుకుందాము.

22. అయితే అనుకోవడంతోనే సరిపోదు.

23. మనకు కనిపించకపోయినా దానిక్రియను మనం తెలిసికోగలిగివుండాలి. అప్పుడే దాన్ని నమ్మగలుగుతాం.

24. మనకు కనిపించనిది, ఏదో ఒక దృశ్యరూపాంతరంలో లభించాలి. లేకపోతే వాస్తవమని నమ్మడానికి వీలులేదు.

25. విద్యుచ్ఛక్తి అనేది మనకు కనిపించకపోయినప్పటికిని దానిద్వారా ఎన్నోపనులు మనం చేయగలుగుతున్నాము కనుక విద్యుచ్ఛక్తిఅనేది వున్నదని మనం నమ్మగలుగుతున్నాము.

26. మీట వేయగానే లైటు వెలుగుతుంది. విద్యుత్తనేది ఉన్నదని నమ్మేందుకు ఇంతకంటే ఆధారమేమికావాలి?

27. అయితే మనకు కనిపించని ఈ బ్రహ్మ ఏ క్రియ చూపగలుగుతున్నాడు? పోనీ మనకు కనిపించనిక్రియలనైనా తాను సృష్టించగలుగుతున్నాడా?

28. ఈ వాదానికి వారినుండి సమాధానం లేదు.

29. ఈ విషయమై మరోమంచి ఉదాహరణనుకూడ చూపెట్టవచ్చు. చట్టమనేది కేవలం కల్పించబడినది. అయితే దాని ప్రతిపాదన, ఆచరణలనుబట్టి చట్టమంటూ ఒకటున్నదని మనం గ్రహించవచ్చు.

30. అయితే ఇది కేవలం కల్పితమైనదేనని అందరూ ఎరుగుదురు.

31. కల్పితమైనట్టి ఈ చట్టాన్ని ఎందుకు అంగీకరించవలసి వస్తున్నది?

32. చట్టమనేది కల్పితమైనప్పటికిని దానివల్ల ఫలితమూ, ప్రయోజనమూ ఉన్నది కాబట్టి దానిని అంగీకరిస్తున్నాము.

33. బ్రహ్మం అనేది కేవలం కల్పితమైనది. దీని వలన ఏదైనా ప్రయోజనము కానీ ఫలితం కానీ ఉన్నదా?

34. ఆ ప్రశ్నకు వశిష్ట భరద్వాజులనుండి ఎలాంటి సమాధానం లభించలేదు.

35. ఆ వాదనను ఇంకా కొనసాగిస్తూ బుద్ధుడు వశిష్టుడిని ఉద్దేశించి : నీవు "బ్రహ్మను చూసావా?" అని ప్రశ్నించాడు.

36. "పోనీ వేదాలన్నీ విస్తారంగాచదివిన బ్రాహ్మణులలో బ్రహ్మంను చూచినవారెవరైనా ఉన్నారా?" అని ప్రశ్నించగా,

37. "లేదు గౌతమా ! ఎవరూచూడలేదు."

38. "వేదాలను క్షుణ్ణంగా పఠించిన ఏడుతరాలవారిలో బ్రహ్మంను ముఖాముఖి చూచిన బ్రాహ్మణులెవరైనా ఉన్నారా?"

39. "లేదు గౌతమా! ఎవరూ చూడలేదు"

40. వేదాధ్యయనంచేసి వాటిసారాన్ని బోధించగల బ్రాహ్మణుల్లో ఎవరైనా బ్రహ్మను చూశారా?"

41. "లేదు గౌతమా! ఎవరూచూడలేదు."

42. "పోనీ వశిష్టా, పూర్వకాలపు ఋషుల్లో ఎవరైనా నేను బ్రహ్మంను చూసాను, తానుఫలానాచోట వుంటాడు. ఫలానా విధంగా ఉంటాడు అని చెప్పినవారెవరైనా ఉన్నారా?"

43. "లేదు గౌతమా, ఎవరూ లేరు."

44. బుద్ధుడు ఆ బ్రాహ్మణుల నిద్దరినీ ఉద్దేశించి ఇలా అన్నాడు.

45. "అలాంటపుడు వశిష్టా, మానవుడు బ్రహ్మంతో ఐక్యమైపోతాడన్న వాదం కేవలం బ్రాహ్మణాల బుద్ధిజాడ్య ప్రేలాపనమాత్రమే కదా?"

46. "వశిష్టా, గుడ్డివాళ్ళు ఒక తాడును పట్టుకొని ఒకరి వెంట మరొకరు నడుస్తున్నప్పటికిని వారిలో మొదటి వాడు కానీ, మధ్యవాడు కానీ లేక ఆఖరి వాడు కానీ ఏమి చూడలేనట్లే బ్రహ్మంను గురించి ఈ బ్రాహ్మణాలు చెప్పేదంతా, మధ్యవాడుకానీ లేక ఆఖరి

వాడుకానీ ఏమి చూడలేనట్లేకేవలం గ్రుడ్డివాడనే కదా? బ్రహ్మంను గురించి ఈ బ్రాహ్మణాలుచేస్తున్న ప్రచారమంతా అర్థరహితమైనది, నిష్ప్రయోజనమైనది మాత్రమే."

47. "వశిష్టా, ఒకడు తానెరుగని కన్యను గూర్చి ఆమె ఎంత అందమైనదీ, అమె కోసం తానెంత తపించిపోతున్నదీ వర్ణించాడనుకుందాం.

48. అది విన్నవాళ్ళు అంత అందమైన ఆ కన్యను నీవెంతో ప్రేమిస్తున్నావు కదా, ఆమె ఎంతటి ఉన్నతురాలు? ఆమె బ్రాహ్మణ కన్యా లేక వైశ్యకులమా లేక శూద్రకులానికి చెందినదా అని ప్రశ్నించారనుకుందాం.

49. "దానికి తానేమి సమాధానం చెబుతాడు?

50. తన సాటిమిత్రులు ` ఓయీ ఎంతో అందమైన స్త్రీని నీవు ప్రేమించానంటున్నావు కదా! ఆమె పేరేమిటి? తన కులగోత్రాలేమిటి? ఆమె పొడగరియా లేక కురచనిదా లేక సామాన్యమైన ఎత్తుంటుందా? ఆమె నలుపా, తెలుపా, బంగారువర్ణమా? ఆమె గ్రామంలో ఉంటుందా లేక పట్నంలో ఉంటుందా? అని ప్రశ్నించినట్లయితే ఆ ప్రశ్నలకు తానేమి సమాధానం చెప్పగలడు?

51. వశిష్టా, తానెరుగని కన్యనుగూర్చి తానేమిచెప్పినప్పటికినీ అది కేవలం బుద్ధిహీనతే కదా?

52. "గౌతమా! నీవన్నదివాస్తవమే"నని ఆ ఇరువురు బ్రాహ్మణులు అంగీకరించారు.

53. అందుచేత బ్రహ్మం. అనేది వాస్తవంకాదు. బ్రహ్మంఅనే వాడిపై ఆధారపడి రూపొందించబడిన ఏ మతంకూడ వాస్తవమైనది కాజాలదు.

## 4. ఆత్మ అనేది ఉన్నదని నమ్మడం ధమ్మం కాదు.

1. ఆత్మంటూ ఒకటున్నదనే భ్రమతో రూపొందించబడిన మతం కేవలం అభూతకల్పన మాత్రమేనని బుద్ధుడు చెప్పాడు.
2. ఆత్మ అనేదాన్ని ఎవరూచూడలేదు. దానితో ఎవరూ సంభాషించినది లేదు.
3. ఆత్మను ఎవరూ చూడలేరు, ఎవరూ ఎరుగరు.
4. వాస్తవంగా ఉన్నది ఆత్మకాదు, మనసు మాత్రమే. మనసు వేరు, ఆత్మ వేరు.
5. ఆత్మంటూ ఒకటున్నదని విశ్వసించడంవలన ఎలాంటిప్రయోజనమూ లేదు.
6. ఆ కారణంగా ఆత్మ అనేదాని ఆధారంతో రూపొందించబడిన మతమేదీ అనుసరణీయమైనది కాదు.
7. అలాంటి విశ్వాసంవలన ఏర్పడినది మూఢత్వమే.
8. బుద్ధుడు ఈ విషయాన్ని [illegible]

పరిశీలించి చర్చించాడు.

9. సామాన్యప్రజానీకం దేవుడున్నాడని విశ్వసిస్తున్నట్లే ఆత్మ అనేది ఒకటున్నదని కూడ నమ్ముతున్నారు.

10. ఆత్మ అనేది ఒకటున్నదనే నమ్మకంకూడ ఈ బ్రాహ్మణమతం సృష్టించినదే.

11. బ్రాహ్మణమతంలో ఈ ఆత్మనే జీవాత్మ అనికూడ అంటారు.

12. ఈ బ్రాహ్మణ మతం విశ్వాసం ప్రకారం ఆత్మ వేరు, శరీరం వేరు. జీవి పుట్టుకతోనే ఈ ఆత్మ ఆ జీవిలో ప్రవేశిస్తుందని వారినమ్మకం.

13. ఈ ఆత్మ అనే దానితోపాటు మరికొన్ని నమ్మకాలనుకూడ ప్రచారంలో పెట్టారు.

14. వారు చెప్పేదాన్ని బట్టి మానవుడు చనిపోయినా ఆత్మచావదు. మానవుడు చనిపోయిన తరువాత ఆత్మ ఆ కళేబరాన్నివదిలి మరోశరీరంలోకి ప్రవేశిస్తుంది.

15. మన వంటిపై బట్టలున్నట్టే శరీరం ఈ ఆత్మకు కవచం మాత్రమే.

16. అయితే బుద్ధుడు ఈ సిద్ధాంతాన్ని పూర్తిగా వ్యతిరేకించాడు. ఆ విషయంపై తాను సాగించిన వాదం "అన్.-అత్త" (అనాత్మిక) అనగా ఆత్మ అనేది లేదు.

17. ఈ ఆత్మకు సంబంధించి ఎన్నో ప్రశ్నలు ఉత్పన్నమౌతున్నాయి. ఆత్మ అనగా ఏమిటి? అది ఎక్కడి నుండి వస్తుంది? మానవుడు చనిపోయిన తరువాత దానిపరిస్థితి ఏమిటి? ఎక్కడికి వెళుతుంది? అప్పుడది ఏ రూపంలో ఉంటుంది? ఎంతకాలం అలా ఉంటుంది? ఈ ఆత్మఅనే సిద్ధాంతాన్ని వ్యతిరేకిస్తూ బుద్ధుడు ఈ ప్రశ్నలకు సంబంధించిన సుదీర్ఘమైన చర్చకొనసాగించాడు.

18. ఈ ఆత్మ అనేదానిపై మొదట తార్కికరూపంలో వాదన ప్రారంభించాడు.

19. "ఆత్మ అనేది ఏ రూపంలో ఉంటుందో, ఎంత పరిమాణంలో ఉంటుందో చెప్పగలరా?" అని దానిని విశ్వసించే వారిని ప్రశ్నించాడు.

20. ఈ విషయంపై బుద్ధుడు ఆనందునితో ఇలాఅన్నాడు: నా ఆత్మకు ఒక రూపమంటూ ఉన్నదని అది చాలా సూక్ష్మమైనదని కొందరంటారు. నా ఆత్మకు ఒక రూపమంటూ ఉన్నదని దానిపరిమాణం అపరిమితమైనదని మరి కొందరు, నా ఆత్మకు రూపురేఖలు లేవని, దానికొక పరిమాణమంటూ లేదని మరికొందరు అంటారు.

21. ఆనందా! ఈ విధంగా ఆత్మనుగురించి పలువురు పలువిధాలుగా చెప్పడం జరుగుతుంది.

22. ఆత్మ అనేది ఉన్నదని నమ్మేవారు అలా నమ్మడానికి కారణమేమిటి అనేది బుద్ధుడు తరచి పరిశీలించాడు. "ఆత్మ అనేది ఉన్నట్లు నాలో భావన కలుగుతున్నద"ని

కొందరంటారు. కాదు, నాలో అలాంటి భావన లేదు. ఆత్మ నిరాకారమైందని కొందరంటారు. కాదు, నాలో ఆత్మ ఉన్నట్టు భావన లేక పోయినా ఆత్మ సాకారమైనదే అని కొందరంటారు. ఈ విధంగా ఆత్మ అనేది సాకారమైనదనీ, నిరాకారమైనదని చెప్పినప్పటికిని ఆత్మంటూ ఒకటున్నదనే వీరిభావన.

23. ఆత్మంటూ ఒకటున్నట్లయితే చనిపోయినతరువాత అది ఏమైపోతుంది అని ఆత్మపై నమ్మకమున్నవారిని బుద్ధుడు ప్రశ్నించాడు.

24. "మనిషి చనిపోయినతరువాత తననుండివేరైన ఆత్మనెవరైనా చూడగలిగారా?" అని ప్రశ్నించాడు.

25. ఈ ప్రశ్నలన్నింటికి లభించిన సమాధానాలు అస్పష్టమైనవే.

26. మనిషి చనిపోయిన తరువాత ఆత్మ ఒక పదార్థంగా ఉండగలదా? ఈ ప్రశ్నకు ఎనిమిద రకాల ఊహారూపమైన అభిప్రాయాలను వ్యక్తపరుస్తున్నారు.

27. మనిషి చనిపోవటంతోపాటు తన ఆత్మకూడ చనిపోతుందా? ఈ విషయంపై కూడ ఎన్నో ఊహాపోహలున్నాయి.

28. మనిషి చనిపోయినతరువాత తన ఆత్మ సంతోషిస్తుందా లేక దుఃఖిస్తుందా? ఈ విషయం పైకూడ తాపసులు, బ్రాహ్మణులు భిన్నాభిప్రాయాలను వ్యక్తంచేస్తున్నారు. చనిపోయినతరువాత తన ఆత్మ సంతోషిస్తుందని మరి కొందరన్నారు. సంతోషం కానీ విచారంకానీ ఉండవని మరికొందరన్నారు.

29. ఆత్మ ఉనికిని గూర్చి బుద్ధుని విస్పష్టమైన అభిప్రాయం ఆయన చుందునితో జరిపిన సంవాదాన్నిబట్టి మనకు విదితమౌతున్నది.

30. బుద్ధుడు చుందునితో యిలా అన్నాడు: "చూడు చుందా! ఆత్మ ఉనికినిగూర్చి ఈ తాపసులు, బ్రాహ్మణులు వివిధఅభిప్రాయాలను వ్యక్తంచేస్తున్నారు. పరస్పర విరుద్ధమైన ఆ అభిప్రాయాలలో దేనినీ నేను అంగీకరింపజాలను."

31. కాని ఆత్మ అనేది లేదంటూ బుద్ధుడు చేసిన వాదనలో చాలా ముఖ్యమైనది ఒకటున్నది.

32. దేవునిఉనికిని వ్యతిరేకిస్తూ బుద్ధుడు ప్రతిపాదించిన వాదన ఈ ఆత్మ విషయంలో సైతం అన్వయిస్తుంది.

33. దేవుడు ఉన్నాడా లేడా అన్న వాదన ఎంత ప్రయోజనరహితమైనదో, ఆత్మ అనేది ఉన్నదా లేదా అన్న మీమాంసకూడా అంత ప్రయోజనరహితమని బుద్ధుని భావన.

34. దేవుడున్నాడని భావించడం సమదృష్టికి ఎంత అంతరాయమో, ఆత్మ ఉన్నదని భావించడం కూడ అంతే అంతరాయమని బుద్ధుని వాదన.

35. దేవుడున్నాడని నమ్మడం ఎంతటి మూఢభావనో ఆత్మ అనేది ఉన్నదని నమ్మడం కూడ

అంతే మూఢభావన. అంతేకాక దేవుడున్నాడని నమ్మడంకంటే ఆత్మ అనేది ఒకటున్నదని నమ్మడం ఎక్కువ ప్రమాదకరమని బుద్ధుని భావన. ఎందుకంటే ఆత్మ అనేది ఒకటున్నదని నమ్మడంలో పురోహితుని అవసరం ఏర్పడుతుంది. అటుపై ప్రాణి పుట్టినప్పటినుండి గిట్టేవరకు ఈ పురోహితుడు పెత్తనంచేస్తూనే ఉంటాడు.

36. అయితే ఇలాంటివాదనలో ఆత్మ అనేది ఉన్నదా లేదా అన్న విషయంపై బుద్ధుడు ఇదమిద్ధంగా తేల్చిచెప్పలేదని కొందరి భావన. ఆత్మ అనేది లేదని బుద్ధుడు ఖచ్చితంగా ఎక్కడా చెప్పలేదని కొందరి వాదన. ఈ విషయంపై బుద్ధుడు ఎటూతేల్చకుండా వదిలేశాడని మరికొందరి వాదన.

37. అయితే ఈ వాదనలన్నీ వాస్తవానికి దూరమైనవే. ఎందుకంటే బుద్ధుడు మహాళి భిక్షువుతో సంభాషిస్తూ ఆత్మ అనేది లేనేలేదని సుస్పష్టంగా తేల్చిచెప్పాడు. ఆత్మఅనేది లేదన్న బుద్ధుని సిద్ధాంతమే అనాత్మవాదం ("అవత్త")

38. ఆత్మఉనికిపై బుద్ధుడు జరిపిన అనేకసంవాదనలలో ఆత్మపైవిశ్వాసం చాలా ప్రమాదకరమని చెప్పడం గమనార్హమైన విషయం.

39. ఆత్మ ఉనికిని నిరాకరిస్తూ ఆయన చేసిన సిద్ధాంతమే ``నామ-రూప" సిద్ధాంతమంటారు.

40. "విభాజ" పరిశీలనను అన్వయించి సాధించిన సిద్ధాంతం యిది. మానవ వ్యక్తిత్వం అనే సచేతనజీవి యొక్క వివిధధాతువులను సునిశితంగా, పటిష్టంగా విశ్లేషించేదే "విభాజ" పరిశీలన.

41. సచేతనజీవుల సమిష్టినామమే "నామ-రూపం".

42. బుద్ధుడి పరిశీలనప్రకారం, భౌతికమైన మానసికమైన ధాతువులు సమ్మేళనంచెంది సాకారరూపం సంతరించుకున్నదే ``సచేతనజీవి" వాటిని ``ఖండాల"ని అన్నాడు.

43. ప్రధానంగా మన్ను, నీరు, నిప్పు, వాయువుల సమ్మేళనమే "రూపఖండం".

44. ఈ రూపఖండానికి "నామఖండం" తోడైనప్పుడే సచేతనజీవి ఏర్పడుతుంది.

45. ఈ నామఖండాన్ని "వినాశం"లేక చేతనత్వంగా పేర్కొన్నాడు మానసికమైన మూడు ధాతువుల సమ్మేళనమే నామఖండము. ఈ నామఖండంలో ఈ స్పృహ, గ్రాహ్యత, మానసికస్థితి అని మూడు ధాతువులున్నాయి. అయితే ఈ మూడింటిలో ప్రతిదానిని చేతనత్వంగానే భావించడం జరుగుతున్నది. మానవుని మానసికమైన చేష్టలన్నింటికి తనలోని చేతనత్వమే మూలమని ఆధునిక మానసిక శాస్త్రజ్ఞులుకూడ అంగీకరిస్తున్నారు.

46. మట్టి, అగ్ని, తేజస్సు, వాయుధాతువుల సమ్మేళనం ద్వారానే చేతనత్వం ఏర్పడుతున్నది.

47. అయితే బుద్ధుడు ప్రతిపాదించిన ఈ చేతనాసిద్ధాంతానికి ఒక అభ్యంతరం చెప్పాడు.

48. అలా అభ్యంతరం తెలిపినవారు ఈ చేతనత్వం ఎలా ఉత్పన్నంకాగలుగుతున్నదని

ప్రశ్నించారు.

49. మానవుని పుట్టుకతోనే ఏర్పడే ఈ చేతనత్వం మానవుడు చనిపోవడంతో అంతమైపోవడం మాత్రం వాస్తవం. అయితే పైనచెప్పబడిన నాలుగు ధాతువుల సమ్మేళనం కారణంగానే చేతనత్వం ఏర్పడుతుందని చెప్పటానికి ఆధారంఏమిటి?

50. ఈ నాలుగు ధాతువులు కలవడంద్వారాగానీ లేక సమపాళ్ళలో మిళితంకావడం ద్వారాగాని చేతనత్వం రూపొందుతుంది అని బుద్ధుడు చెప్పలేదు. ఆయన స్పష్టం చేసినదేమిటంటే రూపం లేక కాయంవెంబడే చేతనత్వంకూడ ఏర్పడుతుందని.

51. ఈ వాదనను సమర్థించేందుకు మనం విద్యుత్ క్షేత్రాన్ని ఉదాహరణగా తీసుకోవచ్చు. ఎక్కడైతే విద్యుత్తు ఉంటుందో అక్కడ అయస్కాంతక్షేత్రం కూడా వుంటుంది. అయితే విద్యుత్ వెంట అయస్కాంతక్షేత్రం ఎలా ఏర్పడుతుందన్న విషయం ఎవరు చెప్పగలరు?

52. విద్యుత్తుకి వెన్నంటి అయస్కాంతశక్తి ఉన్నట్లే కాయం రూపుచెందటంతోపాటు చేతనత్వంకూడా ఏర్పడుతుందని గ్రహించవచ్చును కదా!

53. విద్యుత్తును వెన్నంటి అయస్కాంతశక్తి ఏర్పడడాన్నే ప్రేరేపితము అంటాము. అలాగే కాయం రూపుచెందటంతో ఏర్పడిన ప్రేరేపిత ప్రభావం వలన చేతనత్వం ఏర్పడుతుందని ఎందుకు భావించకూడదు?

54. ఆత్మ అనేదిలేదన్న బుద్ధుని వాదం. ఇంతటితో పూర్తి కాలేదు. దానికి సంబంధించిన ఇంకో ముఖ్యమైన విషయాన్నికూడ వ్యక్తంచేశాడు.

55. చేతనత్వం ఏర్పడటంతో మనిషి చేతనజీవి అవుతాడు. ఆ కారణంగా చేతనత్వం అత్యంత ముఖ్యమైనది.

56. ఈ చేతనత్వంద్వారానే గ్రాహ్యత, ఆవేశం, సంకల్పశక్తి ఏర్పడుతున్నాయి.

57. చేతనత్వంద్వారా గ్రాహ్యత ఉత్పన్నం కావడం ద్వారానే తెలివిడి ఏర్పడుతుంది. ఆ తెలివిడిద్వారానే మానవుడు లోపలి, బయటి వాస్తవాలను, ఘటనలను అవగాహన చేసుకుంటాడు.

58. చేతనత్వంద్వారా ఏర్పడే ఆవేశఫలితంగానే మానవుడు సంతోషం లేక సంతాపం వంటి అనుభూతులను పొందగలుగుతున్నాడు.

59. చేతనత్వంద్వారా ఏర్పడే సంకల్పశక్తిద్వారానే మానవుడు కార్యరూపంలో తాను కోరినవి సాధించగలుగుతున్నాడు.

60. దీనినిబట్టి చేతనత్వంద్వారానే మనిషి తనుచేస్తున్న కార్యాలన్నీ చెయ్య గలుగుతున్నాడు.

61. ఈ విషయమె ఇంతవరకు విషయపరిశీలన చేసిన బుదుడు - చేతనతాం దాారానే

మానవుడు, అన్నిపనులను నిర్వహిస్తున్నపుడు ఆత్మ అనేదాని పాత్ర ఏమిటని ప్రశ్నించాడు.

62. ఏ పాత్రానిర్వహించని ఆత్మ ఉనికి కేవలం అసంభావ్యం.

63. ఈ విధంగా బుద్ధుడు ఆత్మ అంటూ ఒకటి లేదని సశాస్త్రీయంగా నిరూపించగలిగాడు.

64. ఆ కారణంగా ఆత్మ అనేది ఉన్నదని నమ్మడం ధమ్మంలో భాగంకాజాలదు.

## 5. బలులను నమ్మటం ధమ్మం కాదు.

(I)

1. బలులు యివ్వటంపైనే బ్రాహ్మణమతం ఆధారపడి యున్నది.
2. వీటిలో నిత్యమని, నైమిత్తికమని రెండువిధాలు ఉన్నాయి.
3. ఎలాంటిప్రయోజనాన్ని ఆశించకుండా నిర్వర్తించే యజ్ఞయాగాదులు నిత్యమైనవి.
4. ఏదోఒక ప్రాపంచిక ప్రయోజనాన్ని ఆశించి నిర్వర్తించే వాటిని నైమిత్తికమైనవంటారు.
5. ఈ బ్రాహ్మణవిధులలో జంతుబలులు, సోమపానం, వినోదాలు వున్నవి.
6. అయినప్పటికిని ఈ యజ్ఞయాగాదులు సదాచారంగా పాటించబడుతున్నవి.
7. యజ్ఞయాగాదులతో కూడిన మతం అనుసరణీయమైనది కాదని బుద్ధుడు ప్రకటించాడు.
8. మతాచారంలో యజ్ఞయాగాదులు ఎందుకు చెయ్యరాదంటూ ప్రశ్నించిన బ్రాహ్మణులకు బుద్ధుడు సహేతుకమైన కారణాలనుచూపెట్టాడు.
9. ఆ విధంగా యజ్ఞయాగాదులవిషయంలో బుద్ధునితో వివాదానికి తలపడిన వారిలో ముగ్గురు బ్రాహ్మణులున్నారు.
10. వారు కూటదంతుడు, ఉజ్జయుడు మరియు ఉదయనుడు.
11. వారిలో కూటదంతుడను బ్రాహ్మణుడు సుగతుడిని దర్శించి యజ్ఞయాగాదులపై తన అభిప్రాయమేమిటో తెలుపమనికోరాడు.
12. అందుకు సుగతుడు "ఓ బ్రాహ్మణా, నీవు మంచి ప్రశ్నఅడిగావు. చెవులప్పగించి నేను చెప్పబోయే సమాధానం జాగ్రత్తగా వినుమ"న్నాడు.
13. "అలాగే వింటాను, వివరించుడ"ని కూటదంతుడు పలుకగా భగవానుడు ఇలా చెప్పాడు.
14. "చాలాకాలంక్రిందట, ఓ బ్రాహ్మణా! అతిపరాక్రమశాలి, ఐశ్వర్యవంతుడు, బంగారు,

వెండి ధనధాన్యరాసులు పుష్కలంగా వున్న ``మహావిజేతుడను'' రాజుండేవాడు.

15. ఒకానొకరోజున ఈ మహావిజేతుడు ఏకాంతంగా కూర్చొని ఇలాఆలోచించసాగాడు. "నాకు కావలసినన్ని ఆస్తిపాస్తులు, సుఖసౌఖ్యాలు అమరియున్నవి. అతి విస్తారమైన సామ్రాజ్యం నాకున్నది. నా క్షేమం అక్షయంకాకుండాఉండేందుకై నేనొక గొప్ప యజ్ఞాన్ని ఎందుకు చేయరాదు?"

16. రాజుగారి కోర్కెను విన్న ఆయన బ్రాహ్మణ వుద్యోగి ఒకడు ఆ రాజుతో "ఓ రాజా! మనరాజ్యం ఈనాడు పీడనకు, దోపిడికి గురియైయున్నది. దారిదోపిడిగాండ్లు గ్రామాలను, పట్టణాలను కొల్లగొడ్తూ రహదారులప్రయాణం కష్టతరం చేస్తున్నారు. ఇలాంటి పరిస్థితులలో మీరు ప్రజలనుండి పన్నులు వసూలుచేయడం సముచితం కాజాలదు.

17. "ఆ దారిదోపిడిగాండ్లను పట్టిబంధించి దేశబహిష్కారం చేయడం, జుల్మానాలు విధించడం, అవసరమైతే మరణశిక్షలుకూడ విధించేందుకు మీరు సమాయత్తం కావచ్చు. మీరెన్నిచర్యలు గైకొన్నప్పటికినీ తప్పించుకోగలిగిన దారిదోపిడిగాండ్లు తమ అరాచకచర్యలను కొనసాగిస్తూనే ఉంటారు.

18. దారి దోపిడీ చర్యలను పూర్తిగా అంతమొందించాలంటే ఒకేఒక మార్గమున్నది. పశుపోషణ, వ్యవసాయం చేస్తున్నవారికి మీరు అవసరమైన ఆర్థికసహాయంతోబాటు రాజ్యంలో వ్యాపారం చేయదలచుకున్నవారికి అవసరమైన సహాయం చేయండి. మీ రాజ్యంలో ఉద్యోగం చేయదలచుకొన్నవారికి అవసరమైనంత ఆహారం, వేతనాలు ఉదారంగా ఇవ్వండి.

19. అలాచేసినట్లయితే రాజ్యంలోని ప్రతి ఒక్కరికి వారిఅవసరం తీరుతుంది. ప్రజలందరూ ఆయాకార్యకలాపాల్లో నిమగ్నులైనపుడు దోపిడీగాండ్రే వుండరు. ఆయా వృత్తులవారు ఎంతో ఆసక్తితో ద్విగుణీకృతమైన శక్తితో తమవృత్తులు నిర్వహించుకో గలుగుతారు. వారిరాబడి పెరుగుతుంది. కనుక రాజుకు పన్నులు పెచ్చుగా చెల్లిస్తారు. ప్రజలందరు సుఖసంతోషాలతో జీవిస్తూ వారి పిల్లల సంగీత నృత్యాలతో సంతోషంగా కాలంగడుపుతారు. అపుడు వారిఇళ్ళ తలుపులుతెరచి నిశ్చింతగా నిద్రపోయినా దోపిడీలు జరగనేజరుగవు.

20. "బ్రాహ్మణవుద్యోగిసలహాను మహావిజేతరాజు అంగీకరించి తనరాజ్యంలోని ప్రజలందరికి ఎవరకిఎలాంటి సహాయం అవసరమో వారికి ఆసహాయం చేశాడు. ప్రజలందరూ సంపన్నులై పన్నులధికంగా చెల్లించడంతో రాజకోశాగారం ధనరాసులతో నిండిపోయింది. ప్రజలందరూ సుఖశాంతులతో జీవించగలిగారు. వారి పిల్లలు వీధుల్లో చెట్టాపట్టాలు వేసుకొని పాడుతూ, ఆడసాగారు. ప్రజలు తమ ఇండ్ల తులుపులు వేయవలసిన అవసరమే లేకపోయింది.

21. అపుడు రాజైన మహావిజేతుడు బ్రాహ్మణుని పిలిపించి ఇప్పుడు మనరాజ్యంలో

ఎలాంటి అక్రమచర్యలు లేవు కదా. మన రాజ్యమంతా సుఖశాంతులతో నిండివున్నది కదా, నా క్షేమం కోసం, నా రాజ్యం సుభిక్షంగా వర్ధిల్లడం కోసం నేనిప్పుడొక గొప్పయజ్ఞం చేయదలచాను. ఈ విషయమై నాకు తగిన సలహా ఇవ్వమని కోరాడు.

22. అపుడు రాజోద్యోగి రాజుగారితో అలాగే కానివ్వండి. మీ పట్టణాల్లోను, గ్రామాల్లోను నివసిస్తున్న క్షత్రియ, బ్రాహ్మణోత్తములకు మీరు తలపెట్టిన యాగం నిర్విఘ్నంగా కొనసాగేందుకు రాజ్యం సుభిక్షంగా ఉండేందుకు తోడ్పడ వలసిందిగా అందరికీ ఆహ్వానాలు పంపండి" అని సలహా ఇచ్చాడు.

23. ఓ కూటదంతా! అపుడారాజు, ఆ సలహాపాటించి తన రాజ్యంలోని క్షత్రియులకు, సంపన్న బ్రాహ్మణులకు ఆహ్వానాలు పంపగా వారు యజ్ఞం జరిపేందుకు ఇది సరియైన సమయమని సంతోషిస్తూ తమఅంగీకారాన్ని తెలిపారు."

24. మహావిజేత రాజు చాలతెలివైనవాడు, సర్వసమర్థుడు, అతని ఉద్యోగికూడ అంతటి తెలివైనవాడు, సమర్థుడు.

25. విజేతరాజు అతనిని పిలిపించి "ఓ బ్రాహ్మణోత్తమా, ఈ యజ్ఞమెలానిర్వహించాలో తెలుప"మని కోరాడు.

26. "ఓ రాజా! మీరు యజ్ఞాన్ని నిర్వహించతలపెట్టినపుడుగాని, నిర్వహిస్తున్న సమయంలోగాని, నిర్వహించిన తరువాతగానీ - అయ్యో ఈ యజ్ఞంవలన నా సంపద చాలా ఖర్చయి పోయిందన్న విచారం మాత్రం ఉండరాదు.

27. బ్రాహ్మణుడు రాజుతో ఇంకా ఇలా అన్నాడు. "రాజా, ఇక నీవు యజ్ఞం ప్రారంభించవచ్చు, అయితే జీవహింస చేసేవారుగానీ, వారికివ్వబడనిదానిని స్వీకరించేవారు, వంచనచేసేవారు, దురుసుగా మాట్లాడేవారు, అసందర్భ ప్రేలాపకులు, ఇతరుల ఆస్తిని ఆశించువారు, దురాలోచనలుగలవారు తక్క మిగిలిన వారందరినీ ఈ యజ్ఞానికి ఆహ్వానించి సమానంగా ఆదరించి వారిని సంతృప్తి పరచు. అప్పుడు నీ హృదయంలో ఎంతో శాంతి ఏర్పడుతుంది.

28. ఓ రాజా! ఆ యజ్ఞంలో ఎద్దులనుగాని, మేకలనుగానీ, కోళ్ళను గానీ, క్రొవ్విన పందులనుగానీ, ఏ జీవులను బలిచేయడం జరుగరాదు. చెట్లు నరికి స్తంభాలుగా అలంకరించరాదు. కడకు యజ్ఞంలో వాడేందుకు కుశదర్భలుకూడ కోయరాదు. ఆ యజ్ఞకాలంలో పనికై వినియోగింపబడిన బానిసలను, కూలీలను కొరడాలతో కొట్టి ఏడుస్తున్న మొఖాలతో వారుపనులు చేయడంజరుగురాదు. ఎవరు చేయగల్గినంత పని వారుచేయాలి. ఏమీ చేయకూడదనుకున్నవారిని నిర్బంధించరాదు. ఆ యజ్ఞంలో నేయి, నూనె, వెన్న, పాలు, తేనె వంటి పదార్థాలు మాత్రమే వాడాలి.

29. ఓ రాజా నీవు యజ్ఞం చేయదలిస్తే ఆ విధంగానే చేయాలి. యజ్ఞం పేరుతో జీవహింస

చేయడం, ఎలాంటి క్రూరత్వానికైనా పాల్పడడం పవిత్రతకాదు. జంతువులను చంపి యజ్ఞంచేయడం ద్వారా స్వర్గానికిపోగలమని భావించే మతం మంచిది కాజాలదు."

30. అప్పుడు కూటదంతుడు "అయితే ఓ గౌతమా! జీవహింసతో నిమిత్తంలేకుండా యజ్ఞం నిర్వహించితే తద్వారా ఫలితం పొందేందుకు మరోమార్గమేదైనా ఉన్నదా?" అని ప్రశ్నించాడు.

31. అందుకు గౌతముడు "అవును బ్రాహ్మణా, అలాంటి యజ్ఞం ఉన్నద"ని చెప్పాడు.

32. "అయితే గౌతమా, ఆ యజ్ఞం ఎలాంటిదో వివరించమ"ని కూటదంతుడు కోరగా గౌతముడిలా. చెప్పాడు:

33. "మానవుడు హృదయపూర్వకంగా జీవహింసకు పాల్పడకుండ, తనకివ్వబడని దానిని స్వీకరించకుండా, అసత్యమాడకుండా, ఉన్మాదహేతువైన మత్తుపదార్థాలు త్రాగకుండ, ఒకడు నిత్యం జాగృతితో జీవించగలిగితే అది యజ్ఞాలన్నింటిలోకి ఉత్తమమైనది. ఇది భూవిరాళం. కంటే, నిత్యదానధర్మాలకంటే, గృహదానాలకంటే, వేరొకని సలహాను స్వీకరించడం కంటేకూడ ఉత్తమమైనది."

34. గౌతముని ప్రవచనాల కించిన కూటదంతుడు "ఓ గౌతమా, మీ ప్రబోధం ఎంతో ఉత్కృష్టమైనది" అన్నాడు.

## (II)

1. ఒకనాడు ఉజ్జయన బ్రాహ్మణుడు సుగతుని ఇలా ప్రశ్నించాడు.

2. పూజనీయుడైన గౌతముడు యజ్ఞాలను నిర్వహించడం ఆమోదిస్తాడా?"

3. "ఓ బ్రాహ్మణా! యజ్ఞాలలో ప్రశంసనీయమైనవిగా కొన్నింటిని మాత్రమే నేను గుర్తిస్తాను. యజ్ఞం పేరుతో గోవులను, గొర్రెలను, మేకలను, కోళ్ళను, పందులను ఇంకా అనేకమైన జీవులను చిత్రవధ చేయడం మంచి యజ్ఞమని నేను ప్రశంసించజాలను" - "ఎందుచేత"?

4. "ఎందుకంటే యోగ్యులైనవారు, ధర్మమార్గావలంబులైనవారు ఆస్థానాలకు రారు.

5. అలాంటి జీవహింసలేని యజ్ఞాలను నేను అమోదిస్తాను. ఉదాహరణకు, సాంప్రదాయికమైన దానధర్మాలు, పరివారసంక్షేమ విధులు మొదలైనవి. "ఎందుచేత"?

6. ఎందుచేతనంటే - యోగ్యులైనవారు, ధర్మమార్గావలంబులైనవారు అట్లా చిత్రహింస జరిగేచోటుకి రారు."

## (III)

1. ఒకనాడు ఉదయనుడనే బ్రాహ్మణుడు సుగత్తుదర్శించి అదేవిధంగా ప్రశ్నించాడు.

2. "ఓ పూజనీయుడైన గౌతమా! యజ్ఞాన్ని మీరు ప్రశంసిస్తారా?" అందుకు బుద్ధుడిచ్చిన

సమాధానం ఈ విధంగా ఉన్నది.

3. "కాలానుగుణంగా కారుణ్యతను జూపి
క్రూరకృత్యాలను దరిజేరనీక
మానవుడు భవ్యుడై కడుమన్ననల పొంది
పుడమిపై ప్రాణాలు నిలుచునందాక
బ్రతుకు ధన్యతపొందు బాటలోనడచి
త్యాగనిరతినిజూపి పేరుగడియించి
సత్కార్య నిర్వహణకై తాను త్యజించి
బ్రతుకుబాటకు సార్థకతను జేకూర్చి
కరుణామయుండవై కాలంబు గడిపి
పరుల నాదుకొనంగ ప్రజ్ఞను జూపి
భువిలోన బాధలు సమయింపజూడు
అందులోనే కలదు సౌఖ్యధామంబు"

## 6. ఊహాజనితమైన వాటిని నమ్మడం ధర్మం కాదు

(I)

1. మానవుడిలో సహజంగా కొన్ని ప్రశ్నలు ఉదయిస్తుంటాయి.

(i) కొన్ని తరాలక్రితం నేనున్నానా ? (ii)కొన్ని తరాలక్రితం నేను లేనేలేనా ? (iii) ఉండివుంటే అప్పటి నా ఉనికి ఎలాంటిది ? (iv) ఏ రూపం నుంచి ఎలా మారాను? (v)కొన్ని తరాల తరువాత కూడ నేనుంటానా? (vi) కొన్ని తరాల తరువాత నా ఉనికే ఉండదా? (vii) ఉంటే అప్పుడు ఏ రూపంలో ఉంటాను ? (viii) ఆ రూపంలో నేనెలా ఉండగలగుతాను ? (ix) అపుడు ఆ రూపంనుండి ఏ రూపంలోకి మారుతాను ? ఆ ప్రశ్నతోబాటు మరికొన్ని ఉత్పన్నమవుతాయి. (1) అసలు నేనంటూ ఉన్నానా? (2)నేనంటూ లేనేలేనా? (3)అయితే నేనెవరు? (4)నేనిలా ఉండటానికి కారణ మేమిటి? (5) నేనెలా ఏర్పడ్డాను? (6) నేనెక్కడికి పోతాను?.

2. అలాగే ఈ విశాలవిశ్వం గూర్చికూడ ఎన్నో ప్రశ్నలు.

3. ఈ విశ్వసృష్టి ఎలా జరిగింది? అది శాశ్వతంగానే ఉండిపోతుందా?

4. పై రెండు ప్రశ్నల్లో మొదటి దాన్నిగురించి కొందరేమో ఈ సమస్తవిశ్వం బ్రహ్మచే సృజింపబడింది అంటారు. మరికొందరైతే ప్రజాపతి ఈ సృష్టికి కారణమంటారు.

5. ఇక రెండవ ప్రశ్నకు కొందరు ఈ సృష్టి శాశ్వతమైనదంటారు. మరికొందరది అశాశ్వతమైన దంటారు. కొందరు యిది అనంతమని వాదిస్తే మరి కొందరు ఇది నిర్ణీతమైనకాలంవరకే ఉంటుందంటారు.

6. బుద్ధుడు ఈ మీమాంసలకు ఎలాంటి ప్రాధాన్యతను ఇవ్వలేదు. కేవలం తలతిక్కగా ఇలాంటి నిష్ప్రయోజనమైన మీమాంసలు చేస్తూఉంటారని ఆయన వాదం.

7. పై ప్రశ్నలకు ఖచ్చితమైన సమాధానం సర్వంతెలిసినవారే చెప్పగలరు. అలాంటి వారెవ్వరూ లేరు.

8. ఇలాంటి ప్రశ్నలకు సమాధానం చెప్పేందుకు తాను సర్వమూ తెలిసినవాణ్ణి కానని బుద్ధుడు చెప్పాడు. నేను సమస్తమూ ఎరిగినవాడినని ఎవ్వరూ చెప్పలేరు. ఎంత తెలిసినవాడికైనా ఇంకా తెలిసికోవలసింది ఉండనే ఉంటుంది.

9. అందుకే బుద్ధుడు తన ధమ్మంలో ఇలాంటి మీమాంసలను వదలివేశాడు.

10. అలాంటి విషయాలపై యిదమిద్ధంగా చెప్పగలుగుతున్న మతాలు వున్నా లేనట్టేనని ఆయన భావించాడు.

(II)

1. బుద్ధుని కాలంనాటికి ప్రచారంలోఉండిన మతాలకు అహం, విశ్వసృష్టి ఇవే పునాదులు.

2. అహం గుర్చి వాళ్ళు (i) కొన్నితరాలకు పూర్వం నేనెక్కడున్నాను? (ii)కొన్ని తరాలకు పూర్వం నేనంటూ లేనే లేనా ? (iii) ఉండివుంటే అపుడెలా ఉండి వుంటాను? (iv)ఏ రూపంనుండి ఏ రూపానికి మారిఉంటాను ? (v) కొన్ని తరాల తరువాత కూడ నేనుంటానా ? (vi) కొన్ని తరాల తరువాత నేనంటూ ఉండనా ? (vii) ఉండగలిగితే అపుడు ఏ రూపంలో ఉంటాను ? (viii) ఆ స్థితిలో ఎలా ఉండగలుగుతాను ? (ix) ఏ స్థితి నుండి ఏ స్థితికి మారుతాను ? (x) ఈ ప్రశ్నలతో బాటు వ్యక్తి ఉనికినిగూర్చి కూడ అనుమానాలే (1) అసలు నేనంటూ ఉన్నానా ? (2) నేనంటూ లేనేలేనా? (3) నేనేమిటి? (4) నేనిలా ఎలా ఉండగలుగుతున్నాను? (5)నేనెక్కడినుండి వచ్చాను? (6) ఈ స్థితినుండి మరే స్థితికి మారుతాను.

3. విశ్వసృష్టికి సంబంధించి కొందరిలా ప్రశ్నించారు.

4. ఈ విశ్వసృష్టికి బ్రహ్మ కారణమని కొందరన్నారు.

5. ప్రజాపతి తన్నుతాను జ్వలింపజేసికోవడం ద్వారా ఈ సృష్టికి కారకుడయ్యాడన్నారు.

6. మరికొందరు ప్రబోధకులు మరికొన్ని మీమాంసలు లేవదీశారు. ప్రపంచం శాశ్వతం అన్నారు. ప్రపంచం శాశ్వతం కాదన్నారు మరికొందరు. ప్రపంచం నిర్ణీతకాలం వరకే ఉంటుందన్నారు మరి కొందరు. కాయంతో పాటిదే జీవమన్నారు. కాయం వేరు, జీవం వేరు అన్నారు మరికొందరు. చనిపోయినప్పటికినీ సత్యశోధనాశక్తి సైతం నశిస్తుందన్నారు మరి కొందరు. అలాంటిది ఇప్పుడూ లేదు, చనిపోయిన తరువాత కూడ వుండదని మరికొందరన్నారు.

7. కేవలం బుద్ధిజాడ్యతవల్లనే ఇలాంటి నిష్ప్రయోజనకరమైన మీమాంసలు లేవదీస్తుంటారన్నాడు బుద్ధుడు.

8. ఆ కారణంచేతనే ఊహాపోహలఆధారంతో రూపొందింపబడిన ఆ మతాలను బుద్ధుడు తిరస్కరించాడు.

9. అలాంటి మీమాంసలప్రసక్తి మతానికి అవసరం లేదన్నాడు.

10. అలాంటి విషయాలపై ఖచ్చితంగా సర్వస్వం తెలిసినవాడు మాత్రమే చెప్పగలడు. సమస్తం ఎరిగిన వాడెవ్వడూ లేడు.

11. నాకు సమస్తం తెలుసునని చెప్పగలిగినవాడెవ్వడూ లేడు. సర్వస్వం ఎరిగినవాడు లేడు. జ్ఞానానికి అంతమంటూ లేదు. ఎంత తెలిసినప్పటికిని ఇంకా తెలుసుకోవల సిందంటూ ఉండనేఉంటుంది.

12. పై మీమాంసలపై చెప్పబడుతున్నదంతా ఊహాజనితమైనదే. వాటిని హేతుబద్ధంగా తేల్చిచెప్పేందుకు సరియైన ఆధారాలేవీ లేవు. అలా ఆధారసహితంగా చెప్పిందీ లేదు.

13. కేవలం ఊహల ఆధారంతోనే వాటన్నింటినీ చెబుతున్నారు. కాబట్టి అవి వాస్తవం కాజాలవు.

14. అలాంటి ఊహాపోహలవలన మానవునికిగల ప్రయోజన మేముంటుంది? ఎలాంటి ప్రయోజనమూ కనపడదు.

15. ఈ ప్రపంచం సృష్టింపబడిందని బుద్ధుడు భావించలేదు. ఈ ప్రాపంచిక ఉత్పత్తి కాలక్రమంలో ఏర్పడిందనే బుద్ధుడు భావించాడు.

## 7. ధార్మికగ్రంథాలను పఠిస్తుండడమే ధమ్మం కాజాలదు

1. జ్ఞానసముపార్జనకే బ్రాహ్మణులు పూర్తిప్రాధాన్యతనిచ్చారు. వారిదృష్టిలో జ్ఞానసాధనే అంతిమ ధ్యేయం. అంతకుమించి మరేదీలేదు.

2. బుద్ధుడు విద్య అందరికీ అవసరమైనదేనన్నాడు. జ్ఞానసముపార్జనతోపాటు దానిని సద్వినియోగపరచుకోవడం మరీముఖ్యమన్నాడు.

3. జ్ఞానసముపార్జనతోపాటు శీలం అవసరాన్ని మరీ మరీ నొక్కివక్కాణించాడు జ్ఞానం కలిగి వుండిశీలంలేకపోవడం ప్రమాదకరమన్నాడు.

4. ప్రజ్ఞకంటే శీలమెంత ఉత్కృష్టమైనదో పతిసేన భిక్షువుతో బుద్ధుడు చెప్పినది తెలియచేస్తుంది.

5. ఆ రోజుల్లో భగవానుడు శ్రావస్తిలో ఉంటూండగా తన శిష్యగణంలో ఒకడైన పతిసేనుడనే వృద్ధసన్యాసి ధర్మసూత్రాలలో ఒక్క భాగం "గత" కూడ కంఠస్థం చేయలేక పోయాడు. తనలోని మందబుద్ధికారణంగ గ్రాహ్యశక్తి లోపించింది.

6. బుద్ధుడు తనవద్దనున్న ఐదువందల మంది అరహతులచే రోజూ ధర్మసూత్రాలను పతిసేనునిచే వల్లె వేయింపజేసాడు. అయినప్పటికీ ఆ పతిసేనుడు ఒక గతనైనా కంఠస్థంచేయలేకపోయాడు.

7. అతని మందబుద్ధినిగూర్చి ఆ ప్రాంతంలోని నాలుగు తరగతులవారు ఎగతాళిగ చెప్పుకోసాగారు. అతని దయనీయస్థితిని గుర్తించిన భగవానుడొకరోజు అతని చేరబిలిచి ఈ క్రింది ప్రబోధం చేశాడు. "ఎవరైతే వాక్కునదుపులో వుంచుకొని ఆలోచనలను క్రమబద్ధంచేయగలుగుతారో, ఎవరైతే శారీరకంగా యితరుల్ని బాధించకుండ వుండగలుగుతారో, అలాంటివారికి విమోచన సాధ్యమవుతుంది."

8. భగవానుడు తనపట్లచూపుతున్న ఆదరణ అతని హృదయకవాటాలను తెరువగా భగవానుడుచేసిన ప్రబోధాన్ని అప్పటికప్పుడే యధాతథంగా చెప్పగలిగాడు.

9. ఆ తరువాత బుద్ధుడు మరోప్రబోధం జేశాడు."వృద్ధుడవైయుండీ నేను చెప్పిన ప్రబోధాన్ని అప్పటికప్పుడే తిరిగిజెప్పగలిగావు. కానీ ఈ ప్రబోధాన్ని ఇదివరకే ఎరిగి యున్నవారు నిన్ను గేళి చేస్తున్నారు గదా, అయితే నేనుచెప్పిన ప్రబోధానికి వివరణ ఇస్తాను. సావధానంగా విను."

10. ఆవిధంగ పతిసేననికి బోధనచేయసమకట్టిన భగవానుడు శరీరాన్నావహించేవి మూడు గుణాలుంటాయనీ, వాక్కునావహించేవి నాలుగుంటాయనీ, ఆలోచనపై ప్రభావంచూపేగుణాలు మూడు వుంటాయనీ, ఆ దుర్గుణాలను ఎవరైతేఅరికట్ట గలుగుతారో వారికే విముక్తి సాధ్యమవుతుందన్నాడు. ఆ దుర్గుణాలేమిటో గ్రహించగలిగిన ఆ సన్యాసి సత్యాన్వేషియై అర్హతుడుగాగలిగాడు.

11. అదేకాలంలో అక్కడి విహారంలోఉంటూఉండిన ఐదువందలమంది భిక్షుస్త్రీలకు ధర్మోపదేశం చేయవలసిందిగ కోరుతూ వారిలో ఒకరిని భగవానునికడకుపంపారు.

12. భగవానుడు వారికోరికను మన్నించి వారికి ధర్మోపదేశం జేయవలసిందిగ వృద్ధుడైన పతిసేనుణ్ణి పంపాడు.

13. తమకు ధర్మోపదేశం చేసేందుకు మందబుద్ధియైన పతిసేనుడు వస్తున్నాడనివిని ఆ

స్త్రీలు తమలో తాము ఎగతాళిగ నవ్వుకొన్నారు. మందబుద్ధియైన పతిసేనుణ్ణి ఆట పట్టించాలన్నతలంపుతో, అతడు వారికడకొచ్చినపుడు గతను చివరి నుండి మొదటికి చదివి అతన్ని తికమకపరచి అవమానం పాలుచేయాలని తలంచారు.

14. తెల్లవారక వృద్ధభిక్షువైన పతిసేనుడు ఆ భిక్షుక స్త్రీలున్నచోటుకు చేరగానే వారంతా లేచి అతనికి నమస్కరించారు. కానీ వారిలో చిన్నాపెద్దా ఒకరివైపు మరొకరు చూసి ముసిముసిగా నవ్వుకోసాగారు.

15. భిక్షువును కూర్చుండబెట్టి ఆహారం వడ్డించారు. తాను భోజనం చేయగ తనచేతులు శుభ్రపరచారు. ఆపై ఉపదేశం ప్రారంభించమని కోరారు. ఆ భిక్షువు లేచి ఉపదేశకుడికై అమర్చబడిన ఉన్నతాసనంపైకూర్చొని తన ప్రబోధం ప్రారంభించాడు.

16. "చెల్లెళ్లూ! నా ప్రబోధనాపరిణతి అతిపరిమితమైనది. నాకు తెలిసింది కూడ అల్పమైనదే. నాకు ఒక గత మాత్రమే వచ్చు. అది మీకు వినిపించి దాని అర్థమేమిటో మీకు వివరిస్తాను. సావధానంగావిని దాని భావం గ్రహిస్తారా?"

17. ఆ గతను చివరి నుండి మొదటికి వల్లించి తనను తికమక పరచాలనుకొన్న కుర్రకారు స్త్రీలంతా మ్రాన్పడి సిగ్గుతో తలలువంచారు.

18. అప్పుడు పతిసేనుడా గతను వల్లించి బుద్ధుడు తనకు ఎంతవివరంగా దాని అర్థం వివరించాడో అంత విశదంగా తనూ వారికి వివరించాడు.

19. తనవాక్శుద్ధి వారిని తన్మయపరచగ వారందరు ఆశ్చర్యచకితులయ్యారు. ఆ ఒక్క గత అర్థాన్ని గ్రహించగలిగిన ఆ స్త్రీ భిక్షువులు అరహతులయ్యారు.

20. ఆ తరువాత మరోరోజున రాజాప్రసేనజిత్తు భగవానుని భిక్షుసమేతంగా విచ్చేసి తన భవనంలో విందారగించాల్సిందిగా ఆహ్వానం పంపాడు.

21. వారి ఆహ్వానాన్నంగీకరించిన భగవానుడు తన భిక్షువులందరిలోను పతిసేనుడే పెద్దవాడు, గౌరవనీయుడుగ గుర్తించి తన భిక్షాపాత్రనందుకొనవలసిందిగ అతణ్ణి కోరాడు.

22. అయితే పతిసేనుడంటే మందబుద్ధి అన్నవిషయం అదివరకే అందరికీ తెలిసినట్లే రాజభవనపు ద్వారపాలకునికికూడ తెలుసుగాబట్టి "ఒకే ఒక `గత'ను మాత్రమే కంఠస్థ చేయగల్గిన నీవంటివారు లోనికి ప్రవేశింప వీలులేదు. నీకంటే ఎక్కువ చదివినవారు లోనికెళతారు. నీ విక్కడే వుండిపొమ్మ"న్నాడు.

23. పతిసేనుడు మారుమాటాడకుండ ద్వారంవద్దే కూర్చొండిపోయాడు.

24. బుద్ధుడు ఉన్నతాసనంపైచేరి చేతులు శుభ్రపరచుకొని "పతిసేనుడెక్కడో చూడండి. అతని చేతిలోనే నా భిక్షాపాత్ర వున్నద"న్నారు.

25. రాజాప్రసేనజిత్తుతోబాటు అక్కడచేరి వున్న మంత్రి, సామంతులందరు ఆశ్చర్యంతో ఎవరా పతిసేనుడంటూ వెతకసాగారు.

26. ఆ పరిస్థితిని గమనించి బుద్ధుడిలా అన్నాడు: "పతిసేనుడూ ఒక భిక్షువే. అతనికి ఇటీవలే జ్ఞానోదయమైనది. నా భిక్షాపాత్ర అతని చేతిలోనేఉన్నది. కానీ మీ ద్వారపాలకుడు అతనిని లోనికి ప్రవేశపెట్టలేద"న్నాడు.

27. **వెంటనే** ఆ వృద్ధభిక్షువునికూడా లోనికి ప్రవేశపెట్టారు.

28. **ఆ తరు**వాత రాజాప్రసేనజిత్తు భగవానునితో "ఈ పతిసేనుని తెలివితేటలు అతి పరిమితమైనవని విన్నాను. తనకు ఒక గతకంటే ఎక్కువ రాదుటగదా. అలాంటివానికి ఎలా జ్ఞానోదయమైంద"ని ప్రశ్నించాడు.

29. ఆ ప్రశ్నకు బుద్ధుడు"ఎంతనేర్చాడనేది ముఖ్యంకాదు. దానికంటే శీలమే ప్రధానమైనది"అని సమాధానమిచ్చాడు.

30. "ప్రతిసేనుడు నేర్చుకొన్నది కేవలం ఒక్క `గత' మాత్రమే కావచ్చు. అయినప్పటికినీ ఆ ఒక్క `గత'లోని భావం తన వాక్కు, శరీరం, ఆలోచనలనన్నిటిని పరిపూర్ణంగ ఆవహించి ఉన్నతుడిని చేయగలిగింది. ఒక వ్యక్తి ఎంతనేర్చినప్పటికినీ, ఆజ్ఞానం తన జీవన విధానంలో మార్పుతేలేనట్లయితే తానుముక్తిని పొందలేడు. అలాంటి జ్ఞానం తనవినాశనానికే దారితీయవచ్చు. అలాంటపుడు తానెంత నేర్చుకొన్నప్పటికినీ ప్రయోజనమేమున్నది?

31. ఆ తరువాత బుద్ధుడు ఇంకా యిలా అన్నాడు:

32. "ఒకడు వేయిసూత్రాలను కంఠస్థంజేసివుండవచ్చు. అయితే వాటి భావం తాను పూర్తిగా అవగాహన చేసికోలేక పోయినట్లయితే, తాను నేర్చినదాని భావం తన జీవితం పై ఎలాంటి మార్పుతేలేనట్లయితే, ఒకే ఒక సూత్రం నేర్చి దానిభావం తన జీవన విధానంలో మార్పుతేగలిగితే తద్వారా తన ఆలోచనావిధానంలో మార్పు సాధించినట్లయితే ఇదే ఉత్కృష్టమవుతుంది. వేయిసూత్రాలు నేర్చి వాటి భావం గ్రహించలేకపోయినట్లయితే దానివలన ప్రయోజనమేమున్నది? ఒకే ఒక సత్యాన్నెరిగి దానిని ఆచరించగలిగితే అది విముక్తికి దారిజూపుతుంది.

33. ఒకడు చాలా గ్రంథాలను పఠించి వుండవచ్చుకానీ వాటి భావమేమిటో తాను తెలియ చెప్పలేనట్లయితే దానివలన ప్రయోజన మేమున్నది? అలాగాక ఒకే ఒక వాక్యాన్ని చదివి దాని అర్థం గ్రహించి ఆచరించగలిగితే అలాంటి జ్ఞానమే వుత్కృష్టమైనదవుతుంది."

34. ఆ వాక్యాలు విన్న వందమంది భిక్షువులు, రాజు, మంత్రులు అందరు పరమానంద భరితులయ్యారు.

## 3. ధార్మిక గ్రంథాలు దోషాతీతమైనవని నమ్మటం ధమ్మం కాదు

1. వేదాలు పరమపవిత్రమైనవనేకాక వాటిలో చెప్పబడినదంతా ప్రామాణికమైనదని బ్రాహ్మణులు ప్రచారంచేశారు.

2. వేదాలప్రామాణికతలో అంతిమమైనవి మాత్రమేగాక అవి దోషాతీతమైనవని బ్రాహ్మణులు ప్రకటించారు.

3. బుద్ధుడు వారి వాదాన్ని పూర్తిగా వ్యతిరేకించాడు.

4. వేదాలు పవిత్రమైనవి కాజాలవన్నాడు. వేదాలలో చెప్పబడినదే ప్రామాణికమని బుద్ధుడు అంగీకరించలేదు. వేదాలు దోషాతీతమైనవన్న వాదాన్నికూడ ఖండించాడు.

5. వేదాలను గూర్చి బుద్ధుడు వ్యక్తపరచిన భావాలనే కొందరు ప్రబోధకులు సైతం వ్యక్తం చేశారు. కానీ బ్రాహ్మణసిద్ధాంతాన్ని వ్యతిరేకించి తద్వారా వారిమెప్పు కోల్పోయేందుకు సిద్దంగాలేక వారూ, వారి శిష్యులు లొంగిపోయారు. కానీ బుద్ధుడు మాత్రం ఆ విషయంలో ఏ మాత్రం వెనుకాడలేదు.

6. వేదాలనేది జలరహితమైన ఎడారివలె దారీతెన్నూకానరాని అరణ్యంవలె నిస్సారమైనదని "త్విజ" సూత్రంలో బుద్ధుడు స్పష్టంగ చెప్పాడు. నైతికజ్ఞాన తృష్ణగలిగిన ఏమనిషీ వేదాలను పఠించి తద్వారా తన తృష్ణను తీర్చుకోజాలడు.

7. వేదాలు దోషాతీతమైనవనే విషయంలో - వేదాలేగాక ఇంకా పవిత్రమైనవనబడే ఇతర గ్రంథాలన్నీకూడా దోషా నికతీతం కాజాలవన్నాడు బుద్ధుడు. ప్రతి సిద్ధాంతాన్నీ పరిశీలన జేయకతప్పదు. పరిశీలనజేసిన దానినే పునఃపరిశీలన జేయకతప్పదన్నాడు.

8. కాలములకు చేసిన ప్రబోధంలో ఈ విషయాన్ని చాలా స్పష్టంగ వివరించాడు.

9. బుద్ధుడు శిష్యగణసమేతంగా పర్యటిస్తూ కోసలరాజ్యం చేరుకొని అక్కడ కేశపుత్రుమనే కాలముల నివాసం ప్రవేశించాడు.

10. వారి ఆగమనవార్త విన్న కాలములు బుద్ధుని వెతుక్కుంటూ ఆయనున్న చోటుకు వచ్చి సుగతునికి నమస్కరించి ఆ ప్రక్కనే ఒక వైపునకూర్చొని భగవానునిలా ప్రశ్నించాడు:

11. "ఓ భగవానుడా! లోగడ కొందరు విరాగులు, తాపసులు కేశపుత్రం విచ్చేసి వారి మత సిద్ధాంతాలను బోధించడంతోబాటు యితర మతసిద్ధాంతాలను వ్యతిరేకించి, విమర్శించి, ఖండించి పోయారు. మరి కొందరుకూడ అలాగే చేసిపోయారు.

12. "ఈ విధంగా ఒకరు బోధించిన సిద్ధాంతాలను మరొకరు ఖండిస్తూ పోతుండగ వారు చెప్పినవాటిలో ఏది వాస్తవమని నమ్మాలో మాకు తెలియక అనిశ్చితులమై యున్నామ"ని చెప్పారు.

13. ఆపై బుద్ధుడిలా అన్నాడు:" ఓ కాలములారా! మీరు అనిశ్చితులు కావటానికి, మీకు శంకకలగటానికి తగిన మంచికారణమేఉంది. నిజంగా ఉచిత సందర్భంలోనే మీకు సందేహం కలిగింది.

14. కానీ ఓ కాలములారా! కేవలం మీరు విన్నంత మాత్రాన్నే దాన్ని విశ్వసించకండి. గురు శిష్య పారంపర్యంగా వల్లించబడుతూన్నవాటినే గుడ్డిగా నమ్మకండి. కేవలం మత గ్రంథాలలో వ్రాసినంతమాత్రాన వాటిని గుడ్డిగ నమ్మనవసరం లేదు. హేతుబద్ధంగా కనిపించినంతమాత్రానే నమ్మనవసరం లేదు. తార్కికంగా ఆలోచించినంత మాత్రాన్నే నమ్మేందుకు వీలు లేదు. వినసొంపుగ ఉన్నంత మాత్రాన్నే నమ్మరాదు. ఎవరో గొప్ప సన్యాసి చెప్పాడనో లేక మరో గొప్పవ్యక్తి చెప్పాడనో నమ్మరాదు.

15. "అలాగైతే మేమేం చేయాలి? ఏది నమ్మదగినదో పరీక్షించడమెలాగ అంటూ" కాలములు భగవానుని ప్రశ్నించారు.

16. దానికి భగవానుడిలా సమాధానమిచ్చాడు: "మీరు విన్నవి దోషరహితమైనవా? హానికరమైనవా ? విజ్ఞులు వీటిని తెగనాడారా? వీటిని ఆచరించడంద్వారా ఎవ్వరికి ఎలాంటి బాధ, హాని కలుగుతుందా?అని మీలో మీరు, తర్కించి పరిశీలన చేసుకోవాలి. ఇవే వాటికి పరీక్షలు.

17. అంతేగాదు, ఓ కాలములారా! మీరు విన్న సిద్ధాంతాన్ని పాటించినట్లయితే దురాశ, ద్వేషం, భ్రాంతి, హింసలాంటివి ప్రేరేపితమవుతాయా అన్నదికూడ గుర్తించాలి.

18. అంత మాత్రాన సరిపోదు. మీరు విన్న సిద్ధాంతాన్ని పాటించడం ద్వారా మానవుడు వ్యామోహితుడై జీవహింసకుసైతం పాల్పడాల్సివస్తుందేమో, తనకివ్వబడని దానిని సంగ్రహించాలన్న తలంపు వస్తుందేమో, వేరొకడి భార్యను వలచే ప్రమాదమున్నదేమో, అసత్యమాడవలసివస్తుందేమో, లేక ఇతరులచే ఈ దుష్కృత్యాలన్నీ చేయించాల్సి వస్తుందేమో పరిశీలించాలి.

19. సొంతం పరిశీలనచేసిన తరువాత తుదిగా ఆ సిద్ధాంతంద్వారా అహితం, బాధలు కలుగుతాయా అన్న విషయాల్ని సైతం ప్రశ్నించుకోవాలి.

20. "కాలములారా! ఇప్పుడు జెప్పండి. మీరేమనుకుంటారు?"

21. "మీరు విన్న సిద్ధాంతాలు శ్రేయోదాయకమైనవేనా? లేక వినాశకరమైనవా?"

22. "భగవానుడా! అవి తప్పక వినాశకరమైనవే" అని కాలములు జవాబిచ్చారు.

23. "కాలములారా! అవి శ్రేయోదాయకమైనవా! లేక గర్హనీయమైనవా?" అని భగవానుడు ప్రశ్నించగా

24. "అవి గర్హనీయమైనవే" అని సమాధానమిచ్చారు.

25. "అవి తెగనాడవలసినవా?"

26. "అవి తెగనాడవలసినవే" అని వారు సమాధానమిచ్చారు.

27. "విజ్ఞులనతగినవారు వాటిని సమర్థించగలరా?"

28. "అవి సమర్థనీయమైనవి కాజాలవు" అని వారి సమాధానం.

29. "ఆ సిద్ధాంతాలను పాటించినందువలన కీడు, బాధ వాటిల్లుతుందా?"

30. "కీడు, బాధ వాటిల్లుతుంది" అని వారు సమాధానమిచ్చారు.

31. "అయితే అలాంటి మతగ్రంధాలు దోషరహితమనీ, ప్రామాణికమనీ మీరు నమ్మగలరా?"

32. "లేదు భగవానుడా!" అని కాలములు చెప్పారు.

33. "అయితే ఓ కాలములారా! ఈ విషయంపై ఇంకా మీకు చెప్పవలసింది వినండి. ఎవరో చెప్పినది విన్నంతమాత్రాన్నే దానిని గుడ్డిగా అనుసరించకండి. గురుశిష్య పరంపరగ చెప్పబడుతున్నంతమాత్రాన్నే దేనినీ నమ్మకండి. తర్కసూక్ష్మతవున్నంత మాత్రాన విశ్వసించకండి. చూచేందుకు చాల గొప్పగవున్నంత మాత్రానే అది వాస్తవమని భ్రమసిపోకండి. భావాలు, నమ్మకాలు బాగున్నట్లనిపించనంత మాత్రాన్నే అవి వాస్తవమనుకోకండి. సన్యాసులు, శిష్టులు చెప్పారుగనుక అవి విశ్వసనీయమైనవేనని నమ్మకండి.

34. మీరు విన్నవి శ్రేయోదాయకమా, హానికరమా? విజ్ఞులైనవారు వాటినంగీకరించ గలరా? వాటిననుసరించినందువల్ల ఎవరి శ్రేయస్సుకు భంగం కానీ, బాధగానీ గలుగదా? ఇలా అన్ని కోణాలనుండి మీ అంతట మీరు నిశితపరిశీలన జేసి మీ పరిశీలన కవి నిలువలేక పోయినట్లయితే నిరసించండి."

35. "అద్భుతం! ఓ భగవానుడా! మీరు సూచించిన పరీక్షావిధానం అత్యద్భుతం. భగవానుని, సర్వోన్నతుని శరణుగోరి వారి ప్రబోధాలనే యికపై పాటిస్తాము. ఓ భగవానుడా! ఈ నాటినుండే మమ్ము మీ సంఘంలో జేర్చుకొని మా జీవిత పర్యంతం మిమ్మనుసరించేందుకంగీకరించండి," అని ఆ కాలములు భగవానుని వేడుకున్నారు.

36. పై సంవాదం సారమేమిటో సులభగ్రాహ్యమే. ఏ ప్రబోధాలనైన ప్రామాణికమని అంగీకరించేముందు అవి మత గ్రంథాలలో చెప్పినంత మాత్రాన్నే వాటి నంగీకరించరాదు. తార్కికంగా అవిసబబుగా కనిపించినంతమాత్రాన సరిపోదు. చూసేందుకు చాల ఉత్కృష్టమైనట్లు కనిపించినంతమాత్రాన సరిపోదు. అవి నమ్మదగినట్టివిఅని అనిపించినంత మాత్రాన చాలదు. ఎవరో సన్యాసులు, శిష్యులు చెప్పారన్నంత మాత్రాన అవి అనుసరణీయం కాజాలవు.

37. అవి శ్రేయోదాయకమైనవేనా లేక వినాశకరమైనవా? గర్హనీయములా, కాదా అని నిశితంగా పరిశీలించాలి.

38. అలాంటి ఆధారాలున్న ప్రబోధనలు మాత్రమే అనుసరణీయమైనవి.

# ఐదవ భాగం

# ఏది సద్ధమ్మం?

## మొదటి విభాగం- సద్ధమ్మ విధులు.

1. మనస్సులోని మాలిన్యాలను క్షాళనపరచటం.
2. ప్రపంచంలో ధర్మస్థాపన చేయటం.

## రెండవ విభాగం- ప్రజ్ఞను పెంపొందించే ధమ్మమే సద్ధమ్మం.

1. విద్య సర్వులకూ లభింపచేసే ధమ్మమే సద్ధమ్మం.
2. కేవలం విద్యమాత్రమే చాలదని, అది శుష్కపాండిత్యానికి దారి తీయవచ్చని చెప్పే ధమ్మమే సద్ధమ్మం.
3. ప్రజ్ఞ అవసరాన్ని బోధించే ధమ్మమే సద్ధమ్మం.

## మూడవ విభాగం- మైత్రిని పెంపొందించే ధమ్మమే సద్ధమ్మం.

1. ప్రజ్ఞ మాత్రమే చాలదనీ దానికి శీలం తోడుకావాలనీ బోధించే ధమ్మమే సద్ధమ్మం.
2. ప్రజ్ఞ, శీలంతోబాటు కరుణ ఆవశ్యకతను బోధించే ధమ్మమే సద్ధమ్మం.
3. కరుణ కంటే మైత్రి మిన్నయని బోధించే ధమ్మమే సద్ధమ్మం.

## నాల్గవ విభాగం

## అన్ని సామాజిక అవరోధాలను కూల్చివేయగల ధమ్మమే సద్ధమ్మం.

1. మనిషికి, మనిషికి మధ్య సామాజిక అవరోధాలను ఛేదించగల ధమ్మమే సద్ధమ్మం.
2. పుట్టుక కాక యోగ్యతే మనిషి కొలమానమని బోధించే ధమ్మమే సద్ధమ్మం.
3. మనిషికి, మనిషికి మధ్య సమత పెంపొందించే ధమ్మమే సద్ధమ్మం.

## విభాగం 1

# సద్ధమ్మ విధులు

## 1. మనస్సులోని మాలిన్యాలను క్షాళనపరచటం

1. సుగతుడు శ్రావస్తిలో వుంటుండగ ఒకనాడు కోసలరాజైన ప్రసేనజిత్తు భగవానుని దర్శనార్థమై రథం దిగివచ్చి ఎంతో భక్తిప్రపత్తులతో ఆ ప్రబోధకుని ఎదుట నిలిచాడు.

2. భగవానుడు విచ్చేసినట్లయితే ఎంతో మంది ప్రజలకు వారి దర్శనభాగ్యం లభించి వారి ప్రబోధనలచే ప్రభావితులయ్యే అవకాశం లభిస్తుందన్న ఉద్దేశ్యంతో మరుసటి రోజున భగవానుడు తన నగరం విచ్చేసి తన ఆతిథ్యం స్వీకరించాల్సిందిగా కోరాడు.

3. రాజు ఆహ్వానాన్ని అంగీకరించిన భగవానుడు మరునాడు భిక్షుగణసమేతంగా బయల్దేరి నగరంలోని నాల్గుమార్గాల కూడలివద్ద వారికై ఏర్పాటుచేయబడిన చోట ఉపవిష్టులయ్యారు.

4. వారికివ్వబడిన ఆతిథ్యం స్వీకరించి అప్పటికే ఆ కూడలివద్ద గుమిగూడిన విశేష జన సందోహాన్నుద్దేశించి భగవానుడు తన ప్రబోధం ప్రారంభించాడు.

5. అక్కడజేరిన విశేషజనంలో యిద్దరు వ్యాపారులు కూడా వున్నారు.

6. వారిలో ఒకరు "నగర ప్రజలందరు వినేందుకు అనుకూలంగా బహిరంగప్రదేశంలో భగవానుని ప్రబోధం ఏర్పాటు చేసిన రాజెంతటి వివేకవంతుడు? వారి ప్రబోధాలెంత ఉదారమైనవీ, సునిశితమైనవీ" అంటూ తనలోతాను తలపోయసాగాడు.

7. కానీ రెండవవాడు "ఇలాంటివాని ప్రబోధాన్ని ఇక్కడ ఏర్పాటుచేసి రాజెంతటి పొరపాటుచేశాడు?

8. బండికికట్టిన ఎద్దు ఆ బండిని లాగుకొంటూపోతుండగా దానివెంట మీరు అరుచుకుంటూ అనుసరించిపోతున్నట్లుగ ఈ బుద్ధుడు రాజు ఎలా చేయమంటే అలా చేస్తాడ"ని తలపోశాడు. ఆ ఇద్దరు వ్యాపారస్తులు నగరంవిడచి ప్రయాణిస్తూ తాము బసజేసిన ఒక సత్రం చేరారు.

9. వారిద్దరు మధుపానం చేయసమకట్టారు. వారిలో మొదటి వ్యాపారి, లోకాన్నికాపాడే నలుగురు దిక్పాలకుల రక్షణలో అదుపు తప్పకుండ మితంగ స్వీకరించాడు.

10. రెండవవాడు దుష్టశక్తుల ప్రోద్బలంతో అదుపుతప్పేలా త్రాగి సత్రంపక్క బాటలో పడి నిద్రించాడు.

11. తెల్లవారు ఝామున వ్యాపారస్తులబండ్లు అదేమార్గాన వెళుతున్నాయి. ఆ వేకువ చీకటిలో బండ్లునడిపేవారు నడిరోడ్డున పడివున్నవాణ్ణి గమనించక అతనిపైనే బండ్లు పోనిచ్చారు. ఆ వ్యాపారి ప్రాణాలు విడిచాడు.

12. మొదటివ్యాపారి ప్రయాణమై ఒక దూరదేశం చేరుకున్నాడు. అచ్చటి రాజు గారి వారసుని ఎంపిక చేసేందుకైవదిలిన పూతాశ్వం అతన్ని వరించటంతో, ఆ రాజ్య సింహాసనం అధిరోహించాడు.

13. అనూహ్యంగాజరిగిన ఆ మార్పులకెంతో ఆశ్చర్యపడి, అతడు తిరిగి బుద్ధుని దర్శించి ఆయన ప్రబోధభాగ్యం తన ప్రజలకు కలుగ చేయవలసిందిగాకోరాడు.

14. యావత్ ప్రపంచంచేత ప్రస్తుతింపబడుతున్న సుగతుడు దుష్టబుద్ధి అయిన వ్యాపారి ఎలా మరణించిందీ, వివేకి అయిన వ్యాపారి ఎలా రాజైనదీ గుర్తుచేస్తూ ఇలా ప్రబోధించాడు.

15. "మనం నిర్వర్తించే క్రియలన్నింటికి మనస్సే కారణం. మనపై ఆధిపత్యం వహించేది మనస్సే. అన్ని పరిణామాలకు మనస్సే కారణం.

16. మన మనస్సులో చెడు ఆలోచనలు గలిగినట్లయితే మన మాట, చర్యలు కూడ దోషభూయిష్టమైఉంటాయి.

17. మన నింవర్తనకు మనస్సే కారణం. అవే మనల్ని నడిపిస్తుంది. మనస్సే మన ప్రవృత్తిని నిర్దేశిస్తుంది".

18. "మనస్సులో మంచిఆలోచనలు వచ్చినట్లైతే మన వాక్కు, మన చర్యలు కూడా మంచివిగానే ఉంటాయి. మన చర్యలు మంచివైనట్లయితే ప్రతిదానినీ వెన్నంటి దాని నీడ ఉన్నట్లే, దానివెంటే సత్ఫలితాలు ఉంటాయి. వానివల్ల మనకు మేలు, సుఖమూలభిస్తుంది."

19. ఆ ప్రబోధం విన్న ఆ రాజులు, ఆయన మంత్రులు విశేషపరివారమంతా బుద్ధుని అనుయాయులయ్యారు.

## 2. ప్రపంచంలో ధర్మస్థాపన

1. మతం ప్రయోజనం ఏమిటి?

2. దీనికి వివిధమతాలు విభిన్న సమాధానాలు ఇస్తున్నవి.

3. మానవుని దేవునికి సన్నిహతంచేసి తద్వారా ఆత్మకు ముక్తికలిగించడమే మతం వలన ప్రయోజనమని మాత్రం అన్నిమతాలకు అన్వయించే సమాధానం.

4. మూడు రాజ్యాలున్నవని [illegible]

5. ఒకటి స్వర్గలోకం, రెండవది భూలోకం, మూడవది నరక లోకం.

6. స్వర్గరాజ్యాన్ని దేవుడే పాలిస్తాడని అంటారు. నరకలోకానికి సైతాను అధిపతి అయితే భూమండలాన్ని పాలించేవారెవరన్న విషయం మాత్రం వివాదగ్రస్తంగానే మిగిలిపోయింది. భూలోకానికి సైతాను ఆధిపత్యం లేదు. అయితే దేవుని ఆధిపత్యం కూడా లేదు. అది ముందు ముందు జరగాల్సి ఉన్నదంటారు.

7. స్వర్గరాజ్యాన్ని సరాసరి దేవుడే పరిపాలిస్తున్నాడు. కాబట్టి అది సద్ధర్మరాజ్యమై ఉంటుందని వారిభావన.

8. స్వర్గమనేది భూమిపై లేదు. స్వర్గమన్నది వేరు. దేవుని, దేవుని ప్రవక్తను నమ్మిన వారు మాత్రమే స్వర్గానికి పోగలుగుతారని, ఆస్తికులైనవారు మాత్రమే స్వర్గంజేరి వారు కోరిన అన్ని సుఖాలను అనుభవించగలరని వారి నమ్మకం.

9. అన్ని మతాల అంతిమధ్యేయం మానవుడు స్వర్గంజేరుకోవడమెలాగన్నదే.

10. అయితే మతంప్రయోజనమేమిటన్న ప్రశ్నకు బుద్ధుడిచ్చిన సమాధానం, ఈ మత విశ్వాసాలకు పూర్తిగా భిన్నమైనది.

11. మతం ధ్యేయం ఊహాజనితమైన స్వర్గానికి జేరుకోవడమేనని బుద్ధుడు జెప్పలేదు. స్వర్గమనేది భూమిపైనే ఉన్నవనీ, మానవుడు సద్ధర్మవర్తనులైనపుడే భూమి స్వర్గమవుతుందని బుద్ధుడు చెప్పాడు.

12. మానవులలో నెలకొనిఉన్న దైన్యతను తొలగించాలంటే మానవులందరూ సద్వర్తనులు కావాలి. ప్రతిఒక్కరు సాటివ్యక్తిపట్ల సద్వర్తనతో మెలగగలిగినట్లయితే భూమండల మంతా సద్ధర్మరాజ్యంగాగలదని బుద్ధుడు ప్రబోధించాడు.

13. బుద్ధుడు బోధించినదానికి ఇతర మతాలకు ఇదే మౌలికమైన విభేదం.

14. పంచశీల, అష్టాంగమార్గం, పారమితల యొక్కప్రాధాన్యతలు వక్కాణించేది బౌద్ధధర్మం.

15. బుద్ధుడు వాటినే ఎందుకు తనధర్మానికి పునాదులుగ భావించాడు? మనిషి ధర్మరహితజీవనానికి అవిమాత్రమే దోహదంజేస్తాయి గాబట్టి.

16. సాటి మనిషికి మనిషిచేస్తున్న అన్యాయంవలననే దైన్యత ఏర్పడుతుంది.

17. దైన్యతను, దానికి కారణమైన అక్రమవర్తనను తొలగించటం ధర్మవర్తనద్వారానే సాధ్యమౌతుంది.

18. అందుకే మతమనేది కేవలం బోధించటంతో ఆగక, ధర్మవర్తనం ఆవశ్యకతను మానవుని మనస్సులో క్షుణ్ణంగా పాదుకొల్పించగలదైయుండాలన్నాడు.

19. ధర్మవర్తనం నెలకొల్పటానికి, మతం కొన్ని విధులను తప్పక నిర్వర్తించాలి.

20. ఏది ధర్మమో, మతం మనిషికి తెలియచెప్పాలి. అతడు దాన్ని పాటించాలి.

21. ఏది అధర్మమో మతం మనిషికి తెలియచెప్పాలి. అతడు దాన్ని విడనాడాలి.

22. పై రెండు ప్రయోజనాలేగాక, మరో రెండువిధులకు మరింత ప్రాముఖ్యతనిచ్చాడు బుద్ధుడు.

23. పూజాపునస్కారాలకు, బలులకు భిన్నంగా - మనిషి సహజాతాలను, ప్రవృత్తులను శిక్షణద్వారా సంస్కరించటం మొదటిది.

24. "దేవదహ" సూత్రంలో జైనమతాన్నివివరిస్తూ బుద్ధుడీవిషయాన్ని చాల స్పష్టంగ చెప్పాడు.

25. ఒక వ్యక్తి ఈ లోకంలో అనుభవించే కష్టాలు, సుఖాలు పూర్వజన్మల కర్మఫలితాలేనని జైనమతస్థాపకుడైన మహావీరుడు బోధించాడు.

26. గతజన్మలోచేసిన అకృత్యాలను పరిహరిస్తూ, ఈ జన్మలో కొత్తగా ఏ అకృత్యాలు చేయకుండవుండగలిగితే మరుజన్మకు ఏమీమిగలదు. దానివల్ల అకృత్యాలు, వాటివల్లకలిగే దుఃఖంసమసిపోతాయి.

27. ఇదీ జైనమత ప్రబోధం.

28. ఆ విషయమై బుద్ధుడిలా ప్రశ్నించాడు. "చెడుప్రవృత్తులు సమసిపోయి, వెంటనే వాటిస్థానంలో మంచిప్రవృత్తులు ఏర్పడుతాయని నీకు తెలిసిందా?

29. "లేదు" అని దానికి సమాధానం.

30. "మానవుని నైజంలో మంచిమార్పు వచ్చేందుకు మనస్సుకు శిక్షణయివ్వకుండ, పాత పాపాలు పరిహరించి క్రొత్తపాపాలు చేయకుండచూసినమాత్రాన కలిగే ప్రయోజనమేమున్నద"ని బుద్ధుడు ప్రశ్నించాడు.

31. దీనికి ఆస్కారం లేకపోవడం మతంలో చాలపెద్దలోపమని బుద్ధుడు భావించాడు. మానవుని నైజాన్ని చక్కదిద్దడంవలననే శాశ్వతమైన సత్ప్రయోజనం సిద్ధించగలదన్నాడు.

32. ఆ కారణంగానే నైజంలో మంచిమార్పువచ్చేట్లుగ మనస్సును సంస్కరించటానికి బుద్ధుడు మొదటిస్థానం ఇచ్చాడు.

33. ఒకడు ఏకాకిగానైనసరే నిలచి ధర్మమని తానుభావించిన దానికే కట్టుబడి వుండాలన్నది బుద్ధుని రెండవ సూక్తి.

34. ఆ విషయాన్ని "సల్లేక" సూత్రంలో చాల విశదంగాచెప్పాడు.

35. అందులో ఇలా జెప్పాడు.

36. "ఇతరులు నీకు హానిచేసినా ఇతరులను నీవు హానిచేయకుండ స్థిరనిర్ణయం గైకొనాలి."

37. "ఇతరులు ప్రాణహానికితలపడినా నీవందుకు పాల్పడరాదు."

38. "ఇతరులు అపహరణకుపాల్పడినా నీ వందుకు పాల్పడరాదు."

39. "ఇతరులు ఉదాత్తజీవనం గడపకపోయినప్పటికీ, నీవు మాత్రం గడపాలి."

40. "ఇతరులు అసత్యమాడినా, దూషించినా, ఖండించినా, వదరినా, నీవు మాత్రమలాంటివి చేయరాదు."

41. "ఇతరులు అత్యాశకు పాల్పడినా, నువ్వు ద్వేషించరాదు."

42. "ఇతరులు పగపట్టినా, నువ్వు ద్వేషించరాదు."

43. "ఇతరులు చెడుభావనలుజేసినా, చెడు ఆశయాలకు తావిచ్చినా, చెడుగ మాట్లాడినా, చెడుగ వర్తించినా, చెడు ధోరణిలో మనస్సును మరల్చినా, నీవు మాత్రం ఉత్కృష్టమైన అష్టాంగమార్గాన్నే అనుసరించాలి. నీ దృష్టి, ఆశయం, వాక్కు, వర్తన, జీవిక, ప్రయత్నం, శ్రద్ధ, ధ్యానం అన్నీ ధర్మబద్ధమైయుండాలి."

44. "సత్యవర్తనంలో ఇతరులు విఫలురుగావచ్చు, విముక్తిమార్గంలోవారు నడువలేక పోవచ్చుగాక. కానీ నీవుమాత్రం సత్యవర్తనుడవై విముక్తికి ఏది సరియైనమార్గమో దానినే అనుసరించు."

45. "ఇతరులు సోమరితనాన్ని, జడత్వాన్ని ఆశ్రయించినా నీవు మాత్రం వాటికి తావివ్వకు."

46. "ఇతరులు తాము గొప్పవారమని భావించవచ్చుకాక, నీవు మాత్రం అణుకువగానే ఉండు."

47. "ఇతరులు శంకాస్పదులై కుంగవచ్చు. నీవు మాత్రం శంకనుండి దూరంగా ఉండు."

48. "ఇతరులు ఆగ్రహం, అపకారబుద్ధి, అసూయ, అసహనం, లోభితనం, అత్యాశ, వంచన, మోసం, దురహంకారం, గర్వం, దురుసుతనం, దుస్సాహసం, జడత్వం, అపనమ్మకం, నిస్సిగ్గు, వివేచనాలోపం, సద్బోధనాలోపం, అచేతనత్వం, దిగ్భ్రమ, అవివేకంలబారిన పడవచ్చు. ఆ అవలక్షణాలన్నింటికీ ప్రతిగానిలువు."

49. "ఇతరులు ఐహికసుఖాలకు లొంగి వాటికి దాసులైఉన్నప్పటికీ , నీవు మాత్రం ఐహికం కానివాటినే కోరుకొని జీవనాన్ని పరిత్యాగపథంలో సాగించు."

50. "సమకర్మకు, సమవాక్కుకే కాదు చేతనయొక్క సమస్థితికే నీ సంకల్పం దోహదం చేస్తుందని చెపుతున్నాను. అందుచేత,. ఓ చుండా! నేను చెప్పిన ఈ నిర్ణయాలన్నింటికీ నీ సంకల్పాన్ని పెంచుకో."

51. మతమంటే ఏమిటో, దాని ప్రయోజనం ఏమిటో బుద్ధుడావిధంగా ఆలోచన చేశాడు.

రెండవ విభాగం

# ప్రజ్ఞను పెంపొందించు ధమ్మం సద్ధమ్మం

## 1. విద్య సర్వులకు లభింప చేసే ధమ్మమే సద్ధమ్మం

1. జ్ఞానసముపార్జనకందరు అర్హులుకారనీ, అవికొందరికే పరిమితమనీ బ్రాహ్మణ సిద్ధాంతం చెపుతున్నది.

2. బ్రాహ్మణ సిద్ధాంతంప్రకారం జ్ఞానసముపార్జన బ్రాహ్మణులకు, క్షత్రియులకు, వైశ్యులకు మాత్రమే పరిమితం జేయబడింది. ఈ మూడు కులాలలోకూడా పురుషులుమాత్రమే అందుకర్హులు.

3. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యకులాలకు చెందిన స్త్రీలు గానీ, శూద్రకులానికి చెందిన స్త్రీలు, పురుషులు గానీ జ్ఞానసముపార్జనకే గాదు, కనీసపు విద్యార్జనకుకూడా అర్హులుగారని ఆ సిద్ధాంతం చెప్తున్నది.

4. ఈ బ్రాహ్మణ దుష్టసిద్ధాంతంపై ధ్వజమెత్తి తిరుగుబాటుప్రకటించినవాడు బుద్ధుడు.

5. స్త్రీ, పురుష విచక్షణలేకుండా అందరు జ్ఞాన మార్గం వైపుపోగల అవకాశముండాలని బుద్ధుడు బోధించాడు.

6. బుద్ధుని వాదం తప్పని వాదించేందుకు చాలామంది బ్రాహ్మణులు సమాయుత్తమయ్యారు. బుద్ధునికి లోహికుడను బ్రాహ్మణునికి మధ్యజరిగిన వాదప్రతివాదనలలో అతని ఆశయాలు గొప్పగా విశదమవుతున్నది.

7. ఒకప్పుడు భగవానుడు తన విశేషసంఘపరివారసమేతంగా కోసలరాజ్యమండలాలలో పర్యటిస్తూ సాలవాటిక అనే గ్రామం చేరుకున్నాడు. ఆ గ్రామం చుట్టూ సాలవృక్షాలే.

8. ఆ గ్రామంలో లోహికుడునే బ్రాహ్మణుడుండేవాడు. కోసలరాజైన ప్రసేనునుండి బహుమతిగాలభించిన విశేషసంపదలతో ఆ గ్రామంలో తానొక రాజనిపించేంతటి వైభవంగా జీవిస్తుండేవాడు.

9. శ్రమణుడు గానీ, బ్రాహ్మణుడు గానీ తాను ఆర్జించిన జ్ఞానాన్ని స్త్రీలకుగానీ, శూద్రులకు గానీ బోధించరాదనేవాడు లోహికుడు.

10. సుగతుడు సాలవాటికకు విచ్చేశాడన్నవార్త లోహికుడు విన్నాడు.

11. ఆ వార్త విన్న లోహికుడు భేషికుడను మంగలిని చేరపిలచి, "నీవు తక్షణం బయల్దేరి

మహాశ్రమణుడైన గౌతముడున్నచోటుకువెళ్ళి ఆయనకు స్వస్థతచేకూరిందా పరామర్శించి రేపటిరోజున సోదరసంఘీయులతో నా ఇంటికివచ్చి ఆతిథ్యం స్వీకరించమని నా తరపునకోరు." అన్నాడు.

12. "చిత్తం స్వామి!" అని భేషికుడు అన్నాడు.

13. బ్రాహ్మణుడైన లోహికుడు చెప్పినవిధంగానే ఆ మంగలి భగవానుని దర్శించి తన యజమానివర్తమానం తెలియపర్చగా భగవానుడు మౌనంగానే ఆహ్వానాన్ని అంగీకరించాడు.

14. మరునాడు భగవానుడు అంగీధరించి భిక్షాపాత్ర చేబూని, సంఘ సోదరులతో పాటు బయల్దేరాడు.

15. భగవానుని వెంటనిడుకొని రావలసిందిగా బ్రాహ్మణుడు లోహికుడు పంపిన మంగలి భేషికుడు భగవానుని వెన్నంటి వారిఅడుగుల్లో అడుగువేసి నడుస్తూ శ్రమణులు గానీ, బ్రాహ్మణులుగానీ స్త్రీలకు, శూద్రులకు విద్య నేర్పరాదన్న లోహికుని సిద్ధాంతం భగవానునికెరుకపరచాడు.

16. అది విన్న భగవానుడు "అలాగా భేషికా! చాలా బాగున్నదం"టూ సమాధానమిచ్చాడు.

17. లోహికునిఇంట ప్రవేశించిన భగవానుడు తన కొరకై ప్రత్యేకంగా ఏర్పాటు చేయబడిన ఆసనంపై ఉపవిష్టుడయ్యాడు.

18. అనేకరుచులతో తయారుచేయబడిన వంటకాలను లోహికుడే స్వహస్తాలతో ఇక తినమని చెప్పేంతవరకు సంఘానికీ తదధిపతికి వడ్డించాడు.

19. భగవానుడు తన భోజనంముగించి భిక్షాపాత్రను, చేతులను శుభ్రపరచుకొన్న తరువాత లోహికుడు ఒక చిన్న ఆసనాన్ని తెప్పించి భగవానునికి చేరువగా వేయించి దానిపై కూర్చున్నాడు.

20. ఆ తరువాత సుగతుడు సంభాషణకు ఉపక్రమించాడు:" శ్రమణులు, బ్రాహ్మణులు, శూద్రులకు, స్త్రీలకు జ్ఞానోపదేశం చేయరాదని నీవు భావిస్తున్నట్లు చెప్పగా విన్నాను. అది వాస్తవమేనా లోహికా?"

21. "ఔను గౌతమా! నా అభిప్రాయమదేన"ని లోహికుడు చెప్పాడు.

22. "అలాగైతే ఓ లోహికా! ఈ సాలవాటిక గ్రామంలో నీవు స్థిరపడిఉన్నావు గదా?" అని భగవానుడు ప్రశ్నించగా లోహికుడు "ఔన"ని సమాధానమిచ్చాడు.

23. "సరే ఎవరైనావచ్చి ఓ లోహికా ! ఈ సాలవాటికకు చెందిన సమస్తఆస్తిపాస్తులపై వచ్చే ఫలసాయాన్ని నీవొక్కడవే అనుభవించమని, మిగతా వారికేమీ చెందరాదని సలహాయిచ్చాడని భావించు. అలాంటి సలహా ఇచ్చిన వారు కోసలరాజుపై ఆధారపడి

ఉన్న మీకు, మిగతావారికి ప్రమాదకారి కాదంటావా?"

24. "అలాంటి సలహాఇచ్చినవాడు తప్పకుండా ప్రమాదకారియే అవుతాడు గౌతమా లోహికుని జవాబు.

25. "అలాంటి సలహా ఇచ్చినవాడు ఇతరుల శ్రేయస్సు కోరినవాడు కాగలడా?" భగవానుని ప్రశ్న

26. "అలాంటి వాడు ఇతరుల శ్రేయస్సుకోరేవాడు కాజాలడు గౌతమా" లోహికుని జవాబు

27. "అలాంటి వాడిలో ఇతరులపట్ల ప్రేమ ఉంటుందా? లేక వైరముంటుందా?"

28. "అలాంటి వాడిలో ఇతరులపట్ల వైరమే ఉంటుంది."

29. "అలాంటి తీవ్రమైనస్వభావంగలది సవ్యమైన సిద్ధాంతంగాగలదా లోహికా?"

30. "అది తప్పకుండా అపసవ్యసిద్ధాంతమే ఔతుంది గౌతమా"

31. "కాశీ, కోసలరాజ్యాలు ప్రసేనజిత్తు పరిపాలనలోనే ఉన్నాయి గదా లోహికా?"

32. "ఔను గౌతమా! వారి పాలనలోనే ఉన్నాయి."

33. "కాశీ, కోసల రాజ్యాలు రాజా ప్రసేనుడి పాలనలోనే ఉన్నాయి గనుక ఆ రాజ్యాల లభించే ఆదాయమంతా రాజా ప్రసేనుడొక్కడే అనుభవించాలని ఎవడైనా అన్నాడను అలాంటి మాట చెప్పినవాడు ఆ రెండు రాజ్యాల ప్రజానీకానికీ ప్రమాదకారీ అవుతా కాదా లోహికా! నీ అభిప్రాయమేమిటి?"

34. "అలాంటి మాటచెప్పినవాడు తప్పకుండా ప్రమాదకరమైన వ్యక్తి గౌతమా"

35. "అలాంటి మాట చెప్పేవాడు ఆ రెండు రాజ్యాల ప్రజానీకం క్షేమం కోరే వా కాగలడా! లోహికా ?"

36. "అలాంటి వాడు రెండు రాజ్యాల ప్రజానీకపు క్షేమము కోరేవాడు కాజాలడు గౌతమ

37. "అలాంటి అభిప్రాయమున్నవాడికి ఆ రెండు రాజ్యాల ప్రజానీకంపట్ల ఏమైన ప్రే సానుభూతి ఉండగలదా? లేక వైరభావముంటుందా?"

38. "శత్రుభావమే ఉంటుంది గౌతమా"

39. "అలాంటి శత్రుస్వభావం గలిగివుండడం సవ్యమైన సిద్ధాంతమవుతుందా లోహికా'

40. "అది సవ్యమైన సిద్ధాంతం కాజాలదు గౌతమా!"

41. "సాలవాటికలో స్థిరపడివున్న నీవు ఈ గ్రామములోని సమస్త ఆస్తిపాస్తులపై ఆదాయ అనుభవించాలనడం ఎలా ప్రమాదకరమో, కాశీ, కోసల రాజ్యాలను రాజా ప్రసేనజి పాలిస్తున్నాడు కనుక ఆ రాజ్యాల సమస్తసిరిసంపదలు రాజా ప్రసేనజిత్తు ఒక్క

అనుభవించాలనడం ఎలా ప్రమాదకరమో అలాంటి సిద్ధాంతం ఎంత అపసవ్యమైనదో నువ్వు అంగీకరించగలవు."

42. "అదేవిధంగా ఓ లోహికా! శ్రమణులు, బ్రాహ్మణులు స్త్రీలకు, శూద్రులకు విద్య గరపరాదనడంగూడ ప్రమాదకరమైన సిద్ధాంతమే అవుతుంది."

43. "అలాంటి సిద్ధాంతాన్ని నమ్మేవాడు ఇతరుల క్షేమాన్ని కోరేవారుకాజాలరు."

44. "ఇతరులపట్ల సానుభూతిలేని దారి హృదయంలో వైమనస్యభావమే వుంటుంది. అలాంటి భావాన్నిగలిగి యుండడాన్ని బోధించే సిద్ధాంతం సరియైనది కాజాలదు"అని భగవానుడు తన సంభాషణముగించాడు.

## 2. కేవలం విద్యమాత్రమే చాలదని అది శుష్క పాండిత్యానికి దారితీయవచ్చునని చెప్పే ధమ్మమే సద్ధమ్మం.

1. బుద్ధుడు కోశాంబియను గ్రామములోని "రాగ రాగిణి" అనే పేరుగల విహారంలో వుంటుండగా తన ప్రబోధాన్ని వినేందుకు గుమిగూడినవారిలో ఒక బ్రహ్మచారి గూడా వున్నాడు.

2. ఈ బ్రహ్మచారి విశేష జ్ఞానసంపద గడించిన వాడైన కారణంగా ఇక తనతోసాటియైన వారింకెవ్వరూలేరన్న గర్వంతో తానెక్కడకువెళ్ళినా చేత ఒక వెలుగున్న కాగడాను బట్టి బయల్దేరేవాడు.

3. తానలావెళ్తూ ఒక బజారుకూడలివద్దకు వచ్చినపుడు అక్కడ ఒక వ్యక్తి ఆ బ్రహ్మచారి వింత ప్రదర్శనచూచి విస్తుపోతూ దీనికి అర్థమేమిటియని ప్రశ్నించాడు. బ్రహ్మచారి ఇలా చెప్పాడు:

4. "ప్రపంచమంతా అంధకారంలో వున్నది. ప్రజానీకం ఎటూతోచని స్థితిలో వున్నారు. అందుకే ఈ కాగడానుధరించి నాకు సాధ్యమైనంతవరకు వారికి వెలుగు జూపెడదామని బయల్దేరాను."

5. ఈ వింత వాదననుగూర్చి విన్న భగవానుడా బ్రహ్మచారిని పిలిపించి "ఏమిటయ్యా! ఎందుకు నీవే కాగడాబట్టుకు తిరుగుతున్నావ"ని ప్రశ్నించాడు.

6. అందుకా బ్రహ్మచారి "ప్రజానీకమంతా అజ్ఞానాంధకారంలో కొట్టుమిట్టాడుతున్నారు. వారికి వెలుగుజూపేందుకే ఈ కాగడా" అంటూ జవాబిచ్చాడు.

7. ఆ సమాధానంవిన్న జినుడాబ్రహ్మచారినిలా ప్రశ్నించాడు"అయితే పవిత్ర గ్రంథాలలో తారసపడే శబ్దవిద్య (సారస్వతం) ఊర్ధ్వలోక గ్రహాలు, వాటి సంచారం ప్రభుత్వ నిర్వహణ, సైనికశాస్త్రం అనే నాలుగు విద్యలూ నీవెరుగుదువు గదా?"

8. సమస్తమూతెలుసునన్న గర్వంతో విర్రవీగుతున్న ఆ బ్రహ్మచారి ఆ నాలుగు తనకు తెలియవనిజెప్పి సిగ్గుతో తనచేతనున్న కాగడాను దూరంగావిసిరివేశాడు.

9. అప్పుడు భగవానుడు అతనికీవిధంగా బోధనలు చేసాడు.

10. "ఒకడు వివేకవంతుడు కావచ్చు, కాకపోవచ్చు కానీ తనకె సమస్తమూ తెలుసునన్న గర్వంతో ఇతరులను కించపరచబూనడం ఒక గ్రుడ్డివాడు చేతిలో దీపముంచుకుని ఇతరులకు దారి చూపుతాననడం వంటిదే. తానే గ్రుడ్డి వాడు గదా! ఇతరులకు ఎలా దారి చూపగలడు?"

## 3. ప్రజ్ఞఅవసరాన్ని బోధించే ధమ్మమే సద్ధమ్మం

1. బ్రాహ్మణులు విద్య నేర్వడమే గొప్పని భావిస్తారు. ఒక వ్యక్తి సౌశీల్యతతో నిమిత్తం లేకుండా కేవలం అతని శాస్త్రపారంగత్వానికే అతన్ని గౌరవిస్తారు.

2. ఒక రాజు తన రాజ్యప్రజలకు మాత్రమే గౌరవపాత్రుడు. కానీ శాస్త్రపారంగతుడు ప్రపంచానికే గౌరవపాత్రుడని వారు వాదిస్తారు. అనగా రాజుకంటే విద్యనేర్చిన తామే ఉన్నతులమన్నభావం అందులో ఇమిడియున్నది.

3. విద్యకు, ప్రజ్ఞకు మధ్యగల వ్యత్యాసాన్ని చూపెట్టాడు బుద్ధుడు.

4. జ్ఞానానికి, ప్రజ్ఞకు మధ్యగల వ్యత్యాసాన్ని బ్రాహ్మణులుకూడా గుర్తించారని అనవచ్చు.

5. ఐతే ప్రజ్ఞఅనేదానికి బుద్ధుడిచ్చిన అర్థానికీ బ్రాహ్మణులభావానికి ఎంతో వ్యత్యాసమున్నది.

6. "అంగుత్తర నికాయ"లో బుద్ధుడు ఇచ్చిన ఉపదేశంలో ఆ వ్యత్యాసమేమిటో మనకు విశదమవుతుంది.

7. ఒకప్పుడు రాజగ్రహ నగరప్రాతంలో ఉడుతలు విహరించే విదురవనంలో భగవానుడు కాలంగడుపుతుండే వాడు.

8. ఒకనాడు మగధ రాజ్యాధికారియైన విశ్వాకరుడనే బ్రాహ్మణుడు ఆయన్ని దర్శించాడు. బుద్ధునికినమస్కరించి కుశలమడిగి ఒకవైపునకూర్చుని విశ్వాకరుడు ఇలా ప్రశ్నించాడు.

9. "స్వామీ, గౌతమా! నాలుగు లక్షణాలుగలవాడు జ్ఞానియని, వందనీయుడని మా బ్రాహ్మణులు ప్రకటించారు. ఆ నాలుగు లక్షణాలేవి?

10. "ఓ స్వామీ! జ్ఞానియైనవాడు ఒక సంగతి విన్నంతనే దాన్నర్థంచేసుకుని దాని అంతరాన్ని విశదీకరించగలడు. అంతేగాదు అతని జ్ఞాపకశక్తికూడా అపారమైనదే. ఎన్నో ఏళ్ళనాటి సంఘటనైనా యధాతథంగాచెప్పగలడు."

11. అంతేగాదు గృహస్థుగా తన విధుల్ని ఏమరక నేర్పుగా నిర్వర్తిస్తాడు. ఏది ఉచితమో వివేచించి దానికిఏర్పాట్లుచేస్తాడు.

12. "గౌతమ ప్రభూ! పై లక్షణాలన్నీ ఉన్నవాడిని జ్ఞానిగా మా బ్రాహ్మణకులం ప్రకటించాము. మా అభిప్రాయం ఆదరణీయమైతే గౌతమ వర్యులు నన్ను అభినందిస్తారు లేదా అది నిందార్హమైతే నన్ను నిందిస్తారు.

13. ఆ మాటలకు బుద్ధుడు "ఓ బ్రాహ్మణా! నీవు చెప్పిన లక్షణాలు గర్హనీయమైనవని గానీ, అభినందనీయమైనవనిగానీ నేను చెప్పను. కానీ నీవు చెప్పినవాటికి పూర్తిగా భిన్నమైన నాలుగు లక్షణాలున్నవాడిని నేను జ్ఞానిగా గుర్తిస్తాను.

14. ఐతే ఓ బ్రాహ్మణా! మరొకడున్నాడు. పదిమంది క్షేమాన్ని , సంతోషాన్నికోరి, వాళ్ళను ఆర్యసంప్రదాయంలో ప్రతిష్టుల్నిచేస్తాడు. అంటే శ్రేయోదాయకమైన, సుందరమైన మార్గంలో

15. ఏ ఆలోచనాధారను అతను వెంబడించతలుస్తాడో దానివెంటేవెళతాడు. ఏ ఆలోచనాధారను అతను వెంబడించదలచడో దానిని త్యజిస్తాడు.

16. ఏ ఉద్దేశాన్ని సంకల్పించదలుస్తాడో దానినే సంకల్పిస్తాడు. దేనిని తలచడో, దానిని త్యజిస్తాడు. ఆవిధంగా అతడు తనచింతనలో మనస్సుకు ప్రభువు.

17. ఏ ఆయాసప్రయాసలు లేకుండా, ఉన్నతచింతనకు చెందిన నాలుగు భావధారలను సంకల్పమాత్రంగా సంతరిస్తాడు. అవి ఈ జీవితంలోనే అమందానందం కలుగచేస్తాయి.

18. ఈ జీవిత సత్యాన్నిఎరిగి దానిబంధాలు తెంచుకోవడంద్వారా హృదయ స్వేచ్ఛను, కడకు జ్ఞానాన్నిపొంది స్థిరచిత్తుడౌతాడు.

19. అలాంటి వ్యక్తిని నేను జ్ఞానిగా గుర్తిస్తాను. కానీ ఓ బ్రాహ్మణా, నీవు చెప్పిన లక్షణాలను నేను విమర్శించడం లేదు. ప్రశంసించడం లేదు. నే వివరించిన గుణవిశేషాలున్న వ్యక్తిని నేను జ్ఞానిగా గుర్తిస్తాను."

20. బుద్ధుని ప్రవచనాలనువిన్న ఆ బ్రాహ్మణుడు అమందానంద భరితుడై "ఓ గౌతమ వర్యా! మీ ప్రవచనాలు అద్భుతమైనవి. యోగ్యులైన గౌతములవారు మాత్రమే అలాంటి ప్రవచనాలు చెప్పగలరు."

21. ఈ నాలుగు సల్లక్షణాలు గౌతముడిలో ఉన్నాయని నేను నమ్ముతాను. నిజంగా పది మంది శ్రేయాన్ని సంతోషాన్నికోరి వాళ్ళను ఆర్యసంప్రదాయంలో అంటే శ్రేయోదాయకమూ, సుందరమూ ఐనమార్గంలో ప్రతిష్ఠితుల్నిచేస్తాడు.

22. నిస్సందేహంగా ఏ ఆలోచనాధారవెంట గౌతముడు వెళ్ళదలుస్తాడో, దానినే వెంబడిస్తాడు. తనచింతనలో గౌతముడు తనమనస్సుకు ప్రభువు.

23. నిశ్చయంగా - ఏ ఆయాసప్రయాసలులేకుండా ఉన్నత చింతనకుచెందిన నాలుగు భావధారలను గౌతముడు సంకల్పమాత్రంగా సంతరిస్తాడు. బంధాలను పరిహరించి యోగ్య గౌతముడు హృదయ స్వేచ్ఛను, జ్ఞానాన్ని పొంది స్థిరచిత్తుడౌతాడు.

24. పై వాదప్రతివాదనలనుబట్టి బ్రాహ్మణుల దృష్టిలో ప్రజ్ఞకుగల అర్థం ఏమిటో, బుద్ధుని భావన ఏమిటో స్పష్టంగా అవగతమౌతున్నది.

25. అంతేగాదు, విద్యకంటే ప్రజ్ఞయేమిన్న అని బుద్ధుడెందుకు భావించాడో కూడా విశదమవుతున్నది.

మూడవ విభాగం

# మైత్రిని పెంపొందించు ధమ్మమే సద్ధమ్మం

## 1. ప్రజ్ఞమాత్రమేచాలదనీ దానికి శీలం తోడుకావాలనీ బోధించే ధమ్మమే సద్ధమ్మం

1. ప్రజ్ఞ చాలాఅవసరం. అయితే దానికంటే శీలం ఇంకా ఎక్కువ అవసరం. శీలం లేని ప్రజ్ఞ ప్రమాదకరం.
2. ప్రజ్ఞ మాత్రమే కలిగియుండడం ప్రమాదకరం.
3. ప్రజ్ఞ కలవాడు చేతిలో ఖడ్గం ధరించిఉన్నట్లే.
4. అయితే శీలవంతుడు ప్రమాదంలోఉన్న వ్యక్తిని కాపాడగలుగుతాడు.
5. కానీ ఒకడు కేవలం ప్రజ్ఞావంతుడుమాత్రమే అయినట్లైతే తనలో శీలం లోపించి నట్లయితే హత్యకు సైతం పాల్పడవచ్చును.
6. ఆ కారణంగానే శీలం ప్రజ్ఞకంటే ముఖ్యమైనది.
7. ప్రజ్ఞ అంటే విచార ధర్మం. అంటే సదాలోచన శీలం ఆచారధర్మం అంటే సదాచారవర్తనం.
8. శీలానికిసంబంధించి బుద్ధుడు ఐదు మూలసూత్రాలను నిర్ణయించాడు.
9. ప్రాణహానికి సంబంధించినది మొదటిది.
10. అపహరణకు సంబంధించినది రెండవది.
11. లైంగికనీతికి సంబంధించినది మూడవది.
12. అసత్యానికి సంబంధించినది నాల్గవది.
13. త్రాగుడుకు సంబంధించినది ఐదవది.
14. ఈ ఐదు సూత్రాలను ప్రబోధిస్తూ భగవానుడు చంపరాదనీ, అపహరించరాదనీ, నీతి తప్పి వ్యవహరించరాదనీ, అసత్యమాడరాదనీ మత్తుపానీయాలు సేవించరాదనీ చెప్పాడు.

15. జ్ఞానం కంటే శీలానికే బుద్ధుడు ఎక్కువ ప్రాధాన్యత ఎందుకుఇచ్చాడో స్పష్టం.

16. మానవుడు తన జ్ఞానాన్నిఎలా ఉపయోగిస్తున్నాడన్నది అతని శీలాన్ని బట్టే ఉంటుంది. శీలం లోపించినపుడు జ్ఞానం నిరర్థకమవుతుంది. ఆ మాటే బుద్ధుడు నొక్కి వక్కాణించాడు.

17. మరోసందర్భంలో శీలం మరేఇతరమైనదానితోను పోల్చడానికైనా వీలులేనంత విలువైనదన్నాడు.

18. "శీలమే మూలం. అది అభయం యిస్తుంది. సర్వగుణాలలోను సలక్షణాలన్నింటిలోను అది మొట్టమొదటిది. అందుచేతనే శీలాన్ని స్వచ్ఛంగా ఉంచు."

## 2. ప్రజ్ఞ, శీలంతోబాటు కరుణ ఆవశ్యకతను బోధించే ధమ్మమే సద్ధమ్మం.

1. బౌద్ధధర్మానికి ఏది పునాది అనే విషయంపై భేదాభిప్రాయాలున్నాయి.

2. బౌద్ధధర్మానికి ప్రజ్ఞ మాత్రమే పునాదికా గలదా? లేక కరుణ మాత్రమే పునాది కాగలదా?

3. ఈ వివాద కారణంగా బౌద్ధులు రెండు వర్గాలుగా విడిపోవడం జరిగింది. ఒక వర్గం ప్రజ్ఞ ఒక్కటే బౌద్ధమతానికి పునాదిగా నిర్ణయిస్తే, రెండో వర్గం కరుణని మాత్రమే పునాదిగా స్వీకరించింది.

4. ఆనాడలా విడిపోయినవర్గాలు ఈ నాటికీ అలాగేఉన్నాయి.

5. బుద్ధుడు స్వయంగా ప్రవచించిన దాన్నిబట్టి పరిశీలన చేస్తే, పై రెండు వర్గాల వాదనలు సరియైనవికావని తెలుస్తుంది.

6. బౌద్ధధర్మానికి మూలస్థంభాలైన రెండింటిలోను ప్రజ్ఞ ఒకటన్న విషయం అందరూ అంగీకరిస్తారు.

7. అయితే కరుణకూడా ఒక మూలస్థంభమన్నదే వివాదం.

8. కాని బౌద్ధధర్మానికి కరుణకూడా మూలస్థంభమేనని నిర్వివాదాంశంగా చెప్పవలసి ఉంది.

9. ఆ విషయానికి ఆలంబనగా బుద్ధుడే స్వయంగా చెప్పిన వాక్యాలను ఉదహరించవచ్చును.

10. ఆ రోజులలో గాంధారదేశమని ఒకటుండేది. ఆ ప్రాంతంలో ఉండవచ్చిన ఒకానొక సన్యాసికిసోకిన వ్యాధి అతిజుగుప్సాకరమై తానేప్రాంతంవెళితే ఆ ప్రాంతం కలుషిత పరచేవిధంగా ఉండేది.

11. అలాంటి పరిస్థితులలో ఆ సన్యాసి ఉంటున్న విహారానికి ఎవ్వరూ వెళ్ళేవారు కారు. అంత దయనీయమైన స్థితిలోఉన్న తననెవ్వరూ ఆదుకునేవారుకారు.

12. ఒకనాడు ఆ సన్యాసి ఉంటున్న చోటుకు బుద్ధుడు తన ఐదువందల మంది అనుచరగణంతో విచ్చేశాడు. కొన్ని పాత్రలలో వేడినీటితో బుద్ధుడా సన్యాసిదరి చేరాడు.

13. ఆ విహారంనుండి వస్తున్న దుర్వాసన భరింపరానంతగాఉండడంతో భిక్షువులెవ్వరూ దాపులకుపోలేక సన్యాసిని అసహ్యించుకున్నారు. కానీ యావత్ప్రపంచంచే గౌరవింపబడుతున్న భగవానుడు చక్రదేవుని వెంటనిడుకుని వేడినీళ్ళతో కడిగి ఆ సన్యాసికి సకల శుశ్రూషలు చేశాడు.

14. ఆ దృశ్యానికి భూమి కంపించిపోయింది. ఆ పరిసరప్రాంతమంతా లోకాతీతమైన కాంతిఆవరించింది. రాజు, మంత్రులేకాక పై నుంచి దేవతలు, నాగులు దిగివచ్చి బుద్ధుని చుట్టూపరివేష్టించి ప్రణమిల్లారు.

15. సుగుతుడు అలాంటి హీనమైనసేవ ఎలాచేయగలుగుతున్నారని ప్రశ్నించగ బుద్ధుడు వారికిలా సమాధానమిచ్చాడు.

16. "తథాగతుడు ఈ లోకంలో అవతరించింది ఇలాంటి పేదలు, నిస్సహాయులు, అనాధలకు సహాయపడి వారిశారీరకమైన బాధల్ని ఉపశమింపచేసేందుకే వారు శ్రమణులు గావచ్చు, మరేఇతర మతస్థులు కావచ్చు, అభాగ్యులు, అనాధలు, వృద్ధులైనవారికి సహాయపడి ఇతరులుసైతం అలా సహాయపడేందుకు ప్రోత్సహించటానికే తథాగతుడు అవతరించాడు."

# 3. కరుణకంటే మైత్రియే మిన్నయని బోధించే ధమ్మమే సద్ధమ్మం

1. కరుణగూర్చి చెప్పడంతోనే బుద్ధుడు ఆగిపోలేదు.

2. కరుణ అన్నది మానవులకు మాత్రమే పరిమితమైనది. కాని బుద్ధుడు ఇంకా ముందుకు వెళ్ళి మైత్రిని బోధించాడు. సకలజీవుల్ని ప్రేమించడం మైత్రి.

3. సాటిమానవులపట్ల కరుణతో మెలగటంవరకే పరిమితమైపోకుండా సమస్త జీవ రాసుల్ని ప్రేమించే ఆసక్తి పెంపొందించుకోవాలని బుద్ధుడు బోధించాడు.

4. సుగతుడు శ్రావస్తిలో ఉండిన రోజుల్లో తాను ప్రబోధించిన ఒకానొక సూత్రంలో మైత్రిని గూర్చి చాలా విపులంగా చెప్పాడు.

5. మైత్రిని గూర్చి భిక్షువులకు బోధిస్తూ భగవానుడిలా అన్నాడు.

6. "మానవుడు భూమిని త్రవ్వుతాడనుకోండి. అందుకు భూమి వ్యతిరేకిస్తుందా?"

7. "లేదు భగవానుడా" భిక్షువుల జవాబు.

8. "ఒకానొకడు గాలిలో లక్కతో రంగులతో, బొమ్మలేయాలను కొంటాడనుకోండి. అది సాధ్యమవుతుందా?"

9. "సాధ్యం కాదు. భగవానుడా!" భిక్షువుల జవాబు.

10. "ఎందుకు వేయలేడు?" అని భగవానుడు ప్రశ్నించగా "గాలిలో నల్లటి మచ్చలేవీ లేవు గదా?" భిక్షువులు జవాబిచ్చారు.

11. "అలాగే మన మనస్సుల్లోకూడా ఎలాంటి నల్లటిమచ్చలు ఉండరాదు. అవి మీలోని దుష్టవాంఛలను ప్రతిబింబిస్తాయ"ని బుద్ధుడు చెప్పాడు.

12. "ఎవ్వరైనా మండుతున్న ఒక చిన్నదీపంతో గంగానదిని తగులబెట్టాలను కున్నాడనుకోండి. అది తనకు సాధ్యమా?"

13. "సాధ్యం కాదు భగవానుడా!"

14. "ఎందుకని?" "ఎందుచేతనంటే గంగానది నీళ్ళు తగులబడవు గనుక".

15. ఈ సంవాదాన్ని సమాప్తంచేస్తూ భగవానుడిలా ప్రబోధించాడు. "నేలను త్రవ్వితే అది బాధ చెందనట్లు, నిరోధించినట్లు, గాలిలో చిత్రలేఖనం సాధ్యపడనట్లు, గంగానదిలో మండుతున్న దీపాన్ని విసరినా అది తగులబడక ప్రవహించినట్లు భిక్షువులు సైతం అవమానాలను, అన్యాయాలను భరించి మీకు హాని తలపెట్టిన వారిపట్లకూడా మైత్రి భావాన్నే చూపాలి".

16. "ఆవిధంగా ఓ భిక్షువులారా! మైత్రీభావం మీలో జీవనదిలా ఎల్లపుడు ఉండాలి. భూమి వంటి నైర్మల్యం, గంగానదివంటి గాంభీర్యం అలవరచుకోవడం పవిత్రకర్తవ్యంగా మీరు భావించాలి. అలాచేసినట్లయితే మీలో మైత్రీభావం చెదరదు. ఎలాంటి అవాంఛనీయమైన సంఘటనలుగానీ మిమ్ము చలింపజేయరాదు. అలాంటప్పుడు మీపట్ల హాని తలపెట్టినవారు అలసిఆగిపోతారు.

17. "సరిహద్దులులేని ప్రపంచంలా మీ మైత్రీభావం పెంపొందాలి. మీ ఆలోచనలు సైతం విశాలమై ద్వేషభావానికి మాత్రం తావివ్వనట్లుండాలి."

18. "కరుణమాత్రమే చాలదని, దానితోబాటు మైత్రీభావం చాలాఅవసరమని ప్రబోధించేదే నా ధర్మం."

19. ఈ ప్రబోధసందర్భంలోనే భిక్షువులకు భగవానుడు స్మరణీయమైన ఒక కథను చెప్పాడు.

20. "ఒకప్పుడు శ్రావస్తిలో వైదేశిక అను పేరుగల స్త్రీ ఉండేది. ఆమె చాలా సౌమ్యురాలనీ, నెమ్మదస్తురాలనీ, అణకువగలదనీ పేరుండేది. ఆమె వద్ద ధర్కీ అనే పరిచారిక ఉండేది. ఈ పరిచారిక చాలాచురుకైనదై పెందలకడనేలేచి తనపనులు చక్కబెట్టుండేది. "మా యజమానురాలు చాల నెమ్మది గల వ్యక్తి అనే పేరున్నది గదా, అసలామెలో కోపమంటు ఉంటుందేమో చూడాలను" కొన్నది ఆ పరిచారిక.

21. ఒకనాడా పరిచారిక కావాలనే చాలాఆలస్యంగా నిద్రలేచింది. "ధర్కీ, ధర్కీ"అంటూ యజమానురాలు పెద్దగా అరిచింది. చెప్పమ్మా అని ధర్కీ సమాధానమిచ్చింది. "ఈ రోజెందుకింత ఆలస్యంగా నిద్ర లేచావని" ఆమె ప్రశ్నించగా "ఏమి లేదమ్మా పూరకనే" అంటూ పరిచారిక సమాధానమిచ్చింది. "ఏమీ లేదంటావా తుంటరిపిల్లా" అంటూ వైదేశిక కోపంతో అన్నది.

22. "ఓహో! అయితే మా యజమానురాలిలో కోపమున్నది కాని కనబడనీయదనుకొన్నది పరిచారిక. "నేను సక్రమంగా పనిచేసుకుంటుపోతే ఆమెలో కోపం కనిపించదన్నమాట. అయితే ఇంకా ప్రయత్నించి చూస్తాను" అను కొన్నదా పరిచారిక. ఆ రెండవరోజున ఇంకా ఆలస్యంగా నిద్రలేచింది కావాలనే. "ధర్కీ, ధర్కీ" అంటూ యజమానురాలు పొలికేకలువేస్తూపిలువగా "చెప్పండమ్మా" అంటూ పరిచారిక సమాధానమిచ్చింది. "నీవాలస్యంగా ఎందుకు నిద్రలేచావని "ఆమె ప్రశ్నించగా "ఏమీ లేదమ్మా! ఊరకనే "అంటూ పరిచారిక సమాధానమిచ్చింది. "ఏమీ లేదంటావా తుంటరి దానా"అంటూ కోపంతో చీవాట్లువేసింది.

23. "ఓహో మా యజమానురాలిలో కోపం ఎక్కువగానేఉన్నది కానీ కనబడనీయదు. నా పనులు నేను చక్కగా చేసుకుంటుపోతే కోపించదన్న మాట. అయితే ఈమెలో కోపమెంతున్నదో పరిశీలిస్తాను"అనుకొన్నదా పరిచారిక. మూడవ నాడింకా ఆలస్యంగా నిద్రలేవగా యజమాని "ధర్కీ, ధర్కీ" అంటూ బిగ్గరగా కేకలు వేయగా"ఏమీ లేదమ్మా" ఊరకనేఅంటూ సమాధానమిచ్చిందా పరిచారిక.

24. "ఇంత ఆలస్యంగా నిద్రలేచింది గాక ఏమీ లేదంటావా" అని ధుమధుమలాడుతూ కోపంతో అట్లుకాడ అందుకొని పరిచారికతలపై కొట్టగా తలపై గాయమై రక్తం కారసాగింది.

25. తగిలిన దెబ్బకు తలచిట్లి రక్తంకారుచుండగా ఆ పరిచారిక బిగ్గరగా"చూడండీ ఈమెను చాలా సౌమ్యురాలంటారు గదా, ఎంతో మెత్తటి మనిషని అంటారే. నేను ఆలస్యంగా లేచినందుకే నాపై కోపించి అట్లుకాడతో నా తల ఎలా పగిలేలాకొట్టిందో చూడండి" అంటూ ఇరుగుపొరుగువారికి చూపెట్టసాగింది

26. ఇక ఆ రోజునుండి ఎంతో సౌమ్యురాలు, నెమ్మదస్తురాలు మెత్తటిమనిషిగా పేరు పొందిన వైదేశిక, చాలా దుడుకువ్యక్తిగా పేరుబడింది.

27. అదేవిధంగా భిక్షువైనవాడు ఎంతో సౌమ్యుడు నెమ్మదస్తుడు, మెత్తని స్వభావం కలవాడుగావచ్చుగానీ ఏదైనా అవాంఛనీయమైన పరిస్థితులేర్పడి తననుగురించి చెడుగాచెప్పడం జరిగినట్లయితే తనలోని మైత్రీభావానికి, సోదరత్వానికి అది పరీక్ష రోజులని గ్రహించాలి.

28. కేవలం తిండికోసమో లేక బట్టకోసమో భిక్షువు మైత్రీభావం కలిగియున్నట్లైతే అది మైత్రీభావమని నేనంగీకరింపజాలను. మైత్రీసిద్ధాంతంపై పూర్తివిశ్వాసంగలిగి దానిని సాధించినట్లయితేనే ఆ భిక్షువునిలో మైత్రీ భావమున్నదని నేగుర్తిస్తాను" అని భగవానుడన్నాడు.

29. "ఓ భిక్షువులారా! పుణ్యంసాధించేందుకు మీరెన్ని ప్రయత్నాలు చేసినప్పటికి ప్రేమ పూర్వకమైనకరుణలో అవి పదహారవవంతు కూడాకాజాలవు. ప్రేమపూరితమైన కరుణయే హృదయస్వేచ్ఛ. అది మీ హృదాంతరాళల్లోనే ఆవరించి, జ్వలించి, ప్రకాశించాలి.

30. "అలాగే ఓ భిక్షువులారా! సకలతారకలు కలిసియిచ్చే వెలుగు చంద్రకాంతిలో పదహారోవంతుకు సాటిరాదు. వెన్నెల ఆ వెలుగునంతాకలుపుకుని ప్రకాశమానంగా జ్వలిస్తుంది. హృదయస్వేచ్ఛ అయిన ప్రేమాస్పదకరుణ పుణ్యంకొరకు చేసే అన్ని యత్నాలను కలుపుకుని ప్రకాశమానంగా జ్వలిస్తుంది."

31. "అదేవిధంగా ఓ భిక్షువులారా! వర్షం కురిసి వెలియగానే ఆ మబ్బుల్ని పారద్రోలి చీల్చుకొంటూ సూర్యుడు ఆకాశాన్ని ప్రకాశవంతంచేయగలిగినట్లుగా, రాత్రి గడచి తెల్లవారగానే ఉదయభానుడు ప్రకాశవంతమైన కిరణాలతో వెలుగులు విరజిమ్మినట్లుగా ఓ భిక్షువులారా! నిజమైన ప్రేమాన్వితకరుణతో మరేఇతర పుణ్యసాధనలు పదహారవవంతుగూడా సాటిరావని గ్రహించండి. ప్రేమతోగూడిన దయయే హృదయ స్వేచ్ఛ. అది మీ హృదయాంతరాళాల నావరించి, జ్వలించి ప్రకాశించాలి.

నాల్గవ విభాగం

# అన్ని సామాజిక అవరోధాలను కూల్చివేయగల ధమ్మమే సద్ధమ్మం

## 1. మనిషికి, మనిషికిమధ్య సామాజిక అవరోధాలను ఛేధించగల ధమ్మమే సద్ధమ్మం

1. ఆదర్శసమాజమనగా నేమి? ఆదర్శసమాజమనగా వేదాలలో జెప్ప డినదేనని, వేదాలు దోషరహితమైనవిగనుక వాటిలో ఉల్లేఖింపబడినదే ఆదర్శసమాజానికి అర్ధమని బ్రాహ్మణులంటారు. దానినే విధిగా అంగీకరించాలని వారంటారు.

2. చాతుర్వర్ణ్యమే ఆదర్శసమాజమని వేదాలలో చెప్పబడియున్నది.

3. ఈ వేదాలలో చెప్పబడిన ఆదర్శసమాజస్వరూపం మూడునియమాలనను సరించి ఏర్పడాలి.

4. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర వర్ణాలలో అదిరూపొందాలి.

5. ఈ నాలుగు వర్ణాలమధ్య సంబంధాలు ఆరోహణపరమైన అసమానతలతో కూడి ఉంటుంది. దాన్నింకా విడమరచి చెప్పాలంటే, ఒక కులాని కంటే మరోకులం ఉన్నత స్థాయిలో ఉంటూ హక్కులు, సౌకర్యాల విషయంలో వీటిమధ్య సమానత్వానికే మాత్రం ఆస్కారం లేకుండాఉంటాయి.

6. బ్రాహ్మణులు అగ్రభాగాన వుంటారు. క్షత్రియులు బ్రాహ్మలకంటె'అధోస్థాయిలోను, వైశ్యులకు పైస్థాయిలోను వుంటారు. క్షత్రియులకు అధోస్థానంలోను, శూద్రులకు పై స్థాయిలోను వైశ్యులుంటారు. అట్టడుగు స్థాయిలో శూద్రులుంటారు.

7. ఏ వర్ణానికి ఏ వృత్తి నిర్ణయింపబడినదో దానినే ఆ వర్ణంవారు నిర్వర్తించాలన్నది మూడవ నియమం. జ్ఞాన సముపార్జన, బోధన, మతవిధులనిర్వహణ బ్రాహ్మణుల వృత్తి. ఆయుధాలనుధరించి యుద్ధాలుచేయడం క్షత్రియుల వృత్తి. వ్యాపారం, వాణిజ్యం వైశ్యుల వృత్తి. పై మూడు వర్ణాలవారికి వూడిగంచేయడం శూద్రుల వృత్తి.

8. ఏ పరిస్థితులలోను ఈ నియమాన్ని అతిక్రమించి ఒక వర్ణంవారి వృత్తి మరోవర్ణం వారు చేపట్టరాదు.

9. ఆదర్శసమాజమన్న పేరుతో ఏర్పాటైన ఈ వ్యవస్థను చాల ఉత్తమమైనదిగా బ్రాహ్మణులు

సమర్థించారు. ప్రజలంతా తప్పకపాటించాలంటూ ప్రచారం చేశారు.

10. అసమానతా విధానమే దీని ఆంతర్యమని అర్థం చేసుకోవచ్చు. ఈ సాంఘిక అసమానత చారిత్రిక కారణాలవలన ఏర్పడిందికాదు. అసమానత బ్రాహ్మణుల అధికారికమైన సిద్ధాంతం.

11. ఈ సిద్ధాంతాన్ని ఆద్యంతం వ్యతిరేకించాడు బుద్ధుడు.

12. ఈ కులవ్యవస్థను తీవ్రంగావ్యతిరేకిస్తూ సమానత్వాన్ని గట్టిగబలపరచింది మొట్టమొదట బుద్ధుడే.

13. కులాన్ని, అసమానతను సమర్థిస్తూతేబడిన వాదాలన్నింటినీ సవాలుచేస్తూ తాను చేయని ప్రతివాదమంటూలేదు.

14. ఈ విషయంపై చాలామంది బ్రాహ్మణులు బుద్ధుణ్ణి వ్యతిరేకించారు. కాని బుద్ధుడు తన వాదనాపటిమతో వారందరినీ నిరుత్తరులను చేయగలిగాడు.

15. దీనికి సంబంధించినకథ అశ్వలాయనసూత్రంలో వుంది. కులం, అసమానతలపై బుద్ధుడి బోధనల్ని ప్రతిఘటించవలసిందని బ్రాహ్మణులంతా ఒకసారి అశ్వలాయనుడిని ఒప్పించి బుద్ధుడివద్దకు పంపారు.

16. అశ్వలాయనుడు బుద్ధుని దర్శించి బ్రాహ్మణులు జన్మతః ఉన్నతులని వాదించాడు.

17. "ఓ గౌతమా! జన్మతః ఉన్నతులమన్నది బ్రాహ్మణులవాదము. శ్వేతవర్ణులైన బ్రాహ్మణులు ఉన్నతులైనట్లే కాలవర్ణులైన తక్కిన మూడు కులాలవారు హీనస్థాయికి చెందినవారు. బ్రహ్మ నోటినుండి పుట్టినవారు, గనుక బ్రాహ్మణులు పవిత్రులు. బ్రహ్మచే సృష్టింపబడినవారుగనుక ఈ బ్రాహ్మణులు అతనికి పుత్రులు, వారసులు. ఆ విషయమై మీరేమంటారు? "అంటూ ప్రశ్నించాడు అశ్వలాయనుడు.

19. "ఓ అశ్వలాయనా! తక్కినకులాలలోని స్త్రీలవలెనే బ్రాహ్మణ స్త్రీలు సైతం రజస్వలానంతరం గర్భందాల్చి పిల్లల్ని కంటున్నారుగదా అలాంటపుడు తక్కిన కులాల స్త్రీలకు పుట్టినట్లే ఈ బ్రాహ్మణులు పుట్టలేదని నీవెలాచెప్పగలవు?"

20. బుద్ధుని ప్రతివాదనకు అశ్వలాయనుడు జవాబు చెప్పలేక పోయాడు.

21. బుద్ధుడింకా తన ప్రతివాదాన్ని కొనసాగిస్తూ అశ్వలాయనునిలా ప్రశ్నించాడు.

22. "అశ్వలాయనా! ఒక రాజవంశపు యువకుడు బ్రాహ్మణ స్త్రీని కలిశాడనుకొందాం. ఆ బ్రాహ్మణస్త్రీ మానవుణ్ణే కంటుందా? లేక మృగాన్ని కంటుందా?"

23. ఈ ప్రశ్నకు అశ్వలాయనుడెలాంటి సమాధానమూ చెప్పలేకపోయాడు.

24. "ఇక నైతికవికాసపరంగ ఆలోచించినట్లయితే, ఈ దేశంలో ఒక్క బ్రాహ్మణుడు

మాత్రమే ఎలాంటి ద్వేషభావాన్ని, ద్రోహచింతనను గలిగిఉండక తన హృదయాన్ని ప్రేమమయంగా వుంచుకోగలుగుతున్నాడనీ, తక్కిన మూడుకులాలవారికది సాధ్యం గాదనీ చెప్పగలవా?"

25. "ఎలా చెప్పగలను? అన్ని కులాలవారు అలావుండగలగడం సాధ్యమే" నన్నాడు అశ్వలాయనుడు.

26. "అశ్వలాయనా! హూణ, కాంభోజదేశాలలో యజమానులు, బానిసలు అనే రెండు వర్ణాలుమాత్రమే వున్నాయనీ, అయితే యజమానులు బానిసలుగ మారవచ్చనీ, బానిసలు యజమానులు కాగలుగుతారనీ నీ వెరుగుదువా?"

27. "అవును ఆ దేశాలలో అలాంటివిధానమే ఉన్నట్లు విన్నాను" అన్నాడు అశ్వలాయనుడు.

28. "మీరు ఆచరించేచాతుర్వర్ణ వ్యవస్థ ఆదర్శప్రాయమైనదయితే అది యావత్ప్రపంచానికీ ఎందుకు వర్తించలేదు?"

29. బుద్ధుడడిగిన ప్రశ్నల్లో ఏ ఒక్కదానికి అశ్వలాయనుడు సరియైన సమాధానం చెప్పలేక పోయాడు. ఆఖరుకు ఆ బ్రాహ్మణపండితుడు బుద్ధునికి శిష్యుడయ్యాడు.

30. వశిష్టుడనే బ్రాహ్మణుడు బౌద్ధధర్మాన్ని స్వీకరించినకారణంగ సాటిబ్రాహ్మణులాతన్ని ఆక్షేపిస్తూ, నిందిస్తూండేవారు.

31. ఒక రోజున వశిష్టుడు బుద్ధుని దర్శించి తనపై బ్రాహ్మణులు సాగిస్తున్న దూషణగూర్చి తెలుపుకున్నాడు.

32. "ఓ భగవానుడా! సమాజంలో అత్యున్నతమైనస్థాయి బ్రాహ్మణులదేనంటారు. వారి దృష్టిలో తక్కువకులాల వారు అధములు. బ్రాహ్మణవర్ణమే స్వచ్ఛమైనదనీ తక్కిన వర్ణాలు మలినమైనవనీ వారివాదన. ఎలాంటి సంకరంలేనిది ఒక్క బ్రాహ్మణులలో మాత్రమేననే వారివాదన. బ్రహ్మ నోటినుండి పుట్టినందున బ్రాహ్మణులు మాత్రమే బ్రహ్మపుత్రులనీ, వారే బ్రహ్మకు సిసలైన సంతానమనీ, వారసులనీ, వారు వాదిస్తారు."

33. "నీవు ఉన్నత వర్ణసంజాతుడవైవుంటే హీన వర్ణస్తులతోకలిసిపోయి, కేశముండనం చేసికొని, సన్యాసివై కడకు బ్రహ్మకాళ్ళనుండి పుట్టినవారితో సమానమై పోయావు. నీవుచేసిన కార్యమెంత మాత్రము మంచిదికాదు. ఉన్నతవర్ణంనుండి విడిపోయి అధోవర్ణాలవారితో కలవడం, శ్వేతవర్ణుడవై వుండి మలినవర్ణస్తులతో చేరడంతప్పు."

34. "భగవానుడా! ఆవిధంగా వారు నన్ను విమర్శిస్తూ, దూషిస్తూ, అవమానిస్తున్నారు" అని వశిష్టుడన్నాడు.

35. ఆమాటలకు బుద్ధుడిలా అన్నాడు:"ఓ వశిష్టా! ఆ విధంగ నిన్ను వెతలపాలు చేస్తున్న బ్రాహ్మణులు వాస్తవాన్ని విస్మరిస్తున్నారన్నమాట. తక్కిన కులాలవలెనే బ్రాహ్మణ

స్త్రీలు సైతం పిల్లల్ని కనడం నీవుచూస్తున్నావు గదా. అలాంటపుడు వారు బ్రహ్మ నోటినుండి ఉద్భవించారనడం, ఆ కారణంగ వారు బ్రహ్మసంతానమని జెప్పడం, బ్రహ్మకు వారసులమని వాదించడం, ప్రకృతి విరుద్ధమైన విషయంగదా!"

36. ఒకప్పుడు విశ్వకారి అనేబ్రాహ్మణుడు బుద్ధునివద్దకు వచ్చి మూడు ప్రశ్నలపై వాదం మొదలుపెట్టాడు.

37. వృత్తులను శాశ్వతంగా స్థిరీకరించడం మొదటిది. ఈ ప్రశ్నపై తనవాదం ప్రారంభిస్తూ, "మిమ్మల్ని ఒక ప్రశ్న అడగదలచాను. బ్రాహ్మణులు అన్ని కులాలకంటే అగ్రభాగాన ఉంటున్నారు. కనుక వారు మరెవ్వరికీ సేవచేయడానికి వీల్లేదని మా బ్రాహ్మణుల వాదన. అంతేగాక తక్కిన కులాలవారంతా వారికి సేవచెయ్యాల్సిందే.

38. "గౌతమా! ఈ సేవ నాల్గువిధాలు. బ్రాహ్మణులకు సేవచేయడం, రాజులకు సేవచేయడం, మధ్యతరగతి వారికి సేవచేయడం, వ్యవసాయదారులకు సేవజేయడం. వ్యవసాయదారుడికింకెవరు సేవచేస్తారు? ఈ విషయమై యోగ్యులైన గౌతముని అభిప్రాయమేమిటి?"

39. బ్రాహ్మణుడడిగిన ప్రశ్నకు బుద్ధుడు ఎదురు ప్రశ్నతో సమాధానమిచ్చాడు. "బ్రాహ్మణులు చెప్తున్న నాలుగుఅంచెల సేవావిధానమే యావత్ ప్రపంచంలోను వున్నదా?"

40. సేవ చెయ్యమనిగాని, సేవ నిరాకరించమనిగాని నేను చెప్పను. సేవవల్ల ఒక మనిషి సజ్జనుడు కాక దుర్జనుడైతే, అతడు సేవచేయరాదు. కాని దానివల్ల అతడు మరింత యోగ్యుడైతే, సేవచేయవచ్చు.

41. బ్రాహ్మణులుగాని, క్షత్రియులుగాని, మధ్యకులంవారుగానీ, వ్యవసాయదారులుగాని తాము నిర్వర్తించే దానివలన తమ వ్యక్తిత్వానికి మంచిజరిగితే వారాపనిచేయవచ్చు. ఏ పనిచేసినందువలన తమ వ్యక్తిత్వానికి చెడుజరుగుతుందో, ఆ పని చేయరాదు."

42. "వంశ పరంపరానుగతంగా ఒక వ్యక్తి స్థాయిని నిర్ణయించడంలోగల దోషమేమిటి!" ఇది బ్రాహ్మణుడైన విశ్వకారి రెండవ ప్రశ్న.

43. ఆ ప్రశ్నకు బుద్ధుడిలా సమాధానమిచ్చాడు:"ఇందులో తాను ఫలానావంశంలో పుట్టానని చెప్పుకోవటానికేగాని మరేమీ లేదు. కొయ్యకాల్చి నిప్పుచెయ్యవచ్చు. గడ్డి గాల్చి నిప్పుచేయవచ్చు. పేడ కాల్చి నిప్పుచేయవచ్చు. ఏ వస్తువు నుపయోగించి కాల్చితే నిప్పునా వస్తువుపేరుతో పిలచినట్లు, బ్రాహ్మణులుగాని, క్షత్రియులుగాని, మధ్యకులంవారుగాని, వ్యవసాయకులం గాని, వారు పుట్టిన వంశంద్వారా వచ్చే పేర్లు మాత్రమే."

44. "ఒకడు పుట్టిన వంశాన్నిబట్టి మంచివాడుగాని లేక చెడ్డవాడుగాని కాజాలడు. పుట్టుకనుబట్టి ఔన్నత్యాన్ని నిర్ణయించలేము. క్షత్రియకులంలో పుట్టినవాడు హంతకుడు కావచ్చు, దొంగ కావచ్చు, వ్యభిచారి కావచ్చు. అబద్ధీకుడు గావచ్చు, వదరుబోతు,

ఆశబోతు గావచ్చు. దురభిప్రాయాలుగలవాడు కావచ్చు. అందుచేత ఉన్నతవంశంలో పుట్టినంత మాత్రాన్నె ఉత్తముడను కాజాలము. రాజవంశంలో పుట్టిన మరొకడిలో పై చెడులక్షణాలేవీ ఉండకపోవచ్చు. ఆ కారణంగ పరంపరానుగతంగావ్యక్తిస్థాయిని నిర్ణయించి మంచివాడనిగాని లేక చెడ్డవాడనిగాని చెప్పజాలము."

45. ఏ కులంవారు ఆ కులానికై నిర్దేశింపబడిన వృత్తిద్వారా జీవించాలన్నది బ్రాహ్మణుడైన విశ్వకారి మూడవ ప్రశ్న.

46. అతను భగవానునిలా ప్రశ్నించాడు : "బ్రాహ్మణులు యాచనద్వారా, క్షత్రియులు ఆయుధాలద్వారా, నాగలిద్వారా, పశుపోషణద్వారా, మధ్యతరగతి వారు, కర్షకుడు పంటలను భుజాలపై మోసి జీవించాలి. ఒక కులంవారు మరోకులం వారి వృత్తిని చేపట్టడం సంరక్షకుడు తనది కానిది తిరస్కరించటంవంటిది. ఈ విషయమై గౌరవనీయులైన గౌతములవారి అభిప్రాయమేమిటి?"

47. "అయితే ఈ వృత్తి నిర్ణయవిధానం యావత్ ప్రపంచంలోను అమలులో వున్నదా?" అని బుద్ధుడు ఎదురుప్రశ్న వేయగా

48. "లేదు" అని విశ్వకారి జవాబిచ్చాడు.

49. "ఉన్నతాదర్శాలు ముఖ్యంగాని ఉన్నతవంశంలో పుట్టుకగాదు" అని భగవానుడు చెప్పాడు.

50. "కులం వద్దు అసమానతలు వద్దు, ఉచ్ఛనీచాలు వద్దు, మానవులందరూ సమానమే. దీనికి తాను నిలబడతాడు."

51. "ఇతరులతో మమేకంఅవ్వు. వారెంతో నేనంతే, నేనెంతో వారంతే" అని బుద్ధుడు వచించాడు.

## 2. పుట్టుక కాక యోగ్యతే మనిషి కొలమానమని బోధించే ధమ్మమే సద్ధమ్మం

1. బ్రాహ్మణులు బోధించే చాతుర్వర్ణ్య సిద్ధాంతంలో పుట్టుకకే ప్రాధాన్యత ఇవ్వబడింది

2. బ్రాహ్మణదంపతులకు పుట్టాడుకనక తాను బ్రాహ్మణుడు. ఒకడు క్షత్రియుడుగ గుర్తింపబడడానికి కారణం తన తల్లితండ్రులు క్షత్రియులుగావటమే. తల్లితండ్రులు వైశ్యులైతే వారి సంతానం వైశ్యులే. తన తల్లితండ్రులు శూద్రుడు గాబట్టి తాను శూద్రుడు.

3. బ్రాహ్మణులునమ్మే యీ సిద్ధాంతంప్రకారం పుట్టుకకేగాని మరిదేనికే ప్రాధాన్యత లేదు.

4. చాతుర్వర్ణ్య సిద్ధాంతాన్ని వ్యతిరేకించినట్లే ఈ విధానాన్నిసైతం తీవ్రంగ వ్యతిరేకించాడు

బుద్ధుడు.

5. బుద్ధుడు బోధించిన సిద్ధాంతం బ్రాహ్మణ సిద్ధాంతానికి పూర్తిగా వ్యతిరేకమైనది. ఒక వ్యక్తిస్థాయికి తనగుణసంపదే కొలతబద్దయే గాని తన కులంగాదన్నది బుద్ధుని వాదం.

6. ఈ సిద్ధాంతానికి బుద్ధుడు ఉటంకించిన సన్నివేశం చాలఆసక్తికరమైనది.

7. ఒకప్పుడు బుద్ధుడు అనాధపిండకుని ఆరామంలో వున్నాడు. ఒకనాడు బుద్ధుడు పెందలకడనేలేచి తనభిక్షాపాత్రతో భిక్షాటనకై శ్రావస్తి పట్టణం ప్రవేశించాడు.

8. భగవానుడు ఇల్లిల్లుతిరిగి భిక్షాటనచేస్తూ అగ్నికుడను బ్రాహ్మణుని ఇంటివద్దకు వచ్చాడు. యజ్ఞగుండంలో సమిధలువేసి మండిస్తూ ఆయజ్ఞానికి కావలసిన ఇతర సామగ్రిని సమాయుత్తంచేయడం అక్కడ జరుగుతున్నది.

9. సుగతుడు ఆ ఇంటివైపురావడం దూరాన్నుంచే గమనించిన బ్రాహ్మణుడు ఆగ్రహించి "ఓ బోడిగుండు భిక్షకుడా! అక్కడే ఆగు. దౌర్భాగ్యుడా, కులహీనుడా, ముందుకు రాకు" అంటూ తిట్టసాగాడు.

10. ఆ మాటలువిన్న భగవానుడు "ఓ బ్రాహ్మణుడా! కులహీనుడనగ ఎవ్వరో నీ వెరుగుదువా? ఒకడు ఏ పరిస్థితుల్లో కులహీనుడౌతాడో నీవెరుగుదువా?" అని ప్రశ్నించాడు.

11. "ఓ గౌతమా!కులహీనుడనగ ఎవ్వరో నేనెరుగను. ఒకడు ఏ పరిస్థితుల్లో కులహీనుడౌతాడో వాస్తవంగా నాకు తెలియదు" అన్నాడా బ్రాహ్మణుడు.

12. అయితే కులహీనుడంటే ఎవ్వరో తెలుసుకొన్నందువలన ఆ బ్రాహ్మణుడు కోల్పోయే దేదీ వుండబోదని భగవానుడు చెప్పగ "అయితే తెలుసుకోవలసిందిగ నీవు చెబుతున్నావు గనుక అదేదో వివరించమ"ని బ్రాహ్మణుడు అడిగాడు.

13. తెలిసికొనేందుకై బ్రాహ్మణుడు సంసిద్ధతతెలియబరచడంతో భగవానుడు ఇలా చెప్పాడు:

14. "ఎవ్వడైతే ఆగ్రహించి అసభ్యంగా ప్రవర్తిస్తాడో, ఎవ్వడైతే దుర్బుద్ధితో సాటివారిని హీనంగ చూస్తాడో, ఎవ్వడైతే నిశ్చితమైనభావాలులేకుండ మోసపూరితంగ ప్రవర్తిస్తాడో అలాంటివాడే కులహీనుడు.

15. ఏకజుడైనా, ద్విజుడైనా దయారహితుడై జీవులను హింసిస్తే అలాంటివాడు కులహీనుడు.

16. ఎవ్వడైతే ఇతరులను బాధించి, వారి గ్రామాలను, వాడలను నాశనంచేస్తాడో వాడు కులహీనుడు.

17. గ్రామంలోగాని, వనప్రాంతంలోగాని, ఎవ్వడైతే దొంగతనానికి పాల్పడతాడో, తన

కివ్వబడనిదానిని సంగ్రహించచూస్తాడో వాడు కులహీనుడు.

18. ఎవ్వడైతే ఋణందీసికొని పారిపోతాడో, ఋణంచెల్లించమంటే బాకీలేనని బుకాయిస్తాడో అలాంటివాడు కులహీనుడు.

19. ఎవ్వడైతే అల్పబుద్ధితో దారినపోతున్నవాడిని చంపి దోచుకుంటాడో వాడు కులహీనుడు."

20. ఎవ్వడైతే తన స్వార్థంకోసంగాని లేక ఇతరుల ప్రయోజనంకోసమైగాని లేక ధనాశతోగాని అబద్ధపు సాక్ష్యం చెప్తాడో వాడు కులహీనుడు.

21. ఎవ్వడైతే బలవంతంగాగాని లేక యిష్టప్రకారంగాగాని బంధువులు లేక హితుల సతులతో అక్రమసంబంధం నెరపుతాడో అలాంటివాడు కులహీనుడు.

22. ఎవ్వడైతే వార్థక్యంలోఉన్న తన తల్లిదండ్రులను ఆదుకొనడో వాడు కులహీనుడు.

23. హితవుగోరివచ్చిన వాడికి ఎవడైతే చెడుబోధన చేస్తాడో వాడు కులహీనుడు.

24. పుట్టుకతో ఎవ్వడూ కులహీనుడు కాడు. పుట్టుకతో ఎవ్వడూ బ్రాహ్మణుడు కాజాలడు."

25. ఆ మాటలువిన్న అగ్నికుడు తాను దుందుడుకుగ భగవానుని తూలనాడినందుకు సిగ్గుతో తలవాల్చాడు.

## 3. మనిషికి మనిషికి మధ్య సమత పెంపొందించే ధమ్మమే సద్ధమ్మం

1. పుట్టుకతో మానవులందరు సమానులే.

2. వారితో కొందరు బలిష్టులు కావచ్చు. మరి కొందరు బలహీనులు కావచ్చు.

3. కొందరు వివేకులుగావచ్చు. మరి కొందరు మందమతులుగావచ్చు. మరి కొందరు మతిహీనులుగావచ్చు.

4. కొందరిలో అధికశక్తి వుండవచ్చు. మరి కొందరిలో అంతటి శక్తి లోపించి వుండవచ్చు.

5. కొందరు భాగ్యవంతులు గావచ్చు. మరి కొందరు పేదరికంతో వుండవచ్చు.

6. అయితే అందరు జీవనసమరంలో మనుగడకై పోరాడవలసినవారే.

7. ఈ జీవనసమరంలో అసమానతాసూత్రాన్ని అవలంబించినట్లయితే బలహీనులు మట్టిగరుస్తారు.

8. అలాంటపుడు అసమానతను జీవనవిధానంగా అంగీకరించడం భావ్యమేనా?

9. సమర్థులైనవారే బ్రతికిబట్టగడతారని కొందరీ అసమానతను సమర్థించడం జరుగుతుంది.

10. అయితే సాంఘిక ప్రయోజనం దృష్ట్యా, సామర్థ్యమే ఉత్తమమైనది కాగలదా అనేదే ప్రశ్న.

11. దీనినెవ్వరూ సమర్థించి జవాబు చెప్పజాలరు.

12. ఈ శంకవల్లనే మతం సమతని బోధిస్తుంది. సమతావాదం వలన ఉత్తములైన వారికి సైతం మనుగడ లభిస్తుంది, వారు సమర్థులు కాకపోయినా.

13. సమాజానికి సమర్థత కంటే మంచితనమే ముఖ్యం.

14. ఇది బుద్ధుని ఆలోచనా విధానం. ఏ మతమైతే సమతని బోధించదో అది ఆదరణీయం కాజాలదన్నాడు బుద్ధుడు.

16. ఇతరుల్ని దుఃఖితులనుచేసి తద్వారా ఒకడు సుఖించడాన్నిగాని, లేక ఒకడు దుః ఖితుడై తద్వారా ఇతరులు సుఖించడానిగాని లేక తాను దుఃఖితుడై ఇతరుల్ని కూడ దుఃఖితులను చేయడాన్నిగాని సమర్థించే మతాన్ని ఎవ్వడైనా నమ్మి అనుసరించగలడా?

17. దమనకాండను సహించక, ఏకకాలంలో వ్యక్తిసౌఖ్యాన్ని, సమిష్టిసౌఖ్యాన్ని పెంపొందించేది మెరుగైనమతం కాదా?

18. సమానతా సిద్ధాంతాన్ని వ్యతిరేకిస్తున్న బ్రాహ్మణులకు బుద్ధుడు వేసిన ప్రశ్నలలో యివి మిక్కిలి యుక్తమైనవి.

19. మనిషి ఉత్కృష్టస్థితి నుంచి ఆవిర్భవించిన నిర్దుష్టమైనన్యాయం బుద్ధుని మతం.

*అనువాదం : కె.ఎల్.ఎస్. ప్రసాద్*

# నాలుగో అధ్యాయం

# మతం - ధమ్మం

1. భాగం : మతం - ధమ్మం
2. వ భాగం : పారిభాషిక పదాల్లో సాదృశ్యాలను దాచిపెడుతున్న ప్రాథమిక విభేదాలు.
3. వ భాగం : బౌద్ధజీవన మార్గం.
4. వ భాగం : బుద్ధుని ఉపదేశాలు.

# మొదటి భాగం

## మతం - ధమ్మం

1. మతమంటే ఏమిటి ?
2. మతంతో ధమ్మం ఏరకంగా విభేదిస్తుంది?
3. మతం ఉద్దేశం, ధమ్మం ఉద్దేశం.
4. నీతి, మతం
5. ధమ్మం, నీతి
6. నీతి మాత్రాన్నేసరిపోదు. అది పవిత్రంగా,విశ్వజనీనంగాఉండాలి.

# మతమంటే ఏమిటి?

1. "మతం" అనే మాట ఒక సందిగ్ధమైన మాట. దీనికి ఒక నిశ్చయమైన అర్థం లేదు.
2. ఇది అనేక అర్థాలతో కూడుకొన్న ఒక మాట.
3. ఎందుకంటే మతం ఎన్నో దశల్ని దాటుకుంటూ సాగి వచ్చింది. ఒక దశలో మత భావనను ఒక రకంగా వ్యవహరించినా తరువాతి దశలో దాని అర్థం ఒక విధంగా లేదు. మొదటి దశలో వలె చివరి దశలో లేదు.
4. మత భావన ఎప్పుడూ నిర్ణయించబడలేదు.
5. ఇది ఎప్పటికప్పుడూ మారుతూ వచ్చింది.
6. ఉరుములు, వర్షం, వరదలు వంటి పరిస్థితులు సంభవించినప్పుడు, అలాంటి పరిస్థితులకు కారణాలేమిటో ఆది మానవులకు తెలిసేవి కావు. వాటిని ఉపశమింప జేయడానికి వారు ఏదో మహిమల్ని ఆశ్రయించేవారు. అందు వల్లనే మతం అంటేనే మహిమలు అయింది.
7. తర్వాత మతపరిణామంలో రెండవ దశవచ్చింది. ఈ దశలో మతమంటే నమ్మకాలు, ఆచారాలు, కర్మలు, పూజలు, యజ్ఞాలుగా గుర్తింపులోకి వచ్చింది.
8. కాని ఇలాంటి మత భావన ఆచరణానుగుణమైంది.
9. ఆది మానవునికి తెలియని, అర్థం చేసుకోలేని ప్రకృతి ఘటనల వెనుక ఏదో ఒక అతీత శక్తి వున్నదనే నమ్మకంతోనే. మతం మూల సూత్రం ఆరంభమవుతుంది. ఈ దశలో మహిమలు అంతరించాయి
10. ఈ శక్తి ఆదిలో దుష్టమైనది. కాని తరువాత అది ఉపకారి కావచ్చని కూడా భావించారు.
11. నమ్మకాలు, ఆచారాలు, కర్మలు, యజ్ఞాలు, శిష్టశక్తిని ప్రసన్నం చేయటానికి, దుష్టశక్తిని శాంతింప చేయడానికి రెండు విధాలు గాను అవసరమయ్యాయి
12. అనంతరం ఆశక్తిని దేవుడు లేదా సృష్టికర్త అన్నారు.
13. ఆపైన మూడవ దశ వచ్చింది. ఏ దేవుడైతే ఈ విశ్వాన్ని సృష్టించాడో, ఆయనే మనిషిని కూడా సృష్టించాడు అన్నారు.
14. తర్వాత మనిషికి ఆత్మ ఉందని, అది శాశ్వతమైందని, అలాగే విశ్వంలో తన చర్యలన్నింటిపై దేవుడికి మనిషి సంజాయిషీ చెప్పుకోవాల్సి ఉంటుందని నమ్మకం వచ్చింది.

15. ఇదే క్లుప్తంగా మత భావనా పరిణామం.

16. దేవునిలో విశ్వాసం, ఆత్మలో విశ్వాసం, దైవ భక్తి, దారి తప్పిన ఆత్మకి స్వస్థత, యజ్ఞాలు, ప్రార్థనలు, విధులతో దైవాన్ని ప్రసన్నం చేసుకోవటం - ఇవీ క్రమంగా మతానికి అర్థంగా పరిణమించాయి.

## 2. మతంతో ధమ్మం ఎలా విభేదిస్తుంది ?

1. బుద్ధుడు ప్రబోధించిన ధమ్మం మతంతో ప్రాథమికంగా ఎలా విభేదిస్తుంది?

2. ఐరోపా మతవేత్త దృష్టిలో మతానికి, బుద్ధుని దృష్టిలో ధమ్మానికీ సామ్యం ఉంది.

3. కాని రెండింటికీ ఇంతకు మించి పెద్ద అనుబంధం లేదు. పైగా రెండింటి మధ్య తేడా చాలా గొప్పది కూడా.

4. ఈ కారణంగా బౌద్ధధర్మాన్ని ఒక మతంగా గుర్తించడానికి ఐరోపామతవేత్తలు తిరస్కరించారు.

5. ఈ విషయంలో విచారించదగినదేమీ లేదు, నష్టం వారికే, బుద్ధుని ధమ్మానికి, ఇది నష్టం కలిగించకపోగా, మతంలో ఏది అవసరమో ఇది సూచిస్తుంది.

6. ఈ వివాదంలోకి ప్రవేశించే కంటే ధమ్మాన్ని గురించి ఒక అవగాహన కలిగించడం, ఇది మతంతో ఏ రకంగా విభేదిస్తుందో చెప్పబూనడం మంచిది.

7. మతం వ్యక్తిగతమైంది. దీన్ని వ్యక్తి తన వరకు పరిమితం చేసుకోవాలి అంటారు. సమాజ జీవనంలో దీనికి చోటివ్వరాదు.

8. కాని దీనికి విరుద్ధంగా, ధమ్మం సాంఘికమైంది. ఇది ప్రాథమికంగా సాంఘికం.

9. ధమ్మం సన్మార్గ వర్తనం, దాని అర్థం అన్ని రకాల మనుషులతో సాటి మనిషికి మంచి సంబంధం ఉండడం.

10. ఇంకా స్పష్టంగా - మనిషి ఏకాకి అయితే ధర్మంతో పని లేదు.

11. కాని ఎప్పుడయితే ఇద్దరు మనుషులు పరస్పర బంధంలో జీవిస్తున్నారో వారు తప్పకుండా ధమ్మం అవసరం గుర్తిస్తారు - దాని నుండి తప్పుకు తిరిగినా, అదంటే ఇష్టపడక పోయినా.

12. మరో మాటలో చెప్పాలంటే ధమ్మం లేకుండా సమాజం ఉండదు.

13. ఉన్నపుడు ప్రత్యామ్నాయ మార్గాల్లో ఏదో ఒక దానిని సమాజం ఎన్నుకోవాల్సి ఉంటుంది.

14. ప్రభుత్వానికి సాధనంగా ఎలాంటి ధమ్మం అవసరం లేదని సమాజం అనుకోవచ్చు, కాని ధమ్మం ప్రభుత్వానికి ఒక సాధనంగా ఉండకపోతే అది వ్యర్థం.

15. ధమ్మం అనవసరమంటే సమాజం అరాచకం అనే మార్గాన్ని ఎన్నుకున్నదన్నమాటే.

16. రెండవది. పరిపాలనకు సాధనంగా పోలీసులను అంటే నియంతను ఎన్నుకుంటే, అది నిరంకుశానికి సాధనమన్నమాటే.

17. మూడవది. ఎక్కడైనా ధమ్మాన్ని పాటించడంలో విఫలమయ్యే పక్షంలో సమాజం ధమ్మంతోపాటు న్యాయాధికారిని ఎన్నుకోవచ్చు.

18. అరాచకంలోనూ, నిరంకుశపాలనలోనూ స్వేచ్ఛ పోతుంది.

19. మూడవ దానిలోనే స్వేచ్ఛ మనుతుంది.

20. స్వేచ్ఛ కోరే వారెవరైన ధమ్మాన్ని ఆశ్రయించ వలసి ఉంటుంది.

21. ఇక ధమ్మం మంటే ఏమిటి? ధమ్మం ఎందుకవసరం? బుద్ధుని ధమ్మం ప్రకారం అది ప్రజ్ఞ, కరుణలతో కూడి ఉంటుంది.

22. ప్రజ్ఞంటే ఏమిటి? ప్రజ్ఞ ఎందుకు? ప్రజ్ఞ అనేది అవగాహన బుద్ధుడు తన ధమ్మానికి గల రెండు మూలశిలల్లో ఒకటిగా ప్రజ్ఞను పరిగణించాడు. ఎందుకంటే మూఢ నమ్మకాలకు ఎటువంటి చోటూ ఇవ్వకూడదని.

23. కరుణ అంటే ఏమిటి? కరుణ ఎందుకు? కరుణ అంటే ప్రేమ. ఎందుకంటే ఇది లేకుండా సమాజం జీవించలేదు. వికసించ లేదు. అందుకే బుద్ధుడు తన ధమ్మానికి కరుణను రెండవ మూల శిలగా చెబుతాడు.

24. అదీ బుద్ధుడి ధమ్మ నిర్వచనం.

25. మతంతో ఈ ధమ్మ నిర్వచనం ఎలా విభేదిస్తుంది?

26. ధమ్మానికి బుద్ధుడిచ్చిన నిర్వచనం ప్రాచీనమైనది అయినా ఇప్పటికీ ఆధునిక మైనది కూడా.

27. ప్రాచీనమైనదనిపించినా అది నిత్యనూతనమైనది.

28. ఎవరి దగ్గరనుంచి ఎరువు తెచ్చుకున్నది కాదు. ఇప్పటికీ నిజమైనది.

29. అసాధారణమైన ప్రజ్ఞ, కరుణల కలయికే బుద్ధుని ధమ్మం.

30. అదీ మతానికీ, ధమ్మానికీ తేడా.

## మతం ఉద్దేశ్యం - ధమ్మం ఉద్దేశ్యం

1. మతం ఉద్దేశ్యమేమిటి? ధమ్మం ఉద్దేశ్యమేమిటి? అవి రెండు ఒకటేనాలేక వేరువేరా?

2. ఈ ప్రశ్నలకు సమాధానాలు రెండు సంవాదాల వల్ల తెలుసుకుందాం. మొదటి సంవాదం

బుద్ధునికి, సునక్షత్రకునికీ మధ్య జరిగిన సంవాదం. రెండవది బుద్ధునికి, పాత్రపాదుడనే బ్రాహ్మణునికీ మధ్య జరిగిన సంవాదం.

3. ఒకప్పుడు బుద్ధుడు మల్లులకు చెందిన అను ప్రియ అనే పట్టణంలో నివసిస్తుండేవాడు.

4. బుద్ధుడు వేకువనే లేచి వస్త్రాలు ధరించి భిక్షాపాత్రతో సహా పట్టణానికి భిక్షకై బయలు దేరాడు.

5. అయితే మార్గమధ్యంలో మరీ తెల్లవారకముందే భిక్షకు వెళ్ళడం ఉచితం కాదని భావించాడు. అందువల్ల సమీపంలో నివసిస్తున్న భార్గవుడనే దేశ సంచారి ఆశ్రమానికి చేరుకున్నాడు.

6. బుద్ధుని చూడగానే భార్గవుడు లేచి నమస్కరించి ఒక ఉన్నతాసనంపై కూర్చోవలసిందిగా ప్రార్థించాడు.

7. ఆ ఆసనంపై బుద్ధుడు కూర్చున్నాడు. ప్రక్కనే చిన్న ఆసనంపై భార్గవుడు కూర్చున్నాడు. బుద్ధునితో సంభాషణ ప్రారంభించాడు.

8. ప్రభూ! చాలాకాలం కిందట లిచ్ఛవీయుడైన సునక్షత్రకుడు నాదగ్గరికి వచ్చాడు. అతనన్నాడు! ``భార్గవా! నేనిప్పుడు బుద్ధదేవుని శుశ్రూష చేయటం లేదు. నేనాయన్ని వదిలి పెట్టాను." అని అతనన్నది నిజమేనా?"

9. " అవును భార్గవా సునక్షత్రకుడు నీకు చెప్పింది నిజమే" అని బుద్ధుడు సమాధానమిచ్చాడు.

10. చాలా రోజుల కిందట, చాల రోజులయి ఉంటుంది. అప్పుడు లిచ్ఛవీయుడైన సునక్షత్రకుడు నాదగ్గరకు వచ్చాడు. ``స్వామి! నేను మీ శుశ్రూషను చాలించు కుంటున్నాను. అన్నాడు. అప్పుడు నేనన్నాను." సునక్షత్రకా! నిన్నెప్పుడైనా నా శిష్యుడిగా ఉండమన్నానా?"

11. "మీరు ఉండమనలేదు."

12. లేదా "మీ శిష్యునిగా నేనుంటాను" అని నాతో ఎప్పుడైనా చెప్పావా

13. "లేదు, మీకెప్పుడూ చెప్పలేదు."

14. అప్పుడు అన్నాను ``నేను నిన్ను శిష్యుడిగా ఉండమనలేదు. నన్ను శిష్యుడిగా చేర్చుకోమని నీవు నన్ను అడుగలేదు. అలాంటప్పుడు నేను నీకెవరు, నీవు నాకెవరు? తెలివి తక్కువ తనమంతా నీదే."

15. "మంచిది. కాని స్వామి! సామాన్యులకు అందని మహిమల్నినాకు బోధించడం లేదు కదా!"

16. చూడు సునక్షత్రకా! నిన్నెప్పుడైనా ``సునక్షత్రకా! నాశిష్యునిగా నీకు సామాన్యులకతీతమైన మహిమల్ని బోధిస్తానన్నానా?

17. "మీరెప్పుడూ అనలేదు."

18. లేక నీవు "స్వామీ! మీ శిష్యునిగా ఉంటాను. సామాన్యులకందని మహిమలను నాకు బోధిస్తారా!" అని ఎప్పుడైనా అడిగావా.

19. "అడగ లేదు"

20. "నేను అడగలేదు, నేను చెప్పనూలేదు. నీవెవరు, నేనెవరిని, ఇదంతా నీ అవివేకం. అసలు నీ వేమనుకుంటున్నావు సునక్షత్రకా! నీవు చెబుతున్న అసాధారణ మహిమలు అసలున్నా లేకపోయినా నేను బోధించే ధమ్మం అనుష్టించే వాడికి చెడు పూర్తిగా పరిహరించటం జరుగుతుందనుకుంటున్నావా?

21. "మహిమలు ఉన్నా లేకపోయినా - భగవానుడు చేసే బోధల సందేశం తమరు మనవి చేసిందే"

22. "అయినప్పుడు, సునక్షత్రకా, మహిమలున్నా లేకపోయినా నా సందేశానికేమీ భిన్నం కానప్పుడు, అవి వుంటే నీకేం ప్రయోజనం? ఎంత తెలివి తక్కువన పడ్డావో చూశావు గదా."

23. కాని స్వామి! మీరు నాకు సృష్టి ఆరంభం గురించి బోధించడం లేదు."

24. సునక్షత్రకా నీకెప్పుడైనా చెప్పానా ``రా! సునక్షత్రకా ! నాశిష్యునిగా ఉండు, నీకు సృష్టి ఆరంభం గురించి బోధిస్తాను"అని.

25. "లేదు.... మీరెప్పుడూ చెప్పలేదు"

26. లేదా "నేను మీ శిష్యుడ్ని అవుతాను. నాకు సృష్టి ఎలా మొదలైంది బోధించండి" అని నీవెప్పుడైనా నన్ను అడిగావా?

27. "లేదు"

28. "నేనెప్పుడూ చెప్పలేదు. నీవూ ఎప్పుడూ అడగలేదు. నేనెవర్ని, నీవెవరు ? మందబుద్ధీ, మరేమిటి వదిలేస్తానంటున్నావు? అవును, సునక్షత్రకా, నేను సృష్టి ఎలా ఆరంభమైందీ చెప్పినా, చెప్పకపోయినా - నేను బోధించే ధమ్మం అనుష్ఠించే వాడికి నేడు పూర్తిగా నిర్మానం అవుతుందని అనుకుంటున్నావా!"

29. "అవును స్వామీ, సృష్టిని గురించి చెప్పినా చెప్పకపోయినా భగవానుడు చేసే బోధల సారాంశం తమరు మనవి చేసిందే". ``అయితే సునక్షత్రకా ! సృష్టి ప్రారంభం తెలినా తెలకపోయినా--.

30. దానికి నా సందేశంతో నిమిత్తం లేనప్పుడు అది నేర్చుకోవడం వల్ల నీకు కలిగే ప్రయోజనం ఏమిటంటే మాత్రం ఏముంది?"

31. ఈ సంవాదం తెలిపేది ఏమిటంటే - సృష్టి ఆరంభం అనేది మతానికి సంబంధించినదే గాని ధమ్మంలోనిది కాదని.

(II)

మతానికి ధమ్మానికి ఉన్న ఇతర భేదాలు బుద్ధునికి పాత్ర పాదునికీ మధ్య సంవాదం వల్ల తెలుస్తాయి.

1. బుద్ధుడు ఒకప్పుడు శ్రావస్తిలోని జితావనంలో ఉన్న అనాధ పిండకుని ఆశ్రమంలో నివసిస్తుండేవాడు. ఆ కాలంలో మహారాణి యైన మల్లిక తోటలో పాత్ర పాదుడనే బైరాగి తాత్విక చింతనను గూర్చిన ప్రధాన వాదాలపై చర్చ సాగించేవాడు.

2. అతని వెంట చాలా మంది ఉండేవారు అప్పుడు యాయులైన బైరాగులుండే వారు. వారు లెక్కకు 300 మంది ఉండేవారు అప్పుడు పాత్రపాదునికి. బుద్ధునికీ సంవాదం ఇలా జరిగింది. పాత్రపాదుడు అడిగాడు....

3. ``మహానుభావా! అలాగైతే ఈ విషయం తెలుపండి. ఈ ప్రపంచం శాశ్వతమా? ఇది మాత్రమే సత్యమా, మరే ఇతర అభిప్రాయాలైనా తప్పుల తడికలా?

4. ``పాత్రపాదా! ఆ విషయంపై నేను ఏ అభిప్రాయాన్ని వ్యక్తం చెయ్యలేదు." బుద్ధుడు సమాధాన మిచ్చాడు.

5. తర్వాత పాత్ర పాదుడు అలాంటివే కింది ప్రశ్నలడిగాడు.

   i. ఈ ప్రపంచం అశాశ్వతం కాదా?

   ii. ఈ ప్రపంచానికి అంతం ఉందా?

   iii. ఈ ప్రపంచం అనంతమైనదా?

   iv ఈ ఆత్మ, దేహం ఒకటేనా?

   v. ఈ ఆత్మ ఒకటీ, దేహం మరొకటీనా?

   vi సత్యాన్ని గ్రహించినవాడు చనిపోయిన తర్వాత జీవించి వుంటాడా!

   vii అతడు చనిపోయిన తర్వాత జీవించి ఉండడా? మొదలైనవి.

6. అన్ని ప్రశ్నలకు బుద్ధుడు అవే సమాధానాలిచ్చాడు.

7. "పాత్రపాదా! అందులోనూ ఆ విషయంపై నేను అభిప్రాయం వ్యక్తం చెయ్యలేదు."

8. "బుద్ధుడు దానిపై అభిప్రాయం వెలిబుచ్చక పోవడానికి కారణం?"

9. "ఎందుకంటే ఈ ప్రశ్న నిష్ప్రయోజనకరమైనది. ఇది ధమ్మానికి సంబంధించింది కాదు

ఇది సత్ప్రవర్తనకు ప్రమేయం వున్నది కాదు. పాపాల ప్రక్షాళనకు కాదు. అలాగే ప్రశాంత జీవనానికి, హృదయ నైర్మల్యానికీ, సత్య సంబంధమైన జ్ఞానానికీ గాని ఉన్నత పథాలకు గాని నిర్వాణ సాధనకు గాని, అవి దోహదం చేసేవికావు. అందుకే వాటిపై నా అభిప్రాయాలు వ్యక్తం చెయ్యలేదు."

10. "అయితే భగవానులు ఏమని తీర్మానించారు."

11. "పాత్రపాదా! దుఃఖమేమిటో, దుఃఖానికి మూల మేమిటో, నేను వ్యాఖ్యానించాను. దుఃఖానికి నివారణ మార్గమేమిటో వ్యాఖ్యానించాను దుఃఖం నుండి ఎవరైనా విముక్తి సాధించేందుకు నేను పద్ధతులు చెప్పాను."

12. "భగవానుడు ఆ విషయాన్నే ఎందుకు అన్వేషించి చెప్పారు?"

13. "ఆ విషయం ధర్మానికి సంబంధించి ప్రయోజనకరమైనదని చెప్పాను పాత్రపాదా! సత్ప్రవర్తన ఫలితానికి, దుర్వర్తన నుండి దూరానికి, విషయ వాంఛల నుండి హృదయ పరిశుద్ధతకు, శాంతికి, సత్య సంబంధమైన జ్ఞానానికి, ఉన్నత పథాలకు, నిర్వాణానికి మార్గాలు భోధించాను."

14. ఈ సంవాదంలో మతానికి సంబంధించిన విషయమేమిటో, ధమ్మానికి సంబంధంలేని విషయమేమిటో స్పష్టమైంది. రెంటికి నక్కకు నాగలోకానికి వున్నంత దూరం.

15. మతం ఉద్దేశ్యం ప్రపంచం ఆవిర్భావాన్ని వివరించడమే ధమ్మం ఉద్దేశ్యం ప్రపంచాన్ని పునర్నిర్మించడం.

# 4. నీతి - మతం

1. మతంలో నీతికి స్థానం ఏమిటి?

2. నిజానికి మతంలో నీతికి స్థానం లేదు.

3. మతం దేవుడు, ఆత్మ, పూజలు, భక్తి, ప్రార్థనలు, ఆచారాలు, కర్మలు, యజ్ఞాలతో కూడి ఉంటుంది.

4. మనిషి మరో మనిషితో సంబంధం కలిగి ఉన్న చోట నీతి ఉంటుంది.

5. శాంతిని, భద్రతను కాపాడడానికి మతంలోకి నీతి పక్కవాటంగా వస్తుంది.

6. మతం అనేది ముక్కోణాకారపు వస్తువు.

7. నీ పొరుగు వానితో మంచిగా ఉండు. ఎందుకంటే మీ రిద్దరూ దేవుని పిల్లలు.

8. అదీ మతం వాదన.

9. ప్రతిమతం నీతిని బోధిస్తుంది గాని మతానికి నీతి మూలం కాదు.

10. దీన్ని ఒక వాగనులో తగిలించారు. సందర్భాన్ని బట్టి దీన్ని తగిలించవచ్చు. తొలగించవచ్చు.
11. మతంలో నైతిక ప్రభావం నిమిత్త మాత్రం. సందర్భాన్ని బట్టి ఉండవచ్చు.
12. అందుకే మతంలో నీతికి సార్థకత లేదు.

## 5. ధమ్మం - నీతి

1. ధమ్మంలో నీతి స్థానం ఏమిటి?
2. సరళంగా చెప్పాలంటే నీతే ధమ్మం, ధమ్మమే నీతి.
3. మరో మాటలో చెప్పాలంటే మతంలో దేవుని కెంత స్థానముందో ధమ్మంలో నీతికి అంతటి స్థానం ఉంది. ధమ్మంలో దేవుడు లేడు.
4. ధమ్మంలో ప్రార్థనలకు, యాత్రలకు, ఆచారాలకు, కర్మ కాండకు, యజ్ఞాలకు చోటులేదు.
5. నీతి అనేది ధమ్మం సారం. నీతి లేకుండా ధమ్మం లేదు.
6. మనిషి మనిషికి మధ్య ప్రేమకు ప్రత్యాక్షావసరంగా ధమ్మంలో నీతి తలెత్తుతుంది.
7. దీన్ని దేవుడు ఇవ్వవలసిన అవసరం లేదు. ఇది దేవుని సంతృప్తి పరచడానికీ కాదు. మనిషి నీతిగా ఉండాలి. మనిషి మనిషిని ప్రేమించాలి అది అతని మంచికే.

## 6. నీతి మాత్రమే పరిపోదు
## అది పవిత్రంగా విశ్వజనీనంగా ఉండాలి.

1. ఏదైనా ఎప్పుడు పవిత్రంగా ఉంటుంది? ఎందుకు అది పవిత్రం?
2. ప్రతి మానవ సమాజంలో - పురాతన సమాజంలో గాని, ఆధునిక సమాజంలోగాని కొన్ని విషయాలు లేదా విశ్వాసాలు పవిత్రం గానూ, మిగతావి, అపవిత్రంగాను ఉంటాయి.
3. ఎప్పుడైనా ఒక విషయం లేదా విశ్వాసం పవిత్రతను సంతరించుకోవడమంటే దాని అర్థం ఇక దాని పవిత్రతను అది కోల్పోదు. నిజానికి దీన్ని మైల పరచలేం, అది నిషిద్ధం.
4. దీనికి విరుద్ధంగా - అపవిత్రమైన వస్తువుని, విశ్వాసాన్ని అతిక్రమించవచ్చు అంటే భయసంకోచాలు, మన స్తాపం లేకుండా దానికి వ్యతిరేకంగా వర్తించవచ్చు.
5. పవిత్రత పూజించదగినది. దాన్ని వుల్లంఘించడం ధర్మగ్లాని.
6. ఏదైనా ఎందుకు పవిత్రమవుతుంది? మన చర్చకు పరిమితం అవుదాం. నీతిని ఎందుకు పవిత్రం చెయ్యాలి?

7. నీతిని పవిత్రం చెయ్యడానికి మూడు అంశాల పాత్ర వున్నట్లుంది.

3. మొదటి విషయం ఉత్తముల్ని పరిరక్షించుకోవడమనే సామాజిక అవసరం.

9. మనుగడ కోసం పెనుగులాట, సమర్థులు బతికి బయట పడటమనేవి ఈ ప్రశ్న నేపథ్యంలో వున్నాయి.

0. పరిణామ సిద్ధాంతం దృష్ట్యా ఇది తలెత్తుతుంది. మనుగడ కోసం జరిగే పోరాట క్రమంలో పరిణామం సంభవిస్తుందనేది. సాధారణమైన విషయం. కారణం ఆహార ధాన్యాల సరఫరా తొలి రోజుల్లో చాల పరిమితంగా ఉండేది.

1. పోరాటం నిర్దాక్షిణ్యంగా ఉంటుంది. ప్రకృతి పదునైన గోళ్ళూ, పళ్ళతో ఎర్రగా ఉంటుందని చెబుతారు.

12. రక్తపాతంతో కూడిన ఈ చావు బ్రతుకుల పోరాటంలో బలవంతులే బయట పడతారు.

13. అదే ఆదిమ సమాజ స్థితి.

14. గతంలో ఎవరో ఈ ప్రశ్న వేసుకుని వుండాలి. బలవంతులు ఉత్తములా? సమాజపు ఆశయలక్ష్యాన్ని సాధించడమనే క్రమంలో బలహీనుల్ని రక్షించుకుంటే చివరికి వారే ఉత్తములు కాకూడదా?

15. అప్పటి స్థితిలో సమాజం ``కావచ్చు''ననే జవాబు యిచ్చి వుంటుంది.

16. ఆ తర్వాత దుర్బలుడిని రక్షించే మార్గమేది అనే ప్రశ్న ఉదయిస్తుంది.

17 బలిష్ఠుల మీద కొన్ని ఆంక్షలు విధించడం కన్నా మార్గమేమీ లేదు.

18. ఈ సందర్భంలోనే నీతికి ఆవిర్భావం, అవసరం ఉంది.

19. నీతి పవిత్రంగా ఉండాలి. ఎందుకంటే - అది మొదట్లో బలాఢ్యుల మీద విధించ బడింది.

20. దీనికి చాలా తీవ్రమైన పరిణామాలున్నాయి.

21. మొదటిది, నీతి సామాజికం కావటంలో, సమాజ వ్యతిరేకం కావాలా?

22. అంటే దొంగల్లో నీతి లేదని కాదు. వర్తకుల్లో నీతి ఉంది. స్వకులస్తుల్లో నీతి ఉంది. దొంగల ముఠాకు కూడ నీతి ఉంది.

23. కాని ఈ నీతి ప్రత్యేకంగా కొందరిదీ, సంకుచితమైందీను, ఒక సమూహ ప్రయోజనాన్ని పరిరక్షించుకొనే నీతి ఇది. అందుకే ఇది సంఘ వ్యతిరేకమైంది.

24. ఈ రకమైన నీతి సంకుచితంగా, వెలిగా వుండటం వల్ల దాని సంఘ వ్యతిరేక స్ఫూర్తి బయట పడుతుంది.

25. ఒక ముఠా పాటించే నీతి ఇలాంటిదే. ఆ ముఠా తన ప్రయోజనాన్ని తాను కాపాడు కుంటుంది.

26. సమాజం యిట్లా ముఠాలుగా విడి పోవటానికి దీర్ఘపరిణామాలుంటాయి.

27. ఒక వేళ సమాజం సంఘ వ్యతిరేక సమూహాల్ని ఇలా కొనసాగించుకుంటూ పోతే అది అవ్యవస్థీకృతమై,, ముక్క చెక్కలవుతుంది.

28. సమాజ స్థితి. ఈ విధంగా అవ్యవస్థీకృతం, ఛిద్రం కావడం వల్ల దానికి అనేక లక్ష్యాలు, ఉమ్మడి ప్రమాణాలు లేని పక్షంలో సమాజంలో సామరస్యం అనేది ఉండదు.

29. ఉమ్మడి లక్ష్యాలు, ఉమ్మడి ప్రమాణాలు లేని పక్షంలో సమాజంలో సామరస్యం అనేది ఉండదు.

30. అలాంటి భిన్న లక్ష్యాలు, భిన్న ప్రమాణాల మధ్య వ్యక్తి స్థిర చిత్తంతో మన జాలడం అసంభవం.

31. సహేతుకమైన, సమతుల్యమైన హక్కుల ప్రమేయం లేకుండా ఒక ముఠా మరో. దానిపై ఆధిక్యత కోసం ప్రయత్నించినప్పుడు ఘర్షణ అనివార్యమవుతుంది.

32. ఇలాంటి ఘర్షణను ఆపాలంటే ఒకే మార్గం ఉంది. అది అందరూ పవిత్రంగా పాటించే ఉమ్మడి నైతిక సూత్రాలు ఏర్పరచుకోవడమే.

33. నీతిని పవిత్రంగా సాముదాయకంగా వుంచటంలో మూడో అంశం ఒకటి వుంది. అది వ్యక్తి వికాసాన్ని కాపాడటం.

34. మనుగడ కోసం పోరాటంలోనూ, ముఠాపాలన లోను వ్యక్తి ప్రయోజనాలకు భద్రత లేదు.

35. సమాజానికి ఉమ్మడి లక్ష్యాలు ఆదర్శాలున్నప్పుడు మాత్రమే వ్యక్తి స్థిరచిత్తాన్ని సంపాదించుకోవడం సాధ్యమవుతుంది. అది సాధ్యంకానప్పుడు వ్యక్తి ఆలోచన పెడదారి పడుతుంది. అతని ఐక్య దృష్టి అస్వతంత్రమూ, వక్రమూ అవుతుంది.

36. రెండవది - ముఠా రాజ్యం వివక్షకీ, అన్యాయానికీ దారి తీస్తుంది.

37. ముఠా పద్ధతి అనేది వర్గాలుగా విడిపోయేందుకు దారి తీస్తుంది. యజమానులైన వారు యజమానులు గానే ఉంటారు. బానిసలు, బానిసలుగానే ఉండి పోతారు. కామందులు, కామందులుగా, పనివాళ్ళు పనివాళ్ళు గానే ఉంటారు. ఆ విధంగా ముఠా వ్యవస్థలో ఎప్పటికీ అధికులు అధికులుగా, సేవకులు, సేవకులుగా మిగిలిపోతారు.

38. దీని అర్థం స్వేచ్ఛ ఉంటుంది. కాని కొందరికే, అందరికీ కాదు అక్కడ సమానత్వం ఉంటుంది; కాని అల్ప సంఖ్యాకులకే, అధిక సంఖ్యాకులకు కాదు.

39. దీనికి పరిష్కారమేమిటి? ఒక్కటే పరిష్కారం ఏకలక్ష్య సౌభ్రాతృత్వం సర్వులూ అలవరచుకోవాలి.

40. సౌభ్రాతృత్వమంటే ఏమిటి? ఇది విశ్వజనీన సోదరత్వానికి మరో పేరు. దాని ఇంకో పేరే నీతి.

41. ఇందు చేతనే **నీతియే, ధమ్మం అనీ అది** విత్రమో నీతి అంత పవిత్రమైనదని బుద్ధుడు ప్రబోధించాడు.

## ద్వితీయ భాగం

## పారిభాషిక పదాల పోలికలు దాచి పెడుతున్న ప్రాథమిక విభేదం

### మొదటి విభాగం - పునర్జన్మ

1. ప్రాథమికం
2. దేని పునర్జన్మ?
3. ఎవరి పునర్జన్మ?

### రెండవ విభాగం - కర్మ

1. బౌద్ధ కర్మ సిద్ధాంతం, బ్రాహ్మణిక కర్మ సిద్ధాంతం ఒకటేనా?
2. గతంలోని కర్మ భావి జన్మపై ప్రభావం చూపుతుందని బుద్ధుడు నమ్మాడా?
3. గతంలోని కర్మ భావిజన్మపై ప్రభావం చూపుతుందని బుద్ధుడు నమ్మాడా - ముగింపు.

### మూడవ విభాగం - అహింస

1. దానిని అర్థం చేసుకొని ఆచరించటంలో భిన్న మార్గాలు.
2. అహింసకు నిజమైన అర్థం.

### నాలుగవ విభాగం - పరకాయ ప్రవేశం

### ఐదవ విభాగం - అపార్థానికి కారణాలు

# 1. ప్రాథమికం

1. చనిపోయిన తర్వాత ఏమవుతుంది? సాధారణంగా ఈ ప్రశ్న అడుగుతుంటారు.

2. బుద్ధుని సమకాలికులకు ఇందుకు సంబంధించి రెండు అభిప్రాయాలున్నాయి. ఒక వాదం వారు అనశ్వర వాదులు. మరో వాదం వారు అశ్వర వాదులు.

3. అనశ్వర వాదులు చెప్పేదేమిటంటే ఆత్మకు మరణం లేదు. కాబట్టి జీవితం శాశ్వతం. ఇది పునర్జన్మ ద్వారా తిరిగి జన్మిస్తూ ఉంటుంది.

4. ``ఉచ్ఛేదవాదం" అన్న ఒక్క మాటతో అశ్వరవాదుల వాదాన్ని పేర్కొనవచ్చు. దీని అర్థం మరణంతో అంతా అంతమయినట్లే. మరణం తర్వాత ఏమీ మిగలదు.

5. బుద్ధుడు అనశ్వర వాదికాడు. ఆత్మకు ఒక ప్రత్యేకమైన ఉనికి వున్నదని అది అనశ్వరమని నమ్మవలసి వస్తుంది. దానికి ఆయన వ్యతిరేకం.

6. బుద్ధుడు ఉచ్ఛేదవాదేనా? ఆత్మ అనేది లేదని బుద్ధుడు అన్నదాన్నిబట్టి సహజంగా ఆయనని ఉచ్ఛేదవాదిగా భావిస్తారు.

7. కాని నిజానికి తాను ఉచ్ఛేదవాది కాకపోయినప్పటికీ ఉచ్ఛేద వాదిగా పిలవ బడుతున్నందుకు బుద్ధుడు అలగ ద్రూపమ సూత్రంలో ఆక్షేపించాడు.

8. అదే ఆయన చెబుతాడు. ``నేను ప్రబోధిస్తున్న దానికి కొందరు, సన్యాసులు, బ్రాహ్మణులు ఇప్పటికీ తప్పుగా, పొరబాటుగా, అవాస్తవిక భాష్యాలను కల్పించి మరణం తర్వాత అంతా వినాశనమై పోతుందని నేను చెబుతున్నట్లుగా ప్రచారం చేస్తున్నారు. అట్లా నేనెన్నడూ చెప్పలేదు.

9. వారి ప్రచారం వాస్తవ దూరంగా, లోపభూయిష్టంగా నాపై నిందా పూర్వకంగా ఆపాదించడం జరుగుతున్నది. తద్వారా ఈ పెద్ద మనుషులు నన్ను ఉచ్ఛేదవాదిగా జమకడుతున్నారు."

10. బౌద్ధంపైన బ్రాహ్మణ సిద్ధాంతాన్ని ఆపాదించాలనుకున్న వారు ప్రక్షిప్తం చేసింది కాక ఈ ప్రకటన స్వచ్ఛందమైనదైతే, అది పెద్ద సంకటమే తెచ్చి పెడుతుంది.

11. ఒక వైపున ఆత్మ వునికలో విశ్వాసం లేని బుద్ధుడు తాను అశ్వర వాదిని కాదని ఎట్లా చెపుతాడు?

12. బుద్ధుడు పునర్జన్మని నమ్మాడా అనే ప్రశ్నను ఇది లేవనెత్తుతుంది.

# 2. మళ్ళీ జన్మించేది ఏమిటి?

1. బుద్ధుడు పునర్జన్మను విశ్వసించాడా?

2. దీనికి సమాధానం అవుననే.

3. ఈ ప్రశ్నకు ఆపైన రెండు భాగాలుగా విభజించడం మంచిది.

   (1) పునర్జన్మదేనిది? (2)పునర్జన్మ ఎవరిది?

4. ఈ ప్రశ్నల్లో ఒక్కదాన్ని వేరు వేరుగా తీసుకోవడం మంచిది.

5. ఇక్కడ మొదట పునర్జన్మ దేనిది? అనేది పరిశీలిద్దాం.

6. ఈ ప్రశ్న ఎప్పుడూ దాదాపు విస్మరిస్తుంటారు. ఎందుకంటే ఈ రెండు ప్రశ్నలూ కలుపుతూ పెద్ద అయోమయం రేకెత్తిస్తూ ఉంటారు.

7. బుద్ధుని ప్రకారం శరీరం నాలుగు ధాతువుల వల్ల ఏర్పడుతున్నది. అవి...(1) పృధ్వి (2) అగ్ని (3) తేజస్సు (4)వాయువు.

8. మానవ శరీరం మరణిస్తే ఈ నాలుగు ధాతువులు ఏమవుతాయి. అనే ప్రశ్న ఉదయిస్తుంది. శరీరంతో పాటే ఆనాలుగూ మరణిస్తాయా? మరణిస్తాయని కొందరంటారు.

9. బుద్ధుడు `` అవి మరణించవు'' అంటాడు. మనిషి మరణించిన తర్వాత ఆ ధాతువులు విశ్వాంతరాళంలో తేలియాడే సదృశధాతువులలో కలుస్తాయి. అంటాడు.

10. ఈ ధాతు పుంజంలోని నాలుగు ధాతువులు తిరిగి కలిసినప్పుడు ఒక కొత్త జన్మ చోటు చేసుకుంటుంది.

11. బుద్ధుడు ప్రబోధించే పునర్జన్మ అంటే ఇదే.

12. ఈ నాలుగు ధాతువులు చనిపోయిన ఒకే దేహం నుండి వచ్చినవే కానవసరం లేదు. ఆ నాలుగూ ఏదేహం నుంచయినా వచ్చి కలియవచ్చు.

13. `దేహం మరణించినా, ఈ ధాతువులెప్పుడూ మరణించవు' అనేది ఇక్కడ తప్పక గుర్తు పెట్టుకోవాలి.

14. బుద్ధుడు ఈ రకమైన పునర్జన్మను నమ్మాడు.

15. సారిపుత్రుడు మహా కోష్టితునితో జరిపిన సంవాదం ఈ విషయమై గొప్పవివరణ యిచ్చింది.

16. బుద్ధుడు శ్రావస్తిలోని జితవనంలో అనాధపిండకుని ఆరామంలో నివసించిన సమయంలో మహా కోష్టితుడు, తన ధ్యాన నిష్ఠలను ముగించుకొని సారి పుత్రుని దగ్గరికి వెళ్ళి తనన

వేధిస్తున్న కొన్ని ప్రశ్నలను నివృత్తి చేయమని ప్రార్థించాడు.

17. వాటిలో ఈ క్రింది ప్రశ్న ఒకటి.

18. మహా కోష్టితుడు అడిగాడు ``ధ్యానంలో ఎన్ని లక్షణాలు హరిస్తాయి? ఎన్ని మిగులుతాయి?"

19. సారి పుత్రుని సమాధానం `` అయిదేసి లక్షణాలు, వాంఛలు, ద్రోహచింతన, స్తబ్దత, భయం, సందేహం, నివృత్తి అవుతాయి పరిశీలన చింతన, ఆసక్తి, సంతృప్తి, జాగృత హృదయం దృఢమవుతాయి"

20. మహా కోష్టితుడు అడిగాడు `` దృశ్యం, శబ్దం, వాసన, రుచి, స్పర్శ, ఈ ఐదింటిని తీసుకొంటే వీటిల్లో ప్రతిదానికి తనదైన పరిధి, విధులు ప్రత్యేకత, వైవిధ్యం ఉంటాయి గదా! అయితే వాటి మూలాధారం ఏమిటి? ఈ ఐదింటి కార్యకలాపాల స్వామ్యం ఎవరిది?

21. సారి పుత్రుని సమాధానం ``బుద్ధి"

22. మహాకోష్టితుడు అడిగాడు ``ఈ ఐదు ఇంద్రియ శక్తులు దేనిపై ఆధాపరడతాయి?"

23. సారిపుత్రుని సమాధానం ``జీవ చైతన్యం పైన"

24. మహా కోష్టితుని ప్రశ్న ``ఈ జీవ చైతన్యం దేనిపై ఆధార పడుతుంది?"

25. సారిపుత్రుని సమాధానం ``ఉష్ణం పైన"

26. మహాకోష్టితుని ప్రశ్న `` ఉష్ణం దేనిపై ఆధారపడుతుంది?"

27. సారి పుత్రుని సమాధానం ``జీవ చైతన్యంపైన"

28. మహా కోష్టితుని ప్రశ్న ``జీవ చైతన్యం ఉష్ణంపైన, ఉష్ణం జీవ చైతన్యం పైన ఆధార పడతాయని మీరు చెప్పారు. సరిగ్గా దీనిలోని అంతరార్థమేమిటి?

29. సారిపుత్రుని సమాధానం ``నీకు ఇందుకో దృష్టాంతం వివరిస్తాను. దీపం విషయమే తీసుకుందాం. జ్వాల వల్ల వెలుగు వెలుగు వల్ల జ్వాల భాసిస్తాయి. అలాగే జీవచైతన్యం, ఉష్ణం పరస్పరం ఆధారపడి ఉంటాయి."

30. మహా కోష్టితుడు అడిగాడు ``మానవుని శరీరం చైతన్యం లేని కట్టెగా మారినప్పుడు ఆ బొంది నుండి బహిర్గతం అయ్యేవి ఎన్నో?"

31. సారి పుత్రుని సమాధానం ``జీవ చైతన్యం ఉష్ణం స్పృహ."

32. మహా కోష్టితుని ప్రశ్న ``చని పోయిన వాడికి, భావాల్ని, ఇంద్రియ వ్యాపారాన్ని స్తంభింప చేసుకొని సమాధిలో వున్న భిక్షువుకు తేడా ఏమిటి?"

33. సారి పుత్రుని సమాధానం ``చనిపోయిన వాడి శవంలో వాక్కు, మనస్సు నశించడమే గాక జీవ చైతన్యం హరిస్తుంది. ఉష్ణం చల్ల బడుతుంది. ఇంద్రియ వ్యాపారం ఆగి పోతుంది. కాని ధ్యాన సమాధిలో ఉన్న భిక్షువుకు జీవచైతన్యం కొన సాగుతుంది. ఉష్ణం ఉంటుంది. ఇంద్రియ వ్యవస్థ ఎప్పటిలా పనిచేస్తుంది శ్వాసావయవాల్ని బంధించినా''

34. మరణానికి యిది బహుశా వృత్తమమూ, సమగ్రమూ అయిన వివరణ కావచ్చును.

35. అయితే ఈ సంవాదంలో ఇంకా స్పష్టం కాని విషయం ఒకటుంది ``ఉష్ణం అంటే ఏమిటి?'' అనే ప్రశ్న నొకదాన్ని మహా కోష్టితుడు తప్పక అడగవలసింది.

36. దానికి సారి పుత్రుడు ఏం సమాధానం ఇచ్చి ఉండే వాడో ఊహించడం అంత సులభం కాదు కాని నిస్సందేహంగా ఉష్ణమంటే శక్తి.

37. ఆ ప్రశ్నకు నిజమైన అర్థం `` ప్రాణం పోయిన తర్వాత ఏం జరుగుతుంది!'' అంటే విగత శరీరం నుంచి శక్తి సృష్టిలో జరగడం ఆగిపోతుంది.

38. కాని ఇది కేవలం పాక్షిక సమాధానం, ఎందుకంటే మరణంలో కూడా ఆ విగత శరీరం నుంచి పోయే శక్తి సృష్టిలో సంచరించే సాధారణ శక్తి పుంజంలో లీన మవుతుంది.

39. కాబట్టి అశ్వర వాదంలో రెండు అంశాలు వున్నాయి. ఒకట్టి విగత శరీరం శక్తి ఉత్పత్తినిక కోల్పోవడం, రెండోది సృష్టిలో తేలియాడే శక్తి పుంజానికి అదనపు శక్తి వచ్చి కలవటం.

40. అశ్వర వాదపు ఈద్వివిధ అంశాల్ని దృష్టిలో వుంచుకొని బుద్ధుడు తాను పూర్తి ఉచ్ఛేదవాదిని కానని చెప్పినట్లనిపిస్తుంది. ఆత్మకు సంబంధించినంత వరకు బుద్ధుడు ఉచ్ఛేదవాదే. పదార్థానికి సంబంధించినంత వరకు ఆయన ఉచ్ఛేదవాది కాదు.

41. ఇట్లా అర్థం చేసుకోవటం వల్ల బుద్ధుడు తాను ఎందుకు ఉచ్ఛేదవాది కానని చెప్పాడో సులభంగా తెలుస్తుంది. బుద్ధుడు పదార్థ పునరుజ్జీవనం విశ్వసించాడే తప్ప ఆత్మ పునర్జన్మను కాదు.

42. ఇట్లా ఆలోచిస్తే బుద్ధుని దృష్టి విజ్ఞాన శాస్త్రంతో ఏకీభవిస్తుంది.

43. పునర్జన్మ అనేదాన్ని ఈ భావంలో మాత్రమే బుద్ధుడు విశ్వసించి ఉంటాడని చెప్పవచ్చు.

44. శక్తి ఎప్పటికీ నాశనం కానిది. విజ్ఞాన శాస్త్రం చెప్పేదీ అదే. మరణం తర్వాత మరేమీ మిగలదు అని అశ్వర వాదం చెబితే అది విజ్ఞాన శాస్త్రంతో విభేదిస్తుంది. అప్పుడు పరిమాణంలో శక్తి స్థిరంకాదు అని అర్థం వస్తుంది.

45. ఈ మీమంస పరిష్కారానికి ఇదొక్కటే మార్గం.

## పునర్జన్మ ఎవరిది?

1. పునర్జన్మ ఎవరిది? అనేది చాలా క్లిష్టమైన ప్రశ్న.

2. మరణించిన మనిషే తిరిగి జన్మిస్తాడా?

3. బుద్ధుడు ఈ సిద్ధాంతాన్ని విశ్వసించాడా? సమాధానం మిక్కిలి అసంభవం.

4. మరణించిన మనిషిలోని ధాతువులు కలిసి ఒక కొత్త శరీరంగా రూపొందడం మీద అదే మనిషి పునర్జన్మ సాధ్యమా అన్నది ఆధారపడి ఉంటుంది.

5. మరణించిన పలువురు మనుషుల్లోని ధాతువుల మిశ్రమం వల్ల ఒక కొత్త దేహం రూపొందితే అది పునర్జన్మే గాని మరణించిన మనిషిదే ఆ పునర్జన్మ అనడానికి వీలు లేదు.

6. క్షేమ అనే భిక్షుకి సోదరి ప్రసేనుడనే రాజుకు ఈ అంశం చక్కగా వివరించింది.

7. ఒకప్పుడు శ్రావస్తిలోని జేతవనంలోని అనాథ పిండకుని ఆరామంలో బుద్ధుడు నివసించాడు.

8. ఆ సందర్భంలో భిక్షుకి క్షేమ కోసల రాజ్యంలో పర్యటిస్తూ శ్రావస్తి, సాకేత పురాలకు మధ్యనున్న తోరణ వస్తులో విడిది చేసింది.

9. అప్పుడు కోసలరాజు ప్రసేనుడు, సాకేత పురం నుంచి శ్రావస్తికి వెళుతూ శ్రావస్తి, సాకేత పురాలకు నడుమనున్న తోరణ వస్తులో రాత్రి ఆగాడు.

10. కోసల రాజు ప్రసేనుడు అక్కడి మనిషిని పిలిచి ఇలా అన్నాడు. ``ఈ ప్రాంతంలో సన్యాసి గాని బ్రాహ్మణుడు గాని ఉంటేచూడు. ఈ రోజు నాకు అతని దర్శనం చేసుకోవాలనుంది."

11. అలాగే మహారాజా అంటూ అతడు కోసలరాజు ప్రసేనుడు కలుసు కోదలచిన సన్యాసి లేదా బ్రాహ్మణుని కోసం తోరణ వస్తు అంతటా తిరిగాడు ఒక్కరూ కనిపించ లేదు.

12. అయితే తోరణవస్తుకి అప్పుడే చేరుకున్న భిక్షుకి క్షేమను అతడు చూశాడు. చూసి కోసలరాజు ప్రసేనుడి దగ్గరికి వెళ్ళి చెప్పాడు.

13. "మహారాజా ! తోరణ వస్తులో బ్రాహ్మణుడు గాని, సన్యాసి గాని కానరాలేదు. కాని మహారాజా! మహానుభావుడు బుద్ధుని శిష్యురాలు క్షేమ అనే భిక్షుకి ఉన్నది. ఆమె విశేష విజ్ఞానాన్ని సముపార్జించినది. చక్కటి మాటకారి. విస్తారంగా పర్యటించి నదని ప్రసిద్ధి. మీరు ఆమెను కలుసుకోవడం మంచిది.

14. తర్వాత కోసల రాజు ప్రసేనుడు భిక్షుకి క్షేమ ఉన్న చోటుకి వెళ్ళి ఆమెకు నమస్కరించి ఒక వైపు తను కూర్చుని ఆమెను అడిగాడు.

15. "క్షేమసోదరీ! మరణానంతరం కూడా తథాగతుడు జీవించే ఉంటాడా?" అని అడిగాడు.

16. "మహారాజా! ఆ విధంగా తథాగతుడు ఎప్పుడూ చెప్పలేదు" అని సమాధానం చెప్పింది.

17. "క్షేమ సోదరీ, తథాగతుడు మరణానంతరం కూడా జీవించే ఉంటాడా ? అని అడిగితే ఆ విధంగా తథాగతుడు చెప్పలేదన్నావు. ఇతర ప్రశ్నలడిగినా నీవు అలాంటి సమాధానాలే ఇస్తున్నావు. సోదరీ! కారణమేమిటి? హేతువేమిటి? ఆమహానుభావుడు ఈ విషయం చెప్పకపోవడానికి కారణ మేమిటో చెప్పండి." అన్నాడు మహారాజు.

18. "ఈ విషయంలో నిన్ను ఒక ప్రశ్న అడుగుతున్నా నీకు మంచిదని పించిన సమాధానం చెప్పు మహారాజా! గంగానదిలో ఎన్ని ఇసుక రేణువులున్నాయో లెక్కబెట్ట గణకులు గాని లెక్క పెట్టగల యంత్రాలు గాని ఉన్నాయా చెప్పండి! ఎన్నో వందల రేణువులున్నాయి, లేదా ఎన్నో వేల రేణువులు, వందల వేల ఇసుక రేణువులున్నాయి అవి లెక్క పెట్టగలరా!"

19. "లేదు... సాధ్యం కాదు క్షేమ సోదరీ!"

20. "సరే ఇంకో విషయం. అనంతమైన సముద్రం ఉంది. అందులోని నీటిని కొలవగల గణకుల్ని గాని, యంత్రాన్ని గాని సిద్ధం చెయ్యగలరా! సముద్రంలో ఎన్నో గ్యాలన్ల నీళ్ళున్నాయి. ఎన్నోవందలు ఎన్నో వేలు, ఎన్నో వందల వేల గ్యాలన్ల నీరుంది, కొలవడం సాధ్యమా?"

21. "లేదు సాధ్యం కాదు, సాధ్వీ"

22. "ఎందుకు కొలవడం సాధ్యం కాదు"

23. "సముద్రం మహోద్ధతమైంది, లోతైనది. అపారమైనది, అంతు తెలియనిది"

24. "అదే విధంగా, మహారాజా, తథాగతుడిని, భౌతిక రూపంలో నిరూపించటానికి పూనుకుంటే - ముందు ముందు మళ్లీ చిగురించకుండా మొదలంటా నరికిన తాళవృక్షపు బోదె మోస్తరు, తాను కానిదేదోగా ఆరూపం పరివ్యక్తమవుతుంది. శరీరాన్నించి విముక్తి యైనది. మహారాజా తథాగత తత్వం. ఆయన మహాభోధి లాగ గంభీరమూ, అపారమూ, అనంతమూ, అయివాడు. ``మరణం తర్వాత తథాగతుడు మనడు" అనటం పొసగదు అంతేకాదు" మరణం తర్వాత తథాగతుడు ఏక కాలంలో వుంటారు, వుండడు అనటం పొసగదు.

25. భావాత్మకంగా తథాగతుడిని నిరూపించటానికి పూనుకుంటే, భావం పరిత్యక్తయై మొదలంటూ తెగిపోతుంది. భావానికి అందని విముక్తమయ్యే తథాగత తత్వం మహార్ణవం వలెలోతైనది. అపారమూ, అనంతమూ అయినది. అందుచేత తథాగతుడు మరణం తర్వాత మనుతాడు అనటం మరణం తర్వాత మనడు అనటం పొసగదు.

26. అట్లాగే తథాగతుడిని ఇంద్రియ స్పర్శతో, కర్మలతో చైతన్యంతో నిరూపించటానికి పూనుకుంటే.... ఆ చైతన్యానికి అందక విముక్తమయ్యే తథాగత తత్వం మహార్ణవం వలె లోతైనది. అపారమూ, అనంతమూ, అయినది అందుచేత `` తథాగతుడు మరణం

తర్వాత మనుతాడు, మరణం తర్వాత మనడు" అనటం పొసగదు.

27. క్షేమ భిక్షుకి చెప్పిన విషయాలకు కోసలరాజు ప్రసేనుడు పరమానందం పొందాడు. ఆసనం నుండి లేచి భిక్షుకికి ప్రణామం చేసి పయనమయ్యాడు.

28. మరో సందర్భంలో బుద్ధ భగవానుని దర్శించు కోవడానికి మహారాజు ప్రసేనుడు వెళ్ళాడు. ఆయనకు నమస్కరించి తాను ఒక పక్కకూర్చుని ఆయన్ని అడిగాడు.

29. ``మహానుభావా! తథాగతుడు మరణానంతరం జీవించి ఉంటాడా?

30. ``ఈ విషయం నేను చెప్పి ఉండలేదు మహారాజా!"

31. ``అయితే మహానుభావా! తథాగతుడు మరణానంతరం జీవించి ఉండడా?"

32. ``మహారాజా! అది కూడ నేను చెప్పి ఉండలేదు."

33. అతడు తర్వాత ఇతర ప్రశ్నలు వేసినా....అదే సమాధానం లభించింది.

34. ``మరి ఎలా దేవా! తథాగతుడు మరణానంతరం జీవించి ఉంటాడా? ఉండడా! అని నేనడిగితే, అది నేను చెప్పిఉండలేదని మీరు సమాధాన మిచ్చారు. దానికి హేతువేమిటి, కారణ మేమిటి? ఈ విషయం ఎందుకు చెప్పలేదు?"

35. ``మహారాజా! ఇప్పుడు నేను ప్రశ్న వేస్తాను. నీకు ఉచితమనిపించిన సమాధానం చెప్పు" అంటూ గంగానది తీరంలోని ఇసుక రేణువులను లెక్కించే మ హా సముద్రంలోని నీళ్ళని కొలిచే గణకుడున్నాడా అని భిక్షుకి క్షేమ అడిగిన ప్రశ్నలే తథాగతుడు ప్రసేనుడ్ని అడిగాడు.

36. ``అద్భుతం మహానుభావా! గురు, శిష్యవివరణ ..... స్ఫూర్తిలో అక్షరాలా ఒకే విధంగా ఉంది. ఉత్కృష్ట విషయాల్లో ఏకీభావంగా సామరస్య పూర్వకంగా ఉంది.

37. ``ఒక సందర్భంలో నేను భిక్షుకి క్షేమను కలుసుకున్నాను. ఈ విషయమై వివరణ అడిగాను. సరిగ్గా మీరు చెప్పిన విధంగానే, అవే అంశాలతోనే ఆమె జవాబు చెప్పింది. అద్భుతం! గురు శిష్యుల వివరణ ఏకీభవంగా, సామరస్య యోగ్యంగాను ఉంది ఉత్కృష్ట విషయాల్లో.

38. ``మంచిది స్వామీ ఇక వెళ్ళి పోదాం. చాలా కార్యక్రమాలున్నాయి. వాటిని పూర్తి చెయ్యాలి. శలవు"

39. ``సకాలంగా విధులు నిర్వర్తించు మహారాజా?"

40. బుద్ధుని ప్రబోధంతో పరమానంధ భరితుడైన కోసల రాజు ప్రసేనుడు ఆయనను కొనియాడుతూ ఆసనం నుంచి లేచి ప్రదక్షిణం చేసి నిష్క్రమించాడు.

## 2 వ విభాగం

# కర్మ

## 1. బౌద్ధ కర్మ సిద్ధాంతం, బ్రాహ్మణ కర్మ సిద్ధాంతం ఒకటేనా?

1. బౌద్ధ ధమ్మంలో కర్మ సిద్ధాంతం విషయంలో ఉత్పన్నమైనంత అయోమయం మరో సిద్ధాంతంలో లేదు.

2. బౌద్ధ ధమ్మంలో కర్మ స్థానం ఏమిటి? దాని ప్రాధాన్యాన్ని గురించి గతంలో చెప్పిందేమిటి?

3. బొత్తిగా అవగాహన లేక, కేవలం మాటల పోలికల్ని బట్టి బౌద్ధ ధర్మం, బ్రాహ్మణ లేదా హిందూ ధర్మం ఒకటేనని అజ్ఞులైన హిందువులు భావిస్తారు.

4. విద్యావంతులు, ఛాందసులు అయిన బ్రాహ్మణ వర్గం కూడ ఆ పనే చేశారు. వాళ్ళు బుద్ధిపూర్వకంగా జనాన్ని తప్పుదోవ పట్టించారు.

5. బౌద్ధ సిద్ధాంతంలోని కర్మకు బ్రాహ్మణ సిద్ధాంతంలోని కర్మ పూర్తిగా విరుద్ధమైందని విద్యావంతులైన బ్రాహ్మణులకు బాగా తెలుసు అయినా బౌద్ధ కర్మ బ్రాహ్మణ, హిందూ కర్మ ఒకటేనని చెప్పసాగారు.

6. మాటల్లో సారూప్యం వారిచేత తప్పుడు ప్రచారం చేయించింది.

7. కాబట్టే ఈ విషయంలో నిశిత పరిశీలన అవసరం.

8. బౌద్ధ కర్మకు బ్రాహ్మణ కర్మకు మాటల సారూప్యం ఉన్నా వాస్తవానికి మరో పోలికంటూ లేదు.

9. ఈ రెండు సిద్ధాంతాల్లోని ఉప పాఠ్యాలు బహు భిన్నమైనవి. నిజానికి అవి పరస్పర విరుద్ధాలు, ఆ రెండింటి ఫలితాలు ఒకటి కాజాలవు.

10. హిందూ మతంలో చెప్పిన కర్మ అంటే ఏమిటో సౌకర్యం కోసం ఇలా బేరీజు వేసి చెప్పవచ్చు.

11. హిందూ మతంలోని కర్మ ఆత్మ ప్రాతిపదిక మీద ఉంటుంది. బౌద్ధంలో"కర్మ" అలా ఉండదు. నిజానికి బౌద్ధంలో ఆత్మ అనేదే లేదు.

12. బ్రాహ్మణ సిద్ధాంతంలో కర్మ ఆత్మ జన్మ పారంపర్యంగా సంక్రమించనటువంటిది.

13. ఇది ఒక జన్మ నుంచి మరొక జన్మలోకి పోతుంది. అందుకే దీన్ని ఆత్మ జన్మ లెత్తడం అంటారు.

14. బౌద్ధ సిద్ధాంతంలో కర్మ యిట్లా వుండనేరదు. ఎందుకంటే అందులో ఆత్మ అనేది లేదు.

15. శరీరం, ఆత్మ వేరు వేరనే ప్రాతి పదిక పైన హైందవంలో కర్మ ఉంటుంది. దేహం చనిపోయినా ఆత్మకు చావు లేదు. ఆత్మ దేహంలోంచి వెళ్ళిపోతుంది.

16. బౌద్ధ సిద్ధాంతంలోని కర్మలో ఇది నిజం కాదు.

17. హిందూ మత కర్మ సిద్ధాంతం ప్రకారం మనిషి కర్మాచరణ వల్ల రెండు రకాల పర్యవసానాలు సంభవిస్తున్నాయి. ఒకటి కర్మకర్తని ప్రభావితం చేస్తుంది. రెండవది అతని ఆత్మను ప్రభావితం చేస్తుంది.

18. మనిషి చేసే ప్రతి కర్మ అతని ఆత్మ మీద ప్రభావాన్ని చూపిస్తుంది.

19. మనిషి చనిపోయినప్పుడు దేహం లోంచి వెలువడే ఆత్మని అతడు చేసిన కర్మ ఫలాలు చుట్టుకుంటాయి.

20. ఈ కర్మ ఫలాలే మనిషి తరువాత జన్మలో పుట్టుక, ప్రతిపత్తులను నిర్ణయిస్తాయి.

21. ఈ హిందూ కర్మ సిద్ధాంతం ఆత్మరాహిత్య బౌద్ధ సిద్ధాంతంతో విభేదిస్తుంది.

22. ఈ కారణాల వల్ల బౌద్ధ కర్మ సిద్ధాంతం, హిందూ కర్మ సిద్ధాంతం ఒకలాంటివి కాదు, కావడానికి వీలులేనివి.

23. కాబట్టి బౌద్ధ సిద్ధాంతంలో కర్మ బ్రాహ్మణ సిద్ధాంతంలో కర్మ ఒకటేనని మాట్లాడడం తెలివి తక్కువతనం అవుతుంది.

24. అందుకే ఈ మాటల గారడీ పట్ల అప్రమత్తంగా ఉండాలని ఎవరైనా చెబుతారు.

## 2. గతంలోని కర్మ భావి జన్మ పై ప్రభావం చూపుతుందని బుద్ధుడు విశ్వసించాడా?

1. కర్మ సిద్ధాంతాన్ని బుద్ధుడు ప్రవచించాడు. `విత్తనాన్ని బట్టి ఫలమని' మొదట చెప్పింది బుద్ధుడే.

2. కర్మ సిద్ధాంతం గురించి బుద్ధుడు ఎంత పట్టుదల చూపాడంటే దాన్ని తు.చ. తప్పకుండ అనుసరించకపోతే -నైతిక క్రమం సాధ్యం కాదన్నాడు.

3. కర్మ, ప్రస్తుత జీవితం పె దాని ప్రభావానికి మాత్రమే బౌద్ధ కర్మ నియమం వర్తిస్తుంది.

4. అయితే ఒక విస్తృత కర్మ సిద్ధాంతం కూడ ఉంది. దాని ప్రకారం కర్మ అంటే గత జన్మలో, లేదా జన్మల్లో చేసిన కర్మ అని కూడ అర్థం.

5. మనిషి బీద కుటుంబంలో పుట్టాడంటే దీనికి కారణం అతడి పూర్వజన్మ చెడు కర్మఫలం (దుష్కృతం) సంపన్నుల ఇంట పుట్టాడంటే అతడు పూర్వజన్మలో చేసుకున్న మంచి కర్మ (సుకృతం) ఫలితం.

6. ఓ మనిషి ఈ జన్మలో అంగ వైకల్యంతో పుట్టాడంటే అది అతడు గతజన్మలో చేసుకున్న దుష్కర్మఫలం.

7. ఇది చాలా వినాశకర సిద్ధాంతం. కర్మకు ఈ అన్వయంలో మానవ ప్రయత్నానికి స్థానమే లేదు. ప్రతిది పూర్వజన్మ కర్మని బట్టే సంక్రమించింది.

8. ఈ విస్తృత సిద్ధాంతం బుద్ధుడే ప్రబోధించాడని ఆయనకు అంటగట్టడం కూడ జరిగింది.

9. బుద్ధుడు ఇలాంటి సిద్ధాంతాన్ని విశ్వసించాడా?

10. ఈ విస్తృత సిద్ధాంతాన్ని సరిగా పరిశీలించాలంటే దీన్ని వ్యక్తీకరించడానికి ఉపయోగించిన భాషనే మార్చడం శ్రేయస్కరం.

11. గడచిన జన్మలో చేసిన కర్మల ఫలితం ఈ జన్మలోకి దిగుబడి అయింది. అనే కంటే అది వారసత్వంగా సంక్రమించిందనడం మంచిది.

12. ఈ భాష మార్పిడి వల్ల దీనిని వారసత్వ సిద్ధాంతానుగుణంగా పరిశీలించే వీలు మనకు కలుగుతుంది. ఇందువల్ల న్యాయపరంగా. లేదా వ్యవహార పరంగా సిద్ధాంతానికి హాని జరగదు.

13. ఈ వ్యాఖ్యానరె రెండు ప్రశ్నలు వెయ్యటానికి దోహదం చేస్తుంది. ఇంకో విధంగా అయితే ఈ ప్రశ్నలు రావు. వాటికి సమాధానం ఇవ్వకుంటే విషయం స్పష్టం కాదు.

14. మొదటి ప్రశ్న. గత జన్మలో చేసిన కర్మ ఈ జన్మకు ఎలా సంక్రమిస్తుంది. దాని క్రమం ఏమిటి?

15. రెండవ ప్రశ్న ఏమిటంటే - వారసత్వంగా సంక్రమించడానికి సంబంధించి చూస్తే కర్మ స్వభావమేమిటి? ఇది సహ జాతమా? ఆర్జించినదా?

16. మన పూర్వీకుల నుండి వంశ పారంపర్యంగా మనకు సంక్రమించేదేమిటి?

17. విజ్ఞాన శాస్త్ర దృష్ట్యా పురుష వీర్యం అండంలోనికి చేరడంతో కొత్త జీవి మొదలవుతుంది. **అండాశయంతో** వీర్య కణ సంయోగమే అండఫలదీకరణ.

18. ప్రతి మనిషి ఆవిర్భావానికి రెండు జీవకణాల మిశ్రమం మూలమవుతుందన్న మాట.

అండం తల్లి నుండి వీర్యం తండ్రి నుండి.

19. అలాంటి మానవ జన్మాన్ని గురించి తనతో చర్చించడానికి వచ్చిన యక్షునితో బుద్ధుడు ఇలా వివరించాడు.....

20. బుద్ధుడు ఒకప్పుడు రాజగ్రహ ప్రాంతంలోని ఇంద్ర పర్వతం శిఖరం మీద ఉండేవాడు.

21. అప్పుడు యక్షుడు తథాగతుని దగ్గరకి వచ్చి ఇలా అన్నాడు"జీవాత్మ పదార్థం నుండి రాదా? అయితే మహానుభావా! ఆత్మ అనేది శరీరాన్ని ఎలా ధరిస్తుంది? ఆత్మకి మన ఎముకలు, పేగుల పోగులు ఎట్లా చేరుకున్నాయి? తల్లి గర్భంలో వేళ్లాడుతూ ఆత్మ ఎట్లా మనుతుంది?"

22. దీనికి జవాబుగా తథాగతు డన్నాడు: మొదట "కాళ్ళల" పుడుతుంది. దాన్నించి "అబుద్ధ" తర్వాత "పేసి" పెరుగుతుంది. దాన్నుంచి "ఘణ" వృద్ధి అవుతుంది. అప్పుడు "ఘణ"లో వెంట్రుకలు, అధో భాగం గోళ్ళు పుడతాయి. ఇక ఆ శిశువు తల్లి తీసుకునే ఆహార పానీయాల వల్ల గర్భస్థ శిశువు జీవిస్తూ పెరుగుతుంది.

23. కాని హిందూ మత సిద్ధాంతం దీనితో విభేదిస్తుంది.

24. దేహం జన్యు జనితాలని ఇది చెబుతోంది. కాని ఆత్మ మాత్రం కాదు. దాన్ని వెలుపలి నుంచి దేహంలోకి అతికించారు. కాని దాని మూలమేమిటో స్పష్టం చేయదు.

25. రెండవ ప్రశ్నకు వద్దాం. గత జన్మలోని కర్మ స్వభావమేమిటి? దీనికి సహజాత లక్షణముందా లేక ఆర్జిత లక్షణముందా అనేది తేల్చవలసి ఉంది.

26. దీనిని శాస్త్రీయ వారసత్వ సిద్ధాంతం ద్వారా పరిశీలించడం అనేది ఈ ప్రశ్నకు ముందు సమాధానం వస్తే గాని సాధ్యపడదు.

27. ఈ ప్రశ్నకు అటూ, ఇటూ ఒక జవాబు వుందని అనుకున్నా ఇది సమంజసమైన సిద్ధాంతమా కాదా అనేది తెలుసుకోడానికి విజ్ఞాన శాస్త్రం నుంచి సహాయం పొందడం సాధ్యం కాదు.

28. విజ్ఞాన శాస్త్రం ప్రకారం శిశువుకు తన తల్లిదండ్రుల లక్షణాలు సంక్రమిస్తాయి.

29. హిందూ మత సిద్ధాంతం ప్రకారం శిశువు తన తలిదండ్రుల నుంచి శరీరం తప్ప మరేమీ సంక్రమింప జేసుకోదు. గత జన్మ కర్మ ఫలితం మాత్రమే శిశువు కొరకు శిశువు ద్వారా శిశువు యొక్క వారసత్వం.

30. తల్లి దండ్రులేమీ ఇవ్వరు. శిశువే గత జన్మ కర్మల నుండి అన్నీ తెచ్చుకుంటుంది.

31. అలాంటి సిద్ధాంతం కల్పన తప్ప మరోటి కాదు.

32. పైన చెప్పినట్లు బుద్ధుడు ఇలాంటి అభూత కల్పన ను విశ్వసించడు.

33. "అది పునర్జన్మ పొందక పోతే సరే. పొందితే కుదరదు"

34. "దీనికి దృష్టాంతం ఇవ్వండి.

35. "రాజా! ఉదాహరణకు ఒక మనిషి మరో మనిషి మామిడి పండ్లు దొంగిలించాడనుకో. అతను శిక్షార్హుడేనా"

36. "అవును"

37. "కాని అతడు భూమిలో పాతిన మామిడి పండ్లను దొంగిలించలేదు. అతడు శిక్షార్హుడెలా అవుతాడు?"

38. "ఎలాగంటే - అతడు దొంగిలించిన మామిడి పండ్లు అవతలి మనిషి నాటిన చెట్టు ఫలితాలు కాబట్టి"

39. "అదే విధంగా, మహారాజా, ఒక నామ రూపం పాప, పుణ్య కార్యాలేవో కొన్ని చేస్తుంది. ఆ కర్మ వల్ల మరో నామ-రూపం పునర్జన్మ పొందుతుంది. మరి దాని దుష్కృత్యాల నుంచి అది విముక్తం కాదా?"

40. "చాలా బాగా వివరించావు నాగసేనా!"

41. రాజు ఇలా అన్నాడు "నాగసేనా! ఒక నామ-రూపం ఒక జన్మలో పాల్పడే పనులు ఏవిధంగా పర్యవసిస్తాయి?"

42. "ఓ రాజా! చేసిన పనులు తనను నీడలా వెన్నంటే వుంటాయి. అవి వదిలి పెట్టవు."

43. "ఆ పనులు ఇవిగో, అవిగో అని ఎవరైనా గుర్తించి పేర్కొనడం సాధ్యమేనా"

44. "సాధ్యం కాదు."

45. "దీనికి దృష్టాంతం చెప్పండి."

46. "రాజా! చెట్టుకు ఇంకా కాయని పండ్లను గురించి ఎవరైనా........

47. ఇక్కడున్నాయి, అక్కడున్నాయి అని చెప్పగలరా?"

48. "ఏ మాత్రం సాధ్యం కాదు"

49. "అదే విధంగా, మహారాజా జీవితం అంతం కాకుండా కొనసాగినంత కాలం, ఆ పనులను ఎత్తి చూపటం అసాధ్యం".

50. "చాలా బాగుంది నాగసేనా!"

# 3. గతంలోని కర్మ భావిజన్మపై ప్రభావం చూపుతుందని బుద్ధుడు నమ్మాడా? - ముగింపు.

1. బుద్ధుడు ప్రబోధించిన పూర్వకర్మ సిద్ధాంతం విజ్ఞాన శాస్త్ర సమ్మతంగా ఉంటుంది.
2. పూర్వజన్మలో చేసిన కర్మ వారసత్వంగా సంక్రమిస్తుందనే సిద్ధాంతాన్ని బుద్ధుడు విశ్వసించలేదు.
3. అవును, పుట్టుక జన్యు సంబంధి అని, బిడ్డకు వారసత్వంగా వచ్చిందంతా తల్లి దండ్రుల ద్వారానే అని దృష్టి వున్న బుద్ధు డెట్లా విశ్వసిస్తాడు?
4. తర్కం అట్లా వుంది, బుద్ధుడు జైనులతో జరిపిన సంవాదంలో ఈ విషయమై మరింత ప్రత్యక్ష సాక్ష్యం వుంది. ఈ సంవాదం కుల-దుఃఖ-ఖండ అన్న సూత్రంలో వుంది.
5. ఈ సంవాదంలో బుద్ధుడు చెప్పిందిది -"నిగంతులారా! గతంలో మీరు పాపం చేశారు. ఇప్పటి కఠిన నిష్ఠల వల్ల దానిని పరిహరించండి. శరీరం వాక్కు, మనస్సుపై యిప్పుడు వాదిస్తున్న ఆంక్షలు గత కాలపు దుష్కృతాల్ని నిర్ధిస్తాయి. గతంలోని దుష్కర్మలు చెయ్యి నందువల్ల, భవిష్యత్తు స్వచ్ఛమవుతుంది. గతం తుడుచుకుపోతే, కీడంటూ వుండదు, కీడు పోతే (వ్యథార్త) భావాలుండవు, వ్యథార్త భావాలు నశిస్తే, కీడు యావత్తూ శుష్కిస్తుంది" - దీనిపై) నిగంతులు అన్నారు. "ఈ బోధన ఎంతో బాగుంది, మాకు అమోద యోగ్యంగా వుంది. మాకు పరమ సంతోషం కల్గిస్తున్నది".
6. "ఆ తర్వాత నిగంతులతో నేనన్నాను:-"పూజ్యులారా! మీరు జన్మకు ముందు ఒక పూర్వ జన్మ ఉన్నట్లు గాని లేదని గాని ఎరుగుదురా?"
7. "చెప్పలేం"
8. "పూర్వజన్మలో మీరు పాపాలు చేశారని గాని, చేయలేదని గాని చెప్పగలరా?"
9. "చెప్పలేం".
10. "గత జన్మలో ఇదమిత్థమైన ఒక చెడుపని చేశామని, చేయలేదని చెప్పగలరు"
11. "చెప్పలేం."
12. బుద్ధుడు వక్కాణించిన రెండో విషయం: - మనిషి స్థితిని వారసత్వం కంటె కూడ అతని పరిసరాలే ఎక్కువ నిర్ణయిస్తాయి.
13. దేవదాహ సూత్రంలో బుద్ధుడు ఏం చెబుతాడంటే :- కొందరు సన్యాసులు, బ్రాహ్మణులు వ్యక్తి అనుభవించే సంతోషాలు, దుఃఖాలు పూర్వజన్మ నుండి సంక్రమిస్తాయని ఈ విధంగా పూర్వం చేసిన చెడు పనులు పశ్చాత్తాపంతో విసర్జించి, కొత్తగా చెడు పనులు చేయకుండా ఉండడం వల్ల భవిష్యత్తులో కూడా ఎలాంటి దుష్పరిణామాలు

సంభవించవని భావిస్తున్నారు. చెడు పనులు పోతే వాటి వల్ల పరిణామాలుండవు అవి పోతే చెడు భావాలుండవు. చెడు భావాలు పోతే భవిష్యత్తు స్వచ్ఛంగా ఉంటుంది. నిగంతులు చెప్పేది కూడా అదే.

14. తమ పుట్టుక పరిసరాల వల్ల ప్రాణులు సుఖ దుఃఖాలు అనుభవిస్తూంటే నిగంతులు నిందార్హులు. అట్లాకాక పరిసరాలు కారణం కాకపోయినా, వారు నిందార్హులే.

15. మరి బుద్ధుని ఈ వాక్కులు సమంజసమైనవి. పూర్వకర్మలో బుద్ధుడికి నమ్మకమే వుంటే, మళ్ళీ దానిపై శంక ఎందుకు కనబరుస్తాడు? వర్తమాన జీవితంలో సుఖదుఃఖాలు పూర్వ కర్మఫలం అని ఆయన నమ్మితే, అవి పరిసరాల ప్రభావ ఫలితం అని ఎట్లా వాదించగలుగుతాడు.!

16. పూర్వజన్మ సిద్ధాంతం అసలు సిసలైన బ్రాహ్మణ కర్మ సిద్ధాంతం. పూర్వజన్మలో చేసిన కర్మ ఈ జన్మపై ప్రభావం చూపుతుందనేది. ఆత్మ సిద్ధాంతం ఆత్మపై కర్మ ప్రభావం చూపుతుందనే బ్రాహ్మణ సిద్ధాంతాలతో బాగా అతుకుతుంది. కాని బుద్ధుని "అనాత్మ" సిద్ధాంతంతో ఇది విభేదిస్తుంది.

17. బౌద్ధ సిద్ధాంతం తెలియని (వారు) లేదా బౌద్ధ ధర్మాన్ని హిందూ ధర్మానికి చేరువగా తేవాలనుకున్న వారూ ఈ సిద్ధాంతాన్ని బౌద్ధంలోకి ఏకంగా ఎక్కించేశారు.

18. బుద్ధుడు అలాంటి సిద్ధాంతం బోధించటం సాధ్యం కాదనడానికి ఇది ఒక కారణంగా చెప్పవలసి వస్తోంది.

19. ఇది కాక మరింత ఉదారమైన మరొక కారణం కూడ వుంది.

20. పూర్వజన్మ భావిజన్మ నిర్ణాయకమని చెప్పే హిందూ ధర్మమాధారం అక్రమమైనటువంటిది అట్లాంటి సిద్ధాంతాన్ని కల్పించటంలో అంతరార్థం ఏమై వుంటుంది?

21. పేదల స్థితికి, బడుగుల స్థితికి పూచీ పడకుండా సమాజాన్ని, ఏలికల్ని తప్పించటమే ఎవరికైనా అనిపించే ఒకే ఒక్క ఆశయం.

22. లేకపోతే అలాంటి అమానుషమైన అసంబద్ధ సిద్ధాంతం ఎప్పుడూ కల్పించబడేది కాదు.

23. మహా కారుణ్యమూర్తిగా వాసికెక్కిన బుద్ధుడు అలాంటి సిద్ధాంతానికి మద్దతు పలికాడని ఊహించడమే అసాధ్యం.

## మూడవ విభాగం

# అహింస

## 1. దానిని అర్థం చేసుకొని ఆచరించటంలో భిన్న మార్గాలు

1. అహింస, లేదా చంపకపోవటం బుద్ధుని ప్రబోధాల్లో చాలా ముఖ్యమైనది.
2. ఇది కరుణ, మైత్రిలకు బాగా సన్నిహితమైనది.
3. ఆయన అహింస, అనుష్ఠానంలో నిర్నిబంధమైనదా లేక సాపేక్షమైనది మాత్రమేనా అన్న ప్రశ్న వేస్తూనే వున్నారు. అది కేవలం ఒక ధర్మ సూత్రమా? లేక ఒక అనుష్ఠాన నియమమా!
4. బుద్ధుని ప్రబోధాల్ని స్వీకరించేవారు అహింసను నిర్నిబంధమైనదిగా స్వీకరించడానికి ఇబ్బంది పడ్డారు. అహింసకు అలాంటి నిర్వచనం వల్ల చెడు కోసం మంచిని, దుశ్శీలం కోసం సచ్ఛీలాన్ని త్యాగం చెయ్యవలసి వస్తుందన్నారు.
5. ఈ ప్రశ్నకు వివరణ అవసరం. అహింసకు మించిన వేరే ఏ సిద్ధాంతంలోను ఇంత గందరగోళం లేదు.
6. బౌద్ధ దేశాల ప్రజలు దీన్ని ఏ విధంగా అర్థం చేసుకున్నారు, ఎలా ఆచరించారు?
7. ఇది పరిగణనలోకి తీసుకోవలసిన ముఖ్యమైన ప్రశ్న.
8. శ్రీలంక బౌద్ధ సన్యాసులు విదేశీ ఆక్రమణ దారులకు వ్యతిరేకంగా పోరాడడమే కాదు, వారికి వ్యతిరేకంగా పోరాడమని అక్కడి ప్రజలను ప్రేరేపించారు.
9. మరో వైపు బర్మాలోని బౌద్ధ సన్యాసులు విదేశీ ఆక్రమణ దారులకు వ్యతిరేకంగా పోరాడడానికి తిరస్కరించారు. అలాగే బర్మా ప్రజలకు కూడా పోరాడ వద్దని చెప్పారు.
10. బర్మా ప్రజలు గుడ్లు తింటారు. కానీ చేపలు తినరు.
11. అహింసను ఈ రకంగా అర్థం చేసుకున్నారు. ఆచరించారు.
12. ఇటీవల ఒక అహింస తప్ప మిగిలిన అన్ని పంచశీలాల్ని ఆమోదిస్తూ జర్మనీ బౌద్ధ సంఘం ఒక తీర్మానాన్ని చేసింది.
13. ఇదీ అహింసా సిద్ధాంతం పరిస్థితి.

# 2. అహింసకు నిజమైన అర్థం

1. అహింసకు అర్థం ఏమిటి?
2. అహింసకు బుద్ధుడు ఎక్కడా ఎలాంటి నిర్వచనం ఇవ్వలేదు. నిజానికి ఆయన ఈ విషయాన్ని ఇదమిద్ధంగా దాదాపు ఎక్కడా ప్రస్తావించలేదు.
3. మిగతా సహాయకారి అంశాలను బట్టి బుద్ధుని ఉద్దేశ్యాల్ని చెప్పుకోవలసి ఉంటుంది.
4. భిక్షలో భాగంగా ఎవరైనా ఇచ్చే పక్షంలో మాంసం తినడానికి బుద్ధునికి అభ్యంతరం లేదనేది మొదటి ఆధారం.
5. ఆ జంతువును వధించే వారిలో తాను ఒకడు కాకపోయినట్లయితే భిక్షువు తనకు భిక్షగా వేసిన మాంసం తినవచ్చు.
6 భిక్ష ద్వారా వచ్చిన మాంసం భిక్షువులు భుజించరాదని దేవదత్తుడు పట్టుపట్టినా, బుద్ధుడు అతన్ని వారించాడు.
7. రెండవ ఆధారం, యజ్ఞంలో జంతువుల బలిని మాత్రమే బుద్ధుడు వ్యతిరేకించాడు. ఇది ఆయనే స్వయంగా చెప్పాడు.
8. అహింసా పరమో ధర్మః అనేది ఒక అతివాదం అది జైన సిద్ధాంతం. బౌద్ధ సిద్ధాంతం కాదు.
9. ఇక్కడ మరో ఆధారం వుంది. ఇది సహాయకారి అంశాల సాక్ష్యం కన్నా ఎక్కువ సాధికారికమైంది. దీన్ని దాదాపు అహింస నిర్వచనంగా స్వీకరించవచ్చు. బుద్ధుడు చెప్పాడు "దేనినీ చంప బుద్ధి కానంతగా అన్నింటినీ ప్రేమించు" అహింసా సూత్రాన్ని ధ్వన్యాత్మకంగా చెప్పే పద్ధతి ఇది.
10. దీని ద్వారా బోధ పడే దేమిటంటే; అహింసా సిద్ధాంతం "చంపవద్దు" అనదు. "అన్నిటినీ ప్రేమించు" అని చెబుతుంది.
11. ఈ మాటల ద్వారా బుద్ధుడు అహింస అని దేనిని పేర్కొన్నాడో స్పష్టంగా అవగాహన చేసుకోవచ్చు.
12. చంపాలన్న ఇచ్ఛకూ , చంపవలసి వచ్చే అవసరానికీ మధ్య బుద్ధుడు తేడా చూడడం చాల స్పష్టమైన విషయం.
13. అవసరమున్న చోట చంపడాన్ని బుద్ధుడు నిషేధించలేదు.
14. కేవలం ఇచ్ఛాపూర్వకంగా చంపడాన్ని బుద్ధుడు నిషేధించాడు.
15. ఇట్లా గ్రహిస్తే బుద్ధుని అహింసా సిద్ధాంతంలో తికమక లేదు.

16. ఇది ప్రతివారూ గౌరవించదగిన పరిపూర్ణ నైతిక సిద్ధాంతం, చక్కటి సిద్ధాంతం.

17. చంపే అగత్యం వుందా అన్నది ఏ మనిషికి ఆ మనిషే తేల్చుకోవలసిన నిర్ణయమని బుద్ధుడు వారికి వదలిన మాట నిజమే. మరి ఆ నిర్ణయం యింక ఎవరికి వదలాలి? మనిషికి ప్రజ్ఞ వుంది. అది అతడు వినియోగించాలి.

18. నీతి గల మనిషి సరైన బిందువు వద్ద హద్దు ఏర్పరచు కుంటాడని నమ్మవచ్చును.

19. బ్రాహ్మణ సిద్ధాంతంలో చంపే ఇచ్ఛ వుంది.

20. జైన సిద్ధాంతంలో ఎన్నడూ చంపరాదనే సంకల్పం వుంది.

21. బుద్ధుని అహింస తన మధ్యమ మార్గాన్ని అనుసరించింది.

22. ఇంకో విధంగా చెప్పాలంటే బుద్ధుడు ధర్మసూత్రానికి నియమానికి తేడా చూపాడు. అహింసను నియమంగా చెప్పలేదు. ఇది ధర్మ సూత్రంగా, జీవిత మార్గం గానే చెప్పాడు.

23. ఇందులో బుద్ధుడు వివేకం ప్రదర్శించాడని నిస్సందేహంగా చెప్పవచ్చు.

24. ధర్మ సూత్రం నీ ప్రవర్తనకు స్వేచ్ఛ నిస్తుంది. నియమం స్వేచ్ఛనివ్వదు. నియమం నిన్ను నిర్దేశిస్తుంది. లేదా నువ్వు దాన్ని నిర్దేశిస్తావు.

## నాలుగవ విభాగం

# పరకాయ ప్రవేశం

1. భగవానుడు పునర్జన్మ ఉందని ప్రబోధించాడు. అయితే పరకాయ ప్రవేశం మాత్రం లేదని కూడ ఆయన ప్రబోధించాడు.
2. అవి రెండు పరస్పర విరుద్ధమైన సిద్ధాంతాలని ఆయనను విమర్శించిన వారికి కొదువ లేదు.
3. పరకాయ ప్రవేశం లేకుండా పునర్జన్మ ఎలా వుంటుంది. అనేది విమర్శకుల ప్రశ్న.
4. పరకాయ ప్రవేశం లేని, పునర్జన్మ వున్న సందర్భం యిది. అలా ఉంటుందా!
5. అందులో వైరుధ్యం లేదు. పరకాయ ప్రవేశం లేకపోయినా పునర్జన్మ సాధ్యమే.
6. రాజు మిళిందుడు అడిగిన ప్రశ్నలకు నాగసేనుడు తన సమాధానాల్లో వివరంగా దీన్ని గురించి చెప్పాడు.
7. బాక్ట్రియా రాజు మిళిందుడు నాగసేనుని "బుద్ధుడు పునర్జన్మ (పరకాయ ప్రవేశం)ను విశ్వసించాడా?" అని అడిగాడు.
8. "అవును" నాగసేనుని సమాధానం.
9. "ఇందులో వైరుధ్యం లేదా?"
10. "లేదు" నాగసేనుని సమాధానం.
11. "ఆత్మ లేకుండా పునర్జన్మ వుంటుందా?"
12. నాగసేనుని సమాధానం "తప్పకుండా ఆత్మ లేకుండా పునర్జన్మ ఉండవచ్చు"
13. "అదెలాగో వివరించండి"
14. రాజు అన్నాడు మళ్ళీ "నాగసేనా! పరకాయ ప్రవేశం లేకుండా పునర్జన్మ ఎలా సాధ్యం?"
15. "అవును, సాధ్యమే"
16. "కాని ఎలా సాధ్యం? ఒక వృత్తాంతం చెప్పండి."
17. "చూడు రాజా! ఉదాహరణకు ఒక మనిషి ఒక దీపంతో మరో దీపాన్ని వెలిగిస్తే ఒక దీపం మరో దీపంలోకి ప్రవేశించిందని ఎలా చెప్పగలం?"

18. "అవును అది పరకాయ ప్రవేశం కాదు."
19. "మహారాజా! అలాగే పునర్జన్మ కూడా పరకాయ ప్రవేశం కాదు".
20. "ఇంకా మరొక దృష్టాంతం యివ్వండి."
21. "మహారాజా! మీ బాల్యంలో చదువుకొనేటప్పుడు మీ ఉపాధ్యాయుడు చెప్పిన పద్యమేదైన గుర్తుందా"
22. "గుర్తుంది"
23. "మంచిది! అయితే ఆ పద్యం మీ ఉపాధ్యాయుని నుంచి మీలోకి పరకాయ ప్రవేశం చేసిందా?"
24. "కానే కాదు"
25. "మహారాజా! అలాగే పునర్జన్మకు పరకాయ ప్రవేశంతో నిమిత్తం లేదు."
26. "చాలా బాగుంది నాగసేనా?"
27. రాజు అన్నాడు "నాగసేనా ఎక్కడైనా ఆత్మ లాంటిది ఒకటి వుందా?"
28. "రాజా అత్యున్నత దృష్టిలో అలాంటిది లేదు."
29. "చాలా బాగు నాగసేనా!"

## ఐదవ విభాగం

# ఈ అపార్థానికి కారణాలు

1. బుద్ధుడి ప్రబోధాన్ని అధికంగా భిక్షువులున్న ఆయన శ్రోతలు విన్నారు.

2. ఏ విషయాన్ని గురించి అయినా బుద్ధుడు చెప్పిందాన్ని ఆ భిక్షువులు తిరిగి ప్రజలకు చెప్పారు.

3. చెప్పింది వ్రాసుకునే ప్రక్రియ అప్పటికి అభివృద్ధి కాలేదు. అందుచేతనే భిక్షువులు తాము విన్న దాన్ని జ్ఞాపకముంచుకోవాల్సి వచ్చేది. అయితే ప్రతి భిక్షువు తాను విన్న దాన్ని జ్ఞాపకముంచు కోవాలనే విషయాన్ని పట్టించుకోలేదు. కాని కొందరు దాన్ని జ్ఞాపకం ఉంచుకోవాలనేది వృత్తిగా స్వీకరించారు. వాళ్ళను భాణకులని వ్యవహరించారు.

4. బౌద్ధ ధర్మ వాఙ్మయం సముద్రమంత విస్తృతమైంది. అంతా జ్ఞాపకముంచుకోవడం నిజానికి ఒక పెద్ద విద్యే.

5. ఈ విధంగా బుద్ధుడు చెప్పిందాన్ని ఇవతలి వారికి చెప్పాల్సి వచ్చినప్పుడు వాటిని వక్రీకరించడం జరిగిందన్న విషయం కూడ బుద్ధుని దృష్టికి వచ్చింది.

6. ఇలా తాను చెప్పినవి వక్రీకరించిన సంఘటనలు బుద్ధుడు జీవించి ఉండగానే ఆయన దృష్టికి వచ్చాయి.

7. అలాంటి ఐదు సంఘటనలను దృష్టాంతంగా చెప్పవచ్చు. ఈ ఐదింటిలో మొదటిది అలగద్దూపమ సూత్రంలోనిది; రెండవది, మహాకర్మ విభాంగ సాంఖ్య సూత్రంలోనిది, ఐదవది, జీవిక సూత్రంలోనిది.

8. బహుశ ఇలా వక్రీకరించి చెప్పిన సంఘటనలు మరిన్ని ఉండవచ్చు. అలాంటి సందర్భాల్లో భిక్షువులు కూడ బుద్ధుని దగ్గరికి వెళ్ళి నివారణోపాయం అడిగేవారు.

9. కర్మ, పునర్జన్మలకు సంబంధించినంత మటుకు అలా వక్రీకరించి చెప్పిన సంఘటనలు చాలానే ఉన్నాయి.

10. ఈ సిద్ధాంతాలు బ్రాహ్మణ మతంలోనూఉండడం వల్ల భాణకులు సులభంగా బ్రాహ్మణ సూత్రాలను బౌద్ధ ధర్మాల్లోకి చొప్పించి ఉంటారు.

11. కాబట్టి బుద్ధుని ప్రబోధంగా బౌద్ధ వాఙ్మయంలో చెప్పిన దాన్ని ఆమోదించేటప్పుడు జాగ్రత్త వహించాలి.

12. పరీక్షించడానికి ఒక పద్ధతి ఉంది.

13. ధైర్యంగా చెప్పగలిగింది ఏదైనా వుంటే, అది యిది, బుద్ధుడు హేతుబద్ధుడూ; తర్క బద్ధుడూ కాక పోతే **మరేమీ కాడు** ఆయా సందర్భాలకి, అతికి; హేతు, తర్క బద్ధంగా ఒక ప్రవచనం వుంటే దానిని బుద్ధుడిదిగా స్వీకరించ వచ్చు.

14. మానవ శ్రేయస్సుకు ప్రయోజనకరం కాని చర్చలోకి దిగటం బుద్ధుడి కెన్నడూ ఆసక్తి లేదు. ఇది రెండవ గీటురాయి. అందుచేత ఏదైనా మానవ శ్రేయస్సుతో సంబంధం లేని విషయాన్ని బుద్ధునికి అంటగడితే అది బుద్ధుడు చెప్పిన మాటగా స్వీకరించలేము.

15. మూడో గీటురాయి బుద్ధుడు అన్ని విషయాలను రెండు తరగతులుగా విభజించాడు. తనకు బాగా తెలిసిన విషయాలు ఒక తరగతిగానూ, తనకు సందేహాస్పదంగా ఉన్న విషయాలను వేరొక తరగతిగానూ విభజించాడు. మొదటి తరగతి లోకి వచ్చే విషయాల్లో ఆయన తన అభిప్రాయాలను నిక్కచ్చిగానూ అంతిమంగానూ చెప్పాడు. రెండవ తరగతి విషయాలలో కేవలం తన అభిప్రాయాలు వ్యక్తం చేశాడు. కాని అవి తాత్కాలికాలు మాత్రమే.

16. శంకా వైరుధ్యాలున్న మూడు అంశాల్ని చర్చించి వాటి విషయమై బుద్ధుడి దృక్పథమేమిటో ఒక నిర్ణయానికి వచ్చే ముందు, యీ గీటు రాళ్లను దృష్టిలో పెట్టుకోవటం అవసరం.

# తృతీయ విభాగం

# బౌద్ధ జీవన విధానం

1. మంచి, చెడు, పాపం
2. కాంక్ష, కామం
3. హాని, అపకారం
4. క్రోధం, విరోధం
5. అహం, దాన్ని జయించటం
7. జ్ఞానం; న్యాయం, సజ్జన సహవాసం
8. ఆలోచనా పరత్వం, అప్రమత్తత
9. జాగరూకత, శ్రద్ధ, నిర్భీకత.
10. దుఃఖం, సంతోషం, భాతృత్వం, కారుణ్యం
11. కపటం
12. సన్మార్గానుసరణం
13. నిజమైన ధర్మంలో అపధర్మాన్ని కలప వద్దు.

# 1. మంచి, చెడు, పాపం

1. మంచి చెయ్యి, దుష్కృతానికి దూరంగా వుండు. పాపానికి పాల్పడకు.

2. ఇది బౌద్ధ జీవన విధానం.

3. మనిషి ఏది మంచో అదే చెయ్యాలి. అది మళ్ళీ మళ్ళీ చేయనీ. తన మనుగడ వాంఛల్ని అటు మళ్ళించనీ. సత్కార్య నిర్వహణే సంతోష దాయకం.

4. "ఇది నా వల్ల కాదు" అని సత్కార్యాన్ని గూర్చి తేలికగా ఆలోచించకు. బిందువుమీద బిందువు పడితేనే కుండ నిండుతుంది. అలాగే కొద్ది కొద్దిగా చేసే మంచి ఎంతో పెరుగుతుంది.

5. చేసిన తర్వాత చింతించనవసరం లేనిది మంచి పని. మంచి పని పర్యవసానం తృప్తిగా సంతోషంగా పరిణ మిస్తుంది.

6. మంచి పని అనేది విచారాన్ని కలిగించదు. దాని ఫలం కూడా సంతోషకరంగా సంతృప్తికరంగా ఉంటుంది.

7. మనిషి తాను చేసింది మంచి పనే అయితే, దాన్ని మళ్ళీ చేయనివ్వండి. అందులోనే సంతోష పడనీయండి. మంచి పనుల ప్రోది ఆనందదాయకమైంది

8. తన సత్కర్మ ఫలితానికి వచ్చే వరకూ, ఎంత సజ్జనుడైనా తనకు చెడురోజులే అనుకుంటాడు. కాని అది ఫలించాక ఆ మంచి మనిషి మంచి పరిణామాలు చూడగలడు.

9. మంచిని మనిషి తేలికగా చూడరాదు. అది తన దాకా రాదని అనుకోరాదు. చుక్కలుగా పడినా కుండ నీళ్ళతో నిండినట్లు, మనిషి మంచిని కొద్ది కొద్దిగా చేసినా అది అంతా కలిసి తనను పూర్ణంగా సజ్జనుడిని చేస్తుంది.

10. గంధం కన్నా, జవ్వాది కన్నా; తామర; మల్లె పూల పరిమళం కన్నా సుగుణం వలన కలిగేపరిమళమే గొప్పది

11. దుర్బలంగా వుండే ధూప గంధ పరిమళం కన్నా సుగుణ పరిమళం ఉన్నత స్థానాన్ని చేరుతుంది.

12. చెడు నన్నేం చేస్తుందని తేలికగా పరిగణించకు. చుక్క, చుక్క నీటి కుండను నింపినట్లు చెడు కూడ పోగుపడుతుంది.

13. పశ్చాత్తాపం కలిగించే పనులు చెయ్యడం మంచిది కాదు. దాని ఫలితంగా కష్టాలు

కన్నీళ్ళు కలుగుతాయి.

14. దుర్బుద్ధితో మనిషి ఏమి చెప్పినా, చేసినా బండి వెంట చక్రాలు తరలి వచ్చినట్లే బాధలు అతడిని వెంటాడతాయి.

15. వ్యసనాల వెంటపడకు, నిర్లక్ష్యం వహించకు, చెడు భావాలను దరి చేర నీయకు.

16. చెడు ఆలోచనలను అణచి వేసి శ్రేష్టత వైపు సాగు, మంచి పని చేయడానికి ఎవరు వెనుదీస్తారో, వారి మనస్సు వేటుకు సంబరపడుతుంది.

17. పశ్చాత్తాపం కలిగించే పనులు చేయడం మంచిది కాదు. దాని ఫలితంగా కష్టాలు, కన్నీళ్ళు ప్రాప్తిస్తాయి.

18. పాపి తన పాప కర్మ పక్వం కానంత వరకు సంతోషంగానే వుంటాడు; కాని అది పండిన నాడు తన పాపం గుర్తిస్తాడు.

19. మనిషి చెడు చేసి దాని వల్ల నాకేమీ హాని కలగదని తేలికగా అనుకోరాదు. ఒక్కో బొట్టు పడి కుండ నిండినట్లు మూర్ఖుడు చేసిన చెడు పనులు కొద్ది కొద్దివే అయినా క్రమంగా నిలువెల్లా చెడిపోతాడు.

20. మనిషి మంచి వైపే త్వర త్వరగా సాగాలి చెడుకు దూరంగా ఆలోచించాలి. మంచి చెయ్యడానికి ఆలసిస్తే చెడే అతని మనస్సును లోబరుచుకుంటుంది.

21. మనిషి ఒకసారి పాపం చేసినా మళ్ళీ చేయకూడదు. పాపంతో రంజింపరాదు. చెడు పోగు చేసు కోవడం బాధాకరం.

22. సచ్ఛీల వ్రతం పాటించు. పాప మార్గం పరిహరించు. శీలవంతులు ఈ లోకంలో సుఖిస్తారు.

23. వాంఛ నుండి దుఃఖం పుడుతుంది. వాంఛ నుండి భీతి పుడుతుంది. వాంఛను జయించిన వాడికి దుఃఖం ఉండదు. భయమూ ఉండదు.

24. అన్ని జబ్బుల్లోకి ఆకలి పెద్ద జబ్బు. మనుగడ పెద్ద దుఃఖం. ఈ సత్యాన్ని వాస్తవాన్ని తెలుసుకుంటే "నిబ్బాణ"మే పరమోల్లాసం.

25. రత్నశిలను కోయ గల వజ్రం లాగా తాను పెంచి పోషించి చేసే చెడుపని నాశనం చేస్తుంది.

26. చెట్టును అల్లుకున్న తీగ చందాన దౌష్ట్యంలో కూరుకున్న మనిషి శత్రువు కోరుకునేంత అధోగతి పాలవుతున్నాడు

27. చెడుపనులు, మనకే హానిచేసే పనులు చేయడానికి సులభంగానే ఉంటాయి. మంచి మేలు చేసే పనులే చేయటానికి కష్టం అవుతాయి.

# 2. కాంక్ష - కామం

1. కాంక్షను గానీ, కామాన్ని గానీ సోకనీయకు.

2. ఇది బౌద్ధ జీవన విధానం

3. సంపదల వర్షం కురిసే ఆశలకు అంతే ఉండదు. సంతృప్తినివ్వని ఆశలెప్పుడూ ప్రమాదకరమైనవని వివేకవంతునికి బాగా తెలుసు.

4. సర్వ సుఖాలు లభించినా అతడికి సంతోషంకలగదు. అతడి సంతోషం అతడి కాంక్ష విడనాడడంలో ఉంది. అలాంటి వాడే సంపూర్ణ జ్ఞాన వంతుడైన బుద్ధునికి శిష్యుడు కాగలడు.

5. కాంక్ష నుంచే దుఃఖం జనిస్తుంది. కాంక్షనుంచే భయం జనిస్తుంది. కాంక్ష నుంచి పూర్తిగా దూరమున్న వారికి దుఃఖమూ లేదూ భయమూ లేదు.

6. కాంక్ష వల్లనే దుఃఖం, కాంక్షల వల్లనే భయం కలుగుతాయి. కాంక్షారహితంగా ఉన్న వారికి దుఃఖం, భయం దూరంగా ఉంటాయి.

7. సుఖానికి లోబడ్డ వాడు జీవన లక్ష్యాన్ని విస్మరించి శుష్క సుఖాల వెంట పడుతూ - ధ్యాన సాధకుడిని చూసి యీర్ష్య చెందే స్థితికి చేరతాడు.

8. మనిషి ఏ లంపటమూ పెట్టుకోవద్దు. దాని వల్ల బాధ కలుగుతుంది. రాగ ద్వేషాలు లేని వారికి ఎలాంటి బంధాలుండవు.

9. సుఖలాలస నుంచి దుఃఖం, భయం, కలుగుతాయి . సుఖలోలుడు కానివాడికి దుఃఖం భయం తెలియవు.

10. లంపటం నుంచి బాధ, భయమూ, కలుగుతాయి. దానికి అతీతంగా ఉన్న వారికి బాధలు భయాలు కలగవు.

11. కామం వల్ల బాధలు, కామం వల్ల భయం కలుగుతాయి, కామానికి అతీతుడైన మనిషికి బాధలు, భయాలు ఉండవు.

12. దురాశ వల్ల దుఃఖం ఏర్పడుతుంది. దురాశ వల్ల భయం ఏర్పడుతుంది. అది లేని వారికి దుఃఖాలు, భయాలు ఉండవు.

13. శీలం, జ్ఞానం, ధర్మవర్తనం, సత్య వచనం కలిగి తన పని తాను చేసుకుంటూ పోయే వాడు ప్రపంచానికి ప్రేమాస్పదుడౌతాడు.

14. చాలాకాలం దూరంగా ఉండి తిరిగి క్షేమంగా వచ్చిన వారిని బంధువులు, మిత్రులు అభిమానులు ఎంతో గౌరవిస్తారు.

15. తిరిగి వచ్చిన మిత్రునికి బంధు జనం ఆదరించినట్టు, ప్రపంచం విడిచి పెట్టి వెళ్ళిన వాడిని అతడు చేసిన సత్కర్మలు మన్నన చేస్తాయి.

# 3. హాని - అపకారం

1. హాని చెయవద్దు, అపకారం తలపెట్ట వద్దు.

2. ఇదే బౌద్ధ జీవన విధానం

3. చురుకైన గుర్రం రౌతుదెబ్బ తినకుండానే పరుగెత్తినట్లు, ప్రపంచంలో నిందకు అవకాశం ఇవ్వకుండా జీవితం గడిపిన మనిషెవరైనా ఉన్నాడా

4. స్థైర్యం, శీలం, సత్యం, ధ్యాన్యం, సత్యగణన, జ్ఞాన, కర్మ పరిపక్వత, అంతరావలోకనం వల్ల పెను దుఃఖాన్ని అధిగమించి సాగు.

5. క్షయ, సహన శీలమే అసలు సిసలైన సన్యాస వర్తనం. దీర్ఘకాల దుఃఖాల నుండి విముక్తి కోసం చేసేవన్నిటిలో నిర్వాణమే శ్రేష్ఠమని బుద్ధుడు ప్రబోధించాడు. ఇతరులకు హాని చేస్తే సన్యాసి అనిపించుకోడు. ఇతరులను విపత్తుల పాలు చేసే వాడు శిష్యుడు కాజాలడు.

6. చెడు మాట్లాడడం, హాని చేయకుండడం ,క్రమ శిక్షణతో నిగ్రహాన్ని అలవరచుకోవడం - ఇవి బుద్ధుని ప్రబోధాలు.

7. చంపకు, వధకు దోహదం చేయకు.

8. తనలాగానే సుఖ సంతోషాలు కామించే ప్రాణులను బాధించి వధించని వాడికి సుఖ సంతోషాలు లభిస్తాయి.

9. ఛిద్రమైన జేగంట మ్రోగనట్లే, నువ్వు మౌనం వహిస్తే నిబ్బనం సాధిస్తావు. క్రోధం నీకు కలగదు.

10. అన్నెం, పున్నెం, ఎరుగని వాడిని బాధించే వాడు అంతోలోనే దుఃఖ భాజనుడవుతాడు.

11. నిరాడంబరమైన వస్త్రాలు ధరించి, వినయ సంపన్నుడై ఎవరిలోనూ తప్పులెన్న కుండా ఉండే వాడు నిజమైన శ్రమణుడు, భిక్షువు.

12. గొప్ప అశ్వం పరుగెత్తడానికి కొరడా అవసరం లేనట్లు ఈ ప్రపంచంలో ఎవరినైనా లజ్జ, నిందపడకుండా నిగ్రహిస్తున్నదా!

13. గాలికి ఎదురుగా విసిరేదుమ్ములాగా, అన్నెం పున్నెం ఎరుగని వాడికి చేసే కీడు వెనక్కి వచ్చి చేసిన మూర్ఖుడికే తగులుతుంది.

# 4. క్రోధం - విరోధం

1. ఆగ్రహాన్ని ఆశ్రయించరు. నీ శత్రువుల్ని మరచిపో, ప్రేమతోనే నీ శత్రువులను జయించు.
2. ఇదే బౌద్ధ జీవన విధానం
3. కోపాగ్నిని చల్లార్చాలి.
4. "నన్ను అతడు దూషించాడు. అవమానించాడు, లొంగ దీసుకున్నాడు, నన్ను దోచుకున్నాడు" అన్న ఆలోచనతో ఉండే వాడిలో క్రోధం శమించదు.
5. ఇలాంటి ఆలోచనల్ని విడనాడిన వాడిలో క్రోధం శమిస్తుంది.
6. చెడు నుంచి శతృత్వంలోకి, ద్వేషి నుంచి ద్వేషికి శతృత్వం పారుతుంది.
7. మనిషి ప్రేమలో ఆగ్రహాన్ని అధిగమించనీ మంచితో చెడును అధిగమించనీ ఔదార్యంలో దురాశను అధిగమించనీ, అబద్ధాన్ని నిజంతో అధిగమించనీ.
8. నిజాన్ని మాట్లాడు. ఆగ్రహానికి లొంగకు కొంచెం అడిగితే అంతా ఇవ్వు.
9. మనిషి ఆగ్రహాన్ని వదిలి పెట్టనీ, గర్వాన్ని వదిలి పెట్టనీ, కట్టుబాట్లను అధిగమించనీ పేరు ప్రతిష్ఠ కోసం వెంపర్లాడని మనిషికి ఎలాంటి బాధలుండవు. విషయ వాంఛల నుంచి దూరంగా ఉండే వారికి ఎలాంటి బాధలుండవు. విష య వాంఛల నుంచి దూరంగా ఉండే వారికి చింతలుండవు.
10. రథాన్ని అదుపు చేసి నడిపేవాడే అసలైన చోదకుడు. చక్రంలా తిరిగి పెరిగే ఆగ్రహాన్ని అదుపు చెయ్యగలిగిన వాడే అసలైన మనిషి.
11. విజయం శతృత్వానికి జన్మ యిస్తుంది. కాని విజయం కోసం సాగించిన యుద్ధ ఫలితాలు కుంగ దీస్తాయి. సత్పురుషుడు పొంగి పోకుండా, క్రుంగి పోకుండా, విజయానికి ఓటమికి అతీతంగా ఉంటాడు.
12. కామానికి మించిన అగ్ని లేదు. ద్వేషానికి మించిన దౌర్భాగ్యం లేదు. మనుగడ కోసం తపించడం వంటి దైన్యం లేదు. నిర్వాణం వల్ల లభించే శాంతికి మించిన పరమానందం లేదు.
13. ఎప్పుడూ ద్వేషం ద్వేషాన్ని అంతం చెయ్యలేదు. ద్వేషాన్ని ప్రేమతో అంతం చెయ్యవచ్చు, ఇది నిరంతర సత్యం.

# 5. మనిషి, మనస్సు, మాలిన్యం

1. మనిషి తన మనస్సు మలిచినట్లే ఉంటాడు.

2. ధర్మ మార్గవర్తనంలో తొలి అడుగు మంచిని అలవరచుకోవడానికి మనస్సు పొందే శిక్షణ.

3. బౌద్ధ జీవిత విధానంలో ఇది ప్రబోధం.

4. ప్రతి విషయంలోనూ ప్రాథమికమైనది మనస్సు. మనస్సు సర్వోన్నత మైనది.

5. బండి లాగే ఎద్దు గిట్టల్ని చక్రం వెంబడించినట్లుగా, మనిషి చెప్పిన చెడు విషయాలు, చేసిన చెడు పనులు తనను ఎప్పుడూ వెన్నంటి సాగుతాయి.

6. మనిషి నీతిగా, మాట్లాడడం గాని, ప్రవర్తించడం గానీ, చేస్తే సంతోషం అతని వెన్నంటి ఉంటుంది. అతని నీడలాగా.

7. ఈ చంచలమైన అస్థిరమైన మనస్సుకు దారి చూపడం, సంరక్షించడం కష్టతరం. బాణాన్ని సూటిగా చెక్కినట్లు వివేక వంతుడు బుద్ధిని చక్కగా మలచుకుంటారు.

8. నీటి లోంచి చేపను వెలుపల నేల మీద వేసినపుడు అది ఏవిధంగా గిల గిలా కొట్టుకుంటుందో మరుని వల నుండి వెలుపలికి వచ్చిన మనస్సు కూడా ఆ విధంగానే గిల గిలా కొట్టుకుంటుంది.

9. మనస్సు అస్థిరమైనది. దాన్ని అదుపు చేయడం కష్టం. ఇది ఎల్ల వేళలా సుఖాన్ని అన్వేషిస్తూ ఉంటుంది. ఈ మనస్సును జయించడంలోనే మంచి ఉంది. మనస్సును జయించడం లోనే సంతోషం ఉంది.

10. నిన్ను నీవే ఒక ద్వీపంలా చేసుకొని కృషి చెయ్యి, నీలోని కల్మషాలన్ని గాలిలో కొట్టుకు పోతాయి. అపరాధం నుండి దూరంగా, దివ్య సుఖాలందుకొనగలిగే శ్రేష్ఠులలో నీవు ఒకడివి కాగలవు.

11. కంసాలి వెండికి పట్టిన మాలిన్యాన్ని వదల గొట్టినట్లుగా, వివేకవంతుడు తనలోని కల్మషాల్ని ఒకదాని వెంట మరొకటి కొద్ది కొద్దిగా ఎప్పటికప్పుడు వదిలించుకుంటాడు.

12. ఇనుముకు పట్టిన తుప్పు ఇనుమును నాశనం చేసినట్లు, పాపిని ఆవరించిన పాపాలు పాప మార్గానికి ఈడుస్తాయి.

13. అన్ని కళంకాల్లోకి అజ్ఞానమే గొప్ప కళంకం. ఓ సన్యాసులారా, మీలోని కళంకాల్ని తుడిచి వేసి నిష్కళంకులుగా కండి.

14. సిగ్గు మాలిన వాడు, ఇతరుల్ని అవమానించే వాడు, కీడు చేసే వాడు, మొహమాటం లేని వాడు దౌర్భాగ్యుడు జీవించడం సులభమే.

15. నిష్కల్మషుడూ, నిరాసక్తుడూ నిదానస్తుడూ, విజ్ఞుడు అయిన వినయ **శీలికి జీవితం** ఇబ్బంది కరంగానే ఉంటుంది.

16. పరుని భార్యతో వ్యభిచారం చేసే వాడు, ప్రపంచంలో తనకివ్వని దాన్ని తీసుకొనే వాడు, అసత్య మాడేవాడు, జీవుల్ని నాశనం చేసేవాడు.

17. మద్యపానం సేవించే వాడు ఈ ప్రపంచంలో తన గోతిని తానే తవ్వుకుంటాడు.

18. ఓ మనిషీ! అదుపు లేని వారు చాలా హీన స్థితికి చేరుకుంటారని తెలుసుకో, కాబట్టి అత్యాశ (దుర్వ్యసనం) నీకు చిరకాలం దుఃఖాన్ని కలిగించకుండా జాగ్రత్త వహించు.

19. ఈ లోకం దాని చిత్తం వచ్చినట్లో, గురి కుదిరినట్లో మనుషులకు సంపద, కట్టబెడుతుంది. ఇతరులకు లభించే ఆహార, పానీయాదులపై అసూయ పడితే మనిషికి పగలూ, రాత్రీ ఉండదు.

20. అలాంటి భావనలకు మొదటి నుండీ అవకాశం ఇవ్వని వారికి పగలు రాత్రి శాంతి లభిస్తుంది.

21. విషయ వాంఛని మించిన అగ్ని లేదు. అత్యాశను మించిన వరద లేదు.

22. ఎదుటి వాళ్ళ తప్పులు కనుగొనడం సులభం తనలోని తప్పుల్ని కనుగొనడమే కష్టం, మనిషి ఎదుటి వాడి లోపాల్ని చక్కగా తూర్పారబట్టగలడు. కాని తన లోపాల్ని మాత్రం విస్మరిస్తూంటాడు. జూదంలో మోసగాడు పావుల్ని దాచినట్లు.

23. ఇతరుల లోపాలు వెతుకుతూ, ఎప్పుడూ జగడం కొని తెచ్చుకునే వాడిలో మనో వికారాలు వృద్ధి అవుతాయి. వాటి నాశాన్ని ఎన్నడూ సాధించలేడు.

24. చెడును దూరంగా ఉంచుకో మంచిని పెంపొందించుకో, ఆలోచనల్లోనికల్మషాన్ని కడుక్కోమని బుద్ధుడు ప్రబోధించాడు.

## 6. అహం, దాన్ని జయించటం

1. మనిషిలో అహముంటే అతడు దాన్ని నిర్జించే సాధన చెయ్యాలి.

2. ఇదే బౌద్ధ జీవన విధానం.

3. అహానికి అహమే ప్రభువు, మరొకరెలా అవుతారు? అహాన్ని నిర్జిస్తే అతి కొద్ది మంది మాత్రమే కనుగొన గలిగిన ప్రభువును మనిషి దర్శిస్తాడు.

4. మాన్యుల, శ్రేష్ఠుల, శీలవంతుల నియతిని త్రోసిరాజనే మూర్ఖుడు అపధర్మం వెంట బడి "కత్థక" ఫలాల మాదిరిగా, తన వినాశ ఫలాల్ని తానే కోస్తాడు.

5. చెడు చేసిన వాడే బాధలను అనుభవించ వలసి ఉంటుంది. చెడు చేయని వాడు తన మంచి ద్వారా క్షాళన పొందుతాడు. మాలిన్యం నైర్మల్యం వారి వారి చర్యల్ని బట్టి

సంక్రమిస్తాయి. అంతే గాని ఒకర్ని మరొకరు క్షాళనం చెయ్యలేరు.

6. ఇంద్రియాలు అదుపు తప్పి ఆహారం నియతి తప్పి, సోమరిగా, దుర్బలంగా వుంటూ సుఖాల వెంటబడే వారు..బలహీనమైన చెట్టుగాలికి కూలినట్లు కూలిపోతారు

7. సుఖాల వెంటబడక, ఇంద్రియ నిగ్రహంతో, మితాహారంతో, బలంగా విధేయంగా ఉన్న వాళ్ళి మహా పర్వతాన్ని గాలేమీ చెయ్యలేనట్లే ఏదీ ఏమీ చెయ్యలేదు.

8. మనిషి తనకు తానే ప్రియంగా అనిపిస్తే తనపై తానే నిఘా వేసుకోవాలి.

9. ముందు తనను తానే మంచిగా మార్చుకొని ఇతరులను బాగుపరచడానికి పూనుకోవాలి. వివేకవంతుడు ఇతరుల తిరస్కారానికి అవకాశమివ్వడు.

10. ఎవరిని వారు అదుపు చేసుకోవడం కష్టం అంటారు. అయితే ఎవరు ఎదుటి వారికిచ్చే సలహా ప్రకారం తమని తాము మలుచుకుని అదుపు చేసుకుంటారో అప్పుడు అంతా అతని అదుపులో ఉంటారు.

11. మనిషి తన చెడు పనుల ఫలితంగా అనుభవించే కష్టాలే అతడిని చెడు నుంచి విముక్తుడ్ని చేసినట్లే - మంచి, చెడు పరస్పరం సంస్కరించుకుంటాయి. ఒకరు మరొకర్ని సంస్కరించలేరు.

12. ఒకరు యుద్ధంలో వేలకు వేల మందిని జయించవచ్చు. అది గొప్ప కాదు. తనను తాను జయించిన వాడే వీరుల్లో గొప్పవీరుడు.

13. ముందు తనను తాను సరైన మార్గంలోకి తెచ్చుకొని తర్వాత ఎదుటి వారిని సరైన మార్గంలో పెట్టే ప్రయత్నం చెయ్యాలి. తనను మంచి మార్గంలో పెట్టే అవకాశాన్ని వివేక వంతులు మరొకరికి ఇవ్వరు.

14. మంచిగా ఉండడం ఎలాగో ఇతరులకు హితవు చెబుతున్నట్లే, ఆ హితవే తాను పాటిస్తే అది ఇతరులను బాగు చెయ్యడానికి ఆదర్శం అవుతుంది.

15. తనకు తాను సంరక్షకుడు కావాలి మరొక సంరక్షకుని అవసరం ఏమిటి తనకు మించిన సంరక్షకుడు అరుదుగా లభిస్తాడు.

16. మనిషికి తానే తనకు ప్రియం అనిపిస్తే, తనపై తానే కాపలా వుంచుకోవాలి.

17. ఎవరు చేసిన చెడు పనికి వారే ఫలితం అనుభవించవలసి ఉంటుంది. ఆ విధంగానే అతడు స్వచ్ఛమవుతాడు. ఆ విధంగా మంచి, చెడు బహుళంగా ప్రక్షాళనమవుతాయి. ఒకరు మరొకర్ని క్షాళన చెయ్యలేరు.

18. ఎవరికి వారే సంరక్షుడు కాగలరు. అంత కన్నా తనకు సంరక్షకుడు ఎక్కడుంటాడు? తనకు మించిన సంరక్షకుడు అరుదుగా గాని లభించడు.

# 7. జ్ఞానం, న్యాయం, సజ్జన సహవాసం

1. వివేకంగా, న్యాయంగా మసలుకో. మంచి సహవాసాన్ని ఎన్నుకో.

2. ఇదే బౌద్ధ జీవన విధానం.

3. నిన్ను మందలిస్తూ ఏవి విడిచి పెట్టాలో చెప్పే వివేకి నీకు తారసపడితే, గుప్తనిధుల సమాచారం చెప్పేవారిని అనుసరించిన విధంగా ఆ వివేకవంతుని అనుసరించడం మేలే కాని కీడు చేయదు.

4. అతడు నిన్ను మందలించనీ, నీకు బోధించనీ, తగని పనుల గురించి నిన్ను వారించనీ, సజ్జనులు అతన్ని మన్నిస్తారు, దుష్టులు ద్వేషిస్తారు.

5. చెడ్డవారితో స్నేహం చేయకు అల్పులతోనూ స్నేహం చేయకు శీలవంతులతో స్నేహం చెయ్యి. సత్పురుషుల స్నేహం చెయ్యి.

6. ధమ్మం నుంచి జీవధార పొందిన వాడు ప్రశాంత చిత్తుడై సుఖించగలడు. శిష్యులు బోధించిన ధమ్మం వివేకిని వుల్లాస పరుస్తుంది.

7. బావి తవ్వేవారు నీటి దరిదాకా చేరతారు. వెదురును బాగా వంచితేనే అది ధనుస్సవుతుంది. వడ్రంగి చెక్క కావలసిన విధంగా మలుస్తాడు. అలాగే వివేక వంతులు తమని తాము మంచిగా తీర్చిదిద్దుకుంటారు.

8. గండశిలను గాలి కదిలించలేనట్లుగానే వివేకవంతులు నిందలకు అభినందనలకు తడబడరు.

9. లోతైన, ప్రశాంతమైన, నిశ్చలమైన సరోవరంలాగా ధర్మ ప్రభోధం ఆలకించిన వివేకవంతులు నిశ్చలతను సంతరించుకుంటారు.

10. సత్పురుషులు నిజానికి సర్వకాల సర్వావస్థల్లోనూ ఒకే విధంగా సాగిపోతారు. వారు విషయలాలసత గురించి కాక నిష్కామ కర్మను గురించి ప్రబోధిస్తారు. వారిని సంతోషంగాని విచారం గాని స్పృశించదు. వివేకవంతులు పొంగిపోరు. కుంగిపోరు.

11. పాపం ఉండే వరకూ పాపికి తాను చేస్తున్నది తేనెకన్నా తీయగా అనిపిస్తుంది. కాని అది పండినప్పుడు దుఃఖించక తప్పదు.

12. తెలివి తక్కువ వాడు తాను చేస్తున్నప్పుడు అవి పాపకార్యాలని గ్రహించలేడు. కాని దుష్టుడు తను చేసిన పాపాలనే అగ్నిలో దగ్ధం కాక తప్పదు.

13. మేలు కొని ఉన్నవాడికి రాత్రి దీర్ఘమైనదిగా అనిపిస్తుంది. అలసిపోయిన వారికి మైలు దూరం బహుదూరమనిపిస్తుంది. నిజమైన ధర్మం తెలియని మూర్ఖునికి జీవితం దీర్ఘమనిపిస్తుంది.

4. నీవు తినే ఆహారాన్ని బట్టి నీకు పవిత్రత రాదు.
5. ఆహారం కాదు దుశ్చర్యలు ప్రమాదం.
6. బాహ్య స్నానం చాలదు.
7. పవిత్ర జీవనం అంటే ఏమిటి?

## ఆరవ విభాగం-సాంఘిక, రాజకీయ, సమస్యలపై ఉపదేశాలు

1. రాకుమారుల దయా దాక్షిణ్యాలపై ఆధారపడకు.
2. రాజు ధర్మ పరాయణుడైతే ప్రజలు ధర్మ పరాయణులవుతారు.
3. సాంఘిక వ్యవస్థపై ఆధారపడే రాజకీయ సైనిక పాటవం.
4. యుద్ధం తప్పు.
5. శాంతిని జయించిన విజేత విధులు.

28. ఇవన్నీ సమూలంగా పరిహరించుకొని ద్వేషం నుంచి బయట బడి వివేకి అయిన వాడు మాన్యుడవుతాడు.

29. దేన్నైనా హింసద్వారా సాధించే వాడు న్యాయ శీలికాడు - ఎన్నటికో మంచీ, చెడూ విచక్షణ తెలిసే వివేకిఅయి, ధర్మ సంరక్షకుడిగా హింసతో కాక అదే ధర్మంతో యితరులకు దారిచూపే వాడే న్యాయశీలి.

30. ఎక్కువ మాట్లాడినంత మాత్రానే మనిషి పండితుడు కాడు. సహన శీలి ద్వేష రహితుడు. నిర్భయుడు అయిన వాడు పండితుడు అవుతాడు.

31. ధర్మాన్ని గురించి ఎక్కువ మాట్లాడినంత మాత్రాన అతడు ధర్మాన్ని బలపరచేవాడు కాలేడు. తక్కువ చదువుకున్నవాడైనా ధర్మాన్ని ప్రత్యక్షంగా చూసేవాడు ధర్మాన్ని ఎన్నడూ అలక్ష్యం చేయనివాడు, ధర్మాన్ని బలపరచేవాడవుతాడు.

32. మనిషికి ఒక వివేకి సహచర్యం లభిస్తే, తెలివిగా తొట్రు పడకుండా అపాయాన్ని అధిగమిస్తూ, పరహితంగా అతనితో కలిసి జీవయాత్ర సాగించాలి.

33. కలిసి చరించటానికి వివేకి సహచర్యం లభించనప్పుడు మనిషి తెలివిగా, తొట్రు పడకుండా - జయించిన రాజ్యం తన వెనుక వదలి వెడలేరాజులాగ, అరణ్యంలో మత్తేభం లాగ ఒంటరి గానే ముందుకు సాగాలి.

34. మూర్ఖునితో సహచర్యం సాగించడం కన్నా ఒంటరిగా జీవించడమే మేలు. అరణ్యంలో ఏనుగులాగా, మనిషి మిత వాంఛలతో పాపరహితంగా ఒంటరిగా పోవాలి.

35. ఉచిత సందర్భంవుంటే, స్నేహితులు సంతసం కలిగిస్తారు; కారణమేదైనా అనుభవం హాయిగొలుపుతుంది. కారణం ఏదైనా ఒక మంచి పని సంతసం కలిగిస్తుంది. మృత్యుఘడియలో మంచి పని హాయి గొలుపుతుంది. దుఃఖాన్ని వర్జించటం సంతోషదాయకం.

36. ప్రపంచంలో మాతృత్వం సంతోషకరమైంది, పితృత్వం సంతోషకరమైనది. శ్రమగాని స్థితి సంతోషకరమైంది.

37. వార్ధక్యం వరకూ శీలం నిలుపుకోవటం సంతోషకరం. నమ్మకం దృఢంగా పాదుకొని ఉండడమే సంతోషకరం. ప్రజ్ఞవల్ల ప్రాప్తించేదే సంతోషకరం. పాపాలకు దూరంగా ఉండడమే సంతోషకరం.

38. మూర్ఖులతో కలిసి నడిచే వాడికి దూరం పెరుగుతుంది. మూర్ఖులతో సహవాసం అంటే శత్రువుతో సహవాసమే. అది ఎల్లప్పుడూ బాధాకరమే. వివేక వంతులతో సహవాసం ఆత్మీయులతో సంతోషదాయకం.

39. అందుచేత చుక్కల దారిని చంద్రుడు అనుసరించినట్లు - జ్ఞానులైన విజ్ఞులైన బుధులైన సహనశీలు రయిన, బాధ్యతా యుతులైన శిష్యులైన వారిని అనుసరించాలి.

40. ఐడాయి పోవద్దు. కామ వ్యాపారం వెంట పడవద్దు. నిజాయితీగా ఉన్నవాడికి నిత్యానందం.

41. బుద్ధజనుడు నిజాయితీతో డంబాన్ని పార ద్రోలినప్పుడు, జ్ఞాన శిఖరాన్ని అధిరోహిస్తూ క్రింద వున్న మూర్ఖుల్ని చూస్తాడు. ఇక దుఃఖం నించి విముక్తుడయినప్పుడు శిఖరం నుంచి క్రింద మైదానంలో నిలబడ్డ వాళ్ళని చూసినట్లు దుఃఖ భాజనులైన జనాన్ని చూస్తాడు.

42. మతి హీనుల మధ్య మతి మంతుడు, నిద్రితుల మధ్య జాగృతుడు అయిన విజ్ఞుడు గడ్డిమేటలో కొర్రులాగ ముందుకు దూసుకుపోతాడు.

# 8. ఆలోచనా పరత్వం - అప్రమత్తత

1. ప్రతి విషయంలోనూ ఆలోచనా పరుడిగా అప్రమత్తుడిగా ఉండు. అన్ని విషయాల్లోనూ మనస్ఫూర్తిగా, ధైర్యం వ్యవహరించు.

2. ఇదే బౌద్ధ జీవన విధానం.

3. మన స్థితి మన ఆలోచనల ఫలితమే. అది మన ఆలోచనల్ని పునాదిగా చేసుకొని ఆలోచనల ద్వారా వచ్చిందే. మనిషి చెడుగా ఆలోచించి ఏదైనా చెప్పినా, చేసినా అతడ్ని బాధచుట్టుకుంటుంది. మనిషి నిర్మలమైన దృష్టితో ఏది చెప్పినా, చేసినా సంతోషం ప్రాప్తిస్తుంది. కాబట్టి నిర్మలమైన ఆలోచనలు ముఖ్యం.

4. ఏనుగు బురదలో నుండి వెలికి వచ్చినట్లు, చెడు మార్గం నుండి నిన్ను నీవు బయటికి లాక్కో. జడంగా ఉండకు. నీ ఆలోచనని కని పెట్టుకొని ఉండు.

5. విజ్ఞుడు తన ఆలోచనల్ని కనిపెడుతూ ఉండాలి. ఎందుకంటే, అవి ఒక పట్టాన పట్టుబడవు, జిత్తులు పన్నుతాయి; అశాంతితో చెలరేగి పడతాయి. అదుపులో ఉన్న ఆలోచన ఆనందం కలిగిస్తుంది.

6. పూరి గుడిసెలోకి వర్షపు నీరు చొచ్చుకొచ్చినట్లే ఆలోచన లేని మనస్సులోకి భావోద్రేకం చొరబడుతుంది.

7. పటిష్టంగా కప్పుడున్న ఇంట్లోకి వర్షం నీరు రానట్లే, నిబ్బరంగా ఉండే మనస్సులోకి భావోద్రేకాలు రావు.

8. ఇంతకు ముందు నా ఈ మనస్సు దానికి ఇష్టం వచ్చినట్లు దారి తెన్ను లేకుండా సంచరించింది. మదించిన ఏనుగును అంకుశంతో అదుపులోకి తెచ్చే మావటివాడిలా, నేను మనస్సును యిప్పుడు గట్టిగా అదుపులో ఉంచుతాను.

9. మనస్సును అదుపులోకి తేవడం మంచిది. ఎటు పడితే అటు పరుగిడే మనస్సును గట్టిగా

పట్టుకోవడం కష్టమే అయినా అదుపులోకి వచ్చిన మనస్సు సంతోషాన్నిస్తుంది.

10. పరుగులిడే మనస్సుకు పగ్గం వేయగలగే వారు ప్రలోభాలకి దూరంగా ఉండగలరు.

11. మనిషి విశ్వాసం అస్థిరమైనా, అతడికి నిజమైన ధర్మం తెలియక పోయినా, అతన్ని మనశ్శాంతికి భంగం వాటిల్లినా, అతని జ్ఞానం ఎప్పుడూ పరిపూర్ణం కాదు.

12. ఒక ద్వేషి మరో ద్వేషికి చేసే హానికన్నా, ఒక శత్రువుకు మరో శత్రువుకు చేసే హాని కంటే దారి తప్పించిన మనస్సు మనిషికి ఎక్కువ కీడు చేస్తుంది.

13. తల్లిగాని, తండ్రిగాని, బంధువులుగాని చేసే మేలు కన్నా మంచి దారిలో మనస్సు మనకు చేసే మేలు మిన్న.

## 9. జాగరూకత, శ్రద్ధ, నిర్భీకత

1. తన మీద తనకు నిఘా కలిగిన వివేకవంతుడు తనను నిర్లక్ష్యం నుంచి దూరంగా ఉంచుకోవడం వల్ల విజ్ఞాన శిఖరాలను అధిరోహిస్తాడు. శోకరహితుడై అక్కడి నుండి కింద కష్టాల్లో మునిగి తేలుతున్న మానవజాతిని గిరి శిఖరం మీద నుంచి కింద లోయలోనున్న మూర్ఖులను చూసినట్లు చూస్తాడు.

2. ప్రమత్తులలో అప్రమత్తుడై నిద్రితుల్లో జాగృతుడై విజ్ఞుడు, కుంటి గుర్రాన్ని జవనాశ్వం దాటుకు పోయినట్లు దూసుకుపోతాడు.

3. నిర్లక్ష్యానికి అవకాశ మివ్వదు. శరీర వాంఛలకు లోనుకాదు. అప్రమత్తుడు ధ్యానమగ్నుడవుతాడు.

4. చిత్తశుద్ధి మృత్యువు లేని దారి చూపుతుంది. ప్రమత్తత మృత్యువుకు దారి. చిత్త శుద్ధిని నమ్ముకున్న వారు మరణించరు. ప్రమత్తులు మృతులకిందేజమ.

5. వేరే ఆశయం ఎంతగొప్పదైనా, నీ ఆశయం నుంచి మళ్ళకు. ఒకసారి నీ గమ్యాన్ని పోల్చుకున్న తరువాత, దానికే దృఢంగా, దీక్షగా అంకితం కావాలి.

6. అప్రమత్తంగా ఉండు. సోమరితనం వీడు. సత్యపథంలో పయనించు. ఆ మార్గంలో ఎవరైతే పయనిస్తారో వారు ప్రపంచంలో సంతోషంగా ఉంటారు.

7. సోమరితనం అనేది అవమానకరం. ఎప్పుడూ సోమరిగా ఉండడం భ్రష్టతకు దారి తీస్తుంది. కఠోరయత్నంతో, లోదృష్టి సాయంతో సోమరి తనం అనే విషబాణాన్ని నీనుంచి పెరికి వెయ్యవచ్చు.

8. నీవు నిర్లక్ష్యానికి ఆస్కారమివ్వకు. శారీరక కామ వాంఛలను జయించు, అప్రమత్తత ధ్యాన సంపన్నత అనేవి మహదానందాన్నిస్తాయి.

9. మరపులో పడకుండా, పరహితం కోరి నిష్కల్మష కార్యాలు చేస్తూ, ధర్మాను సారంగా సంయమనంతో జీవించే లక్ష్యబదుడు పూర జాగృతి పొందితే. అతని స్రాభవం

# 10. దుఃఖం, సంతోషం, దాతృత్వం, కారుణ్యం

1. దారిద్ర్యం దుఃఖానికి హేతువు.

2. కాని దారిద్ర్యనివారణ తప్పని సరిగా సౌఖ్యం కొని తేదు.

3. ఉన్నతమైన జీవిత ప్రమాణం కాదు, ఉన్నతమైన సంస్కారం సౌఖ్యాన్నిస్తుంది.

4. ఇది బౌద్ధ జీవన విధానం.

5. ఆకలిని మించిన తీవ్రమైన జబ్బులేదు.

6. ఆరోగ్యమే గొప్ప కానుక, సంతృప్తే గొప్ప సంపద. నమ్మకమే గొప్ప బంధుత్వం, నిర్యాణమే పరమానందం.

7. నిజమైన సంతోషకరమైన జీవనాన్ని మనం తప్పక అలవరుచుకోవాలి. మనల్ని ద్వేషించే వాళ్ళను ద్వేషించే జీవితాన్ని కాదు.

8. రోగపీడితుల్లో రోగిగా కాక వాస్తవ సంతోషకరమైన జీవితాన్ని అలవరచుకోవాలి.

9. దురాశా పరుల్లో వుండే దురాశకు దూరంగాసంతోషకరమైన జీవితాన్ని అలవరచుకోవాలి.

10. చీడలు పైర్లను నాశనం చేసినట్లు మానవ జాతిని తీవ్ర వాంఛలు నాశనం చేస్తున్నాయి. అందు చేత వాంఛారహితులైన వారికి దానం చేయడం వల్ల గొప్ప ప్రతిఫలం లభిస్తుంది.

11. మానవ జాతిని డంబాచారం నాశనం చేస్తుంది, పైర్లను చీడపీడలు నాశనం చేసినట్లు. అందు చేత డంబాచార దూరులైన వారికి దానం చేయడం వల్ల గొప్ప ప్రతిఫలం లభిస్తుంది.

12. చీడ పీడల వల్ల పైర్లు నాశమైనట్లు. కామం మానవజాతిని నాశనం చేస్తుంది. అందు చేత కామరహితులైన వారికి దానం చేయడం వల్ల గొప్ప ప్రతి ఫలం లభిస్తుంది.

13. ధర్మం పట్ల చూపే దాతృత్వం అన్ని బహుమానాలకు మించినది. ధర్మం యొక్క మాధుర్యం ధర్మాన్ని మించినది. అన్ని ఆనందాల్లోకి మించినది ధర్మంలోని ఆనందమే.

14. విజయం ద్వేషాన్ని అంకురింప జేస్తుంది. ఎందుకంటే అది పరాజితుడికి అసంతృప్తిని కలిగిస్తుంది. జయాపజయాలకు అతీతంగా ఉండేవాడు సంతృప్తుడై సుఖిస్తాడు.

15. వాంఛకు మించిన అగ్ని లేదు. ద్వేషానికి మించిన వినాశం లేదు. దేహానికి మించిన బాధలేదు. విశ్రాంతికి మించిన గొప్ప సంతోషం లేదు.

16. ఇతరుల చెడు మాటలు, చెడు చేతలమీద వారు ఏమిచేశారు, చెయ్యలేదు అనే దాని మీద దృష్టి పెటకు. నీవు ఏం చేశావు. ఏం చెయ్యలేదనేది చూడు.

17. నిరాసక్తంగా, ఆయాసరహితంగా, పరిశుభ్రంగా, పవిత్రంగా, విచక్షణాయుతంగా వుండే వినయ వంతుడికి జీవిత మెప్పుడూ దుష్కరంగానే వుంటుంది.

18. చురుకైన గుర్రాన్ని కొరడాతో కొట్టవలసిన అవసరం లేకుండానే పరుగు తీసి నట్లు ప్రపంచంలో నిందకు అస్కారం ఇవ్వకుండా మచ్చలేని విధంగా జీవించే మనిషి వున్నాడా! అట్లా చురుకైన గుర్రం వలె. వురకలు వేస్తూ వుజ్వలంగా జీవించు.

19. ఎవరినీ పరుషంగా తూలనాడకు, ఎదుటి వాళ్ళు నీకు అదే పద్ధతిలో సమాధానమిస్తారు. కోపంగా మాట్లాడడం బాధాకరం. దెబ్బకుదెబ్బనీకూతగుల్తుంది.

20. రథానికి సీలలాగు ప్రపంచానికి స్వేచ్ఛ, సద్భావం, మర్యాద, నిస్వార్థం అవశ్యం.

21. ఇదే బౌద్ధజీవన విధానం.

## 11. కపటం

1. ఎవరూ అబద్ధం చెప్ప కూడదు. ఎవరితోనూ అబద్ధం చెప్పించ కూడదు అబద్ధ మాడిన వారి పనులను ఆమోదించరాదు. అన్ని రకాల అనృత భాషని, బొంకుల్ని మీ మధ్య నుంచి పరిహరించండి.

2. పరిపూర్ణుడైన బుద్ధుడు ఏం చెబుతాడో అదే చేస్తాడు. ఏది చేస్తాడో అదే చెబుతాడు. తాను చేసేది చెప్పి చెప్పింది చేస్తాడు కనుకనే ఆయన్ని పరిపూర్ణుడంటారు.

3. ఇదే బౌద్ధుల జీవనవిధానం.

## 12. సన్మార్గానుసరణం

1. సన్మార్గం ఎంచుకో. దారి తప్పకు.

2. అనేక దారులున్నాయి. అవి అన్నీ సన్మార్గానికి దారి తీయవు.

3. సన్మార్గం సంతోషకారకం. అది కొందరికి కాదు. అందరికీ.

4. సన్మార్గానుసరణంతో ప్రారంభించి, కొనసాగించి, ముగించాలి.

5. సన్మార్గాను సరణం బౌద్ధ జీవన విధానం.

6. సర్వ మార్గాల్లో ఉత్తమమైనది అష్టాంగ మార్గం. సర్వసత్యాల్లో ఉత్తమమైనది చతుశ్శబ్దం. సర్వ సద్గుణాల్లో ఉత్తమమైనది వికార రాహిత్యం. సర్వులలో ఉత్తముడు దృష్టివున్నవాడు.

7. జ్ఞానాన్ని వినిర్మలం చేసుకోడానికి మరో మార్గం లేదు. ఇదే ఉత్తమమైన మార్గం. ఈ మార్గాన్నే వెళ్ళు

8. ఈ మార్గాన్ని అనుసరిస్తే బాధని అంతం చేసుకుంటావు. శరీరంలో గుచ్చుకున్న ముళ్లని తొలగించటం తెలిసినప్పుడు, ఈ మార్గం నేను బోధించాను.

9. తధాగతులు బోధించ గలవారు మాత్రమే. నీవు నీయంతట ప్రయత్నించేయాలి.

10. ``సృష్టింపబడిన వన్నీ నశించేవి'' ఈ సత్యాన్ని తెలుసుకోగలిగి, దర్శించ గలవానిని బాధ ఏమీ చెయ్యలేదు.

11. ``అన్ని రూపాలు మిధ్య'' ఈ సత్యం తెలుసుకుని దర్శించ గలిగిన వారిని బాధ ఏమీ చెయ్యలేదు.

12. యువకుడూ, బలశాలీ అయివుండీ కూడ - దుర్బల సంకల్పం, ఆలోచనలలో, పూర్తి అలసత్వంలో కూరుకున్న వాడు సందర్భం వచ్చినప్పుడు సవాలుగా నిలబడడు. అలాంటి సోమరికి జ్ఞాన మార్గం ఎన్నడూ దొరకదు.

13. మనస్సును బాగా నిగ్రహించుకొని, ఆచితూచి సంభాషణం చేసేవాడు, శారీరకంగా కూడ ఏ తప్పు చెయ్యకూడదు. మనిషి మూడు క్రియా మార్గాల్ని స్పష్టంగా ఏర్పరచుకున్నదే తడవుగా, జ్ఞానులు చూపిన మార్గాన్ని అందుకు పోగలడు.

14. నిజమైన జ్ఞానం వల్ల మనిషి లాభిస్తాడు ; నిజమైన జ్ఞానంలోపిస్తే నష్టపోతాడు ; ఈ లాభనష్టాల రెండు దారులు తెలిసిన మనిషి తన జ్ఞానం పెంపొందే విధంలో వ్యవహరిస్తాడు.

15. శరత్కాలంలో తామరలా స్వార్థం మీద వ్యామోహాన్ని తెంచుకో. శాంతి మార్గాన్ని అభిలషించు. సుగతుడు నిర్వాణ మార్గాన్ని చూపించాడు.

16. దుష్టశాసనాన్ని అనుసరించకు. ఆలోచనా రాహిత్యంలో కొట్టు మిట్టాడకు. అప సిద్ధాంతాన్ని అనుసరించకు.

17. సోమరిగా పొద్దు పుచ్చక, విజృంభించు. సచ్ఛీల నియతి పాటించు. శీలవంతుడీ లోకంలో ఆనంద పారవశ్యం చెందుతాడు.

18. మొదట నిర్లక్ష్యంగా చరించి తర్వాత సలక్షణంగా మారిన వాడు, మబ్బు విడిచిన చంద్రుడిలా లోకాన్ని కాంతివంతం చేస్తాడు.

19. ఒకడి మంచి పనులు చెడు పనులని కప్పివేసే, అతడు - మబ్బు విడిచిన చంద్రుడిలా - లోకాన్ని కాంతి వంతం చేస్తాడు.

20. ఉన్న ఒకే నీతిని వుల్లంఘించి బొంకులు నేర్చాడో, అతడు చేయని కానిపని అంటూ వుండదు.

21. నిరంతరం అప్రమత్తంగా ఉండేవారు, రాత్రీ పగలు అధ్యయనం చేసే వారు, నిర్వాణ మార్గాన్ని అనుసరించే వారు, వికారాలకు స్వస్తిపలుకుతారు.

22. ఇది పాతమాటే. మౌనంగా కూర్చునే వాడినీ నిందిస్తారు. అతిగా మాట్లాడే వాడిని నిందిస్తారు. తక్కువ మాట్లాడే వాడిని కూడ నిందిస్తారు. భూమ్మీద నిందలు మోయని వాడంటూ ఉండడు.

23. ఎల్లకాలం నిందమోసే వాడు గాని, ఎల్లకాలం పొగడ్తలందుకునే వాడుగాని ఒక మనిషి గతంలో లేడు, ముందువుండడు, యిప్పుడు లేడు.

24. నాలుక మీదకు వచ్చే కోపం పట్ల జాగ్రత్తగా ఉండు. నాలుకను అదుపులో పెట్టుకో. మనస్సులోని పాపపు ఆలోచనల్ని వదిలి పెట్టు. సచ్ఛీలతను సాధన చెయ్యి. చిత్తశుద్ధి నిర్వాణ మార్గం, ఆలోచనా రాహిత్యం మృత్యు మార్గం.

# 13. నిజమైన ధర్మంతో అపధర్మాన్ని కలపవద్దు

1. అసలును నకిలీగాను, నకిలీని అసలుగాను పొరపడే వారిలో వక్ర బుద్ధి తలెత్తు తుంది. వారు సత్యాన్ని చేరరు.

2. అసలును అసలుగా, నకిలీని నకిలీగా ఎరిగిన వారిలో ఋజు చింతన వికసిస్తుంది. వారు సత్యాన్ని చేరతారు.

3. సరయిన కప్పులేని గుడిసెలోకి వర్షం నీరు కురిసినట్లు అశిక్షితమైన మనస్సులోకి లాలస చేరుతుంది.

4. సరిగా కప్పువేసిన గుడిసెలోకి వర్షం నీరు రానట్లు సుశిక్షతమైన మనస్సులోకి లాలస చేరదు.

5. లేచి అలక్ష్యాన్ని వర్జించు, సుభోధనా మార్గంలో నడకసాగించు. అలాంటి మార్గంలో సాగేవారు ఈ లోకం లోనే కాదు, ఏ లోకంలోనయినా సుఖిస్తారు.

6. సుబోధనా మార్గం అనుసరించు. దుష్ట పధాల్లో చరించకు, సుభోధ మార్గాన్ని అనుసరించేవారు. ఈ లోకం లోనే కాదు ఏ లోకంలో నయినా సుఖిస్తారు.

# నాల్గవ భాగం
# ఆయన ఉపదేశాలు

## మొదటి విభాగం - గృహస్థులకు ఉపదేశాలు

1. సంతుష్ట గృహస్థు
2. కొడుకు కన్నా కూతురు మేలు కావచ్చు
3. భార్యా భర్తలు

## రెండవ విభాగం-సచ్ఛీల అగత్యంపై ఉపదేశాలు

1. మనిషికి పతనాన్ని కలిగించేదేమిటి?
2. దుర్మార్గుడు
3. ఉత్తముడు
4. బోధిసత్వుడు
5. ధర్మాత్ముడు, సజ్జనుడు
6. మంచి పనులు చేయవలసిన అవసరం
7. మంచి తీర్మానాలు చేసుకోవలసిన అవసరం.

## మూడవ విభాగం - ధర్మంపై ఉపదేశాలు

1. ధర్మం అంటే ఏమిటి?
2. ధర్మం యొక్క అవసరం.
3. ధర్మం - ప్రాపంచిక బాధ్యతలు.
4. ధర్మ వర్తనలో పరిపూర్ణత సాధించడమెలా!
5. ధర్మ మార్గంలో పయనించడానికి తోడుకోసం నిరీక్షించనవసరం లేదు.

## నాల్గవ విభాగం - నిర్వాణంపై ఉపదేశాలు

1. నిర్వాణ మంటే ఏమిటి?
2. నిర్వాణానికి మూలాధారాలు

## ఐదవ విభాగం - ధమ్మంపై ఉపదేశాలు

1. సమ్యక్ దృష్టికే ప్రథమ స్థానం ఎందుకు?
2. మరణానంతర జీవితాన్ని గురించి చింత దేనికి?
3. దేవుని పూజలు, ఉపాసనలు వ్యర్థం.

4. నీవు తినే ఆహారాన్ని బట్టి నీకు పవిత్రత రాదు.
5. ఆహారం కాదు దుశ్చర్యలు ప్రమాదం.
6. బాహ్య స్నానం చాలదు.
7. పవిత్ర జీవనం అంటే ఏమిటి?

## ఆరవ విభాగం-సాంఘిక, రాజకీయ, సమస్యలపై ఉపదేశాలు

1. రాకుమారుల దయా దాక్షిణ్యాలపై ఆధారపడకు.
2. రాజు ధర్మ పరాయణుడైతే ప్రజలు ధర్మ పరాయణులవుతారు.
3. సాంఘిక వ్యవస్థపై ఆధారపడే రాజకీయ సైనిక పాటవం.
4. యుద్ధం తప్పు.
5. శాంతిని జయించిన విజేత విధులు.

## మొదటి విభాగం

# గృహస్థులకు ఉపదేశాలు

## 1. సంతుష్ట గృహస్థు

1. అనాథ పిండకుడు ఒకసారి బుద్ధుడున్న చోటికి వచ్చి నమస్కారం చేసి పక్కన కూర్చున్నాడు.
2. గృహస్థ జీవితం గడుపుతున్న వానికి ఏ విధంగా సంతోషం లభిస్తుందో తెలుసుకోవాలన్న ఉత్కంఠతో ఉన్నాడు అనాథ పిండకుడు.
3. గృహస్థ జీవి సంతోషంలోని రహస్య మెట్లో వివరించ వలసిందని ఆ మహాను భావుని అనాథ పిండకుడు కోరాడు.
4. దానికి సమాధానంగా భగవానుడు చెప్పిందేమిటంటే మొదట గృహస్థుకు సంతోషాన్నిచ్చేది తన సంపద. ఆ సంపద అతడు న్యాయంగా, ధర్మంగా, రెక్కల కష్టం ద్వారా చెమటోడ్చి సముపార్జించుకున్నదయిఉండాలి. తర్వాత ఆ సంపదను తాను న్యాయంగా సంపాయించుకున్నానన్న ఆలోచనతో గృహస్థు సంతోషించగలడు.
5. రెండవది సంపద అనుభవించడం. తాను న్యాయంగా, ధర్మంగా చెమటోడ్చి రెక్కలు ముక్కలు చేసుకుని సంపాదించిన దాన్ని అనుభవిస్తూ గృహస్థు పుణ్యకార్యాలు చేస్తాడు. ఆపైన న్యాయంగా సంపాదించిన తన సంపదతో ధర్మ కార్యాలు చేస్తున్నాననే ఆలోచనలో అతడు సంతృప్తి చెందగలడు.
6. మూడవది అప్పునుంచి దూరంగా ఉండడ మనే సంతోషం కొద్దిగా గాని పెద్దగా గాని ఎవరికీ బాకీ పడని గృహస్థు సంతోషాన్ని పొందగలడు. నేనెవ్వరికీ ఏమీ బాకీలేను" అన్న భావనే అతనికి సంతోషాన్నిస్తుంది.
7. నాలుగవది నిందా రాహిత్యం వల్ల సంతుష్టి. తన మాటల ద్వారాగాని చేతల ద్వారాగాని, ఆలోచనల ద్వారా గానీ నిందార్హుడు కాక పోవటం గృహస్థుకు ఆనందాన్నిస్తుంది.
8. అనాథ పిండకా! గృహస్థు యత్నించాలేగాని, యీ నాలుగు రకాల సంతుష్టి అతనికి నిత్యం లభిస్తుంది.

## 2. కొడుకు కన్నా కూతురే మేలు కావచ్చు.

1. బుద్ధుడు శ్రావస్తిలో ఉండగా కోసలరాజు ప్రసేన జిత్తు మహాను భావుని దగ్గరికి వచ్చాడు.

2. రాజు బుద్ధునితో సంభాషణ సాగిస్తుండగా రాజభవనం నుండి ఒక దూత వచ్చి మహారాణి మల్లిక ఆడ శిశువును ప్రసవించిందన్న వార్త రాజు చెవిన వేశాడు.

3. అది విని రాజు చాలా నిరాశకు, నిస్పృహకు లోనయినట్లు కనిపించాడు. ఆ నిస్పృహకు కారణమేమిటని భగవానుడు రాజును అడిగాడు.

4. మహారాణి మల్లిక కుమార్తెను ప్రసవించదన్న విషాద వార్త తనకు ఇప్పుడే చేరిందని రాజు సమాధానం చెప్పాడు.

5. రాజు విచారానికి కారణమైన విషయాన్ని తెలుసుకొని భగవానుడన్నాడు. ఆహా! అడ బిడ్డా! ఓ నరేంద్రా! మగ బిడ్డకన్నా ఆడ సంతానమే గొప్పదని రుజువు కావచ్చు. వివేకవతిగా శీలవతిగా ఆమె తన అత్త చేత మెప్పు పొందవచ్చు, ఆదర్శసతిగా, మంచి కూతురుగా ప్రశంసింపబడవచ్చు.

6. అలాంటి కులీన సతికి కలిగే కొడుకు గొప్ప కార్యాలు చేసి, గొప్పగా రాజ్యాలు ఏలవచ్చు. తన దేశానికీ మార్గ దర్శి కావచ్చు.

# 3. భార్యా భర్తలు

1. ఒకప్పుడు బుద్ధుడు మధురనుండి నిరంజనకు పోయే ప్రధాన రహదారి మీద నడక సాగించాడు. అదే సమయంలో చాలమంది గృహస్థులు తమ భార్యలతో సహా ఆ రహదారిలో కలిశారు.

2. తరువాత భగవానుడు రోడ్డు విడిచి పక్కనే ఉన్న ఒక చెట్టు కింద కూర్చున్నాడు. చెట్టు కింద కూర్చున్న బుద్ధుని ఆ గృహస్థులు; వారి భార్యలు చూశారు.

3. చూడగానే ఆ మాహనుభావుని సమీపించి ఆయనకు నమస్కరించి ఒక ప్రక్కన కూర్చుని భార్యా, భర్తల సత్సంబంధాలను గురించి వారు అడిగారు. వారి నుద్దేశించి ఆయనిలా చెప్పాడు.

4. ``గృహస్థులారా! భార్యా భర్తలు అన్యోన్య దాంపత్యం గడపడానికి నాలుగుమార్గాలున్నాయి. ఒక నీచుడు నీచురాలితో కలిసి జీవించవచ్చు, ఒక నీచుడు దేవతలాంటి స్త్రీతో కలిసి జీవించ వచ్చు. ఒక దేవుడు లాంటి వాడు నీచురాలితో కలిసి జీవించవచ్చు. దేవుని లాంటి వాడు దేవతలాంటి స్త్రీతో జీవించవచ్చు.

5. ``గృహస్థులారా! చంపడం, దొంగతనం చేయడం అకృత్యాలకు పాల్పడడం, అబద్ధాలాడడం, పీకల వరకూ మద్యంలో మునగడం, దౌర్జన్యాలకు పాపాలకు పూనుకోవడం, పరమ లోభిగా గార్హస్థ జీవితం గడపడం, మంచి వారిని తూల నాడడం, దూషించడం వంటివి చేసే భర్త ఉన్నాడనుకోండి. అతనిలాగే అతని భార్య

కూడ చంపేది, దొంగతనం చేసేది, అకృత్యాలకు, పాపకార్యాలకు పాల్పడేది, ప లోభిగా జీవితం గడిపేది మంచి వారిని తూలనాడేది, దూషించేది, అనుకోండి, స్త్రీ నీచ పురుషుడు కలిసి గార్హస్థ్య జీవితం గడపడం అంటే వాస్తవంగా అదీ.

6. గృహస్థులారా! హంతకుడు, దొంగ, అకృత్యాలకు పాల్పడేవాడు, అబద్ధాలాడేవా మద్యంలో మునిగేవాడు, దౌర్జన్యాలకు, పాపాలకు పాల్పడేవాడు, పరమ లోభ జీవితం గడిపేహడు, మంచివారిని తూలనాడేవాడు, దూషించేవాడు అయిన వున్నాడు. అతని భార్యలో చంపడం దొంగతనం చేయడం, చెడు ఆలోచన చెయ్యడం, అబద్ధాలాడడం, మద్యం సేవించటం వంటి వాటికి దూరంగా ఉం గుణాలుండవచ్చు. ఆమె శీలవతి, సత్ప్రవర్తన కలిగినది, కళంకానికి తావు లే హృదయంతో ఎవరినీ దూషించక, నిందించక గార్హస్థ్య జీవితం గడపవచ్చు. వాస్తవం అదీ ఒక నీచునితో ఒక దేవత గృహస్థ జీవితం గడపడం అంటే.

7. చంపడం, దొంగతనం చేయడం, చెడు భావనలు కలిగి వుండడం, అబద్ధాలాడడ మద్యంలో మునగడం వంటి గుణాలకు దూరంగా ఉండడంతో పాటు సత్ప్రవర్త సచ్ఛీలం కలిగి లోభానికి దూరంగా జీవితం గడుపుతూ, ఎవరినీ దూషించకుండ తూలనాడకుండా ఉండే భర్త ఉన్నాడనుకోండి! వాటికి విరుద్ధంగా అతని భార చంపడం, దొంగతనం చేయడం, చెడు ఆలోచనలు చేయడం, అబద్ధాలాడడం మద్యంలో మునగడం దుర్మార్గానికి, పాపాలకు పాల్పడడం, లోభంతో కూడిన జీవితం గడపడం మంచి వారిని నిందించడం వంటి గుణాలు కలిగినదయితే అది వాస్తవంగా దేవుని లాంటి వాడితో నీచ స్త్రీ గృహస్థ జీవితం గడిపినట్లు.

8. "గృహస్థులారా! చంపడం, దొంగతనం చేయడం, దురాలోచన చేయడం అబద్ధమాడడం మద్యంలో మునిగి పోవడం వంటి వాటికి దూరంగా వుంటూ సత్ప్రవర్తన, సచ్ఛీలం కలిగి లోభంలేని గృహస్థ జీవనం గడపడం మంచివారిని తూలనాడకుండా అవమానించకుండా భార్యా భర్తలిరువురూ ఉంటే అది యిరువురు దేవతా మూర్తులు గృహస్థ జీవితం గడిపినట్లు.

9. "గేస్తులారా! ఇవీ నాలుగు రకాలుగా దాంపత్య జీవనం గడపడం"

రెండవ విభాగం

# సచ్ఛీలత ఆవశ్యకతపై ఉపదేశాలు

## 1. మనిషి పతనానికి కారణాలు

1. ఒక సందర్భంలో బుద్ధ భగవానుడు శ్రావస్తిలోని జితవనంలో[5] ఉన్న అనాధ పిండకుని విహారంలో ఉండేవాడు.

2. ఆ రోజు రాత్రి పొద్దు పోయాక ఒక దివ్య పురుషుడు జిత వనమంతా మిరు మిట్లు గొలిపే కాంతుల్ని వెదజల్లుతూ భగవానుని వద్దకు వచ్చి గౌరవ పురస్సరంగా ప్రణామం అర్పించి ఒక పక్కన నిలబడ్డాడు తర్వాత ఆ పురుషుడు భగవాను నుద్దేశించి అడిగాడు.

3. "భగవానుని కొన్ని ప్రశ్నలడగడానికి వచ్చిన వాడినై అడుగుతున్నాను. ఓ గౌతముడా! పతనానికి గురయ్యే మనిషిని గురించి చెప్పండని ప్రార్థిస్తున్నాను. మనిషి దిగజారి పోవడానికి కారణం ఏమిటో చెప్పండి" మనిషి దిగజారి పోవడానికి కారణాలు వివరించడానికి భగవానుడు అంగీకరించాడు.

4. "పురోగమిస్తున్నవాడిని, తిరోగమిస్తున్నవాడిని సులభంగా తెలుసుకోవచ్చు. ధర్మాన్ని ప్రేమించేవాడు పురోగమిస్తాడు. ధర్మాన్ని ద్వేషించేవాడు తిరోగమిస్తాడు.

5. "దుష్టులు అతనికి ప్రీతి పాత్రులవుతారు. సత్పురుషుల్లో తనకు ప్రీతి పాత్రమైనదేదీ కనిపించదు. దుష్టుల అభిమతాలనే అతడు అభిమానిస్తాడు. ఇది మనిషి పతనానికి రెండవ కారణం.

6. "నిద్రమత్తులో ఉండేవాడు సహవాసలోలుడు, కష్టించడానికి వెనుదీసేవాడు, సోమరిపోతు, కోపిష్టి పతనం చెందుతాడు. ఇది పతనానికి మూడవ కారణం.

7. "సంపద ఉన్నా వృద్ధాప్యంలో ఉన్న తల్లిదండ్రుల ఆలన పాలన చూడనివాడు యవ్వనాన్ని గడిపేవాడు కూడ పతన మవుతాడు. పతనానికి ఇది నాలుగవ కారణం.

8. "తన మూర్ఖత్వం ద్వారా సాధువుల్ని, సన్యాసుల్ని ఇతర సత్పురుషుల్ని బాధపెట్టే వాడికి పతనం తప్పదు. ఇది పతనానికి ఐదవ కారణం.

9. "తనకు సంపద, బంగారం, ఆహారం పుష్కలంగా ఉండి, తన భాగాల్ని ఒంటరిగా అనుభవించడం పతనానికి ఆరవ కారణం.

10. "మనిషి తను పుట్టిన పరిస్థితుల వల్లగాని, సంపదలవల్లగాని గర్వంతో కన్ను మిన్ను

గానక తన బంధువులను సైతం చులకన చేయడం అతని పతనానికి ఏడవ కారణం.

11. "మనిషి వ్యభిచారి, తాగుబోతు, జూదరి అయి తను సంపాదించుకున్నదంతా దుబారా చెయ్యడం పతనానికి దారి తీస్తుంది. ఇది పతనానికి ఎనిమిదవ కారణం.

12. "తన భార్యతో సంతృప్తి చెందక వేశ్యల కోసం, ఇతరుల భార్యల కోసం వెంపర్లాడడం మనిషి పతనానికి తొమ్మిదవ కారణం.

13. "విచ్చల విడిగా ఖర్చుచేసే స్త్రీకి గాని, అలాంటి స్వభావమే కలిగిన పురుషునికి గాని పెత్తనం ఇవ్వడం, పతనానికి పదకొండవ కారణం.

14. "స్వల్పంగా శక్తి యుక్తులున్న ఒక క్షత్రియ కులస్తుడు అధికార కాంక్షతో మహారాజు కావాలను కోవటం మనిషి పతనానికి పన్నెండో కారణం.

15. ``దివ్య పురుషుడా! ఈ పతన కారణాలు తెలుసుకో, వీటిని అధిగమించ గలిగితే నీవు సురక్షితంగా ఉండగలవు."

## 2. దుర్మార్గుడు

1. బుద్ధభగవానుడు భిక్షువులతో సహా ప్రయాణం చేస్తున్నప్పుడు యధావిధిగా భిక్షువులను ఉద్దేశించి ఈ క్రింది ప్రసంగం చేశాడు.

2. భిక్షువుల వుద్దేశించి "దుర్మార్గుని ఏవిధంగా గుర్తించాలో తెలుసా" అని బుద్ధ భగవానుడు ప్రశ్నించాడు. భిక్షుకులు తెలియదని సమాధానమిచ్చారు.

3. "దుర్మార్గుని లక్షణాలు మీకు చెబుతాను."

4. "అడగకపోయినా ఎదుటి మనిషిలో లోపాలను చెప్పే మనిషి ఉన్నాడనుకోండి. అలాంటి వాడ్ని ఇక అడగాలా! నిజంగా అడిగితే చాలు ఎలాంటి జంకు గొంకు లేకుండా ఉన్నదీ లేనిదీ ఎదుటివారి అవలక్షణాల గురించి పూస గుచ్చినట్లు చెబుతాడు. సోదరులారా! అలాంటి మనిషేదుర్మార్గుడు.

5. "ఒక మనిషిని అడిగినా ఎదుటి వారిలోని మంచి గుణాలను చెప్పడు. అడగకపోతే ఎలాగూ చెప్పడు. ఇక గుచ్చి గుచ్చి అడిగినప్పుడు మాత్రం ఎదుటి వారి మంచి లక్షణాలు చెపుతాడు.

6. ఒక మనిషి అడిగినా తనలోని అవ లక్షణాలను బయటపెట్టడు. అడగకపోతే సరి. ఇక గుచ్చి గుచ్చి అడిగినప్పుడు తన అవలక్షణాలు చెపుతాడు గాని వివరాల్ని దాటవేసి మరుగుపరుస్తాడు. భిక్షు -సోదరులారా అలాంటి వాడు దుర్మార్గుడు.

7. ఇక్కడ ఇంకో మనిషి అడగకపోయినా తన సద్గుణాలను ఏకరువు పెడతాడు. అడిగితే

ఇక చెప్పనే అవసరం లేదు. వత్తిడి చేసి అడిగితే తన సద్గుణాలను ఎంతో వివరంగా ఏమీ దాచకుండా, దాట వెయ్యకుండా చెపుతాడు. సోదరులారా, అలాంటి వాడు దుష్టుడు.

## 3. ఉత్తముడు

1. బుద్ధ భగవానుడు బిక్షుకులతో సహా ప్రయాణం చేస్తున్నప్పుడు ఎప్పటిలాగే వారితో ఈ ప్రసంగం చేశాడు.

2. భిక్షువులనుద్దేశించి ``ప్రపంచంలో మనకు నాలుగు రకాలైన వ్యక్తులు కనిపిస్తారు" అన్నాడు.

3. ``తన కోసం గాని ఎదుటి వాళ్ళ కోసం గాని ఏమీ చెయ్యలేని వాడు, పరుల క్షేమం కోసం ఏమైనా చేస్తూ తన కోసం తానేమీ చేసుకోనివాడు, తన కోసం తాను ఏమైనా చేసుకుంటూ, పరుల కోసం ఏమీ చెయ్యనివాడు, తన కోసం, పరుల కోసం కూడ పాటుపడే వాడు ఇలా నాలుగు రకాలుగా ఉంటారు."

4. ``తన కోసం, పరుల కోసం కూడ పాటు పడని వాడు, మధ్య పేడ పూసి రెండు వైపుల కాలుతున్న చితిలోని కర్రలాంటి వాడు. ప్రపంచానికి వ్యర్థుడు అంతేగాదు తనకి తానే వ్యర్థుడు.

5. తన మేలుని లెక్కచెయ్యక పరుల కోసం పాటు పడేవాడు ప్రశస్తుడు శ్రేష్ఠుడు.: శ్రేష్ఠుడు.

6. ఇక తన మేలు, పరుల మేలు కోసం పాటు పడేవాడు - ఆ నలుగురు వ్యక్తుల్లోను ఉత్తముడు, ముఖ్యుడు, అగ్రస్థానాననిలిచే సర్వోత్కృష్టుడు.

## బోధిసత్వుడు

1. ఒక సందర్భంలో బుద్ధభగవానుడు ఉద్దద - సౌతవ్య పట్టణాలమధ్య నున్న ప్రధాన రహదారి చేరుకున్నాడు. ద్రోణుడు అనే బ్రాహ్మణుడు కూడ అదే సమయంలో ఆ రహదారికి చేరుకున్నాడు.

2. కొద్దిసేపటికి భగవానుడు రోడ్డు విడిచి పక్కనే ఉన్న చెట్టు కింద పద్మాసనంలో కూర్చున్నాడు. బ్రాహ్మణుడైన ద్రోణుడు ఆయనను అనుసరించాడు. చెట్టు పాద పీఠాన తేజోమూర్తియై, మనోహరరూపుడై, సర్వేంద్రియాల్ని నియంత్రణ చేసుకుని చల్లని మనస్సుతో, మహా సాధువై శక్తి సంపన్నుడై ఉన్న ఆ మహానుభావుని సమీపించాడు ద్రోణుడు.

3. సమీపించి ఆయననుద్దేశించి అన్నాడు. "భగవానుడు దేవతా కోటిలో వారా? "బ్రాహ్మణుడా ! నేను దేవగణానికి చెందను" "మీరు మరి గంధర్వులా!

"బ్రాహ్మణుడా! నేను వాస్తవానికి గంధర్వుడిని కాను "అయితే మరి మీరు యక్షులా?" "బ్రాహ్మణుడా ! నేను వాస్తవానికి యక్షుడను కాను" ``అయినప్పుడు మరి మీరు మానవులా?" ``బ్రాహ్మణుడా ! నేను వాస్తవానికి మనిషిని కాను"

4. భగవానుని సమాధానం విని బ్రాహ్మణుడైన ద్రోణుడు అన్నాడు ``మీరు దేవతలా అంటే కాదన్నారు" ``తర్వాత మీరు గంధర్వులా అని ప్రశ్నించాను. కాదన్నారు" ``దాంతో మీరు యక్షులా అని అడిగాని అదీ కాదన్నారు" ``అయితే మరి మీరు మనిషా అని అడిగాను. మనిషిని కూడ కానన్నారు. అలాగయితే మహానుభావా! మీరెవరు?"

5. బ్రాహ్మణుడా ! అన్ని వ్యసనాలను నేను పరిహరించ నంతవరకు నేను దేవతను గంధర్వుడిని యక్షుడ్ని, మనిషిని, తాళ వృక్షపు వేళ్ళు ఛేదించి తిరిగి మొలకరాకుండా మూలాన్నే మట్టు పెట్టినట్లు నేను యీ వ్యసనాలు మళ్ళీ తలెత్తకుండా పరిత్యజించాను.

6. ``తామర లేదా కలువ పూవు నీటిలో మొగ్గతొడిగి, నీటిలోనే విరిసి నీటిలోనే ఉన్నా నీరంట నట్లు ఈ ప్రపంచంతో పుట్టి ఈ ప్రపంచంలో పెరిగి ముందు సాగినా ప్రాపంచిక బంధాలు నన్నంటవు.

7. ``అందుచేత ఓ బ్రాహ్మణుడా! నన్ను బోధిసత్వునిగా గ్రహించు"

## 5. ధర్మాత్ముడు సజ్జనుడు

1. సహచరులనుద్దేశించి ప్రసంగిస్తూ బుద్ధ భగవానుడు అన్నాడు."ఎవరు ధర్మాత్ములు, ఉత్తములు తెలుసుకోవాలంటే నాలుగు రకాల వ్యక్తుల్ని మీరు వివేచించడం నేర్చుకోవాలి.

2. ``సహచరులారా ! ఒక తరగతి వ్యక్తులున్నారు. వారు తమ సుఖం కోసమే తప్ప ఎదుటి వాళ్ళకోసం ఏమీ చేయరు"

3. ``ఒకడు తనలోని వాంఛల్ని అణుచుకుంటారు. అంతేగాని ఎదుటి వాళ్ళలోని వాంఛను జయించాలని మాత్రం చెప్పడు తనలో తలెత్తే అపకార బుద్ధిని తుడిచి పెట్టే ప్రయత్నం చేస్తాడు. కాని ఎదుటి వారిలో దానిని తుడిచి పెట్టుకోవాలని కోరడు. తనలోని అజ్ఞానాన్ని తొలగించు కొమ్మని కోరడు.

4. ``సహచరులారా! ఇతడు తన సుఖమే చూసుకుంటాడు గాని ఎదుటి వాళ్ళ సుఖాన్ని చూడడు."

5. ``కాని ఒక తరగతివాళ్ళు తమ సుఖాల్ని త్యజించి ఇతరుల సుఖం కోసం పాటు పడతారు."

6. "ఈ తత్వం మనిషి తనలోని కామం, అపకార బుద్ధిని, అజ్ఞానం పరిహరించుకునే

ప్రయత్నం చెయ్యడు. కాని వాటిని పరిహరించు కోవలసిందిగా యితరులను వుద్బోధిస్తాడు.

7. వాస్తవంగా ఇతడు ఎదుటి వాళ్ళ కోసం పాటు పడేవాడే తప్ప తన కోసం ఆలోచించడు.

8. ఇంకో తరగతి వ్యక్తులున్నారు. వారు ఎదుటి వాళ్ళ మేలు కొరకు గాని తమ మేలు కొరకు గాని యత్నించరు.

9. ఈ తత్వం మనిషి తనలోని కామం, అపకారగుణం, అజ్ఞానం పరిహరించే యత్నం చెయ్యడు. ఇతరులను ఆపని చెయ్యమని కోరడు.

10. ఇతడు తన క్షేమం కోసం పాటుపడడు. ఎదుటి వాళ్ళ క్షేమం కోసం పాటు పడతాడు.

11. ఇంకొక తరగతికి చెందిన వ్యక్తులున్నారు. వాళ్ళు తమ క్షేమం కోసం ఎదుటి వాళ్ళ క్షేమం కోసం కూడ పాటు పడతారు.

12. ఈ వ్యక్తి తనలోని కామం, అపకారబుద్ధి, ఆజ్ఞానం పరిహరించే సాధన చేయడమే కాదు, ఎదుటివాళ్ళలో కూడ వాటి నిర్మూలనకు పూనుకుంటాడు.

13. తన క్షేమం కోసమే గాక ఎదుటి వాళ్ళ క్షేమం కోసం కూడ పాటు పడేది ఈ వ్యక్తి మాత్రమే.

14. ఈ చివరి వ్యక్తిని ధర్మాత్ముడిగా, సజ్జనుడిగా గుర్తించవలసి ఉంటుంది.

# 6. మంచి పనులు చేయవలసిన అవసరం

1. ఒక సందర్భంలో బుద్ధ భగవానుడు తన సహచర భిక్షువుల నుద్దేశించి ప్రసంగించాడు.

2. సోదరులారా! మంచి పనులకి వెరవకండి. ఈ "మంచి పనులు" సంతోషానికి, లక్షించిన దానికి; ప్రియమూ, ప్రీతి పాత్రమూ, ఆహ్లాదకరమూ అయిన దానికి మరో పేరు. ఇట్లా కోరుకున్నదీ, ప్రియమూ, ప్రీతి పాత్రమూ, ఆహ్లాదకరమూ అయిన మంచి పనుల వల్ల సత్ఫలితం కొల్లలుగా పొందినదానికి నేను తార్కాణంగా వున్నాను.

3. ఏ కార్యాలు ఈ ఫలితాన్నిస్తున్నాయి? నేను సంతోషంగా సంతృప్తిగా ఉండడానికి ఏ మంచి కార్యాలు పక్వం అవుతున్నాయి అని నేను అనుకుంటూ ఉంటాను.

4. "దాతృత్వం, ఆత్మ సంయమనం ఆత్మ నియంత్రణం ఈ మూడు కార్యాల పర్యవసానంగా ఈ ఫలితం లభ్యమవుతున్నదనే సమాధానం నాకు వస్తుంది.

5. "యోగ్యులకు దానమిచ్చిందే శుభవేళ, సుదినం! మంచిపనులు, మంచిమాటలు, మంచి ఆలోచనలు అలవడి సత్కామితాలు కోరినవాళ్ళకి శుభం లాభం కలిగినప్పుడే శోభస్కరమూ, ఆనందకరమూ, దివ్యమూ అయిన సుప్రభాతం!

6. "అలాంటి శుభం, లాభం, పొందిన వారే సుఖులు, జీవన పథంలో సంపన్నులు. మీరు కూడ మీ వాళ్లతో కలిసి సుఖులూ, జీవన పథంలో సంపన్నులూ కండి"

# 7. మంచి తీర్మానాలు చేసుకోవలసిన అవసరం

1. ఒకప్పుడు శ్రావస్తిలోని వనంలో ఉన్నప్పుడు భగవానుడు తన సహచర భిక్షువులనుద్దేశించి ఇలా చెప్పాడు.

2. "సహచరులారా! మంచి తీర్మానాలు చేసుకోవడం, వాటిని ఆచరించడం అనేది నిష్కల్మషమైన, సుఖవంతమైన జీవితానికి గొప్ప అవసరం.

3. "ఎలాంటి తీర్మానాలు చేసుకోవాలో నేను చెబుతాను"

4. "నా జీవిత పర్యంతం నా తల్లి దండ్రులకు అండగ నిలబడతాను. నా కుటుంబ పెద్దను నేను గౌరవిస్తాను. నేను మర్యాదగా మాట్లాడతాను. చెడు మాటలు మాట్లాడను. హృదయంలో స్వార్థమనే మచ్చను ప్రక్షాళన చేసుకుంటాను. నానుంచి ఎవరైనా ఒక కానుక కోరడానికి అర్హుడిగా వుదారంగా, స్వచ్ఛంగా నాయింట్లో జీవిస్తూ, ఇచ్చి వెయ్యటంలో లేదా కలిసి అనుభవించటంలో ఆనందిస్తూ వుంటాను.

5. ``నా జీవిత పర్యంతం క్రోధ రహితునిగా ఉంటాను. ఒక వేళ క్రోధం తలెత్తితే వెంటనే దాన్ని అదుపు చేసుకుంటాను.

6. ``అవీ ఏడు తీర్మానాలు. సహచరులారా! వాటిని సంకల్పించి, ఆచరించడంవల్ల స్వచ్ఛతా; సౌఖ్యమూ కలస్థితికి చేరతారు.

## మూడవ విభాగం

# ధర్మంపై ఉపదేశాలు

1. ఒకసారి బుద్ధ భగవానుడు భిక్షుక గణం వెంటరాగా కోసలలో భిక్షాటన చేస్తూ సాల అనే బ్రాహ్మణ గ్రామం చేరుకున్నాడు.

2. కోసలలో భిక్షాటన కోసం తమ గ్రామానికి భగవానుడు వచ్చాడన్నవార్త ఆ గ్రామంలోని బ్రాహ్మణ కుటుంబ పెద్దల చెవిని బడింది.

3. వెళ్ళి ఆ భగవానుని దర్శించు కోవడం మంచిదని వారు భావించారు. అంతే సాల బ్రాహ్మణులు భగవానుని సమీపించారు. గౌరవాభివందనాలర్పించి ఆయన పక్కగా ఆసీనులయ్యారు.

4. ధర్మమంటే ఏమిటో వివరించమని వారు భగవానుని కోరారు.

5. శ్రద్ధగా వింటున్న బ్రాహ్మణులనుద్దేశించి భగవానుడు చెప్పనారంభించాడు. "దేహానికి సంబంధించిన అధర్మ, దౌష్ట్య క్రియలు మూడున్నాయి. మరి నాలుగు క్రియలు వాక్కుకు సంబంధించినవి, మూడు క్రియలు ఆలోచనలకు సంబధించినవి"

6. "శారీరకమైన అధర్మానికి సంబంధించినంత మటుకు మనిషి (1)జీవ జంతువులను నిర్దాక్షిణ్యంగా వేటాడి చంపటం (2) గ్రామంలోని, అడవి లోని ప్రజలకు చెందిన వాటిని దొంగతనంగా తస్కరించి సొంతం చేసుకోవటం (3) బంధువుల, తల్లుల, తండ్రుల, అన్నల, అక్కల, మీద అధారపడిన ఆడపిల్లలకు నిశ్చితార్థం చేసి మెడలో పూలదండవేసికొన్న. ఆడ పిల్లలకు కూడ మానహాని తలపెట్టడం... ఈ మూడు దేహానికి సంబంధించిన మూడు అధర్మ. దౌష్ట్యా క్రియలు.

7. "వాక్కుకు సంబంధించినంత మటుకు మనిషి (1)అబద్ధాల కోరుకావచ్చు పెద్దల సభలోగాని, గ్రామ సమావేశంలోగాని, కుటుంబ చర్చల్లోగానీ సాక్ష్యం పలికేటప్పుడు తెలియనివి తెలిసినట్లు, తెలిసింది తెలియనట్లు, చూడనిది చూసినట్లు, చూసింది చూడనటు, తనకోసమో పరుల కోసమో కావాలని పనికి మాలిన అబద్ధాలు చెప్పేవాడు, లేదా (ii) చాడీకోరు కావచ్చు. ఇక్కడ విన్నది మరొక చోట, ఎక్కడో విన్నది ఇక్కడ తిప్పి చెపుతూ జన వర్గాల మధ్య సామరస్యం చెరుపుతాడు. ఘర్షణ రేపుతాడు. వైషమ్యం అతనితో మాట్లాడిస్తుంది. వైషమ్యమే అతనికి వినోదం, సంతోషం, ఆనందం, లేదా.(iii)అతడు నోటి దురుసు గలవాడు కావచ్చు. తన పరుషమైన, దుస్సహమైన మాటతీరుతో ఎదుటి వారిని గాయపరచవచ్చు. వారిలో క్రోధాన్ని రెచ్చ గొట్టవచ్చు లేదా (iv) అతడు అసందర్భంగా వాగేవాడు కావచ్చు. నిజాన్ని లక్ష్యపెట్టకుండా ఎప్పుడూ నిష్ప్రయోజకరమైన మాటలే మాట్లాడుతాడు. సిద్ధాంతం నియతి గురించి కాక ఏమీ

కొరగాని అల్పవిషయాల గూర్చి సమయం సందర్భం లేకుండా వదురుతాడు.

8. "అధర్మ పరమైన ఆలోచనల విషయానికొస్తే మనిషి(i)దురాశాపీడితుడు అయి ఉండవచ్చు. ఎదుటి వాళ్ళ సొత్తు తనకే చెందాలనే దురాశాపరుడయి ఉండవచ్చు. లేదా (ii) తన చుట్టూఉన్న ప్రాణులు చావాలని, ధ్వంసం కావాలని, తుడిచి పెట్టుకు పోవాలన్న దురాలోచన కలిగినవాడై ఉండవచ్చు. లేదా (iii)అతని దృక్పథం తప్పుగా, వూహలు పొరపాటుగా వుండవచ్చు. భిక్షులు, బలులు, నైవేద్యాలు వంటివేమీ లేవని, మంచి చెడు కార్యాలకు పర్యవసానం, ఫలితం అంటూ ఏమీ ఉండవని, యీ లోకం పరలోకం ఏమీ లేవని, తల్లి దండ్రులు బంధువులంటూ ఎవరూ లేరని, తమ ఋజు మార్గవర్తనం ద్వారా యీలోకం, యితర లోకాల్ని గహనం చేసుకున్న బ్రాహ్మణులు. తాపసులు ఆవైనం పరులకి ప్రకటించి వున్న సంగతి వట్టిదని వీరు భావిస్తారు.

9. "వీటికి ప్రతిగా ధర్మ పరత్వానికి, మంచి తనానికి సంబంధించి శారీరకమైన మూడు పద్ధతులున్నాయి. వాక్కులో ధర్మ పరత్వానికి నాలుగు, ఆలోచనల్లో ధర్మపరతకు మూడు పద్ధతులు ఉన్నాయి.

10. "శారీరకంగా ధర్మ పరత్వానికి సంబంధించి చూస్తే, మనిషి చంపడం మానివేయడం, ఖడ్గం. కర్రదూరంగా విసిరేసి అన్ని జీవుల పట్లా జాలి, కారుణ్యం, అమాయకత్వంతో జీవించడం ii ఎదుటి వాళ్ళ నుంచి తనకు న్యాయంగా లభించింది తప్ప దొంగతనంగా తీసుకోవడం లేకుండా నిజాయితీగా జీవించడం iii ఇంద్రియ లోలత నిగ్రించి, తాను కామ క్రియ నుంచి విరమించటం, తన తల్లి, తండ్రి సోదరీ, సోదరులు, బంధువుల పోషణలో వున్న ఆడపిల్లతో, నిశ్చితార్థం అయి మెడలో దండలు ధరించిన ఆడ పిల్లలతో కామ కలాపం జరపక పోవడం.

11. "వాక్కు విషయకంగా ధర్మ ప్రవర్తన అంటే! మనిషి అబద్ధాలకు దూరంగా ఉండి అబద్ధమాడే అలవాటు మాను కోవడం పెద్దల సభలో గాని గ్రామ సభలో గాని, కుటుంబ సమావేశంలో గాని. రాజ గృహంలో గాని రాజు స్థానంలో గాని సాక్ష్యం చెప్పవలసి వచ్చినప్పుడు తెలియనిది తెలియదని, తెలిసింది తెలుసునని చెప్పడం, చూడనిదాన్ని చూడలేదని. చూసింది చూశానని చెప్పడం. తన కోసమో తోటి వారి కోసమో కావాలని అబద్ధాలు చెప్పక వాటికి దూరంగా ఉండడం. ii అపనిందలు వెయ్యకుండా వాటికి తాను దూరంగా వుండడం ఒకచోట తాను విన్నది మరోచోట మరొకరంగా చెప్పి ఇక్కడి వారికి అక్కడి వారికి కలహాలు పెట్టక సామరస్యాన్ని స్నేహసౌభ్రాతృత్వాన్ని పెంపొందించి కాఠిన్యం ఉండక నిష్ఠురమైన మాటలు మాట్లాడకపోవడం అతను అన్నదాంట్లో చేదు మాట లేకుండా అందరికీ హాయిగా స్నేహంగా, హార్దికంగా, మర్యాదగా, అంగీకార యోగ్యంగా, ఆమోద యోగ్యంగా ఉండడం iii నోటికి వచ్చినట్లు వదరకుండా సందర్భోచితంగా వాస్తవాన్ని మాట్లాడడం సిద్ధాంతం ప్రకారం నియమాను సారం మాట్లాడడం సందర్భోచితంగా, గుర్తుంచుకోదగిన విధంగా విజ్ఞాన దాయకంగా పరమ ప్రయోజన కరంగా ప్రసంగించటం.

12. "ఆలోచనల్లో ధర్మ పరాయణత్వానికి సంబంధించి మనిషి దురాశకి దూరంగా ఉండడం. ఇతరులు దయదలచి ఇచ్చేవి చాలక వారి వన్నీ తనకే కావాలన్న లాభం వర్జించటం. అపకార బుద్ధి, దుష్టబుద్ధి తన దరికి చేరనీయక పోవటం, తన చుట్టూ వున్న ప్రాణులన్నీ సుఖశాంతులతో పగ,పీడనల నుంచి సురక్షితంగా వుండాలని అతను కోరతాడు ! ! అతని దృక్పథం, వూహలు ధర్మ బద్ధంగా వుంటాయి.

13. ``ఇదీ నా దృష్టిలో ధర్మపరత అధర్మపరత అంటె"

# 2. ధర్మం ఆవశ్యకత

1. పాటలీ గ్రామానికి చెందిన పామరులనుద్దేశించి బుద్ధుడు ఈ విధంగా అన్నాడు.

2. "నీతి లేని దుష్టుడు నష్టాల పాలవుతాడు, గృహస్థులారా!"

3. "సోమరిపోతు కావడం వల్ల అతడి సంపదంతా పోతుంది"

4. "తర్వాత అతడి పాపకార్యాలు ప్రపంచానికి తెలిసి అందరి దృష్టిలో అతడు చులకనైపోతాడు."

5. గొప్పవారి మధ్యకు బ్రాహ్మణుల మధ్యకు లేదా పెద్దవారి మధ్యకు సన్యాసుల మధ్యకు సిగ్గుగా అయోమయంగా వెళ్ళవలసి వస్తుంది. నిర్భయంగా వెళ్ళలేడు. అది మూడవ నష్టం.

6. "తర్వాత అతడికి మనశ్శాంతి ఉండదు. చనిపోయేటప్పుడు అతడ్ని ఈ మానసిక అశాంతి పీడిస్తుంది. ఇది నాలుగవ నష్టం.

7. గృహస్థులారా! పాపిష్టి నీతిమాలిన వాడు ఆ విధంగా నష్టపోతాడు.

8. "సాధు మార్గంలో జీవించే ధర్మవర్తనునికి కలిగే ప్రయోజనాలు పరిశీలించండి."

9. "సాధుమార్గంలో జీవించే ధర్మ వర్తనుడికి తన విశేషకృషి వల్ల అశేష సంపద చేకూరుతుంది.

10. "తద్వారా అతని పట్ల అందరికీ సదభిప్రాయం ప్రబలుతుంది. ప్రతి ఒక్కరి చేత అతడు గౌరవించబడతాడు.

11 సభలోకి వెళ్ళినా బ్రాహ్మణుల మధ్యకు గొప్పవాళ్ళ మధ్యకు ఇంటి పెద్దల మధ్యకు సన్యాసుల మధ్యకు గాని అతడు ధైర్యంగా, ఆత్మ విశ్వాసంతో వెళ్ళగలడు."

12. "అతనికి మనశ్శాంతి ఉంటుంది. అవసానదశలో ప్రశాంత చిత్తుడవుతాడు."

13. "కీడు చెయ్యటంలో తప్పేమిటో మూర్ఖుడికి తెలియదు. తను చేసిన పనుల వల్లే తాను దహించుకుపోతాడు."

14. హాని చేయని అమాయకులను బాధ పెట్టేవాడు శీఘ్రంగా గొప్ప దౌర్భాగ్యానికి గురవుతాడు. మతి చెడిపోయి, బంధువులకు దూరమై తన యావత్తు సంపదా కోల్పోతాడు.

## 3. ధర్మపరత, ప్రాపంచిక బాధ్యతలు.

1. ఒకప్పుడు బుద్ధ భగవానుడు రాజగ్రహలోని ఉడుతలను మేపే వెదురు వనంలో నివసిస్తున్నాడు. ఆ సందర్భంలో పూజ్యుడైన సారిపుత్రుడు దక్షిణకొండల్లో తన సహచర భిక్షుక సమూహంలో కలిసి భిక్షాటన చేస్తున్నాడు.

2. అతడు తన మార్గంలో వస్తూ వర్షాకాలంలో రాజగ్రహంలో గడిపిన భిక్షకుని కలిశాడు. స్నేహ పురస్సర గౌరవ మర్యాదలు పరస్పరం ఇచ్చి పుచ్చుకున్న తర్వాత సారిపుత్రుడు రాజ గ్రహంలోని భగవానుని యోగక్షేమాల్ని భిక్షుకుని అడిగి ఆయన క్షేమంగా ఉన్నట్లు తెలుసుకున్నారు. అలాంటి సౌభాతృ భావంతో అక్కడే తండుల పాల ద్వారం వద్ద నివసించే బ్రాహ్మణుడు ధనంజని యోగ క్షేమాలను గురించి కూడ సారిపుత్రుడు విచారించాడు.

3. "బ్రాహ్మణుడైన ధనంజని ఉత్సాహంగా గౌరవంగా ఉంటున్నాడా?" అని సారిపుత్రుడు ఆ భిక్షుకుని అడిగాడు."

4. "ధనంజనిలో గౌరవం ఉత్సాహం ఉండడం ఎలా సాధ్యం?" అని బదులు చెప్పాడు భిక్షకుడు. "అతడు బ్రాహ్మణులు ఇతర గృహస్థులపై రాజుకు ఏవో చెప్పి వారి పైకి రాజును ఉసి గొల్పుతారు. వారిని తిరిగి రాజు పైకి వుసిగొల్పుతాడు అంతే కాదు ఒక పునీత వంశానికి చెందిన పునీతురాలు అయిన భార్య చనిపోయింది. తర్వాత పునీత వంశానికి చెందని పునీతురాలు కాని మరొక భార్యను తెచ్చుకున్నాడు."

5. "ధనంజని ఉత్సాహ రాహిత్యానికి సంబంధించిన ఈ వార్త చాలా చెడు వార్త......" అన్నాడు. సారి పుత్రుడు. "కాని ఎప్పుడైనా ఎక్కడైనా అతడు తటస్థపడితే నేను తప్పకుండా కలిసి మాట్లాడతాను."

6. "తర్వాత తన కిష్టమైనంత కాలం దక్షిణ కొండ ప్రాంతంలో గడిపి సారిపుత్రుడు రాజగ్రహం వైపుగా భిక్షాయాత్ర సాగించాడు. అక్కడికి చేరుకుని వెదురు వనంలో విశ్రమించాడు.

7. ప్రాతః కాలాన్నే కాషాయ వస్త్రాలు వేసుకుని భిక్షపాత్ర చేతబూని రాజగ్రహలో భిక్ష కోసం వెళ్ళాడు. ఆ సమయంలో ధనంజని నగరం వెలుపల ఉన్న తన ఆవులను చూసి పాలు పితుక్కొని రావడానికి వెళ్ళి ఉన్నాడు.

8. భిక్షాటన నుండి తిరిగి వచ్చి భోజనం చేసిన తర్వాత సారిపుత్రుడు బ్రాహ్మణుని జాడ

గురించి అడిగాడు. దారిలోనే బ్రాహ్మణుడు సారిపుత్రుని కలుసుకున్నాడు. ఇంటికి వెళ్లిన తర్వాత భోజనానికి సమయం ఉంది కాబట్టి తత్పూర్వం పాలు తాగుదామన్నాడు ధనంజని.

9. "వద్దు బ్రాహ్మణుడా! నేను ఈ పూట భోజనం పూర్తి చేసాను ఆ చెట్టునీడన మధ్యాహ్నపు టాయాసం తీర్చుకుంటాను నీవు అక్కడికి నాతోరా!"

10. ధనంజని అందుకు అంగీకరించి, తాను భోజనం చేసి సారిపుత్రుని దగ్గరకు చేరి స్నేహపూర్వకంగా పరామర్శించి పక్కనే కూర్చున్నాడు.

11. సారి పుత్రుడు అన్నాడు "ధనంజనీ! నీవు గౌరవంగా ధర్మపరాయణుడిగా ఉన్నావని విశ్వసించనా!"

12. "అదెలా సాధ్యమవుతుంది! నా తల్లిదండ్రులను భార్యాపిల్లలకు, సంసారాన్ని స్నేహితులను, సన్నిహితులను, అతిథులను పోషించి సహకరించ వలసి వుంది. చనిపోయిన నా బంధువులకు తర్పణం పెట్టాల్సి వుంది. దేవతలకు నైవేద్యం సమర్పించవలసి ఉంది. రాజుకు సేవలు చేయవలసి ఉంది. ఇవి గాక నా కోసం నేను మద్యం, మాంసాహారం సమకూర్చుకోవలసి ఉంది గదా!"

13. "ధనంజనీ నీ ఉద్దేశమేమిటి? ఉదాహరణకు ఒక మనిషి ధర్మ మార్గం న్యాయ మార్గం తప్పినపుడు నిలదీస్తే అతడు తన తప్పిదాలను తల్లి దండ్రుల కోసం చేశానని అందుకే న్యాయ ధర్మ మార్గాన్ని తప్పి ప్రవర్తించానని విన్నవించుకుంటే వదిలేస్తారా?"

14. "లేదు ఎన్ని విజ్ఞప్తులు చేసినా తప్పకుండా కారాగారంలో వేసి శిక్షిస్తారు."

15. "తన కోసం న్యాయ ధర్మ మార్గం తప్పినానని అతను మా కోసమే ధర్మ మార్గం తప్పి ప్రవర్తించాడని భార్య, పిల్లలు విన్నవించుకొనే అవకాశం ఉందా?"

16. "లేదు"

17. "అతడలా తమ కోసమే చేశాడని అతని పరిచారక జనం అతని పక్షాన వాదిస్తారా?"

18. "ఏ మాత్రం వాదించరు"

19. "లేదా పరిచయస్తులు, స్నేహితులు అతని కోసం వాదిస్తారా!"

20. "అసలు వాదించరు"

21. "లేదా చుట్టపక్కాలు, అతిథులు అతని తరపున వాదిస్తారా?"

22. "ససేమిరా వాదించరు"

23. "లేదా దైవ రాజ లాంఛనాల గురించి అతని తరపున వాదిస్తారా?"

24. "ఏ మాత్రం వాదించరు"

25. "న్యాయ ధర్మ వర్తనను మద్యపానం మాంస భక్షణం కోసం తప్పానని తన పక్షాన తాను కాని తన తరపున ఇతరులు గాని మద్ధతుగా వాదిస్తారా?"

26. "లేదు."

27. "నీ ఉద్దేశమేమిటి ధనంజనీ! ఎవరు ఉత్తమ మానవుడు! తల్లి దండ్రుల కోసమని న్యాయ ధర్మ పధాన్ని వదులుకునే వాడా, లేక ఎవరికి ఏమి జరిగినా చలించక తన ధర్మ పథాన్ని వదలని వాడా?"

28. "రెండవ వాడే ధర్మ న్యాయ మార్గం తప్పడం కన్నా వాటిని అనుసరించడమే ఉత్తమం" అని ధనంజని సమాధానం చెప్పాడు.

29. "అదీ కాక ధనంజనీ పాప కార్యాలు చెయ్యకుండా తలెత్తుకు నడుస్తూ కూడ వృద్ధ మాతాపితరులను పోషించే మార్గాలు వేరే వున్నాయి. అట్లాగే భార్యా బిడ్డలు తదితరుల విషయం కూడా కదా?"

30. "అవును అంతే సారిపుత్రా" ధనంజని సమాధానం చెప్పాడు.

31. ఆ తర్వాత బ్రాహ్మణుడు ధనంజని పూజ్యుడు సారిపుత్రుడు చెప్పిన దానికి ఆనందించి, కృతజ్ఞతలు చెప్పుకుని లేచి తన దారిని తాను వెళ్ళిపోయాడు.

## 4. ధర్మ వర్తనలో పరిపూర్ణత సాధించడమెలా?

1. ఒకప్పుడు బుద్ధ భగవానుడు శ్రావస్తిలోని జిత వనంలో నివసిస్తూండగా ఆయన దగ్గరకు సుమారు 500 మంది పామర శిష్యగణం వచ్చారు. వారిలో ఒకరు ధార్మికుడు.

2. ధార్మికుడు భగవానుని అడిగాడు"ధర్మవర్తనలో పరిపూర్ణత సాధించాలంటే మీ అనుయాయులు పాటించవలసిన సూత్రమేమిటి?

3. "ఈ ప్రశ్నే మిమ్మల్ని ఎందుకడుగుతున్నానంటే మీరు మానవ సంక్షేమాన్ని కాంక్షించి సాటిలేని విధంగా ప్రబోధిస్తున్న ధర్మమూర్తి కాబట్టి"

4. "సుశిక్షితులైన జైనులు, సన్యాసులు అందరూ మిమ్మల్ని జయించడంలో విఫలమయ్యారు. ఎంతో కాలంగా శిక్షితులై పరిణితి వున్న బ్రాహ్మణులు ఎంతో మంది అనుయాయులు వుండి కూడ మీ సత్యబోధ రక్షణ కోరారు. కాని అన్ని వేదనలను పోగొట్ట గలిగే మీ ప్రబోధాన్ని అనుగ్రహించి ఒక సమాధానం మాకు చెప్పండి ప్రభూ!

5. "ఈ పామర శిష్యులకు మీ నోటి నుంచి ఆ నిష్కల్మమైన జ్ఞానాన్ని తెలియనివ్వండి"

6. ఆ కారుణ్య మూర్తి తన పామర అనుచరుల నుద్దేశించి అన్నాడు."శ్రద్ధగా వినండి. ధర్మ పరాయణత్వ సూత్రాలను మీకు వివరిస్తాను. విని వాటిని అనుసరించండి"

7. ప్రాణులు బలవంతమైన వైనా; బలహీనమైన వైనా చంపకు. చంపమని అనుజ్ఞ ఇవ్వకు. వధ శాలకు పంపకు. వాటిని హింసించకు.

8. "ఏ పౌరుడూ బుద్ధి పూర్వకంగా దొంగతనం చేయరాదు, దొంగతనానికి ఎవరినీ ఆదేశించకండి. సమర్ధించకండి. ఇతరులు ఇచ్చిన దాన్నే స్వీకరించండి."

9. "విశృంఖలత అగ్నిగుండం వంటిది. దానికిదూరంగా వుండండి. ఒక వేళ సంయమం పాటించ లేకపోయినా పరదారతో కలవరాదు.

10. "ధార్మిక సభల్లో, న్యాయ స్థానాల్లో ప్రసంగాల్లో అబద్ధాలు మాట్లాడకండి, అబద్ధాలు మాట్లాడమని ఎవరినీ ప్రోత్సహించకండి. అసత్యం వర్జించండి."

11. "పామరులారా యీ ధర్మం పాటించండి. తాగుడు మానివేయండి ఎవరినీ తాగనివ్వకండి. తాగుడు ప్రోత్సహించకండి. తాగుడు ఏ విధంగా ఉపతనానికి దారి తీస్తుందో గ్రహించండి"

12. "మూర్ఖులు తాగడం వల్లనే పాపాలకు పాల్పడతారు. పాపాలకు పూనుకోడానికి లోలోపల బీజాలు వేసే జబ్బు ఇది. కాబట్టి మూర్ఖులకు సంతోషాన్నిచ్చే ఉన్మాద పూరితమైన యీ అలవాటుకు దూరంగా ఉండు.

13. చంపవద్దు, దొంగతనం చేయవద్దు, అబద్ధమాడవద్దు, చిక్కటి మద్యానికి దూరంగా ఉండు, వ్యభిచారం మానివెయ్యి, రాత్రివేళల్లో సరిగాలేని భోజనాన్ని స్పృశించకు"

14. "పూల మాలల్ని, సుగంధ ద్రవ్యాలని రెండింటిని విసర్జించు-నేలనే నీ శయన చేసుకో. ఈ పవిత్ర అష్టాంగ సూత్రాలను ప్రతివారం పాటించి హృదయాల్ని నిర్మలంగా పదిల పరచుకొండి.

15. "ప్రాతఃకాలాన ఈ నిష్ఠలను భక్తి, కృతజ్ఞత నిండిన హృదయంతో ఆచరించి వివేక వంతులై భిక్షుకులకు వున్నంతలో అన్నపానీయాలు ఇవ్వండి"

16. "తల్లి దండ్రులను చక్కగా చూడండి. ధర్మమైన వృత్తిని నిర్వహించండి,వీటి వెలుగులో పామరులు పరిపూర్ణత సాధించగలరు".

## 5. ధర్మ మార్గంలో పయనించడానికి తోడు కోసం నిరీక్షించ నవసరం లేదు.

1. యుద్ధ భూమిలో బాణం గుచ్చుకోవడం వల్ల కలిగిన బాధను ఏనుగు భరించినట్లు

ప్రపంచంలోని మనుషుల పరుష వాక్కుల వలన కలిగే బాధను నేను భరించవలసిందే.

2. ఏనుగును మచ్చిక చేసుకొని యుద్ధంలోకి తీసుకెళతారు. మచ్చిక చేసుకొని రాజు దాన్ని అధిరోహిస్తాడు. దాన్ని కసురుకోకపోతే అది జంతువుల్లో వుత్తమమైనది.

3. మచ్చికయిన కంచర గాడిదలు మంచివి. సింధు దేశపు జాతి అశ్వాలు మంచివి, మదపు టేనుగులు మంచివి, తనను తాను అదుపు చేసుకొన్న మనిషి అందరిలోకి వుత్తమోత్తముడు.

4. అప్పటికీ ఆ జంతు వాహనాలు నిర్యాణ మార్గంలో తీసికెళ్ల లేవు. మనల్ని మనం మచ్చిక చేసుకొని స్వంత సవారిలో సాగినప్పుడే ఆ మార్గం అందుతుంది.

5. ఆప్యాయతలోనే ఆనందాన్ని అనుభవించు. ఆలోచనల్ని ఒక కంట కనిపెట్టి వుండు. ఇందులో అలిసి పోకుండా ఉండాలి. మదపుటేనుగును బురదలో నుండి లాగినట్లు, పాప మార్గం నించి బయటపడు.

6. నీతో కలిసి ప్రయాణిస్తున్న వాడు నీతిమంతుడు స్థిరమైన వాడు తెలివైన వాడేనా! అయితే అన్ని వెతలను వదిలేసి అతనితో సంతోషంగా నడిచిపో.

7. నీతో ప్రయాణిస్తున్న వాడు నీతిమంతుడు, స్థిరమైనవాడు, తెలివైన వాడు కాడా? శత్రువుచేత పరాజితుడై సరిహద్దులు దాటి పారిపోయినట్లు, మత్తగజం అడవిలో పారిపోయినట్లు నీవు అలా పారిపోయి ఏకాంతంగా ఉండడం మంచిది.

8. మూర్ఖులతో సహవాసం చేయడం కంటే ఒంటరిగా జీవించడం మేలు. ఒంటరిగా జీవించు. పాపకార్యాలు చేయకు, మత్తగజం అడవిలో దొరికింది మేసి ఒంటరిగా ఉన్నట్లు కోర్కెలు తగ్గించుకుని ఒంటరిగా జీవించు.

9. చెడు ఆలోచనలన్నిటినీ నీ లోంచి తరిమి వెయ్యి.

10. వాటిని తరిమి వేసే మార్గం వుంది.

11. ఇతరులు హానికరమైన వాళ్ళై కావచ్చు. అయినా నీవు మాత్రం అపకారం చెయ్యకూడదని తీర్మానించుకొని చెడును నీ నుంచి తరిమి వెయ్యి.

12. ఇతరులు జీవహింస చేయవచ్చు. నీవు మాత్రం హింస జోలికి పోకు.

13. ఇతరులు దొంగతనం చెయ్యవచ్చు. నీవు మాత్రం దొంగతనం చెయ్యకు

14. ఆ రకంగా ఇతరులు ఉదాత్త జీవితం గడపక పోవచ్చు నీవు గడుపు.

15. ఇతరులు అబద్ధమాడవచ్చు. నిందించవచ్చు. దుష్ప్రచారం చేయవచ్చు. వదర వచ్చు నీవు మాత్రం అవి చేయకు.

16. ఇతరులు దురాశాపరులు కావచ్చు. నీవు మాత్రం దురాశకు లోను కాకు.

7. ఇతరులు ద్రోహచింతనతో వుండవచ్చు. తప్పుడు లక్ష్యాల్ని కలిగి ఉండవచ్చు. తప్పుడు మాటలు మాట్లాడవచ్చు. తప్పుడు చర్యలు, తప్పుడు పద్ధతులకు పాల్పడవచ్చు. తప్పుడు ప్రయత్నాలు చేయవచ్చు. ప్రమత్తత కలిగి ఉండవచ్చు. ఏకాగ్రత లోపం ఉండవచ్చు. కాని నీవు మాత్రం మహోన్నతమైన అష్టాంగ మార్గాన్ని అనుసరించు. సమదృష్టి, సమవాక్కు, సమ సంకల్పం, సమకర్మ, సమార్జన, సమ వ్యాయామం, సమశక్తి, సమ సమాధి ఆచరించి పాటించు.

19. ఇతరులు సత్యం, విముక్తి మార్గం విషయంలో పొరపడవచ్చు. నీవు మాత్రం సత్యం విముక్తి మార్గాలను సరిగా ఎన్నుకోవాలి.

20. ఇతరులు సోమరిపోతులుగా, మందమతులుగా ఉండవచ్చు. నీవు వాటి నుండి దూరంగా ఉండు.

21. ఇతరులు గర్విష్టులై ఉండవచ్చు. నీవు మాత్రం వినయ మనస్కునివై ఉండు.

22. ఇతరులు అనుమానాలతో కలవరం చెందుతూ ఉండవచ్చు. నీవు మాత్రం వాటికి అతీతంగా ఉండు.

23. ఇతరులలో క్రోధం, అపకార బుద్ధి, అసూయ, లోభిత్వం, దురాశ, కపటం, మోసం, కఠినత్వం, అహంకారం, అర్ధ సత్యం, నీతి నియమ రాహిత్యం, మొరటుదనం, జడత్వం, అయోమయం, అవిద్య గూడు కట్టుకుని వుండవచ్చు. నువ్వు వీటన్నిటికీ ప్రతిగా నిలబడు.

## నాల్గవ విభాగం

# "నిబ్బాన" పై ఉపదేశాలు.

## 1. నిబ్బాన మంటే ఏమిటి?

1. ఒకప్పుడు బుద్ధ భగవానుడు శ్రావస్తిలోని అనాథ పిండకుని ఆరామంలో నివసిస్తున్నాడు. అక్కడే సారిపుత్రుడు కూడ ఉంటున్నాడు.

2. సహచర భిక్షుకుల నుద్దేశించి భగవానుడు అన్నాడు"భిక్షుకులారా ప్రపంచంలోని వస్తు సంచయంలో భాగస్వాములు కాకండి. నా సిద్ధాంతంలో భాగస్వాములు కండి. మీ పై వాత్సల్యం వల్ల యీ విషయమై నాకు ఆతురతగా వున్నది."

3. ఆ మాట చెప్పి ఆయన అక్కడ నుండి లేచి తన కక్ష్యలోకి వెళ్ళిపోయాడు.

4. అక్కడే వున్న సారిపుత్రుని ఉద్దేశించి ఆ భిక్షువులు నిర్వాణ మంటే ఏమిటో వివరించమని అడిగారు.

5. "సోదరులారా! ఆశ నీచమని మీకు తెలుసా! అది దురాగ్రహానికి దారి తీస్తుంది" అని సారిపుత్రుడు సమాధానమిచ్చాడు.

6. "ఈ ఆశను దురాగ్రహాన్ని తొలగించుకోడానికి ఒక మధ్యమ మార్గం ఉంది. అది చూడడానికి కళ్ళిస్తుంది. తెలుసుకోడానికి అవకాశాన్నిస్తుంది. శాంతికి దారి చూపుతుంది. ఆంతర దృష్టి బుద్ధివికాసం చివరకు నిర్వాణం కలిగిస్తుంది."

7. "మధ్యమ మార్గమంటే ఏమిటి? ఇది మరేమిటో కాదు. సమ్యక్ దృష్టి, సదాశయం సద్వాక్కు. సరైన జీవనోపాధి సత్ప్రయత్నం జాగృతి సరైన ధ్యానం అనే మహోదాత్తమైన అష్టాంగ మార్గం. భిక్షువులారా! ఇదే ఆ మధ్యమ మార్గం."

8. "అవశ్యంగా, అయ్యలారా ఆగ్రహం నీచమైంది, ద్వేషం నీచమైంది, అసూయ, ఓర్వలేనితనాలు నీచమైనవి, పిసినారి తనం దురాశ నీచమైనవి. కపటం, మోసం దురహంకారం నీచమైనవి, ఉబ్బిపోవడం నీచమైనది, సోమరితనం నీచమైనది.

9. "ఉబ్బిపోవడం, సోమరితనం తన నుంచి పారదోలడానికి మధ్యమ మార్గం ఉంది. అది చూడడానికి మనకు కళ్ళిస్తుంది. తెలుసుకోనే తెలివిస్తుంది. శాంతికి మార్గం చూపుతుంది., ఆంతర దృష్టిని బుద్ధివికాసాన్ని ఇస్తుంది.

10. నిర్వాణం అంటే మహోదాత్తమైన అష్టాంగ మార్గమనుకొనే వారు కాదు.

11. ఆ విధంగా పూజ్య సారిపుత్రుడు చెప్పడంతో భిక్షువుల హృదయాల్లో ఆనందం వెల్లివిరిసింది.

## 2. నిబ్బాణానికి మూలాధారాలు

### (i)

1. ఒకప్పుడు బుద్ధుని దగ్గరికి రాధి అనే మన్యుడైన భిక్షువు వచ్చారు. భగవానునికి ప్రణామ మాచరించి ఒక పక్కన కూర్చున్నాడు. కూర్చున్న రాధ ఆయన నుద్దేశించి ప్రభూ! నిర్వాణము దేని కొరకు? అని అడిగాడు.
2. "నిర్వాణ మంటే వికారం నుంచి విముక్తి" సమాధానమిచ్చాడు భగవానుడు.
3. "కాని నిర్వాణం లక్ష్యమేమిటి?"
4. రాధా నిర్వాణం ఆధార భూతంగా మనిషి ధర్మహిత జీవనం సాగించాలి నిర్వాణ జీవిత లక్ష్యం. నిర్వాణం దాని అంతం"

### (ii)

1. ఒకప్పుడు భగవానుడు శ్రావస్తిలోని జితవనంలో ఉన్న అనాధపిండకుని ఆరామంలో నివసిస్తున్నాడు. అక్కడి భిక్షువులనుద్దేశించి"సోదరులారా!" అన్నాడు. "ఏమిటి ప్రభూ!" అని వాళ్ళు బదులు పలికారు. వారితో ఆయన ఇలా అన్నాడు.
2. "భూప్రపంచాన్ని కట్టి పడేస్తున్న పంచబంధనాలను గురించి మీకు చెప్పాను గుర్తుందా?"
3. దానికి పూజ్య మాలంక్య పుత్రుడు ఇలా సమాధానమిచ్చాడు.
4. "ఓ ప్రభూ! నాకు ఆ పంచ బంధనాలు గుర్తున్నాయి."
5. "నీకు జ్ఞాపకమున్న ఆ పంచ బ[illegible]నాలేమిటో వివరించు మాలంక్య పుత్రా."
6. "ప్రభూ, అధో ప్రపంచానికి కట్టిపడవేసే బంధనాలుగా భగవానుడు ప్రవచించిన శరీర తత్వం, శంక, కర్మ కాండల్ని నమ్ముకోవటంలోని ధార్మిక కళంకం, ఇంద్రియ సౌఖ్యపు వుద్రేకం, అపకార బుద్ధి - యీ అయిదు బంధాల్ని నా మనస్సులో ధారణ చేసుకున్నాను."
7. "మాలంక్య పుత్రా! నువ్వు గ్రహించిన ఈ పంచ బంధనాలను ఎవరి నుద్దేశించి నేను ప్రబోధించాను పసిబిడ్డ సామ్యాన్ని వాడుకుని పరధర్మ సంచారులు నిన్ను నిందించకుండా వుంటారా?

8. "కానీ మాలంక్యపుత్రా! పసివారు ఊహ లేకుండా వెల్లకిలా ఉండడం తప్ప అతనికి శారీరక స్వరూపం ఉండదు కదా! అలాంటప్పుడు అతనిలో శరీరతత్వం ఎలా తలెత్తుతుంది? అయినప్పటికీ నిజానికి అతనిలో అంతర్లీనంగా శరీర తత్వ ధోరణి వుంటుంది."

9. "అదే విధంగా మాలంక్యపుత్రా! ఊహ లేకుండా వెల్లకిలా తిరిగి పడుకున్న పసిపిల్లవాడికి మానసిక స్థితిగతులు కూడ ఉండవు. అతడిలో మరి మానసికంగా పూగిసలాట ఉండదు కదా? అయినప్పటికీ నిజానికి శిశువులో అంతర్లీనంగా సందేహ స్థితి ఉంటుంది."

10. "మాలంక్యపుత్రా! శిశువుకు నైతిక ఆదరణ కూడా ఉండదు. అలాంటప్పుడు కర్మ కాండలకు సంబంధించిన కళంకం శిశువుకు ఏమి ఉంటుంది? అయినప్పటికీ నిజానికి అతడిలో అంతర్లీనంగా ఆ తత్త్వం ఉంటుంది."

11. "అట్లాగే ఆ శిశువుకు భావ వికారాలుండవు. అలాంటప్పుడు శిశువులో ఇంద్రియ సౌఖ్యం (ఉద్రేకం) ఎలా కనిపిస్తుంది. అయినా ఆ ధోరణి ఉంటుంది."

12. "మాలంక్య పుత్రా చివరగా ఆ పసి ప్రాణానికీ వేరే జీవునిలో పట్టదు. అలాంటప్పుడు దానిలో అపకార బుద్ధి ఎలా తొంగిచూస్తుంది? అయినా శిశువులో అలాంటి ధోరణి అంతర్లీనంగా ఉంటుంది.

13. ఈ ప్రబోధం వల్ల, మాలంక్య పుత్రా! పర ధర్మ పరివ్రాజకులు పసిబిడ్డ సామ్యం చేసుకుని నిన్ను తప్పు పట్టరు.

14. ఇది చెప్పడం పూర్తి కాగానే పూజ్య ఆనందుడు భగవానుడితో అన్నాడు. భగవానుడా వేళ అయింది. నిత్య సంచారీ! మీ సమాధి వేళ అయింది."

ఐదవ విభాగం

# ధమ్మం పై ఉపదేశాలు

## 1. సమదృష్టికే ప్రథమ స్థానం ఎందుకు?

1. మహోదాత్తమైన అష్టాంగ మార్గంలో సమ దృష్టి మహోదాత్తమైనది.

2. అజ్ఞానాన్ని తొలగించడానికై ఉన్నతమైన జీవితంలో సమస్తమైన అంశాలకు సమదృష్టి ఆ ముఖమూ, సులభటిపణి.

3. అవగాహనా లోపమే అన్ని అనర్థాలకు మూలం.

4. సమదృష్టి ఏర్పడాలంటే సమస్త జీవన వ్యాపారాలను కార్య కారణ నియతి యొక్క విలసనంగా తెలుసుకోవాలి; కార్యకారణ సంబంధాన్ని గుర్తించడమే సమదృష్టి కలిగి వుండడం.

5. "ఏ వ్యక్తి కయితే, సోదరులారా, విపరీత దృష్టి లక్ష్యం, వాక్కు క్రియలు, జీవిక వుంటాయో; వికృతమైన కృషి, ధ్యాస, ధ్యానం వుంటాయో; ఎవని వైదుష్యం మోక్షం వికారమైనవో - అలాంటివాడికి అట్టి విపరీత దృష్టి వల్ల చేసే మనో వాక్కాయకర్మలు; సంకల్పించే చర్యలు; వాంఛితాలు, నిర్ణయాలు - అతని యావత్తు కార్యకలాపం అరుచికి, అసంతోషానికి, జుగుప్సకి అశుభానికి, వ్యాకులతకీ దారి తీస్తాయి. ఎందువల్ల/ అతని చెడుదృష్టి వల్ల."

6. సవ్యంగా ఉండడం మాత్రమే చాలదు. పసిపాప సవ్యంగా ఉండవచ్చు అంటే దాని అర్థం ఆపాపకు సవ్యమైనదేమిటో తెలుసునని కాదు సవ్యంగా ఉండడానికి సవ్యం అంటే ఏమిటో ప్రతి వారు తెలుసుకోవాలి.

7. "ఆనందా! సరైన భిక్షువుగా ఎవరికి చెప్పాలి ? ఏది సహేతుకంగా సాధ్యమో; ఏది సహేతుకంగా అసాధ్యమో క్షుణ్ణంగా తెలిసిన వాడై ఉండాలి".

## 2, మరణానంతర జీవితాన్ని గురించి చింత దేనికి?

1. ఒకప్పుడు పూజ్య కశ్యప మహాశయుడు పూజ్య సారిపుత్రుడు వారణాసి సమీపంలో ఉన్న విశ్వపట్నంలోని హరిణస్థలిలో కలిసి గడిపారు.

2. అప్పుడు పూజ్య సారిపుత్రుడు ఒక సాయం సంధ్యవేళ ఏకాంతవాసం నించి పూజ్య కశ్యపుని దగ్గరికి వెళ్ళి ఒక పక్క కూర్చున్నాడు.

3. అలా కూర్చున్న పూజ్యసారి పుత్రుడు కశ్యప మహాశయునితో అన్నాడు. "మిత్రమా కశ్యపా! తథాగతుడు మరణానికి ఆవల కూడా ఉంటాడా?"

4. "మిత్రమా! తథాగతుడు అట్లా ప్రకటించి ఉండలేదు కదా, తాను మరణించిన తర్వాత జీవించి ఉంటానని"

5. "అయితే మరి మిత్రమా! మరణానంతరం తథాగతుడు జీవించి ఉండడం ఉండక పోవడం రెండూ సాధ్యమా?"

6. "తథాగతుడు దీన్ని కూడా ప్రకటించి ఉండలేదు కదా మిత్రమా!"

7. "ఎలా మిత్రమా! తథాగతుడు మరణానంతరం జీవించి ఉండక పోవడం, ఉండ కుండా లేక పోవడం ?" అది కూడా తథాగతుడు ప్రకటించ లేదు.".

8. "ఆయన దాన్ని ఎందుకు ప్రకటించలేదు?"

9. "పవిత్ర జీవన ప్రాథమిక సూత్రాలకు గాని, మానవ శ్రేయస్సుకు గాని , ఈ ప్రశ్న ఏ విధంగానూ ఉపయోగ పడదు. ఇది పరిపూర్ణ జ్ఞానానికి, లేదా నిర్వాణానికి కూడ దారి తీయదు. అందుకే తథాగతుడు ఈ విషయాన్ని ప్రకటించలేదు మిత్రమా!"

## 3. దేవుని పూజలు, ఉపాసనలు వ్యర్థం.

1. ఒకనాడు భగవానుడు వశిష్టునితో ఇలా అన్నాడు.

2. ఈ అచిరావతి నీటితో నిండి గట్టుమీద పొంగి పారలుతున్నదని అనుకో. మనిషి కార్యార్థం ఆవల గట్టుకు పోవాలి అంటే నదిని దాట కోరతాడు.

3. "అతడు ఇవతలి గట్టుమీదే నిలబడి అవతలి గట్టును" ఆవలి తీరమా! ఇక్కడికి రా! అంటాడనుకోండి

4. "ఏ మాలోచిస్తున్నావు వశిష్టా! ఇవతలికి రమ్మని ఆ మనిషిని కోరగానే అచిరావతి తీరం ఇవతలికి వస్తుందా? వస్తుందని ఆ మనిషి ఆవాహనం చేయడం వల్ల, ప్రార్థించడం వల్ల, ఆశించడం వల్ల, ప్రశంసించడం వల్ల ఇటు వైపుకు వస్తుందా?"

5. "సరిగ్గా అదే విధంగా వశిష్టా!మూడు వేదాలు వర్ణించే బ్రాహ్మణులు - ఒక మనిషిని నిజంగా బ్రాహ్మణుడిని చేసే సలక్షణాల దోహదం విస్మరించి, మనిషిని బ్రాహ్మణేతరుడిగానే చేసే లక్షణాలను సంతరించుకుంటూ అంటారు కదా!

6. "ఇంద్ర దయచేయు బ్రహ్మ దయచేయు, ఈశ్వర దయచేయు, ప్రజాపతీ దయచేయు, దయచేయండి, దయచేయండి అంటూ ఉపాసిస్తారు."

7. "వశిష్టా! ఈ బ్రాహ్మణులు నిజంగా తమ ఆవాహనం ద్వారా, ప్రార్థనలు, స్తోత్రాల

ద్వారా నమ్మడం ద్వారా మరణానంతరం బ్రహ్మైక్యం పొందుతారా! అలాంటి స్థితి ఎన్నటికీ సాధ్యం కాదు.

## 4. నీవు తినే ఆహారాన్ని బట్టి నీకు పవిత్రత రాదు

1. ఒక బ్రాహ్మణుడు భగవానుని కలుసుకోవడం తటస్థించింది. అప్పుడు మనిషి శీలం పైన తినే ఆహారపు ప్రభావం విషయంలో విచారణ తలెత్తింది.

2. ఆ బ్రాహ్మణుడు అన్నాడు"జొన్నలు, ఖర్జూరాలు, కందమూలాలు, ఆహారధాన్యాలు, మొలకలు సవ్యంగా ఆహారాన్ని స్వీకరిస్తే ధార్మిక జీవితానికి దోహదం చేస్తాయి. కుళ్ళిన జంతు మాంసం అధ్వాన్నం.

3. భగవానుని సమాధానం "అంటే నీవు చచ్చిన జంతు మాంసాన్ని ముట్టవు. పక్షుల మాంసం ప్రీతికరంగా వంటలు చేసుకుని తింటావు. నీవు"కుళ్ళిన మాంసం" అని దేనిని అంటావు?"

4. "చంపడం, అంగవైకల్యం చేయడం, వాతలు పెట్టడం, కొరత వెయ్యడం, దొంగతనం చేయడం, అబద్ధాలు ఆడటం, వంచించడం, వ్యభిచరించడం యివే కుళ్ళిన మాంసం, ఇవి జంతువుల నుంచి రావు.

5. సుఖాల కోసం వెంపర్లాడడం, పీకల దాకా తాగాలనే వాంఛ, మలినమైన జీవనం, అసమ్మతి కుట్రలు ఇది జంతువులనుంచి రావు.

6. చాడీలు చెప్పడం, క్రూరత్వం, ద్రోహం, మదోన్మత్తత, నీచ లోభం, ఇవి కుళ్ళిన మాంసం. ఇవి జంతువుల నుంచి రావు.

7. కోపం, కపటం, కుట్ర, మోసం, అసూయ, రంకెలు వేయడం, గర్వం అల్పుల సహవాసం - ఇవి కుళ్ళిన మాంసం. ఇవి జంతువుల నుంచి రావు.

8. అధమజీవనం, అపనిందలు, దగా మొసం నక్కజిత్తులు, దుష్ట ప్రచారాలు - ఇవీ కుళ్ళిపోయిన మాంసాలంటే ఇవి జంతువుల నుంచి రావు.

9. హత్యంటే, అపహరణం అంటే వున్న ఈ కోరిక యీ దారుణ నేరాలు వినాశనానికీ దారితీస్తాయి, చివరికి నరకంలో అంతం అవుతాయి. ఇవే కుళ్ళిన మాంసం, ఇవి జంతువుల నుంచి రావు.

10. మాంసం, చేపలు తినడం మానేసినా, దిగంబరంగా ఉన్నా, శిఖలు ముడి వేసుకున్నా తలలు గొరిగించుకున్నా, తోలు వస్త్రం వేసుకున్నా యజ్ఞాలు చేసినా, జప తపాలొనర్చినా, నీటిలో మునకలు వేసినా ధూప దీపాలు వెలిగించినా - ఇవి మనిషిని శంక నుంచి కడిగి వెయ్యలేవు.

11. మనస్సును నిగ్రహించుకో, నీ శక్తి యుక్తుల్ని నియంత్రించు; నిజానికి బద్ధుడవై ఉండు,

దయగా ఉండు, బంధనాలను విడచి, అనర్థాలను నిర్జించిన ఋషిని అతను చూసిన, విన్నచో ఏమీ అంటవు.

12. ఉదాత్త ఉద్ధారక సత్యాలను బోధిస్తూ, "కుళ్ళిన మాంసాన్ని దూషిస్తూ అనర్థాలను పారదోలుతూ భగవానుడు చేసిన ప్రసంగం విన్న బ్రాహ్మణుడు వినయంగా మోకరిల్లి తనను అక్కడి కక్కడే భిక్షువుగా స్వీకరించమని వేడుకున్నాడు.

## 5. ఆహారం కాదు దుశ్చర్యలు ప్రమాదం.

1. ఆయ గంధుడనే బ్రాహ్మణ విరాగి హిమాలయ పర్వత ప్రాంతాల్లో తన శిష్యులతో ఉండేవాడు.

2. వారు మాంసాన్ని గాని చేపల్ని గాని తినే వారు కాదు. ఉప్పు పులుపుల కోసం వారు ప్రతి సంవత్సరం తమ ఆశ్రమాల నుండి బయటికి వచ్చేవారు. అక్కడి గ్రామస్తులు వారిని సగౌరవంగా ఆహ్వానించి నాలుగు నెలల పాటు ఆతిథ్యం ఇస్తుండేవారు.

3. అప్పుడు భగవానుడు తన భిక్షువులతో అదే గ్రామాన్ని సందర్శించాడు. ఆయన ప్రబోధించిన ధర్మాన్ని ఆలకించి ప్రజలు ఆయన అనుయాయులయ్యారు.

4. ఆ సంవత్సరం కూడా ఆయగంధుడు తన శిష్యులతో సహా ఆ గ్రామానికి వెళ్ళాడు. కాని వారి పట్ల ఆ గ్రామస్థులు మునుపటి ఆసక్తి కనబరచలేదు.

5. గ్రామస్థులకు మాంసం, చేపలు తినడం నిషిద్ధమని భగవానుడు చెప్పలేదని విని ఆయగంధుడు నిరుత్సాహం చెందాడు. ఆ విషయాన్ని భగవానుడి దగ్గరే ధృవీకరించుకోదలచి శ్రావస్తిలోని జితవనంలో నివసిస్తున్న భగవానుని దగ్గరికి వెళ్ళి అన్నాడు.

6. "పప్పులు, చిక్కుడు, బఠానీలు, ఆకులు, దుంపలు తీగెలకు కాచిన ఫలాలు వంటివి తింటే మనుషులు తమ సుఖాల కోసం అబద్ధాలాడకుండా, న్యాయవర్తన కల వారుగా రూపుదిద్దుకుంటారు."

7. "శుభ్రమూ, శ్రేష్ఠమూ అయి చక్కగా యితరులు వండి యిచ్చినవి ఆహారమయినా మీరు స్వీకరిస్తారు. అట్లా బియ్యం వండి చేసిన ఆహారాన్ని ప్రీతిగా భుజించే వాడు ఆయ గంధం తిన్నట్టు. మీరేమో పిట్ట మాంసంతో చక్కగా చేసిన వంటలను వరి అన్నంతో కలిపి భుజిస్తూ ఆయ గంధ దోషం మీకు అంటదని చెప్పుతున్నారు.

8. "ఆయ గంధం అంటే మీరు ఏమి అర్థం చెపుతున్నారో మీ నుంచి తెలుసుకో గోరుతున్నాను."

9. భగవానుడు సమాధానమిచ్చాడు. "ప్రాణాన్ని హరించడం, బాధించడం, నరకడం, బంధించడం, దొంగిలించడం అబద్ధమాడటం, దగా చెయ్యడం, కొరగాని పాండిత్యం, వ్యభిచరించటం ఇవి ఆయ గంధం గాని మాంసం భక్షించడం గాదు.

10. "ఈ లోకంలో ఎవరైతే ఇంద్రియ సుఖాల కోసం విశృంఖలంగా వర్తిస్తారో, మధుర భక్ష్యాల కోసం వెంపర్లాడతారో, పాప కార్యాల్లో పాలు పంచుకుంటారో వక్రమూ దురవగాహమూ అయిన శూన్యవాద సూత్రాలు పాటిస్తారో - వారికి ఆయ గంధ దోషం, మాంస భక్షకులకు కాదు.

11. "ఈ లోకంలో ఎవరైతే మొరటుగా, కటువుగా, చాడీకోరులుగా, కృతఘ్నుంగా, నిర్భయంగా, మదోన్మత్తంగా, నిర్దాక్షిణ్యంగా ఎవరికీ ఏమీ పెట్టుకోకుండా వుంటారో - వారికి ఆయ గంధ దోషం గాని, మాంస భక్షకులకు కాదు.

12. ఆగ్రహం, గర్వం, మూఢత్వం, వైరభావం, వంచన, అసూయ ప్రగల్భం దురహంకారం అధర్మపరుల సహవాసం - ఇవన్నీ ఆయ గంధంగాని మాంస భక్షణం కాదు.

13. దుర్నీతి కలిగిన వారు, తీసుకున్న అప్పు తిరిగి ఇవ్వని వారు అపనిందలు వేసే వారు వ్యవహార వంచకులు, కపట బుద్ధి గలవారు. ఈ లోకంలో నీచాతి నీచమైన మనుషులు - వీరికి ఆయగంధ దోషం కాని, మాంస భక్షకులకు కాదు.

14. ప్రపంచంలోని జీవుల పట్ల మితి మీరి వ్యవహరించేవారు సాటి వారిని బాధించే వారు, ఇతరులవి అపహరించే వారు, నీతిలేనివారు, క్రూరులు కఠినాత్ములు మర్యాద లేనివారు వీళ్ళకు ఆయ గంధ దోషం కాని మాంస భక్షకులకు కాదు.

15. దురాశ చేతనో విరోధం చేతనో ప్రాణులను హింసించే వారు, ఎప్పుడూ చెడు ప్రవర్తన కలవారు, వారు మరణానంతరం గాఢాంధకారంలో నరక కూపంలో పడిపోతారు. వీరికి ఆయగంధ దోషం కాని మాంస భక్షకులకు కాదు.

16. మాంసం లేదా చేపల పట్ల వైముఖ్యంతో, దిగంబరులై శిరోముండనం గావించుకుని జటాజూటులై విభూది ధరించి, లేడి చర్మం కట్టుకుని యజ్ఞ యాగాదులు చేస్తూ అమరత్వం కోసం మంత్ర తంత్రాల ద్వారా బలు లివ్వడం ద్వారా యజ్ఞాల ద్వారా లేదా కాలానుగతమైన అనుష్ఠానాలు ఆచరించడం ద్వారా శంకాస్పదుడు పరిశుద్ధుడు కాలేడు.

17. ఇంద్రియ నిగ్రహంతో కోర్కెలను జయిస్తూ ధమ్మం పాటిస్తూ ఋజుసాధు వర్తనంలో ఆనందం పొందుతూ బంధాలకు అతీతుడై అన్ని శోకాలను అధిగమించే వివేకవంతుడు ఎదుట కనిపించే వాటికి వినిపించే వాటికి ప్రలోభ పడడు.

18. కాని పనులు ఆయ గంధం అవుతాయి. కాని మత్స్య మాంస భక్షణం కాదు."

## 6. బాహ్య స్నానం చాలదు.

1. బుద్ధుడు ఒకప్పుడు శ్రావస్తిలో నివసించేవాడు. అదే కాలంలో సంగారవుడనే బ్రాహ్మణుడు కూడ ఉన్నాడు. ఆ బ్రాహ్మణుడు జల స్నానంతో శుభ్రం చేసుకునే వాడు. ఈ శుభ్రం చేసుకోవడమనేది. నిత్యకృత్యంగా ఉండేది. రాత్రిపగలు స్నానానికి

వెళ్ళే అలవాటుండేది.

2. అప్పుడు పూజ్య ఆనందుడు ఒక ప్రాతః కాలాననే లేచి కాషాయ వస్త్రాలు ధరించి అంగవస్త్రం కూడ భుజాన కప్పుకొని శ్రావస్తి నగరంలోకి భిక్షాటనకు వెళ్ళేవాడు. ఆ విధంగా భిక్షగా వచ్చిన అన్నాన్ని భుజించి తిరిగి వచ్చేటప్పుడు భగవానుని దగ్గరికి వెళ్ళి ప్రణామం చేసి ఒక ప్రక్కన కూర్చున్నాడు. తర్వాత పూజ్య ఆనందు డన్నాడు.

3. ఓ ప్రభూ! ఇక్కడ శ్రావస్తిలో సంగారవుడని ఒక బ్రాహ్మణుడున్నాడు. ఎప్పుడూ అతనికి శుభ్రపరచుకోవడం అలవాటు. ఆ విధంగా రాత్రీ పగలు స్నానానికి వెళుతూనే ఉంటాడు. భగవానులైన మీరు అతన్ని అనుగ్రహించి ఒకసారి కలుసుకుంటే బావుంటుంది."

4. దానికి భగవానుడు మౌనంగానే అంగీకరించాడు.

5. మరునాడే ప్రాతఃకాలాన్నే భగవానుడు నిద్రలేచి కాషాయ వస్త్రాలు ధరించి అంగవస్త్రం భుజం పై వేసుకుని భిక్షపాత్ర తీసుకుని బ్రాహ్మణుడైన సంగారవుని దగ్గరికి వెళ్లాడు. అక్కడికి చేరుకుని సిద్ధంగా ఉన్న ఒక ఆసనం పై కూర్చున్నాడు.

6. బ్రాహ్మణుడైన సంగారవుడు భగవానుని దగ్గరికి వచ్చి పరామర్శించాడు. పరస్పర మర్యాదలయిన తదుపరి అతడు ఒక వైపు కూర్చున్నాడు.

7. అతడు కూర్చోగానే బుద్ధుడు అతని నుద్దేశించి ఈ విధంగా అన్నాడు"ఓ బ్రాహ్మణుడా! నీటితో శుభ్రం చేసుకొనే అలవాటు నీకున్నదట. రాత్రీపగలు అదే పనిగా స్నానం చేయడం ద్వారా శరీరాన్ని శుభ్రం చేసుకుంటావని విన్నాను."

8. "ఇది నిజమే స్వామి గౌతమా"

9. బ్రాహ్మణుడా ఎప్పుడూ స్నానం చేస్తూ శరీరాన్ని పరిశుభ్రం చేసుకుంటూ ఉండడం వల్ల నీవు ఆశిస్తున్న ఫలమేమిటి?"

10. స్వామి గౌతమా! ఆ రోజు నేనే చెడు చేసినా ఆ సాయంత్రం నేను చేసే స్నానం వల్ల అది ప్రక్షాళనమై పోతుంది. రాత్రిపూట నేనే చెడు చేసినా మరునాటి ఉదయాన్నే నేను చేసే స్నానం ద్వారా అది ప్రక్షాళన మైపోతుంది. నీటితో ఎప్పుడూ నన్ను నేను శుభ్రం చేసుకుంటూ ఉండడం వల్ల నాకు ఆ ప్రయోజనం ఉంది"

11. దానికి మహానుభావు డేమన్నాడంటే

12. నియతి అనేదే సరస్సు అది నిర్మలంగా నిష్కల్మషంగా ఉంటుంది.

13. ఇక్కడకు స్నానానికి వచ్చి తమ సర్వాయవాల్ని పరిశుభ్రం చేసుకొని సత్పురుషులు అవతలి తీరం చేరుతారు."

14. అందుకు సంతోషించి బ్రాహ్మణుడైన సంగారవుడు భగవానుని ఉద్దేశించి అన్నాడు. "స్వామి గౌతమా! అద్భుతం ఈ రోజు నుండి జీవిత పరి సమాప్తి వరకూ ఆయన అభయం పొందిన వాడిగా ఆయన అనుచరుడిగా స్వామి గౌతముడు నన్ను స్వీకరించుగాక!"

## 7. పవిత్ర జీవన మంటే ఏమిటి?

1. ఒకప్పుడు భగవానుడు ప్రయాణం సాగిస్తుండగా తన అలవాటు ప్రకారం తనతో వస్తున్న భిక్షువులతో యీ ప్రసంగం చేసాడు.

2. భిక్షువుల నుద్దేశించి భగవానుడు చెప్పాడు: సోదరులారా ఈ పవిత్ర జీవనం ఆచరిస్తున్నది ప్రజల్ని మోసగించడానికి కాదు. లేదా వారి మెప్పు పొందడానికీ కాదు. వారి నుంచి లాభం కోసమో, ప్రయోజనం కోసమో లేదా ప్రతిష్ఠ కోసమో లేదా వివాదస్పద సమస్యల్ని అధిగమించే ఉద్దేశ్యంతోనో' కాదు. ఆ విధంగా ఎవరూ ఫలానా అనుకొనే అవకాశం ఉండరాదు. నిజానికి ఈ పవిత్ర జీవనం ఆచరించేది నిగ్రహం (శరీరం మాట) కోసం క్షాళన కోసం (కల్మషాల నుండి) నిరాసక్తత, నిరోధం కోసం (లాలస నుండి).

## ఆరవ విభాగం

# సాంఘిక, రాజకీయ సమస్యలపై ఉపదేశాలు

## 1. రాకుమారుల దయాదాక్షిణ్యాలపై ఆధారపడకు

1. భగవానుడొకప్పుడు రాజ గ్రహలోని ఉడతల మేత స్థలమైన వెదురువనంలో ఉండేవాడు.

2. అప్పట్లో భగవానుని పట్ల వైరం పెంచుకున్న దేవదత్తునికి రాకుమారుడు అజాత శత్రువు మద్దతు నిస్తున్నాడు.

3. అతడు దేవదత్తుని మద్దతు దారులను తన దగ్గర వుంచి పోషిస్తున్నాడు. ఐదువందల బండ్లలో వారికి ఉదయం, సాయంత్రం ఐదువందల కుండల్లో ఆహారం పంపిస్తున్నాడు.

4. తర్వాత కొంత మంది భిక్షువులు భగవానుని దగ్గరికి వచ్చి నమస్కరించి ఒక వైపు కూర్చున్నారు. కూర్చుని ఈ విషయాలన్నీ ఆయనకు వారు వివరించారు.

5. సోదర భిక్షువుల నుద్దేశించి భగవానుడీ విధంగా చెప్పాడు "మీరు రాజుల నుంచి సంపద కోసంగాని, అనుగ్రహం కోసంగాని, పొగడ్తల కోసం గాని ప్రాకులాడవద్దు. రాకుమారుడు అజాతశత్రువు దేవదత్తునికి మద్దతునిస్తూ ఉదయం సాయంత్రం ఐదువందల బండ్లలో ఆహారం ఉన్న ఐదువందల కుండలు పంపుతూ ఉండవచ్చు. అది దేవదత్తుని స్థితిని మెరుగు పరచలేదని పతనం తథ్యమని గుర్తించండి "

6. "సోదరులారా! పిచ్చి కుక్క ముక్కుపైన కాలేయపు ముక్కను విరచ యత్నిస్తే ఆ కుక్క మరింత పిచ్చిదయినట్లు, రాకుమారుడు అజాత శత్రువు దేవదత్తునికి మద్దతు ఇవ్వడం దేవదత్తుని పిచ్చివాని జేసి నాశనం చేయడానికి దోహదం చేస్తుందే తప్ప అతన్ని మంచి పరిస్థితుల్లో వృద్ధి పరచదు. కాబట్టి సోదరులారా రాకుమారుల కానుకల మెప్పు పొగడ్తలు వినాశకరం."

7. "నిక్కమైన ప్రశాంత జీవనానికి అవి నిష్ఠురమైన, బాధాకరమైన ప్రతిబంధకాలే."

8. "అందుచేత సోదరులారా! ఈ మార్గంలో అభ్యాసం చెయ్యండి. కానుకలు, పొగడ్తలు మెప్పులు మీ ముందుకు వస్తే వాటిని తిరస్కరిస్తాం. అవి మీ పాలిట పడితే వాటిని మీ మీద పట్టు సాధించనివ్వం. మీ మనసుల్లో తిష్ఠ వేసుకోనివ్వం. మిమ్మల్ని రాకుమారుల దాసులను చెయ్యనివ్వం."

## 2. రాజు ధర్మ పరాయణుడైతే ప్రజలు ధర్మపరాయణులవుతారు.

1. ఒకప్పుడు భగవానుడు భిక్షువుల నుద్దేశించి ప్రబోధించాడు

2. సోదరులారా! రాజులు ధర్మపరాయణులు కాని సమయాల్లో వారి మంత్రులు అధికారులు, కూడ అధర్మానికి దిగుతారు. మంత్రులు అధికారులు అధర్మపరాయణులైతే బ్రాహ్మణులు గృహస్థులు అధర్మపరాయణు లవుతారు. బ్రాహ్మణులు గృహస్థులు అధర్మ పరాయణులైతే పట్టణాల్లోని, గ్రామాల్లోని సామాన్య ప్రజలు కూడ అధర్మ పరాయణులవుతారు.

3. "కాని ఎక్కడ రాజులు ధర్మ పరాయణులుగా ఉంటారో రాజులు, మంత్రులు అధికారులు కూడ ధర్మ పరాయణులుగా ఉంటారు. ఎప్పుడయితేరాజులు మంత్రులు అధికారులు ధర్మపరాయణులయి ఉంటారో, బ్రాహ్మణులు, గృహస్థులు ధర్మపరాయణులవుతారు. ఎప్పుడైతే బ్రాహ్మణులు గృహస్థులు ధర్మ పరాయణు లవుతారో పట్టణాలలోని గ్రామాల్లోని సామాన్య ప్రజలు ధర్మపరాయణులవుతారు.

4. "ఆవుల మంద వెళుతున్నప్పుడు ముసలి ఎద్దు దారి తప్పిందో మిగతా ఆవులన్నీ దాని వెంట దారి తప్పుతాయి. అలాగే మనుషుల్లో ఒక ముఖ్యుడైన వాడు వక్రగతి పడితే ఇతరులు కూడ అదే దారి పయనిస్తారు.

5. అదే విధంగా రాజు తప్పుదారిలో నడిస్తే మొత్తం రాజ్యమంతా నష్టపోతుంది. ఆవులు వెళుతున్నప్పుడు ముందు వరుసలో ఉన్న ఎద్దు సరైన దారిలో వెళితే మిగతావి అదే దారిలో నేరుగా వెళతాయి. అలాగే మనుష్యుల్లో ముఖ్యుడు ధర్మవర్తనుడైతే ఇతరులంతా అతడ్ని అనుసరిస్తారు. రాజులు మంచి వారైతే రాజ్యమంతా సుఖ సంతోషాలతో ఉంటుంది."

## 3 రాజకీయ, సైనిక పాటవం సాంఘిక వ్యవస్థపై ఆధారపడుతుంది.

1. భగవానుడు ఒకప్పుడు రాబందుల పర్వతం మీద గల రాజు గ్రహలో నివసించాడు.

2. ఆ సమయంలో విదేహ వంశ సంజాత అయిన మహారాణి కుమారుడు, మగధ రాజు అయిన అజాతశత్రు తన శత్రువులైన వజ్జనుల మీద దండయాత్రకు ఉత్సాహంతో ఉండి తనలో తానే అనుకున్నాడు. "ఈ వజ్జినులను సమూలంగా నాశనం చేస్తాను. వారెంత శక్తి సంపన్నులు, బలసంపన్నులయినా సరే వీరిని ధ్వంసం చేస్తాను, వజ్జనులను రాజ్యం నుండి తరిమివేస్తాను."

3. మగధ ప్రధాన మంత్రి అయిన బ్రాహ్మణుడు వశకరునితో ఈ విధంగా అన్నాడు.

4. "బ్రాహ్మణుడా! చూడు నీవు భగవానుని దగ్గరికి వెళ్ళి ఆయన చరణాలవద్ద నా తరఫున మోకరిల్లి, తాము అనారోగ్యం నుంచి బాధల నుంచి దూరంగా ఉన్నారా! సౌఖ్యంగా సంపూర్ణ ఆరోగ్యంగా, సంతోషంగా ఉన్నారా అని నా తరఫున వారిని విచారించండి."

5. "తర్వాత విదేహ మహారాణి కుమారుడు, మగధ రాజు అయిన అజాతశత్రువు వజ్జీనులపై దాడికి ఉవ్విళ్లూరుతున్నాడని చెప్పండి. వారెంత బలవంతులు, శక్తి సంపన్నులైనా నేను వారిని నిర్మూలించి రాజ్యభ్రష్టుల్ని చేయ సంకల్పించానని చెప్పండి"

6. ఇంకొక విషయం జాగ్రత్తగా జ్ఞాపకముంచుకోండి. భగవానుడు ఏం ప్రవచిస్తాడో అది మనస్సులో ఉంచుకొని నాకు తిరిగి అప్పగించండి. బుద్ధుడు చెప్పేది ఎప్పుడు అసత్యం కాదు."

7. బ్రాహ్మణుడు వశకరుడు రాజు మాటల్ని విని "మీరు చెప్పిన ప్రకారమే జరుగుతుందని పలికాడు. ఆ వెంటనే అనేక ఉత్తమాశ్వాలతో పూన్చిన రధాలు సిద్ధం చెయ్యడానికి ఆదేశాలు వెళ్ళాయి. వాటి మీద రాబందుల పర్వతం చేరుకున్నాడు.

8. పర్వతం చేరుకున్న బ్రాహ్మణుడు అయిన మగధ ప్రధాన మంత్రి భగవానుని కలుసుకొని ప్రణామాలర్పించాడు. ఇరువురి మధ్య గౌరవ మర్యాదలయ్యాక మగధరాజు పంపిన సందేశాన్ని బ్రాహ్మణుడు భగవానునికి అందజేశాడు.

9. అప్పుడు పూజ్య ఆనందుడు భగవానుని వెనుకవైపు నిలుచున్నాడు. భగవానుడు ఆనందుని ఉద్దేశించి "వజ్జీనులు తరచూ ప్రజా సభలు నిర్వహిస్తారని నీవు విన్నావా! ఆనందా" అన్నాడు.

10. "ప్రభూ! నేను విన్నాను." సమాధానమిచ్చాడు ఆనందుడు.

11. "అయితే ఆనందా! అని మళ్ళీ భగవానుడు "పూర్తిగా నిరంతరం వజ్జీనులు ప్రజాసభలను నిర్వహిస్తున్నారు కదా! ఎప్పటి వరకు అవి కొనసాగిస్తారో అంతకాలం వారికి పతనం సంభవించదు; పురోగమించటమే తప్ప"

12. ఆనందా ప్రజల సమ్మతితో సభలు జరుపుతూ వారి సమ్మతితో నిర్ణయాలు తీసుకుని సర్వసమ్మతితో వాటిని అమలు జరుపుతూ పురోగమిస్తున్నంత కాలం వారికి పతనం లేదు.

13. ఎంతకాలం సుప్రతిష్ఠంకాని దేనినీ శాశనంగా మలచరో, వున్న శాసనాన్ని రదు పరచరో, తొలిరోజుల్లో ప్రతిష్ఠితమైన సంప్రదాయాలను అనుకూలంగా నడచుకుంటారో,"

14. "ఎంత కాలమైతే వజ్జికులు తమ పూర్వీకుల పట్ల గౌరవాదరాలు అభిమానం చూపుతూ వారి సలహాలనూ ఆలకించడం తమ బాధ్యతగా స్వీకరిస్తారో.......

15. "ఎంత కాలం వారు తమ స్త్రీలు యువతులను బలవంతంగా బంధించి ఉంచరో.....

16. "ఎంతకాలం వజ్జీనులు మతాన్ని గౌరవిస్తారో...

17. ఆనందా, అంత కాలం వజ్జీనులు పురోగమిస్తారే గాని పతనం చెందరు ఎవరూ వారిని నాశనం చేయలేరు.

18. "ఎంతకాలం వజ్జినులు ప్రజాస్వామ్యాన్ని విశ్వసిస్తారో ఆచరిస్తారో అంతకాలం వారి దేశానికి ఎలాంటి ప్రమాదం ఉండదు" అని భగవానుడు సంక్షిప్తంగా ప్రకటించాడు.

19. ఆ తర్వాత భగవానుడు వశకరుడ్ని ఉద్దేశించి ఇలా చెప్పాడు.

20. "ఓ బ్రాహ్మణా! నేను వైశాలిలో ఉన్నప్పుడు వజ్జనులకు శ్రేయోనియమాలను బోధించాను."

21. ఓ గౌతమా ఎంత కాలమైతే వజ్జినులు ఈ నియమాలను పాటిస్తారో అంత కాలం వారిని మగధ రాజు అధిగమించలేడని మాకర్థమైంది."అన్నాడు బ్రాహ్మణుడు.

22. వశకరుడు భగవానుని మాటలు విని తన ఆసనం నుండి లేచి భగవానుడు చెప్పిన సందేశాన్ని రాజుకు అందించడానికి రాజగ్రహ బయలుదేరాడు.

## 4. యుద్ధం తప్పు

1. ప్రసేనుని రాజ్య భాగమైన కాశీపై మగధరాజు అజాతశత్రువు తన అశ్విక పదాతి దళాలతో దండయాత్రకు వెళ్ళడం సంభవించింది. ఈ దండయాత్ర వార్త విన్న ప్రసేనుడు కూడ తగినంత బలగంతో ఎదుర్కోడానికి వెళ్ళాడు.

2. ఇరుసేనలు యుద్ధం చేసాయి. అజాత శత్రువు ప్రసేనుడిని ఓడించాడు. ప్రసేనరాజు తన రాజధాని శ్రావస్తికి వెనుతిరిగాడు.

3. శ్రావస్తిలో భిక్షాటనకు వెళ్ళి తిరిగి వచ్చిన భిక్షువులు జరిగిన యుద్ధం ప్రసేనుని ఓటమిగురించి భగవానునికి చెప్పారు.

4. భిక్షులారా ! మగధి రాజు అజాత శత్రువు ఏ చెడుకైనా మిత్రుడే. ప్రసేన రాజు ఏమంచికైనా మిత్రుడే. ప్రస్తుతానికి ఓటమి పొందిన అనుభవంతో ప్రసేనుడు ఈ రాత్రి గడుపుతాడు.

5. "విజయం ద్వేషం రగిలిస్తుంది. ఓడిన వారు దుఃఖంలో మునిగిపోతారు కాని ఎవరు శాంతిగా నిర్వికారంగా ఉంటారో వారు సుఖజీవనం సాగిస్తారు. వారు జయాన్ని అపజయాన్ని పరిత్యజిస్తారు."

6. మరోసారి ఈ ఇరువురు రాజులకు యుద్ధం సంభవించింది. కాని ఈ సారి కోసలరాజు ప్రసేనుడు అజాత శత్రువును ఓడించి సజీవంగా పట్టుకున్నాడు. అప్పుడు ప్రసేన రాజు అనుకున్నాడు "ఈ రాజు తనని భాధించని నన్ను బాధించాడు. అయినా అతడు నా మేనల్లుడే. అందుచేత ఈతని సైన్యాన్ని, ఏనుగులను, అశ్వాలను, రథాలను పదాతి దళాల్ని హస్తగతం చేసుకొని ఈతడ్ని మాత్రం సజీవంగా వదిలి పెడుతూ అట్లాగే వదిలి పెట్టాడు కూడ.

7. శ్రావస్తిలో భిక్షాటనకు వెళ్ళిన భిక్షువులు తిరిగి వచ్చి ఈ విషయాలను భగవానునికి వివరించారు. ఆ తర్వాత ఆ మహానుభావుడు అన్నాడు. ``ఓ మనిషి ఇంకో మనిషికి చెరుపు చేయవచ్చు. తాత్కాలికంగా అది అతనికి తృప్తి నివ్వ వచ్చు. తర్వాత తను చెరుపు తనకే చెరుపు అవుతుంది.

8. ``తాను చేసిన చెరుపు పండే వరకు మూర్ఖుడు, ఇదే మంచి అదను అనుకుంటారు. కాని పాపం పండినప్పుడు అతడే చెడతాడు.

9. ``హంతకుడు హంతకుని బారిన పడవలసివస్తుంది. జయించిన వాడు జయించ బడ వలసి వస్తుంది. నిందించేవారు నిందలకు గురి కావలసి వస్తుంది.

10. ``చర్య పరిణామంవల్ల చెడుపు చేసిన వాటికి చెడు జరుగుతుంది."

## 5. శాంతిని నెల కొల్పడం విజేత విధి.

1. యుద్ధంలో గెలిచి శాంతిని సాధించినవాడు తనచే పరాజితుడైన, వాడిని దస్యుని చేసుకోవడం కుదరకపోతే అణచివేసేందుకు ఉందంటారు. ఈ విషయంలో బుద్ధుని అభిప్రాయం ఇందుకు విరుద్ధంగా ఉంటుంది. ఆయన దృష్టిలో శాంతికి ఉన్న అర్థం ఏదయినా తన విజయాన్ని ఓడిన వాడికి సేవకు వినియోగించవలసిన బాధ్యత విజేతకుంది. ఈ విషయాన్ని భిక్షుకులకు చెప్పాడు.

2. యుద్ధంలో గెలిచి శాంతిని నెల కొల్పాలంటే గెలిచిన వారు తన నైపుణ్యాన్ని ప్రదర్శించి ఓడినవాడిని సాంత్వన వాక్యాలతో దయాదృష్టితో నిగర్వంగా సున్నితంగా మంచి అతిధి ప్రవర్తించినట్లు ప్రవర్తించాలి. కాని ఆత్మ నిగ్రహం కోల్పోయి అవివేకంతో నీచ స్థాయికి దిగజారి ఓడిన వాడిని పీడించి తీవ్ర నిందకు గురి చెయ్యరాదు.

3. సమస్త ప్రాణులు చిన్నవి గాని పెద్దవి గాని బలవంతమైనవిగాని బలహీనమైనవి గాని కనిపించేవిగాని కనిపించనివిగాని దూరంగా ఉన్నవిగాని దగ్గరగా ఉన్నవి గాని పుట్టినవిగాని పుట్టనివిగాని పుట్టబోయేవిగాని అన్నీ ఎల్లప్పుడూ శాంతి సౌభాగ్యాలలో ఓలలాడాలి.

4. ``ఎవరూ తోటి వారిని బుజ్జగించనూకూడదు. గేలిచెయ్యనూ కూడదు. క్రోధంతో, ద్వేషంతో యితరుల కీడు కోరరాదు.

5. స్వంత ప్రాణం పణంగా పెట్టి, తన ఒక్కగా నొక్క శిశువును ఆపదా రాకుండా తల్లికాపాడినట్లు - సర్వ ప్రాణి పరివృతంగా నువ్వుసంభావించు ; శిఖరాలతో, లోయలతో మైదానాలలో నిండి వున్న సమస్త విశ్వాన్ని నీ విశాలపరిష్వంగంలోకితీసుకున్న ప్రేమ, ద్వేషాలు స్పృశించని, అవధులులేని ప్రేమ, నీదికావాలి.....

6. ``కాబట్టి నువ్వు నిలిచినా, నడిచినా, కూర్చున్నా, పరుండినా నీ సమస్త శక్తితో యిలా సంభావించు:

`ఇదే, యిదే దివ్యస్థితి"

# ఐదవ అధ్యాయం

# సంఘం

మొదటి భాగం : సంఘం

రెండవ భాగం : భిక్షువు - బుద్ధుని అభిప్రాయంలో భిక్షువు

మూడవ భాగం : భిక్షువు బాధ్యతలు

నాల్గవ భాగం : భిక్షువు - సామాన్య బౌద్ధులు

ఐదవ భాగం : బౌద్ధులు పాటించవలసిన వినయ విధులు

# మొదటి భాగం

## సంఘం

1. సంఘం - దాని నిర్మాణం
2. సంఘ సభ్యత్వం
3. భిక్షువు చేయవలసిన ప్రమాణాలు
4. భిక్షువు - మత సంబంధనేరాలు
5. భిక్షువు - ఆంక్షలు
6. భిక్షువు - ప్రవర్తనా నియమావళి
7. భిక్షువు - నేర విచారణ

# 1. సంఘం దాని నిర్మాణం

1. బుద్ధుని అనుయాయులు `భిక్షువు ' `ఉపాసకులు' అని రెండు తరగతులుగా విభజించ బడ్డారు.

2. భిక్షువులను సంఘంగా ఏర్పరచి ఉపాసకులను సామాన్య బౌద్ధులుగా పరిగణించారు. ఉపాసకులు సంఘంలో సభ్యులు కారు.

3. బౌద్ధ భిక్షువైన ప్రతివారు ముందుగా పరివ్రాజకుడై వుండాలి. పరివ్రాజక వ్యవస్థ బౌద్ధ భిక్షువుల సంఘం కంటే ప్రాచీనమైనది.

4. పరివ్రాజక వ్యవస్థలోని సభ్యులు సంసారిక బంధనాలను వదిలి దేశ సంచారులుగా వుండేవారు.

5. పరి వ్రాజకులు సత్యాన్వేషణ కోసం వివిధ గురువులను వేదాంతులను కలుసుకొని వారితో నీతి, వేదాంతం, ప్రకృతి, మొదలగు విషయాలపై చర్చలు జరిపి వారి బోధనలు వింటూ దేశ సంచారం చేస్తూ వుండేవారు.

6. ప్రాచీన పరి వ్రాజకులలో కొంత మంది ఎవరో ఒక గురువు నాశ్రయించుకొని వుండేవారు. కొంత మంది గురువుల నాశ్రయించక స్వతంత్రంగా వుండేవారు.

7. ప్రాచీన పరివ్రాజకులలో స్త్రీలు కూడా వుండేవారు. వారు పురుష పరివ్రాజకులతో కలిసి వుండడం కాని, తమంత తామే ఒంటరిగా వుండడం గాని వుండేది.

8. ప్రాచీన పరివ్రాజకులకు సంఘం లేదు. వారికి క్రమశిక్షణా సంబంధమైన నియమాలు కాని, సాధించవలసిన లక్ష్యాలుగాని లేవు.

9. బుద్ధుడు మొదటి సారిగా తన పరివ్రాజకులను సంఘంగా ఏర్పరచి వారిని క్రమశిక్షణకు సంబంధించిన నియమనిబంధనలను ధ్యేయాన్ని నిర్దేశించి ఆ ధ్యేయసాధన కోసం కృషిచేసేలా తీర్చాడు.

# 2. సంఘ సభ్యత్వం

1. ఎవరైనా సంఘ సభ్యులు కావచ్చు.

2. సభ్యత్వానికి కులం అడ్డుకాదు.

3 స్త్రీపురుష విభేదం లేదు.

5. సంఘంలో కులానికి తావులేదు.
6. సమాజంలోని అంతస్తుకు సంఘంలో స్థానం లేదు.
7. సంఘంలోని సభ్యులందరు సమానులే.
8. సంఘంలో స్థాయి నిర్ణయం పుట్టుకను బట్టి కాక పరిణతిని బట్టి వుంటుంది.
9. బుద్ధుడు చెప్పినట్లుగా సంఘం సముద్రంలాంటిది. భిక్షువులు సముద్రంలో కలిసే నదిలాంటివారు.
10. సముద్రంలో కలువక ముందు నదికి తనదంటూ ఒకపేరు, వునికి వున్నట్లుగానే సంఘంలో కలువక ముందు భిక్షువులకు తమ దంటూ ఒక పేరు, ప్రత్యేక వునికి వుంటుంది.
11. సముద్రంలో కలువగానే నది తన పేరు, ప్రత్యేక వునికి కోల్పోయినట్లుగానే సంఘంలో చేరగానే భిక్షువులు వారి పేరు, వునికి కోల్పోతారు.
12. అది మిగతా వాటిలో ఐక్యం అవుతుంది.
13. అదే మాదిరిగా సంఘంలో చేరిన భిక్షువు అందరు భిక్షువులులో ఒకడౌతాడు.
14. బుద్ధుని ప్రవచనం ప్రకారం సంఘంలో చేరిన భిక్షువు తన కులాన్ని అంతస్తును కోల్పోతాడు.
15. సంఘంలో వున్న ఒకే ఒక వేర్పాటు స్త్రీ పురుష భేదం. భిక్షువుల సంఘం భిక్షుకిల సంఘం వేర్వేరుగా వుంటాయి.
16. సంఘంలో చేరిన వారిని శ్రమణేరులు, భిక్షువులుణులు అని రెండు తరగతులుగా విభజించారు.
17. 20సంవత్సరములలోపున వయస్సున్నవారు శ్రమణేరులు కావచ్చు.
18. త్రిశరణంతో పాటు పది ధర్మ సూత్రాలను ఆచరించటం వల్ల బాలుడు శ్రమణేరుడౌతాడు.
19. బుద్ధుని అనుసరించడం, ధర్మాన్ని అనుసరించడం, సంఘాన్ని అనుసరించడం అనేవి త్రిశరణాలు.
20. హత్య, దొంగతనం నుంచి దూరంగా వుండడం బ్రహ్మచర్యం పాటించడం, అబద్ద మాడ కుండడం, మద్య పానం చేయకుండడం.
21. అకాల భోజనం చేయకుండా వుండడం, అసభ్య, అవినీతి కరచర్యలకు పాల్పడకుండడం, భూషణాలు ధరించకుండడం, అలంకరణాలు చేసికొనక పోవడం, ఆడంబరాలనుంచి దూరంగా వుండడం బంగారం, వెండి ఎడల ఆపేక్ష కలగకుండడం.
22. ఇవీ పది ధర్మ సూత్రాలు.

23. శ్రమణేరుడు సంఘాన్ని ఎప్పుడైనా వదిలి పోయి సామాన్య బౌద్ధుడుగా వుండవచ్చు. శ్రమణేరుడు బౌద్ధ భిక్షువు అధీనంలో వుంటూ ఆ భిక్షువునకు శుశ్రూష జేయాలి. అతడు పరివ్రాజకుడు కాడు.

24. శ్రమణేరుడు భిక్షువు స్థాయి చేరడానికి రెండు దశలున్నాయి. మొదటి దశ పరివ్రాజకుడు, రెండవది ఉపసంపద దశ. ఈ రెండు దశలు దాటిన తర్వాత భిక్షువు అవుతాడు.

25. బౌద్ధ భిక్షువైన ఉపాధ్యాయుని అంగీ కారంతోనే శ్రమణేరుడు పరివ్రాజకుడౌతాడు. పరివ్రాజకుడైన వాడు తన ఉపాధ్యాయుని శుశ్రూషలో సంరక్షణలో వుండాలి.

26. ఉప సంపద ప్రధానానికి ప్రత్యేకం ఏర్పాటయిన సంఘ సమావేశంలో, సంరక్షణ కాలం ముగించుకున్న తన వటువు పేరును ఉపాధ్యాయుడు ప్రతిపాదించాలి. వటువు కూడ ఉపసందనిమిత్తం సంఘాన్ని అభ్యర్థించాలి.

28. శ్రమణేరుడు భిక్షువు కావడానికి తగిన వాడని, సరియైన వాడని నిర్ణయించడానికి రూపొందించిన ప్రశ్నలకు శ్రమణేరుడు సంతృప్తి కరమైన సమాధానాలివ్వాలి.

29. సంఘం ఉపసంపదునిగ గుర్తింపుకు అనుమతి ఇస్తేనే శ్రమణేరుడు బౌద్ధ భిక్షువౌతాడు.

30. భిక్షుకుల సంఘ సభ్యత్వానికున్న నియమాలే దాదాపు భిక్షుకిల సంఘ సభ్యత్వానికున్నాయి.

## 3. భిక్షువు చేయ వలసిన ప్రమాణాలు

1. సామాన్య బౌద్ధుడు గాని శ్రమణేరుడు గాని బౌద్ధ సూత్రాలను స్వీకరించి వాటిని అనుసరించడానికి బద్ధుడై వుంటాడు.

2. భిక్షువు అట్టి సూత్రాలను స్వీకరించడంతో పాటు వాటిని ప్రః ...లుగా ఆచరిస్తూ కట్టుబడి వుంటాడు. ప్రమాణాలను వుల్లంఘిస్తే శిక్షకు పాత్రుడౌతాడు.

3. భిక్షువు ఈ క్రింది ప్రమాణాలు చెయ్యాలి.

4. దొంగ తనం చెయ్యను.

5. ప్రగల్భాలు పలకను.

6. ఏజీవిని చంపను, ప్రాణహాని చెయ్యను.

7. బౌద్ధనియమాల ప్రకారం కలిగి వుండ దగిన వస్తువులకు మించి దేనినీ కలిగి వుండను.

8. ఈ క్రింది ఎనిమిది వస్తువులు మించి మరే వస్తువులు భిక్షువులు కలిగి వుండరాదు.

1. శరీరాన్ని దాచుకోవడానికి మూడు వస్త్రాలు.

ii ఉత్తర సంగ్ (అంగవస్త్రం - శరీరపైభాగం రక్షణకోసం)

iii సంఘటి (చలికి కప్పుకొనే దుప్పటి)

2. మొలత్రాడు
3. భిక్షాపాత్ర
4. క్షురకర్మకోసం కత్తి
5. సూది
6. నీటి సంచి

9. బీదవానిగానే వుంటానని భిక్షువు ప్రమాణం చెయ్యాలి. ఆహారం కోసం భిక్షాటన భిక్షపైనే జీవించాలి. రోజుకు ఒక సారి మాత్రమే భోజనం చేస్తూ బౌద్ధ విహా చోట వాటిలోనే వుంటూ అవి లేని చోట చెట్టు క్రింద వుంటూ జీవనం గడపే

10. విధేయుడుగా వుంటానని భిక్షువు ఎవ్వరికీ ప్రమాణం చెయ్యడు. పైవారికి వి ప్రకటించడం అనుభవంలేని కొత్తవారు చేయవలసిన పని కాని భిక్షువులు చేయ పనికాదు. భిక్షువు మోక్షసాధన, ఉపాధ్యాయునిగా వుపయోగం అతని స్వీయ సంస్క ఆధారపడి వుంటాయి. భిక్షువు ధర్మానికి విధేయుడే కాని తనపై వానికి గాదు. వానికి మానవా తీతమైన మేధస్సు గాని సర్వజ్ఞతగాని లేదు. భిక్షువు ఉద్ధతి లేక అతని పైనే ఆధారపడి వుంటాయి, దానికి కావలసిన స్వేచ్ఛ అతనికి వుండా

11. భిక్షువు తాను చేసిన ప్రమాణాలలో దేనినైనా ఉల్లంఘించినట్లయితే `పరాజిక' అ చేసిన వాడౌతాడు. `పరాజిక' అనే నేరం చేసిన భిక్షువుకు శిక్ష సంఘ బహిష్క

## 4. భిక్షువు - మత సంబంధ నేరాలు

1. భిక్షువు తాను చేసిన ప్రమాణాల్లో దేన్ని ఉల్లంఘించినా ధర్మం పట్ల అపచారం చే
2. ప్రమాణోల్లంఘనమే కాకుండా నేరాలుగా పరిగణించేవి కొన్ని మత సంబంధ వున్నాయి. అవి ``సంఘాదిశేష'' అనే నేరాలు.
3. `వినయ పీటకంలో ఇటువంటి పదమూడు నేరాలను పేర్కొన్నారు.
4. ఆపద మూడు, `పరాజిక' నేరాలకు అనుబంధమైనవే.

## 5.భిక్షువు - ఆంక్షలు

1. భిక్షువు నేరాలు చేయకుండా వుండడమే కాక, కొన్ని ఆంక్షలకు కట్టుబడి వు భిక్షువుకు ఇతర మానవుల కున్నంత స్వేచ్ఛ ఉండదు.
2. ఇటువంటి ఆంక్షలలో ఒక భాగానికి `నిస్సగీయ - పసిత్తియ' మనిపేరు. ఇందులో

3. పై ఆంక్షలు దుస్తులు, ఉన్ని దుప్పట్లు, భిక్షాపాత్ర, వైద్య పరికరాలు కానుకలుగా స్వీకరించడానికి సంబంధించినవి.

4. అదే విధంగా బంగారం, వెండి స్వీకరించటం, భూముల కొనుగోళ్ళు అమ్మకాలలో పాల్గొడం సంఘం ఆస్తులను స్వంతం చేసుకోవడం లాంటి విషయాలకు కూడా సంబంధించినవి.

5. పై ఆంక్షలనుల్లంఘించిన భిక్షువులకు శిక్ష తీసుకున్న వస్తువులను తిరిగి అప్పగించడం (నిస్సగీయ) పశ్చాత్తాపాన్ని ప్రకటించటం (పసిత్తీయ).

6. ఈ ఆంక్షలతోపాటు భిక్షువు `పసిత్తీయ' అనే భాగానికి సంబంధించిన తొంభై రెండు ఆంక్షలకు లోబడి వుండాలి.

# 6. భిక్షువు సత్ ప్రవర్తనా నియమావళి

1. భిక్షువు సత్ప్రవర్తన కలిగి వుండాలి, తన ప్రవర్తనా సరళి ఇతరులకు ఆదర్శ ప్రాయమైనదిగా వుండాలి.

2. సత్ప్రవర్తన కలిగి వుండడానికి పాటించాల్సిన సత్ప్రవర్తనానియమావళిని బుద్ధుడు రూపొందించాడు.

3. ఈ సత్ప్రవర్తనా నియమావళిని సేఖియ ధమ్మ అంటారు. సేఖియ ధమ్మలు డెబ్బై అయిదు

# 7. భిక్షువు - నేర విచారణ

1. భిక్షువుపై మోపబడిన నేరాలను విచారణ చేయడానికి రూపొందించిన శాసనాల నామమాత్రమైనవి కావు. అవి భిక్షువుపై ఖచ్చితమైన నేరారోపణ, విచారణ, శిక్ష అమల చేయడానికి వీలైన శాసన బద్ధతను కలిగి వున్నవి.

2. నేర విచారణ కోసం ఏర్పరచబడిన న్యాయస్థానం లోవిచారణ జరపకుండా ఏ భిక్షువున శిక్షించకూడదు.

3. నేరం జరిగిన చోట వున్న భిక్షువులతో ఈ న్యాయ స్థానాన్ని ఏర్పరచాలి.

4. న్యాయ స్థానం ఏర్పాటు చేయడానికి అవసరమైనంత మంది భిక్షువులు లేకుంటే విచారణ జరగదు.

5. ఖచ్చితమైన నేరారోపణ జరగనిదే విచారణ చట్ట బద్ధం కాదు.

6. నిందితుని సమక్షంలో జరగని విచారణ చట్ట బద్ధమైన విచారణ కాజాలదు.

7. నిందితుడు తనను తాను సమర్ధించు కోవడానికి పూర్తి అవకాశం ఇస్తేనే విచార చట్టబద్ధమౌతుంది.

8. నేరస్థుడైన భిక్షువుకు ఈ కింది శిక్షలు వేయవచ్చు.

i తర్జనీయ కర్మ (మందలించి వదలి వేయడం)

ii నియష కర్మ (మతి చలించినవాడిగా ప్రకటించడం)

iii ప్రవ్రజ్ఞీయ కర్మ (సంఘ బహిష్కరణ)

iv ఉత్క్షేపనీయ కర్మ (వెలివేత)

v పరివాస కర్మ (విహారాన్నుంచి బహిష్కరించడం) పరివాస కర్మ అనే శిక్ష అయిన తరువాత భిక్షువు సత్ప్రవర్తన కలిగి వున్నాడని సంఘం. సంతృప్తి చెందితే ఆ నేరస్తుడైన భిక్షువును క్షమించి రద్దైన సంఘ సభ్యత్వాన్ని పునరుద్ధరించే వీలుంది. దీనిని అబ్బన కర్మ అని అంటారు.

## 8. భిక్షువు - నేరం ఒప్పుకోలు

1. భిక్షుక సంఘంలో బుద్ధుడు సృష్టించిన మౌలికమైన, అసమానమైన వ్యవస్థ, భిక్షువుతాను చేసిన నేరాన్ని తనే ఒప్పుకోవడానికి అవకాశం కల్పించడం. దీనినే `ఉపోసత్' అంటారు.

2. తాను గుర్తించిన నేరాలు - నివారించటానికే కాక, నేరాలు కాని వాటికి కూడ బుద్ధుడు ఆంక్షలు విధించాడు. సచ్ఛీలాన్ని ప్రోది చేసి సంరక్షించుకోవడంలో వీటికి సన్నిహిత సంబంధం ఉందని, అందుచేత వాటిని పాటించడం కూడా అంతే అవసరముందని ఆయన చెప్పారు.

3. ఈ ఆంక్షలను అమలు పరచడానికి సరిమైన మార్గమేదీ బుద్ధునికి కనబడక బహిరంగంగా నేరం ఒప్పుకోవటం అనే మార్గం ద్వారా భిక్షువు తన మనస్సునే సాక్షిగా చేసుకొని తప్పులు చేయకుండా వుండడం, చేసిన తప్పులు తనకు తానే ఒప్పకొని ప్రకటించటం అనే నియమాలను ఏర్పరచడం జరిగింది.

4. నేరం ఒప్పుకోలు అన్నది ఆంక్షలను ఉల్లంఘించడానికి పరిమితం చేసాడు. వీటిని `ప్రతిమోక్ష' అన్నాడు.

5. ఈ నేరం ఒప్పుకోలు అనే ప్రక్రియ అమలు జరగడానికి ఆ ప్రాంతంలో వున్న భిక్షువులు పక్షం రోజులలో చతుర్దశి, పంచదశి, అష్టమినాడు మూడు సమావేశాలు జరపాలి. ఈ మూడు సమావేశాలు జరిపే రోజులలో భిక్షువులు ఉపవాసాలుంటారు. ఇలా ఉపవాసాలు ఉన్నందువలన ఆ రోజును ఉపోసత్" అంటారు.

6. `ప్రతిమోక్ష' కింద రూపొందించిన ఆంక్షలను సమావేశాలలో ఒక దాని తరువాత ఒకటి ఒక భిక్షువు చదువుతాడు. సమావేశమైన భిక్షువులను ఉద్దేశించి మూడు సార్లు `మీరందరూ మౌనంగా వుండడం వల్ల ఈ ఆంక్షను మీరెవరూ ఉల్లంఘించలేదను కుంటాను అంటాడు. ప్రతి ఆంక్ష విషయంలో ఇదే విధంగా చేస్తాడు.

7. భిక్షుకిల సంఘానికి కుడా పైవిధంగానే `నేరం ఒప్పుకోలు కార్య క్రమం జరుగుతుంది.

8. నేరం ఒప్పుకున్న తరువాత నేరారోపణ, నేర విచారణ జరగవచ్చు.

9. భిక్షువు ఆంక్షలనుల్లంఘించినట్లు నేరం ఒప్పుకోని పక్షంలో ఆంక్షలనుల్లంఘించిన సంఘటనకు ప్రత్యక్ష సాక్షి అయిన మరొక భిక్షువు వాటిని సంఘం దృష్టికి తెస్తే నేరారోపణ, నేర విచారణ జరపాలి.

# రెండవ భాగం

# బుద్ధుని భావనలో భిక్షువు

1. భిక్షువు ఎట్లా వుండాలనే దానిపై బుద్ధుని అభిప్రాయం.
2. భిక్షువు - సన్యాసి.
3. భిక్షువు - బ్రాహ్మణుడు.
4. భిక్షువు - ఉపాసకుడు.

# 1. భిక్షువు ఎట్లా వుండాలనే దానిపై బుద్ధుని అభిప్రాయం

1. భిక్షువుగా వుండడానికి అర్హతలను ఈ క్రింది విధంగా బుద్ధుడు చెప్పాడు.

2. పాప పరిహారం చేసుకోకుండానే కాషాయ వస్త్రాలు ధరించాలనుకునేవాడు, సత్యాన్నీ, మనో నిగ్రహాన్ని లక్ష్య పెట్టనివాడు కాషాయ వస్త్రం ధరించడానికి అర్హుడు కాడు.

3. ఎవరైతే పాప పరిహారం చేసుకొని, సత్యాన్నీ మనో నిగ్రహాన్ని పాటిస్తూ సుగుణ వంతుడుగా వుంటాడో అతడే భిక్షువుగా కాషాయవస్త్రాలు ధరించడానికి అర్హుడు.

4. భిక్షాటన జేసినంత మాత్రాన భిక్షువుగాడు. భిక్షువులకు నిర్దేశించిన నియమాలన్నీ పాటిస్తూ భిక్షాటన జేసిన వాడు మాత్రమే భిక్షువు.

5. చెడుకు అతీతంగా పవిత్రంగా వుంటూ ప్రాపంచిక జీవనాన్ని కడు జాగ్రత్తగా సాగించేవాడే నిజమైన భిక్షువు.

6. క్రమ శిక్షణతో దీక్షలను పాటిస్తూ, విశేషజ్ఞాననిమగ్నుడై సంపత్తి గలిగి ధ్యానమగ్నుడై ఏకాంతంగా నిద్రించిన మాత్రాన ప్రాపంచిక విషయాలనుంచి విముక్తి చెందినందువల్ల గలిగే నిజమైన ఆనందం పొందజాలరు. కోరికలను పరిహరించిన భిక్షువు మాత్రమే నిజమైన ఆనందాను భూతి పొందగలుగుతాడు.

7. తన వాక్కును అదుపులో వుంచుకొని వివేకంతోనూ, సౌమ్యంగానూ మాట్లాడుతూ, అను శాసనాల అర్థాలను బోధించే భిక్షువు మాటలే మధురం.

8. నియతికి అనుగుణంగా జీవిస్తూ, దాని వల్ల కలిగే ఆనందం పొందుతూ నియతిని నిత్యం స్మరించే భిక్షువు నిజమైన నియతి నుంచి వైదొలగడు.

9. తనకు లభించిన దాన్ని తృణీకరించకూడదు ; ఇతరులను చూసి ఈర్ష్య చెందకూడదు. ఇతరుల పట్ల ఈర్ష్యచెందే భిక్షువు మనశ్శాంతి పొంద జాలడు.

10. తనకు లభించినది ఎంత అల్పమైనదైనా తృణీకరించకుండా బద్ధకం విడనాడి, స్వచ్ఛమైన జీవితం గడిపే భిక్షువును దేవతలు కూడా దీవిస్తారు.

11. పేరు ప్రఖ్యాతుల కోసం పాకులాడ కుండా తనకు లభించని దాని కోసం బాధపడకుండా వుండేవాడే భిక్షువు.

12. దయతో వ్యవహరిస్తూ, బౌద్ధ ధర్మాచరణలో ఆనందాన్ని అనుభవించే భిక్షువు, సహజాత వాంఛల నుండి విముక్తి చెందడంలో గల ఆనందాన్ని అంటే `నిబ్బానం' పొందుతాడు.

13. భిక్షకుడా! రాగద్వేషాలతో నిండిన ఈ పడవను ఖాళీ చెయ్యి ఖాళీగా వున్న పడవ త్వరగా గమ్యం చేరినట్లు రాగద్వేషాలు వీడిన నీవు కూడా `నిబ్బానం' సాధించ గలుగుతావు.

14. అయిదు బంధనాలను తెంచుకొని, వాటికి అతీతంగా జీవించు. అయిదు బంధనాలను తెంచుకున్న భిక్షువు 'ఓ ఘతిన్నుడు' (వరద నుండి రక్షింపబడినవాడు) అవుతాడు.

15. భిక్షుకుడా! ధ్యానంచెయ్యి. ప్రమత్తతను విడనాడు! అల్పసుఖాలవైపుకు నీ ఆలోచనలను మరల్చ వద్దు.

16. జ్ఞానం లేనిదే ధ్యానం లేదు ; ధ్యానంలేనిదే జ్ఞానం లేదు. జ్ఞానం, ధ్యానం, కలిగినవాడు నిబ్బాన స్థితిని చేరుతాడు.

17. ప్రశాంతమైన, కోరికలకు అతీతమైన మనస్సుతో బౌద్ధ ధర్మాన్ని దర్శించ గలిగిన భిక్షువు సామాన్య మానవులకు అతీతమైన ఆనందాన్ని పొందుతాడు.

18. ఇంద్రియ నిగ్రహం, సంతృప్తి కలిగి, బౌద్ధ ధర్మాను సారమైన ఆంక్షలకు కట్టుబడి వుండి, బద్ధకస్తులుగాని పవిత్రులతో స్నేహంచేయడం ద్వారా భిక్షువు వివేకవంతుడై. ధర్మ జీవనం ప్రారంభిస్తాడు.

19. భిక్షువు యాచన ద్వారా జీవించాలి, తన విధులను సంపూర్ణంగా నిర్వర్తించాలి, తద్వారా కలిగిన పరిపూర్ణ ఆనందంలో తన భాధలను శమింప చేస్తాడు.

20. నిన్ను జాగృతం చేసుకో నిన్ను నువ్వు పరీక్షించుకో. ఆ రకంగా ఆత్మ రక్షణ చేసుకొని, మెలకువతో మెలగడం వల్ల, భిక్షుకుడా, నీవు ఎల్లప్పుడూ ఆనందం పొందుతావు.

21. నీ అంతరాత్మే నీకు రక్షణ. రౌతు అయిన వర్తకుడు ఉత్త మాశ్వాన్నీ అదుపు చేసినట్లు నీవు కూడా నీ మనసును అదుపులో పెట్టుకోవాలి.

22. శ్రద్ధా సక్తులతో ఆనందాన్ని పొంది, అనాలోచిత ప్రవర్తన పట్ల భయం కలిగి, నిప్పు వలె వేగంగా చరిస్తూ చిన్నా, పెద్ద బంధనాలను దహించి వేసే వాడే భిక్షువు.

23. వివేచనలో ఆనందం పొంది, అనాలోచిత చర్యల పట్ల భయం కలిగి తన పరిపూర్ణ స్థితిని కోల్పోని భిక్షువు `నిబ్బానం'కు సన్నిహితుడవుతాడు.

24. గౌతమ బుద్ధుని అనుయాయులు ఎప్పుడూ అప్రమత్తంగా ఉంటారు. రాత్రింబవళ్ళు వారి ఆలోచనలు బుద్ధునిపైనే లగ్నమై వుంటాయి.

25. బుద్ధుని అనుయాయులు ఎల్లప్పుడూ అప్రమత్తంగా ఉంటారు వారి ఆలోచనలు రాత్రిం బవళ్ళు ఆరామంపైనే వుంటాయి.

26. బుద్ధుని అనుయాయులు ఎల్లప్పుడూ అప్రమత్తంగా ఉంటారు వారి ఆలోచనలు రాత్రిం బవళ్ళు ధర్మంపైనే వుంటాయి.

27. బుద్ధుని అనుయాయులు ఎల్లప్పుడూ అప్రమత్తంగా ఉంటారు వారి ఆలోచనలు రాత్రిం బవళ్ళు సంఘంపైనే ఉంటాయి.

28. బుద్ధుని అనుయాయులు ఎల్లప్పుడూ అప్రమత్తంగానే ఉంటారు వారి మనస్సులు రాత్రింబవళ్ళు కరుణ చూపడం వల కలిగే ఆనందాన్ని పొందుతాయి

రెండవ భాగం

# బుద్ధుని భావనలో భిక్షువు

1. భిక్షువు ఎట్లా వుండాలనే దానిపై బుద్ధుని అభిప్రాయం.
2. భిక్షువు - సన్యాసి.
3. భిక్షువు - బ్రాహ్మణుడు.
4. భిక్షువు - ఉపాసకుడు.

ఇతర నమ్మకాలు అభిరుచులు కలవారు అర్థం చేసుకోవడం కష్టమైన పని అని చెప్పాడు.

9. నిగ్రోధా, నీవు ప్రవచించే నియమనిష్టల సిద్ధాంతం గురించే నన్నడుగు మీరు చెప్పే కఠినమైన వ్రతాలు ఏరకంగా సంతృప్తినీ, అసంతృపి కలిగాస్తాయి?" బుద్ధ భగవానుడు నిగ్రోధునితో ఇలా అన్నాడు.

10. దానికి నిగ్రోధుడు మేము పాటించే నియమ నిష్టలు వ్రతాలు శరీరాన్ని కృశింప జేసే ఇతర కట్టుబాట్లు అతి ముఖ్యమైనవిగా భావిస్తాం వాటి మూలంగా ఫలితాలు సాధించడం సాధించలేక పోవడం అనే భావన వుండదు" అని చెప్పాడు.

11. ఒక సన్యాసి దిగంబరిగా వుంటూ చెడు అలవాట్లతో తిరుగుతూ దగ్గర వచ్చిన వారిని గౌరవింపక, ఇతరులు ఏది ఇచ్చినా స్వీకరించక తనకై తయారు చేసి తెచ్చిన దానిని తిరస్కరిస్తూ, ఆహ్వానాలను లెక్క చేయక ఉంటాడను కుందాం. వండిన వంట పాత్ర నుంచి తెచ్చిన ఆహారం గాని, తన వాకిట తన కోసమై ఉంచిన దానినిగాని, చిప్పలోనిది గాని కర్ర పెట్టెలో పెట్టినది గాని, బుట్టలో ఉంచినది గాని స్వీకరించడనుకుందాం. కలసి భోజనం చేసేవారి నుంచిగాని, గర్భవతియైన స్త్రీ నుంచి గాని, చంటి పిల్ల తల్లినుంచి గాని సంభోగం చేసిన స్త్రీ నుంచిగాని, కరువు ప్రాంతం నుంచి సేకరించినది గాని కుక్కవున్న ప్రదేశం నుంచి గాని, ఈగలు వాలి వున్న ప్రదేశం నుండి గాని, చేపలు మాంసం గాని, మత్తు పదార్థాలను గాని, మత్తుకలిగించే గంజి గాని ఆహారం గాని స్వీకరించడను కుందాం. ఒకటి లేక రెండు లేక ఏడు భిక్షులతో రోజుకొక సారో రెండు రోజుల కొకసారో, ఏడు రోజులకొక సారి భోజనం చేస్తూ జీవనం గడుపుతారను కొందాం. ఒక ఇంటి నుంచి గాని రెండిళ్ళ నుంచి గాని, ఏడిళ్ళ నుంచిగాని భిక్షను స్వీకరించి ఒక ముద్దో, రెండు ముద్దలో, ఏడు ముద్దలో ఆహారంగా తీసుకుంటాడనుకొందాం. ఈ విధంగా నియమాను సారంగా ఒక్కొక్క సారి పదిహేను రోజల కొకసారిగా ఆహారం తీసుకుంటా జీవనం సాగించడానికి అలవాటు పడతాడు. మొక్కలు, అడవి బియ్యం, నివర విత్తనాలు, బియ్యపు సంకటి, బియ్యపు తేట, పిండి నూనె గింజలు గడ్డి, ఆవుపేడ, ఆడవి పండ్లు దుంపలు తింటాడు. ముతక వస్త్రాలను గాని, పార వేయ బడిన గుడ్డ పీలికలను గాని చెట్టు బెరడుతో తయారు చేసిన బట్టను గాని ధరిస్తాడు. లేదా లేడి చర్మాన్ని గాని, దుప్పి వెంట్రుకలతో తయారు చేసిన బట్టను గాని ధరిస్తాడు. లేక తీగలను శరీరానికి కప్పు కోవడం చెట్టు బెరుడుతో చేసిన వస్త్రాలను ఉపయోగించడం, మనిషి వెంట్రుకలతో, గుర్రపు వెంట్రుకలతో, గుడ్లగూబ రెక్కలతో తయారైన బట్టను వాడడం చేస్తాడు. తలపై గడ్డంపై మొలచిన వెంట్రుకలను పీకి వేస్తూ వుండడానికి అలవాటు పడి వుంటాడు. రెండు కాళ్ళపై నిలబడి వుండడం. కూర్చొని మడిమలతో ముందుకు జరగడం చేస్తాడు. ముండ్లు ఇనుప చీలలను పడకగా చేసుకుంటాడు. చెక్కపై పడుకుంటాడు. నేలపై నిద్రిస్తాడు. దుమ్ము ధూళి వంటికి రాసుకొని బహిరంగ ప్రదేశాలలో గాలిలో ఒక వైపు తిరిగి పడుకొంటాడు. ఎక్కడ బడితే అక్కడ కూర్చొంటూ చెత్తా చెదారం తింటానికి అలవాటు పడి ఉంటాడు. చన్నీళ్ళు రోజుకు మూడు సార్లు త్రాగడం లేదా ఏ నీరు తాగకుండా ఉండడం అతని అలవాట్లు.

12. "పైన చెప్పిన నియమాలన్నీ పాటించి సన్యాసులు శరీరాన్ని కృశింప జేస్తారా?" బుద్ధ భగవానుడు నిగ్రోధుని అడగ్గా నిగ్రోధుడు అవునని చెప్పాడు.

13. "అయితే కఠోర నియమాలను పాటిస్తూ సాధించేవి దోషాలు మాత్రమే"

14. "అవి ఏ విధంగా దోషాలో తెలపండి దేవా " అని కోరాడు నిగ్రోధుడు.

15. "కఠోర నియమనిబంధనలు పాటించడం వల్ల తన లక్ష్యం సిద్ధించిందనే కలుగుతుంది. ఈ భావన సన్యాసికి దోషమే."

16. "అది కాక కఠోర నియమాలు ఆచరించడం వల్ల తను ఉన్నతుడనని భావించి ఇతర చిన్న చూపు చూడడం సన్యాసియైన వానికి దోషమే.

17. "కఠోర నియమాల ద్వారా పొదుపు పాటిస్తూ మత్తు పదార్థాలను సేవిస్తూ కాము ఇతరుల యెడ నిర్లక్ష్య ధోరణి నవలంబిస్తూ వుండే సన్యాసి దోషం చేసినట్లే.

18. "కఠోర నియమాలను పాటిస్తూ చేసే జపతపాలు సన్యాసికి దక్షిణలు , పేరు ప్ర సంపాదించి పెడతాయి. వాటి మూలంగా సన్యాసి ధీమాగా తన ధ్యేయాన్ని సాధిం తృప్తి కలిగి వుండడం కూడా దోషమే.

19. "దక్షిణలు అందుకొని ప్రతిష్టలు సంపాదించడం ద్వారా సన్యాసి తనను ఉన్నతుడుగా భావించి ఇతరులను తక్కువ చూపు చూడడం కూడా దోషమే అవు

20. "దక్షిణలందుకుంటూ పేరు ప్రతిష్టలు సంపాదించుకుంటూ వుండే సన్యాసి పదార్థాలు సేవించడంలో మునిగి కాముకుడౌతాడు ఇది కూడా దోషమే.

21. "అటువంటి సన్యాసి ఆహారంలో యిష్టా యిష్టాలు పాటిస్తూ తనకు ఇష్టమైన ఆ భుజిస్తూ ఇష్టం లేని దాన్ని తృణీకరిస్తాడు. ఇష్టమైన ఆహారాన్ని అమితంగా భ కాముకుడై వుంటాడు. ఇష్టమైనది అమితంగా భుజించడం, భోగలాలసుడై వుం గల ప్రమాదాల్ని ప్రమాదాలుగా భావించక వాటిలోనే ఆనందం పొందుతాడు. ఇ దోషమే.

22. "దక్షిణలు, పేరు ప్రతిష్టల పట్ల ఆపేక్ష పెరిగి ` రాజులు, అధికారులు నన్ను క అదే విధంగా బ్రాహ్మణులు విద్యా సంస్థల స్థాపకులు, గృహస్థులు నా వద్దకు వ పొగిడి బహుమతులిస్తారు" అని ఎదురు చూస్తూ వుంటాడు ఇదీ దోషమే.

23. "ఇతర సన్యాసులను బ్రాహ్మణులను గురించి చులకన భావంతో సన్యా అంటాడు" వారు అన్ని రకాలు వేళ్ళు, కాయలు, విత్తనాలు, చెత్త చెదారం, చేస్తూ నములు తారు. అటువంటి వారు పవిత్రులట" ఇలా హేళన మాట్లాడుతూ వుండడం దోషమే.

24. ఇతర సన్యాసులు గాని బ్రాహ్మణులు గాని గౌరవం పేరు ప్రతిష్టలు బహ

విస్తున్నారు. నేనింత కఠోర నియమాల నాచరించి జపతపాలు చేసినప్పటికీ నన్ను అభిమానించడం లేదు. అని వాపోతూ పరనిందకు పాల్పడతాడు. పరనింద కూడా దోషమే.

25. నిగ్రోధా, సన్యాసి కావాలనే గోప్యంగా వ్యవహరిస్తాడు. ఏదైనా విషయం గురించి, "దీన్ని నీవు ఆమోదిస్తావా ! అంటే ఆమోదించక పోయినా "ఔనని" చెప్తాడు. మరో సారి ఆమోదించినా `లేదని' చెప్తాడు. ఇలా ఉద్దేశ్య పూర్వకంగా అబద్ధం చెప్పడం కూడా దోషమే.

26. సన్యాసి సహనాన్ని కోల్పోయి శత్రుభావాన్నికలిగి వుండడం కూడా దోషమే.

27. సన్యాసి కపటి, మోస కారియై ఇతరులపట్ల ఈర్ష్యా సూయలు కలిగి జిత్తుల మారియై కఠిన హృదయుడై గర్వంతో చెడు ఆలోచనలకు బందీ అవుతాడు. దీని మూలంగా చెడు ఆలోచనలకు తావిస్తూ నిర్హేతుకమైన సిద్ధాంతాల ఊబిలో పడి తన అనుభవాల్ని వక్రీకరిస్తూ దురాశాపరుడై సర్వసంగ పరిత్యాగానికి దూరుడౌతాడు. ఈ విధంగా ప్రవర్తించే సన్యాసి దోషం చేసినట్లే.

28. "కఠోర నియమాలతో జపతపాలు చేసే సన్యాసిలో పైన చెప్పబడిన విషయాలన్నీ దోషాలేనా కావా?" అని బుద్ధుడు నిగ్రోధుని అడిగాడు.

29. దానికి నిగ్రోధుడు "నిర్యాణానికి సన్యాసి ఆచరించే పైకార్యాలన్నీ దోష భూయిష్టమైనవే. ఇందులో కొన్నింటిని గాని అన్నింటిని గాని చేసే సన్యాసులున్నారు." అని చెప్పాడు.

30. బౌద్ధ భిక్షువులు పైన చెప్పిన దోషాల మూలంగా నిందితులు కాకూడదు.

## 3. భిక్షువు - బ్రాహ్మణుడు

1. భిక్షువు బ్రాహ్మణుడు ఒకటి కాదు.

2. భిక్షువునికి బ్రాహ్మణునికి గల పోలికలు తేడాలపై చాలా చోట్ల చర్చ జరిగింది. అయితే ఆ తేడాలను తేలికగా చెప్పవచ్చు.

3. బ్రాహ్మణుడు పూజారి. పుట్టుక, పెండ్లి, చావుల గురించి మత సంబంధమైన కార్యక్రమాలు జరపడం అతని ముఖ్యవిధి.

4. భగవంతుడు, ఆత్మ అనే వాటిపై ఉన్న నమ్మకాల వల్ల, మౌలిక మైన పాప ప్రక్షాళనకు అత్యవసరమని భావించడం వల్ల, ఈ మత సంబంధ కార్యక్రమాలు నిర్వహించడం అవసరమైంది.

5. ఈ మత సంబంధమైన కార్యక్రమాలకు పూజారి అవసరం అయితే భిక్షువు మౌలిక పాపాన్ని గానీ, భగవంతుడిని గానీ ఆత్మను గానీ నమ్మడు. కనుక అతను మత క్రతువులను జరపనవసరంలేదు. అందువల అతను పూజారి కాజాలడు.

6. పుట్టుకతో బ్రాహ్మణుడు, శిక్షణ వల్ల భిక్షువు అవుతాడు.

7. బ్రాహ్మణుడికి కులం వుంది. భిక్షువుకు కులం లేదు.

8. బ్రాహ్మణుడైన వాడు ఎల్లప్పుడూ బ్రాహ్మణుడే. అతడే పాపం చేసినా నేరం చేసినా బ్రాహ్మణుడు కాకుండా పోడు.

9. కాని ఒకసారి భిక్షువైనవాడు ఎల్లప్పుడూ భిక్షువుగా వుండడు. శిక్షణతో భిక్షువు అయిన భిక్షువుగా వుండడానికి కావలసిన సత్ప్రవర్తన కలిగి వుండనట్లయితే భిక్షువుగా గుర్తింపు కోల్పోతాడు.

10. బ్రాహ్మణుడిగా కొనసాగడానికి ఎలాంటి మానసిక, నైతిక శిక్షణ అవసరం లేదు. బ్రాహ్మణుడు మత సంబంధమైన విషయాలు తెలుసు కొని వుంటే చాలు.

11. భిక్షువుకు బ్రాహ్మణుడికి చాలా తేడా వుంది. భిక్షువుకు మానసిక నైతిక శిక్షణే ప్రాణాధారం.

12. బ్రాహ్మణుడు ఎంత ఆస్తినైనా సంపాదించవచ్చు. భిక్షువుకు ఆస్తి వుండడానికి వీలులేదు.

13. ఈ తేడా చిన్న తేడా కాదు. మనిషి మానసిక, నైతిక స్వేచ్ఛపైన, అతని ఆలోచనలు, అతడు చేసే పనులపైన ఆస్తి ప్రభావం చాలా వుంటుంది. ఆస్తి కలిగి వుండడం అనేది ఆలోచనలకు చర్యలకు వైరుధ్యం కలిగిస్తుంది. అందుకే బ్రాహ్మణుడైనవాడు మార్పును వ్యతిరేకిస్తాడు. మార్పుఅనేది బ్రాహ్మణునికి తాననుభవిస్తున్న అధికారాన్ని అంతస్తును పోగొడ్తుంది.

14. భిక్షువుకు ఆస్తి పాస్తులుండవు కాబట్టి మానసికమైన, నైతిక మైన స్వేచ్ఛ కలిగి వుంటాడు. అతను గౌరవప్రదమైన, నీతి దాయకమైన జీవనాన్ని గడపడానికి స్వప్రయోజనాలు అడ్డురావు.

15. బ్రాహ్మణులు వ్యక్తిగత ప్రయోజనాలు కలిగి వుంటారు. ఏ మత వ్యవస్థకు అతడు లోబడి వుండడు. తనకు తానే సర్వాధికారిగా భావిస్తాడు. బ్రాహ్మణులకు కలిగే భౌతికమైన ప్రయోజనాలే వారిని కలిసికట్టుగా వుంచుతాయి.

16. భిక్షువు ఎల్లప్పుడూ బౌద్ధ సంఘాలలో సభ్యుడు. సంఘంలో సభ్యుడు కాని వాడు భిక్షువుగా గుర్తించబడడమనేది ఊహా తీతమైన విషయం. భిక్షువు సంఘం కట్టు బాట్లకు లోబడి వుంటాడు. తను సర్వాధికారి కాడు. సంఘం ధర్మబద్ధమైన వ్యవస్థ.

## 4. భిక్షువు - ఉపాసకుడు

1. బౌద్ధ ధర్మం ప్రకారం భిక్షువు, ఉపాసకుడు (సామాన్య బౌద్ధుడు) ఆచరించ వలసిన ధర్మాలలో గణనీయమైన తేడాలున్నాయి.

2. భిక్షువు బ్రహ్మచారిగా వుండాలి. ఉపాసకుడు వివాహం చేసుకోవచ్చు.

3. భిక్షువుకు తన దంటూ ఒక ఇల్లు సంసారం లేవు. ఉపాసకునికి తన ఇల్లు, సంసారం ఉండవచ్చు.

5. భిక్షువు ఎలాంటి ప్రాణహాని చేయరాదు. ఉపాసకునకు ఈ నియమం వర్తించదు.

6. పంచశీల సూత్రాలు భిక్షువుకూ ఉపాసకునికీ ఒకటే అయినప్పటికీ భిక్షువుకు అవి ప్రమాణాలు. వాటి ఉల్లంఘున భిక్షువును శిక్షార్హుని చేస్తుంది.

7. భిక్షువు పంచశీల సూత్రాలను తప్పనిసరిగా పాటించాలి. ఉపాసకునికి అవి స్వచ్ఛందంగా అనుసరించేవి మాత్రమే.

8. బుద్ధ భగవానుడు మంచి ప్రయోజనాల నాశించందే భిక్షువుకూ ఉపాసకునికీ ఈ భేదాలు కల్పించి వుండడు.

9. ఈ భేదాలకు కారణాలు భగవానుడు కూడా వివరించవన్పటికీ అవి ఆలోచించి గ్రహించి తెలుసుకో దగినవి.

10. సధర్మ రాజ్య స్థాపన కోసం తన ధర్మాన్ని భగవానుడు భిక్షువులకూ సామాన్య బౌద్ధునికి తేడా లేకుండా భోధించాడు.

11. సామాన్య బౌద్ధులకు ధర్మ బోధ చేసినంతమాత్రాన్నే సద్ధర్మ పూరిత మైన ఆదర్శ సంఘస్థాపన జరగదని భగవానునికి తెలుసు.

12. ఆదర్శ మనేది ఆచరణ యోగ్యమైనదిగా వుండడమే గాక ఆచరణయోగ్యంగా ఉన్నట్లు కనబడాలి. అప్పుడు ప్రజలు దానిని సాధించడానికి కృషిచేస్తారు.

13. ఆదర్శ ప్రాతి పదికపై వుండే సమాజ స్వరూపం తెలిసి వుండాలి. అప్పుడు సద్దర్మ ఆచరణోధ్యేయంగా గల ఆదర్శం సాధ్యం గాదనీ, సాధన ద్వారా సాధ్యమేననీ సామాన్యులకు రుజువవుతుంది.

14. బుద్ధ భగవానుడు భోదించిన ధర్మం ఎలా ఆచరణ యోగ్యమో ఇతరులకు తెలియ జెప్పడానికి బౌద్ధ సంఘం ఒక నమూనా మాత్రమే.

15. ఈ కారణం చేతనే భగవానుడు భిక్షువుకు ఉపాసకునికి (సామాన్య భౌద్ధునికి) ధర్మ సూత్రాలను ఆచరించడంలో తేడా కల్పించాడు. బుద్ధుడాశించిన ఆదర్శ సమాజానికి భిక్షువు మార్గదర్శి అయితే ఉపాసకుడు భిక్షువును తన చేతనయినంత దగ్గరగా అనుసరిస్తాడు.

16. భిక్షువు పాటించాల్సిన విధులేమిటి అనే ప్రశ్నకు సమాధానం అవసరం.

17. భిక్షువు తనకు తానును సంస్కారవంతునిగా చేసుకోవడమేనా లేక ఇతరులకు సేవజేస్తూ వారిని సన్మార్గం వైపు నడిపిస్తాడా?

18. తనను తాను సంస్కారవంతునిగా చేసుకుని ఇతరులకు సేవ జేస్తూ వారిని సన్మార్గం

19. స్వయం సంస్కారం లేని వాడు ఇతరులకు మార్గదర్శి కాజాలడు. కావున తాను శీలవంతుడై, ఉత్తముడై సద్ధర్మ వర్తనుడై జ్ఞానియై వుండాలి. ఈ గుణాలు పొందాలంటే స్వయం సంస్కార సాధన అవసరం.

20. భిక్షువు తన ఇల్లు వదలి వెళ్తాడు. కానీ ప్రపంచానికి దూరంగా ఉండడు. విచారంతో, బాధలతో, సంతోషమనేది లేకుండా తమకు తాము సహాయం చేసుకోలేని గృహస్థులకు సేవ జేయడానికి స్వేచ్ఛ, అవకాశం పొందడానికి మాత్రమే భిక్షువు ఇల్లు విడచి వెళ్తాడు.

21. కరుణ అనేది బౌద్ధ ధర్మ సారం. ఈ కరుణ వల్లే ప్రతి వ్యక్తి తోటి వారిని ప్రేమిస్తాడు. సేవిస్తాడు. భిక్షువు కూడా ప్రేమించడం, సేవ జేయడం తన ధర్మాలుగా గుర్తించాలి.

22. మానవుల బాధలను పట్టించుకోని భిక్షువు ఎంతటి స్వయం సంస్కారం కలిగి వున్నప్పటికీ భిక్షువు కాడు. అతడింకేమైనా కావచ్చునేమో గాని భిక్షువు మాత్రం కాడు.

# మూడవ భాగం

# భిక్షువు బాధ్యతలు

1. బౌద్ధమత వ్యాప్తిలో భిక్షువు బాధ్యత
2. అద్భుతాల ప్రదర్శనతో దీక్ష ఇవ్వరాదు
3. బలవంతంగా మతం మార్చరాదు
4. బౌద్ధ ధర్మ వ్యాప్తికి భిక్షువు పోరాడాలి

# 1. బౌద్ధ వ్యాప్తిలో భిక్షువు బాధ్యత

1. యశునితోపాటు అతని నలుగురు మిత్రులు ధర్మాన్ని స్వీకరించారనే వార్త చాలా దూరం వ్యాపించింది. దాని ఫలితంగా ఉన్నత కుటుంబాలకు చెందిన వారు చాలా మంది బుద్ధుని శరణుజొచ్చి తమకు కూడా దీక్షను ప్రసాదించ వలసిందిగా కోరారు.

2. చాలా మంది బౌద్ధ ధర్మాన్ని స్వీకరించడానికి ముందుకు రావడంతో తను స్వయంగా అందరికీ దీక్ష నివ్వడం కష్టమని బుద్ధుడు గ్రహించాడు. పరి వ్రాజకులను ఒక పద్ధతిలో నడిపేందుకొక వ్యవస్థ అవసరమని భావించి దానికి భిక్షు సంఘమని పేరు పెట్టాడు.

3. ఆ విధంగా పరివ్రాజకులను సంఘ సభ్యులుగా జేసి వారిని ప్రవర్తనానియమావళికి బద్దులను చేశాడు. ఈ నియమాలను 'వినయ' అని వ్యవహరించారు.

4. ఒక శిష్యుడు భిక్షువుస్థాయి చేరడానికి ముందు రెండంచెలు దాటాలని బుద్ధుడు నిర్దేశించాడు. మొదటి దశలో శిష్యుడు కొన్ని సంవత్సరాలపాటు పరి వ్రాజకుడుగా భిక్షువు శిక్షణలో గడపాలి. శిక్షణా కాలం పూర్తయిన తరువాత నిర్దేశించబడిన పరీక్షకులు ఉపసంపదకు అర్హుడని సంతృప్తి చెందితే ఉప సంపాదకుడౌతాడు. ఉప సంపాదకుడైన తర్వాత భిక్షువు కావడానికి అనుమతిస్తే భిక్షువై భిక్షువుల సంఘ సభ్యుడౌతాడు.

5. ధర్మ దీక్షా కార్యపు తొలి రోజుల్లో వ్యవధి లేక తన పరివ్రాజకులను ఏకంగా భిక్షువులుగా జేసి బౌద్ధ ధర్మాన్ని ప్రచారానికి పంపడం జరిగింది.

6. వారిని బౌద్ధ ధర్మ ప్రచారానికి పంపే ముందు బుద్ధుడు ఇలా అన్నాడు. "నేను మానవ సంబంధమైన, దైవ సంబంధమైన బంధాల నుంచి విముక్తుడ నయ్యాను. మీరు కూడా అదే విధంగా విముక్తులయ్యారు. ప్రపంచంలో ఎక్కువ మంది సంక్షేమంకోసం మీరు కరుణామయులై, మానవుల, దేవతల క్షేమం కోసం బౌద్ధ ధర్మం నలుదెసలా వ్యాపింపచేయండి."

7. "మీలో ఏ యిద్దరూ ఒకే వైపుకూ వెళ్ళకండి. భిక్షువులారా, ఆదిలోనూ, మాధ్యంలోనూ, అంతంలోనూ ముమ్మొర్తులా దీప్తి మంతమైన ధర్మాన్ని ప్రచారం చెయ్యండి. ప్రపూర్ణము, స్నిగ్ధమూ, స్వచ్ఛమైన పవిత్ర జీవనాన్ని చాటి చెప్పండి.

8. " ప్రతి దేశం తిరిగి ధర్మ దీక్ష స్వీకరించని వారిని బౌద్ద దర్మ దీక్ష స్వీకరించేలా చేయండి. బాధాగ్రస్తులైన వారికి, సరియైన మార్గమేదో తెలియనివారికి ప్రబోధం చేసి సన్మార్గ వర్తనులుగా మార్చండి.

9. తమ బోధలతో ప్రజల్ని ప్రభావితం చేస్తున్న మహర్షులూ, రాజర్షులూ, బ్రహ్మర్షులు ఉన్న ప్రాంతాలకు వెళ్ళండి."

10. "ప్రతి భిక్షువు కురణాంతరంగుడై, ఎవరి త్రోవనవారు ప్రయాణం చేస్తూ బౌద్ధ ధర్మ ప్రబోధం చేయండి."

11. భగవానుడు భిక్షువులతో యింకా ఈ విధంగా కూడా చెప్పాడు.

12. "ధర్మం అనేది అన్ని బహుమతుల కంటే గొప్పది. అన్ని రుచులనూ మించిన మధురత్వాన్ని కలిగి వుంటుంది. సకల సౌఖ్యాల కంటే ఎక్కువ సంతోషాన్ని కిలిగించేది."

13. " కలుపు మొక్కలు పైరుకు నష్టం కలుగ జేసినట్లు చిత్త విభమం మానవాళికి నష్టం కలుగజేస్తుంది. ధర్మం మానవాళికి గొప్ప బహుమానం.

14. " పైరుకు కలుపు మొక్కలు నష్టం కలిగించే విధంగా మానవాళికి ద్వేషం నష్టం కలుగజేస్తుంది. ధర్మం మానవాళికి మేలు చేస్తే గొప్పవరం.

15. పైరుకు కలుపు మొక్కలు నష్టం కిలిగించి నట్లుగా దంభం మానవాళికి కీడు చేస్తుంది. ధర్మం మానవాళికి మంచి చేసేవరం.

16. " కలుపు మొక్కల మూలంగా నష్టపడే పైరు మాదిరిగా మానవాళ కామం మూలంగా నష్టపడతారు. ధర్మం మానవాళికి మేలు కలిగిస్తుంది.

17. పై ఆదేశాలను పొందిన అరవై మంది భిక్షువులు ధర్మ ప్రభోధం చేయడానికి ప్రపంచ నలుదెసలా ప్రయాణమై వెళ్ళారు.

18. భగవానుడు బౌద్ధదీక్ష ఇవ్వడం గురించి మరికొన్ని ఆదేశాలిచ్చాడు.

## 2 అద్భుతాల ప్రదర్శనతో దీక్ష ఇవ్వరాదు.

1. ఒకసారి భగవానుడు మల్లుల పట్టణాలలో ఒకటైన అనుప్రియ అనే పట్టణంలో వుండడం తటస్థించింది.

2. ఆయన ఒకనాడు అంగీ ధరించి భిక్షా పాత్రతో భిక్షకై పట్టణంలోనికి బయలు దేరాడు.

3. మరీ పెందలకడే పట్టణంలో భిక్ష అడగటమెందుకని దారిలో భార్గవుడనే సన్యాసిని పరామర్శించి పోదామని అనుకున్నాడు.

4. ఆ విధంగా భార్గవుని మఠానికి చేరుకున్నాడు.

5. భగవానునికి భార్గవుడు స్వాగతం పలుకుతూ, "రండి నా వద్దకు భగవానుడు చాలా రోజుల తరువాత రావడం జరిగింది. మీ కోసం సిద్ధం చేసిన ఆసనంపై ఆశీనులు కండి" అని కోరాడు.

6. భగవానుని ప్రక్కనే భార్గవుడు చిన్న ఆసనంపై కూర్చొని భగవానునితో ఈ విధంగా అన్నాడు.

7. "లిచ్ఛవీయుడైన సునక్షత్తుడు కొన్నాళ్ళ క్రింద కలిసి తాను భగవానుని అనుసరించటం లేదని భగవానుని తన గురువుగా భావించడం లేదని అన్నాడు. అది నిజమేనా?"

8. "లిచ్ఛవీయుడు సునక్షత్రుడు చెప్పింది యధార్థమే భార్గవా!

9. "కొన్ని రోజుల క్రితం, నిజానికి చాలా రోజుల క్రితం భార్గవా, లిచ్ఛవీయుడు సునక్షత్రుడు నా వద్దకు వచ్చారు. నేను భగవానుడిని వదులు కుంటున్నాను. ముందు ముందు ఆయన గురుత్వంలో నేను వుండి బోవటంలేదు- అని అన్నాడు. దానికి నేను - చూడు నక్షత్రా నావద్ద శిష్యరికం చెయ్యమని, నిన్ను ఎప్పుడైనా పిలిచానా" - అని అడిగాను.

10. "లేదు స్వామీ, నన్ను పిలవలేదు" అని సునక్షత్రుడు జవాబు చెప్పాడు.

11. పోనీ నువ్వే ఎప్పుడైనా భగవానునికి శిష్యరికం చేస్తానని అనుమతి కోరావా అనడిగాను.

12. "లేదు స్వామీ అన్నాడు సునక్షత్రుడు."

13. "మరి నేను ఏమీ అడగలేదు, నువ్వు ఏమీ అడగలేదు మన బాంధవ్యం ఏ ముందని నువ్విప్పుడు వదులుకుంటానంటున్నావు. అని అడిగాడు."

14. "దానికి సునక్షత్రుడు - సామాన్యుల కందని అతీత శక్తులు ఏవీ భగవానుడు నాకు చూపడం లేదు" అన్నాడు.

15. "దానికి నేను చూడు సునక్షత్రా నువ్వు నన్ను బోధకునిగా స్వీకరించు, సామాన్యుల కందని అతీతశక్తులు చూపుతాను అని ఎప్పుడైనా చెప్పానా? అని అడిగాను.

16. "లేదు స్వామీ అన్నాడు.

17. "పోనీ నువ్వెప్పుడైనా - సామాన్యులకందని అతీతశక్తులు నేను చూపితే నన్ను గురువుగా అంగీకరిస్తానని చెప్పావా అని అడిగాడు.

18. "లేదు స్వామీ అన్నాడు.

19. "మరి నువ్వేమి అడిగిందీ లేదు, నేను చెప్పిందీ లేదు అయినప్పుడు, ఓ మందమతీ, మన బాంధవ్యం ఏముందని నువ్వు వదులుకుంటా నంటావు? ఏమంటావు; సునక్షత్రకా - అని అడిగాడు.

20. " సామాన్యుల కందని అతీత శక్తులు చూపినా, చూపకపోయినా, నేను ధమ్మం బోధించే లక్ష్యం - కర్త యొక్క సంపూర్ణ పాప నిర్మూలనానికి దారి తీస్తుందని కాదా ?

21. ఆ శక్తుల్ని చూపినా చూపకున్నా భగవానుడు బోధించేలక్ష్యం అదే - అని అతడు జవాబు చెప్పాడు.

22. "అయినా భార్గవా! సునక్షత్రుడు అంతటితో వురుకోలేదు. సృష్టి ఆరంభం భగవానుడు తనకి వెల్లడించ లేదు, అన్నాడు.

23. "దానికి నేను - చూడు సునక్షత్రా నా శిష్యుడిగా చేరు, నీకు సృష్టి ఆరంభం వెల్లడిస్తాను అని ఎప్పుడైనా చెప్పానా అని అడిగాడు.

24. "లేదు స్వామీ అన్నాడు.

25. "పోనీ భగవానుడు నాకు సృష్టి ఆరంభం వెల్లడిస్తాడు అందుకు ఆయన శిష్యుడిగా చేరతాను అని నువ్వెప్పుడైనా అన్నావా అని అడిగాను.

26. "లేదు స్వామీ అన్నాడు.

27. మరి నువ్వేమీ అడిగిందీ లేదు. నేను చెప్పిందీ లేదు. మరి మన బాంధవ్యం ఏముందని నువ్వు వదులు కుంటానంటావు. మందమతీ ? సృష్టి ఆరంభం నేను వెల్లడి చేసినా చేయకున్నా - నేను ధమ్మం భోధించే లక్ష్యం, కర్త యొక్క సంపూర్ణ పాప నిర్మూలనానికి దారి తీస్తుందని కాదా సునక్షత్రా? అని అడిగాను.

28. అది వెల్లడి చేసినా చేయకున్నా, భగవానుడు, ధమ్మం భోధించే లక్ష్యం అదే అని అతడు ఒప్పుకున్నాడు.

29. "మరి సునక్షత్రా, సృష్టి ఆరంభం వెల్లడి అయినా కాక పోయినా ఆలక్ష్యానికి ప్రమేయం లేనప్పుడు. అది తెలియటం వల్ల నీకు ఒన గూడేదేమిటని అడిగాను.

30. "సునక్షత్రా. వజ్జినులతో నన్ను గురించి ఎన్నో విధాల ప్రశంసలు చేసి వున్నావు.

31. "వజ్జినులలో ధమ్మం గురించి ఎన్నో విధాల ప్రశంసలు చేసి వున్నావు.

32. "వజ్జినులతో సంఘం గురించి ఎన్నో విధాల ప్రశంసలు చేసి వున్నావు.

33. "అందుచేత నేను నీకు తెలియ చెప్పే దేమిటంటే - నిన్ను గురించి యిట్లా అనుకునే వాళ్ళు వుంటారు. గౌతమ యతి వద్ద లిచ్ఛవీయసునక్షత్రుడు పవిత్ర జీవనం గడపలేక పోయాడు. అట్లాగడపలేక కట్టు బడు వదలుకుని అల్ప విషయాల వైపు మళ్ళాడు.

34. "ఈ విధంగా భార్గవా! నేను హెచ్చరించిన లిచ్ఛవీయసునక్షత్రుడు వినాశోపహతుడై ఉపదేశాన్ని కట్టు బాటుని కాదని వెళ్ళిపోయాడు."

35. ఇట్లా ఉపదేశాన్ని కట్టుబాటును కాదని వెళ్లిపోయిన సునక్షత్రుడు ఆ వెంటనే - జ్ఞానం, సూక్ష్మ దృష్టి సంబంధిగా బుద్ధుని ప్రజ్ఞలు మానవాతీతమైన వేమీ కాదని, ఆయన చెప్పే సిద్ధాంతం ఆయన వివేచన నుంచి క్రమంగా రూపొందగా తనే స్థాపించి నట్టిదని, ఆయన చేసిన బోధలు విన్నవారు పాప నిర్మూలన మార్గంలో నడవటానికి వాటిని ఆచరించవలసి వుంటుందని చెప్పసాగాడు.

36. బుద్ధుని గురించి సునక్షత్రుడు నిందా ప్రచారం సాగించినప్పటికీ అతను చెప్పేది యదార్థమే. మరి బుద్ధుడెన్నడూ తన ధర్మ ప్రచారంలో అద్భుతాలకి, మానవాతీత శక్తులకి పాల్పడలేదు.

# 3. బలవంతంగా మతం మార్చరాదు.

1. ఒక సారి బుద్ధ భగవానుడు రాజ గ్రహనుంచి నలందా వెళ్ళే మార్గం వెంబడి దాదాపు 500 మంది భిక్షువులతో వెళ్తున్నాడు. సుప్రియుడనే సన్యాసి బ్రహ్మదత్తుడనే తన శిష్యునితో అదే మార్గాన వెళ్ళడం తటస్థించింది.

2. సుప్రియుడు బుద్ధుడ్ని అతని సిద్ధాంతాన్ని బౌద్ధ సంఘాన్ని తెగడుతూ మాట్లాడుతుండగా అతని శిష్యుడైన బ్రహ్మదత్తుడు బుద్ధుడ్ని అతని సిద్ధాంతాన్ని బౌద్ధ సంఘ నిర్మాణాన్ని ప్రశంసిస్తూ ఉండేవాడు.

3. ఆ విధంగా గురుశిష్యులు విరుద్ధాభి ప్రాయాలతో బుద్ధుడు, ఆయన పరివారం పోతున్న మార్గంలో వారి వెంట అడుగులో అడుగు వేసుకుంటూ నడవ సాగారు.

4. బుద్ధుడు తన పరివారంతో ఆ రోజు రాత్రి వసతి గృహంలో బసచేయగా సుప్రియుడు తన శిష్యుడు బ్రహ్మదత్తునితో అదే వసతి గృహంలో బస చేయడం. అదే రీతిలో వారిద్దరు చర్చలు చేయడం జరిగింది.

5. తెల్లవారగానే భిక్షువు లందరూ వసారాలో చేరి సుప్రియుడు బ్రహ్మదత్తుడు మధ్య జరిగిన సంభాషణపై చర్చించ సాగాడు.

6. భిక్షువులు చర్చించుకునే విషయం గ్రహించి బుద్ధ భగవానుడు వసారాలోనికి వచ్చి తనకోసం పరచి యున్న చాపపై కూర్చుండి "మీరు దేనిని గురించి చర్చించు కొంటున్నారు?" అని వారినడిగి తెలుసుకొని వారితో ఈ కింది విధంగా చెప్పాడు.

7. "ఇతరులు నన్ను నా సిద్ధాంతాన్ని సంఘ నిర్మాణాన్నివిమర్శించినంత మాత్రాన మీకు వారి పట్ల నిరసన గాని, ఆగ్రహం గాని, చెడు భావనగాని కలుగ కూడదు.

8. "ఇతరుల విమర్శ పట్ల ఆగ్రహంచెంది బాధ పడ్డట్లయితే ఆత్మ నిగ్రహం కోల్పోవలసి వస్తుంది. దీని మూలంగా ఇతరులు మన గురించి మాట్లాడేది సరియైనదా కాదా అనే న్యాయ విచక్షణ చేయగలరా" అని బుద్ధుడు అడిగాడు.

9. దానికి వారంతా "ఆగ్రహంతో బాధతో న్యాయనిర్ణయాలు చేయడం వీలు కాదని ఒప్పుకున్నారు.

10. "ఇతరులు నన్ను, నా సిద్ధాంతాన్ని, సంఘ నిర్మాణాన్ని విమర్శించినప్పుడు వారి విమర్శలో ఏది వాస్తవమో, ఏది వాస్తవం కాదో, వారు చూపించేలోపాలు మనలో వున్నవనో లేవనో హేతుబద్ధంగా, తార్కికంగా విమర్శకులకు తెలియజేయాలని బుద్ధభగవానుడు తన పరివారానికి చెప్పాడు.

11. "అదే విధంగా ఇతరులు నన్ను నాసిద్ధాంతాన్ని, సంఘాన్ని ప్రశంసించినప్పుడు కూడా పై విధంగానే స్వయంపరిశీలన చేసుకొని తార్కికమైన దృష్టితో వారి ప్రశంసలో నిజానిజాలను వారికి తెలియ జేయాలని కూడా చెప్పాడు.

12. "జీవ హింస చేయకుండా గౌతముడు సన్యాసియై జీవ వినాశానికి దూరంగా వుంటున్నాడని, దయా మయుడైన గౌతముడు కర్కశత్వానికి దూరంగా వుండడానికి కత్తి, డోలు త్యజించి సకల జీవ రాసుల పట్ల ప్రేమాను రాగాలు కలిగి వున్నాడని బౌద్ధమతం స్వీకరించని వాడు తథాగతుని గూర్చి ప్రశంసా పూర్వకంగా మాట్లాడవచ్చు.

13. "లేదు తన కివ్వబడిన దేదీ గ్రహించక తనది కానిదానిని దూరంగా వుంచ గలుగుతున్నాడని తన కివ్వబడిన దానిని మాత్రమే గ్రహించి హృదయ నైర్మల్యంతో నిజాయితీగా బ్రతకగలుగుతున్నాడని ఇతరులు ప్రశంసించవచ్చు.

14. "లేదా శీలరాహిత్యాన్ని విడనాడి సౌశీల్య వంతుడై లైంగిక అనుభవానికి దూరంగా వుంటున్నాడని ఇతరులు అనవచ్చు.

15. "అసత్యాలను పలుకకుండా సత్యవంతుడయ్యాడని, సత్యాన్నే మాట్లాడుతూ, సత్యానికి దూరంగా వుండడనే నమ్మకాన్ని, సత్యానికి విధేయతను కలిగిస్తాడని గౌతముని గురించి అనవచ్చు.

16. "లేక ఇతరులను దూషించడం మానివేసి గౌతముడు నిందకు దూరంగా వుంటున్నాడనీ, అక్కడ విన్నది ఇక్కడా, ఇక్కడ విన్నది అక్కడ చెప్పి తగాదాలు సృష్టించడనీ, ఆ విధంగా విరుద్ధ భావాలు గలవారిని కలిసేటట్టు చేయటం, స్నేహితుల మధ్య స్నేహాన్ని మరింతగా పెంపొందించడం వంటి సత్కార్యాల ద్వారా శాంతి కాముకుడై శాంతి వచనాలు మాత్రమే మాట్లాడుతాడని అనవచ్చు.

17. "లేక పరుష సంభాషణలు వదలివేసి గౌతముడు పరుష భాషకు దూరంగా వుంటాడనీ అనవచ్చు. నిందాపూర్వకంగాని చెవికింపైన, ప్రేమ పూర్వకమైన హృదయానంద కరమైన ప్రజారంజకమైన మాటలను మాత్రమే గౌతముడు మాట్లాడుతాడనీ అనవచ్చు.

18. "లేక గౌతముడు నిరుపయోగకరమైన సంభాషణలు చేయక, వాస్తవికమైన, అర్థవంతమైన విషయాలను మాత్రమే ధర్మాన్ని గురించి, సంఘాన్ని గురించి మాట్లాడుతాడనీ అనవచ్చు. సరియైన సమయంలో హృదయాలలోనికి చొచ్చుకు పోయే మాటలను మాత్రమే ఉదాహరణలతో సహా మాట్లాడుతాడనీ అనవచ్చు.

19. "లేక గౌతముడు చెట్లకూ, విత్తనాలకూ హాని చేయకుండా వుండడానికి ఈ కింది విషయాలను పాటిస్తాడనీ అనవచ్చు. రోజు కొక సారి ఆహారం తీసుకోవడం, రాత్రి పూట భోజనం చేయక పోవడం, ప్రదర్శనలకు, సంతలకు, జుగుప్సాకరమైన నృత్య సంగీత ప్రదర్శనలకు దూరంగా వుండడం. ఆడంబరమైన బట్టలు, ఆభరణాలు, పూల మాలలు వేసుకోవడం, సువాసనలనుపయోగించడం లేపనాలు వాడడం నుంచి దూరంగా వుండడం. ఆడంబరమైన పరుపులను ఉపయోగించకుండా వుండడం, బంగారం, వెండి స్వీకరించకుండా వుండడం, వండిన ఆహార ధాన్యాలను స్వీకరించకుండా వుండడం. స్త్రీలను, బాలికలను, స్వీకరించకుండా వుండడం. బానిసలుగా వున్న పురుషులను, స్త్రీలను స్వీకరించకపోవడం, గొర్రెలను మేకలను స్వీకరించక పోవడం. కోళ్ళను, పందులను స్వీకరించకపోవడం. ఏనుగులు పశువులు, గుర్రాలను స్వీకరించకపోవడం, కొనడం

అమ్మడం వంటి వాటికి దూరంగా వుండడం. త్రాసు కొలత పాత్రలు మొదలగు వాటితో మోసం చేయకుండా వుండడం. లంచాలు తీసుకోకుండా వుండడం, మోసం, వంచనలనుంచి దూరంగా వుండడం. వికలాంగులుగా చేయడం, హత్య చేయడం, బంధించడం, దారి దోపిడీ చేయడం, బంది పోటుగా వుండడం, హింసాత్మక చర్యలు చేయడం వంటి వాటి నుంచి దూరంగా వుండడం.

20. "ఈ విధంగా బౌద్ధధర్మం స్వీకరించినవారు తథాగతున్ని ప్రశంసిస్తారు అంతమాత్రనా భిక్షువుల హృదయాలు ఆనందభరితమై పోకూడదు. ఆనందభరితులైతే భిక్షువులు స్వయం విజయాన్ని సాధించలేరు. ఇతరులు నన్ను నా సిద్ధాంతాన్ని సంఘాన్నీ ప్రశంసించినప్పుడు ఆ ప్రశంసలో నిజమెంత వున్నదో,ఎందుకు అది నిజం అని ప్రశ్నించు కోని ప్రశంసాపాత్రమైన లక్షణాలు వాటిలో నిజంగా వున్నాయా అనేది తేల్చుకోవాలి."

## 4. బౌద్ధ ధర్మవాప్తికి భిక్షువు పోరాడాలి.

1. భిక్షువులనుద్దేశించి భగవానుడీ విధంగా చెప్పాడు.
2. "నేను ప్రపంచంతో పోట్లాడడం లేదు. ప్రపంచమే నాతో పోట్లాడుతున్నది. సత్యాన్ని బోధించే వాడు ఎవ్వరితోనూ పోట్లాడడు.
3. "ప్రభూ! శూరులం, వీరులం, అని చెప్పుకుంటాం. ఏ విధంగా మనం శూరులం?"
4. "శిష్యులారా! మనం యుద్ధం చేస్తాంకనుకనే శూరులయ్యాం.
5. దేని కొరకు మనం యుద్ధం చేస్తాం, (ప్రభూ)"
6. ఉదాత్త గుణాలకొరకు, ఉన్నత లక్ష్యం కొరకు, భవ్యజ్ఞానం కొరకు - మనం యుద్ధం చేస్తాం. అందుకే మనల్ని శూరులంటారు."
7. ధర్మం ఎక్కడైతే దారి తప్పుతుందో అక్కడ పోరాడేందుకు వెనుకాడకుండా వుండాలి. నోరు మెదపకుండా వుండవద్దు.

# నాల్గవ భాగం

# భిక్షువు - సామాన్య బౌద్ధులు

1. భిక్షానుబంధం
2. పరస్పర ప్రభావం
3. భిక్షువు, ఉపాసకుల ధర్మాలు

# 1. భిక్షాను బంధం

1. భిక్షు సంఘం దాని సభ్యులతో సంఘటితమైన సంస్థ దానిలో సభ్యత్వం కొందరికి మా

2. పరి వ్రాజకుడై నంత మాత్రాన భిక్షు సంఘంలో సభ్యుడు కాజాలడు.

3. పరివ్రాజకుడు వుపసంపదకుడైన తరువాతనే సంఘంలో సభ్యత్వం లభిస్తుంది.

4. భిక్షు సంఘం ఒక స్వాతంత్రపు వ్యవస్థ. దాని సంస్థాపకునితో కూడా అది స్వతంత్ర వ్యవహరిస్తుంది.

5. అది స్వయం ప్రతిపత్తిగల సంస్థ. భిక్షు సంఘం అంగీకరిస్తే ఎవరికైనా సభ్యత్వమివ్వ ఎవరి సభ్యత్వాన్నైనా రద్దు పరచవచ్చు. ఈ విషయాలలో వినయ పీటకంలో ప పరచిన నిబంధనలు పాటించాలి.

6. భిక్షువుకీ సామాన్య బౌద్ధునికీ గల ఒకే ఒక బంధం భిక్ష.

7. భిక్ష మీద ఆధారపడే వాడు భిక్షువు; భిక్ష వేసేవాడు సామాన్య బౌద్ధుడు.

8. సామాన్య బౌద్ధులకు సంఘం లేదు.

9. సంఘ దీక్షద్వారా సామాన్య బౌద్ధులు సంఘ సభ్యులౌతారు.

10. సంఘ దీక్ష అంటే సంఘంలోనికి, ధర్మం లోనికీ కూడ ప్రవేశం.

11. సంఘంలో సభ్యత్వం కోరకుండా ధర్మ దీక్ష స్వీకరింపదలచుకున్న వారికి ప్రత్యే ధర్మ దీక్షా విధానం లేదు. సంఘంలో సభ్యత్వం కోరడమంటే గృహస్థు జీవితాన్ని వ కోవడమే.

12. ధర్మ దీక్షకు ప్రత్యేకమైన విధాన మంటూ లేక పోవడం పెద్ద లోపం. భారత దే బౌద్ధ మతం పతనం కావడానికి ఈ లోపం కారణమైంది.

13. సామాన్య బౌద్ధుల కొక సంఘం, దీక్షా కార్యక్రమం లేక పోవడం మూలాన ఒక నుంచి వేరొక మతానికి మారడం జరిగింది. అంతకంటే ఘోరంగా ఒకేసారి పలుమ స్వీకరించడానికి కూడా అవకాశం లభించింది.

# 2. పరస్పర ప్రభావం

1. భిక్షానుబంధం వల్ల తప్పు చేసే సామాన్య బౌదులను భికువు సరియైన మా

2. ఈ సందర్భంలో అంగుత్తరనికాయంలో పొందుపరచబడిన నిబంధనలు గమని దగినవి.

3. ఈ నిబంధనలతో పాటు, సామాన్య బౌద్ధులు భిక్షువు దుష్ప్రవర్తన, దుశ్చర్యలపై ఇ భిక్షువులకు నేరారోపణ చేసే అవకాశం వుంది.

4. బుద్ధునికి భిక్షువు చేసిన నేరం చేరగానే, వినయ పీటకంలో ఈ నేరానికి తీసుకోవల చర్యలకు నిబంధనలు లేనట్లయితే, వినయ పీటకంలో తగు మార్పులు చేసి నిబం ఏర్పరచి ఇటువంటి నేరాన్ని మరో సారి చేస్తే సంఘం పట్ల నేరం చేసి భావించబడేటట్లు వినయ పీటకాన్ని సంస్కరించేవారు.

5. సామాన్య బౌద్ధులు ఫిర్యాదులను పరిశీలించి తగిన చర్యలు తీసుకునేందుకు వి పీటకంలో రూపొందించారు.

6. భిక్షువుకు సామాన్య బౌద్ధులకు ఆ విధంగా సంబంధ మేర్పడింది.

# 3. భిక్షువు - ఉపాసకుల ధర్మాలు

1. కొంత మంది విమర్శకులు బౌద్ధమతం కాదంటారు.

2. అటువంటి విమర్శకు ప్రాధాన్య మివ్వనవసరం లేదు. ఒక వేళ అటువంటి విమర్శకు సమాధానమివ్వాల్సివస్తే బౌద్ధ మతమే నిజమైన మతమనీ దాన్ని ఒప్పుకోని మతానికి నిర్వచనాన్ని మార్చుకోవాల్సి వస్తుందని చెప్పాలి.

3. మిగతా విమర్శకులు ఈ విధంగా గాక బౌద్ధమతం ఒక్క భిక్షులకే సంబంధించి సామాన్య మానవులను పట్టించుకోలేదనీ దాని పరిధిలోనికి సామాన్యుడిని తీసుకో అంటారు.

4. బుద్ధుని సంభాషణలలో భిక్షువుని గురించి మాత్రమే ఎక్కువ సార్లు ప్రస్తావించడం ఈ వాదానికి బలం చేకూరుతుంది.

5. కాబట్టి విషయాలను విశదీకరించడం అవసరం.

6. బౌద్ధ ధర్మం భిక్షువుకూ సామాన్యుడికీ ఒకటేనా లేక భిక్షువు కొక ధర్మం, సామా కొక ధర్మమా!

7. భిక్షువులను ఉద్దేశించి ధర్మాలు చెప్పినంత మాత్రాన అవి వారికి మాత్రమే వర్తిస్తా భావించ కూడదు. అవి భిక్షువులకు సామాన్యులకు సమానంగానే వర్తిస్తాయి.

8. (1)పంచశీలను (2) అష్టాంగ మార్గాన్నీ (3) పారమితలను సామాన్యుని ధ వుంచుకొని బుద్ధుడు ప్రవచించాడనేది నిర్వివాదాంశం.

పంచశీల, అష్టాంగ మార్గం, పారమితలు ముఖ్యంగా చెప్పడం జరిగింది. గృహస్థ జీవితం వదులుకున్న భిక్షువు వాటిని ఉల్లంఘించే అవకాశం లేదు.

10. బుద్ధుని ధర్మ ప్రబోధం సామాన్యుల కోసం ఉద్దేశించబడినదే.

11. కేవలం తర్క ప్రమాణాల బట్టే కాకుండా ప్రత్యక్ష సాక్ష్యం ద్వారా కూడా బౌద్ధంపై యీ విమర్శ సమంజసం కాదని నిరూపించవచ్చు.

12. ఈ విషయాన్ని ఋజువు చేయడానికి ఈ క్రింది ప్రబోధాన్ని ఉదహరించవచ్చు.

13. ఒక సారి బుద్ధుడు శ్రావస్తి యందలి జితవనంలో అనంతపిండకుని ఆరామంలో వుండగా ధార్మికుడనే బౌద్ధుడు మరో **500** మంది బౌద్ధపరివారంతో బుద్ధుని వద్దకు వచ్చి నమస్కరించి ప్రవర్తనా విధులేమిటో వివరించవలసింది.

14. ఓ ప్రభూ గృహస్థ జీవనాన్ని విడనాడిన భిక్షువులకు, గృహస్థ జీవనాన్ని గడుపుతూ ఉపాసకులుగా వున్న వారికి గల ప్రవర్తనా విధులేమిటో వివరించవలసింది.

15. "ఉపాసకులతో పాటు కూర్చుని వున్న భిక్షువులు కూడా మానవాళిని రక్షించే ఈ సత్యాన్ని తెలుసుకోగలరు."

16. దానికి బుద్ధుడు భిక్షువులను శ్రద్ధగా నియమాలను వినవలసిందిగా కోరాడు.

17. "భిక్షాటనకు మధ్యాహ్నం దాటిన తర్వాత వెళ్ళవద్దని, వేళకాని వేళలో వచ్చిన అతిథి దూషణకు గురవుతాడని చెప్పాడు.

18. "భిక్షాటన చేసే సమయంలో తమ మనస్సు నుంచి భిక్షువులు రూపం, శబ్దం, వాసన, రుచి అదృష్టాల పట్ల ఆకాంక్షలను పారద్రోలాలి.

19. భిక్ష అందుకున్న తర్వాత తిరిగి వచ్చి ఏకాంతంగా కూర్చుని అన్య విషయాలలోనికి పచరించని స్థిర చిత్తంతో ధ్యానించాలి.

20. "పవిత్రులతో సంభాషణ చేసేటప్పుడు బౌద్ధ సిద్ధాంతాన్ని గురించిన విషయాలపైనే మాట్లాడాలి.

21. "భిక్షువు, పడుకునేదిగది, పడక, నీరు ధ్యేయ సాధనకు మార్గాలే తప్ప ధ్యేయాలు కావని గ్రహించాలి.

22. "ఆ విధంగా భావించినట్లయితే తామరాకు నీటిలో వున్నప్పటికీ దానికి నీరు అంటనట్లు భిక్షువులు ఏమచ్చ లేకుండా మనగలుగుతాడు.

23. "ఇక ఉపాసకులు పాటించవలసిన విధులు యిప్పుడు ప్రస్తావిస్తాను. వాళ్ళకి నా ఉపదేశం యిది.

24. "జీవులను వధించడం, చంపడం, ఇతరులు వధిస్తూంటే దాన్ని ఆమోదించడం చేయకూడదు. బ్రతికున్న దేనినైనా (బలవంతమైనదైనా బలహీనమైనదైనా) హింసించ కూడదు. అన్ని జీవరాసుల్ని ప్రేమించాలి.

25. "ఉపాసకులు దొంగతనం చేయరాదు, చేయించరాదు. ఇతరులిచ్చిన దానినే స్వీకరించాలి.

26. "కామం అగ్నిగుండం లాంటిది. దానిని విడనాడాలి. పెండ్లి అయిన స్త్రీతో వ్యభిచరించ కూడదు.

27. "సభల్లో, న్యాయ స్థానాలలో అసత్యాలు పలకడం, పలికించడం కూడదు, అసత్యాన్ని విడనాడాలి.

28. "మత్తు పదార్థాలు సేవించడం, సేవింప జేయడం, ఇతరులు సేవిస్తుంటే ఆమోదించడం వంటివి విడనాడి మత్తు పదార్థాల సేవనం మనిషినెంత పిచ్చివానిగాచేస్తుందో గుర్తించాలి.

29. "బుద్ధి హీనులు త్రాగుడు మూలంగా పాపాలను చేస్తూ, ఇతురుల చేత పాపాలు చేయిస్తూ వుంటారు. కాబట్టి మతి హీనుల్ని చేసే త్రాగుడు నుంచి దూరంగా వుండాలి మూర్ఖులకు మాత్రమే త్రాగుడు మనోరంజకమైనది.

30. "చంపడం, దొంగిలించడం, అసత్యాలను పలకడం, త్రాగుడుకు కాముక చర్యలకు పాల్పడడం అనే వాటి జోలికి పోకుండా వుండాలి.

31. ఈ పంచ నియమాలను వారం వారం మననం చేసికొంటూ అష్టాంగ మార్గ పవిత్రతను పవిత్ర హృదయాలతో పాటించాలి.

32. "రోజు వుదయం ఈ నియమాలను గుర్తుచేసుకొని, పవిత్ర హృదయాలతో వివేక వంతులై వారి శక్తి మేరకు భిక్షువులకు భిక్షయివ్వాలి."

33. "తల్లిదండ్రులను సుఖపెడ్తూ సక్రమార్జన చేస్తూ వుండాలి."

34. "ఉపాసకులీవిధంగా నియమబద్ధులై ధర్మ శిఖరాలకు చేరుకోవాలి. " అని చెప్పాడు బుద్ధుడు.

35. ఈ విధంగా చేసినట్లయితే బౌద్ధ ధర్మం భిక్షువులకూ ఉపాసకులకూ ఒకే విధంగా ఉన్నట్లు కనపడుతుంది

36. అయితే ధర్మాచరణలో మాత్రం భిక్షుకులకూ ఉపాసకులకూ తేడా కనబడుతుంది.

37. భిక్షువు పంచ ప్రమాణాలు చేయాలి.

38. తాను ఏ జీవినీ చంపకుండ ప్రమాణం చేయాలి.

39. తనకివ్వని ఇతరుల ఆస్తిని సంగ్రహించనని ప్రమాణం చేయాలి.

40. అసత్యం పలుకనని ప్రమాణం చేయాలి.

41. కాముక చర్యలకు పాల్పడనని ప్రమాణం చేయాలి.

43. ఈ నియమాలు వుపాసకులకు కూడా వర్తిస్తాయి.

44. భిక్షువులకు పై నియమాలు ప్రమాణాలైతే ఉపాసకులకవి నియమాలు మాత్రమే. భిక్షువులు ప్రమాణాలనుల్లంఘించడానికి వీలులేదు. ఉపాసకులు స్వచ్ఛందంగా ఈ నియమాలను పాటిస్తారు.

45. ఇవి కాక భిక్షువులకు, ఉపాసకులకు మధ్య గమనించవలసిన రెండు భేదాలున్నాయి.

46. భిక్షువుకు వ్యక్తిగత ఆస్తి వుండదు, సామాన్య బౌద్ధుడు స్వంత ఆస్తి కలిగి వుండవచ్చు.

47. భిక్షువు పరినిర్వాణం చేయవచ్చు. సామాన్య బౌద్ధునికి నిర్వాణం చాలు.

48. ఇవీ భిక్షువులకూ, ఉపాసకులకూ గల పోలికలు, తేడాలు.

49. కానీ భిక్షువులకూ, ఉపాసకులకూ ధమ్మం మాత్రం ఒక్కటే.

## అయిదవ భాగం

# సామాన్య బౌద్ధులకు వినయ విధి

1. సంపన్నులకు వినయ విధి
2. గృహస్థులకు వినయ విధి.
3. పిల్లలకు వినయ విధి
4. విద్యార్థికి వినయ విధి.
5. భార్యా భర్తలకు వినయ విధి.
6. యజమాని, సేవకులకు వినయ విధి.
7. సారాంశం
8. బాలికలు వినయ విధి

# 1. సంపన్నులకు వినయ విధానం

## (i)

1. భగవానుడు పేదరికాన్ని ఒక వర ప్రసాదంగా చెప్పి దానికి ఉన్నత స్థాయి కల్పించలేదు.

2. పేదరికంతో తృప్తి చెందే పేదవారికి ఈ భూలోకం స్వంతమౌతుందనీ చెప్పలేదు.

3. దానికి విరుద్ధంగా సంపద అనుభవయోగ్యమేనని, అయితే సంపదను వినయ విధులకు లోబడే పొందాలనీ భగవానుడు చెప్పాడు.

## (ii)

1. ఒకసారి అనాధ పిండకుడు భగవానుడున్న చోటికి వచ్చి భగవానునికి ప్రణామం ఆచరించి ఆయన ప్రక్కన కూర్చుని అడిగాడు. గృహస్థుకు ఆదరపాత్రము, ఆహ్లాదకరము, సంతోషప్రదమూ అయి కూడా కష్టసాధ్యమైన సంగతులేమిటో బోధిసత్వులు వచిస్తారా?

2. దానికి సమాధానంగా భగవానుడు మొదటిది చట్టబద్ధంగా సంపదను పొందడమని చెప్పాడు.

3. "రెండవది తన బంధువులు కూడా చట్టబద్ధంగా సంపదనార్జించేటట్లు చూడడం.

4. "మూడవది ఎక్కువ కాలం జీవించాలని కోరుకోవడం."

5. "పై మూడు విషయాలు గృహస్థుకు ఆదర పాత్రము, అహ్లాదకరము సంతోష ప్రమాదరమూ అయినప్పటికి సులభసాధ్యమైనవి కావు. ఈ మూడింటిని సాధించేందుకు నాలుగు షరతులు ఉన్నాయి. ఆ నాలుగు షరతులు ధర్మంపై విశ్వాసం కలిగి ఉండడం, సద్గుణుడై ప్రవర్తించడం, ఉదారుడై ఉండడం, వివేకియై ఉండడం."

6. ధర్మంపై విశ్వాసం ఉండడ మంటే సర్వోన్నతుడు, పవిత్రుడు పరిపూర్ణమైన జ్ఞానం కలిగిన వాడూ సద్వర్తనుడు సకల విషయ పరిపూర్ణుడు, నిరుపమాన శిక్షకుడు, దేవతలకు మానవులకు గురువూ అయిన తథాగతుని బోధనలపై విశ్వాసం కలిగి ఉండడమే.

7. "సద్వర్తన కలిగి ఉండడమంటే ప్రాణహాని, దొంగతనం, వ్యభిచారం, అసత్య వచనం, మద్యపానం వంటి వాటిని త్యజించడం."

8. గృహస్థుడి ధర్మమంటే - అతని మనస్సు అత్యాశ నుంచి విముక్తమై ఉండాలి. అతడు పెద మనస్సుతో కానుకలు అడగటానికి యోగ్యుడుగా, యివ్వటంలో సములాసిగా,

9. వివేకియై ఉండడమంటే ఏమిటి? దురాశ, అత్యాశ చెడు స్వభావం జడత్వం సోమరితనం, వైముఖ్యం తడబాట్లు కలిగి ఉంటే గృహస్థు కానిపనులు చేస్తూ కర్తవ్యం విస్మరించి ఉంటాడు. అటువంటి వానికి సంతోషం గౌరవం లభ్యం కావు.

10. "దురాశ, అత్యాశ, చెడుస్వభావం, జడత్వం, సోమరితనం వైముఖ్యం తడబాటుతనం అనేవి మనస్సును మలిన పరుస్తాయి. ఆ మాలిన్యాలను తొలగించు కొన్న గృహస్థుడు గొప్పదైన విస్తారమైన సమదృష్టితో గూడిన పరిపూర్ణమైన జ్ఞానాన్ని పొందుతాడు."

11. ఆ విధంగా న్యాయబద్ధంగా సక్రమమైన పద్ధతిలో శ్రమించి స్వహస్తాలతో చమటోడ్చి సంపాదించిన సంపద ఉత్కృష్టమైనది. అలా సంపాదించిన ఆస్తితో గృహస్థు సుఖ సంతోషాలను పొందడమే కాక తన భార్యా బిడ్డలకు సేవకులకు, పని వారికి స్నేహితులకు కూడా సంతోషాన్ని కలుగ చేస్తాడు.

## 2. గృహస్థులకు వినయ విధి

గృహస్థులకు విధించిన వినయ నిబంధనలు సిగాలునితో బుద్ధుని సంభాషణ ద్వారా తెలుస్తాయి.

1. ఒకసారి రాజ గ్రహలోని వేలు వనంలోని ఉడతలను మేపే స్థలం వద్ద తథాగతుడు ఉండడం తటస్థించింది.

2. ఒక గృహస్థుని కుమారుడైన సిగాలుడు ఉదయాన్నే లేచి రాజగ్రహస్థలం నుంచి బయలు దేరి తడిసిన బట్టలతో విరబోసుకున్న వెంట్రుకలతో , రెండు చేతులు జోడించి పైకెత్తి తూర్పు, దక్షిణం, పడమర,ఉత్తరం, భూమి, ఆకాశం వైపు తిరిగి పూజా కార్యక్రమాలు చేయసాగాడు.

3. అదేసమయంలో బుద్ధుడు అంగీ తొడిగి భిక్షాపాత్రను తీసుకొని భిక్షకోసం రాజగ్రహానికి బయలు దేరాడు. పూజలు చేస్తున్న సిగాలుని చూసి"ఎందకు భూమ్యాకాశాలకు అన్ని దిక్కులకు నమస్కారాలు చేస్తున్నావని అడిగాడు."

4. అందుకు సిగాలుడు "మా తండ్రి మరణిస్తూ భూమ్యాకాశాలకూ, అన్ని దిక్కులకూ నమస్కారాలు చేస్తూ పూజ చేయమని చెప్పాడు. కనుక నా తండ్రి మాట యందున్న గౌరవం కొద్దీ ఆ విధంగా చేస్తున్నాను అని చెప్పాడు.

5. మానవుడు అనుసరించ వలసిన మతం ఇది ఎలా అవుతుంది? అని బుద్ధుడు సిగాలుని అడగ్గా సిగాలుడు "అలా అయితే ఏమతం మానవుడు అనుసరించ వలసిన మత మౌతుంది. అని అడిగాడు" మానవుడు అనుసరిచవలసిన మతం ఏదో భగవానుడు వివరిస్తే మహా భాగ్యంగా భావించి తెలుసుకుంటాను" అని సిగాలుడు సమాధానమిచ్చాడు.

6. ఓ యువ గృహస్థా! మానవుడు అనుసరించవలసిన మత మేమిటో చెప్తాను. సావధానంగా విను "అన్నాడు బుద్ధుడు. "అలాగే" నని సమ్మతించాడు సిగాలుడు. **అప్పుడు** బుద్ధుడు ఈ విధంగా చెప్పాడు.

7. "మానవుడు ఆచరించవలసిన మతం దుష్ట ప్రవర్తనకు దూరంగా ఉండమని బోధించాలి. ప్రాణహాని చేయడం, ఇవ్వబడనిదేదీ గ్రహించ కుండా ఉండడం, వ్యభిచారం చేయకుండడం, అబద్ధాలాడకుండడం మానవుడు అనుసరించవలసిన విధులు.

8. "పాక్షిక దృష్టితో శత్రుత్వంతో బుద్ధిహీనతతో, భయంతో మానవులు చెడ్డ పనులు చేస్తారు" ఇవి విడనాడినట్లయితే మానవుడు దుష్టకార్యాలకు పూనుకోడు.

9. ఒక మతం మానవుని మతం కావాలంటే సంపదను దుర్వినియోగ పరచ కూడదని బోధించాలి. త్రాగుడు, వేళగాని వేళ వీధుల వెంట తిరగడం , సంతలను దర్శించడం, జూదంపై మోజు చూపడం, చెడు సాంగత్యం, సోమరితనం వల్ల కలిగే ఫలితమే సంపద దుర్వినియోగం.

10. త్రాగుడు మూలంగా సంక్రమించే దుష్ఫలితాలు ఆరు. సంపద పోగొట్టు కోవడం, తగాదాలు పెరగడం, జబ్బున పడడం మంచి ప్రవర్తన కోల్పోవడం, అసభ్యకరంగా ప్రవర్తించడం, బుద్ధిమాంధ్యం కలిగి ఉండడం.

11. "వేళ గాని వేళల్లో వీధుల వెంట తిరగడం వల్ల కలిగే దుష్ఫలితాలు ఆరు. తనకు, భార్యా బిడ్డలకు, ఆస్తికి రక్షణ లేక పోవడం వీధిలో జరిగిన ఎవరో చేసిన నేరాలు ఇతనే చేశాడని భావించడం ఇతనిపై పుకార్లు పుట్టడం ఎన్నో ఇబ్బందులను ఎదుర్కోవలసి రావడం."

12. సంతలకు పదే పదే పోవడం వల్ల కూడా ప్రమాదాలు ఆరు. ఎక్కడ నృత్య ప్రదర్శన జరుగుతుందో, ఎక్కడ గీతాలాపన జరుగుతుందో ఎక్కడ సంగీత కచేరీ జరుగుతుందో, పాటలెక్కడ పాడుతున్నారో, మేళ తాళాలెక్కడ వినిపిస్తాయో, ఎక్కడ పాడుకుంటూ నృత్యాలు చేస్తారో అనే వాటి మీదనే మనస్సు లగ్నమై ఉంటుంది.

13. "జూదం అనే వ్యసనానికి లోనైన వానికి ఆరు ప్రమాదాలున్నాయి. జూదంలో గెలిచిన వాడు ఇతరుల ద్వేషాగ్నికి గురౌతాడు. పోగొట్టుకున్న వాడు పోయిన దానిని గురించి విచారిస్తాడు. పైగా తనకున్నదాన్నంతా కోల్పోవలసి వస్తుంది, తమ మాటకు న్యాయ స్థానంలో విలువ ఉండదు. స్నేహితులు, అధికారులు చులకనగా చూస్తారు. తనకు పిల్ల నిచ్చే వాడు జూద మాడే వాడు భార్యను పోషించలేడనే నెపంతో పిల్ల నివ్వరు."

14. చెడు సహవాసం చేయడం వల్ల కలిగే ప్రమాదాలు ఆరు: వానికి ఏ జూదగాడైనా తిరుగుబోతైనా, మోసగాడైనా ,వంచకుడైనా ,హింసా ప్రవృత్తి గలవాడైనా స్నేహితుడౌతాడు.

15. సోమరి తనం వల్ల కలిగే ప్రమాదాలు ఆరు: చల్లా చదురుగా ఉంది. గాబట్టి పని చేయననీ, ఇంత పెందలకడే లేక ఇంత ప్రొద్దు పోయిన తరువాత పనిచేయననీ చాలా ఆకలిగా ఉంది కాబట్టి పనిచేయననీ, బాగా తిన్నాను గాబట్టి పని చేయననీ, అంటూ సోమరి పని చేయకుండా ఉంటాడు. అటువంటి వానికి కొత్త సంపద రాకపోగా ఉన్న

16. "ఒక మతం మానవుని నిజమైన మతం కావాలంటే తన నిజమైన స్నేహితుడెః తెలుసుకొనే విధంగా బోధించాలి."

17. "స్నేహితుల్లా కనబడుతూ శత్రువులుగా భావించ వలిసిన వారు నల్గురున్నారు. వ దురాశాపరులు, మాటలే తప్ప చేతల్లో శూన్యులు, అతిగా పొగిడే వారు, తనతో పా వృధా చేసే వారు."

18. "వీరిలో మొదటి వానిని శత్రువుగా భావించాలి. అతడు ఇచ్చేది కొద్ది కోరేది మరిం అతడు తన బాధ్యతలను భయం వల్ల చేస్తాడు. అతనికి స్వహితంపైనే ద జంటుంది."

19. "మాటల మనిషే గానీ చేతల మనిషి గాని వానిని హితుడి రూపంలో ఉన్న శత్రువ పరిగణించాలి. అతడు స్నేహాన్ని వృత్తిగా చూసి పాత స్నేహాన్ని చేయ బో స్నేహాన్ని వృత్తిగా భావించి, శుష్కమై మాటల ద్వారా అనుగ్రహం సంపాదిం నిజంగా సేవ చేయవలసి వచ్చినపుడు తన అసహాయతను కనబరుస్తాడు."

20. "పొగిడే వాడిని స్నేహితుని రూపంలో ఉన్న శత్రువుగా భావించాలి. అతడు తః చేయడానికి ఒప్పుకోవడమే కాకుండా ఒప్పు చేయడానికి తిరస్కరిస్తాడు. మన ముం మనల్ని పొగిడి ఇతరుల ముందు తెగడుతాడు."

21. "అదే విధంగా మనతో పాటు వృధా చేసే వాడు కూడా స్నేహితుని రూపంలో ఉ శత్రువే. అతడు వేళ కాని వేళల్లో వీధుల్లో తిరిగే సమయంలో వెంట వస్తాడు. విన శాలలను సందర్శించే సమయాల్లో తోడు వస్తాడు. జూదమంటే అమితాసక్తి మన కలిగినపుడు వెంట ఉంటాడు."

22. హృదయపూర్వకంగా మిత్రులనదగిన వారు నల్గురు. వారు సహాయ కారి, సుఖ ఁ ఖాలలో పాలు పంచుకునే వాడు, మంచి సలహాల నిచ్చేవాడు, సానుభూతి చూపేవాం

23. "సహాయకారిగానున్నవాడు అప్రమత్తంగా లేనప్పటికీ మనల్ని కాపాడతాడు. మః భయపడ్తున్న సందర్భాల్లో అభయం కల్పిస్తాడు. మన పనిలో మనకు కావలసి సహాయం కంటే రెట్టింపు చేస్తాడు."

24. "సుఖ దుఃఖాలలో ఒకే విధంగా మనతో ఉండేవాడే నిజమైన ఆత్మీయుని పరిగణించాలి. అటువంటి వాడు తన రహస్యాలన్నీ మనకు చెప్పడమే కాకుండా మ రహస్యాలను రహస్యంగా ఉంచుతాడు. అతడు మనలను కష్టాలలో వదలి పెట్టఁ మన కోసం ప్రాణ త్యాగం చేస్తాడు."

25. "మనం కర్తవ్యాన్ని నిస్సంకోచంగా చెప్పేవాడే హృదయ నైర్మల్యం గలవాఁ అటువంటి వాడు మనల్ని తప్పు చేయనీయడు. ఒప్పుచేయమని ప్రోత్సహిస్తాడు మనకు తెలియని విషయాన్ని విశదీకరిస్తూ, సద్గతులకు దారి చూపిస్తాడు."

26. మనమంటే సానుభూతి చూపించేవాడు హృదయపూర్వకమైన ...

దురదృష్టాలతో సంతోషం పొందడు. మన వృద్ధికి సంతోషిస్తాడు. మనల్ని గురించి చెడుమాట్లాడేవారిని వారిస్తాడు. మనల్ని గురించి మంచిగా మాట్లాడేవారిని ప్రోత్సహిస్తాడు.

27. "మానవుడిని అనుసరించవలసిన మతం ఆరు దిక్కులను పూజించడం నేర్పే బదులు తల్లి తండ్రులను, గురువులనూ, భార్యాబిడ్డలను, స్నేహితులను, సేవకులనూ పని వారినీ, మత గురువులను గౌరవించడం నేర్పాలి."

## 3. పిల్లలకు వినయ విధి

1. తల్లిదండ్రుల పోషణ బాధ్యత వహిస్తూ ఇలా అనుకోవాలి" తల్లిదండ్రులకు సహాయకారిగా ఉంటాను. వారి బిడ్డగా చేయ వలసిన పనులన్నీ చేస్తాను. కుటుంబానికి వంశపారంపర్యంగా వచ్చే గౌరవాన్ని నిలబెడ్తాను. నా తల్లిదండ్రులకు తగిన వారసుడనని పించుకుంటాను" అని ఎందుకంటే తల్లిదండ్రులు వారి ప్రేమానురాగాల్ని బిడ్డల పట్ల ప్రదర్శించడమే కాకుండా వారు చెడు మార్గాల బారిన పడకుండా మంచి మార్గాల వైపు నడిపించి ఒక వృత్తి వైపు వారిని మళ్ళించి పెళ్ళి చేసి ఆస్తి పాస్తులను వారికి అప్పగించుతారు."

## 4. విద్యార్థికి వినయ విధి

1. లేచి నిలబడి అభివాదం చేయడం, వారి ఆజ్ఞల కొరకు ఎదురు చూడడం విద్య యందు ఆసక్తి చూపడం, స్వయంగా శుశ్రూష చేయడం, బోధన వేళ శ్రద్ధాసక్తుడై ఉండడం - విద్యార్థి అయిన వాడు గురువు ఎడల నిర్వర్తించ వలసిన బాధ్యతలు. ఎందుకంటే తమ విద్యార్థిని వాత్సల్యంతో చూస్తారు. అతడు ఏ శిక్షణ నేర్చినా, ఎందులో పారంగతుడైనా వారి చలవే. ప్రతి విద్య సంప్రదాయాన్ని అతనికి క్షుణ్ణంగా బోధిస్తారు. అతని మిత్రులతో, సహచరులతో అతన్ని గూర్చి ప్రశంసగా చెబుతారు. ప్రతి సందర్భంలో అతన్ని భద్రంగా కాపాడుతారు.

## 5. భార్యా భర్తల వినయ విధి

1. భర్త భార్య పట్లగౌరవం, మర్యాద, దాంపత్య విశ్వాసం, కలిగి ఉండి అధికారాన్ని అప్ప చెప్పాలి. ఆమెకు కావలసిన అలంకారాలను సమకూర్చి ఇవ్వాలి. ఎందుకంటే భార్య, భర్త పట్ల ప్రేమగా ఉంటుంది. తన బాధ్యతలను నెరవేరుస్తూ ఇరువైపుల బంధువులను ఆదరాభిమానాలతో చూస్తూ విశ్వాసం కలిగి భర్త తెచ్చిన సరకులను జాగ్రత్త పరుస్తూ శ్రమించి నేర్పుగా తన బాధ్యతలను నెరవేరుస్తుంది.

2. గృహస్థుడు స్నేహితులు, అనుచరుల పట్ల ఔదార్యం, మర్యాద ఉపకార బుద్ధి కలిగి ఉండాలి. తనను తానెట్లు శ్రద్ధగా చూసుకొంటాడో వారిని ఆ విధంగా చూస్తూ తన మాటలెంత మంచివో చేతలంత మంచిగా చేస్తూ ఉండాలి. ఎందుకంటే అతని

కాపాడుతూ అతని ఆస్తిని కాపాడుతూ, అతడు ప్రమాదాలలో ఉన్నపుడు బాసటగా ఉండి కష్టాలలో అతనిని విడనాడకుండా అతని కుటుంబానికి ఆసరాగా నిలుస్తారు.

## 6. యజమాని - సేవకులు

1. యజమాని, తన సేవకులకు, ఉద్యోగులకు వారి వారి శక్తిని బట్టి పనిని కేటాయిస్తూ ఉండాలి. వారికి కావలసిన ఆహారం జీత భత్యాలు ఇస్తూ, వారు అస్వస్థతకు గురైనపుడు ఆదుకొంటూ వారికి అవసరమైన సెలవు ఇస్తూ, మంచి భక్ష్యాలను వారితో పంచుకోవాలి. ఎందుకంటే సేవకులు, ఉద్యోగులు వారి యజమానిని ప్రేమిస్తారు. అతని కంటే ముందుగా నిద్రలేచి ముందుగా పనులు చేసి అతని కంటే ఆలస్యంగా పడుకుంటారు. వారికి యజమాని ఏది ఇస్తే దానితో తృప్తి పడతారు. వారి పని బాగా చేస్తారు. యజమానిని ప్రశంసిస్తూ అతని ప్రతిష్ఠ పెంచుతారు.

2 గృహస్థు తన మత గురువుల యెడల మనసా వాచా గౌరవం చూపాలి. వారెప్పుడు వచ్చినా స్వాగతం పలికి వారికి కావలసిన ప్రాపంచిక అవసరాలను తీర్చాలి. ఎందుకనగా గురువులు అతనిని చెడుకు దూరంగా ఉంచుతూ మంచి చేయమని బోధిస్తూ దయాపూరితమైన మనస్సుతో ప్రేమిస్తూ తనకు తెలియని విషయాల్ని బోధిస్తూ తనకు తెలిసిన దానిని సంస్కరిస్తూ ఉంటారు.

## 7. సారాంశం

1. ఆ విధంగా భగవానుడు చెప్పగా సిగాలుడు భగవానునుద్దేశించి, అద్భుతం భగవాన్ అద్భుతం పార వేసిన దానిని తిరిగి పొందటం, నిక్షిప్తమైన దానిని బహిర్గతం చేయడం, దారి తప్పిన వానికి సరియైన దారి చూపడం చీకటిలో వెలుగు చూపడం ఎలాంటివో మీ బోధనలు అలా ఉన్నాయి. "కన్నులున్న ప్రతి వాడు బాగా చూడగలిగినట్లే సత్యాన్ని చాలా విధాలుగా మీరు నా కెరుక పరచారు" అని వెల్లడించాడు.

2. సిగాలుడు భగవానునితో నేను భగవానుడు తెలియ జేసిన సత్యాన్ని మతాన్ని అనుసరిస్తాను. నన్ను ఈ రోజు నుంచి జీవితాంతం వరకు శిష్యునిగా ఉండాడానికి అనుమతి ఇవ్వండి" అని కోరాడు.

## 8. బాలికలు వినయ విధి

1. ఒకసారి భగవానుడు జైత్య వనంలోని భద్దియ అనే ప్రదేశంలో ఉండగా మెండకుని మనుమడైన ఉగ్రహకుడు భగవానుని సందర్శించి నమస్కరించి ఆయన ప్రక్కన ఆసీనుడయ్యాడు.

2. ఉగ్రహుడు భగవానుని తన ఇంటికి మరుసటి రోజు భోజనానికి ఆహ్వానించారు. ఆయన ఇంట్లో ముగ్గురితో పాటు నాల్గవ వాడు బుద్ధ భగవానుడు

3. బుద్ధభగవానుడు మౌనంగా ఆమోదం తెలిపాడు.

4. ఉగ్రహుడు లేచి నిలబడి నమస్కరించి భగవానుని వద్ద సెలవు తీసుకొని వెళ్ళాడు.

5. మరుసటి రోజు భగవానుడు ఉదయాన్నే అంగీ ధరించి భిక్షాపాత్ర తీసుకొని ఉగ్రహుని ఇంటికి వెళ్ళి తన కోసం సిద్ధం చేసిన ఆసనం పై కూర్చున్నాడు. ఉగ్రహుడు స్వయంగా వడ్డించి భగవానునికి తృప్తి కలిగే లాగా భోజనం పెట్టాడు.

6. భోజనం పూర్తి అయిన తరువాత భగవానుని ప్రక్కన కూర్చొని ఉగ్రహుడు అన్నాడు.

7. స్వామీ నా కుమార్తెలు పెళ్ళికాగానే వారి భర్తల ఇండ్లకు పోతారు.వారు చిరకాలం సుఖ సంతోషాలతో జీవితం గడిపేందుకు గాను వారికి హిత బోధ చేయండి.

8. ఉగ్రహుని కుమార్తెలకు భగవానుడు ఈ హితబోధ చేశాడు. "మీ తల్లిదండ్రులు మీ భవిష్యత్తును సుఖ సంతోషాలను ఆశించి ఎవర్ని భర్తలుగా తెచ్చినా ఆ భర్తల పట్ల అనురాగంతో ఉంటూ రోజూ వారికంటే ముందు నిద్ర లేచి తర్వాత నిద్రకుపక్రమించి ఇష్ట పూర్వకంగా విధులు నిర్వర్తించి మృధుమధురంగా మాట్లాడుతూ మెలగటానికి శిక్షణ పొందండి.

9. భగవానుడు వారికి హిత బోధ కొనసాగిస్తూ ఇంకా ఇలా వచించాడు. భర్త వైపు బంధువులందరినీ గౌరవ మర్యాదలతో ఆదరించాలి. భర్త తరపు వాళ్ళలో భర్త తండ్రి కావచ్చు, తల్లి కావచ్చు, శరణు కోరిన వారు కావచ్చు, ఎవరైనప్పటికీ వారు రాగానే ఆసనం చూపించి మంచి నీళ్ళు ఇవ్వాలి.

10. భర్త ఇంట్లో చేస్తున్న పనుల్లో, నూలు, పూలు , వస్త్రాలకు సంబంధించినవైనా ఆ పనులలో నేర్పు సాధించాలి.

11. "పని వాళ్ళతో వారు చేయగలిగినంత పని చేయిస్తూ ఎవరే పని చేయగలుగుతారో ఆ పనికి వారిని పురమాయిస్తూ ఎవరి బలహీనత లేమిటో ఎవరికే ఆహారం పడుతుందోనని తెలుసుకొని తగినట్లుగా నడుచుకోవటానికి కావలసిన శిక్షణ పొందాలి."

12. భర్త తెచ్చిన ధనం, ధాన్యం, వెండి, బంగారం, భద్రంగా దాచి దొంగల పాలు కాకుండా కాపాడుతూ దొంగిలించకుండా ఉండేందుకు కావలసిన శిక్షణ కూడా పొందాలి.

13. ఈ హిత బోధ విన్న మీదట ఉగ్రహుని కుమార్తెలు అమితానందంతో భగవానునికి కృతజ్ఞతలు తెలిపారు.

*అనువాదం: డి.వి.సుబ్బా రావు*

# ఆరవ అధ్యాయము

# బుద్ధుడు - అతని సమకాలికులు

మొదటి భాగం - బుద్ధునికి ఉపకారులు

రెండవ భాగం - బుద్ధునికి విరోధులు

మూడవ భాగం - బుద్ధుని మిత్రులు, అభిమానులు

నాల్గవ భాగం - హితులూ - అభిమానులు

## మొదటి భాగం

# బుద్ధునికి ఉపకారులు

1. బింబిసారుని కానుక
2. అనాధ పిండకుని కానుక.
3. జీవకుని కానుక.
4. ఆమ్రపాలి కానుక .
5. విశాఖ వదాన్యత

# 1. బింబి సారుని కానుక

1. బింబిసార చక్రవర్తి బుద్ధభగవానుని అనుయాయుడే కాక బుద్ధుని యెడల గొప్ప భక్తి కలిగిన వాడు. ఆయన ధర్మానికి గొప్ప ఆలంబనం.

2. సామాన్య బౌద్ధునిగా దీక్ష తీసుకున్న బింబిసారుడు, అనుచరులైన భిక్షువులతో పాటు తన ఆతిథ్యం స్వీకరించవలసిందిగా బుద్ధుని కోరాడు.

3. బుద్ధుడు మౌనంతో ఆతిథ్యాన్ని స్వీకరించడానికి అంగీకరించాడు.

4. ఆతిథ్యాన్ని స్వీకరించడానికి అంగీకరించాడని గ్రహించిన బింబిసారుడు తన ఆసనం నుంచి లేచి గౌరవంతో బుద్ధునికి ప్రదక్షిణం చేసి వెళ్ళాడు.

5. మరుసటి రోజు బింబిసారుడు రుచికరమైన వంటకాలు తయారు చేయవలసిందిగా తన వారిని ఆదేశించి తగు సమయంలో భగవానుని వద్దకు పోయి భోజనం సిద్ధమైనదనీ, భోజన వేళ అయిందని చెప్పాడు.

6. బుద్ధుడు మొల వస్త్రాన్ని, అంగీధరించి ఇంతకు ముందు జటిలురుగా ఉండి తరువాత బౌద్ధ ధీక్ష బూనిన భిక్షువులతో రాజగృహ ప్రవేశించాడు.

7. బింబిసారుని రాజ భవనానికి వెళ్ళి తమ కోసం సిద్ధపరిచిన ఆసనాలపై బుద్ధుడూ, తనతో వచ్చిన భిక్షువులూ ఆశీనులయ్యారు. బింబిసారుడు పాత్రనూ తన చేతులనూ శుభ్రపరచుకొని కూర్చున్న తరువాత ఆయన ప్రక్కనే బింబిసారుడు కూర్చున్నాడు.

8. బుద్ధుని ప్రక్కనే కూర్చుని బింబిసారుడు బుద్ధుని నివాసానికి అనువుగా ఉండే స్థలాన్ని గూర్చి ఆలోచించసాగాడు. ఆ స్థలం గ్రామానికి దూరంగా గాని దగ్గరగా గాని ఉండ కుండా బుద్ధునికి గాని, ఆయన వద్దకు పోదలచుకున్న వారికి అందుబాటులో ఉండేది గాను, జన సమూహాలకు దూరంగా, నిశ్శబ్దంగా విడిగా ప్రశాంతంగా ఉండాలని బింబిసారుని ఆలోచన.

9. బింబిసారుడు తన విహార స్థలమైన వేలువనం పట్టణానికి దగ్గరగా గాని దూరంగా గాని లేదు. కాబట్టి వచ్చి పోవడానికి అనువుగా ఉంటుందిది. అని ఆలోచించి బుద్ధునికి ఆయన భిక్షువులకు వేలువనాన్ని ఇవ్వజూపుదామనుకున్నాడు.

10. బింబిసారుడు బంగారు పాత్రలో నీరు తీసుకొని బుద్ధుని చేతిలో పోసి తన విహార వనమైన వేలు వనాన్ని బుద్ధుని సారథ్యంలో ఉన్న భిక్షువులకు ధారాదత్తం చేస్తున్నానని చెప్పగా బుద్ధ భగవానుడందుకు అంగీకరించాడు.

11. తథాగతుడు తన మత ప్రబోధం బింబిసార చక్రవర్తికి ఉత్తేజం, ప్రేరణ, ఆనందం,

12. బౌద్ధమత సంబంధమైన ప్రవచనం ముగించి బుద్ధుడు వేలువనాన్ని భిక్షుకులు విరాళంగా స్వీకరించడానికి అనుమతిస్తున్నానని చెప్పాడు.

## 2. అనాధ పిండకుని కానుక

1. అనాధ పిండకుడు బౌద్ధ ధర్మం స్వీకరించిన తర్వాత ఒకసారి బుద్ధుని దగ్గరకు వచ్చి ఆయన ప్రక్కన కూర్చోవడం తటస్థించింది.

2. అనాధ పిండకుడు "నేను శ్రావస్తి నివాసియని భగవానునికి తెలుసు, అక్కడ పంటలు బాగా పండుతాయి. అది శాంతియుతమైన ప్రదేశం ప్రసేనుడనే రాజు దాని పాలకుడు." అని చెప్పాడు.

3. "ఇప్పుడు శ్రావస్తిలో ఒక విహారాన్ని నెలకొల్పాలనుకుంటున్నాను. భగవానుడు శ్రావస్తి వచ్చి విహారాన్ని స్వీకరంచ వలసింది" అని అతను అర్థించాడు.

4. భగవానుడు దానికి మౌనంగానే అంగీకారం తెల్పాడు.

5. అభాగ్యులకు ఆప్తుడు, అనాధలకు అండ ఐన అనాధ పిండకుడు శ్రావస్తి రాకుమారుడైన జితుని వనంలోని పచ్చని పొదరిళ్ళనూ, నెమ్మదిగా పారుతున్న సెలయేళ్ళనూ చూచి అదే భగవానునికీ అతని భిక్షువులకూ అనుకూలమైన ప్రదేశమని భావించి రాకుమారుని వద్దకు పోయి ఆ వనాన్ని తనకు అమ్మవలసిందిగా కోరాడు.

6. రాకుమారుడు ఆ వనాన్ని చాలా విలువైనదిగా భావించడం వల్ల దానిని అమ్మడానికి ఇష్ట పడలేదు. మొదట అమ్మడానికి నిరాకరించినా తర్వాత ఆ ధనాన్నంతా బంగారంతో నింపితే ఎంతౌతుందో అంత ఖరీదుకు తప్ప మరే ఖరీదుకు ఆ వనాన్ని అమ్మనన్నాడు.

7. రాకుమారుని షరతుకు ఒప్పుకుని అనాధ పిండకుడు వనాన్ని బంగారంతో నింప నారంభించగా రాకుమారుడు తన మనస్సు మార్చుకొని వనాన్ని అమ్మనన్నాడు. అప్పుడు అనాధ పిండకుడు వనాన్ని అమ్మడం గురించి న్యాయ మూర్తి దృష్టికి తీసుకెళ్ళడం జరిగింది.

8. రాకుమారునికీ అనాధపిండకునికీ మధ్య తలెత్తిన వివాదాన్ని గురించి పట్టణ ప్రజలు రకరకాలుగా చెప్పుకోవడంతో అనాధపిండకుడు ధనవంతుడే గానీ నిజాయితీ పరుడనే తెలియడంతో రాకుమారుడు ఈ విషయంలో విచారణ చేశాడు. ఆ విచారణలో భగవానుని పేరు వినగానే విహారాన్ని ఏర్పాటు చేయడంలో తాను కూడా భాగ స్వామి కావాలను కొని అనాధ పిండకుడు ఇవ్వజూపిన బంగారంలో సగం మాత్రమే స్వీకరించి వనం ఉన్న భూమి మాత్రమే అనాధ పిండకునిదనీ వనంలో ఉన్న చెట్లన్నీ తన భాగంగా భగవానునికి విరాళంగా యిస్తానని ఒప్పందం కుదుర్చుకున్నారు.

10. జిత వనమనే ఈ విహారాన్ని అనాథల కాప్తుడైన అనాథ పిండకుడు భగవానుని శ్రావస్తి వచ్చి స్వీకరించ వలసిందిగా అర్థించగా భగవానుడు కపిల వస్తునగరాన్ని వదలి శ్రావస్తి వచ్చాడు.

11. భగవానుడు జితవనం ప్రవేశిస్తుండగా అనాథ పిండకుడు ఆయన ప్రవేశించే ప్రదేశమంతా పూలు జల్లి వాసనల ధూపాలను వెలిగించాడు. విహారాన్ని కానుకగా ఇస్తున్న సందర్భాన్ని పురస్కరించుకొని బంగారు కూజా నుంచి బుద్ధుని చేతిలో నీరు పోస్తూ యావత్ప్రపంచంలోని సోదరుల కోసం ఆ జితవనాన్ని భగవానునికి ధారాదత్తం చేస్తున్నట్లుగా చెప్పాడు.

12. కానుకను అందుకొంటూ భగవానుడు "చెడు ప్రభావాలు అంతరించుగాక ధర్మసంస్థాపన కోసం ఈ బహుమానం ఉపయోగపడు గాక, ఈ బహుమానం మానవాళికంతటికీ, ముఖ్యంగా దాతకూ మేలు చేకూర్చు గాక అని చెప్పాడు.

13. భిక్ష ప్రదాతలుగా బిరుదు పొందిన ఎనభై మంది బుద్ధుని అనుయాయుల్లో అనాథ పిండకుడు ఒకడు.

# 3. జీవకుని కానుక

1. రాజగ్రహలో ఉన్నపుడల్లా జీవకుడనే వైద్యుడు రాజుకు రెండుసార్లు బుద్ధుని కలుస్తుండే వాడు.

2. బింబిసారుడు బుద్ధునికి బహుమానంగా ఇచ్చిన వేలువనం చాలా దూరమని జీవకుడు భావించాడు.

3. జీవకునికి రాజగ్రహలోనే తనదైన అంబవనమనే వనం ఉండి ఆ వనం తనకు దగ్గరౌతుంది.

4. అన్ని సదుపాయాలతో అంబవనంలో ఒక విహారాన్ని నిర్మించి అంబవనంతో సహా విహారాన్ని భగవానునికి కానుకగా సమర్పించాలని జీవకుడను కున్నాడు.

5. భగవానునితో తాను అంబవనంలో విహారాన్ని నిర్మించి ఇవ్వాలనే కోర్కెను తెలిపాడు.

6. దానికి భగవానుడు మౌనంగానే అంగీకారం తెల్పాడు.

# 4. ఆమ్రపాలి కానుక

1. కొంత కాలం నాదికలో గడిపిన భగవానుడు మరో తావుకు పోదలచి ఆనందునితో వైశాలికి పోదామన్నాడు.

2. ఆనందుడు భగవానుని కోర్కె ప్రకారం వైశాలికి పోవడానికి అంగీకరించాడు.

4. రాజ నర్తకియైన అమ్రపాలి భగవానుడు వైశాలి వచ్చి తన మామిడి తోటలో బసచేస్తున్నాడని విన్నది. చాలా రాజ వాహనాలను సిద్ధంచేయించి అందులో తానొక వాహనంపై వైశాలి నుంచి తోట వద్దకు బయలుదేరింది. వాహనాలు పోగలిగినంత వరకు వాహనంలో పోయి, వాహనం దిగి నడచి భగవానుని దగ్గరకు వెళ్ళి గౌరవంగా ఆయన ప్రక్కన కూర్చుంది. ఆ విధంగా కూర్చున్న అమ్రపాలికి బుద్ధుడు ధర్మబోధ చేశాడు.

5. ధర్మబోధానంతరం అమ్రపాలి భగవానునితో "మీ సోదర భిక్షువులతో పాటు రేపు మా యింటికి భోజనానికి రండి " అని ఆహ్వానించింది.

6. దానికి భగవానుడు మౌనంగానే అంగీకారం తెల్పాడు. ఆ తర్వాత అమ్రపాలి వంగి నమస్కరించి తన కుడివైపున భగవానుడుండే విధంగా వెళ్ళిపోయింది.

7. బుద్ధుడు వైశాలి వచ్చి అమ్రపాలి తోటలో బసచేస్తున్నాడని విని వైశాలీయులైన లిచ్ఛవులు విని వారు కూడా బుద్ధుని భోజనానికి ఆహ్వానించాలనుకొని ఒక్కొక్కరు ఒక రథంలో బుద్ధుడున్న చోటికి బయలుదేరారు.

8. వారికి దారిలో అమ్రపాలి ఎదురైంది.

9. అమ్రపాలి ప్రయాణం చేస్తున్న రథాలు, యిరుసులు, చక్రాలు, కాడి కర్రలు లిచ్ఛవుల రథాల యిరుసులకు, చక్రాలకు, కాడి కర్రలకు రాసుకొని పోతూ ఉండడం చూసి లిచ్ఛవులు అమ్రపాలిని "ఎందుకు ఆ విధంగా రథాలను పరుగుతీయిస్తున్నావు "అని అడిగారు.

10. దానికి అమ్రపాలి "భగవానుని తన సోదర భిక్షువులతో సహా రేపు మా యింట ఆతిథ్యం స్వీకరించవలసిందిగా ఆహ్వానించి వస్తున్నాను" అని చెప్పింది.

11. "ఆ ఆహ్వానాన్ని మాకు ఇప్పిస్తే నీకు నూరు వేలిస్తాం" అని లిచ్ఛవులన్నారు.

12. మొత్తం వైశాలి రాజ్యాన్ని దాని సామంత రాజ భాగాల్ని ఇచ్చినప్పటికీ ఆ ఆహ్వానాన్ని వదలుకోనని" అమ్రపాలి చెప్పింది.

13. ఈమామిడిబాల మమ్మల్ని ఓడించింది" అంటూ లిచ్ఛవులు అమ్రపాలి తోట వైపు సాగి పోయారు.

14. అమ్రపాలి తమను మించి పోయిందని తెలిసినా బుద్ధుడు తమ ఆహ్వానాన్ని అమ్రపాలి ఆహ్వానం కంటే ముందు అంగీకరిస్తాడనే ఆశతో భగవానుని భోజనానికి పిలవటానికి అమ్రపాలి తోటకు లిచ్ఛవులు వెళ్ళారు.

15. లిచ్ఛవులు రావడం చూసి వారు కొంత దూరంలో ఉండగానే సోదర భిక్షువులనుద్దేశించి వారితో దేవతలను చూడని వారెవరైనా ఉంటే లిచ్ఛవులను చూడమనీ, లిచ్ఛవులు ప్రపంచంలో ఉన్నట్లు చెప్పబడుతున్న దేవతలతో పోల్చదగిన వారనీ చెప్పాడు.

16. లిచ్ఛవులు పోగలిగినంత దూరం రథాలలో పోయి, అక్కడ కాలినడకతో భగవానుని వద్దకు పోయి ప్రక్కన ఆసీనులయ్యారు.

17. భగవానుని ఉద్దేశించి "రేపు మీరు మా ఇంటికి భోజనానికి వచ్చి ఆతిథ్యం స్వీకరించే మహాద్భాగ్యాన్ని మాకు కలుగచేయరా" అని లిచ్ఛవులు కోరారు.

18. దానికి భగవానుడు "నేను ముందే ఆమ్రపాలి ఇంట ఆతిథ్యం స్వీకరించడానికి వాగ్దానం చేశాను" అని చెప్పారు.

19. వారి ప్రయత్నం విఫలమైందని తెలుసుకొని భగవానునికి ధన్యవాదాలు తెలిపి వంగి నమస్కరించి వెళ్ళారు.

20. రాజ నర్తకియైన ఆమ్రపాలి మరుసటి రోజు ఉదయాన్నే రుచికరమైన వంటకాల్ని తన భవనంలో తయారు చేసి భోజనానికి వేళ అయిందనీ భోజనం సిద్ధంగా ఉందనీ భగవానుని భోజనానికి ఆహ్వానించింది.

21. ప్రాతః కాలమే లేచి బుద్ధుడు కాషాయపు అంగీ ధరించి భిక్షాపాత్ర చేతబట్టుకొని తన సోదర భిక్షువులతో ఆమ్రపాలి భవనానికి వెళ్ళి తమకోసం సిద్ధం చేసిన ఆసనాలపై కూర్చున్నాడు. అంతట ఆమ్రపాలి స్వయంగా వంటకాలను వారు వద్దనే వరకు తృప్తిగా వడ్డించింది.

22. భోజనాలై భిక్షా పాత్రను, తన చేతులను భగవానుడు శుభ్రపరచుకున్న తర్వాత ఆమ్రపాలి చిన్న ఆసనం పై భగవానుని ప్రక్కన కూర్చుంది.

23. ఆమ్రపాలి భగవానునితో తన భవనాన్ని భగవానునికీ భిక్షుక సంఘానికి కానుకగా సమర్పించుకొంటానని చెప్పగా దానికి భగవానుడు సమ్మతించి ధార్మిక సంప్రదాయ బద్ధంగా అంగీకరించి తన సోదర భిక్షువులతో తమ విడిది కెళ్ళారు.

## 5. విశాఖ వదాన్యత

1. శ్రావస్తి నివాసియైన విశాఖ గొప్ప సంపన్నురాలు. ఆమెకు చాలా మంది కొడుకులు, కూతుళ్ళు, మనుమలు , మనుమరాళ్ళు ఉన్నారు.

2. భగవానుడొకసారి శ్రావస్తిలో ఉండగా విశాఖ భగవానుని వద్దకు వచ్చి తన ఇంటికి భోజనానికి రావలసిందని ఆహ్వానించగా భగవానుడు అందుకంగీకరించాడు.

3. ఆ రోజురాత్రి, మరుసటి రోజు ఉదయం వర్షం కుండపోతగా కురిసింది. భిక్షువులు వారి వస్త్రాలు తడవకుండా ఉండడానికి వాటిని తీసి దాచుకొని వర్షంలో నగ్నంగా తడుస్తూ ఉండి పోయారు.

4. విశాఖ ఇంట్లో భోజనాలైన తర్వాత విశాఖ భగవానుని ప్రక్కనే కూర్చొని తనకు ఎనిమిది వరాలివ్వ వలసిందిగా కోరింది.

5. దానికి భగవానుడు "ఆ వరాలేమిటో తెలుసుకోకుండా తథాగతులు వరాలివ్వరు" అని చెప్పారు.

6. అంతట విశాఖ "నేను కోరే వరాలు సముచితమైనవి. నిరభ్యంతరకరమైనవి అని చెప్పింది.

7. వరాలడగటానికి అనుమతి లభించగానే విశాఖ ఇలా వివరించింది. "భిక్షులకు వర్షాకాలంలో వస్త్రాలు, బయటి నుండి అక్కడి వచ్చే భిక్షువులకు ఆహారం, అస్వస్థులకు ఆహారం, వారికి సేవజేసే వారికి ఆహారం, అస్వస్థులకు మందులు, సంఘ సభ్యులకు క్షీరాన్నమూ, భిక్షుకి సోదరీమణులకు స్నానపు అంగీలు నా జీవితాంతం ఏర్పాటు చేయడానికి అనుమతి రూపంలో ఎనిమిది వరాలు ఇవ్వండి."

8. ఈ ఎనిమిది వరాలను తథాగతుని అడగడంలో విశాఖ ఉద్దేశ్యమేమిటని భగవానుడు విశాఖను అడిగాడు.

9. దానికి సమాధానంగా విశాఖ భగవానునితో "నా పరిచారికను భోజనానికి భిక్షువులనాహ్వానించడానికి పంపగా అక్కడ భిక్షువులు తమ వస్త్రాలను దాచుకొని నగ్నంగా వర్షంలో తడుస్తూ ఉండడం చూసి వారు భిక్షువులు కారేమో నగ్నసన్యాసులేమో నని భావించి తిరిగి వచ్చేసింది. నేను ఆమెను మరలా వారిని ఆహ్వానించడానికి పంప వలసి వచ్చింది" అని చెప్పింది.

10. "నగ్నత్వం జుగుప్సాకరమైంది కాబట్టి నా జీవితాంతం భిక్షువులు వర్షాకాలంలో ధరించేందుకు వస్త్రాలను భిక్షువుల కివ్వదలచినాను" అని విశాఖ చెప్పింది.

11. "ఇక నా రెండవ కోరిక గురించి: బయట నుంచి అక్కడకు వచ్చే భిక్షువుకు దారి తెలియక, ఎక్కడ ఆహారం దొరుకుతుందో తెలియక భిక్షాటనతో అలసి పోయి ఉంటాడు. అందుకే అటువంటి భిక్షువులకు నా జీవితాంతం ఆహారం అందివ్వాలనేది రెండవ కోరిక.

12. "నా మూడవ కోరిక: ఆ ప్రదేశం నుండి బయటకు వెళ్ళే భిక్షువు భిక్షాటన చేసి ఆహారం సంపాదించి బయల్దేరాలంటే అతడు పోవలసిన చోటుకు చాలా ఆలస్యంగా అలసటతో పోతాడు. కాబట్టి అటువంటి భిక్షువులకు కూడా నాజీవితాంతం ఆహారం ఏర్పాటు చేయడానికి అనుమతి ఇవ్వండి.

13. "ఇక నాల్గవది : అస్వస్థుడైన భిక్షువుకు తగిన ఆహారం దొరకనట్లైతే జబ్బు తీవ్రమౌతుంది. కాబట్టి అస్వస్థతతో నున్న భిక్షువుకు తగిన ఆహారం సమకూర్చేందుకు అనుమతి కావాలి."

14. "అస్వస్థతలో నున్న భిక్షువుకు పరిచర్యలు చేస్తున్న భిక్షువుకు భిక్షాటన చేయడానికి సమయం దొరకదు. కాబట్టి అటువంటి వారికి ఆహారం సమకూర్చాలన్నది నా ఐదో కోరిక.

15. "అస్వస్థులైన భిక్షువులకు సరియైన ఔషధాలు దొరకక పోయినట్లయితే రోగం ముదిరి మరణించవచ్చు. అటువంటి అస్వస్థులకు ఔషధాలు సమకూర్చాలనేది" ఆరవ కోరిక.

16. "ఇక నా ఏడవ కోరిక: క్షీరాన్నం మనస్సును తేజపరుస్తుందనీ, ఆకలి దప్పికలను తీరుస్తుందనీ, అది ఆరోగ్య వంతులకు పరిపూర్ణాహారమనీ రోగ గ్రస్తులకు ఔషధమనీ భగవానుడు ప్రశంసించినట్లు నేను విన్నాను. అందుకే నా ఏడవ కోరికగా భిక్షువులందరికి నాజీవితపర్యంతం క్షీరాన్నాన్ని అందించడానికి అనుమతి కోరాను.

17. అభిరావతీ నదిలో నాట్యగత్తెలతో బాటు భిక్షుకిలు నగ్నంగా స్నానం చేస్తూ ఉంటే వారి నగ్నసౌందర్యాన్ని చూచిన నాట్యగత్తెలు వారిని ఇంత యవ్వనంలోనే బ్రహ్మచారిణులుగా ఉండడం ఏ విధంగా మంచిదనీ వృద్ధాప్యంలో బ్రహ్మచర్యం వల్ల ఇహమూ, పరమూ లభ్యమవుతాయని ఎగతాళి చేస్తూ ఉంటారు. నగ్నత్వం అపవిత్రమైంది, జుగుప్సాకరమైందీ కాబట్టి నా ఎనిమిదవ కోరికగా స్త్రీ భిక్షువులకు స్నానపు బట్టలు సమకూరుస్తాను

18. తాను కోరిన ఎనిమిది వరాలకు కారణాలు పై విధంగా విశాఖ భగవానునికి వివరించింది."

19. తథాగతుని ఈ ఎనిమిది వరాలు కోరడంలో తనకు కలిగే ప్రయోజనమేమిటో వివరించవలసిందిగా భగవానుడు విశాఖను కోరాడు.

20. విశాఖ ఇలా వివరించింది. "భిక్షువులు వివిధ ప్రదేశాల్లో వర్షాకాలం గడిపి శ్రావస్తిలో ఉన్న భగవానుని దర్శించి ఆ భిక్షువు మరణానంతర పరిస్థితి ఏమిటని భగవానుని అడిగినప్పుడు ఆయన మరణించిన భిక్షువు ధర్మ దీక్షా ఫలితాలు పొందుతాడనీ ఆరహంతుడవడం కానీ, నిర్వాణం పొందడం కానీ జరుగుతుందని చెప్తాడు.

21. "అప్పుడు నేను వారి దగ్గరకు పోయి ఆ చనిపోయిన సోదరుడు ఒకప్పుడు శ్రావస్తిలో ఉన్న వాడేనని అడిగి తెలుసుకుంటాను. మృతుడు వర్షాకాలంలో నేను సమకూర్చిన బట్టలు ధరించాడని, అట్లాగే రోగులకు ఆహారం, మందులు, వారిని చూసే వారికి ఆహారం, వచ్చే పోయే భిక్షువులకు ఆహారం, నిత్య క్షీరాన్న ప్రదానం - అన్నీ సమకూరాయని నేను అవశ్యం తెలుసుకుంటాను.

22. "చనిపోయిన భిక్షువు నా ఆతిథ్యం స్వీకరించిన వాడని తెలుసుకొన్నపుడు నా శరీరం పులకించి పోతుంది. నాకు శాంతి తృప్తి లభిస్తాయి. ఆ ప్రశాంతతలో నా నైతిక శక్తులు పుంజుకుంటాయి. నా జ్ఞానం ఏడు విధాలుగా వికసిస్తుంది. ఇవే నాకు ఎనిమిది వరాల వల్ల కలిగే ప్రయోజనాలు."

23. దానికి భగవానుడు మెచ్చి " ఈ ఎనిమిది వరాలు నన్ను అడగడంలో కలిగే ప్రయోజనాలు ఉత్తమమైనవి. అర్హులైన వారికి ఉదారంగా సహాయం చేయడం సారవంతమైన నేలలో మంచి విత్తనాలను విత్తిపుష్కలంగా ఫలాన్ని పొందడం లాంటిది. కోరికలకు బానిసలైన వారి పట్ల ఉదారత చవిటి నేలలో విత్తనాలు విత్తడం వంటిది. అటువంటి వారి ఉదారత యొక్క గొప్పతనం స్వీకరించిన వారికి ఊపిరాడ కుండా చేస్తుంది" అని చెప్పాడు.

24. విశాఖ ఉదారతకు కృతజ్ఞత తెలుపుతూ భగవానుడు , "ఉదాత్తమైన జీవనం గడుపుతున్న

సంతోషంగా ఇచ్చే విరాళం దివ్యమైంది. దుఃఖ నాశనకారి, మహా దానం దాన్ని కలుగ చేస్తుంది. ఆమె నిర్మలమూ నీతి దాయకమూ అయిన మహాదానందాన్ని పొందుతుంది. అందరి బాగును కోరుకోవడంలో ఆమె సంతోషం పొందుతూ ధార్మిక కార్యాలలోనే ఆనందిస్తుంది అని చెప్పాడు.

25. విశాఖ భిక్షుక సంఘానికి తన తూర్పు వైపున గల ఉద్యానవనాన్ని విరాళంగా ఇచ్చి మహిళా బౌద్ధులకు పరిరక్షకురాలైంది.

# 1. ఆకర్షణతో దీక్షయిస్తున్నాడనే ఆరోపణ

1. భగవానుడొక సారి వైశాలి ప్రాంతంలోని వనంలో విహారంలో ఉండగా లిచ్ఛవీయుడైన భద్రుడు ఆయనను దర్శించి "ప్రభూ కొందరు ప్రజలు మీరు మాయావి ఆకర్షణలతో ఇతర మతాలకు చెందిన వారిని మీ వైపు సమ్మోహితుల్ని చేస్తున్నారని అంటున్నారు" అని చెప్పాడు.

2. భగవానుని గూర్చి దుష్ప్రచారం చేయాలనే కోర్కెతో ఆ విధంగా చెప్పడం లేదని కూడా వారంటున్నారు, వారి ఆరోపణలను లిచ్ఛలీయులైన మేము నమ్మడం లేదని కూడా వారంటున్నారు. వారి ఆరోపణలను లిచ్ఛలీయులైన మేము నమ్మడం లేదు. కానీ భగవానుడీ విషయంలో ఏమి చెప్పదలచుకున్నడో తెలుసు కోవాలను కుంటున్నాం" అని చెప్పాడు.

3. దానకి భగవానుడు "చూడు భద్రా! వినికిడిని బట్టి గాని, ఆనవాయితీ బట్టిగానీ ప్రజలంటున్నంత మాత్రాన, తార్కికమైనంత మాత్రాన, పర్యవసాన ఫలితమైనంత మాత్రాన, సాదృశ్యమున్నంత మాత్రాన, నీ భావానికనుకూలంగా ఉన్నంత మాత్రాన నీవు సమంజసమైనదనుకుంటున్న మాత్రాన నీకు అదంటే గౌరవం ఉన్న మాత్రాన లేక సన్యాసి చెప్పినంత మాత్రాన దేనినీ అంగీకరించవద్దు అని చెప్పాడు.

4. వాస్తవాలను పరిశీలించినపుడు నీవు చేసేది పాప కార్యమని అనిపిస్తే జ్ఞానులు దానిని నిరసిస్తే ఆ పని చేయడం వల్ల నష్టం, హాని కలుగుతాయని తేలితే ఆ పనిని చేయవద్దు."

5. "నేను మాయావిగా మతం మార్పిడి చేస్తున్నానని ప్రచారం చేసేవారు ఏదో ఆశించి అలా చేస్తున్నారని అనిపించడం లేదా?" అని భద్రుడు అడుగగా తనకూ అలాగే అనిపిస్తుందని భగవానునితో భద్రుడు చెప్పాడు.

6. "దురాశ చేత మనసు వశం తప్పిన కాంక్షాపరుడు తన లక్ష్య సిద్ధికి అసత్యమాడడా, నేరం చెయ్యడా? ఏ మంటావు భద్రా?" అది సత్యమే స్వామీ అన్నాడు భద్రుడు.

7. దుర్బుద్ధి, ప్రతీకార కాంక్ష పరుని మనస్సును స్వాధీనపరచుకొన్నపుడు, తన లక్ష్య సాధనకు అవాంతరంగా ఉన్నారనుకొన్న వారిపై నేరారోపణ జేయడానికి యితరులను పురిగొల్పుతాడు" అని భగవానుడు చెప్పగా భద్రుడు అది సత్యమే అనుకొన్నాడు.

8. "అందుకే నేను నా అనుచరులతో అత్యాశను అదుపులో పెట్టుకోమని అది అదుపులో ఉన్నపుడు వారు శారీరకంగా గాని పనిలో గాని ఆలోచనల్లో గాని అత్యాశ వల్ల చేసే పనులు చేయకుండా ఉంటారని బోధించాను.

9. కాబట్టి నేను సమ్మోహన శక్తితో ఒక ఆకర్షణ కిటుకుతో మతం మార్పిడి చేస్తున్నానని నిందించే సన్యాసులు, బ్రాహ్మణులు అసత్యాలు మాట్లాడు తున్నారు. అనవసరంగా నాపై దుష్ప్రచారం చేస్తున్నారు.

4. ఈ ఆరోపణలు విన్న భిక్షువులు ఈ విషయాన్ని భగవానునికి విన్నవించారు.

5. దానికి భగవానుడు ఈ గొడవ ఎక్కువ కాలం ఉండదనీ, ఏడు రోజుల తర్వాత సద్దుమణుగుతుందనీ చెప్పాడు.

6. భిక్షువుల నుద్దేశించి భగవానుడు మాట్లాడుతూ" ఒకవేళ మగధ ప్రజలు భిక్షువులను దూషించినట్లైతే తథాగతులు ఐన మీరు పాటిస్తున్న ధర్మ మార్గం సరియైనదని చెప్పండి. జ్ఞానులైన వారు జనాన్ని సద్ధర్మమార్గంలో నడిపిస్తున్నపుడు వారిని నిందించడ మెందుకు? మన ధర్మాన్ని పాటించాలనే వత్తిడులేవీ లేవనీ, గృహస్థుగా ఉండడం గృహస్థుగా ఉండక పోవడం అనేవి వ్యక్తి గత ఇష్టాఇష్టాలకు సంబంధించిన విషయాలని చెప్పండి "అని భిక్షువులకు చెప్పాడు.

7. భగవానుడు చెప్పిన విధంగా భిక్షువులు మగధ ప్రజలకు చెప్పడంతో వారు శాక్య పుత్రుడైన శ్రమణుడు ధర్మ మార్గంలోనే తన అనుయాయులను నడిపి స్తున్నాడనీ అధర్మ మార్గాలేవీ అనుసరించడం లేదనీ నమ్మారు.

## 4. జైనులు - ఒక హత్యారోపణ

1. గౌతమ శ్రమణుని ధర్మ ప్రచారంతో, తీర్థంకరులను ఎవరూ గౌరవించలేదనీ, వారి ఉనికే కొందరికి తెలియదనే భావం తీర్థంకరులలో కలిగింది.

2. గౌతముని ప్రతిష్ఠను దిగజార్చడానికి ఎవరితోనన్నా చెయ్యి కలపడానికి వీలుంటుందేమో ఆలోచించి సుందరి అనే ఆమె సహాయంతో గౌతముని ప్రతిష్ఠ దిగజార్చాలను కొన్నారు తీర్థంకరులు.

3. సుందరి వద్దకు తీర్థంకరులు పోయి ఆమె అందచందాలు ఆకర్షణ చాలా గొప్పదనీ తను గౌతముని గురించి అపవాదులు ప్రచారం చేస్తే నమ్ముతారనీ దాని మూలంగా గౌతముని ప్రభావం దిగజారుతుందనీ చెప్పారు.

4. సుందరి రోజూ పూల దండలతో, కర్పూరంతో, సువాసనలతో జితవనం పోతుండేది. ఎదురైన వారెవరైనా ఎక్కడకు పోతున్నావన్నావని సుందరినడిగితే తాను గంధకుటీరంలోని శ్రమణ గౌతముని వద్దకు పోతున్నానని సమాధానమిచ్చేది.

5. సుందరి తీర్థంకరుల తోటలలో ఉంటూ ఉదయాన్నే తిరిగి వచ్చినప్పటికీ ఎవరైనా అడిగినట్లైతే తాను గౌతమునితో రాత్రంతా గడిపినట్లు చెప్పేది.

6. కొన్నాళ్ళు గడిచిన తర్వాత తీర్థంకరులు కొందరు హంతకుల్ని కిరాయికి కుదుర్చుకొని సుందరిని చంపి గౌతముని గంధ కుటీరం వద్ద ఉన్న పెంట కుప్పలో వేయమన్నారు. వారికి పురమాయించిన విధంగా హంతకులు సుందరిని హత్య జేసి గౌతముని గంధ కుటీరంవద్ద ఉన్న చెత్తకుప్పలో పడవేశారు.

ఉండేదనీ, ఆమె అదృశ్యమైందనీ వారి దృష్టికి తెచ్చారు.

8. అధికారుల సహాయంతో తీర్థంకరులు సుందరి శరీరాన్ని గంధ కుటీరం వద్ద నున్న చెత్త కుప్పలో కనుగొనడం జరిగింది.

9. గౌతమునికి సుందరి వల్ల అపప్రధ వస్తుందనే భయంతో ఆయన శిష్యులే సుందరిని హత్య చేశారని తీర్థంకరులు నేరారోపణ చేశారు.

10. కాని సుందరిహత్య చేయడానికి తీర్థంకరుల వద్ద పుచ్చుకున్న సొమ్ము పంచుకోవడంలో హంతకుల మధ్య పానశాలలో పోట్లాటవచ్చింది.

11. హంతకులను అధికారులు బంధించడంతో వారు తమనేరాన్ని అంగీకరించి తీర్థంకరులు పురిగొల్పడం వల్లనే తాము హత్య చేశామని చెప్పారు.

12. ఆ విధంగా తీర్థంకరులు వారికున్న కొద్దిపాటి విలువను కూడా పోగొట్టుకున్నారు.

## 5. జైనులు - ఒక అసత్య దుర్నడత ఆరోపణ

1. సూర్యోదయంతో మిణుగురు పురుగులు అదృశ్యమైనట్లే గౌతముని ధర్మదీక్ష విస్తరణలో తీర్థంకరుల పరిస్థితి దీనావస్థకు దిగజారిపోయి ప్రజలు వారిని గౌరవించడం, వారికి కానుకలివ్వడం మానివేశారు.

2. వీధుల వెంటబడి తీర్థంకరులు మేము కూడా గౌతముని వలెనే జ్ఞానులం బుద్ధునికి కానుకలివ్వడం వల్ల పుణ్యం లభిస్తే మాకు కానుకలివ్వడం వల్ల కూడా పుణ్యం లభిస్తుంది. కనుక మాకు కానుకలివ్వవలసింది అని "ప్రజలను అడగడం మొదలు పెట్టారు"

3. తీర్థంకరుల మాటలు ప్రజలు పెడచెవిన పెట్టారు. దీనితో శ్రమణునిపై అభాండాలు వేసి బౌద్ధ సంఘాన్ని అపఖ్యాతి పాలు చేయడానికి తీర్థంకరులు పన్నాగం పన్నారు.

4. శ్రావస్తిలో చించ అనే ఒక బ్రాహ్మణ పరివ్రాజక ఉండేది. శరీరసౌష్టవంతో వంపు సొంపులతో ఇతరులను సమ్మోహితుల్ని చేయగల అందగత్తె. ఆమె తన శరీర కదలికలతో చూపరులను ముగ్ధుల్ని చేసేది.

5. ఎత్తుగడలు వేయడంలో నేర్పరియైన తీర్థంకరుడు చించ సహాయంతో గౌతముని అప్రతిష్ఠ పాలు చేయడానికి వేసినఎత్తుగడకు మిగతా తీర్థంకరులు సమ్మతించారు.

6. ఒక రోజు చించ తీర్థంకరులున్న తోటకు వచ్చి వారికి నమస్కరించి వారి వద్ద కూర్చుంది. అయినా తీర్థంకరులెవ్వరూ ఆమెతో మాట్లాడలేదు.

7. తాను మూడు సార్లు అభివాదం చేసినప్పటికీ ఎవ్వరూ మాట్లాడకుండా ఉండడానికి తానేమైనా వారికి బాధ కలిగించానా అని చించ తీర్థంకరులను అడిగింది.

12. "దేవదత్తా! నీవు నా పట్ల క్రూరంగా ప్రవర్తిస్తున్నావు. నాపై నీ ప్రేమ వాస్తవమైనా, అవమానకరమైనదే, ప్రేమిస్తున్నాననడం కేవలం అసత్యం మాత్రమే" అని యశోధర చెప్పింది.

13. నేను యవ్వనంలో అందంగా వున్నప్పుడు నీవెప్పుడు నా వైపు చూడలేదు. ఇప్పుడు విచారంతో కృంగి వృద్ధాప్యంలో వున్న నా వద్దకు వచ్చి నీ ప్రేమను ప్రకటించడం ఎంత కుటిలమైనదో నీ వెంత పిరికివాడవో నాకర్థమౌతుందని యశోధర చెప్పింది.

14. తక్షణం గది నుంచి వెళ్ళిపోవలసిందిగా యశోధర బిగ్గరగా అరవడంతో దేవదత్తుడా గది నుంచి వెళ్లిపోయాడు.

15. తనను భిక్షుకసంఘానికి ముఖ్యునిగా నియమించక సారిపుత్రుని, మృగళాణుని ముఖ్యులుగా చేసినందుకు దేవదత్తునికి బుద్ధునిపై కోపం వుంది. బుద్ధుని అంతమొందించటానికి అతడు మూడు సార్లు విఫల ప్రయత్నం చేశాడు.

16. ఒకనాడు భగవానుడు రాబందుల శిఖరం నీడన అటూ ఇటూ పచార్లు చేస్తున్నాడు.

17. దేవదత్తుడు శిఖరం పై నుంచి భగవానుని అంతమొందించాలనే ఉద్దేశ్యంతో ఒక పెద్ద బండరాయిని భగవానుని పైన పడే విధంగా దొర్లించాడు. కాని ఆ రాయి కిందకు దొర్లుతున్నప్పుడు మరో రాయితో ఢీకొని ముక్కలై ఒక ముక్క బుద్ధుని కాలికి తగిలినందువల్ల భగవానునికి రక్తం కారింది.

18. మరోసారి దేవదత్తుడు భగవానుని చంపడానికి ప్రయత్నం చేశాడు.

19. దేవదత్తుడు అజాత శత్రువనే రాకుమారుని వద్దకు పోయి తనకు కొంత మంది మనుషుల నిమ్మన్నాడు. అజాత శత్రువు మనుషులను దేవదత్తుని కిస్తూ అతడే పని చేయమంటే ఆ పని చేయవలసిందిగా వారి నాజ్ఞాపించాడు.

20. అజాతశత్రువు పంపిన మనుషులలో ఒకనిని దేవదత్తుడు భగవానుడుండే చోటు చెప్పి అతనిని చంపిరమ్మన్నాడు. దాని కాతడు భగవానుని ప్రాణాలను తీయలేనన్నాడు.

21. దేవదత్తుడు మూడవసారి భగవానుని చంపడానికి ప్రయత్నం చేశాడు.

22. నలగిరి అనే ఏనుగు రాజ గ్రహలో అతి క్రూరంగా మనుషులను చంపివేసే ఏనుగు.

23. రాజగ్రహలోని ఏనుగులశాలకు దేవదత్తుడు వెళ్ళి మావటీలతో తాను వాళ్ళ రాజుకు బంధువుననీ, కింది స్థాయిలో గలవారిని పై స్థాయికి తీసుకు రాగల సామర్థ్యం తనకున్నదనీ వాళ్ల జీతభత్యాలు పెరిగేటట్లు చేయగలననీ చెప్పాడు.

24. శ్రమణ గౌతముడా మార్గాన వెళ్లే సమయంలో నలగిరి అనే ఏనుగును మార్గంలో విడిచి పెట్టవలసిందిగా మావటీలను దేవదత్తుడు కోరాడు.

25. నలగిరిని భగవానునిపై వదలడమే గాకుండా నేర్పరులైన విలుకాండ్రను కూడా వినియోగించి దేవదత్తుడు భగవానుని చంపజూశాడు.

26. భగవానుని అంతమొందించడానికి దేవదత్తుడు చేసే ప్రయత్నాలన్నీ విఫల మయ్యాయి. తన కుట్రలన్నీ ప్రజలకు తెలిసిపోవడంతో వారినుంచి లభించే ఆదాయం ఆగిపోయింది. అజాతశత్రువు కూడా అతనికి దర్శనమీయడం మానివేశాడు.

27. చివరకు దేవదత్తుడు జీవనం కోసం ఇంటింటికీ తిరిగి బిచ్చమెత్తుకోవలసి వచ్చింది. అజాతశత్రువు నుంచి చాలా రకాలుగా సహాయం పొందిన దేవదత్తుడు దానిని నిలుపుకోలేకపోయాడు. నలగిరి ఉదంతం తర్వాత దేవదత్తుని పలుకుబడి పూర్తిగా దిగజారింది.

28. తను చేసిన పనుల వల్ల అప్రతిష్ఠ పాలైన దేవదత్తుడు మగధను వదిలి కోసల దేశం రాజైన ప్రసేనజిత్తు ఉన్నా ఆదరిస్తాడని కోసల దేశం వెళ్ళాడు. కానీ ప్రసేన జిత్తు కూడా దేవదత్తుని నిర్దాక్షిణ్యంగా వెళ్ళగొట్టాడు.

## 7. బ్రాహ్మణులు - బుద్ధుడు

1. ఒకసారి కోసల రాజ్యంలో చాలా మంది భిక్షువులతో కలిసి ప్రయాణం చేస్తూ భగవానుడు బ్రాహ్మణ గ్రామమైన తుణ దాపుకు వెళ్ళడం జరిగింది.

2. గృహస్థులైన తుణ గ్రామ బ్రాహ్మణులు గౌతముడు వారి గ్రామ పొలిమేరలకు వచ్చాడని విన్నారు.

3. స్వభావ సిద్ధంగా దురుద్దేశాలతో, ధనాశాపరులైన ఆ బ్రాహ్మణ గృహస్థులు బుద్ధుని ప్రబోధాలపై విశ్వాసం లేనివారు.

4. బుద్ధుడు తమ గ్రామానికి వచ్చి రెండు మూడు రోజులుంటే ఆ గ్రామ ప్రజలను బౌద్ధులుగా మారుస్తాడనీ దానితో వారి బ్రాహ్మణ మతం బలహీనపడుతుందనీ అనుకుని బుద్ధుడు తమ గ్రామంలోనికి రావడం ఆపాలనుకొన్నారు.

5. ఆ గ్రామానికి రావాలంటే ఒక నదిని దాటవలసివుంది బుద్ధుని వారి గ్రామానికి రానివ్వకుండా చేయడానికి బ్రాహ్మణులు నది రేవుల వద్ద ఉండే పడవలను తీసివేసి వంతెనలు వాడుకకు వీలులేకుండా జేశారు.

6. ఒక్క బావిని మినహాయించి మిగతా బావులన్నిటినీ ఉపయోగించడానికి వీలు లేకుండా చెత్తతో నింపారు. నీరుండే ప్రదేశాలు, చావిళ్ళు కొట్టాలు కనపడకుండా చేశారు.

7. బ్రాహ్మణుల దుష్కార్యాలు తెలుసుకున్న భగవానుడు వారిపై కరుణతో తన భిక్షుక సమూహంతో నదిని దాటి బ్రాహ్మణుల గ్రామమైన తుణను చేరుకున్నాడు.

8. వీధి ప్రక్కన వున్న చెట్టు కింద కూర్చొని తన ప్రక్కనుంచే నీటి కడవలను మోసుకుపోతున్న స్త్రీలను భగవానుడు చూశాడు.

9. శ్రమణుడైన గౌతముడు తమ గ్రామానికి వస్తే అతనికి ఆహ్వానం పలకడం, ఇండ్లకు వస్తే ఆయనకు, ఆయన అనుయాయులకు గాని భోజనం పెట్టడం, నీళ్ళివ్వడం వంటివి

పొందుతాడనుకుందాం. "అయితే ధర్మ మంటే ఏమిటి?"

19. కొనడం, అమ్మడం ద్వారా గాక జలధారతో తాను స్వీకరించిన బ్రాహ్మణితోనే కాపురం చేయడం, కుల బహిష్కృతుని కుమార్తెతో గాని, వేటగాని కుమార్తెతోగానీ, మేదరి కుమార్తె తో గాని, వడ్రంగి కుమార్తెతో గాని అడవి జాతివాని కుమార్తె తోగాని, బిడ్డతల్లితో గానీ, బిడ్డకు పాలిస్తూన్న స్త్రీతో గానీ రుతుకాలంలో వున్న స్త్రీతో గానీ రమించకుండా వుండడంలో ధర్మం వుంది.

20. బ్రాహ్మణుడు బిడ్డ తల్లితో ఎందుకు రమించడంటే ఆమెకు కలిగే సంతానం అక్రమ సంతానమవుతుంది కాబట్టి. పాలిచ్చే స్త్రీ జోలికి ఎందుకు వెళ్ళడంటే పాలుత్రాగే బిడ్డ అపరిశుభ్రమవుతుంది కాబట్టి.

21. "రుతుకాలంలో వున్న స్త్రీ వద్దకు పోయినట్లయితే బ్రాహ్మణి పట్ల తన కోర్కెలు సన్నగిల్లి ఆమె ఏ మాత్రం అతనికి శారీరకమైన సుఖాన్ని కలిగించలేదు. ఆమె కేవలం తనకు సంతానాన్ని కనేది గానే వుంటుంది."

22. "భార్య ఒక బిడ్డను కనగానే బ్రాహ్మణుడు తల గొరిగించుకుంటాడు."

23. "ఆ విధంగా తల గొరిగించుకొని ఇల్లు వదలి కామ వాంఛల నుంచి దూరంగా వుంటూ నిష్టతో ప్రపంచంలో నాల్గవవంతునుంచి నాల్గవ ఆశ్రమం చేరుకుంటాడు."

24. "నాలుగు దశలలో జీవించి మరణానంతరం దేహాన్ని వదలి దైవలోకంలో వెలుస్తాడు."

25. ఆ విధంగా బ్రాహ్మణుడు దైవ స్వరూపుడౌతాడని భగవానుడు ద్రోణునికి చెప్పాడు

26. బ్రాహ్మణుడు బంధితుడెలా అవుతాడో భగవానుడు ద్రోణునికి చెప్పాడు.

27. "ముందు చెప్పిన విధంగా పుట్టుక సౌశీల్యత కలిగి అదే విధంగా వివాహం చేసుకున్న బ్రాహ్మణుని విషయం తీసుకో?"

28. "వివాహం ద్వారా బిడ్డలు పుట్టగానే వారంటే వుండే ప్రేమాతిశయంతో గృహస్థుగా స్థిరపడిపోయి గృహాన్ని వదలిపెట్టకుండా వుండి పోవడం బంధితుడవడమే."

29. "పురాతన బ్రాహ్మణులకున్న బంధాలే తనకు బంధాలై వాటిని అధిగమించ లేక బ్రాహ్మణుడు బంధితుడౌతాడు."

30. "ఆ విధంగా బ్రాహ్మణుడు బంధితుడు"

31. బంధాలను తెంచుకున్న బ్రాహ్మడెవరో కూడా భగవానుడు చెప్పాడు.

32. "ముందు చెప్పిన విధంగా పుట్టుక, సౌశీల్యత కలిగివున్న బ్రాహ్మణుడు బోధన ద్వారా సంపాదించింది ఇతరుల కిస్తూ ధర్మంగానో అధర్మంగానో కొనడం వల్లనో, అమ్మడం వల్లనో, జలధార పోసి బ్రాహ్మణిని సంపాదించి భార్యను స్వీకరిస్తాడనుకొందాం.

33. "అటు వంటి బ్రాహ్మణుడు బ్రాహ్మణి వదకో సంపన్నుని కుమారె వదకో, తక్కువ

వాని కుమార్తె వద్దకో, మేదరి కుమార్తె వద్దకో, వడ్రంగి కుమార్తె వద్దకో, అడవి జాతి వాని కుమార్తె వద్దకో, బిడ్డ తల్లి వద్దకో, పాలిస్తున్న స్త్రీ వద్దకో, రుతుకాలంలో వున్న స్త్రీ వద్దకో కామవాంఛలు తీర్చుకోవడానికి వెళతాడు. అతనికి బ్రాహ్మణి కామవాంఛలు తీర్చుకొనేందుకూ, బిడ్డలను కనేందుకు మాత్రమే పనికి వస్తుంది.

34. "అటువంటి బ్రాహ్మణుడు సనాతన బ్రాహ్మణుల ఆచారాలకు కట్టుబడి వుండక బంధనాలను ఛేదించుకొని విముక్తుడౌతాడు"

35. ఆ విధంగా బ్రాహ్మణుడు బంధవిముక్తుడౌతాడని భగవానుడు ద్రోణునికి చెప్పాడు.

36. కుల బహిష్కరణకు గురియైన బ్రాహ్మణుడంటే ఎవరో కూడా భగవానుడు చెప్పాడు.

37. "ముందు చెప్పిన విధంగా జన్మించి, నలభై ఎనిమిది సంవత్సరాలు బ్రహ్మ చర్యం పాటించి, మంత్రబద్ధమైన చదువు పూర్తి చేసి, బోధన చేసినందుకు దక్షిణ స్వీకరిస్తూ, ధర్మంగానో అధర్మంగానో జీవనోపాధి సంపాదిస్తూ నాగలిదున్నేవానిగానో, వ్యాపారస్తునిగానో, పశువుల కాపరిగానో, విలుకాని గానో రాజు బంటుగానో, ఏదో ఒక విద్యతోనో భిక్ష పాత్రను ఏవగించుకోక భిక్ష సంపాదించుకుంటూ జీవించే బ్రాహ్మణుడు ఉన్నాడనుకుందాం.

38. బోధన ద్వారా సంపాదించిన దక్షిణను ఇతరుల కిచ్చి వేయడం ద్వారానో, అమ్మడం ద్వారానో జలధారపోసి బ్రాహ్మణిని పొందడం ద్వారానో అటువంటి వాడు రమించడానికి బ్రాహ్మణి అయినా, ఏ స్త్రీ అయినా బిడ్డ తల్లయినా, పాలిచ్చే స్త్రీ అయినా తన వాంఛలు తీర్చేవారుగా గాని, తన వల్ల బిడ్డల్ని కనే స్త్రీగా గానీ భావించి తదనుగుణంగానే జీవిస్తారు.

39. "అటువంటి బ్రాహ్మణుని గూర్చి బ్రాహ్మణులు - "గౌరవనీయుడైన బ్రాహ్మణుడు అట్లాంటి జీవితాన్ని గడుపుతున్నాడేమిటి?" అనుకుంటారు.

40. "దానికి అతడు ఇలా జవాబిస్తాడు. నిప్పు శుభ్రమైన వాటినీ అపరిశుభ్రమైన వాటిని దహించినప్పటికీ ఏ విధంగా దానికి మలిన మంటదో అలాగే బ్రాహ్మణుడిన్ని పనులు చేసినా భ్రష్టుడు కాడా - అని."

41. "అన్ని పనులూ చేస్తూ జీవనాన్ని గడుపుతున్న బ్రాహ్మణుని కుల భ్రష్టుడయ్యాడంటారు".

42. ఆ విధంగా బ్రాహ్మణుడు కులభ్రష్టత్వం పొందుతాడని భగవానుడు ద్రోణుడికి వివరించాడు.

43. బ్రాహ్మణ ఋషులూ, మంత్రాలను తయారుచేసిన వారూ, మంత్రాల నుచ్చరించే వారూ బ్రాహ్మణులను బ్రహ్మస్వరూపులనీ, దైవస్వరూపులనీ, బంధితులనీ, బంధ విముక్తులనీ, బ్రాహ్మణ భ్రష్టులనీ ఐదు విధాలుగా విభజించారు.

44. ఆ ఐదింటిలో దేనికి చెందిన వాడివో చెప్పవలసిందిగా భగవానుడు ద్రోణున్నడిగాడు.

45. ద్రోణుడు తాము కనీసం బ్రాహ్మణ భ్రష్టుల కోవకు కూడా చెందమని చెప్పాడు.

46. బ్రాహ్మణుడంటే ఇంత అద్భుతమైన వివరణతో చెప్పిన గౌతమునితో ద్రోణుడు "నన్ను మీ సాధారణ బౌద్ధునిగా స్వీకరించండి" నా జీవితాంతం మీ శరణు గోరుతూ శిష్యరికం

# మూడవ భాగం

# బౌద్ధధర్మ విమర్శకులు

1. సంఘంలో అందర్నీ చేర్చుకోవడం పై విమర్శ
2. దీక్షా ప్రమాణాలపై విమర్శ
3. అహింసా సిద్ధాంతం పై విమర్శ
4. సౌశీల్యత బోధిస్తూ అంధకారాన్ని విస్తరింపజేస్తున్నాడనే ఆరోప
5. ఆత్మ - పునర్జన్మ సిద్ధాంతం పై విమర్శకులు
6. బుద్ధుడు.

# 1. సంఘంలో అందర్నీ చేర్చుకోవడం పై విమర్శ

1. బుద్ధుని అనుయాయులైన సామాన్య బౌద్ధులను, బౌద్ధ సంఘం అభీష్టం ప్రకారం సంఘ సభ్యులుగా చేర్చుకొనేవారు.

2. అందరికీ ప్రవేశార్హతకల్పించి దేవాలయం వలె ఎవ్వరైనా సభ్యులుగావడానికి వీలుగా సంఘాన్ని తయారు చేసినందుకు కొందరు భగవానుడిని విమర్శించారు.

3. తేలికగా సంఘంలో సభ్యులైన వారు కొన్నాళ్ళకు సంఘాన్ని వదలి సభ్యులుగాక ముందున్న స్థితికి దిగజారిపోవచ్చు. అప్పుడు గౌతముని ధర్మ సిద్ధాంతాలు నిష్ప్రయోజనం గాబట్టి సభ్యులైన వారు ఆ సిద్ధాంతాలను వదలి వేశారని ప్రజలంటారని కొందరు విమర్శించారు.

4. భగవానుడు ఈ పద్ధతి ఏ కారణంగా ప్రవేశ పెట్టాడనేది గ్రహించలేనివారు చేసిన ఈ విమర్శ సరియైన ఆధారాలు లేక పోవడం వల్ల నిలబడజాలదు.

5. దీనికి భగవానుడు సమాధానమిస్తూ బౌద్ధ ధర్మం స్థాపించడంలో తన ఉద్దేశ్యం స్వచ్ఛమైన నీటితో నింపిన సరోవరం నిర్మించటమేనని దానిలో అందరూ స్నానం చేసి ధర్మాన్ని పొందాలని తన కోరిక అని చెప్పారు.

6. పాపకార్యాలు చేసి మలినమైన వారు ధర్మసరోవరంలో స్నానం చేసి పునీతులు గావచ్చున్నది భగవానుని భావన.

7. ఎవరైనా ధర్మ సరోవరం వద్ద వెళ్ళి స్నానం చేయకుండా పాపాలనే మలినంతో తిరిగి వస్తే దానికి అతనిని నిందించాలి గాని ధర్మాన్ని నిందించకూడదు.

8. పాపాలు చేయడం వల్ల అంటిన మలినాన్ని వదిలించుకోవడానికి ఏర్పరచిన ధర్మసరోవరం నిర్మించిన తర్వాత మైలపడిన వారెవ్వరూ అందులో స్నానం చేయరాదనీ, ఎలాంటి మురికీ, మైలలేనివారే అందులో స్నానంచేయాలని చెప్పడం భావ్యం కాదని భగవానుని భావన.

9. ఆ విధంగా నియమాలు విధిస్తే బౌద్ధ ధర్మం ఏమి మేలు చేకూర్చగలదని భగవానుడు ప్రశ్నించాడు.

10. భగవానుడు బౌద్ధ ధర్మాన్ని ఏ కొద్దిమంది కోసం గాక అందరికీ అందుబాటులో ప్రయోజనకరంగా వుండాలని ఆశించాడనేది విమర్శకులు గ్రహించలేదు.

# 2. దీక్షా ప్రమాణాలపై విమర్శకులు

1. పంచశీల సూత్రాలుండగా, ప్రమాణాల అవసరమేమిటనేది తరచుగా వస్తున్న విమర్శ.

2. ఏ ఔషధం లేకుండా జబ్బు నయమవుతున్నప్పుడు విరేచన కారుల వంటి ఇతర మందుల ద్వారా దేహాన్ని బలహీన పరచవలసిన అవసరం ఏముందని విమర్శకులంటారు.

3. సాధారణ బౌద్ధులు గృహస్థులుగా వుంటూ, సంసార సుఖాలననుభవిస్తూ శాంతినీ, అత్యున్నతమైన నిర్వాణాన్నీ, ఆనందాన్నీ పొందగలిగినప్పుడు భిక్షువులు వాటిని పొందడానికి కఠోర ప్రమాణాలను ఆచరించవలసినన అవసరమేమిటని అడిగారు విమర్శకులు.

4. ప్రమాణాలలో సద్గుణాలిమిడి వున్నాయి. కాబట్టే ప్రమాణాలను భగవానుడు రూపొందించాడు.

5. ప్రమాణాల కనుగుణంగా చేసే జీవనం వుత్కృష్టమైనదనీ పతనావస్థకు దిగజారకుండా కాపాడుతుందనీ భగవానుని భావన.

6. ప్రమాణాలను స్వీకరించి వాటిని స్వయం శక్తిగల వాటినిగా భావించి ఆదరించిన వారు విముక్తులౌతారన్నది భగవానుడి ఉవాచ.

7. ప్రమాణాల నాచరించటమంటే కామం, అసూయ, గర్వం, దురాలోచన త్రుంచి వేయడం.

8. ప్రమాణాలను స్వీకరించి ఆదరించేవారు ఎల్లప్పుడూ జాగ్రదావస్థలో వుంటూ మనస్సును, ప్రవర్తనను నిర్మలంగా ఉంచుకోగలుగుతారు.

9. కేవలం పంచశీల సూత్రాల నాచరించిన మాత్రాన ఇవి సాధ్యం కాదు.

10. ప్రమాణాలలో నైతికపతనం బారిన పడకుండా వుండడానికున్న రక్షణ పంచశీల సూత్రాలలో లేదు.

11. ప్రమాణాలను పాటించి జీవించడం కష్టతరమైన పని. పంచశీల సూత్రాలను పాటించడం అంత కష్టమైన పని గాదు. ప్రమాణాలను పాటించి జీవించేవారు మానవాళికవసరం కాబట్టి భగవానుడు పంచశీల సూత్రాలను, ప్రమాణాలను రెండింటినీ రూపొందించాడు.

## 3. అహింసా సిద్ధాంతం పై విమర్శకులు

1. అహింసా సిద్ధాంతాన్ని అభ్యంతరకరమైందిగా భావించేవారు కొందరున్నారు. ఆ సిద్ధాంతం లొంగుబాటుతనానికి, చెడును ప్రతిఘటించక పోవడానికి దోహదం చేస్తుందంటారు.

2. ఇది భగవానుడు రూపొందించిన అహింసా సిద్ధాంతానికి వక్ర భాష్యం మాత్రమే.

3. అసంబద్ధతకూ అనుమానాలకూ తావు లేకుండా భగవానుడు చాలా సందర్భాలలో తన అహింసా సిద్ధాంతాన్ని విశదీకరించాడు.

4. సైనికుడు బౌద్ధ సంఘంలో చేరే విషయంలో భగవానుడు ఏర్పరచిన నిబంధన అటువంటి సందర్భాలలో మొదటిది.

5. ఒకసారి మగధ రాజ్య సరిహద్దున వున్న పరిగణాలలో అలజడి ఏర్పడింది. మగధరాజైన బింబిసారుడు తన సేనాపతిని, అధికారులను పంపి నేరస్తులను వెదికి, శిక్షించి, శాంతిని నెలకొల్పవలసిందిగా ఆదేశించాడు. సేనాపతి బింబిసారుని ఆదేశాల నమలుపరిచాడు.

6. సేనాపతి ఆదేశాలు వినగానే అధికారులు సందిగ్ధావస్థలో పడ్డారు. యుద్ధం చేయడంలో ఆతురత కనబరచడం వల్ల కలిగేవి దుష్ఫలితాలేనని తథాగతుడు బోధించిన విషయం వారికి తెలుసు. కాని బింబిసారుని ఆదేశం నేరస్తులను బంధించి, చంపమని. ఇటువంటి సందర్భంలో ఏమి చెయ్యడమా అని వారు ఆలోచనలో పడ్డారు.

7. దీనికి తరుణోపాయం బిక్షుక సంఘంలో చేరడమేనని అధికారులు భావించారు.

8. ఆవిధంగా సైన్యంలోని అధికారులు భిక్షువుల వద్దకు పోయి ధర్మ దీక్ష నొసంగ వలసిందిగా కోరారు. భిక్షువులు పవజ్జ, ఉపసంపద అనే విధులను జరిపి వారిని భిక్షుక సంఘంలో జేర్చుకున్నారు. అంత వారు బింబిసారుని సైన్యం నుంచి అంతర్ధానమయ్యారు.

9. అధికారులేమయ్యారని సైనికులను సేనాపతి అడుగగా వారంతా భిక్షుక సంఘంలో చేరారని సైనికులు చెప్పారు.

10. "రాజుకు చెందిన సైన్యాన్ని భిక్షువులు వారి సంఘంలో ఏ విధంగా చేర్చుకుంటారు? అని ఆగ్రహంగా అన్నాడు సేనాధిపతి.

11. ఆ తర్వాత సేనాపతి బింబిసారునికి జరిగినదంతా తెలియజేశాడు. అంతట బింబిసారుడు, రాజ సైన్యానికి జెందిన వారిని భిక్షుక సంఘంలో చేర్చుకొన్న వాడు ఎటువంటి శిక్ష కర్హుడో తెలియజేయండి అని న్యాయాధికారులను కోరాడు.

12. "ఆ విధంగా ధర్మ దీక్షాకార్యాన్ని జరిపిన వాడితల తీయాలి. ధర్మదీక్షను పలికిన వాని నాలుకను కోసివేయాలి, దీక్షను తీసుకొన్న వారి పక్కటెముకలు సగానికి విరగ్గొట్టాలని" న్యాయాధికారులు చెప్పారు.

13. అంతట బింబిసారుడు భగవానుని వద్దకు పోయి ప్రణామంచేసి, జరిగిన విషయాన్ని చెప్పాడు.

14. "ధర్మ దీక్షకు కొంతమంది రాజులు వ్యతిరేకంగా వున్నారని తెలుసు, వ్యతిరేకత వున్న రాజులు ఏదో ఒక కారణంతో భిక్షువులను రోజూ అవస్థల పాలు జేయాలని చూస్తున్న విషయం కూడా తెలుసు. ఇప్పుడు భిక్షువులు సైనికుల్ని, భిక్షువులుగా మార్చివేస్తున్నారని తెలిసినప్పుడు ఆ రాజులు భిక్షువులనెన్ని ఇక్కట్ల పాలు చేస్తారో ఊహించటం కష్టం, ఈ విపత్కర పరిస్థితులలో భగవానుడే తరుణోపాయం చూపాలి." అని బింబిసారుడు భగవానుని కోరాడు.

15. "సైనికులు అహింసా సిద్ధాంతాల మిషతో, అహింస పేరుతో, దేశం పట్ల రాజు పట్ల తమ బాధ్యతలను విస్మరించడం నా అభిమతం కాదు." అని భగవానుడు చెప్పాడు.

16. దానికనుగుణంగా సైనికులను భిక్షుక సంఘంలో చేర్చుకోవడానికి అవకాశంలేకుండా

నిబంధననేర్పరుస్తూ భగవానుడు భిక్షుకులతో రాజసైన్యం లోని వారెవరికీ పరజ్ఞ కార్యక్రమం జరపవద్దనీ అది జరిపిన వారు దుఃఖితనేరం చేసినవారౌతారని ప్రకటించాడు.

17. మరొకసారి సర్వసేనాధిపతీ, మహావీరుని అనుయాయుడు అయిన సింహుడనే వాడు భగవానునితో అహింసా సిద్ధాంతం పై సంవాదం జరిపాడు.

18. "భగవానుని సిద్ధాంతానికి సంబంధించి నాకు ఒక సందేహం వుంది. దానిని విశదీకరించి సందేహ నివృత్తి చేయవలసింది" అని సింహుడు భగవానుని కోరాడు.

19. తథాగతుడు అనుమతించగానే అతనిలా అన్నాడు నేనొక సైనికుడిని. రాజు తన చట్టాల నమలు పరచడానికీ, తన తరపున యుద్ధాలను జేయడానికి నన్ను నియమించాడు. అనంతమైన దయనూ కరుణను బోధించే తథాగతుడు నేరగాడ్ని శిక్షించడానికి తన కనుమతినిస్తాడా? ఇండ్లను, భార్యల్నీ బిడ్డల్నీ ఆస్తినీ కాపాడు కోవడానికి యుద్ధం చేయడం తప్పు అవుతుందా? దుష్టునికి లొంగి అతని అభీష్టం ప్రకారం చేసిన వాటిని బాధతో అనుభవిస్తూ హింస ద్వారా మనదైన దాన్ని కూడా మనల్ని భయపెట్టి తీసుకు పోయేవాడికి లొంగి పొమ్మంటారా? మంచి కారణం కోసం చేసే యుద్ధాలతో సహా అన్ని తగాదాలు నిషేధించ వలసిందేనా? అని సింహుడు భగవానునడిగాడు.

20. దానికి తథాగతుడీవిధంగా సమాధానమిచ్చాడు "శిక్షార్హులైన వానిని శిక్షించవలసిందే. ఆదరణ కర్హుడైన వానిని ఆదరించవలసిందే. అయినప్పటికీ ఏ ప్రాణికీ హింస తల పెట్టకుండా ప్రేమానురాగాలు చూపాలి ఈ రెండు పరస్పర విరుద్ధాలు కావు. నేరం చేసిన వాడు తాను జేసిన నేరానికి శిక్ష పొందుతున్నాడు గాని న్యాయమూర్తికి అతని పట్ల వున్న దురుద్దేశంతో గాదు. తాను జేసిన తప్పులు తనకు శిక్ష వేసేలా దండనాధికారిని చేశాయి. న్యాయాధికారికి నేరస్తుని పట్ల ద్వేషం పనికి రాదు. హంతకుడు తాను చేసిన నేరానికి ఫలితంగా మరణ శిక్షను పొందానని భావించాలి. తన నేరానికి తనకు విధించిన మరణ శిక్ష తన ఆత్మను పునీతం జేస్తుందని గ్రహించి హంతకుడు పరితాపం జెందక సంతోషం పొందుతాడు.

21. ఈ ఉదాహరణలను సరిగా అర్థం చేసుకొంటే భగవానుడు బోధించిన అహింసా సిద్ధాంతం మౌలికమైందనీ యుక్తా యుక్త వివేచనతో ఆదరించదగినదనీ తెలుస్తుంది.

22. చెడును మంచితో జయించమని భగవానుడు చెప్పాడే గాని చెడును ప్రోత్సహించి మంచిపై ఆధిక్యం సంపాదించడానికి అనుమతించమని ఎన్నడూ బుద్ధుడు బోధించలేదు.

23. భగవానుడు అహింస కోసం నిలబడ్డాడు. హింసను ఖండించాడు, అయినప్పటికీ చెడు మూలంగా మంచి నాశనం కాకుండా రక్షించాల్సిన సమయం వచ్చినప్పుడు హింసే చివరి ఆయుధంగా భావించడాన్ని తానెప్పుడూ కాదనలేదు.

24. భగవానుడు ప్రమాదకరమైన సిద్ధాంతాన్నెప్పుడూ బోధించలేదు, అహింసావాదంలోని ప్రాముఖ్యాన్ని, దాని పరిధినీ విమర్శకులు అర్థం చేసుకోలేదు.

# 4. సౌశీల్యత బోధిస్తూ అంధకారాన్ని విస్తరింపజేస్తున్నాడనే ఆరోపణ

(i)

## 1. దుఃఖమే అంధకారానికి మూలం

1. దుఃఖానికి కపిలుడు చెప్పిన అసలైన అర్థం అశాంతి, అలజడి.
2. మొదట్లో దానికి ఆ విధంగా తాత్వికార్థం వుండేది.
3. తరువాత బాధ, విచారం అనే అర్థాన్ని సంతరించుకుంది.
4. ఆ రెండు అర్థాలూ పెద్ద భేదమున్నవి గావు. ఒకదానికొకటి సన్నిహితమైనవే.
5. అశాంతి విచారాన్నీ, బాధనూ కలుగజేస్తుంది.
6. సాంఘిక ఆర్థిక కారణాల వల్ల కలిగే విచారం, బాధ, దుఃఖ కారణమే గాబట్టి దుఃఖం, విచారం, బాధ అనే అర్థాలను అచిరకాలంలోనే పొందింది.
7. బుద్ధుడు విచారం, బాధ అనే పదాలను ఏ అర్థంలో వాడడం జరిగింది.?
8. బీదరికం దుఃఖానికి కారణమని బుద్ధుని ప్రబోధ పాఠాలలో లిఖితరూపంలో విశదంగా కనపడ్తుంది.
9. ఆ ప్రబోధ పాఠంలో ప్రాపంచిక విషయ లోలునికి బీదరికం దుఃఖభాజకమేనా అని భిక్షువులను భగవానుడడిగినట్లుగా వుంది.
10. దానికి భిక్షువులు బీదరికం దుఃఖభాజకమేనన్నారు.
11. "బీదరికం, అవసరాలు, ఇబ్బందుల వల్ల మానవుడు అప్పులపాలైతే అది కూడా విచారకరమైందేనా అని భగవానుడడిగాడు.
12. "విచారకరమైందే" నని భిక్షువులన్నారు.
13. "అప్పులపాలైన వాడు అప్పులు తీర్చడానికి అప్పులు చేస్తే అది కూడా భాదాకరమయిందేనా? అని భగవానుడడిగాడు.
14. దీనికి కూడా అవునని సమాధానమిచ్చారు భిక్షువులు.
15. "అప్పులు తీర్చలేని స్థితిలో అప్పు లిచ్చిన వారు అతనిని అప్పులు తీర్చమని బలవంతం చేయడం కూడా బాధాకరమేనా?"

17. "అప్పుల వాళ్ళు బలవంతం చేసినా అప్పులు తీర్చలేకపోవడం కూడా బాధాకరమేనా"

18. తప్పనిసరిగా బాధాకరమేనన్నారు.

19. "అప్పులు తీర్చలేక సతమతమవుతున్నప్పుడు అప్పులవాళ్ళతనిని బంధిస్తే కూడా బాధాకరమేనా?"

20. తప్పకుండా బాధాకరమే నన్నారు.

21. ప్రాపంచిక స్థితిగతుల మూలంగానే బీదరికం, అప్పులు, అరువు తేవటం, వత్తిళ్ళకు గురి కావడం బంధనాలకు గురికావడం వంటి బాధలేర్పడుతున్నాయని భగవానుడు భిక్షువులతో చెప్పాడు.

22. ప్రపంచంలో బీదరికం, అప్పులు, బాధాకరమైనవి.

23. బుద్ధుని భావనలో దుఃఖానికి కారణాలు ప్రాపంచిక విషయాలన్నది విదితమౌతుంది.

## (ii) అశాశ్వతత్వం అంధకారానికి హేతువు

1. మిశ్రమమైనది ఏదీ శాశ్వతం కాదన్న సిద్ధాంతం ఈ ఆరోపణకు మరో కారణం.

2. అయితే ఈ సిద్ధాంతంలోని నిజాన్ని ఎవరూ ప్రశ్నించరు.

3. ప్రతీదీ అశాశ్వతమని అందరూ అంగీకరిస్తారు.

4. సిద్ధాంతం వాస్తవమైనప్పుడు అది ఆనంద దాయకం కాకపోయినా వెల్లడించక తప్పద

5. అయితే ఆ సిద్ధాంత సారాంశం నిరాశావాదమేనని తేల్చడం ఎందుకు?

6. జీవితం కొద్ది కాలానికే పరిమితమయినదని తెలిసినప్పుడు దానిని గురించి విచారం దేనికి

7. అది వాస్తవమైన విషయానికి వ్యాఖ్యానం మాత్రమే.

8. జీవిత కాల పరిమితి కొద్దిదనే విషయాన్ని బర్మా బౌద్ధులు వేరే విధంగా వ్యాఖ్యానిస్తా

9. బర్మా బౌద్ధులు కుటుంబంలోని మరణాన్ని సంతోషకరమైన సంఘటనగా భావి ఉత్సవం జరుపుకుంటారు.

10. వారు కుటుంబంలో ఎవరైనామరణించినరోజున అందరికీ విందుచేసి శవాన్ని స్మశానా నృత్యంతో తరలిస్తారు. మృత్యువు అనేది ఎవరికీ తప్పదనేది వాస్తవం కాబట్టి దా గురించి ఎవరూ బాధపడరు.

11. శాశ్వతత్వం అనేది అసత్యమైనప్పటికీ అదే సత్యమని నమ్మడం వల్ల అశాశ్వతత్వ

12. అందుచేత బుద్ధుని బోధనలలో చెప్పిన అశాశ్వతత్వ సిద్ధాంతం అంధకారాన్ని వ్యాపింపజేస్తున్నదని అరోపణ జేయడానికి వీలు లేదు.

## (iii) బౌద్ధ మతం నిరాశావాదమా?

1. బౌద్ధ ధర్మం నిరాశావాదాన్ని సృష్టిస్తున్నదని అరోపణ వుంది.
2. ప్రపంచంలో దుఃఖం (విచారం - దైన్యం) ఉన్నదనే ఆర్యుల మొదటి సత్యం నుండి ఉదయించిందీ ఆరోపణ.
3. దుఃఖాన్ని గురించిచెప్పినంత మాత్రాన్నే ఈ ఆరోపణ రావడం ఆశ్చర్యంగా కనబడుతుంది.
4. ప్రపంచంలో దోపిడీ ఉన్నదనీ, ధనవంతుల్ని మరింత ధనవంతులు గానూ బీదవార్ని మరింత పేదవారిగాను చేస్తున్నదీ దోపిడీ అని కారల్ మార్క్స్ కూడా చెప్పాడు.
5. ఐతే ఎవరూ కారల్ మార్క్స్ సింద్ధాంతం నిరాశావాదం అని అనలేదు.
6. అటువంటప్పుడు బౌద్ధ సిద్ధాంతం పైనే ఈ వివక్ష ఎందుకు?
7. బుద్ధుడు తన మొదటి ప్రబోధంలో పుట్టుక, వృద్ధాప్యం, చావులను దుఃఖదాయకాలుగా చెప్పడం వల్ల బౌద్ధ ధర్మాన్ని నిరాశావాదంగా చిత్రీకరించడం జరిగి వుండవచ్చు.
8. వాస్తవాన్ని వక్రీకరించి చిన్న విషయాలను పెద్ద విషయాలుగా చిత్రీకరించడంలో సిద్ధహస్తులైన వారు ఈ రకమైన ప్రచారం చేసి వుంటారని ఈ రంగంలో నిష్ణాతులైనవారికి తెలుసు.
9. మానవునిగా పుట్టడం మహోన్నతమైనదని బుద్ధుడు మరో ప్రబోధంలో చెప్పడాన్ని బట్టి పుట్టుక దుఃఖహేతువనే బుద్ధుని మొదటి ప్రబోధాన్ని అవసరమైన దానికంటే ఎక్కువ ప్రచారం చేశారనుకోవాల్సివస్తుంది.
10. ప్రపంచంలో దుఃఖం మాత్రమే ఉన్నదని చెప్పి ఉంటే ఆయన బోధనలు నిరాశా వాదాలనడానికి వీలుండేది.
11. ఆర్య సత్యాలలో రెండవ దానిలో బుద్ధుడు ప్రపంచంలో దుఃఖాన్ని తొలగించాలన్నాడు. దుఃఖాన్ని తొలగించే బాధ్యతను నొక్కి చెప్పడానికే ప్రపంచంలో దుఃఖమున్నదన్నాడు.
12. దుఃఖాన్ని తొలగించడానికే బుద్ధుడు ప్రాముఖ్యమిచ్చాడు. కపిలుడు ప్రపంచంలో దుః ఖముందని మాత్రమే చెప్పి దుఃఖాన్ని గురించి మరే విషయం చెప్పక పోవడం వల్లనే బుద్ధుడు కపిల సిద్ధాంతంతో తృప్తి చెందక అలర కాలమునే ఆశ్రయాన్ని వదలి వెళ్లాడు.
13. అటువంటప్పుడు బౌద్ధ ధర్మాన్ని నిరాశావాదమని ఎలా అనగలం?
14. ప్రపంచం నుంచి దుఃఖాన్ని తొలగించడానికి ఆదుర్దా పడే బోధకుడ్ని నిరాశావాది అని

## 5. ఆత్మ పునర్జన్మ సిద్ధాంతంపై విమర్శకులు

1. ఆత్మ అనేది లేదనీ పునర్జన్మ వున్నదనీ భగవానుడు ప్రబోధించాడు.
2. ఈ రెండు పరస్పర విరుద్ధ ప్రబోధాలని విమర్శించిన వారూ లేకపోలేదు.
3. ఆత్మ లేకుండా పునర్జన్మ ఏ విధంగా వుందనేది వీరి వాదన.
4. ఈ ప్రబోధాలలో పరస్పర విరుద్ధ భావాలేమీ లేవు. అత్మ లేకపోయినా పునర్జన్మ సాధ్యమే.
5. మామిడిటెంక మామిడిచెట్టుకు జన్మనిస్తుంది. మామిడిచెట్టు కాయలు కాస్తుంది.
6. ఇక్కడ మామిడిచెట్టుకు పునర్జన్మ వుంది.
7. కాని దానికి ఆత్మ లేదు.
8. కాబట్టి ఆత్మ లేకున్నా పునర్జన్మ సాధ్యమే.

## 6. బుద్ధుడు అశ్వరవాదనే నింద

1. ఒకప్పుడు బుద్ధుడు శ్రావస్తిలోని జిత వనంలో వుండగా అరిత్రుడనే భిక్షువు భగవానుని ప్రబోధనలపై కొన్ని అభిప్రాయాలనేర్పరచుకొని తన అభిప్రాయాలను భగవానుని అభిప్రాయాలుగా ప్రచారం చేస్తున్నాడని బుద్ధుని దృష్టికి వచ్చింది.
2. అరిత్రుడా విధంగా ప్రచారం చేస్తున్న సిద్ధాంతాలలో బుద్ధుడు అశ్వరవాది అన్నది ఒకటి.
3. భగవానుడు అరిత్రుని పిలిపించి అతడు ప్రచారం చేస్తున్న సిద్ధాంతాన్ని గురించి ప్రశ్నించగా అతడు ఏమీ చెప్పలేక మౌనంగా వుండిపోయాడు.
4. అప్పుడు భగవానుడు అరిత్రునితో కొందరు బ్రాహ్మణులు, సన్యాసులు దురుద్దేశ్యంతో దుర్బుద్ధితో సత్యదూరంగా తనను అశ్వరవాదిగా ప్రచారం చేస్తున్నారని" చెప్పాడు.
5. ఆ విధంగా తానెప్పుడూ భావించలేదనీ, చెప్పలేదనీ భగవానుడు చెప్పాడు.
6. చెడు ఆవరించియున్నదనీ, దానిని తొలగించాలనీ మాత్రమే తానింతకు ముందూ ఇప్పుడూ చెప్తున్నానని భగవానుడన్నాడు.

10. భగవానుడు వస్త్రధారియై భిక్షుకుల సహితంగా చుందుని ఇంటికి వెళ్ళి విందులో పాల్గొన్నారు.

11. భోజనానంతరం బుద్ధుడు చుందునికి మరొక పర్యాయం ధమ్మ సందేశం అందించారు. తరువాత ఆసనం నుంచి లేచి నిష్క్రమించారు.

12. చుందుడు వడ్డించిన ఆహారం భగవానుడికి పడలేదు. ఆయన తీవ్రంగా అస్వస్థులయ్యారు. విరేచనాలు, తీవ్రమైన నొప్పి. ఈ జబ్బే ఆయన మరణానికి కూడా దారితీసింది.

13. కానీ, బుద్ధభగవానుడు అంత బాధనూ పల్లెత్తుమాట అనకుండా భరించారు.

14. మామిడి తోటకు తిరిగి వచ్చి విశ్రాంతి తీసుకున్న తరువాత భగవానుడు ఆనందునితో "కుశినారకు వెడదాం పద" అని అన్నారు. భిక్షుగణం కదిలింది.

## 3. కుశినారకు రాక

1. తథాగతుడు కొంత దూరం దాకా నడిచారు. కాని శ్రాంతి కావాలనిపించింది.

2. దారిలో పక్కనున్న ఓ చెట్టు కిందికి వెళ్ళి ఆనందునితో ఇలా అన్నారు "ఆనందా, దయచేసి వస్త్రాన్ని పరుచు. నేను అలసి పోయి ఉన్నాను. నాకు విశ్రాంతి కావాలి."

3. "అలాగే దేవా!" అని ఆనందుడు వస్త్రాన్ని నాలుగు మడతలు మడిచి పరిచాడు.

4. భగవానుడు దానిపై ఆసీనుడయ్యారు.

5. ఆసీనులైన తరువాత ఆనందునితో - "ఆనందా, దాహంగా ఉంది, నాక్కొంచెం నీరు తెచ్చివ్వు" అని అర్థించారు.

6. "కకుత్థనది ఎంతో దూరం లేదు. ఆనది నీరు చల్లగా ఉంటుంది, స్వచ్ఛంగా ఉంటుంది. సులభంగా నది దగ్గరకు వెళ్ళవచ్చు. అక్కడ ఆహ్లాదంగా కూడా ఉంటుంది. భగవానుడు అక్కడికి వెడితే నీరు తాగనూ వచ్చు, కాళ్ళు చేతులు శుభ్రపరుచుకోనూ వచ్చు. పక్కన ఉన్న వాగులో నీరు మురికిగా వుంది" అని సమాధానమిచ్చాడు ఆనందుడు.

7. కాని, భగవానుడికి నది దాకా వెళ్ళే ఓపికలేదు. వాగు నీరే తాగాలనుకున్నారు.

8. ఆనందుడు ఆనీరు తెచ్చాడు. భగవానుడు తాగారు.

9. కొంత సేపు విశ్రమించిన తరువాత భగవానుడు భిక్షువులతో కలసి కకుత్థనది వద్దకు వెళ్ళారు. నీటిలోకి దిగి, స్నానం చేశారు, ఆనది నీరు తాగారు, ఆవలితీరం నుంచి వెలుపలికి నడిచి మామిడి వనంలోకి వెళ్ళారు.

10. వనంలోకి వెళ్ళిన తరువాత, తన వస్త్రాన్ని తిరిగి నేలపై పరచమనిఆనందుని అడిగారు. "నేను అలసిపోయి ఉన్నాను విశ్రమిస్తాను" అన్నారు. వస్త్రాన్ని పరచిన తరువాత

# 1. బ్రాహ్మణియైన ధనంజనని భక్తి

1. భగవానునికి చాలామంది హితులూ, అభిమానులూ వున్నారు. వారిలో ధనంజనని ఒకరు.

2. ఆమె ఒక భరద్వాజ బ్రాహ్మణుని భార్య. ఆమె భర్త భగవానుని ద్వేషించే వాడు. కాని ఆమె భగవానుని భక్తురాలు. ఆమె భక్తితత్పరత చెప్పుకోదగినది.

3. ఒకప్పుడు భగవానుడు రాజగ్రహలోని వెదురువనం వద్ద ఉడుతల మేపు స్థలంగా పేరున్న విహారం వద్ద ఉండడం తటస్థించింది.

4. అదే సమయంలో భరద్వాజ కుటుంబానికి చెందిన ఒక బ్రాహ్మణుని భార్య యైన ధనంజనని రాజగ్రహలో నివసిస్తూ వుండేది.

5. ధనంజనని భర్త బుద్ధునికీ, ఆయన ధర్మాలకూ ఆయన సంఘానికీ బద్ధ వ్యతిరేకి కాగా ఆమెకు ఈ మూడింటిలో అపారమైన నమ్మకం ఉండేది. ఆమె ఎప్పుడూ త్రిశరణాలనుప్రశంసిస్తూ ఉండేది. త్రిశరణాలను ప్రశంసించినప్పుడల్లా ఆమె భర్త చెవులు మూసుకుంటూ ఉండేవాడు.

6. సాటి బ్రాహ్మణులకు ఒక గొప్ప విందు చేయాలని సంకల్పించి ఆ బ్రాహ్మణుడు తన భార్యతో అతిధుల ముందు త్రిశరణాల ప్రశంస చేసి వారిని నొప్పించకుండా ఉన్నట్లయితే ఆమె తాత్విక ధోరణికి అవరోధం కల్పించనన్నాడు.

7. అందుకామె ఎటువంటి అంగీకారమూ తెలుపకపోవడంతో భర్త ఆమెను తన కత్తితో అరటిపండును ముక్కలు ముక్కలుగా కోసినట్లు కోస్తానని బెదిరించాడు. ఆమె బాధలు భరించడానికి సిద్దమై తన వాక్స్వాతంత్ర్యాన్ని నిలబెట్టుకుంటూ భగవానుని ధర్మాన్ని ప్రశంసిస్తూ ఐదువందల గీతాల్ని ఆలపించింది. దానికి ఆమె భర్త నిరుత్తరుడై ఊరకుండిపోయాడు.

8. భోజనపు గిన్నెలు, బంగారపు గరిటెలు అతిథుల కోసం సిద్ధంచేశారు. అతిధులు భోజనాలకు కూర్చున్నారు. అతిథులకు వడ్డిస్తూ ఉండగా ఆమె ఉప్పొంగిన హృదయోద్వేగంతో వెదురువనంవైపు తిరిగి త్రిశరణ ప్రశంస చేయసాగింది.

9. దానిని అవమానంగా భావించిన అతిథులు తాము తిన్న ఆహారం ధనంజనని త్రిశరణ ప్రశంస వల్ల అపవిత్రమయిందని భావించి ఆహారాన్ని వదిలి అక్కడి నుండి వెళ్ళిపోయారు. దానికామె భర్త ఆమెను ఎంతగానో నిందించాడు.

10. తన భర్తకు భోజనం వడ్డిస్తూ అతని ముందుకొచ్చి ధనంజనని అరిహంతుడు, సర్వోన్నతుడైన బుద్ధునికి శుభం కలగాలని, అతని ధర్మ విధానం వర్ధిల్లాలని, అతని

11. ఆమె ఆ విధంగా అన్నందుకు భర్తకు కోపం వచ్చి "చెడిపోయినదానా! ప్రతి సారి ఆ బోడి సన్యాసిని పొగడ్తావా? అంటూ తానే ఆ బుద్ధునికి చీవాట్లు వేస్తానని అన్నాడు.

12. దానికామె"ప్రపంచంలోని ఏ దేవుళ్ళూ, రాకుమారులూ, బ్రాహ్మణులూ, సన్యాసులూ, మానవులూ, మానవేతరులూ అరిహంతుడు, సర్వోన్నతుడు అయిన బుద్ధుని మందలించ లేరు. అయినా మీరు వెళ్ళండి మీకే తెలిసి వస్తుంది" అని భర్తతో చెప్పింది.

13. విసిగి వేసారిన ఆ బ్రాహ్మణుడు భగవానుని వద్దకు పోయి ఆనవాయితీ ప్రకారం అభివాదం చేసి స్నేహభావాన్ని ప్రదర్శిస్తూ ఆయన ప్రక్కన కూర్చున్నాడు.

14. ప్రక్కన కూర్చొని బ్రాహ్మణుడు భగవానునితో "సంతోషంగా బ్రతకాలంటే దేనిని వదులు కోవాలి? ఏ మాత్రం విలపించకుండా ఉండాలంటే దేనిని విడనాడాలి? వదులు కోవలసిన వాటిలో అతి ముఖ్యమయిందేది" అని అడిగాడు.

15. ఆ ప్రశ్నకు భగవానుడు సమాధానమిస్తూ "కోపాన్ని విడనాడితే సంతోషంగా, ఏ మాత్రం విలపించకుండా జీవించవచ్చు. కోపం విషగ్రస్తమై జ్వర తీవ్రతకు కారణమై, మృత్యుప్రాయమైంది. కోపాన్ని చంపివేయడాన్నే ఆర్యులు ప్రశంసించారు. నీవు కూడా కోపాన్ని చంపుకొని విలపించనవసరం లేని జీవనాన్ని గడుపు" అని బ్రాహ్మణుణ్ణి కోరాడు.

16. ఆ భగవానుని ప్రబోధంలోని గొప్పతనాన్ని గుర్తించిన బ్రాహ్మణుడు ఇలా అన్నారు. "అద్భుతం భగవానుడా అద్భుతం! పడిపోయిన వానిని యధాస్థానంలో నిలబెట్టినట్లూ, దాచబడిన దానిని వెలికి తీసి వివరించినట్లూ, దారి తప్పిన వాడిని సన్మార్గంలోనికి మళ్ళించినట్లూ, అంధకారంలో ఉన్న వానికి వెలుగు జూపి కళ్ళున్న వారికి బాహ్య ప్రపంచాన్ని చూపినట్లు మీరు అన్ని విధాలా ధర్మ సిద్ధాంతాన్ని ఎరుక పరచారు. నేను ఇక మీ ధర్మాన్ని మీ సంఘాన్ని శరణు కోరుతున్నాను. మీధర్మానుసరణతోనే ఈ లోకాన్ని విడుస్తాను. మీ ఆజ్ఞలనే శిరసావహిస్తాను".

17. ఆ విధంగా ధనంజనని తాను బుద్ధుని భక్తురాలు కావడమే కాకుండా భర్తను కూడా బుద్ధుని భక్తునిగా చేసింది.

## 2. విశాఖ అచంచల విశ్వాసం

1. విశాఖ అంగదేశంలోని భాడియా అనే పట్టణంలో జన్మించింది.

2. ఆమె తండ్రి ధనంజయుడు, తల్లి సుమన.

3. ఒకసారి బుద్ధుడు భిక్షుక సమూహంతో బ్రాహ్మణుడైన సేలుని ఆహ్వానంపై భాడియా వెళ్ళాడు. విశాఖకుఅప్పుడు ఏడేళ్ళు.

4. ఏడేళ్ళ వయస్సు మాత్రమేవున్న విశాఖ తన తాతయైన మెండకునితో బుద్ధుని

ఒప్పుకుని విశాఖకు ఐదువందల మందినితోడిచ్చి ఐదువందల మంది పని వాళ్ళనూ, ఐదు వందల రథాలనూ ఆమెతో పంపాడు.

5. బుద్ధునికి కొంత దూరంలో రథాల నాపి బుద్ధుని వద్దకు విశాఖ నడచుకుంటూ వెళ్ళింది.

6. భగవానుడామెకు బౌద్ధ ధర్మ ప్రబోధం చేయగానే ఆమె బౌద్ధధర్మ ఉపాసకి అయింది

7. అటు తర్వాత మెండకుడు ప్రతిరోజూ ఆ భగవానునీ, భిక్షువులనూ తన యింటి కాహ్వానించి పదిహేను రోజులపాటు భోజనాలు పెట్టాడు.

8. ప్రసేనుని కోరికపై బింబిసారుడు ధనంజయుని కోసలకు పంపగా తన తల్లి దండ్రులతో పాటు విశాఖ సాకేతపురంలో ఉండసాగింది.

9. శ్రావస్తిలో సంపన్నుడైన మిగరుడనే వాడు తన కుమారుడైన పూర్ణవర్ధనునికి వివాహం జేయదలచి తగిన కన్యను వెదకడానికి కొంత మందిని పురమాయించాడు.

10. వారు శ్రావస్తి రావడం, విందు రోజున విశాఖ కొలనుకు స్నానానికి వెళ్తూ ఉండగా చూడటం తటస్థించింది.

11. ఆ సమయంలో పెద్ద వర్షపు జల్లు రావడం విశాఖ వెంటనున్న వారు తడవ కుండా ఉండడానికి పరుగెత్తడం, విశాఖ మాత్రం తన నడకలో మార్పులేకుండా కన్యాన్వేషణలో ఉన్న వారి దగ్గరికి నింపాదిగా రావడం జరిగింది.

12. వారామెను ఎందుకు చాటుకు పరుగెత్తి బట్టలు తడవకుండా చేసుకోలేదని అడుగగా తనకు చాలా బట్టలున్నాయనీ, తను పరుగెత్తి ఏదో ఒక అవయవానికి నష్టం కలుగచేసుకుంటే దాని స్థానంలో మరో అవయవం అమర్చడం వీలు పడదనీ, కన్యలు అమ్మకానికి సిద్ధంగా ఉన్న సరుకుల లాంటి వారనీ, వారు అంగవికలులు కాకూడదనీ చెప్పింది.

13. ఆమె అందానికే ముగ్ధులైన వారు ఆమె తెలివి తేటలకు మరింత ముగ్ధులయ్యారు. వారామెకు పుష్పగుచ్ఛాన్నివ్వగా ఆమె దానిని పెండ్లి ప్రతిపాదనగా అంగీకరించి దానికి గుర్తుగా స్వీకరించింది.

14. విశాఖ తన యింటికి వెళ్ళగానే పెండ్లి పెద్దలు కూడా ఆమె ఇంటికి వెళ్ళి తాము పూర్ణవర్ధనునికి పెండ్లి కూతురు విషయమై వచ్చామని ధనంజయునితో చెప్పారు. ధనంజయుడు వారి ప్రతిపాదన నామోదించి వారితో తాంబూలాలు మార్చుకొన్నాడు.

15. ప్రసేనుడీ వార్త విని పూర్ణవర్ధనుని వివాహానికి బయలుదేరాడు. ధనంజయుడు ప్రసేనుని, ఆయన పరివారాన్ని స్వయంగా గౌరవపూర్వకంగా ఆహ్వానించి సకల మర్యాదలూ, సదుపాయాలూ కలుగచేసాడు.

16. పెండ్లికుమార్తెకు నగలు చేయించడానికి ఐదు వందలమంది కంసాలులను నియమించారు. ధనంజయుడు తన కుమార్తెకు కట్నంగా ఐదు వందల బండ్ల నిండా ధనాన్ని, ఐదు

వందల బంగారు పాత్రలు, పాడి పశువుల్ని ఇచ్చాడు.

17. విశాఖ తన అత్తవారింటికి వెళ్ళే సమయంలో ఆమె తండ్రి ధనంజయుడు ఆమెకు పది నియమాలను పాటించ వలసిందిగా చెప్తుండగా మిగరుడా నియమాలను ప్రక్క గది నుంచి విన్నాడు. ఆ పదినియమాలు: తన యింటిలోని నిప్పును బయటి వారికి ఇవ్వరాదు, బయటి నుంచి నిప్పు ఇంట్లోకి తీసుకు రాకూడదు, ఇవ్వదలిస్తే తిరిగి ఇవ్వ గలవారికే ఇవ్వాలి. తిరిగి ఇవ్వలేని వారికి ఇవ్వొద్దు. బదులివ్వగలిగితే బదులివ్వగల వారికే ఇవ్వాలి, బదులివ్వ లేని వారికి బదులివ్వ కూడదు, పద్ధతిగా కూర్చోవాలి, సంతోషంగా భోజనం చేయాలి, ఇంటిలోని నిప్పునారిపోకుండా చూడాలి, యింటి దైవాలనారాధించాలి.

18. మరుసటి రోజు తన కుమార్తె యోగ క్షేమాలు చూసేందుకు, ఒక వేళ ఆమె నడవడికలో ఏమైనా లోపాలుంటే విచారణ జరిపి తనకు తెలియజేయడానికి ధనంజయుడు 8 మంది గృహస్థులను నియమించాడు.

19. శ్రావస్తి యందలి ప్రజలందరూ తన కోడల్ని చూడాలని మిగరుడనుకొన్నాడు. శ్రావస్తిలోని ప్రజలందరూ రాజమార్గానికిరువైపులా గుంపులుగా నిలబడి చూస్తుండగా విశాఖ తనరథంలో నిలబడి శ్రావస్తికి వచ్చింది. శ్రావస్తి ప్రజలు ఆమెకు బహుమతులెన్నో ఇవ్వగా వాటన్నింటిని తిరిగి ప్రజలకే పంచింది విశాఖ.

20. నిగంతువుల అనుయాయుడైన మిగరుడు విశాఖ తన యింటికి రాగానే నిగంతువులను తన యింటి కాహ్వానించి విశాఖను వారికి శుశ్రూష చేయమన్నాడు. దిగంబరులైన నిగంతువులకు సపర్యలు చేయడానికి విశాఖ నిరాకరించింది.

21. అప్పుడు నిగంతువులు విశాఖను తన యింటి నుంచి పంపివేయాల్సిందిగా మిగరుడిని కోరారు. పంపి వేయడానికి మిగరుడు కొంత కాలయాపన చేశాడు.

22. ఒక రోజు మిగరుడు భోజనం చేస్తుండగా విశాఖ ఆయన ప్రక్కనే నిలబడి విసనకర్రతో విసర సాగింది. ఆ సమయంలో ఇంటి ముందు భిక్షువు నిలబడి ఉండడం చూసిన విశాఖ, మిగరుడికి భిక్షువు కనబడడానికి వీలుగా ప్రక్కకు తొలగింది. కాని భిక్షువును కన్నెత్తి చూడకుండా మిగరుడు భోజనం చేయసాగాడు.

23. ఇది గమనించిన విశాఖ భిక్షువుతో తన మామ తింటున్న ఆహారం పాసి పోయిన ఆహారమని చెప్పి భిక్షువును వెళ్ళమన్నది. దానికి మిగరుడాగ్రహించి ఆమెను ఇంటి నుంచి వెళ్ళగొడతానని బెదిరించాడు. కాని ఆమె తన ప్రవర్తనను గమనించమని తనతో తన తండ్రి పంపిన ఎనిమిది మంది దృష్టికి విషయాన్ని తేవలసిందిగా కోరింది.

24. ఆ ఎనిమిది మంది ఆమెపై మోపబడిన అభియోగాలన్నిటినీ విచారించి ఆమెను నిర్దోషిగా ప్రకటించారు.

25. విశాఖ తన పుట్టింటికి వెళ్ళిపోవడానికి సన్నాహాలు ప్రారంభించింది. జరిగిన దానికి

భిక్షువులను మిగరుడు తన ఇంటికాహ్వానించే షరతుపై వారి కోర్కె మన్నిస్తానని చెప్పింది.

26. విశాఖ కోరినట్లుగానే మిగరుడు బుద్ధుణ్ణీ, భిక్షువులనూ ఆహ్వానించాడు. తనపై నిగంతువుల ప్రభావం ఉన్నందువల్ల విశాఖనే వారికి సదుపాయాలన్నీ చూడమని చెప్పి, భోజనాలయిన తర్వాత తెరచాటు నుంచి బుద్ధుని బోధనలను వినడానికి మిగరుడు అంగీకరించాడు.

27. బుద్ధుని ప్రబోధాలను విన్న మిగరుడు వాటి ప్రభావం వల్ల బౌద్ధుడయ్యాడు.

28. తన మార్పుకు కారణమైన విశాఖ పట్ల మిగరునికి అనంతమైన కృతజ్ఞతా భావం ఏర్పడింది. అప్పటి నుంచి విశాఖను తన తల్లిగా భావించి తల్లికివ్వవలసిన గౌరవాలన్నీ ఆమెకిస్తూఉన్నాడు. ఆనాటి నుంచి విశాఖ మిగరమాతగా పిలువబడుతూండేది.

29. విశాఖ బుద్ధుని పట్ల అచంచల విశ్వాసం ఆ విధంగా చాటుకొన్నది.

## 3. మల్లిక భక్తి

1. ఒకసారి భగవానుడు శ్రావస్తి యందలి జితవనంలో ఉంటూండగా ఒక గృహస్థు తన ప్రియమైన కుమారుణ్ని కోల్పోయిన బాధతో తన వ్యాపారం పట్ల, అన్న పానీయాల పట్ల అనాసక్తి చూపసాగాడు.

2. అతడు ప్రతిరోజూ స్మశాన భూమికి పోయి కుమారుని కోసం విలపించసాగాడు.

3. పుత్ర వియోగంతో బాధపడుతున్న ఆ తండ్రి భగవానుని వద్దకు వచ్చి అభివాదం చేసి ఆయన ప్రక్కన కూర్చున్నాడు.

4. అతని మనస్సు ఆలోచనారహితంగా ఉందనీ, అతడు దేనిలోనూ ఆసక్తి లేకుండా ఉన్నాడనీ, అతడు తానెందుకు భగవానుని వద్దకు వచ్చిందీ చెప్పడం లేదనీ గ్రహించిన భగవానుడు అతనితో "నీవు ఎప్పటిలా లేవు, ఎందులో మనస్సు వ్యాకుల పడింది" అన్నాడు.

5. దానికి అతడు తన ప్రియమైన ఏకైక కుమారుడిని పోగొట్టుకొన్న తరువాత తన మనస్సు వ్యాకుల పడకుండా ఎట్లా ఉంటుందని సమాధానమిచ్చాడు.

6. "అవును మనకు ప్రియమైన వారివల్ల లభించేవి విచారం, వ్యాకులత, బాధ, వ్యధ, కష్టాలు మాత్రమే అన్నాడు భగవానుడు.

7. దానికా గృహస్థు ఆగ్రహించి "ప్రియమైన వారివల్ల బాధ కలుగుతుందని ఎవరను కొంటారు. ప్రియమైన వారి వల్ల మనకు సుఖసంతోషాలు, ఆనందం కలుగుతాయి."

8. భగవానుడు వెలిబుచ్చిన అభిప్రాయాలను ఈ విధంగా తిరస్కరించి గృహస్థు ఆయన

9. దగ్గరలో పాచికలతో ఆట ఆడుతున్న జూదగాళ్ళ వద్దకు గృహస్థు వెళ్ళి ఆతనెట్లా గౌతమునికి తన పుత్రవియోగం వల్ల కలిగిన బాధను వెల్లడించిందీ గౌతముడు తాను చెప్పినదానికెట్లా సమాధానం ఇచ్చిందీ, ఆ సమాధానంతో తానెట్లా విసిగి గౌతముని వద్ద నుంచి వస్తున్నదీ చెప్పాడు.

10. మనకు ప్రియమైనవారు మనకు సంతోషాన్ని, ఆనందాన్నీ కలుగజేస్తారనే గృహస్థువాదనే సరియైనవాదనని ఆ జూదగాళ్ళన్నారు. దానితో ఆ గృహస్థు తన వాదనను ఆ జూదగాళ్ళు సమర్థించారుగాబట్టి తనవైపునే ఉన్నారనుకున్నాడు.

11. కొంత కాలానికి ఈ విషయం రాజ భవనానికి వ్యాపించింది. ప్రియమైన వారు దుఃఖం, వ్యాకులత, బాధ, కష్టాలు, అవస్థలు కలుగ జేస్తారని గౌతముడు ప్రచారం చేస్తున్నాడట గదా! అని రాజు రాణీగారైన మల్లికను అడిగాడు.

12. దానికి మల్లిక "భగవానుడలా చెప్పిఉంటే అదే వాస్తవం అయి ఉంటుంది" అని రాజుతో అన్నది.

13. "గురువు ఏది జెపితే దాన్ని వాస్తవమని తలూపే విద్యార్థిలాగా గౌతముడేది జెపితే దానికి భగవానుడు చెప్పాడు గనక అది వాస్తవమవడమేనా ఇక చాలు, వెళ్ళు" అన్నాడు రాజు మల్లికతో.

14. ఆ తర్వాత నాళీధ్యానుడనే బ్రాహ్మణుడిని భగవానుని వద్దకు పంపింది. తన పేరు చెప్పి మొకరిల్లి, యోగ క్షేమాలు విచారించి ప్రియమైన వారు బాధను కలుగచేస్తారని భగవానుడు నిజంగా చెప్పాడా అనేది తెలుసుకొని రమ్మని మల్లిక ఆశయం.

15. భగవానుడేమి చెపుతాడో అక్షరాలాదానినే తనకు జెప్పాలని హెచ్చరించి బ్రాహ్మణుని భగవానుని వద్దకు మల్లిక పంపింది.

16. రాణీ గారి ఆజ్ఞ మేరకు బ్రాహ్మణుడు భగవానుని వద్దకు పోయి"భగవానుడు ప్రియమైన వారి విషయంలో చెప్పింది నిజమేనా?" అని అడిగాడు.

17. అవును తాను అదే విధంగా చెప్పానంటూ ప్రియమైన వారు మనకు దుఃఖం, వ్యాకులత, బాధ, కష్టాలు, అవస్థలు కలుగజేస్తారనటానికి భగవానుడు రుజువు చూపాడు.

18. "శ్రావస్తి నగరంలో ఒకామె తన తల్లి మరణించగా విచారగ్రస్తమైన స్థితిలో ఏమీ తోచక వీధి వీధి తిరుగుతూ, కూడలి కూడలి వెతుకుతూ ప్రియమైన తల్లినెవరైనా చూశారా అని అడుగుతూ తిరుగాడసాగింది.

19. "మరొకామె తన తల్లిని, తండ్రిని, సోదరుని, సోదరిని, కొడుకుని, కూతురుని, భర్తను కూడా పోగొట్టుకొని వీధి వీధి తిరుగుతూ కూడలి కూడలికి పోయి తను పోగొట్టుకున్న తన ప్రియమైన వారి నెవ్వరినైనా చూశారా? అని రోదించసాగింది.

పోగొట్టుకొని వ్యాకులత చెంది వీధి, వీధి, కూడలి, కూడలి తిరుగుతూ తాను పోగొట్టుకున్న తన ప్రియమైన వారినెవ్వరైనా చూశారా? అని వాపోతున్నాడు.

22. "శ్రావస్తిలోనే ఒక వివాహిత తన బంధువుల ఇంటికి పోగా ఆమె బంధువులు ఆమెను భర్త నుంచి వేరు చేసి తనకిష్టంలేని వానికిచ్చి పెండ్లిచేయాలని చూశారు."

23. ఆ బ్రాహ్మణుడైన నాళీధ్యానుడీ విషయాలన్నీ విన్నవి విన్నట్లుగా రాణీ మల్లికకు వివరించాడు.

24. అప్పుడు మల్లిక తన భర్త వద్దకు పోయి "మీ ఏకైక కుమార్తెయైన రాకుమారి వజీర అంటే మీకు చాలా ఇష్టం గదా?" అని అడుగగా "అవును ఇష్టమే"నన్నాడు.

25. "మీ వజీరకేమైనా ముప్పు వాటిల్లితే మీకు దుఃఖం కీడు గదా! అని అడుగగా రాజు "నా కుమార్తెకు ఏమైనా జరిగితే దుఃఖమే కాకుండా జీవితంలోనే గొప్పతేడా వస్తుందన్నారు".

26. మల్లిక రాజుతో "నేనంటే అభిమానం ఉందా మీకు?"అని అడగ్గా అవును ఉందన్నారు" రాజు.

27. "నాకేమైనా జరిగితే విచారిస్తారా విచారించరా?" అని అడిగింది మల్లిక" నీ కేమైనా జరిగితే విచారించడమే గాదు నేనేమైపోతానో కూడా నాకు తెలియదన్నాడు" రాజు.

28. "కాశీ, కోసల రాజ్యంలోని ప్రజలు మీకు ప్రియమైన వారు కారా?" అని రాజునడిగింది మల్లిక. "వారికేమైనా ఉపద్రవం జరిగితే వ్యాకుల పడతారా లేదా అని మల్లిక రాజునడిగింది. •

29. ఎందుకు వ్యధ చెందనూ తప్పక వ్యధ చెందుతానన్నాడు రాజు.

30. "భగవానుడు చెప్పినదే గదా తేడా ఏముంది " అని రాజును మల్లిక అడగ్గా పశ్చాత్తాపంతో రాజు భగవానుడు చెప్పింది వాస్తవమని అంగీకరించాడు.

## 4. గర్భవతియైన తల్లి స్థిర సంకల్పం

1. ఒకప్పుడు భగవానుడు భగ్గలదేశంలోనిశుంశుమారగిరి వద్ద గల జింకల వనంలోని చెట్ల నీడలలో ఉంటూ ఉన్నపుడు బోధిరాకుమారుని కోసం పద్మభవనం నిర్మాణం పూర్తయింది. దానిలో అప్పటి వరకూ ఏ సన్యాసి గాని బ్రాహ్మణుడు గాని, మరెవ్వరూ గాని విడిది చేసి యుండలేదు.

2. బోధి రాకుమారుడు శాంకిక పుత్రుడనే బ్రాహ్మణుని భగవానుని వద్దకు పంపి తన తరపున భగవానునికి ప్రణామం ఆచరించి, ఆయన యోగక్షేమాలు తెలుసుకుని మరుసటి రోజు భిక్షుసమేతంగా తన యింటికి విందుకు వచ్చి తనను తరింప

3. శాంకిక పుత్రుడు రాకుమారుని ఆహ్వానాన్ని భగవానునికి తెలియచేయగా భగవానుడు మౌనంగానే ఆహ్వానాన్ని అంగీకరించాడు. భగవానుని అంగీకారాన్ని బ్రాహ్మణులు రాకుమారునికి తెలియ జేశారు.

4. మరుసటి రోజు ఉదయాన్నే రాకుమారుడు రుచికరమైన వంటకాల్ని చేయించి పద్మ భవనం మెట్లపై తెల్లటి తివాచీ పరచి బ్రాహ్మణుడైన శాంకిక పుత్రుని పంపి భోజనానికి రావలసిందిగా భగవానునికి కబురంపాడు.

5. కాషాయపుఅంగీ ధరించి భిక్షాపాత్ర చేబూని భగవానుడు పద్మ భవనానికి వచ్చేటప్పటికి రాకుమారుడు భవనద్వారం వద్ద భగవానుని రాకకోసం వేచి యున్నాడు.

6. భగవానుని రాక గమనించిన రాకుమారుడాయన కెదురేగి ప్రణామం చేసి ఆయనకూ ఆయన అనుచరులకూ ఆహ్వానం పలికాడు.

7. పద్మ భవనం మెట్ల వద్దకు వచ్చి భగవానుడక్కడ ఆగి పోయాడు. తన క్షేమం, తన ప్రజల క్షేమం కోసం తెల్ల తివాచీ పై నడిచి లోనికి వెళ్ళ వలసిందిగా రాకుమారుడు భగవానుని కోరాడు. దానికి భగవానుడు మౌనంగా ఉండిపోయాడు.

8. రెండవసారి రాకుమారుడదేవిధంగా విన్నవించుకున్నా భగవానుడు మౌనంగానే ఉండిపోయాడు. మూడవ సారి కూడా కోరినప్పుడు భగవానుడు ఆనందుని వైపు చూశాడు.

9. ఆనందుడు భగవానుడు తివాచీ పై నడవడానికి ఇష్టపడడం లేదన్న విషయాన్ని గ్రహించి తివాచీ చుట్టితీసివేయవలసిందిగా కోరాడు.

10. రాకుమారుడు తివాచీని చుట్టించి తీసివేయించి భవనం పై భగవానునికీ, భిక్షువులకూ ఆసనాలనూ ఏర్పాటు చేశాడు.

11. భగవానుడు భవనంపైన తమకేర్పాటు చేసిన ఆసనాలపై భిక్షుసమేతంగా ఆసీనుడయ్యాడు.

12. వారి కోసం తయారు చేసిన రుచికరమైన వంటకాలను రాకుమారుడే శుచిగా వారికి స్వహస్తాలతో వడ్డించాడు.

13. భోజనాలయ్యాక రాకుమారుడు భగవానుని ప్రక్కనే చిన్న ఆసనం పై ఆసీనుడై "నా భావనలో నిజమైన సంక్షేమం ఆనందకరమైన విషయాల ద్వారా గాక బాధాకరమైన విషయాల వల్లనే సాధ్యమవుతుంది" అన్నాడు.

14. దానికి భగవానుడు "జ్ఞానోదయంగాక పూర్వం నేను కూడా అదే భావన గలిగి ఉండే వాడిని, యుక్త వయస్సులో, నిగనిగలాడే వెంట్రుకలతో యౌవన సౌందర్యం ఉట్టి పడుతున్నపుడు నా తల్లిదండ్రుల ఇష్టానికి వ్యతిరేకంగా, వారు రోదిస్తూ వ్యాకులం చెందినప్పటికీ తలవెంట్రుకలనూ, గడ్డాన్నీ గొరిగించుకుని కాషాయ వస్త్రాల్ని వేసుకొని గృహస్థజీవనానికి స్వస్తి చెప్పి సన్యాసినయ్యాను. నేనిప్పుడు జనరంజకమూ, సకల

15. "అయితే నా భావన ప్రస్తుతం వేరే విధంగా ఉంది. మానవుడు మూల సిద్ధాంతాన్ని తెలుసుకొంటే చెడును నాశనం చేసే మార్గాన్ని తెలుసుకుంటాడు" అని భగవానుడు రాకుమారునితో చెప్పాడు.

16. భగవానుని మాటలకు రాకుమారుడు చాలా సంతోషించి, "ఎంత ఉదాత్తమైన సిద్ధాంతం! ఎంత చక్కని అభివ్యక్తి, ఎవ్వరికైనా సులభంగా అర్థమయ్యేలా చెప్పారు" అని భగవానుని శ్లాఘించాడు.

17. అప్పుడు బ్రాహ్మణుడైన శాంకికపుత్రుడు జోక్యం చేసుకుని భగవానుని సిద్ధాంతాన్నైతే మెచ్చుకున్నారు గానీ వారినీ, వారి ధర్మాన్నీ, వారి సంఘాన్నీ శరణు కోరలేదేమిటని రాకుమారునుద్దేశించి అన్నాడు.

18. దానికి రాకుమారుడు "అలా అనకు మిత్రమా! నేను చెప్పేది విను. భగవానుడు కుశాంబిలో ఉంటూ ఉన్న రోజుల్లో నా తల్లి, నేను గర్భంలో ఉండగా భగవానుని దర్శించి భగవానునీ, ఆయన ధర్మాన్నీ, ఆయన సంఘాన్నీ, శరణు కోరి, తనకు గలుగబోయే బిడ్డ జీవితాంతం భగవానుని ధర్మం పట్ల నిబద్ధతతో జీవించేటట్లు అనుగ్రహించవలసిదిగా కోరిందని నా తల్లే నాతో చెప్పింది" అని వెల్లడించాడు.

19. "మరొకసారి భగ్గుల దేశంలో శుంశుమారగిరి వద్ద భేషకల వృక్షచ్ఛాయల్లో భగవానుడు ఉండగా చిరుప్రాయంలో నా పరిచారిక నన్ను భగవానుని వద్దకు తీసుకుపోయి నేను బోధిరాకుమారుడిననీ, నేను భగవానునీ, ఆయన ధర్మాన్నీ, ఆయన సంఘాన్నీ శరణు గోరుతున్నాననీ భగవానునికి తెలిపింది" అని బోధి రాకుమారుడు చెప్పాడు.

20. ఇప్పుడు మూడవసారి తాను స్వయంగా భగవానుని దర్శించి, జీవితాంతం వారి ధర్మాల నాచరించడానికి అనుగ్రహించవలసిందని శరణుగోరుతున్నానని రాకుమారుడు చెప్పాడు.

## 5. కేణీయుని ఆహ్వానం

1. అపనాథ ప్రాంతంలో సేలుడనే బ్రాహ్మణుడు నివసిస్తూ ఉండేవాడు. అతడు మూడు వేదాలను వల్లెవేసి సాంప్రదాయాల్ని సాకల్యంగా తెలుసుకొన్న వాడై స్వర శబ్ద లాక్షణికుడై, పంచాంగ పఠనంలో నిష్ణాతుడై, కార్యకారణ సిద్ధాంతాలలో ఆరితేరిన వాడై, మూడు వందల మంది బ్రాహ్మణ యువకులకు గురువుగా ఉంటూ మహోన్నతుడుగా పేరొందాడు.

2. అగ్ని దేవునారాధించే కేణీయుడనే ఆప్రాంతనివాసి సేలుని అనుయాయుడు. కేణీయుడు మరి కొంత మందితో అగ్ని దేవుని కారాధాన జరిపే చోటుకు సేలుడు తన మూడువందలమంది శిష్యులతో వచ్చి దైవారాధనలో రక రకాల పనులలో నిమగ్నమై ఉన్న వారిని చూసాడు.

విందు ఏర్పాటు చేస్తున్నారా లేక అగ్నిహోత్రం చేయనున్నారా లేక మగధరాజైన బింబిసారుని పరివారంతో సహా విందుకు ఆహ్వానిస్తున్నారా?" అని అడిగాడు.

4. "అది పెండ్లి విందు కాదు, బింబిసారుడు తన పరివారంతో అక్కడకు రావడంలేదు. నే నొక గొప్ప యజ్ఞం తలపెట్టాను. గౌతముడు భిక్షుక యాత్రామార్గంలో పన్నెండు వందల యాభై మంది భిక్షువులతో అపనాధ వచ్చాడ"నీ సేలునితో చెప్పాడు.

5. నేను విన్న దానిని బట్టి గౌతముడు గొప్ప కీర్తి గల వాడు, జ్ఞానోదయం పొందిన వాడు "అని కేణీయుడు సేలునితో చెప్పాడు.

6. అటువంటి భగవానునీ, ఆయన భిక్షుక గణాన్ని మరుసటి రోజు భోజనానికి ఆహ్వానిస్తున్నానని కేణీయుడు సేలునితో అన్నాడు.

7. దానికి సేలుడు నిజంగా గౌతముడు జ్ఞానోదయం పొందిన వాడేనా? అని అడగ్గా కేణీయుడు తాను గౌతముని బోధిసత్వుడనే నమ్ముతానని సమాధానమిచ్చాడు.

## 6. ప్రసేనునిచే భగవానుని ప్రశంస

1. ఒకప్పుడు భగవానుడు శ్రావస్తిలోని జితవనంలో అనాధ పిండకుని వనంలో ఉండడం తటస్థించింది.

2. ఆ సమయంలో కోసల రాజైన ప్రసేనుడు మోసపూరితమైన యుద్ధంలో తన లక్ష్యాన్ని సాధించిన విజయంతో అక్కడికి వచ్చాడు. అనాధపిండకుని వనం వైపు జూసి బండ్లు పోగలిగినంత దూరం బండ్లలో వెళ్ళి తర్వాత దిగి కాలినడకతో వనంలోకి వెళ్ళారు.

3. వనంలో అటూ ఇటూ తిరుగుతూ ఉన్న భిక్షువులను ప్రసేనుడు చూశాడు. వారి వద్దకు వెళ్ళి గౌరవపూర్వకంగా సంబోధించి అరిహంతుడు సర్వోన్నతుడు అయిన బుద్ధుడెక్కడున్నాడని అడిగాడు.

4. భిక్షువులు ప్రసేనునితో, బుద్ధుడు దూరంగా తలుపులు మూసి ఉన్న తన వసతి గృహంలో ఉన్నాడని చెప్పి మెల్లగా అక్కడకు చేరి బిడయపడకుండా వరండా లోనికి వెళ్ళి నెమ్మదిగా దగ్గి తలుపులు తట్టమనీ భగవానుడు తన కోసం తలుపు తీస్తాడనీ చెప్పారు.

5. కోసల రాజైన ప్రసేనుడు బుద్ధుని వసతి గృహం దగ్గరకు వెళ్ళి భిక్షువులు చెప్పిన విధంగా చేయగానే తలుపు తీశాడు.

6. ప్రసేనుడు లోపలికి ప్రవేశించి తన తలను భగవానుని కాళ్ళపై ఉంచి, పాదాలను చుంబించి, నిమిరి, తాను కోసల రాజైన ప్రసేనుడనని ప్రకటించారు.

7. దానికి భగవానుడు మహారాజా! నాలో ఏమి గొప్పతనం జూచి మీరు ఇంత ప్రగాఢమైన మానవతాన్ని చూపుతూ అమిత ప్రేమతో ప్రణామాలు చేసున్నారని

# ఏడో అధ్యాయం

# సంచారి చివరి మజిలీ

మొదటి భాగం - ఆత్మీయుల పునర్దర్శనం

రెండో భాగం - వైశాలి నుంచి నిష్క్రమణ

మూడో భాగం - మహాపరినిర్వాణం

# 1. ఉపదేశించిన కేంద్రాలు

1. ధర్మ ప్రచారకులను నియమించిన తరువాత భగవానుడు తాను ఒక్క చోటనే కూర్చొనలేదు. తాను కూడా ధర్మ ప్రచారం కోసం పర్యటించాడు.
2. ధర్మ ప్రచారం నిమిత్తం భగవానుడు కొన్ని ప్రదేశాలను ముఖ్యకేంద్రాలుగా ఎంపిక చేసినట్టున్నది.
3. వాటిలో శ్రావస్తి, రాజ గ్రహ ప్రధానమైనవి.
4. ఆయన శ్రావస్తిని 75 సార్లు, రాజ గ్రహను 24 సార్లు సందర్శించాడు.
5. మరి కొన్నిటిని ఆయన సాధారణ కేంద్రాలుగా ఎంచుకున్నాడు.
6. వాటిలో కపిలవస్తును ఆరు పర్యాయాలు, వైశాలిని ఆరు పర్యాయాలు, కమసద్ధమ్మన నాలుగు పర్యాయాలు ఆయన దర్శించాడు.

# 2. బుద్ధుడు పర్యటించిన స్థలాలు

1. ముఖ్య కేంద్రాలూ, సాధరణ కేంద్రాలూ కాక ఇంకా అనేక స్థలాలను కూడా భగవానుడ ధర్మ ప్రచారార్థం పర్యటించాడు.
2. ఉక్కథ (వుగ్రధ), నాదిక (నాదిగ), సాల అస్సపుర (అశ్వపుర) ఘోషితరః (గోష్టితారామ), నలంద అప్పన (అపనాధ), ఏతుమ (ఏతమ)లలో ఆయ పర్యటించాడు.
3. ఒపసద (ఉపాసద), ఇచ్చానౌకల (ఇచ్ఛానుకల), చందలకప్ప(చందలకుర్ప), కుశినా (కుశనగల) లను ఆయన సందర్శించాడు.
4. దేవదహా, పవ, అంచసంద (అంబసంధ), సౌతవ్య, అనుపియ(అనుప్రియ), ఉగన్మల ఆయన వెళ్ళాడు.
5. ఆయన పర్యటించిన స్థలాలను బట్టి చూస్తే ఆయన శాక్య, కురు, అంగదేశాల విస్తృతంగా తిరిగాడు.
6. ఇంచుమించు ఉత్తర భారతమంతా ఆయన పర్యటించారని చెప్పవచ్చు.
7. ఈ స్థలాల సంఖ్య కొద్దిగానే ఉన్నట్టు కనిపించవచ్చు. కాని మొత్తం ఎంత దు మనుకున్నారు? రాజగ్రహ నుంచి లుంబినికి 250 మైళ్ళదూరం ఉంటుంది. దా బట్టి ఊహించుకోవచ్చు ఆయన ఎంత దూరం తిరిగాడో!

9. తరువాతి కాలంలో తన శిష్యులు విహారాలను, ఆరామాలను నిర్మించేంతవరకు భగవానుడికి ప్రచార పర్యటనలో విడిది చేయడానికి చోటేలేదు. తరచు ఆయన దారి పక్కన చెట్ల కిందే విశ్రమించేవాడు. విహారాల నిర్మాణం జరిగాక ఆయన, ఆయన భిక్షువులు వాటిల్లో విడిది చేసేవారు.

10. ఆయన ఒక చోటినుంచి మరోచోటికి, ఒక గ్రామం నుంచి మరో గ్రామానికి, తన సందేశాన్ని స్వీకరించదలచిన వారి సందేహాలను, సమస్యలను నివృత్తి చేస్తూ, వ్యతిరేకుల వాదనలను ఖండిస్తూ, దర్శనంకోసం వచ్చినవారికి చిన్న పిల్లలకువలె బోధనలు చేస్తూ తిరుగుతూ ఉండేవాడు.

11. తన మాటలను వినడానికి వచ్చేవారందరూ తెలివిగలవారు కాదనీ, కేవలం తెలుసుకుందామనే జిజ్ఞాసతో రావడం లేదనీ భగవానుడికి తెలుసు.

12. వినేందుకు వచ్చేవారిలో మూడు రకాల వారుంటారని ఆయన భిక్షుసోదరులకు జాగ్రత్తలు చెప్పారు కూడా.

13. కొందరి బుర్రలు మట్టి బుర్రలు. భిక్షువులు వారి కెన్ని పర్యాయాలు చెప్పినా ఏమీ తలకెక్కదు. చెప్పేదంతా పొల్లు పోకుండా వింటూనే ఉంటారు మరి. కానీ వారేమీ జీర్ణించుకోలేరు. వివేకానికి వీరు దూరం.

14. కొందరి మెదడు స్థిమితంగా ఉండదు. భిక్షుసోదరులు చెప్పేదంతా పొల్లుపోకుండా వింటూనే ఉంటారు. వారి మాటలను అందుకుంటారు కూడా. కానీ అక్కడి నుంచి లేవగానే ఏమీ మిగలదు. వీరి బుర్ర ఖాళీగానే ఉండి పోతుంది. అయితే ముందు చెప్పిన వారి కంటే వీరు మెరుగు.

15. కొందరు వీరి కంటె ఎంతో విజ్ఞులు. భిక్షుసోదరులు చెప్పేది వీరు పొల్లుపోకుండా వినడమేకాదు, శ్రద్ధగా వింటారు. మనసుకు పట్టించుకొంటారు. విన్నది వారి మనస్సులో స్థిరంగా నాటుకు పోతుంది. అర్థం చేసుకున్న దాన్ని ఆచరించడం ఏమిటో వీరికి తెలుసు.

16. జనంలో ఇన్ని రకాలవారున్నప్పటికీ భగవానుడు తన సందేశాన్ని ప్రచారం చేయడానికి అలుపెరుగకుండా సంచరించాడు.

17. భిక్షువైన భగవానుడి వద్ద మూడు మాత్రమే కట్టు వస్త్రాలుండేవి. ఆయన రోజుకు ఒక్కపూటే భుజించేవారు. ఆయన ప్రతి ఉదయం ఇల్లిల్లూ తిరిగి భిక్షాటన చేసేవారు.

18. ఏ మానవుడూ చేయలేని కఠోరమైనకార్యాన్ని ఆయన ఆనందంగా నిర్వహించాడు.

## 3. తల్లీ కొడుకుల, భార్యా భర్తల ఆఖరి సమాగమం

1. మహాప్రజాపతి, యశోధర తనువు చాలించేముందు భగవానుడిని కలిశారు.

2. బహుశా ఆయనను వారు కలవడం అదే ఆఖరుకావచ్చును.

3. మహాప్రజాపతి వెళ్ళి, మొదట ఆయనను పూజించింది.

4. ఉదాత్తమైన ధర్మానందాన్ని తనకు అందించినందుకు ; ధార్మికంగా తనకే ఆయన తండ్రి అయినందుకు; ఆయన ద్వారా తనలో ధర్మం ఎదిగినందుకు ; ధమ్మక్షేత్రాన్ని బిడ్డవలె ఆయన నుంచి పొందినందుకు ; జీవన సాగరాన్ని ఆయన ద్వారా అధిగమించినందుకు మహాప్రజాపతి కృతజ్ఞతలు తెలిపింది. అంతటి బుద్ధునికే తల్లి కాగలిగిన భాగ్యానికి కృతజ్ఞతలు తెలిపింది.

5. "ఈ కట్టెను వదిలి కను మూద్దామని ఉంది, ఓ దుఃఖ నిర్మూలకుడా ! నాకు అనుమతివ్వు" - అని ఆమె బుద్ధుని ప్రార్థించింది.

6. యశోధర భగవానుడిని సంబోధించి, తనకిప్పుడు డెబ్బై ఎనిమిది ఏళ్ళని చెప్పింది. తనకు ఎనభయ్యేళ్ళు పైబడినాయని బుద్ధుడు బదులిచ్చాడు.

7. ఆ రాత్రే తాను తనువు చాలించనున్నట్టు యశోధర చెప్పింది. మహాప్రజాపతిలో కంటె యశోధరలో ఆత్మస్థైర్యం అధికంగా కనిపించింది. తనువు చాలించేందుకు అనుమతిని ఆమె కోరలేదు. బుద్ధుని శరణం కోరడానికే ఆమె రాలేదు.

8. పైగా ఆమె 'నాకు నేనే శరణం' (మె శరణం అత్తనో) అని ప్రకటించింది.

9. ఆమె జీవితంలోని అన్నివేదనలనూ జయించింది.

10. తనకు ఆ మార్గాన్ని చూపించి, శక్తినిచ్చినందుకు ఆయనకు కృతజ్ఞతలు చెప్పడానికి ఆమె వచ్చింది.

# 4. తండ్రీ కొడుకుల తుది సమాగమం

1. భగవానుడు ఒక సారి రాజగ్రహలోని వెదురు వనంలో ఉంటున్న సమయంలో రాహులుడు అంబలతికలో ఉన్నాడు.

2. బుద్ధుడు ధ్యానం ముగిసిన తరువాత రాహులుని వద్దకు వెళ్ళాడు. రాహులుడు భగవానుడిని చూడగానే, ఆయన కోసం ఆసనం సిద్ధం చేసి, కాళ్ళుకడుగు కొనేందుకు నీళ్ళు అందించాడు.

3. ఆసనంపై ఆసీనుడై భగవానుడు పాదాలను కడుగుకొన్నారు. రాహులుడు ఆయనకు ప్రణమిల్లి పక్కన ఆసీనుడయ్యాడు.

4. రాహులుని ఉద్దేశించి తథాగతుడిలా అన్నాడు ``అబద్ధాలాడడంలో సంకోచపడనివాడు ఎన్ని దుష్కృత్యాలకైనా పాల్పడతాడు. కాబట్టి, నువ్వు సరదా కోసమైనా సరే అసత్య మాడకుండా నిన్ను తీర్చిదిద్దుకోవాలి."

5. "మాట్లాడేటప్పుడు, ఆలోచనలు చేసేటప్పుడు, ఆచరించేటప్పుడు నువ్వు పదేపదే తరచి చూడాలి."

6. "నువ్వేదైనా చేయదలచినప్పుడు, అది నీకు గానీ ఇతరులకు గానీ, ఉభయులకు గానీ హాని చేస్తుందా, కష్టాలను కలిగిస్తుందా అన్నది తరచి చూడాలి. ఆ అవలోకనంలో నీకు ఆపని మంచిది కాదని తోస్తే నువ్వుదాన్ని విరమించుకోవాలి."

7. "ఆ అవలోకనంలో పనివల్ల హాని లేదని, మంచి జరుగుతుందని అనిపిస్తే దాన్ని ఆచరించవచ్చు."

8. "ప్రేమను కరుణను పెంపొందించుకో ; ఫలితంగా నీ నుంచి ద్వేషం వైదొలగుతుంది."

9. "దయను పెంచుకో; ఫలితంగా నీలో నిస్పృహ అంతరిస్తుంది."

10. "ఇతరుల బాగులో ఆనందాన్ని పొందు ; ఫలితంగా వైమనస్యాలు అదృశ్యమవుతాయి."

11. "సమభావాన్ని పెంచుకో ; ఫలితంగా ప్రతికూల భావాలు అంతరిస్తాయి."

12. "దైహికమైన చెడుగును నిరంతరం స్మరించుకో, ఫలితంగా వికారం నశిస్తుంది."

13. "ప్రకృతిలోని క్షణికతను అవగతంచేసుకో; ఫలితంగా అహంకారం రూపుమాసిపోతుంది."

14. భగవానుడి ప్రవచనాలివి. వాటిని ఆలకించి రాహులుడు మనస్ఫూర్తిగా ఆనందించాడు.

## 5. బుద్ధుడు - సారిపుత్రుల ఆఖరి సమాగమం

1. శ్రావస్తిలోని గౌధకుటి విహారపు జీతవనంలో భగవానుడు విడిది చేశాడు.

2. ఐదు వందల మంది భిక్షువులతో సారి పుత్రుడు అక్కడికి వచ్చాడు.

3. తథాగతునికి ప్రణమిల్లి సారిపుత్రుడు తన నిర్వాణ సమయమాసన్నమైనదని చెప్పాడు. దేహ పరిత్యాగానికి భగవానుడు అనుమతించగలరా?

4. పరినిర్వాణానికి ఏ స్థలాన్నైనా ఎంపిక చేసుకున్నావా అని భగవానుడు సారి పుత్రుని అడిగాడు.

5. "మగధలోని నలకలో నేను జన్మించాను. నేను పుట్టిన ఇల్లు ఇంకా అలాగే ఉన్నది. పరినిర్వాణానికి దాన్ని నేను ఎంచుకున్నాను" అని సారిపుత్రుడు సమాధానం చెప్పాడు.

6. "ప్రియసారిపుత్రా! నీ యిష్టప్రకారమే చేయి!" అన్నాడు బుద్ధుడు.

7. "మీ పాదాలపై మోకరిల్లాలనే ఒకే ఒక్క ఆకాంక్షతో వేయి కల్పాలు పారమితలను సాధన చేశాను. ఆ కోరిక నేటికి నెరవేరింది. నా ఆనందానికి అవధులు లేవు"

8. "పునర్జన్మపై మనకు నమ్మకం లేదు. కాబట్టి ఇదే మన తుది సమాగమం. నాలోని

దోషాలను భగవానుడు మన్నించాలి. నాకు సమయం ఆసన్నమైనది " అన్నాడు సారిపుత్రుడు.

9. "సారిపుత్రా! నీలో క్షమించవలసినవి ఏమీలేవు" అన్నాడు బుద్ధుడు.

10. సారిపుత్రుడు నిష్క్రమించటానికి లేచినిలుచోగా, భగవానుడు ఆయన గౌరవార్థం గౌధకుటీరం వరండా వరకు వచ్చాడు.

11. సెలవు తీసుకుంటూ సారిపుత్రుడు ఇలా అన్నాడు : "మిమ్ములను మొదటిసారి దర్శించినపుడెంతో ఆనందించాను. నేడు కూడా అంతే ఆనందిస్తున్నాను. ఇదే ఆఖరి దర్శనమని నాకు తెలుసు. ఇకపై మిమ్ములను చూడలేను."

12. సారి పుత్రుడు ముకుళిత హస్తాలతో భగవానుడికి అభిముఖంగా నిలబడి వెనకకు నడిచి నిష్క్రమించాడు.

13. అక్కడ ఉన్న భిక్షువులతో బుద్ధుడు - "భిక్షుసోదరుల్లో అగ్రజుడు వెడుతున్నాడు. మీరాతనిని అనుసరించండి" - అని చెప్పగా పరివేష్టిత భిక్షువులు సారిపుత్రుని అనుసరించి వెళ్ళారు.

14. సారిపుత్రుడు స్వగ్రామంలో, జన్మించిన స్వగృహంలోనే తనువు చాలించాడు.

15. అగ్ని సంస్కారానంతరం సారి పుత్రుని అస్థికలను భగవానుడి దగ్గరకు తీసుకు వెళ్ళారు.

16. అస్థికలను స్వీకరిస్తూ బుద్ధుడు భిక్షువులతో ఇలా అన్నాడు: అతను మహాజ్ఞాని, తనకంటూ దేనినీ కోరలేదు, ఎంతటి శక్తిమంతుడో అంతటి శ్రమచేసేవాడు; పాపాగ్ని ద్వేషించినవాడు. సోదరులారా ! ఇవే అతని అస్థికలు ! భూమికి ఉన్నంత సహనం వుండేది అతనిలో. ఎన్నడూ ఆగ్రహాన్ని దరి చేరనీయలేదు, ఎన్నడూ కోరికలకు లొంగలేదు, వాంఛల్ని జయించగల్గినవాడు. సానుభూతి, సహచర్యం, ప్రేమ అతనిలో పుష్కలంగా ఉండేవి."

17. అదే సమయంలో మహా మొగల్లాణ రాజగ్రహ సమీపంలోని ఓ ఏకాంత విహారంలో ఉండేవాడు. భగవానుడి శత్రువులు అతన్ని దారుణంగా హత్య చేయించారు.

18. ఆ విషాదవార్త బుద్ధుని చెవిన పడింది. సారిపుత్రుడు, మహా మొగల్లాణుడు బుద్ధుని ప్రధాన శిష్యులు. వారిద్దరినీ ధర్మ సేనపతుల్ని పిలిచేవారు. తన ధమ్మాన్ని విస్తరింపజేయడానికి బుద్ధుడు వారిద్దరిపై ఆధారపడ్డాడు.

19. తన జీవితకాలంలోనే వారిద్దరూ మృతిచెందటం బుద్ధుని తీవ్రంగా కలచివేసింది.

20. ఇక ఆయనకు శ్రావస్తిలో ఉండాలనిపించలేదు. మనశ్శాంతికోసం పర్యటన కొనసాగించాలనుకున్నాడు.

## రెండో భాగం

# వైశాలి నుంచి నిష్క్రమణ

1. వైశాలికి వీడ్కోలు
2. పవ మజిలీ
3. కుశినారకు రాక

# 1. వైశాలికి వీడ్కోలు

1. ఆఖరి ప్రయాణానికి సమాయత్తమవుతున్నపుడు భగవానుడు రాజగ్రహలోని గృధశిఖరంలో నివసిస్తున్నారు.
2. కొంతకాలం గడిచిన తరువాత ఆయన "పద ఆనందా, అంబలతికకు పోదాం" అన్నారు.
3. "అలాగే దేవా!" అన్నాడు ఆనందుడు. భిక్షుక సందోహంతో బుద్ధుడు అంబలతికకు ప్రయాణమయ్యారు.
4. అంబలతికలో కొంతకాలం ఉండి ఆయన నలందకు ప్రయాణమయ్యారు.
5. నలంద నుంచి మగధ రాజధాని పాటలికి వెళ్ళారు.
6. పాటలి గ్రామం నుంచి కోటిగామకు, కోటిగామ నుంచి నాదికకు వెళ్ళారు.
7. ప్రతిచోటా ఆయన కొన్ని రోజులు బసచేసి భిక్షువులకు, గృహస్థులకు ధర్మ ప్రబోధాలు చేశారు.
8. నాదిక నుంచి ఆయన వైశాలి వెళ్ళారు.
9. వైశాలి మహావీరుని జన్మస్థలం. ఆతని ధర్మానికి పట్టున్న చోటు.
10. కానీ తథాగతుడు అనతికాలంలోనే వైశాలి ప్రజలను తన `ధమ్మం' వైపు ఆకర్షింపజేసుకున్నారు.
11. ఆ సమయంలో వైశాలిలో తీవ్రమైన దుర్భిక్షం నెలకొని జనం పెద్ద సంఖ్యలో చనిపోయేవారని చెబుతారు.
12. వైశాలి ప్రజలు సమావేశమై దుర్భిక్షం గురించి చర్చించుకున్నారు.
13. సుదీర్ఘ చర్చల తరువాత బుద్ధుని తమ నగరానికి ఆహ్వానించాలని జన సభ నిర్ణయించింది.
14. బింబిసారుని స్నేహితుడు, వైశాలి పురోహితుని కుమారుడు అయిన మహాలి అనే లిచ్ఛవీయుని తథాగతుని ఆహ్వానించడానికి పంపారు.
15. బుద్ధుడు ఆ ఆహ్వానాన్ని అంగీకరించి వారు వజ్జినుల రాజ్యంలో ప్రవేశించగానే ఆకాశం మేఘావృతమై వర్షం కురిసింది. దుర్భిక్షం అంతరించింది.
16. భగవానుడికి వైశాలి ప్రజల స్వాగతం అలా ఆరంభమైందన్నమాట.

17. వారి హృదయాలను గెలుచుకున్న భగవానుడికి వైశాలి ప్రజలు గొప్ప స్వాగతం చెప్పడం సహజం.

18. అప్పుడే `వాన'కాలం మొదలయింది. తన వానకాలం గడిపేందుకు బుద్ధుడు చేలుణకు చేరుకున్నారు. భిక్షుక సోదరులను వైశాలిలో వానకాలం గడపమని చెప్పారు.

19. వానకాలం ముగిసాక భగవానుడు వైశాలికి వచ్చి, అక్కడి నుంచి తిరిగి ప్రయాణం ప్రారంభించారు.

20. ఒక రోజున తెల్లవారు జామున భగవానుడు వస్త్రధారియై భిక్షాపాత్ర చేతబూని భిక్షయాచించుకుని భోజనం పూర్తి అయిన తరువాత, వైశాలి వైపు పరికించి చూసి - "ఆనందా! తథాగతుడు వైశాలిని చూడడం ఇదే ఆఖరిసారి "అని అన్నారు.

21. ఆ విధంగా ఆయన వైశాలి ప్రజలకు వీడ్కోలు చెప్పారు.

22. వైశాలీ నగరపు ఉత్తరపు పొలమేరల వద్ద భగవానుడు తన భిక్షపాత్రను లిచ్చవీయులకు జ్ఞాపికగా బహూకరించారు.

23. అదే ఆయన వైశాలి చివరి పర్యటన. ఆ తరువాత ఆయన జీవించిఉండగా మళ్లీ అక్కడకు రాలేదు.

## 2. పవ మజిలీ

1. వైశాలి నుంచి బుద్ధుడు భండగామ్ చేరుకున్నారు.

2. అక్కడినుంచి హత్తిగామ్, అక్కడి నుంచి భోగనగరం వెళ్ళారు.

3. భోగనగరంనుంచి పవ చేరుకున్నారు.

4. పవలో చుందుడనే కమ్మరికి చెందిన మామిడి తోటలో ఆయన బసచేశారు.

5. బుద్ధుడు పవకు వచ్చి తన తోటలో విడిది చేసారని చుందుడికి తెలిసింది.

6. చుందుడు మామిడి తోటకు వెళ్ళి భగవానుడికి సమీపంలో ఆసీనుడయ్యాడు. బుద్ధుడు ఆతనికి ధమ్మబోధ చేశారు.

7. సంతోషించిన చుందుడు బుద్ధునితో ఇలా అన్నాడు. ``రేపు నాయింట్లో పరివారంతో కలసి భగవానుడు భోజనం చేసే భాగ్యం కల్పించాలని కోరుతున్నాను."

8. భగవానుడు మౌనంగా తన అంగీకారం తెలిపాడు. బుద్ధుని అంగీకారాన్ని గమనించి చుందుడు నిష్క్రమించాడు.

9. మరునాడు చుందుడు తన ఇంట్లో పరమాన్నాన్నీ, పిండి వంటలను, సూకర మాధవాన్నీ సిద్ధం చేశాడు. ``దేవా, భోజనం సిద్ధం" అని భగవానుడిని పిలిచాడు.

10. భగవానుడు వస్త్రధారియై భిక్షుకుల సహితంగా చుందుని ఇంటికి వెళ్ళి విందులో పాల్గొన్నారు.

11. భోజనానంతరం బుద్ధుడు చుందునికి మరొక పర్యాయం ధమ్మ సందేశం అందించారు. తరువాత ఆసనం నుంచి లేచి నిష్క్రమించారు.

12. చుందుడు వడ్డించిన ఆహారం భగవానుడికి పడలేదు. ఆయన తీవ్రంగా అస్వస్థులయ్యారు. విరేచనాలు, తీవ్రమైన నొప్పి. ఈ జబ్బే ఆయన మరణానికి కూడా దారితీసింది.

13. కానీ, బుద్ధభగవానుడు అంత బాధనూ పల్లెత్తుమాట అనకుండా భరించారు.

14. మామిడి తోటకు తిరిగి వచ్చి విశ్రాంతి తీసుకున్న తరువాత భగవానుడు ఆనందునితో "కుశినారకు వెడదాం పద" అని అన్నారు. భిక్షుగణం కదిలింది.

## 3. కుశినారకు రాక

1. తథాగతుడు కొంత దూరం దాకా నడిచారు. కాని శ్రాంతి కావాలనిపించింది.

2. దారిలో పక్కనున్న ఓ చెట్టు కిందికి వెళ్ళి ఆనందునితో ఇలా అన్నారు "ఆనందా దయచేసి వస్త్రాన్ని పరుచు. నేను అలసి పోయి ఉన్నాను. నాకు విశ్రాంతి కావాలి.'

3. "అలాగే దేవా!" అని ఆనందుడు వస్త్రాన్ని నాలుగు మడతలు మడిచి పరిచాడు.

4. భగవానుడు దానిపై ఆసీనుడయ్యారు.

5. ఆసీనులైన తరువాత ఆనందునితో -"ఆనందా, దాహంగా ఉంది, నాక్కొంచెం నీరు తెచ్చివ్వు" అని అర్థించారు.

6. "కకుత్థనది ఎంతో దూరం లేదు. ఆనది నీరు చల్లగా ఉంటుంది, స్వచ్ఛంగా ఉంటుంది సులభంగా నది దగ్గరకు వెళ్ళవచ్చు. అక్కడ ఆహ్లాదంగా కూడా ఉంటుంది. భగవానుడ అక్కడికి వెడితే నీరు తాగనూ వచ్చు, కాళ్ళు చేతులు శుభ్రపరుచుకోనూ వచ్చు. పక్కన ఉన్న వాగులో నీరు మురికిగా వుంది" అని సమాధానమిచ్చాడు ఆనందుడు.

7. కాని, భగవానుడికి నది దాకా వెళ్ళే ఓపికలేదు. వాగు నీరే తాగాలనుకున్నారు.

8. ఆనందుడు ఆనీరు తెచ్చాడు. భగవానుడు తాగారు.

9. కొంత సేపు విశ్రమించిన తరువాత భగవానుడు భిక్షువులతో కలసి కకుత్థనది వద్దక వెళ్ళారు. నీటిలోకి దిగి, స్నానం చేశారు, ఆనది నీరు తాగారు, ఆవలితీరం నుం వెలుపలికి నడిచి మామిడి వనంలోకి వెళ్ళారు.

10. వనంలోకి వెళ్ళిన తరువాత, తన వస్త్రాన్ని తిరిగి నేలపై పరచమని ఆనందుని అడిగార "[illegible] విశ్రమిస్తాను" అన్నారు. వస్త్రాన్ని పరచిన తరువా

భగవానుడు దానిపై విశ్రమించారు.

11. కొంత సేపు విశ్రమించిన భగవానుడు ఆనందునితో "ఆనందా, హిరణ్యావతీ తీరాన కుశినార వద్ద ఉన్న మల్లుల సాల వృక్షాలవనం దగ్గరకు వెడదాం పదండి" అన్నారు.

12. సాలవనం చేరిన తరువాత "నాకు చాలా అలసటగా ఉన్నది. నా వస్త్రాన్ని నేలపై పరచమ"ని భగవానుడు అడిగారు. ఆనందుడు సాల వృక్షాల మధ్య వస్త్రాన్ని పరిచాడు.

13. భగవానుడు దానిపై విశ్రమించారు.

- -

# మహాపరి నిర్వాణం

1. వారసుని నియామకం
2. తుది దీక్ష
3. తుది ప్రవచనాలు
4. ఆనందుని దుఃఖం
5. మల్లుల సంతాపం, ఒక భిక్షువు సంతోషం
6. అంత్యక్రియలు
7. అస్థికల కోసం వివాదం
8. బుద్ధునికి విధేయత

# 1. వారసుని నియామకం

1. బుద్ధుడు ఒకప్పుడు శాక్య విలుకాళ్ళ కుటుంబానికి చెందిన మామిడి తోపులో నిడిది చేశారు.

2. అప్పుడే పవలో నిగంతువైన నతపుత్రుడు మరణించాడు. ఆ తరువాత నిగంతువులు రెండు బృందాలుగా చీలిపోయి వాగ్వివాదాలతో ఘర్షణ పడసాగారు.

3. యువ భిక్షువైన చుందుడు చూడడానికి వచ్చాడు. "నిగంతువైన నతపుత్రుడు పవలో మరణించాడు. అతని మరణానంతరం నిగంతువులు రెండు బృందాలుగా చీలిపోయి కలహించుకుంటూ పరస్పరం బాధించుకుంటున్నారు. వారికిప్పుడు నాయకుడెవరు లేకపోవడం వల్ల ఈ స్థితి సంభవించింది." అని చుందుడు ఆనందునితో చెప్పాడు

4. పూజ్య ఆనందుడు ఇలా బదులిచ్చారు: ``మిత్రమా చుందుడా, ఆ విషయాన్ని తథాగతుని దృష్టికి తీసుకు వెళ్ళడం అవసరం. మనం వెళ్ళి ఆయనతో చెబుదాం పద

5. "మంచిది, గురువర్యా" అని చుందుడన్నాడు.

6. పూజ్య ఆనందుడు, చుందుడు వెళ్ళి భగవానుని దర్శించి నమస్కరించార నిగంతువుల గురించి చెప్పి, వారసుని నియమించవలసిన ఆవశ్యకతను విన్నవించార

7. చుందుడు చెప్పింది విని భగవానుడు ఇలా బదులిచ్చాడు: "చూడు చుందుడ పరిపూర్ణంగా జ్ఞాని అయిన వాడు, అర్హుడైన బోధకుడు ప్రపంచంలో అవతరించాడ కుందాం. తానొక సిద్ధాంతాన్ని రూపొందించి, బోధించి, శాంతి స్థాపనార్థమై మా దర్శక సిద్ధాంతంగా దాన్ని తీర్చి దిద్దాడను కుందాం. ఆయన అనుయాయులు మాత్ర ఆ ధర్మ సిద్ధాంతాన్ని పూర్తిగా అవగాహన చేసికోలేక, బోధకుడు మరణించగా అనిశ్చిత స్థితికి వెళ్ళిపోయారనుకుందాం."

8. "చుందుడా, ఆ పరిస్థితుల్లో ఆ బోధకుడు చనిపోవడం అనుయాయులకు తీరనిలో అతని ధమ్మానికి ప్రమాదకరం"

9. 'కానీ చుందుడా, పరిపూర్ణ జ్ఞాని అవతరించి ధమ్మాన్ని రూపొందించి, అనుయాయు బోధించి, మార్గ దర్శకంగా చేయగలిగాడనుకుందాం. అతని అనుయాయులు సై ఆ ధర్మాన్ని అవగాహన చేసుకుని ధర్మానుష్ఠానంలో నిష్ణాతులయ్యారనుకుందాం. దశలో వారి బోధకుడు మరణిస్తే...."

10. "అప్పుడు ఆ బోధకుని అనుయాయులకు ఎటువంటి హానీ కలుగదు. అప్పుడు వారసుడెవ్వడన్న ప్రశ్నరాదుకదా"

11. ఆనందుడు ఇదే సమస్యను మరో సందర్భంలో కూడా ప్రస్తావించినప్పు

భగవానుడు ఇలా చెప్పారు : "నీ ఉద్దేశ్యం ఏమిటి ఆనందా? మన భిక్షుకులలో ఎవరికైనా నా బోధనల గురించి సంశయం ఉందా?"

12. "లేదు, కాని, భగవానుడి నిర్యాణం తరువాత భిక్షుసోదర గణంలో ధమ్మ నియమానుసరణం గురించి వివాదాలు తలెత్తితే, అవి అందరికీ బాధ కలిగిస్తాయి కదా?"

13. "ధమ్మ నియమానుసరణం గురించి తలెత్తే వివాదాలను పట్టించుకోనవసరం లేదు ఆనందా, ధమ్మం గురించే సోదరగణంలో వివాదం తలెత్తితే అది ప్రమాదం" అన్నారు భగవానుడు.

14. "ఈ వివాదాలను ఏనియంతా పరిష్కరింపజాలడు. అటువంటప్పుడు వారసుడు నియంత వలె ప్రవర్తిస్తే తప్ప, ఏం చేయగలగుతాడు?

15. "మార్గం గురించిన వివాదాలను నియంతలు పరిష్కరింపజాలరు.

16. "వివాద పరిష్కార నిర్ణయాన్ని సోదరగణం చేయాలి. భిక్షుక మహాగణమంతా ఒక చోట కూర్చొని అంగీకారం కుదిరేదాకా చర్చించి నిర్ణయించాలి.

17. "వివాదాల పరిష్కారానికి అత్యధికుల ఆమోదం మార్గంగాని వారసుని నియామకం కాదు."

## 2. తుది దీక్ష

1. సంచారి సుభద్దుడు (సుభద్రుడు) కుశినారలో ఉంటుండేవాడు. "నేటి రాత్రి ఆఖరు ఘడియల్లో గౌతమ శ్రమణుడు తనువు చాలించనున్నాడ"న్న వార్తను సుభద్దుడు విన్నాడు. అప్పుడతనికో ఆలోచన వచ్చింది.

2. "అరుదుగా, చాలా అరుదుగా మాత్రమే తథాగతులై, పరిపూర్ణ జ్ఞానులైన వారు అవతరిస్తారని దేశ దిమ్మరుల్లో తలపండినవారు చెప్పగా విన్నాను. నేటి రాత్రే గౌతమ శ్రమణుడు తనువు చాలించనున్నాడని తెలిసింది. నేను గనుక వెంటనే వెళ్ళి గౌతమ శ్రమణుణ్ణి దర్శించగలిగితే నాలోని సందిగ్ధ స్థితిని తొలగించుకోవచ్చు."

3. ఇలా అనుకున్న సుభద్దుడు మల్లుల సాలవనం చేరుకున్నాడు. పూజ్య ఆనందుడు తటస్థపడగానే తానెందుకు వచ్చిందీ ఆయనకు వివరించాడు "ఆనంద గురువర్యా! గౌతమ శ్రమణుని దర్శనం కలిగించవలసింద"ని అర్థించాడు.

4. ఆ మాటలు విన్న ఆనందుడు "వద్దు మిత్రమా, భగవానుడు చాలా అలసి పోయి ఉన్నాడు. సుభద్దా, వారినిప్పుడు ఇబ్బంది పెట్టవద్దు" అన్నాడు.

5. సుభద్దుడు మరోసారి అడిగాడు. మూడోసారి కూడా అడిగాడు. ఆనందుని సమాధానమదే.

6. పూజ్య ఆనందునికీ, సంచారి సుభద్దునికీ జరుగుతున్న సంభాషణ భగవానునికీ వినవచ్చింది. భగవానుడు పూజ్య ఆనందుని పిలిచి "చాలు ఆనందా, ఇక సుభద్దుని

అడ్డుకోకు. తధాగతుడిని దర్శించడానికి అతనిని అనుమతించు. సుభద్దుడు నన్ను అడిగేది ఏదైనా అది అతని జిజ్ఞాస నుంచే వచ్చినది తప్ప, నన్ను ఇబ్బంది పెట్టే ఉద్దేశ్యం అతనికి లేదు. కాబట్టి నేను చెప్పే సమాధానం అతనికి త్వరగా అవగతమవుతుంది."

7. అప్పుడు పూజ్య ఆనందుడు "లోపలికి వెళ్ళు మిత్రమా సుభద్దా, భగవానుడు నిన్ననుమతించారు" అన్నాడు.

8. సంచారి సుభద్దుడు భగవానుని వద్దకు వాళ్ళి అభివాదం చేసి. కుశల ప్రశ్నల తరువాత ఒక ప్రక్కగా కూర్చొన్నాడు. భగవానునితో ఇలా సంభాషణకు ఉపక్రమించాడు.

9. "గౌతమ గురువర్యా! పురాణ కశ్శపుడు (పురాణ కశ్యపుడు), గోశాలకు చెందిన మక్కలి, అజిత కౌశకంబళి, పకుధ వృక్షశాయి అయిన కాచ్చాయనుడు (కాత్యాయనుడు), చేలతృతి పుత్రుడైన సంజయుడు, నాధ తెగకు చెందిన నిగంతులు. బ్రాహ్మణులు, సన్యాసులు - వీరికి విశేష సంఖ్యలో అనుయాయులూ శ్రోతలూ వివిధ తత్త్వశోధకులూ ఉన్నారు కదా, వీరందరిలో పరమ సత్యాన్ని గ్రహించగలిగిన వారు ఎవరైనా ఉన్నారా? ఎవరూ లేరా? కొందరు గ్రహించి, కొందరు గ్రహించకుండా ఉన్నారా?"

10. ఆ ప్రశ్నకు భగవానుడు -"వారందరూ గానీ, వారిలో కొందరుగానీ, పరమ సత్యాన్ని తెలుసుకున్నారా లేదా అన్న విచికిత్స నీకు అనవసరం. నీకు ధమ్మమేమిటో చెబుతాను శ్రద్ధగావిను. మనసు పెట్టి విను" అన్నారు.

11. "అలాగే దేవా" అన్నాడు సుభద్దుడు. అప్పుడు తధాగతుడు ఇలా చెప్పారు:

12. "ధమ్మ మార్గమేదైనప్పటికీ, అందులో అష్టాంగ మార్గం లేకపోతే ఏ శ్రమణకుడూ కనిపించడు. అది ఏ ధమ్మమైనప్పటికీ అందులో అష్టాంగ మార్గం ఉంటే అందులో శ్రమణుడు కనిపిస్తారు.

13. "నా ధమ్మమార్గంలో అష్టాంగమార్గముంది. ఈ ధమ్మంలో నాలుగు రకాల శ్రమణులుంటారు. ఇతర మార్గాలలో శ్రమణుల స్థాయి వారే వుండరు. అయితే సుభద్దా, యీ మార్గంలో భిక్షు సోదరులంతా సక్రమమమైన జీవనాన్ని నడిపితే ఈ ప్రపంచంలో అరిహతులకు లోటుండదు.

14. "నేను సన్మార్గన్వేషణ ప్రారంభించినప్పుడు నా వయస్సు ఇరవై తొమ్మిదేళ్ళు.

15. "ప్రాపంచిక జీవితాన్ని విడనాడి సద్ధమ్మసాధన ఆరంభించి యేభై ఏళ్ళకాలం గడిచిపోయింది."

16. "మీ నుంచి అద్భుతమైన మాటలు విన్నాను" అన్నాను సుభద్దుడు.

17. "పతనమైన దాన్ని ఉద్ధరించినట్టు, నిగూఢమైన దాన్ని బహిరంగ పరచినట్టు, దారి తప్పిన వారికి సరి అయిన దారి చూపినటు, చీకటిలో వెలుగు పరిచి దృష్టిని సార్ధకం

18. "భగవానుని నుంచి ఇప్పుడే సత్యాన్ని తెలుసుకున్నాను. సత్యాన్ని, ధర్మాన్ని అనుసరించేందుకు ఆయన్ని శరణు వేడుతున్నాను."

19. "ఇతర ధర్మాలనుండి ఈ ధమ్మంలోకి వచ్చేవారు నాలుగు మాసాల పాటు శిక్షణ పొందవలసి వుంటుంది సుభద్దుడా!"

20. "అదే నియమమైతే అలాగే శిక్షణ పొందుతాను."

21. మనుషులలో విశిష్టతా విభేదాలను నేను అర్థం చేసుకోగలను. ఆనందా, ఈ వ్యక్తికి వెంటనే దీక్ష ఇచ్చి భిక్షు సంఘలో చేర్చుకో" అన్నారు భగవానుడు.

22. "అలాగే భగవానుడా" అని ఆనందుడు బదులిచ్చారు.

23. "మిత్రమా ఆనంధుడా, ఈనాడు ధర్మ దీక్ష ఇచ్చి ఎందరినో భిక్షుసంఘంలో చేర్చుకుంటున్న నీవు భగవానుడి ద్వారానే స్వయంగా దీక్ష పొందగలగడం నీ అదృష్టం" అన్నాడు సుభద్దుడు.

24. "నీ విషయంలో కూడా అది వర్తిస్తుంద"న్నాడు ఆనందుడు.

25. ఆ విధంగా సంచారి అయిన సుభద్దుడు భగవానుని ద్వారానే భిక్షు సంఘంలో చేరాడు. భగవానుడే స్వయంగా దీక్ష ఇచ్చిన వారిలో సుభద్దుడు చివరివాడు.

# 3. తుది ప్రవచనాలు

1. పూజ్య ఆనందునితో భగవానుడు అన్నారు.

2. "మా బోధకుడు గతించి పోయాడు, అతని మాటలిక వినలేమని నీవు భావించవచ్చు. కాని, నీ వలా అనుకోరాదు ఆనందా, నేను బోధించిన ధమ్మము, వర్థిల్ల జేసిన మార్గమే నా తరువాత నీకు బోధకులు"

3. "ఆనందా, ఇప్పుడు భిక్షుసోదరులు పరస్పరం మిత్రమా అని సంబోధించుకుంటున్నారు. నా అనంతరం ఈ పద్ధతి కొనసాగరాదు. పెద్దవాడైన భిక్షువు యువ భిక్షువును పేరు పెట్టిగానీ, గణం పేరుతోగానీ, మిత్రమా అని కానీ పిలవవచ్చు. కానీ ఆనందా, యువభిక్షువు పెద్దవారైన భిక్షువులను ప్రభూ అని గానీ పూజ్యుడా అని గానీ పిలవాలి."

4. "అలాగే, సంఘం కోరిన పక్షంలో స్వల్ప ఆరోపణలపై విచారణను నా అనంతరం విరమించుకోవచ్చు.

5. "చెన్నుడి సంగతి నీకు తెలుసు ఆనందా ! అతనెంత పిడివాదో, వికల మనస్కుడో, క్రమ బద్ధత లేనివాడో...."

6. "నా అనంతరం అతనికి తీవ్రమైన శిక్ష విధించండి, ఆనందా"

8. "సోదర చెన్నుడు ఏం మాట్లాడినా దాన్ని తిరిగి పేర్కొనరాదు, ఖండించరాదు. సోదరగణానికి బోధించరాదు. అతనిని ఏకాకిని చేయండి. అతను దారికి వస్తాడు."

9. ఆ తర్వాత భగవానుడు సోదంగణాన్ని ఉద్దేశించి ప్రసంగించారు.

10. "సోదరులారా! బుద్ధుని గురించికాని, నియితి గురించి కానీ, సంఘం గురించి కానీ, మార్గం గురించి కానీ, మార్గానుసరణం గురించి కానీ, ఎవరి మనస్సుల్లోనైనా సంశయం గానీ, గంద్రగోళం కానీ ఉన్నట్టయితే ఇప్పుడే అడగండి. "మన బోధకుడు మన ఎదురుగానే వున్నాడు, అయినా అప్పుడు ఆయన్ని ఈ ప్రశ్న వేయలేకపోయామే" అని తరువాత పశ్చాత్తాపపడవద్దు"

11. ఆ మాటలు విన్న సోదరగణం బదులు పలకలేదు.

12. భగవానుడు అదే మాటలలో రెండోసారి, మూడోసారి ప్రశ్నించారు. అయినా భిక్షువులు మౌనంగానే ఉన్నారు.

13. అప్పుడు ఆయనిలా అన్నారు : "బోధకుడనే గౌరవంతో మీరు అడగడం లేదు. సరే, ఓ మిత్రుడిగా నైనా అడగండి సోదరులారా!"

14. అప్పుడు కూడా భిక్షు సోదరులు నిశ్శబ్దంగానే ఉన్నాయి.

15. అప్పుడు పూజ్య ఆనందుడు ఆశ్చర్యాతిరేకంతో భగవానునితో ఇలా అన్నాడు "ఆశ్చర్యం భగవానుడా ! అద్భుతం ఇదిదేవా! సోదరగణంపై నాకు అమిత విశ్వాసం ఏర్పడింది. బుద్ధుని గురించి కానీ, ధమ్మం గురించి కానీ, సంఘం గురించి కానీ, మార్గం గురించి కానీ, ఘార్గాను సరణం గురించి కానీ సోదరుల్లో ఒక్కరికి కూడా సందేహంకానీ, సందిగ్ధత కానీ లేవు!"

16. "నువ్వు విశ్వాసంతో మాట్లాడుతున్నావు, ఆనందా! కానీ తథాగతునికి వాస్తవం తెలుసును. ఈ అయిదు వందల మంది భిక్షుక సోదరులలోనూ ఎటువంటి సందేహం కానీ, సందిగ్ధతగానీ లేవు. వీరిలో ఎవరైనా వెనుకబడి ఉన్నప్పటికీ అతను కూడా ప్రవాహానికి ఎదురీదగలవాడు. అతను మునిగిపోడు. అత్యున్నత జ్ఞానాన్ని అందుకుంటాడు."

17. తరువాత భగవానుడు సోదరులతో ఇలా అన్నారు:

18. "సోదరులారా, వినండి సమ్మిశ్రమాలన్నీ నశించక తప్పదనే మాటను మీకు గుర్తుచేస్తున్నాను. దీనినెన్నడూ మరువకండి."

19. అవె భగవానుని తుది ప్రవచనాలు.

## 4. ఆనందుని దుఃఖం

1. వయసు పైబడుతున్నందున భగవానుడికి ఒక సొంత సహాయకుడి అవసరం కలిగింది.

ఎంచుకున్నాడు. భగవానుడి నిర్యాణం వరకు ఆనందుడే సకల సపర్యలు చేశాడు.

3. ఆనందుడు కేవలం సహాయకుడు మాత్రమే కాదు. ఆయనకు నిరంతర సన్నిహిత సహచరుడిగా మెలిగాడు.

4. భగవానుడు కుశినారలో సాలవృక్షాల నడుమ విశ్రమించినప్పుడు, తనకు తుది ఘడియలు సమీపించాయని గుర్తించి, ఆనందుని ఆంతరంగికునిగా భావించాలనుకున్నారు.

5. ఆనందుని పిలిచి భగవానుడు ఇలా చెప్పారు. "నేటి రాత్రి మూడో ఝాములో, కుశినారలోని ఉప్పవనంలో సాల వృక్షాల జంట నడుమ తథాగతుని అవసానం సంభవిస్తుంది."

6. భగవానుడు చెప్పినది విని పూజ్య ఆనందుడు: "అనుగ్రహించు దేవా, ఓ పవిత్రమూర్తీ, బహుజన సుఖార్థమై, ప్రపంచంపై కరుణతో దేవ మానవ సంక్షేమం కోసం కలకాలం జీవిస్తానని మాట ఇవ్వండి" అని ఆక్రోశించాడు.

7. పూజ్య ఆనందుడు మూడుసార్లు అలా అభ్యర్థించాడు. "చాలు ఆనందా, చాలు, తథాగతుడిని బతిమాలవద్దు. కాలం మారిపోయింది." భగవానుడి సమాధానం.

8. "ఆనందా! నేనిప్పుడు వృద్ధుణ్ణి. వయసు పండిపోయింది. నా యాత్ర ముగియ నున్నది. నేను గడప వలసిన కాలం గడిచిపోయింది. ఎనభై ఏళ్లు జీవించాను. శిథిలమైన బండిని విసర్జించినట్టే తథాగతుని కాయం కూడా విసర్జితం కావలసి వుంది." అన్నాడు భగవానుడు. ఆ మాటలు విన్న ఆనందుడు అక్కడినుంచి వెళ్ళిపోయాడు.

9. ఆనందుడు లేకపోవడం చూసి భగవానుడు సోదర గణాన్ని"ఆనందుడేడీ?" అని అడిగాడు. పూజ్య ఆనందుడు విలపిస్తున్నాడని వారు బదులిచ్చారు.

10. అప్పుడు భగవానుడు ఒక భిక్షువును పిలిచి - "వెళ్లి ఆనందుడిని రమ్మన్నానని చెప్పు, సోదరా ఆనందా, బోధకుడు పిలుస్తున్నాడని చెప్పు" అని అన్నాడు.

11. "అలాగే దేవా" అన్నాడా సోదరుడు.

12. అప్పుడు ఆనందుడు వచ్చి భగవానుడి ప్రక్కన యథాస్థానంలో కూర్చున్నాడు.

13. భగవానుడు ఆనందునితో ఇలా చెప్పాడు: "ఆపు, ఆనందా, ఏడవ వద్దు. మనకెంతో సన్నిహితము, ప్రియము అయిన వాటినుంచి మనం ఎడబాయవలసి వస్తుందని, వాటిని వదలి వెళ్ళ వలసి వస్తుందని, వాటి నుంచి దూరం కావలసి వస్తుందని నేను గతంలో చాలా సార్లు చెప్పాను కదా!

14. "ఆనందా, చాలా కాలంగా నువ్వు ప్రేమ చేత కరుణ చేత, మంచితనం వల్ల నాకు ఆప్తుడవైనావు. చెప్పలేనంత ఆప్తుడవైనావు.

ఇంద్రియ మోహం నుంచి, నేను నాది అనే బంధం నుంచి, భ్రమ నుంచి విముక్తుడవు అవుతావు."

16. భిక్షు సోదరుల నుద్దేశించి "సోదరులారా, ఆనందుడు జ్ఞాని" అన్నాడు భగవానుడు.

17. తథాగతుడిని దర్శించడానికి ఏది తగిన సమయమో, సంఘంలోని సోదర సోదరులు ఎప్పుడు తథాగతుని దర్శించాలో, సామాన్య స్త్రీ పురుషులు, రాజులు, మంత్రులు, ఇతర బోధకులు వారి అనుయాయులు తథాగతుని ఎప్పుడు కలుసుకోవాలో ఆనందునికి తెలుసు.

18. "సోదరులారా! ఆనందునిలో ఈ నాలుగు ప్రత్యేకతలున్నాయి.

19. "ఆనందుని అందరూ ఇష్టపడతారు. ఆనందుని చూసిన వారందరూ ఆనందిస్తారు. ఆనందుడు మాట్లాడితే ఆనందిస్తారు. ఆనందుడు మౌనంగా ఉంటే వారు మథన పడతారు."

20. తరువాత ఆనందుడు మళ్ళీ తథాగతుని నిర్యాణం ప్రస్తావన తెచ్చాడు. "ఈ అడవి మధ్యలో ఈ చిన్న పట్టణంలో భగవానుడు నిర్యాణం చెందరాదు, భగవానుడి కోసం చంప, రాజగ్రహ, శ్రావస్తి, సాకేత, కోశాంబి, వారణాసి వంటి మహానగరాలున్నాయి. భగవానుడు నిర్యాణం కోసం వాటిలో ఒకదానిని ఎంచుకోవాలి" అని అన్నాడు.

21. "అలా అనకు ఆనందా, అలా అనకు. ఈ కుశినారయే కేశవటి పేరిట మహా సదస్సున (మహా సుదర్శన) అనే రాజునకు రాజధానిగా ఉండేది."

22. ఆ తరువాత బుద్ధుడు ఆనందునికి రెండు హెచ్చరికలు చేశారు.

23. చుందుడు వడ్డించిన భోజనం కారణంగానే భగవానుడు మరణించాడన్న నమ్మకం ప్రచారం కాకుండా చూడమని ఆయన ఆనందుడికి చెప్పాడు. ఆ ప్రచారం కారణంగా చుందుడు ఇబ్బంది పడే అవకాశం వుందని, ప్రజల్లో ఆ అభిప్రాయం ఏర్పడకుండా జాగ్రత్త పడమని చెప్పారు.

24. భగవానుడు కుశినార వచ్చాడని, ఈ రాత్రి ఆఖరు ఝామున నిర్యాణం చెందనున్నాడని మల్లులకు తెలియ జేయమన్నారు.

25. "తథాగతుడు మాగ్రామంలోనే నిర్యాణం చెందినప్పటికీ ఆ విషయం మాకు ముందుగా చెప్పి తుది దర్శన భాగ్యం కలుగ జేయలేదెందుకని మల్లులు నిన్ను నిందించే అవకాశం ఇవ్వకు"

26. ఆ తరువాత పూజ్య అనురుద్ధ, పూజ్య ఆనందుడు ధార్మిక ప్రసంగాలలో కాలం గడిపారు.

27. ముందే చెప్పినట్టు భగవానుడు ఆ రాత్రి మూడవ ఝామున తుది శ్వాస విడిచాడు.

రోదించారు. కొందరు కుప్పకూలిపోయారు. "భగవానుడు అప్పుడే అస్తమించాడా, ఇంత స్వల్ప కాలంలోనే నిత్య సంతోషి మమ్ములను వదిలి వెళ్ళాడా, అప్పుడే ప్రపంచం నుంచి వెలుగు అంతరించిందా?" అంటూ వారు విలపించారు.

29. వైశాఖ పూర్ణిమ రోజున అర్ధరాత్రి భగవానుడు కన్ను మూసారు. అది క్రీస్తుపూర్వం **483**వ సంవత్సరం.

30. ఆ సన్నివేశం పాళీ గ్రంథంలో ఇలా వర్ణితమైంది.

"దివా తపతి అదిక్కో
రాతిం అభాతి చందమా;
సన్నద్ధో కతియోతపతి
ఝాయా తపతి బ్రహమణో;
అత్తా సబ్బాయనీ అహోరాత్తాయిన్
బుద్ధో తపతి తేజసా"
(అనగా)

31. "సూర్యుడు పగలు మాత్రమే ప్రకాశిస్తాడు. చంద్రుడు రాత్రివేళలో కాంతులు వెదజల్లుతాడు. యోధుడు సాయుధుడైనప్పుడే ప్రకాశిస్తాడు. బ్రాహ్మణుడు ధ్యానసమాధిలో ఉన్నపుడే కాంతి వంతంగా కనిపిస్తాడు. కాని బుద్ధుడు రాత్రి, పగలు ప్రకాశిస్తాడు"

32. "బుద్ధుడు నిస్సంశయంగా మొత్తం ప్రపంచానికే వెలుగు"

## 5. మల్లుల సంతాపం, ఒక భిక్షువు సంతోషం

1. భగవానుడు కోరినట్లే ఆనందుడు వెళ్ళిమల్లులకు మరణవార్త తెలియ జేశాడు.
2. ఆ వార్త విన్న మల్లులు, వారి భార్యలు, యువతీయువకులు ఎంతో దుఃఖ పడ్డారు.
3. వారిలో కొందరు జుత్తు విరబోసుకొని చేతులు జాపి రోదిస్తూ కుప్పగూలారు.
4. తరువాత మల్లులు సపరివారంగా భగవానుని అంతిమ దర్శనార్థం ఉపవనంలోని సాల వృక్షాల వద్దకు చేరుకున్నారు.
5. అప్పుడు పూజ్య ఆనందులు ఇలా యోచించాడు "కుశినార మల్లులను ఒకరి వెనుక ఒకరిని అనుమతిస్తూ పోతే భగవానుడి భౌతికకాయానికి శ్రద్ధాంజలి ఘటించడానికి చాలా సమయం పడుతుంది."
6. కాబట్టి వారిని బృందాలుగా, కుటుంబాలుగా దర్శనార్థం పంపాలని నిర్ణయించాడు. ప్రతి కుటుంబం భగవానుడి పాదాలచెంత ప్రణమిల్లి కదులుతున్నారు.

7. అదే సమయంలో పూజ్య మహాకశ్యపుడు పవ నుంచి కుశినార రహదారిలో ప్రయాణిస్తున్నారు.

8. దిగంబరి అయిన సన్యాసి కుశ నగరం నుంచి పవ వెడుతూ వారికి ఎదురయ్యాడు.

9. నగ్న సన్యాసిని దూరం నుంచే పూజ్య మహా కశ్యపుడు గమనించాడు. ఓ మిత్రమా! మా బోధకుడిని ఎరుగుదువా? "గౌతమ శ్రమణుడు నిర్వాణం చెంది వారం రోజులైనది."

10. ఎరుగుదును మిత్రమా! గౌతమ శ్రమణుడు నిర్వాణం చెంది వారంరోజులైనది."

11. ఆ వార్త వినగానే సోదరగణం దుఃఖ సాగరంలో మునిగి పోయారు. రోదించ సాగారు.

12. వారిలో సుభద్దుడనే వృద్ధ భిక్షువు కూడా ఉన్నాడు.

13. అతను సోదరగణంతో ఇలా అన్నాడు: "వద్దు సోదరులారా! విలపించకండి. మహా శ్రమణుని నుంచి మనకు విముక్తి దొరికింది. ఇది చెయ్యాలి, ఇది చెయ్య వద్దు అన్న మాటలు విని విని మనం విసుగు చెందేవారం. ఇప్పుడో మనమేం చెయ్యాలంటే అది చెయ్యవచ్చు. ఇష్టం లేనిది మానవచ్చు. అతని మరణం మంచిదే కద! ఎందుకు రోదన, ఎందుకు విలాపం, ఇదో శుభవార్త!"

14. పై మాటలను బట్టి భగవానుడు ఎంత ఉన్నతమైన, కఠినమైన క్రమశిక్షణాసక్తుడో అర్థమవుతుంది.

## 6. అంత్యక్రియలు

1. "తథాగతుని మృతకళేబరానికి ఏ విధంగా అంత్య క్రియలు జరపాలి". అని కుశినార వాసులైన మల్లులు పూజ్య ఆనందుని ప్రశ్నించారు.

2. "రాజాధిరాజుకు ఏ విధంగా అంత్య క్రియలు జరుపుతారో తథాగతునికి కూడా ఆ విధంగానే జరపాలి" సమాధానమిచ్చాడు ఆనందుడు.

3. "రాజాధి రాజుకు అంత్యక్రియులు ఏ విధంగా జరుపుతారు?"

4. "రాజాధిరాజు శరీరాన్ని కొత్త వస్త్రంలో చుడతారు. తరువాత దాన్ని పత్తి ఉన్నిలో చుడతారు. మళ్ళీ దాన్ని కొత్త వస్త్రంలో చుడతారు. ఆ విధంగా అయిదు వందల పొరలు వచ్చేట్టు చుడతారు. తరువాత ఆ శరీరాన్ని ఇనప నూనె పీపాలో ఉంచి మరో ఇనుప నూనె పీపాతో దాన్ని కప్పుతారు. తరువాత రకరకాల సామాగ్రితో చితిని పేరుస్తారు. రాజాధిరాజుకు అంత్య క్రియలు జరిపే విధానం అది" అని వివరించాడు ఆనందుడు.

5. "అలాగే చేద్దాం" అన్నారు మల్లులు.

6. "భగవానుడి అంత్య క్రియలకు ఈ రోజు సమయం మించి పోయింది కదా, రేపు

చేద్దామని" అన్నారు మల్లులు.

7. కుశినార వాసులైన మల్లులు తమ పని వారితో "తథాగతుని అంత్యక్రియల కోసం సుగంధ ద్రవ్యాలు, పూల మాలలు, కుశినారలోని వాద్యకారులను తీసుకురమ్మ"ని చెప్పారు.

8. తథాగతునికి గౌరవ సూచకంగా శ్రద్ధాంజలి ఘటించారు. నృత్యాలతో, గానంతో, సంగీతంతో, పూల మాలలతో, సుగంధాలతో, పందిళ్ళతో, రకరకాల అలంకరణలతో నివాళులర్పిస్తుండగా రెండు రోజులు గడిచి పోయాయి. మూడవ రోజు, నాల్గవ రోజు, ఐదో రోజు, ఆరో రోజు కూడా గడిచి పోయింది.

9. ఏడో రోజున కుశినార వాసులైన మల్లులు "భగవానుడి భౌతిక కాయాన్ని తీసుకుని పోయి అంత్య క్రియలు చేద్దామని" అనుకున్నారు.

10. మల్లులలో పెద్దలైన ఎనిమిది మంది తల స్నానం చేసి, కొత్త వస్త్రాలు ధరించి శవవాహకులుగా సిద్ధమయ్యారు.

11. కుశినార తూర్పున ఉన్న మల్లుల ఆలయం "మకుట బంధనం" వద్దకు భగవానుడి మృత దేహాన్నిమోసుకు పోయి అక్కడ చితిపై ఉంచి నిప్పంటించారు.

12. కొద్ది సేపటికి భగవానుడి భౌతిక కాయం మంటల్లో బూడిదగా మారింది.

## 7. అస్థికల కోసం వివాదం

1. భగవానుడి శరీరం దహనమైన తరువాత, కుశినార మల్లులు చితా భస్మాన్ని, అస్థికలను పోగు చేసి వారి సభాలయ వేదికపైకి చేర్చారు. బల్లేలు, విల్లంబులు ధరించి అస్థికలను ఎవరూ దొంగిలించ కుండా కాపలా కాశారు.

2. సుగంధ ద్రవ్యాలతో, పూమాలలతో, సంగీత గాన నృత్యాలతో శ్రద్ధాంజలి ఘటిస్తూ ఏడు రోజులు గడిపారు.

3. భగవానుడు కుశినారలో నిర్యాణం చెందాడన్న వార్త మగధ రాజైన అజాత శత్రువుకు తెలిసింది.

4. భగవానుడి అవశేషాలలో కొంత భాగాన్ని ఇవ్వ వలసిందిగా ఆయన మల్లులను కోరుతూ ఓ దూతను పంపాడు.

5. వైశాలికి చెందిన లిచ్ఛవీయల నుంచి కపిల వస్తు శాక్యుల నుంచి, అట్ట కప్ప (అర్థ కర్ప)కు చెందిన బులియుల నుంచి, రామగామకు చెందిన కొలియుల నుంచి, పవకు చెందిన మల్లుల నుంచి కూడా అటువంటి అభ్యర్థనలే వచ్చాయి, దూతలు వచ్చారు.

6. వేత దీపానికి చెందిన ఒక బ్రాహ్మణుడు కూడా అస్థికలను కోరాడు.

7. తథాగతుని అస్థికలు కావాలన్న అభ్యర్థనలను విన్న కుశినార మల్లులు -" భగవానుడు

మా గ్రామంలో అస్తమించాడు. ఆయన అస్థికలను మేమెవ్వరికీ ఇవ్వము. అవి మాకే చెందినవి" అన్నారు.

8. పరిస్థితి ఉద్రిక్తంగా మారడం గమనించిన ద్రోణుడనే బ్రాహ్మణుడు జోక్యం చేసుకొని "పూజ్యులారా, నేను చెప్పేది వినండి" అన్నాడు.

9. "సహనశీలం గురించి బుద్ధుడు మనకు బోధించాడు. సర్వోన్నతుడైన ఆయన అస్థికల విషయంలో వివాదపడడం, ఘర్షణలు చెలరేగడం, యుద్ధానికి దారి తీయడం ఉచితం కాదు.

10. "అందరం ఐకమత్యంగా సామరస్యంగా ఈ అవశేషాలను ఎనిమిది భాగాలుగా విభజిద్దాం. అది ప్రతి ప్రాంతానికి వెళ్ళి, వాటిపై స్థూపాలు నిర్మితమై, బుద్ధుడు సర్వత్ర ఆరాధనీయుడయ్యేట్టు చూద్దాం".

11. అందుకు కుశినార వాసులైన మల్లులు అంగీకరించారు. "అయితే ఓ బ్రాహ్మణుడా, నీవే న్యాయంగా వీటిని ఎనిమిది భాగాలుగా విభజించు" అని కోరారు.

12. "అలాగే" నన్నాడు ఆయన.

13. ఆయన భగవానుడి అస్థికలను ఎనిమిది భాగాలు చేశాడు.

14. విభాగం తరువాత ద్రోణుడు, బుద్ధుని శరీరం ఉంచిన పాత్రను తనకిమ్మని, దానిపై స్థూపం నిర్మింపచేస్తానని కోరాడు.

15. మల్లులాయనకు ఆ పాత్రను ఇచ్చారు.

16. ఆ విధంగా భగవానుడి అస్థికల వివాదం, శాంతి సామరస్యాల మధ్య పరిష్కారమైంది.

## 8. బుద్ధునికి విధేయత

1. ఇది శ్రావస్తిలో జరిగిన సంఘటన.

2. ఒక సందర్భంలో అనేక మంది భిక్షువులు కలసి భగవానుని కొక కొత్త వస్త్రం తయారు చేయాలని సంకల్పించారు. అది మూడు మాసాల్లో సిద్ధమవుతుందని భగవానుడు తిరిగి పర్యటన ప్రారంభించే నాటికి అది పనికి వస్తుందని వారి ఆలోచన.

3. ఆ సమయంలో ఇసిదత్తుడు పురాణుడు అనే ఇద్దరు రాజోద్యోగులు రాచకార్యం కోసం సాధుకలో ఉంటున్నారు. భిక్షువులు భగవానుని కొక కొత్త వస్త్రం తయారు చేస్తున్నారనీ, అది మూడు మాసాల్లో సిద్ధం అవుతుందని భగవానుడు అప్పటికి పర్యటన పునః ప్రారంభిస్తాడనీ వారిద్దరికీ తెలియ వచ్చింది.

4. ఇసిదత్తుడు, పురాణుడు ఒక మనిషిని రాజ మార్గంలో నియమించి ఇలా ఆదేశించారు "ఓ సజ్జనుడా! భగవానుడు, అర్హతుడు, సంపూర్ణ సంబుద్ధుడు అయిన వాడు

కనిపించగానే బయల్దేరివచ్చి, మాకు తెలియ చేయి."

5. అతను వెళ్ళి రాజ మార్గంలో రెండు మూడు రోజులు నిరీక్షించగానే రావడం కనిపించింది. ఆయన ఇంకా కొద్ది దూరంలో ఉండగానే ఆ ఇసిదత్తుడు, పురాణులకు చెప్పాడు. "నా ప్రభువు భగవానుడు అర్హతుడ సంబుద్ధుడు అయిన వాడు వస్తున్నాడు. ఇక మీ అభీష్టాలను నెరవే అన్నాడు.

6. ఆ వార్త విన్న రాజోద్యోగులు ఇసిదత్తుడు, పురాణుడు వెంటనే బయలుదేరి దర్శించి వారి అడుగుల్లో అడుగు వేసుకుంటూ అనుసరించ సాగారు.

7. భగవానుడు రహదారి నుంచి దిగి పక్కనే ఉన్న వృక్షం కింద సిద్ధంచేసి ఆసీనుడయ్యారు. రాజోద్యోగులు కూడా ఆయనకు అభివందనం చేసి పక్క ఇలా అన్నారు.

8. "భగవానుడు కోసల ప్రాంతం వెళ్ళనున్నారన్న వార్త విన్నపుడు భగవా దూరంగా వెళ్ళిపోతున్నారు కదా అని వ్యథ చెందాము."

9. "ఆ తరువాత మళ్ళీ శ్రావస్తి నుంచి కోసల ప్రాంతంలో పర్యటించడా దేరినప్పుడు కూడా భగవానుడు మాకు దూరంగా వెళుతున్నారని వేదన

10. "ఆ తరువాత భగవానుడు కోసల నుంచి మల్లుల దగ్గరకు వెడుతున్న నిరాశ నిస్పృహలకు లోనయినాము."

11. "భగవానుడు మల్లుల ప్రాంతం వదిలి వజ్జినుల వద్దకు వెళుతున్నారని, అ మగధకు వెళ్ళనున్నారని తెలిసనప్పుడు మేమెంతో వ్యథ చెందాము.

12. "అయితే భగవానుడు మగధ నుంచి కాశీ దిశగా వస్తున్నారని తెలిసిన మాకు చేరువవుతున్నారు కదా అని ఆనందంతో ఉప్పొంగి పోయాం.

13. "భగవానుడు కాశీ నుంచి ఇటువైపు వస్తున్నారని మగధలో తిరుగాడుతున ఆనందంలో ఉప్పొంగి పోయాము."

14. "కాశి నుంచి వజ్జికి, వజ్జి నుంచి మల్లుల వద్దకు, మల్లుల నుంచి కోసలకు తెలిసి ఆనందంతో ఉప్పొంగి పోయాము."

15. "కోసల నుంచి భగవానుడు శ్రావస్తి పర్యటనకు వస్తున్నారని తెలిసి మేమేమి అనుకున్నామంటే - భగవానుడు మాకు చేరువలో ఉన్నారని

16. "ఆ తరువాత భగవానుడు శ్రావస్తి వచ్చారని, అనాథ పిండకుని ఉంటున్నారని తెలిసినప్పుడు భగవానుడు మా దగ్గరికి వచ్చారు కద ఆనందానికి అవధులు లేవు!

***అనువాదం: జయధీర్ తి***

## ఎనిమిదో అధ్యాయం

# మానవుడిగా సిద్ధార్థ గౌతముడు

మొదటి భాగం - ఆయన వ్యక్తిత్వం

రెండో భాగం - ఆయన మానవత్వం

మూడో భాగం - ఆయన ఇష్టాయిష్టాలు

కనిపించగానే బయల్దేరివచ్చి, మాకు తెలియ చేయి."

5. అతను వెళ్ళి రాజ మార్గంలో రెండు మూడు రోజులు నిరీక్షించగానే భగవానుడు రావడం కనిపించింది. ఆయన ఇంకా కొద్ది దూరంలో ఉండగానే అతను వెళ్ళి ఇసిదత్తుడు, పురాణులకు చెప్పాడు. "నా ప్రభువు భగవానుడు అర్హతుడు, సంపూర్ణ సంబుద్ధుడు అయిన వాడు వస్తున్నాడు. ఇక మీ అభీష్టాలను నెరవేర్చుకోండి " అన్నాడు.

6. ఆ వార్త విన్న రాజోద్యోగులు ఇసిదత్తుడు, పురాణుడు వెంటనే బయలుదేరి భగవానుని దర్శించి వారి అడుగుల్లో అడుగు వేసుకుంటూ అనుసరించ సాగారు.

7. భగవానుడు రహదారి నుంచి దిగి పక్కనే ఉన్న వృక్షం కింద సిద్ధంచేసిన ఆసనంపై ఆసీనుడయ్యారు. రాజోద్యోగులు కూడా ఆయనకు అభివందనం చేసి పక్కన కూర్చుని ఇలా అన్నారు.

8. "భగవానుడు కోసల ప్రాంతం- వెళ్ళనున్నారన్న వార్త విన్నపుడు భగవానుడు మాకు దూరంగా వెళ్ళిపోతున్నారు కదా అని వ్యథ చెందాము."

9. "ఆ తరువాత మళ్ళీ శ్రావస్తి నుంచి కోసల ప్రాంతంలో పర్యటించడానికి బయలు దేరినప్పుడు కూడా భగవానుడు మాకు దూరంగా వెళుతున్నారని వేదన చెందాము."

10. "ఆ తరువాత భగవానుడు కోసల నుంచి మల్లుల దగ్గరకు వెడుతున్నపుడు మేము నిరాశ నిస్పృహలకు లోనయినాము."

11. "భగవానుడు మల్లుల ప్రాంతం వదిలి వజ్జినుల వద్దకు వెళుతున్నారని, అక్కడి నుంచి మగధకు వెళ్ళనున్నారని తెలిసనప్పుడు మేమెంతో వ్యథ చెందాము.

12. "అయితే భగవానుడు మగధ నుంచి కాశీ దిశగా వస్తున్నారని తెలిసినప్పుడు తిరిగి మాకు చేరువవుతున్నారు కదా అని ఆనందంతో ఉప్పొంగి పోయాం.

13. "భగవానుడు కాశీ నుంచి ఇటువైపు వస్తున్నారని మగధలో తిరుగాడుతున్నారని మేము ఆనందంలో ఉప్పొంగి పోయాము."

14. "కాశి నుంచి వజ్జికి, వజ్జి నుంచి మల్లుల వద్దకు, మల్లుల నుంచి కోసలకు వస్తున్నారని తెలిసి ఆనందంతో ఉప్పొంగి పోయాము."

15. "కోసల నుంచి భగవానుడు శ్రావస్తి పర్యటనకు వస్తున్నారని తెలిసి ఆనందంతో మేమేమి అనుకున్నామంటే - భగవానుడు మాకు చేరువలో ఉన్నారని!

16. "ఆ తరువాత భగవానుడు శ్రావస్తి వచ్చారని, అనాధ పిండకుని జితవనంలో ఉంటున్నారని తెలిసినప్పుడు భగవానుడు మా దగ్గరికి వచ్చారు కదా అని మా ఆనందానికి అవధులు లేవు!

*అనువాదం: జయధీర్ తిరుమల రావు*

# ఎనిమిదో అధ్యాయం

## మానవుడిగా సిద్ధార్థ గౌతముడు

మొదటి భాగం - ఆయన వ్యక్తిత్వం

రెండో భాగం - ఆయన మానవత్వం

మూడో భాగం - ఆయన ఇష్టాయిష్టాలు

# మొదటి భాగం

## ఆయన వ్యక్తిత్వం

1. ఆయన రూపు రేఖలు
2. కళ్ళారా చూసిన వారు చేసిన అభివర్ణన
3. ఆయన మార్గదర్శక దక్షత

# I. ఆయన రూపు రేఖలు

1. ఏ విధంగా చూసినా భగవానుడు సుందరుడు.

2. అతనొక మూర్తీభవించిన మేరు శిఖరం. ఆజానుబాహువు, ధృఢకాయుడు, ప్రసన్న వదనుడు.

3. ఆయన దీర్ఘ బాహువులు, సింహగమనం, వృషభనయనాలు, చక్కదనం, పసిడి వన్నె, విశాల వక్షం అందరినీ ఆకర్షించేవి.

4. ఆయన కనుబొమ్మలు, ఆయన ఫాలభాగం, ఆయననోరు, కన్నులు, శరీరము, చేతులు, పాదాలు, నడక - అన్నీ చూపరులను కట్టిపడేసేవి.

5. ఎవరాయనను చూసినా ఆ రాజసానికీ, బలిష్టతకీ, స్నిగ్ధ సౌందర్యానికీ ముగ్ధులయ్యారు.

6. ఎటో వెళుతూ ఆయన్ని చూసిన వారు అలాగే స్థాణువులై నిలబడి పోయేవా. నిలబడి ఉన్న వారు వెంబడించి నడిచేవారు. నడుస్తున్న వారు వేగంగా పరుగిడి పోయేవారు. కూర్చుని ఉన్నవారు చివాలున లేచి నిలబడేవారు.

7. ఆయనను కలిసిన వారు కొందరు ముకుళిత హస్తాలతో, కొందరు శిరఃప్రణామాలతో, కొందరు ఆప్యాయ సంబోధనలతో గౌరవించే వారు. ఆయనకు ప్రణతులర్పించకుండా ఒక్కరూ వెళ్ళేవారు కాదు.

8. తథాగతుని అందరూ ప్రేమించే వారు. గౌరవించే వారు.

9. స్త్రీలు, పురుషులు కూడా ఆయన మాటలు వినేందుకు సంసిద్ధులుగా ఉండే వారు.

10. ఆయన కంఠస్వరం మధురంగా ఉండేది. కంచు మోగినట్లు గంభీరంగా ఉండేది. ప్రేమ, ప్రకంపన ప్రతిధ్వనించేవి. ఫలితంగా ఆయన వాక్కు దివ్య సంగీతం వలె వినిపించేది.

11. ఆయన కంఠం శ్రోతలను ఆకట్టుకునేది, ఆయన చూపులు సంభ్రమం కలిగించేవి.

12. ఆయన రూపు రేఖలే చాలు - ఆయన్ని ఒక ధీర నాయకునిగా ఒక దివ్యునిగా తోపింపచేసేవి.

13. ఆయన గొంతు విప్పితే చాలు శ్రోతలు మూగేవారు.

14. ఆయనేం చెప్పాడనేది ప్రధానం కాదు. విన్న వారందరూ ఉద్వేగ భరితులయ్యేవారు, ఆయన ఆత్మ శక్తికి అవనతులయ్యే వారు.

15. ఆయన చెప్తున్నది సత్యం మాత్రమే కాదు, ముక్తి మార్గం కూడానని శ్రోతల మనస్సులో అభిప్రాయం ఏర్పడేది.

16. బానిసలను స్వేచ్ఛా జీవులను చేసే సత్యమేదో శ్రోతలు ఆయన పలుకుల్లో గ్రహించే వారు.

17. ఆయన స్త్రీ పురుషులతో ప్రసంగిస్తున్నపుడు వారు ఆయన ప్రశాంత రూపాన్ని ఆరాధనగా దర్శించి స్ఫూర్తి పొందేవారు. ఆయన ప్రేమాస్పద కంఠ స్వరం వారిని మంత్ర ముగ్ధులను చేసేది.

18. అంతటి మహా వ్యక్తిత్వమే ఆయనకు లేనట్టయితే - దోపిడి దొంగ అంగుమాలుని, నరమాంస భక్షకుడు అతవిని మార్చగలిగే వారా? రాజు ప్రసేన జిత్తుకు, అతని మహారాణి మల్లికకు మధ్య ఒకే ఒక్క మాటతో సయోధ్య కుదర్చగలిగే వారా? వారిని శాశ్వత అనుయాయులుగా చేసుకోగలిగే వారా? ఆయన వ్యక్తిత్వమంత మోహనమైనది.

## 2. కళ్ళారా చూసిన వారు చేసిన అభివర్ణన

1. తథాగతుని గురించిన ఈ జనశ్రుతికి ఆయన జీవితకాలంలో కలుసుకున్న ప్రత్యక్ష సందర్శకుల మాటలు సాక్షీభూతంగా ఉన్నాయి.

2. తథాగతుని స్వయంగా దర్శించ గలిగిన వారిలో సాలుడను బ్రాహ్మణుడు ఒకడు. భగవానుడి దర్శనానంతరం ఆయనను స్తుతిస్తూ సాలుడు కొన్ని భావాలు వెలిబుచ్చాడు.

3. భగవానుడి సన్నిధికి వచ్చి అభివాదం చేసి ఆసీనుడై, ఆయను ఆ పాద మస్తకం అవలోకించి మహానుభావులలో మాత్రమే కనిపించే ముప్పై రెండు ముద్రలను అన్వేషించాడు.

4. ఆ ముద్రలు తథాగతునికి ఉన్నాయని నిర్ధారించుకో గలిగినా, సాలుడికి ఆయన బుద్ధుడగునో కాదో తెలియ లేదు. ఒక వ్యక్తి ఔన్నత్యాన్ని ధ్రువ పరచుకోవాలంటే ఆ వ్యక్తి విశిష్టతలను స్తుతిస్తే వెల్లడి కాగలదని తలపండిన బ్రాహ్మణులు, పరమ గురువులు, అరిహంతులు, సంబుద్ధులు చెప్పగా విన్న సాలుడు తథాగతుని కీర్తించడం ప్రారంభించాడు.

5. "సర్వాంగ సుందరుడా, సజ్జనుడా, భగవానుడా, జనరంజకుడా, పసిడి వన్నెలో మెరిసి పోయేవాడా; మెరిసే పలు వరుస గలవాడా, శక్తి వంతుడా - మహోన్నతుడా, సల్లక్షణాలు కలవాడా!

6. "నిర్మల నయనాలతో, దివ్య సుందర విగ్రహంతో, సూర్యతేజంతో, ఆహ్లాద వర్తనతో, స్వర్ణ ఛాయతో అలరాడే వాడా, ఎందుకు నీ సౌందర్యాన్ని ఇలా ద్రిమ్మరిగా వ్యర్థం చేసుకుంటావు?

7. "సముద్రాలే అవధిగా పాలించ గలవాడివి, రాజులందరూ నీకు అధీనులై ఏలగలిగిన చక్రవర్తివి, నువ్వు రాజాధి రాజువి."

8. ఆనందుడొక సారి తథాగతుని మేని ఛాయను వర్ణిస్తూ, ఆయన బంగారు వస్త్రాలు ధరిస్తే అవి వెలవెల బోతాయని అన్నాడు.

9. వ్యతిరేకులే ఆయనను సుందరాకారుడని కీర్తించారంటే ఆశ్చర్యమేముంది?

## 3. ఆయన మార్గదర్శక దక్షత

1. భిక్షు సంఘానికి అధికారికంగా అధిపతి ఎవరూ లేరు. భగవానుడికి సంఘంపై ఏ అధికారమూ లేదు. సంఘం స్వయం పాలిత వ్యవస్థ.

2. అయితే, సంఘంలోనూ సంఘ సభ్యులలోనూ భగవానుడి స్థానమేమిటి?

3. ఈ విషయంలో భగవానుడి సమకాలికులైన సకుల్‌దాయి, ఉదయ్‌ల ఉదంతాలు చూద్దాం.

4. ఒకప్పుడు భగవానుడు రాజగ్రహలోని వెదురు వనంలో బస చేశారు.

5. ఒకరోజు ఉదయాన్నే భగవానుడు పట్నంలో భిక్షాటనకు బయలు దేరాడు. అయితే, భిక్షకు ఇంకా సమయం కాలేదని ఎంచి సకుల్‌దాయి ఉంటున్న బైరాగుల మఠం వెళ్ళాలని అనుకొన్నారు.

6. ఆ సమయంలో అస్తిత్వం, అస్తిత్వ రాహిత్యంపై బిగ్గరగా వాదిస్తున్న బైరాగుల నడుమ సకుల్‌దాయి కూర్చొన్నాడు.

7. తథాగతుని రాకను దూరం నుంచే గమనించి సకుల్ దాయి సహచరులతో ఇలా అన్నాడు: "నిశ్శబ్దంగా ఉండండి, అల్లరి చేయకండి, గౌతమ శ్రమణుడు వస్తున్నాడు. ఆయనకి నిశ్శబ్దం యిష్టం."

8. వారు నిశ్శబ్దం పాటించారు. భగవానుడు వచ్చారు. "భగవానుడికి స్వాగతం. ఎట్టకేలకు మా దగ్గరకు వచ్చారు. దయచేసి ఆసీనులు కండి, ఇదే మీ ఆసనం" అన్నాడు సకుల్‌దాయి.

9. భగవానుడు ఆసీనుడయ్యాడు. వారు ఏ విషయంపై చర్చించుకుంటున్నారని సకుల్‌దాయిని ప్రశ్నించారు.

10. "కాసేపు దాన్నలా ఉండనీయండి - మీకు అది సులభమైన విషయమే" అన్నాడు సకుల్‌దాయి.

11. కొంతకాలం తరువాత సన్యాసులు, బ్రాహ్మణులు, సభాభవనంలో సమావేశమయ్యారు. పలు మతాధిపతులు, సన్యాసులు, ధర్మప్రబోధకులు వర్షాకాలంలో రాజగ్రహలో

15. ఆయన చెప్తున్నది సత్యం మాత్రమే కాదు, ముక్తి మార్గం కూడా అభిప్రాయం ఏర్పడేది.

16. బానిసలను స్వేచ్ఛా జీవులను చేసే సత్యమేదో శ్రోతలు ఆయ వారు.

17. ఆయన స్త్రీ పురుషులతో ప్రసంగిస్తున్నపుడు వారు ఆయ ఆరాధనగా దర్శించి స్ఫూర్తి పొందేవారు. ఆయన ప్రేమాస్ప మంత్ర ముగ్ధులను చేసేది.

18. అంతటి మహా వ్యక్తిత్వమే ఆయనకు లేనట్టయితే - దోపిడి నరమాంస భక్షకుడు అతవిని మార్చగలిగే వారా? రాజు మహారాణి మల్లికకు మధ్య ఒకే ఒక్క మాటతో సయోధ్య కుద శాశ్వత అనుయాయులుగా చేసుకోగలిగే వారా? ఆయన వ్యక్తిత

## 2. కళ్ళారా చూసిన వారు చేసిన ఆ

1. తథాగతుని గురించిన ఈ జనశ్రుతికి ఆయన జీవితకాలం సందర్శకుల మాటలు సాక్షీభూతంగా ఉన్నాయి.

2. తథాగతుని స్వయంగా దర్శించ గలిగిన వారిలో సాలుడను భగవానుడి దర్శనానంతరం ఆయనను స్తుతిస్తూ సా వెలిబుచ్చాడు.

3. భగవానుడి సన్నిధికి వచ్చి అభివాదం చేసి ఆసీనుడై, ఆం అవలోకించి మహానుభావులలో మాత్రమే కనిపించే ము అన్వేషించాడు.

4. ఆ ముద్రలు తథాగతునికి ఉన్నాయని నిర్ధారించుకో గలి బుద్ధుడగునో కాదో తెలియ లేదు. ఒక వ్యక్తి ఔన్నత్యాన్ని ధ్రు వ్యక్తి విశిష్ఠతలను స్తుతిస్తే వెల్లడి కాగలదని తలపండిన గురువులు, అరిహంతులు, సంబుద్ధులు చెప్పగా విన్న సాలుడు ప్రారంభించాడు.

5. "సర్వాంగ సుందరుడా, సజ్జనుడా, భగవానుడా, జనరంజకుడ పోయేవాడా, మెరిసే పలు వరుస గలవాడా, శక్తి వంత సల్లక్షణాలు కలవాడా!

6. "నిర్మల నయనాలతో, దివ్య సుందర విగ్రహంతో, సూర్యతే స్వర్ణ ఛాయతో అలరాడే వాడా, ఎందుకు నీ సౌందర్యాన్ని చేసుకుంటావు?

7. "సముద్రాలే అవధిగా పాలించ గలవాడివి, రాజులందరూ నీకు అధీనులై ఏలగలిగిన చక్రవర్తివి, నువ్వు రాజాధి రాజువి."

8. ఆనందుడొక సారి తథాగతుని మేని ఛాయను వర్ణిస్తూ, ఆయన బంగారు వస్త్రాలు ధరిస్తే అవి వెలవెల బోతాయని అన్నాడు.

9. వ్యతిరేకులే ఆయనను సుందరాకారుడని కీర్తించారంటే ఆశ్చర్యమేముంది?

## 3. ఆయన మార్గదర్శక దక్షత

1. భిక్షు సంఘానికి అధికారికంగా అధిపతి ఎవరూ లేరు. భగవానుడికి సంఘంపై ఏ అధికారమూ లేదు. సంఘం స్వయం పాలిత వ్యవస్థ.

2. అయితే, సంఘంలోనూ సంఘ సభ్యులలోనూ భగవానుడి స్థానమేమిటి?

3. ఈ విషయంలో భగవానుడి సమకాలికులైన సకుల్‌దాయి, ఉదయ్‌ల ఉదంతాలు చూద్దాం.

4. ఒకప్పుడు భగవానుడు రాజగ్రహలోని వెదురు వనంలో బస చేశారు.

5. ఒకరోజు ఉదయాన్నే భగవానుడు పట్నంలో భిక్షాటనకు బయలు దేరాడు. అయితే, భిక్షకు ఇంకా సమయం కాలేదని ఎంచి సకుల్‌దాయి ఉంటున్న బైరాగుల మఠం వెళ్ళాలని అనుకొన్నారు.

6. ఆ సమయంలో అస్తిత్వం, అస్తిత్వ రాహిత్యంపై బిగ్గరగా వాదిస్తున్న బైరాగుల నడుమ సకుల్‌దాయి కూర్చొన్నాడు.

7. తథాగతుని రాకను దూరం నుంచే గమనించి సకుల్ దాయి సహచరులతో ఇలా అన్నాడు: "నిశ్శబ్దంగా ఉండండి, అల్లరి చేయకండి, గౌతమ శ్రమణుడు వస్తున్నాడు. ఆయనకి నిశ్శబ్దం యిష్టం."

8. వారు నిశ్శబ్దం పాటించారు. భగవానుడు వచ్చారు. "భగవానుడికి స్వాగతం. ఎట్టకేలకు మా దగ్గరకు వచ్చారు. దయచేసి ఆసీనులు కండి, ఇదే మీ ఆసనం" అన్నాడు సకుల్‌దాయి.

9. భగవానుడు ఆసీనుడయ్యాడు. వారు ఏ విషయంపై చర్చించుకుంటున్నారని సకుల్‌దాయిని ప్రశ్నించారు.

10. "కాసేపు దాన్నలా ఉండనీయండి - మీకు అది సులభమైన విషయమే" అన్నాడు సకుల్‌దాయి.

11. కొంతకాలం తరువాత సన్యాసులు, బ్రాహ్మణులు, సభాభవనంలో సమావేశమయ్యారు. పలు మతాధిపతులు, సన్యాసులు, ధర్మప్రబోధకులు వర్షాకాలంలో రాజగ్రహలో

15. ఆయన చెప్తున్నది సత్యం మాత్రమే కాదు, ముక్తి మార్గం కూడానని శ్రోతల మనస్సులో అభిప్రాయం ఏర్పడేది.

16. బానిసలను స్వేచ్ఛా జీవులను చేసే సత్యమేదో శ్రోతలు ఆయన పలుకుల్లో గ్రహించే వారు.

17. ఆయన స్త్రీ పురుషులతో ప్రసంగిస్తున్నపుడు వారు ఆయన ప్రశాంత రూపాన్ని ఆరాధనగా దర్శించి స్ఫూర్తి పొందేవారు. ఆయన ప్రేమాస్పద కంఠ స్వరం వారిని మంత్ర ముగ్ధులను చేసేది.

18. అంతటి మహా వ్యక్తిత్వమే ఆయనకు లేనట్టయితే - దోపిడి దొంగ అంగుమాలుని, నరమాంస భక్షకుడు అతనిని మార్చగలిగే వారా? రాజు ప్రసేన జిత్తుకు, అతని మహారాణి మల్లికకు మధ్య ఒకే ఒక్క మాటతో సయోధ్య కుదర్చగలిగే వారా? వారిని శాశ్వత అనుయాయులుగా చేసుకోగలిగే వారా? ఆయన వ్యక్తిత్వమంత మోహనమైనది.

## 2. కళ్ళారా చూసిన వారు చేసిన అభివర్ణన

1. తథాగతుని గురించిన ఈ జనశ్రుతికి ఆయన జీవితకాలంలో కలుసుకున్న ప్రత్యక్ష సందర్శకుల మాటలు సాక్షీభూతంగా ఉన్నాయి.

2. తథాగతుని స్వయంగా దర్శించ గలిగిన వారిలో సాలుడను బ్రాహ్మణుడు ఒకడు. భగవానుడి దర్శనానంతరం ఆయనను స్తుతిస్తూ సాలుడు కొన్ని భావాలు వెలిబుచ్చాడు.

3. భగవానుడి సన్నిధికి వచ్చి అభివాదం చేసి ఆసీనుడై, ఆయను ఆ పాద మస్తకం అవలోకించి మహానుభావులలో మాత్రమే కనిపించే ముప్పై రెండు ముద్రలను అన్వేషించాడు.

4. ఆ ముద్రలు తథాగతునికి ఉన్నాయని నిర్ధారించుకో గలిగినా, సాలుడికి ఆయన బుద్ధుడగునో కాదో తెలియ లేదు. ఒక వ్యక్తి ఔన్నత్యాన్ని ధ్రువ పరచుకోవాలంటే ఆ వ్యక్తి విశిష్ఠతలను స్తుతిస్తే వెల్లడి కాగలదని తలపండిన బ్రాహ్మణులు, పరమ గురువులు, అరిహంతులు, సంబుద్ధులు చెప్పగా విన్న సాలుడు తథాగతుని కీర్తించడం ప్రారంభించాడు.

5. "సర్వాంగ సుందరుడా, సజ్జనుడా, భగవానుడా, జనరంజకుడా, పసిడి వన్నెలో మెరిసి పోయేవాడా, మెరిసే పలు వరుస గలవాడా, శక్తి వంతుడా - మహోన్నతుడా, సల్లక్షణాలు కలవాడా!

6. "నిర్మల నయనాలతో, దివ్య సుందర విగ్రహంతో, సూర్యతేజంతో, ఆహ్లాద వర్తనతో, స్వర్ణ ఛాయతో అలరాడే వాడా, ఎందుకు నీ సౌందర్యాన్ని ఇలా భ్రమ్మరిగా వ్యర్థం చేసుకుంటావు?

"సముద్రాలే అవధిగా పాలించ గలవాడివి, రాజులందరూ నీకు అధీనులై ఏలగలిగిన చక్రవర్తివి, నువ్వు రాజాధి రాజువి."

ఆనందుడొక సారి తథాగతుని మేని ఛాయను వర్ణిస్తూ, ఆయన బంగారు వస్త్రాలు ధరిస్తే అవి వెలవెల బోతాయని అన్నాడు.

వ్యతిరేకులే ఆయనను సుందరాకారుడని కీర్తించారంటే ఆశ్చర్యమేముంది?

## 3. ఆయన మార్గదర్శక దక్షత

భిక్షు సంఘానికి అధికారికంగా అధిపతి ఎవరూ లేరు. భగవానుడికి సంఘంపై ఏ అధికారమూ లేదు. సంఘం స్వయం పాలిత వ్యవస్థ.

అయితే, సంఘంలోనూ సంఘ సభ్యులలోనూ భగవానుడి స్థానమేమిటి?

ఈ విషయంలో భగవానుడి సమకాలికులైన సకుల్‌దాయి, ఉదయ్‌ల ఉదంతాలు చూద్దాం.

ఒకప్పుడు భగవానుడు రాజగ్రహాలోని వెదురు వనంలో బస చేశారు.

. ఒకరోజు ఉదయాన్నే భగవానుడు పట్నంలో భిక్షాటనకు బయలు దేరాడు. అయితే, భిక్షకు ఇంకా సమయం కాలేదని ఎంచి సకుల్‌దాయి ఉంటున్న బైరాగుల మఠం వెళ్ళాలని అనుకొన్నారు.

. ఆ సమయంలో అస్తిత్వం, అస్తిత్వ రాహిత్యంపై బిగ్గరగా వాదిస్తున్న బైరాగుల నడుమ సకుల్‌దాయి కూర్చొన్నాడు.

'. తథాగతుని రాకను దూరం నుంచే గమనించి సకుల్ దాయి సహచరులతో ఇలా అన్నాడు: "నిశ్శబ్దంగా ఉండండి, అల్లరి చేయకండి, గౌతమ శ్రమణుడు వస్తున్నాడు. ఆయనకి నిశ్శబ్దం యిష్టం."

3. వారు నిశ్శబ్దం పాటించారు. భగవానుడు వచ్చారు. "భగవానుడికి స్వాగతం. ఎట్టకేలకు మా దగ్గరకు వచ్చారు. దయచేసి ఆసీనులు కండి, ఇదే మీ ఆసనం" అన్నాడు సకుల్‌దాయి.

9. భగవానుడు ఆసీనుడయ్యాడు. వారు ఏ విషయంపై చర్చించుకుంటున్నారని సకుల్‌దాయిని ప్రశ్నించారు.

0. "కాసేపు దాన్నలా ఉండనీయండి - మీకు అది సులభమైన విషయమే" అన్నాడు సకుల్‌దాయి.

1. కొంతకాలం తరువాత సన్యాసులు, బ్రాహ్మణులు, సభాభవనంలో సమావేశమయ్యారు. పలు మతాధిపతులు, సన్యాసులు, ధర్మప్రబోధకులు వర్షాకాలంలో రాజగ్రహాలో

గడిపేందుకు రావడం అంగ దేశంలోని మగధ ప్రజానీకానికి ఎంతో శుభదాయకం కదా అని చర్చ వచ్చింది.

12. అలా వచ్చిన వారిలో పురాణకశ్యపుడు, మఖాశి గోశాలుడు, అజిత కేశకంబళుడు, ఏకుధ కచ్చాయనుడు, సంజయ చేలు పుత్రుడు, నిగంధ నాద పుత్రుడు, మహా శ్రమణుడైన గౌతముడు కూడా ఉన్నారు. వారందరి సోదర గణమూ, అనుయాయులు కూడా ఉన్నారు.

13. వీరందరిలోనూ శిష్యుల ద్వారా అచంచల గౌరవాన్ని పొందుతున్న వారెవరు? ఎలాంటి భక్తిప్రపత్తులతో వారు ఆయనతో మసలుతారు?

14. కొందరన్నారు - "పురాణ కశ్యపునికి అనుయాయుల నుంచి ఎటువంటి విశేష గౌరవమూ లభించడం లేదు. ఏ ప్రత్యేక గౌరవము లేకుండానే అనుయాయులు ఆయనతో ఉన్నారు."

15. విశేష భిక్షుగణ పరివేష్ఠితుడై ధర్మబోధ చేస్తున్న పురాణ కశ్యపుని అనుయాయుడొకరు కల్పించుకొని "పురాణ కశ్యపుని విషయం ప్రశ్నించకండి. వారి స్థాన మేమిటో నన్నడగండి, నేను చెబుతాను" అన్నాడు.

16. అప్పుడు పురాణ కశ్యపుడు అశ్రునయనాలతో చేతులు చాచి "శాంతంగా ఉండండి, వాదోపవాదాలు వద్దు" అన్నారు.

# రెండో భాగం

# ఆయన మానవత్వం

1. మహాకారుణ్య మూర్తి
2. బాధితులకి ఉపశమనం
3. రోగుపై ఆయన శ్రద్ధ
4. అసహనపరుల యడ బుద్ధుని సహిష్ణుత
5. భగవానుడి సమ భావం సమ - ఆదరణ

# 1 మహాకారుణ్యమూర్తి

1. భగవానుడు ఒకప్పుడు శ్రావస్తిలో ఉన్నపుడు భిక్షువులు కొందరు ఆయన వద్దకు వచ్చి దేవగణం వాడొకడు వచ్చి నిరంతరం తమను బాధిస్తున్నాడని, తమ ధ్యానాన్ని భంగపరుస్తున్నాడని చెప్పారు.

2. వారి ఫిర్యాదును వివరంగా విన్న మీదట భగవానుడు ఈ విధంగా ప్రవచించాడు.

3. "సజ్జనత్వం సాధించిన వాడు, ప్రశాంత చిత్తాన్ని పొందాలనుకున్న వాడు ఈ విధంగా వ్యవహరించాలి:సమర్థుడై, సూటి మనస్తత్వం కలవాడై, వినయ వాఙ్మయుడై, సాధుశీలియై ఉండాలి.

4. "సంతృప్తజీవియై వుండాలి. అతనికి సాయం చేయడం భారం కాకూడదు. ఎక్కువ బరువు బాధ్యతలుండకూడదు. తేలికపాటి జీవికపై జీవించే వాడయి వుండాలి. నిగ్రహపరుడై వుండాలి. విచక్షణా పరుడూ నిగర్వి సంసార వ్యామోహం లేనివాడూ అయి వుండాలి.

5. "వివేక వంతులు నిందించే పద్ధతిలో వ్యవహరించకూడదు. అన్ని ప్రాణులూ సుఖంగా సురక్షితంగా వుండాలని వారు పూర్ణ మనస్కులై వర్ధిల్లాలని వాంఛించాలి.

6. "సకల ప్రాణులూ - అవి అల్పమైనవైనా బలమైన వైనా - పొట్టి, పొడుగూ, మధ్యస్థం - ఏవైనా సరే అన్నీ సుఖపడాలనే కోరుకోవాలి.

7. "కనిపించేవీ, కనిపించనివీ దూరంగా వుండేవి దగ్గరగా వుండేవి, పుట్టినవీ, ఇంకా పుట్టనివీ అంతా సుఖంగా వుండాలని కోరుకోవాలి.

8. "ఒకరి నొకరు వంచించరాదు. దూషించరాదు. కోపంతోనో దురుద్దేశ్యంతోనో ఎవరికీ హాని జరగాలని కోరుకోరాదు."

9. "తల్లి తన ఏకైక సంతానాన్ని ప్రాణత్యాగానికి కూడా సిద్ధ పడి ఎలా రక్షించుకుంటుందో అతను కూడా సకల ప్రాణుల పట్ల అవ్యాజానురాగాన్ని పెంపొందించుకోవాలి."

10. "అపారమైన అతని ప్రేమ భావనలు ప్రపంచం అంతా నిండిపోనీ; పైనా క్రిందా అంతటా ఏ అవరోధమూ, ఏ వైరి భావమూ లేకుండా వ్యాపించనీ.

11. "నిల్చున్నా, నడుస్తున్నా, కూర్చున్నా, శయనించినా - మేల్కొన్నంతసేపూ అతని వివేకాన్ని వదులుకోకూడదు. అదే ఉత్తమ జీవనం.

12. "భ్రమలకు లోను కాకుండా, సద్ధర్మ వర్తనులై, అంతర్దృష్టి కలిగి వుండి, ఐహిక వాంఛలపై అనురక్తిని వదులుకున్న వాడు ఎన్నడూ పునర్జన్మ పొందడు.

13. అంటే ఆయన ఒక్క ముక్కలో - `నీ శత్రువులను కూడా ప్రేమించు'అని చెప్పినట్లయింది.

# 2. బాధితులకు ఉపశమనం

## దుఃఖోపశమన ప్రదాత

### I. విశాఖకు ఓదార్పు

1. విశాఖ ఒక ఉపాసకురాలు. భిక్షువుల పోషణ ఆమె నిత్యకృత్యం
2. ఆమె మనుమరాలు సుదత్త ఒకనాడు అస్వస్థురాలై మరణించింది.
3. విశాఖ ఆ దుఃఖాన్ని భరించలేకపోయింది.
4. అంత్యక్రియల తర్వాత ఆమె బుద్ధుని వద్దకు వెళ్ళి అశ్రునయనాలతో ఆయన ప్రక్కన కూర్చున్నది.
5. "ఓ విశాఖా! నువ్విలా కన్నీరు కార్చుతూ దిగులుగా కూర్చోవడానికి కారణమేమిటి?" - అని భగవానుడు ఆమెను ప్రశ్నించాడు.
6. తన మనుమరాలి మరణ వార్తను చెప్పి "నా మనుమరాలు బుద్ధిమంతురాలు, అటువంటి పిల్లలు అరుదుగా వుంటార"నీ విశాఖ అన్నది.
7. "శ్రావస్తిలో ఎందరు చిన్నపిల్లలుంటారంటావు విశాఖా?"
8. "ప్రభూ! కోట్లాది మంది ఉంటారని అంటారు."
9. "వారందరూ నీ మనుమరాలి వంటి వారే అయితే వారిని నువ్వు ప్రేమించవా?"
10. "ప్రేమిస్తాను ప్రభూ!"విశాఖ జవాబు.
11. "శ్రావస్తిలో రోజూ ఎందరు మరణిస్తారు?"
12. "చాలామంది ప్రభూ!"
13. "అంటే నువ్వు రోదించని క్షణం అంటూ ఉండకూడదు కదా?"
14. "నిజం ప్రభూ!
15. "రాత్రింబగళ్ళు ఏడుస్తూ జీవిత మంతా గడుపుతావా?"
16. "అర్థమైంది ప్రభూ, చక్కగా చెప్పారు."
17. "ఐతే ఇక దుఃఖించకు."

### (II) కుశ గౌతమికి సముదాయింపు

1. శ్రావస్తికి చెందిన ఒక వ్యాపారిని కుశగౌతమి పెళ్ళాడింది.

2. కొంతకాలానికి ఆమెకో కుమారుడు కలిగాడు.
3. పిల్లవాడు నడక కూడా నేర్చుకోకముందే దురదృష్టవశాత్తూ పాముకాటుకు గురై మరణించాడు.
4. ఆమె అంతకు ముందు మరణాన్ని చూడకపోవడం వల్ల తన బిడ్డ మరణించాడంటే నమ్మలేకపోయింది.
5. పాము కాటు వేసిన చోట ఎర్రగా వుంది. ఆ చిన్న గాయం వల్ల బిడ్డ మరణించాడంటే నమ్మలేకపోయింది.
6. నిర్జీవుడై వున్న బిడ్డను భుజాన వేసుకొని ఆమె ఇంటింటికీ తిరగనారంభించింది. ఆమె పరిస్థితి చూచి జనం ఆమెకు మతి చలించిందనుకున్నారు.
7. చివరకు ఓ వృద్ధుడామెకు తారసపడి, ఆ సమయంలో శ్రావస్తిలో నే వున్న గౌతమ బుద్ధుని దగ్గరకు వెళ్ళమని కుశగౌతమికి సలహా ఇచ్చాడు.
8. ఆమె భగవానుడి వద్దకు వెళ్లి తన మృత కుమారుడి కోసం మందు అడిగింది.
9. భగవానుడు ఆమె చెప్పింది విన్నాడు. ఆమె దుఃఖాన్ని గ్రహించాడు.
10. "పట్టణంలోకి వెళ్లి, చావు అన్నది సంభవించని ఇంటినుండి కొన్ని నువ్వులను తీసుకురా, వాటితో నీ కొడుకును సజీవుని చేస్తాను" అని భగవానుడామెతో చెప్పాడు.
11. అదెంత పని అనుకుని ఆమె బాలుడి కళేబరాన్ని తీసుకుని పట్టణంలోకి వెళ్ళింది.
12. అయితే తాను వెళ్ళిన ప్రతి ఇంట్లోనూ ఎవరో ఒకరు ఎప్పుడో మరణించారని ఆమెకు అర్ధమైంది.
13. "బతికున్నవారే కొద్దిమంది, మృతులే ఎక్కువమంది" అని ఒక గృహస్థు ఆమెతో అన్నాడు.
14. కుశగౌతమి రిక్తహస్తాలతో, చనిపోయిన కుమారునితో భగవానుడి దగ్గరకు తిరిగి వచ్చింది.
15. మరణమన్నది సర్వసాధారణమైన విషయమన్న సంగతి తెలుసుకున్నావా, లేక అది నీ ప్రత్యేక దురదృష్టమని కుమిలిపోవాలనుకుంటున్నావా? - అని భగవానుడామెను ప్రశ్నించాడు.
16. అప్పుడామె `సర్వం అనిత్యం, అదే సత్యం' అనుకుంటూ వెళ్ళి కుమారునికి అంత్యక్రియలు జరిపింది.

## 3. రోగులపై ఆయనకు శ్రద్ధ

### (i)

1. ఒకప్పుడు ఒకానొక భిక్షు సోదరుడు విరేచనాలతో బాధపడుతూ, తన విసర్జనపైనే పడిపోయాడు.

2. అప్పుడు భగవానుడు భిక్షువుల విహారాలను సందర్శిస్తూ ఆ రోగి ఉన్న విహారానికి వచ్చాడు. అప్పుడు ఆనందుడు కూడా వెంట ఉన్నాడు.
3. భగవానుడు అతడు తన విరేచనం పైనే పడివుండడం గమనించి దగ్గరకు వెళ్ళి 'సోదరుడా నీ జబ్బేమిటి' అని ప్రశ్నించాడు.
4. "విరేచనాలతో బాధపడుతున్నాను, ప్రభూ"
5. "మరి నీకెవరైనా సపర్యలు చేస్తున్నారా, సోదరా?"
6. "లేదు ప్రభూ!"
7. "ఎందుకలా? భిక్షుసోదరులు నిన్ను చూసుకోవడం లేదా?"
8. "నేను భిక్షుగణానికి నిరుపయోగిని. అందుకని వారు నన్ను పట్టించుకోవడం లేదు ప్రభూ!"
9. అప్పుడు భగవానుడు పూజ్య ఆనందునితో "ఆనందా, వెళ్లు, వెళ్ళి నీళ్ళు తీసుకురా, ఈ సోదరుడిని నేను శుభ్రపరుస్తాను" అన్నాడు.
10. "అలాగే", అని ఆనందుడు నీళ్లు తెచ్చాడు. భగవానుడు నీళ్ళు పోస్తుండగా, పూజ్య ఆనందుడు ఆ రోగిని శరీరమంతా కడిగాడు. అప్పుడు భగవానుడు అతని తలవైపు, పూజ్య ఆనందుడు కాళ్లవైపు పట్టి పడకమీద పడుకోబెట్టారు.
11. ఈ సందర్భంగా భగవానుడు భిక్షుసంఘాన్ని సమావేశపరిచి సోదరులనిలా ప్రశ్నించాడు.
12. "సోదరులారా, ఫలానా విహారంలో ఒక సోదరుడు జబ్బుపడి వున్నాడా?"
13. "అవును ప్రభూ!"
14. "అతని జబ్బేమిటి?"
15. "ప్రభూ, అతను విరేచనాలతో బాధపడుతున్నాడు"
16. "మరి ఎవరైనా అతని గురించి పట్టించుకొంటున్నారా, సోదరులారా?"
17. "లేదు, ప్రభూ!
18. "ఎందువల్ల? ఎందుకని భిక్షుసోదరులతనిని పట్టించుకోలేదు?"
19. "ఆ సోదరుడు సోదర గణానికి నిరుపయోగం ప్రభూ! అందువల్లే పట్టించుకోలేదు"
20. "సోదరులారా, మీ గురించి పట్టించుకొనేందుకు తల్లీ దండ్రీ ఎవరూ లేరు కదా, మీరు పరస్పరం శ్రద్ధ చూపకపోతే మరెవరు చూపిస్తారు చెప్పండి! సోదరులారా, నాపై శ్రద్ధ చూపేవారు రోగగ్రస్తులపై కూడా శ్రద్ధ చూపించాలి."
21. "అనుయాయిపై బోధకుడు శ్రద్ధ వహించాలి. రోగం నుండి కోలుకునే దాకా సపర్యలు చేయాలి. బోధకుడు వ్యాధిగ్రస్తుడైతే అనుయాయి గానీ, ఆ విహారంలోని తోటివారు

గానీ శ్రద్ధ వహించాలి. ఎవరూ పట్టించుకోకపోవడం నేరం అవుతుంది."

## (ii)

1. భగవాను డొకప్పుడు రాజగ్రహ వద్ద దట్టమైన వనంలోని ఉడతల మేత స్థలంలో ఉండేవారు.

2. ఆ సమయంలో పూజ్య వక్కాశి ఒక కుమ్మరివాని కొట్టంలో వుండేవాడు. ఆయనకు అప్పుడు పుండ్ల జబ్బు చేసింది.

3. అప్పుడు పూజ్య వక్కాశి తనకు సపర్యలు చేస్తున్నవారితో ఇలా అన్నాడు: "సోదరులారా, మీరు వెళ్లి భగవానుని సందర్శించి, నా పేరిట ఆయనకు ప్రణమిల్లి ఇలా చెప్పండి - ప్రభూ, సోదరుడు వక్కాశి తీవ్ర అనారోగ్యంతో బాధపడుతున్నాడు. అతను మీ అనుయాయి. ప్రభూ, అతని మీద దయ కలిగిన మీరతనిని దర్శించగలరా?"

4. ఆ మాటలు విన్న భగవానుడు మౌనంగానే అంగీకారం తెలిపాడు. వెంటనే తన వస్త్రాన్ని ధరించి భిక్షాపాత్ర చేతబూని పూజ్య వక్కాశిని దర్శించేందుకు బయల్దేరాడు.

5. భగవానుడు తన దగ్గరకు రావడాన్ని దూరం నుంచే గమనించిన వక్కాశి ప్రక్కమీద నుంచి లేచేందుకు ప్రయత్నించాడు.

6. భగవానుడాతనిని వారిస్తూ `వద్దు వక్కాశీ, పక్కమీది నుంచి లేవకు. నేనీ పక్కనే కుర్చుంటాను లే' అని, పడక పక్కనే ఆసీనులయ్యారు.

7. "వక్కాశీ, బాధ భరించరాకుండా లేదు కదా, నీ బాధ పెరగడం లేదు కదా, నయమవుతున్న సూచనలేమైనా వున్నాయా?"

8. "లేదు ప్రభూ, నేను భరించలేకుండా ఉన్నాను. నొప్పి ఇంకా పెరుగుతోంది. ఏమీ నయం కావడం లేదు. పెరగడమే కానీ తగ్గుముఖంలో లేదు."

9. "నీలో ఏదైనా సంశయంకానీ పశ్చాత్తాపం కానీ వుందా వక్కాశీ?"

10. "నిజంగా నాకే సంశయమూ లేదు ప్రభూ, నాకే పశ్చాత్తాపమూ లేదు"

11. "నిన్ను నీవు నైతికంగా విమర్శించుకోదగినది ఏమీ లేదా వక్కాశీ?"

12. "లేదు ప్రభూ, నన్ను నేను నైతికంగా విమర్శించుకో దగినదేమీ లేదు."

13. "అలాగైతే నీ కేదో చింత, ఏదో అపరాధ భావన వుండి ఉండాలి.".

14. "అవును ప్రభూ, భగవానుని దర్శించుకోవాలన్న కోరిక నాలో చాలా కాలంగా వున్నది. కాని బయల్దేరి వచ్చి దర్శనం చేసుకోవడానికి నాలో శక్తిలేకపోయింది."

15. "చాలించు వక్కాశీ, నా ఈ శరీరంలో చూడవలసింది ఏమున్నది? నియతిని

చూడగలిగినవారు నన్ను చూసినట్టే. నన్ను చూడగలిగిన వారు నియతిని చూసినట్టే. వక్కాళీ! నియతి ద్వారా నన్ను, నా ద్వారా నియతిని చూసినట్టే!"

## (iii)

1. నేనీ విధంగా విని ఉన్నాను: భగవానుడొకప్పుడు భేషకల వనంలోని జింకల తోపులో మొసళ్ళ కొలను వద్ద భగ్గి జాతివారి మధ్య విడిది చేశారు. వారి ఇంటి పెద్ద నకులపిత భగవానుడి దగ్గరకు వచ్చి ప్రణామాలాచరించి సమీపంలో ఒకవైపు కూర్చున్నాడు.

2. ఆసీనుడైన నకులపిత భగవానుడితో ఇలా అన్నాడు: "స్వామీ, నేను శక్తి వుడిగిపోయిన ముదుసలినై పోయాను. జీవిత చరమాంకానికి చేరుకున్నాను. ఎప్పుడూ జబ్బులతో బాధపడుతున్నాను. పైగా నేను భగవానుని, పూజ్య భిక్షు గణాన్ని అరుదుగా మాత్రమే దర్శించ గలిగే వాణ్ణి. కాబట్టి భగవానుని ఉపశమనపు పలుకులు విని, నా కవి చాలాకాలం వరకు వరప్రసాదంగా తుష్టి కూర్చే భాగ్యం నాకు కలగనీ."

3. "నిజం, నిజం ఇంటి పెద్దా! నీ శరీరం బలహీనమై కుంగిపోయింది. ఈ శరీరంలో క్షణ కాలపు ఆరోగ్యం కోరుకున్నా అది మూర్ఖత్వమే. కాబట్టి నువ్విలా సాధన చేసుకోవాలి:" నా శరీరం జబ్బు పడినా నా మనస్సు జబ్బు పడరాదు" అంటూ సాధన చేసుకోవాలి"

4. ఆ మాటలు విన్న నకులపిత సంతోషించి భగవానుడికి కుడివైపు నుంచి ప్రణామం చేస్తూ నిష్క్రమించాడు.

## (iv)

1. భగవానుడొకప్పుడు శాక్యుల రాజ్యమైన కపిల వస్తులో అత్తి చెట్ల వనంలో బస చేసాడు.

2. ఆ సమయంలో అనేక మంది భిక్షువులు భగవానుడి కోసం వస్త్రాలు తయారు చేస్తున్నారు." - భగవానుడు మరో మూడు మాసాలలో తన పర్యటన కొనసాగిస్తారు. అప్పటికీ వస్త్రాలు తయారు కాగలవు" అని వారు అనుకున్నారు.

3. ఒకరోజు శాక్యుడైన మహానాముడు ఈ సంగతి విన్నవాడై భగవానుని దగ్గరకు వచ్చి, ప్రణామాలు చేసి, సమీపంలో కూర్చున్నాడు.

4. "ప్రభూ, కొందరు భిక్షువులు మీ కోసం వస్త్రాలు తయారు చేస్తున్నారు. మీరు మరో మూడు మాసాల తరువాత తిరిగి పర్యటన ప్రారంభిస్తారని, అప్పటికి ఆ వస్త్రాలు సిద్ధం కాగలవని వారి తలంపు. ప్రభూ, నాదో మనవి. వివేకి అయిన సామాన్య భిక్షుడొకరు రోగగ్రస్తుడూ బాధాగ్రస్తుడూ అయిన పక్షంలో సోదర బౌద్ధుడతనిని ఎలా ఉల్లాసపరచాలో భగవానుని ముఖతః మేము విని యుండలేదు." అని మహానాముడన్నాడు.

5. "మహానాముడా, రోగగ్రస్తుడైన వివేకిని సాటి బౌద్ధుడు ఎలా ఉల్లాసపరచాలంటే, నాలుగు సుఖదాయకమైన అభయవచనాలు చెప్పాలి. సజ్జనుడా, నీ ధర్మంలో

ఉల్లాసాన్ని పొందు, భిక్షు సంఘంలో ఉల్లాసాన్ని పొందు, ధర్మానికి క్రమమైన సద్గుణాలను కాపాడుకోవడంలో ఉల్లాసం పొందు; చిత్త స్థైర్యాన్ని చెదరకుండా ఉంచుకోవడంలో ఉల్లాసం పొందు" -

6. "ఆ విధంగా సాటి బౌద్ధుని ఉల్లాసపరచిన తరువాత, మహానామం, ఈ రకంగా అనునయవచనాలు పలకాలి.

7. "అస్వస్థుడైన వాడు తన తల్లి దండ్రులను చూడాలని బెంగ పెట్టుకున్నాడనుకో. అప్పుడా అస్వస్థుడు "నేను నా తల్లి దండ్రులను చూడాలనుకొంటున్నాను" అంటాడు. అప్పుడు సోదర భిక్షువు ఇలా చెప్పాలి. - "ఓ సజ్జనుడా, నీవు మరణించక తప్పదు. నువ్వు నీ తల్లి దండ్రుల కోసం బెంగ పెట్టుకున్నా పెట్టుకోకపోయినా మరణం తప్పదు. కాబట్టి ఆ కోర్కెను వదులుకోవడమే మంచిది కదా!"

8. "ఒక వేళ ఆ అస్వస్థుడు తల్లి దండ్రులను చూడాలనే కోర్కె నశించి పోయింది.' అన్నాడనుకో, అప్పుడు సాటి మనిషి `కానీ సజ్జనుడా, నీలో ఇంకా నీ సంతానాన్ని చూడాలనే కోర్కె మిగిలి వుండవచ్చు కదా, ఆ కోర్కె వున్నా లేకున్నా నీ మరణం తప్పదు కదా, అటువంటప్పుడు ఆ కోర్కెను కూడా విసర్జించడమే మంచిది కదా' అని చెప్పాలి.

9. "అలాగే అతను పంచేంద్రియ సుఖాల కోసం కూడా ఆశపడవచ్చు. అతను పంచేంద్రియ సుఖాలపై నాకు కోర్కె వుందని అన్నాడనుకో, అప్పుడు స్నేహితుడు మిత్రమా, పంచేంద్రియ సుఖాల కన్నా ధార్మికమైన ఆనందాలే ఉత్తమమైనవీ బహుళమైనవీ కదా! కాబట్టి నీ మనసు నుంచి మానవ సుఖాపేక్ష తొలగించి దివ్య రాజన్య సుఖ చతుష్టయం పై దృష్టి నిలుపు" అని చెప్పాలి.

10. "అప్పుడా రోగి "నా మనసును అలాగే నిలిపాను" అన్నాడనుకో, అప్పుడు సాటి భిక్షువు `అయితే బ్రహ్మలోకంపై దృష్టిని నిలుపు' అనాలి, అప్పుడా రోగి `అలాగే నిలిపాను' అంటే రెండోవాడు ఇలా చెప్పాలి:

11. "సజ్జనుడా, బ్రహ్మలోకం కూడా అశాశ్వతమే కదా, వ్యక్తినిష్ఠయే కదా, అందుకని నీ మనస్సుని బ్రహ్మలోకానికి అతీతంగా అహం నుంచి విముక్తి దిశగా మళ్ళించు.

12. "అది కూడా సాధించానని ఆ రోగి చెప్పినట్టయితే, మహా నామా, ఆ సామాన్య బౌద్ధునికీ, ఆవాసాలను విడనాడిన భిక్షువుకేమాత్రమూ తేడా లేదని తెలుసుకో; అనగా, ఆ సామాన్యుడికి కూడా విముక్తి లభించినట్టే".

## 4. అసహన పరుల యెడ బుద్ధుని సహిష్ణుత

1. భగవానుడొకప్పుడు ఆళవి పట్టణంలో యఖ్ఖ అళవాకుడి (యక్ష అళవాకుడి)కి సమీపంలో బస చేశాడు. అళవాకుడు భగవానుడి దగ్గరికి వచ్చి ఇలా అన్నాడు.

"ఓ భిక్షూ! బయటకు వెళ్లు"

2. "అలాగే మిత్రుడా" అంటూ బుద్ధుడు బయటకు నడిచాడు.
3. యఖ్కుడు మళ్ళీ ఆదేశించాడు: "లోపలికి రా, భిక్షూ!"
4. "సరే మిత్రుడా" అంటూ లోపలికి వచ్చాడు భగవానుడు.
5. మళ్ళీ యఖ్కుడు భగవానుడిని `బయటకు నడువు భిక్షూ' అన్నాడు.
6. 'సరే మిత్రుడా' అంటూ బుద్ధుడు బయటకు వెళ్ళాడు.
7. `లోపలికి రా భిక్షూ!' అని మళ్లీ ఆదేశించాడు యఖ్కుడు.
8. `సరే మిత్రుడా' అంటూ వచ్చాడు బుద్ధుడు.
9. మూడోసారి కూడా బయటకు వెళ్ళమన్నాడు యఖ్కుడు.
10. `సరే' అంటూ వెళ్ళాడు బుద్ధుడు.
11. `రా, భిక్షూ!' మళ్ళీ ఆదేశించాడు అళవాకోడు.
12. `సరే మిత్రుడా' అంటూ లోపలికి వచ్చాడు భగవానుడు.
13. నాలుగో సారి కూడా యఖ్కుడు బయటకు నడు భిక్షూ' అన్నాడు.
14. అప్పుడు భగవానుడు "నేను వెళ్లను మిత్రుడా, ఏం చేసుకుంటావో చేసుకో" అన్నాడు.
15. "నేను నిన్నో ప్రశ్న అడుగుతాను భిక్షూ, నువ్వు నా ప్రశ్నకు సమాధానం ఇవ్వకపోతే నీకు పిచ్చెక్కిస్తాను. నీ గుండె చీల్చేస్తాను, లేదా నీ రెండు కాళ్ళు పట్టి నది ఆవలికి గిరాటేస్తాను" అన్నాడు కోపంతో అశవికుడు.
16. "నాకు పిచ్చి ఎక్కించేవారు, నా గుండెలు చీల్చేవారూ, నా రెండు కాళ్ళు పట్టి నది ఆవలికి విసిరేసేవారూ ప్రపంచంలో ఎవరైనా వున్నారని అనుకోను. అయినా, మిత్రమా నువ్వే ప్రశ్నఅయినా అడగవచ్చు."
17. అప్పుడు యఖ్య అళవాకుడు భగవానుడిని ఈ ప్రశ్నలు అడిగాడు.
18. "ఈ ప్రపంచంలో మనిషికి అన్నిటికంటె గొప్ప సంపద ఏది? ఏ నిర్మలక్రియ ఆనందం కలిగిస్తుంది ? అన్ని రుచులలోకి తియ్యటిది ఏది? ఏరకమైన జీవనం ఉన్నతమైనది?"
19. ఈ ప్రశ్నలకు భగవానుడు ఇలా సమాధానం చెప్పారు - ఈ ప్రపంచంలో మానవునికి గొప్ప సంపద విశ్వాసం. ధర్మాన్ని పూర్తిగా ఆచరించడమే ఆనందం. రుచులన్నిటిలోకీ సత్యమే తియ్యటిది. జ్ఞాన సంపన్నంగా జీవించడమే ఉన్నతమైనది.
20. ఆళవాకుడిలా ప్రశ్నించాడు : "ఒకడు ప్రవాహాన్ని (పునర్జన్మను) ఎలా దాటగలడు ? ఒకడు సముద్రాన్ని (మనుగడను) ఎలా దాటగలడు ? ఒకడు బాధను ఎలా అధిగమించగలడు?"
21. భగవానుడిలా సమాధానమిచ్చాడు : "ప్రవాహాన్ని విశ్వాసంతో దాటవచ్చు. సముద్రాన్ని

జాగ్రత్తతో దాటవచ్చు. బాధను సాధన ద్వారా అధిగమించగలడు. వివేకంతో పవిత్రత సాధించగలడు."

22. అళవాకుడు మళ్ళీ అడిగాడు : "జ్ఞానం ఎలా సంపాదిస్తారు-? సంపదను ఎలా సాధిస్తారు? పేరు ప్రఖ్యాతులు ఎలా వస్తాయి ?పరలోక గతుడైనప్పుడు పశ్చాత్తాపం లేకుండా వుండాలంటే ఏమిటి మార్గం?"

23. భగవానుడు సమాధానమిచ్చాడు : "నిర్వాణలబ్ధికోసం అరహాతుల యందు, ధర్మం పైన నమ్మకం వుండి, విధేయత కలిగిన శ్రద్ధాళువైన వ్యక్తి జ్ఞానవంతుడవుతాడు."

24. "సత్కార్యాలను చేసేవాడూ, దృఢచిత్తం గలవాడూ, జాగరూకుడు అయినవాడు సంపద సాధిస్తాడు. వితరణశీలి స్నేహితులను సంపాదించుకుంటాడు. "

25. "సత్యసంధత, విచక్షణ, సహనం, ఔదార్యం కలిగిన గృహస్థు మరణానంతరం పశ్చాత్తాపం పొందడు. "

26. "ఇటు చూడు, సత్యము నిగ్రహము ఔదార్యమూ సహనాలకు మించిన ఉత్తమ గుణాలు ఇంకేమైనా ఉన్నాయేమో ఇతర భిక్షువులనూ, బ్రాహ్మణులను కూడా విచారించు."

27. "అనేక బ్రాహ్మణులను, భిక్షువులను ఇంకా నేనెందుకు సంప్రదించాలి? నా భవిష్యత్తు క్షేమానికి ఏది అవసరమో నాకది యిప్పుడు తెలిసిపోయింది" అన్నాడు అళ్వకుడు.

28. "బుద్ధుడు అళవికి రావడం నాకీ భాగ్యం కలిగించడానికే, నిజం! ఎవరికి సమర్పించుకుంటే అధిక ఫలం లభిస్తుందో నాకివ్వాళ తెలిసింది!

29. "నేటి నుంచి నేను ప్రతిరోజూ ఊరూరు, పట్టణం పట్టణం తిరిగి బోధిసత్వునికి, ఆయన సమ్యక్ ధర్మానికీ నివాళులర్పిస్తాను."

## 5. భగవానుడి సమభావం - సమ ఆదరణ

1. సంఘం కోసం భగవానుడు రూపొందించిన నియమాలను ఆయన కూడా ఇష్టపూర్తిగా, స్వచ్ఛందంగా అనుసరించేవారు.

2. భిక్షు సోదరగణానికి ఆయన సర్వామోదితుడైన ఆధిపతే అయినప్పటికీ, ఆ కారణం చేత తనకు నియమాలనుంచి మినహాయింపు కావాలని గానీ, తనకు ప్రత్యేక సౌకర్యాలు కావాలని గానీ భగవానుడు కోరలేదు. ఆయనకు లభించిన మినహాయింపు లేవైనా భిక్షుగణాలు అపరిమితమైన ప్రేమాదరాలతో, గౌరవంతో ఇష్టపూర్తిగా కల్పించినవే

3. సంఘ సభ్యులు రోజుకు ఒకసారి మాత్రమే ఆహారం తీసుకోవాలనే నియమాన్ని భగవానుడు, భిక్షువూ సమంగా పాటించేవారు.

4. సంఘ సభ్యులెవరికీ స్వంత ఆస్తులుండరాదన్న నియమాన్ని భగవానుడూ, భిక్షువు సమంగా పాటించారు.

5. సంఘ సభ్యులెవరికీ మూడింటికి మించి వస్త్రాలుండరాదనే నియమాన్ని భగవానుడూ భిక్షువూ సమంగా అనుసరించారు.

6. ఒకప్పుడు, భగవానుడు శాక్యదేశంలోని కపిలవస్తు సమీపంలోని వట వృక్షవనంలో విడిది చేశారు. భగవానుని తల్లి మహాప్రజాపతి గౌతమి ఆయనను దర్శించి, తాను స్వహస్తాలతో నేసితెచ్చిన రెండు నూతన వస్త్రాలను కానుకగా స్వీకరించమని ప్రాధేయ పడింది.

7. ఆ వస్త్రాలను భిక్షు సంఘానికి యివ్వమని భగవానుడు ఆమెకు బదులు చెప్పారు.

8. గౌతమి తన అభ్యర్థనను రెండో సారి, మూడోసారి కూడా చేసింది. అయినా అదే సమాధానం.

9. అప్పుడు ఆనందుడు కల్పించుకుని ఇలా అన్నాడు: "గౌతమి కానుకలను స్వీకరించండి ప్రభూ! ఆమె భగవానుడికి ఎంతో సేవ చేసింది. ఆయన కన్న తల్లి చనిపోతే పినతల్లిగా పెంచి పెద్ద చేసింది" - అయినా బుద్ధుడి వైఖరిలో మార్పు రాలేదు - ఆ వస్త్రాలు భిక్షు సంఘానికే యిమ్మన్నారు.

10. పెంటకుప్పలలో లభించే చింకిపాతలతోనే భిక్షువుల వస్త్రాలు తయారు చేయాలని మొదట సంఘంలో నియమముండేది. సంపన్న కుటుంబీకులు సంఘంలో చేరకుండా నివారించేందుకు ఆ నియమం ఉద్దేశించారు.

11. ఒకప్పుడు జీవకుడు తాను తెచ్చిన నూతన వస్త్రాన్ని స్వీకరింపజేసేందుకు భగవానుడికి నచ్చచెప్పి విజయం సాధించాడు. భగవానుడు జీవకుడి కోరికను మన్నిస్తూ సోదర భిక్షువులందరికీ కూడా నియమాన్ని సడలించారు.

మూడో భాగం

# ఆయన ఇష్టా యిష్టాలు

1. పేదరికం అంటే అయిష్టం
2. కూడ బెట్టే వ్యసనమంటే విముఖత
3. అందమే ఆయన ఆనందం

# ఆయన ఇష్టా యిష్టాలు

## 1. పేదరికం అంటే అయిష్టం

1. భగవానుడొకప్పుడు శ్రావస్తిలోని అనాధపిండకుని జేతవనంలో బస చేశాడు. గృహస్థు అనాధ పిండకుడు భగవానుని దర్శించి ప్రణామాలు చేసి ఒక పక్కన ఆసీనుడయ్యాడు. "సంపదల నెందుకు ఆర్జించాలో" వివరించమని భగవానుని కోరాడు.

2. "అడిగావు కాబట్టి చెబుతున్నాను."

3. "ధార్మికుడైన వాడు ఉత్సాహంతో కష్టించి పనిచేసి సాధించుకున్న సంపదను, చెమటోడ్చి సాధించుకున్న సంపదను, న్యాయమార్గంలో సంపాదించిన సంపద ద్వారా తనను తాను సంతోషపరుచుకుంటాడు. తన భార్యను, పిల్లలను, బానిసలను, పనివారలను సంతోషపెడతాడు. సంపదను ఆర్జించేందుకు ఇది మొదటి హేతువు."

4. "అలా సాధించుకున్న సంపద ద్వారా మిత్రులను, సహచరులను సంతోషపెట్టగలుగుతాడు. సంపద నార్జించటానికి అది రెండో హేతువు."

5. "అటువంటి సక్రమార్జనకు అగ్ని నుంచి, నీటి నుంచి, రాజులనుంచి, బందిపోట్లనుంచి, శత్రువునుంచి, వారసుల నుంచి ప్రమాదం నివారణవుతుంది. సంపద నార్జించడానికి ఇది మూడో హేతువు."

6. "ఆరకంగా సంపాదించిన సంపద గలవాడు ఐదు కర్మలను నిర్వర్తించగలుగుతాడు. బంధువులకు, అతిధులకు, పితరులకు, రాజులకు, దేవతలకు యధాకర్మలు నిర్వహించ గలుగుతాడు. సంపాదించడానికి ఇది నాలుగో హేతువు."

7. "పైగా, ఆరకంగా సాధించిన సంపద ద్వారా గృహస్థు ఉన్నతాదర్శ పూరితములైన, ఆనందదాయకాలైన, స్వర్గకారకాలైన దానాలను ఆచరిస్తాడు. నిగర్వులు సహన వంతులు వినయ శీలురు ఆత్మ జ్ఞానంలో పండితులు అయిన సన్యాసులకు, దైవ పురుషులకు సహాయ పడతాడు. సంపన్నుడయేందుకు ఇది అయిదవ హేతువు."

8. పేదరికమొక గొప్ప వరమని, అందులో సంతోషంగా జీవించవచ్చునని భగవానుడెంత మాత్రమూ భావించలేదని అనాధ పిండకునికి అర్ధమైంది.

## 2. కూడ బెట్టే వ్యసనమంటే విముఖత

1. భగవానుడొకప్పుడు కురుదేశంలోని కామ్మసదమ్మ (కామ సద్ధర్మ)లో బస చేసారు.

2. పూజ్య ఆనందుడు ఒక రోజు భగవానుని దర్శించి ప్రణామాలు ఆచరించి

ఆసీనుడైనాడు.

3. ఉపవిష్టుడైన ఆనందుడు ఇలా అన్నాడు : "ప్రతిదానికీ కారణముండి తీరుతుందని జినుడు బోధించిన సిద్ధాంతం అద్భుతమైనది. ఎంతో లోతైనది. స్పష్టాతి స్పష్టంగా ఆ విషయం నాకు విశదమైనది."

4. "అలా అనకు ఆనందా! కారణాల నుంచి కార్యాలు సంభవిస్తాయనే సిద్ధాంతం ఎంతో లోతైనది. దీన్ని పూర్తిగా అవగతం చేసుకోక పోవడం వల్ల, మనసుకు పట్టించుకోక పోవడం వల్ల నేటి తరం చిక్కుపడ్డ దారపుండవలె కొట్టుమిట్టాడుతూ దుఃఖ మార్గాన్ని అధిగమించలేక పోతున్నారు.

5. "ఆబే దండు కోవటానికి కారణం. దేనిపైనా ఎటువంటి రకమైన ఆబా ఎవరికీ లేకపోతే దండు కోవటానికి ఆస్కారముంటుందా?"

6. "ఉండదు ప్రభూ!"

7. ఆబ వల్లనే లాభాపేక్ష కలుగుతుంది.

8. లాభాపేక్ష నుంచి కోరిక, మోహమూ కలుగుతాయి.

9. కోరిక, మోహం మానవుడిలో పంతం పెంచుతుంది.

10. పంతం, నా స్వంతం అన్న భావానికి పునాది.

11. స్వంతమైనవి ఏర్పడ్డాక దురాశ, మరింత స్వార్థ బుద్ధి పెరుగుతాయి.

12. అలా ఏర్పరచుకున్న స్వంత ఆస్తులను కాపాడుకోవడానికి సదా అప్రమత్తత అవసరమవుతుంది.

13. ఆక్రమంలో ఎన్నో దుష్టయత్నాలు, ఎన్నో ప్రమాదాలు, వివాదాలు, విమర్శలు, ఘర్షణ, నిందలు, అబద్ధాలు, ఎదురవుతాయి.

14. కార్యకారణ సంబంధమనేది ఇలా గొలుసు పద్ధతిలో ఉంటుంది. ఆనందా, ఆబే లేకపోతే లాభాపేక్ష వుండదు కదా! లాభాపేక్ష లేకపోతే మోహం ఉండదు కదా! మోహం లేకపోతే పంతాలేర్పడవు కదా? పంతాలు లేకపోతే స్వంత ఆస్తులపై మమకారముండదు కదా: స్వంతాస్తులే లేకపోతే మరింత ఆస్తి దాహం కలగదు కదా!"

15. "కలగదు ప్రభూ!"

16. "స్వంత ఆస్తులపై మమకారమే లేకపోతే ప్రశాంతత నెలకొంటుంది గదా!"

17. "అవును ప్రభూ!"

18. "ఈ భూమిని నేను భూమిగానే గుర్తిస్తాను. అది నాకు చెందాలన్న ఆబ లేదు." అన్నారు భగవానుడు.

11. "సంపద పెంచుకుంటే ఆ పెరుగుదల అల్పమైనది. వివేకం పెంచుకుంటే ఆ పెరుగుదల గొప్పది. కాబట్టి, శ్రమణులారా, నేను చెప్పేది ఏమంటే "మేం వివేకంలో పెరుగుతాము," అనుకుని సాధన చేయాలి. అది సాధించేందుకు కృషి చేయాలి.

12. "పేరు ప్రతిష్టలను కోల్పోవడం స్వల్పమైన నష్టం. వివేకాన్ని కోల్పోతే అది ఘోరమైన నష్టం."

## 4. ఇంపైన వాటిపై ఆయన మక్కువ

1. భగవానుడొకప్పుడు శాక్యుల పట్టణమైన సక్కరలో శాక్యుల మధ్య విడిది చేశారు.

2. అప్పుడు పూజ్య ఆనందుడు బుద్ధుని దర్శించుకుని ప్రణామాలు చేసి సమీపంలో అసీనుడైనాడు. అసీనుడై ఇలా అన్నాడు:

3. "ప్రభూ, పవిత్ర జీవనంలో సగభాగం సుందరమైనవాటి స్నేహం, సుందరమైనవాటి సహచర్యం, సుందరమైనవాటి సాన్నిహిత్యం కదా!"

4. "అలా అనకు ఆనందా, అలా అనకు, సగం జీవనమే కాదు, పూర్తి జీవితం, పరి జీవనంలో పూర్తి భాగం ఇంపైన వాటి స్నేహానిదే సహచర్యానిదే సాన్నిహిత్యానిదే!"

5. సౌందర్యానికి సన్నిహితుడు, సహచరుడు, మిత్రుడు అయిన శ్రమణుని నుంచి మనమేమి ఆశించవచ్చునంటే అతను అష్టాంగ జీవన మార్గాన్నే ప్రోది చేస్తుంటాడు, దాంట్లోనే తరిస్తాడు.

6. "అయితే, ఆనందా! శ్రమణుడు ఎలా అష్టాంగ జీవన మార్గాన్నే ప్రోదిచేస్తాడు, అందులోనే తరిస్తాడు?"

7. "ఎట్లానంటే, ఆనందా! నిరాసక్తత, నిర్వికారం, స్తంభన చర్యల మీద ఆధారపడి శరణాగతిలో లీనమయ్యే సమదృష్టిని అతడు అలవర్చుకుండాడు. అదే విధంగా అతడు సమలక్ష్యం, సమవాక్కు, సమకర్మ, సమ ఉపాధి, సమయత్నం, సమ జాగృతి, సమధ్యానం కూడ సాధన చేస్తాడు. చివరికవి శరణాగతిలో లీనమవుతాయి."

8. "ఈ పద్ధతిలో, ఆనందా, సుందరమైనవాటిని స్నేహితుడు, సహచరుడు, సన్నిహితుడు అయిన శ్రమణుడు అష్టాంగ మార్గాన్ని అనుసరిస్తాడు, ఆ మార్గంలో తరిస్తాడు."

9. "ఈ విధంగా పవిత్ర జీవనం యావత్తూ - ఇంపైన వాటి స్నేహ, సహచర్య, సాన్నిహిత్యాలలోనే వుందని నువ్వు గ్రహించగలవు, ఆనందా!"

10. "నిక్కంగా, ఆనందా, **జరామృత్యువులను**, దుఃఖం, విచారం, బాధ, నిస్పృహలను తప్పించుకోలేని జీవులు - ఇంపైన వాటి చెలిమి ద్వారానే విముక్తమవుతాయి."

11. "ఈ విధంగా పవిత్ర జీవన సమస్తమూ ఇంపైన వాటి స్నేహ, సాంగత్య, సాన్నిహిత్యాలలోనే యిమిడి వున్నట్టు, నువ్వు గ్రహించగలవు, ఆనందా!"

*అనువాదం: జయధీర్ తిరుమల రావు*

# ఉపసంహారం

1. బుద్ధుని మహత్వానికి నివాళులు
2. ధమ్మ ప్రచారానికి ప్రతిజ్ఞ
3. బుద్ధుని స్వస్థలానికి చేరుకోవడం కోసం విన్నపం

# 1. బుద్ధుని మహత్వానికి నివాళులు

1. బుద్ధుడు 2500ల సంవత్సరాల క్రితం జన్మించాడు.
2. ఆధునిక తాత్వికులు, శాస్త్రవేత్తలు బుద్ధుని గురించి, ఆయన ధమ్మం గురించి ఏం చెబుతున్నారు? ఈ విషయంపై వారి ఆలోచనలను సమీకరించడం ఉపయోగకరంగా ఉంటుంది.
3. ఆచార్య ఎస్. ఎస్. రాఘవాచార్ ఇలా అన్నారు:
4. "బుద్ధుని జన్మకు పూర్వపుయుగం భారతీయ చరిత్రలోనే అత్యంత అంధయుగాల్లో ఒకటి.
5. అది మేధోపరంగా వెనక బడిన కాలం. వేదాల సాధికారికతపై అచంచల విశ్వాసం కలిగి ఉండడమే ఆనాటి ఆలోచనా విధానం లక్షణం.
6. నైతికంగా అది అంధయుగం.
7. అప్పటి హిందువులకు నైతికత అంటే, పవిత్ర గ్రంథాల్లో చెప్పిన కర్మకాండ విధులను యథాతథంగా ఆచరించడమే.
8. అసలైన నైతిక సిద్ధాంతాలైన ఆత్మత్యాగం, సంకల్ప శుద్ధి అనే వాటికి ఆ కాలంలో స్థానమే లేదు."
9. ఆర్. జె. జాక్సన్ ఇలా అన్నారు.
10. భారతీయ తాత్వికచింతన నేపథ్యంలో బుద్ధుని బోధనలలో ఉన్న అద్వితీయ స్వభావాన్ని పరిశీలించాలి.
11. రుగ్వేదంలో మనిషి ఆలోచన బహిర్ముఖమై, దేవతా ప్రపంచం వైపుకు మళ్ళడం కనిపిస్తుంది.
12. బౌద్ధమతం మనిషి అన్వేషణను అంతర్ముఖం చేసి, తనలోని సామర్థ్యాన్ని గుర్తించేలా చేసింది.
13. వేదాల్లో ప్రార్థన, స్తుతి కనిపిస్తాయి.
14. బౌద్ధమతంలోనే మొదటిసారిగా, ధర్మబద్ధంగా ప్రవర్తించేందుకు మనసుకు శిక్షణ ఇవ్వాలన్న భావన కనిపిస్తుంది."
15. విన్‌వుడ్ రీడ్ ఇలా అన్నారు.

16. "మనం ప్రకృతిని అధ్యయనం చేసినపుడు, లక్షలాది సంవత్సరాలుగా రక్తకన్నీటితో రాసిన మానవజీవితపరిణామగాథను చదివినపుడు, జీవితాన్ని క్రమబద్ధం చేసి, అభివృద్ధి పరిచే ప్రకృతి నియమాలను అధ్యయనం చేసినపుడు, ప్రేమే దైవమన్న సిద్ధాంతం ఎంత భ్రమా జనితమైందో స్పష్టంగా గుర్తిస్తాం.

17. "ప్రతి దానిలోనూ అనైతికత్వం, వ్యర్థమే ఎక్కువగా కనిపిస్తుంది. జన్మించిన ప్రతి జంతువులోనూ అతి తక్కువ శాతమే మనగలుగుతున్నాయి.

18. "సముద్రంలోనూ, గాలిలోనూ, అరణ్యంలోనూ, `తిను, తినబడు' అనే నియమమే కనిపిస్తోంది. అభివృద్ధిని నియంత్రించే సూత్రం హత్యే."

19. `మనిషి అమరత్వం' అనే గ్రంథంలో రీడ్ పైవిధంగా చెప్పాడు. బుద్ధుని ధమ్మం ఎంత విలక్షణమైనదో ఆయన చెప్పాడు.

20. డా|| రంజన్ రాయ్ ఈ విధంగా చెప్పారు.

21. "19వ శతాబ్దం ఉత్తరార్థం అంతటా సృష్టిని గురించి మూడు పరిరక్షణ నిబంధనలే తిరుగు లేకుండా విశ్వసింపబడ్డాయి. ఎవరూ వాటిని సవాలు చేయలేదు.

22. "అవి పదార్థం, ద్రవ్యరాశి, శక్తి అన్నవి.

23. ఈ మూడూ వినాశనం లేనివని నమ్మిన ఆదర్శవాదులు. వీటిని అవసరమైనపుడల్లా వాడుకున్నారు.

24. పందొమ్మిదవ శతాబ్దం శాస్త్రవేత్తలు వీటినే సృష్టిని శాసించేవిగా ప్రకటించారు.

25. "సకల విశ్వం మౌలిక స్వభావం ఈ మూడింటితోనే రూపుదిద్దుకుందని శాస్త్రవేత్తలు చెప్పారు.

26. "ఈ విశ్వం నాశంలేని అణువులతో నిండి వుందని వీరన్నారు.

27. "పందొమ్మిదవ శతాబ్దాంతానికి సర్ జె.జె. థాంప్సన్, ఆయన అనుయాయులు అణువిభజన ప్రారంభించారు.

28. ఆశ్చర్యకరంగా అణువు ముక్కలుగా విడిపోవడం ప్రారంభమైంది.

29. ఈ ముక్కలనే ఎలక్ట్రాన్లు అన్నారు.

30. సకల సృష్టికి పునాదులై, శాశ్వతమెరుగనివిగా మాక్స్‌వెల్ ప్రశంసించిన అణువు ఇలా ముక్కలైపోయింది.

31. "అణువు భిన్న భిన్న భాగాలుగా విడిపోయి, ప్రోటాన్లు, ఎలక్ట్రాన్లుగా మారింది.

32. దీనితో, ద్రవ్యరాశి పరిణామరహితమైనదీ, స్థిరమైనదీ అన్న నమ్మకం వీగిపోయింది. ఈ శతాబ్దంలో, అనుక్షణం ద్రవ్యరాశి అణచబడుతూందనే సర్వత్రా విశ్వసిస్తున్నాం.

33. బుద్ధుని అనిత్య సిద్ధాంతం ధృవీకరించబడింది.

34. విశ్వవిధానం, సమీకరణాలు,విచ్చిత్తి, పునస్సమీకరణాలే నని శాస్త్రం రుజువు చేసింది.

35. ఆధునిక శాస్త్రధోరణి పరమమైన వాస్తవికత, అహంకారసమైక్యతా, విభిన్నతలను అనుసరించిందే.

36. ఆధునిక శాస్త్రం బుద్ధుని అనిత్య సిద్ధాంతం, నిరహంకార సిద్ధాంతాలను ప్రతిధ్వనిస్తోంది.

37. మిస్టర్ ఇ.జి.టేలర్ తన "బుద్ధిజమ్ అండ్ మోడరన్ థాట్" అనే గ్రంథంలో ఇలా అంటాడు.

38. "మానవుడు ఇప్పటిదాకా ఒక అతీతశక్తిచేత పరిపాలించబడ్డాడు. అతడు నిజమైన నాగరీకుడైతే, తన సొంత సిద్ధాంతాలతో పాలించుకోవడం నేర్చుకోవాలి. బౌద్ధం నైతికవ్యవస్థ మానవుడు తనకు తానే స్వయంపాలకుడు కావాలని బోధిస్తుంది.

39. ఈ అత్యున్నత పాఠాన్ని ఆధునిక అభ్యుదయ ప్రపంచం బౌద్ధం నుంచి నేర్చుకోవలసి వుంది.

40. ఏకేశ్వరోపాసనను విశ్వసించే రెవరెండ్ లెస్లీ బోల్టన్ ఈ విధంగా అన్నాడు;

41. "బౌద్ధం యొక్క ఆధ్యాత్మిక మనోవిజ్ఞానమే బుద్ధుడు అందించిన అతిగొప్ప విజ్ఞానంగా నేను భావిస్తాను.

42. బౌద్ధుల వలె దైవం ఒకడే అని నమ్మే క్రైస్తవులు అతీతశక్తిని తిరస్కరిస్తున్నారు. మానవునిలోనే మార్గదర్శనాన్ని వారు కనుగొన్నారు.

43. క్రీస్తులోనూ, గౌతమునిలోనూ ఉన్నత జీవిత దర్శనాన్ని వారు చూశారు.

44. ఆచార్య డ్వైట్ గొదార్డ్ ఇలా అన్నారు;

45. "ప్రపంచంలోని మతబోధకులలో బుద్ధుడు ఒకనికే అతీతశక్తి సహాయం లేకుండా మానవుని నిర్యాణ సామర్థ్యాన్ని తెలుసుకోగలిగిన కీర్తి దక్కింది.

46. మానవజాతి సామర్థ్యాన్ని అత్యున్నమైనదిగా గుర్తించడమే ఒక మహోన్నతుడి ఔన్నత్యానికి రుజువైతే, ఆ మాటకు అర్హుడు తథాగతుడి కంటే వేరొకరు కాదు.

47. అందుకే ఈ ఉన్నతుడిపై మరొకశక్తి ఉన్నట్టు చెప్పడానికి బదులు, ఆయననే ప్రేమ, విజ్ఞానాల శిఖరాగ్రంలో నిలిపారు.

48. "బౌద్ధం" అనే గ్రంథ రచయిత, ఇ.జె. మిల్స్ ఇలా అన్నాడు;

49. ఏ ఇతరమతం, విజ్ఞానం విలువలు, అజ్ఞానపు నీచత్వం గురించి బౌద్ధం మాదిరిగా వివరించలేదు.

50. ఏ ఇతర మతమూ ఒకరి నేత్రాలను తెరచి ఉంచవలసిన అవసరం గురించి నొక్కి చెప్పలేదు.

51. ఏ ఇతర మతమూ మానసిక సంస్కృతికి సంబంధించిన లోతైన ప్రణాళికలను నిర్ణయించలేదు.

52. ఆచార్య డబ్ల్యు.టి. సైస్ తన "బుద్ధుని నీతులు" గ్రంథంలో ఇలా అన్నాడు.

53. అరహంతుని పేరిట ప్రచారమైన, బుద్ధుని నీతి సిద్ధాంతం నైతికపరంగానూ విజ్ఞానపరంగానూ గొప్పదే.

54. అతడు సత్ప్రవర్తన కలవాడే కాకుండా వేదాంతి కూడా అయి ఉంటాడు.

55. బౌద్ధంలో నిర్వాణానికి అవసరమైన విజ్ఞానం గురించి ఎల్లప్పుడూ నొక్కి చెబుతారు. అజ్ఞానం, పరాజయానికి గల రెండు కారణాలలో ఒకటిగా చెబుతారు. (కోరిక, అనుబంధాలు అనేవి రెండో కారణం)

56. దీనికి విరుద్ధంగా "క్రైస్తవ ఆదర్శమానవుని గుణాలలో విజ్ఞానం భాగం కాదు."

57. క్రైస్తవ ఆలోచనా పంథాను కనుగొన్న వారి వేదాంత రహిత గుణం వల్ల మానవుని నైతిక మార్గం నుండి విజ్ఞాన మార్గం వేరయింది.

58. ప్రపంచంలోని దుఃఖానికి కారణం మూర్ఖత్వం, అంధ విశ్వాసంతో పాటు క్రూరత్వం కూడా.

59. బుద్ధుడు దీనిని అనుమతించలేదు.

60. బుద్ధుడు, అతని ధర్మం ఎంత గొప్పదో ఎంత ప్రత్యేకత కలదోదీనివల్ల తెలుస్తోంది?.

61. అలాంటివాడు తమ గురువుగా ఉండాలని ఎవరు భావించరు?

## 2. ధమ్మ ప్రచారానికి ప్రతిజ్ఞ

1. "పరిమితి లేని ప్రాణులు ఉన్నాయి. దాన్ని తెలియచెప్పాలని ప్రతిజ్ఞ చేద్దాం.
2. మనలో అసంఖ్యాకమైన దోషాలున్నాయి. వాటిని నిర్మూలించాలని ప్రతిజ్ఞ చేద్దాం.
3. అంతం లేని సత్యాలున్నాయి. వాటిని అర్థం చేసుకొందామని ప్రతిజ్ఞ చేద్దాం.
4. నిరుపమానమైన బుద్ధుని మార్గముంది. దాని పరిపూర్ణ సాధనకు ప్రతిజ్ఞ చేద్దాం.

# 3. బుద్ధుని స్వస్థలానికి చేరుకోవడం కోసం విన్నపం

1. ఓ తథాగతా! ఎవని కాంతి ఎటువంటి అవరోధం లేక అన్ని ప్రాంతాల్లోనూ ప్రసరిస్తుందో, ఆ తథాగతునికి నన్ను నేను అంకితం చేసుకుంటున్నాను. ఆ భూ మిలో జన్మించాలని మనసారా ఆకాంక్షిస్తున్నాను.

2. ముల్లోకాల్లోని అన్ని భాగాల కంటె నీ ఆవాసం ఉన్నతమైందని నేను గుర్తించాను.

3. నీ ఆవాసం ఆకాశంలా, అంతటినీ ఆవరిస్తుంది. సరిహద్దులు లేక విస్తారంగా, విశాలంగా ఉంటుంది.

4. ధర్మమార్గానుసారమైన నీ కారుణ్యం, దయ, ప్రాపంచిక సౌఖ్యాలకు అతీతమైన సద్గుణాల ఫలితమే (అవి నీవు పోగుచేసినవి)

5. సూర్య చంద్రుల కిరణాల్లా నీ వెలుగు అంతటా పరుచుకొంటుంది.

6. అక్కడ జన్మించిన అందరూ, బుద్ధుడవైన నీలా, సత్యమే ప్రవచించాలని నేను ప్రార్థిస్తున్నాను.

7. ఓ బుద్ధా! ఈ క్రింది పదాలతో నేనీ వ్యాసం రాస్తున్నాను. నిన్ను ముఖాముఖీ చూడాలనీ,

8. నా సహచరులందరితో కలసి పరిపూర్ణ ఆనందదాయకమైన నీ భూమిలో జన్మించాలని ప్రార్థన చేస్తున్నాను"

"మతం - నీతి విజ్ఞాన సర్వస్వం, పదవ సంపుటం పే.169.

